శ్రీ ర స్తు.

వాగ్భటాచార్యకృత

# అష్టాంగహృదయము

## శారీర, నిదానస్థానములు

ఆంధ్ర తాత్పర్య సహితము.

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1930

# విషయసూచిక.

## శారీరస్థానము.

## చతుర్థాధ్యాయము.

## షష్ఠాధ్యాయము.

## నిదానస్థానము.

## ఏకాదశాధ్యాయము.

| విషయము. | సంఖ్య |
|---|---|

## పంచదశాధ్యాయము.



## షోడశాధ్యాయము.

శ్రీ ర స్తు.

# అష్టాంగహృదయము

## సాంధ్ర తాత్పర్యము.

---

# శారీరస్థానము.

---

## ప్రథమాధ్యాయము.

అవ. లోకమున మిథ్యాహారాదులచే సంప్రాప్తములగు రోగములనుండి తొలగించి మనుజుల యారోగ్యమును పరిపాలించు నుద్దేశముతో శ్రీవాగ్భటాచార్యుండు హేతులక్షణ ఔషధస్కంధరూపమైన చికిత్సాప్రధానతంత్రమును చెప్పుచు సూత్రస్థానమున చికిత్సను వివరించునపుడు "కాయబాలగ్రహోర్ధ్వాంగ" అని యుపక్రమించి కాయచికిత్స, బాలచికిత్స, మున్నగు నష్టాంగములను సూచనామాత్రముగ జెప్పెను. అందు కాయచికిత్స మొదటిది. ధర్మార్థకామమోక్షములకు ముఖ్యసాధనమైన శరీరమున జాగన్తువ్యాధులకు అధిష్ఠానము. అట్టి యధిష్ఠానమైన శరీరముయొక్క బాహ్యాభ్యంతరవిభాగముల జక్కగ దెలియక దాని నాధారముగ జేసి సంభవించురోగముల గమనించి చికిత్సజేయ వలనుపడదు. కావున సూత్రస్థానమును జెప్పినపిదప శరీరమునకు సంబంధించిన విషయముల స్ఫుటముగ దెలుపునట్టి శారీరస్థానమును చెప్పెను — అందును శరీరోత్పత్తికి గర్భధారణము కారణము కావున ముందు గర్భోత్పత్తిక్రమము ఈ యధ్యాయమున దెలుపబడును:—

సూ. అథాతో గర్భవక్రాన్తిం శారీరం వ్యాఖ్యాస్యామః,
ఇతి హస్మాహు రాత్రేయాదయో మహర్షయః.

వ్యాఖ్యానప్రారంభమున మంగళాచరణము.

శ్రీవత్సాఙ్కితవక్షసం గుణనిధిం శ్రీజానిమార్తావనం,
చిన్మాత్రం చిదచిద్విభేదరహితం సత్స్వప్రకాశంవిభుమ్.

భూమానం బహిరన్తరస్థమమరైస్తోష్టూయమానం సదా,
సేవే వాఙ్మనసోరతీతమమితానన్దాప్తయే భూయసా.
నత్వాత్రేయం చరకం చాచార్యం సుశ్రుతం మునీడ్యమహమ్,
వాగ్భట నిగదితమతులం శారీరం వ్యాకరోమి స నిదానమ్.
పూర్వైర్వ్యాఖ్యాతృభిర్వివృతౌ భాగావాద్యౌ జనోపకృతయేఽతః,
పరిశిష్టమేతదుభయం వ్యాకుర్వే భగవతః కృపాలేశాత్.

శరీరము నుద్దేశించి చెప్పబడిన గ్రంథము శారీరము. గర్భావక్రాంతియన గర్భము యొక్క సంప్రాప్తి. సూత్రస్థానమును జెప్పిన పిదప గర్భము సంప్రాప్తించు విధమును తెలియజేయం శరీరము నుద్దేశించిన గ్రంథమును (అధ్యాయమును) ఆత్రేయాదిమహర్షులు చెప్పిన పద్ధతికి న్యూనాతిరేకము గాకుండ వివరించెదనని భావము. (స్వకల్పితముగాక ఆత్రేయాదిమహర్షుల పద్ధతి నవలంబించి గర్భావక్రాంతి శారీరమును జెప్పెదననుటచేత తాజెప్పునవియెల్ల ప్రాచీన ఋషిసమ్మతమని ప్రామాణికత తెలియుచున్నది.)

### గర్భోత్పత్తి.

శుద్ధే శుక్రార్తవే సత్వః స్వకర్మక్లేశచోదితః,
గర్భస్సమ్పద్యతే యుక్తివశాదగ్నిరివారణౌ. ౧

పురుషులకు సప్తమధాతురూపమైనది శుక్రము, స్త్రీలకు ప్రసవమార్గమునుండి ప్రతిమాసమునను వెడలునట్టి రక్తము ఆర్తవము. అయ్యవి కొంచెము నలుపురంగుకల్గి గంధరహితమై వాతముచేత ప్రేరితమై ప్రతిమాసమునను ప్రసవమార్గమునుండి బైట వెడలును. జీవుడు తాను పూర్వజన్మమున జేసిన శుభాఽశుభకర్మములచేతను, అవిద్య, అస్మిత, రాగద్వేషములు, అభినివేశము, అను నీక్లేశములచేతను ప్రేరితుడై వాతపిత్తకఫములచే చెడకుండు పైజెప్పిన (తల్లిదండ్రులకు సంబంధించిన) శుక్రార్తవములయందు యుక్తవశముగ జేరి, అరణులయందు మంథిప్రమంథుల సంధించి మథనమును యుక్తియుక్తముగ జేసినపుడు అగ్నిపొడసూపుభంగి గర్భరూపముగ పరిణమించును.

ఇచ్చట తల్లిదండ్రుల శుక్రార్తవములు గర్భోత్పత్తికి బీజము. అయ్యవి వాతపిత్తకఫములచే చెడకయుండవలెను. వానిచే చెడిన శుక్రార్తవములు గర్భోత్పత్తికి సమర్థములుకావు. సత్వమనజీవుడు. అట్టిజీవుడు శుద్ధమైన శుక్రార్తవముల నధిష్ఠించునపుడు ఈమూడిటి సంయోగమున గర్భమేర్పడును. జీవునకు శుక్రార్తవములతో సంబంధము కల్గుటకు తాను తొలిపుట్టువున జేసిన శుభాశుభకర్మలును అయిదు క్లేశములును ప్రేరేపించుటయే కారణము. "క్లేశయన్తి (దుఃఖయన్తి)లోకానితి క్లేశాః" అనువ్యుత్పత్తి

చేత ప్రాణిసామాన్యముగ (జననమరణరూపమైన) కష్టముల గల్గించునవి యనియర్థము. అందు ఒకవస్తువునందు భ్రాంతికల్పితముగల్గిన యన్యథాజ్ఞానము అవిద్య, శరీరాదుల కతీతమైనయాత్మ వేరొండులేదను విరుద్ధజ్ఞానము అస్మిత, దుఃఖమునుకల్గించు మనోవిశేషము ద్వేషము, సుఖమును కల్గించునది రాగము. మూఢమైనజ్ఞానము అభినివేశము. ఇవియ క్లేశములు.

అరణియందు లీనముగనుండు అగ్ని యుక్తియుక్తముగ మథించినగాని అగ్ని వెలువడదు. ఆరీతిగనే జీవునకు శుక్రశోణితములతో సంబంధము యుక్తియుక్తముగ నుండినగాని గర్భము కలుగబోదు. మరియు నట్టిశుక్రశోణితములతో సంబంధము జీవునకు కల్గుటకు కర్మంబును క్లేశంబులును కారణములు. కావుననే విరాగులుగనుండు వారికి కర్మక్లేశసంబంధము లేదు. కావున వారికి జన్మముకల్గదు. ఈవిషయము గ్రంథాన్తరమున నిట్లుచెప్పబడినది.—"చిత్తమేవహిసంసారి రాగాదిక్లేశ దూషితమ్, తదేవ తైర్వినిర్ముక్తం భవాన్త ఇతికథ్యతే"

### గర్భవృద్ధికారణములు.

బీజాత్మకై ర్మహాభూతైః సూక్ష్మైస్సత్వానుగైశ్చ సః,
మాతుశ్చాహారరసజైః క్రమాత్కుక్షౌ వివర్ధతే. ౨

పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము ననునీపంచమహాభూతములును గర్భమును కల్గింప సమర్థములైన శుక్రార్తవములయందు మిక్కిలి సూక్ష్ములై యోగిమనోదృశ్యములై చేరియుండును. మరియు నయ్యవి యట్టి బీజరూపమునొంది జీవునితోగూడ నియతముగ జేరియుండును. అట్టి పరమాణురూపములై శుక్రార్తవముల యందుజేరి జీవునితో నిత్యసంబంధముగల మహాభూత సూక్ష్మాంశములచే కుక్షియందలి గర్భము నానాటవృద్ధినొందును. మరియు తల్లిభుజించు ఆహారరసమునగల్గు మిక్కిలి సూక్ష్మములైన పంచమహాభూతములచే గూడ గర్భము నానాటవృద్ధినొందును.

[తల్లిభుజించిన యాహారము పక్వముగనై రసముగ నేర్పడును. అట్టిరసము తల్లియొక్క కుక్షియందుండునపుడు (చెరువు నీటిచేనిండియున్నపుడు చెరువుకట్టకు చేరువనున్నపైరు ఆనీటియూటచేతనే పెరుగువిధముగ) తల్లియొక్క ఆహారరసమునకు సమీపముననున్న గర్భంబును వృద్ధినొందునని భావము.]

### గర్భాశయమున జీవుడుచేరెననుటకు యుక్తి.

తేజో యథార్కరశ్మీనాం స్ఫటికేన తిరస్కృతమ్,
నేన్ధనం దృశ్యతే గచ్ఛత్సత్వో గర్భాశయం తథా. 3

సూర్యకాంతపుమణిక్రింద నొక పౌరకపుల్లనునిచినయెడ సూర్యునియొక్క తేజస్సు మణి యడ్డముగనున్నను క్రిందనుండుపుల్లను దహించును. ఇచ్చట సూర్యుని యొక్క తేజస్సు మణిచే నడ్డగింపబడియుండుటవలన తేజస్సు ఇంధనము దగ్గరకుబోవుట కనబడదు. అయినను పుల్ల దహింపబడుటంగని తేజస్సంబంధముకలదని నిశ్చయముగ నూహించెదము. ఆవిధముగనే జీవుడు మిక్కిలి యదృశ్యపదార్థము కావున గర్భాశయమున జేరునపుడు తెలియబడదు. ఆట్టి జీవున కనపాయముగ ననువర్తించియుండు మహాభూతసూక్ష్మాంశములును గోచరములుగావు. అయినను నానాటగర్భము వృద్ధినొందు కార్యమునుబట్టి జీవుడును తదనుసారములగు పంచభూత సూక్ష్మాణువులును గర్భాశయమున జేరినవని యూహింపదగును.

### ఒకజీవుడె నానారూపములుగ జనించుటకు కారణము.

కారణానువిధాయిత్వాత్ కార్యాణాం తత్స్వభావతా,
నానాయోన్యాకృతీః సత్వో ధత్తేఽతో ద్రుతలోహవత్. ౪

లోకమున ఘటాదికార్యములన్నియు అవశ్యముగ కారణముల ననుకరించియుండుటస్వభావసిద్ధమైన గుణము. కావున కార్యములన్నియు కార్యమునకు సదృశములైన స్వభావముకల్గియే యుండును. వెండిమున్నగు లోహమునుకరిగించి అనేకరూపములు (మనుష్యాకారము, ఇతరజంతువుల యాకారములును)గ మూసల నిర్మించి అందుబోసిన యెడ మూసయెట్టి యాకారము కల్గియుండునో అట్టిరూపమే యందుంచబడిన లోహమునకును కల్గును. ఇచ్చట లోహమొక్కరూపమేయైనను కారణమైన మూసకనుగుణమైన మనుష్యాద్యాకారములే భిన్నభిన్నముగ సంభవించును. కావున జీవుడు ఏకరూపమైనను దానికి కారణభేదమునంజేసి మనుష్యాది ఆకారభేదముకల్గును.

### స్త్రీపురుషనపుంసకజన్మములుకల్గు కారణము.

అతఏవచశుక్రస్య బాహుల్యాజ్జాయతేపుమాన్,
రక్తస్య స్త్రీతయోస్సామ్యేక్లీబః.

పై వాక్యముచేత కార్యకారణములు అవశ్యముగ సాదృశ్యము కల్గియుండునని యేర్పడినది. ఆరెండిటకిని సాదృశ్యముండుటంజేసియే శుక్రార్తవముల రెండింటిలో పురుషుని రేతస్సైనశుక్రము అధికముగనుండి స్త్రీ రేతస్సైన యార్తవము తక్కువగ నుండినయెడ (బలిష్టముగనున్న శుక్రము బలహీనమైన యార్తవమును దిరస్కరించి) పురుషుడు జన్మించును. ఈవిధముగనే యార్తవము అధికముగనుండి శుక్రము తక్కువయగునప్పుడు స్త్రీశిశువుకల్గును. అటుగాక శుక్రార్తవములురెండును సమముగనున్నపుడు స్త్రీ పురుషచిహ్నములు మిశ్రమైన నపుంసకుడుపుట్టును.

స్త్రీ పురుషజన్మములు కలుగుటకు కారణములు తంత్రాన్తరమునని ట్లు చెప్పబడి నది:—"స్త్రీ పుంసయోస్సంయోగే యద్యాదౌవిసృజేత్పుమాన్, శుక్రం తతః పుమాన్‌వీరః జాయతేబలవాన్‌దృఢః. అథ చేద్వనితాపూర్వం విసృజేద్రక్తసంయుతమ్, తతోరూపాన్వితాకన్యా జాయతేదృఢసంయుతా" స్త్రీ పురుషులిరువురును సంభోగముజేయు సమయమున పురుషుఁడు శుక్రమును స్త్రీకన్నముందుగ విసర్జించిన యెడ మిక్కిలి బలవంతుఁడును దృఢగాత్రుఁడును వీరుఁడునగు పురుషుఁడుపుట్టును. అటు గాక. స్త్రీ యార్తావమును పురుషునికన్న ముందువిసర్జించినయెడ మిక్కిలి దృఢగాత్రము కల్గి రూపవతియగు స్త్రీపుట్టును అనియర్థము.

ఇచ్చట నీవిమర్శనము ఎరుంగునది:—రసాదిసప్తధాతువుల యుత్పత్తి క్రమమును జెప్పునపుడు "రసాద్రక్తం తతోమాంసం మాంసాన్మేదః తతోఽస్థిచ, అస్థ్నోమజ్జాతతః శుక్రం శుక్రాద్గర్భః ప్రజాయతే" అని చెప్పఁబడినది. పైవాక్యము చేత రసధాతువువలన రక్తంబును, దానివలన మాంసంబును, మాంసమువలన మేద స్సును, మేదస్సువలన అస్థులును, అస్థివలన మజ్జయు, మజ్జవలన శుక్రంబును, అట్టి శుక్రమువలన గర్భంబును పరుసగకల్గునని తెలిసెడి. రసము మొదలుజేసి శుక్రము వరకుంగల సప్తధాతువులును, స్త్రీలకును పురుషులకును సమానముగ నుండును. అట్లుండు నపుడు ఒక యౌవనవతియగు స్త్రీ సుందరుడగు పురుషుని ప్రేమతోజూచినపుడు మద నోద్దీపితయైయుండ సప్తమధాతువగు శుక్రముకూడ గర్భాశయమునకు స్రవించును. అపుడాయువతికేల గర్భముకల్గకూడదు. అను నాశంకకల్గును. గాని యిది సమంజసము కానోపదు.

పురుషుని సప్తమధాతువైన శుక్రంబును స్త్రీయొక్కయార్తవంబును ఒకటిగ జేరినపుడు స్త్రీకి గర్భముకల్గునుగాని కేవలము స్త్రీయొక్క సప్తమధాతువైన శుక్రము మాత్రమున గర్భముగల్గబోదు. ఈవిషయమును అష్టాంగసంగ్రహమున వాగ్భటాచార్యు లిట్లు చెప్పిరి.

"యోషితోఽపి స్రవత్యేవ శుక్రం పుంసస్సమాగమే,
గర్భస్యతునతత్కించిత్ కరోతీతి నచింత్యతే"

స్త్రీపురుషునితో జేరినపుడు స్త్రీకిని శుక్రముస్రవించును కాని అయ్యది గర్భధారణ మునకు సమర్థముకానోపదు.

ఒక్కకాలముననే అనేకగర్భములు కల్గుటకు కారణములు.

**శుక్రార్తవేపునః.** **౫**

**వాయునా బహుశోభిన్నే యథాస్వంబహ్వాపత్యతా,**

శుక్రార్తవములు స్రవించి యొకటిగ జేరినయెడ గర్భముకల్గునని చెప్పబడినది. అవి రెండునుకలిసి గర్భాశయమున జేరునపుడు వాయువేగముచేత నాబీజము తుత్తునియలై యనేకబిందువులుగ వేరువేరుగబడినయెడ అనేకశిశువులు ఒకగర్భముననే సమకాలమున గల్గుదురు. ఆబీజము ఎన్నితునియలగునో అందరు శిశువులు సమకాలమున గల్గుదురు. అందును శుక్రం బధికమైనబీజము వాయువుచే పలుతెరంగుల భిన్నమైనపుడు అనేక పురుషశిశువులును, స్త్రీవీర్య మధికమైనపుడు స్త్రీశిశువులును కల్గుదురు. (అందు కొన్నిబిందువులు పురుషవీర్యం బధికముగను, కొన్ని స్త్రీవీర్యమధికముగను నున్నపుడు పురుషులును స్త్రీలునుకూడ కల్గుదురు. అని యెరుంగునది) పందులు కుక్కలు మున్నగు తిర్యగ్జంతువులకు సమకాలమున ననేకశిశువులు జనించుటకు ఇదియే కారణము.

### వికృతాకారగర్భము కలుగుకారణము.

వియోనివికృతాకారా జాయన్తే వికృతైర్మలైః ౬

వాతాదిదోషములు ప్రకోపమునొందియున్మార్గముననుండునపుడు అట్టిదోషములచే శుక్రార్తవములు దుష్టమైననాడు ఇతరజంతువుల యాకారంబుగల శిశువులును, వికృతాకారములైన శిశువులును పుట్టుదురు.

### రజః ప్రవృత్తికాల నియమము.

మాసిమాసిరజస్స్త్రీణాం రసజం స్రవతి త్ర్యహమ్,
వత్సరాద్ద్వాదశాదూర్ధ్వం యాతిపంచాశతః పరమ్. ౭

స్త్రీలకు ఆహారరసమువలన పుట్టినరక్తము ప్రతిమాసమునందును మూడుదినములు నిరంతరముగ స్రవించును. అయ్యదిపుట్టిన సంవత్సరము మొదలు ప్రాయికముగ పదిరెండవసంవత్సరమునుండి వెడలనారంభించి యేబదిసంవత్సరములవరకును స్రవించి పిమ్మట వెడలకనిలుచును.

ఇచ్చట నీకాలనియమమునుతప్పి ముందైనను వెనుకయైనను వెడలనారంభించి యేబదిసంవత్సరములకు ముందువెనుకగూడ నిలచుటకలదు. కావున నీకాలనియమము ప్రాయికము. మరియు రసధాతువువలన రక్తముపుట్టునని 'రసాద్రక్తం' అను వాక్యముచే దెలియుచున్నను మరల 'రసజం' అనిచెప్పుటచేత నిచ్చటజెప్పబడిన రక్తము ఆహారరసమువలన బుట్టినరక్తముగాని రసధాతువునబుట్టిన రక్తముకాదని యెరుంగునది.

### సద్గర్భధారణమునకు దగినవయోనిర్ణయము.

పూర్ణషోడశవర్షాస్త్రీ పూర్ణవింశేనసంగతా,

శుద్ధే గర్భాశయే మార్గే రక్తే శుక్రేఽనిలే హృది. ౮
వీర్యవన్తం సుతం సూతే తతో న్యూనాబ్దయోః పునః,
రోగ్యల్పాయురధన్యో వా గర్భో భవతి నైవ వా ౯

గర్భమునివసించుకోశము గర్భాశయము, అట్టిగర్భాశయంబును ప్రసూతి మార్గంబును గర్భమునకు బీజభూతమైన శుక్రార్తవంబులును వాతాదులచే దుష్టములు గాక శుద్ధములై యుండి, అట్టిగర్భబీజమును ప్రేరేపించువాతము పిత్తాదులచే నావరింపబడక హృదయము దోషములచే నాక్రమింపబడక యుండుకాలమున పదునారువత్సరములవయసు పూర్ణమైన స్త్రీ ఇరువదివత్సరముల వయసునిండిన యువకునితో సంయోగము జేసినయెడ మిక్కిలివీర్యవంతుడగు కొడుకుపుట్టును. పైజెప్పినవయసుకు తక్కువ వయసున స్త్రీ పురుషులు సంభోగించినయెడ గర్భమునబుట్టు శిశువు రోగియగును. లేక అల్పాయువగును. లేక ప్రతిష్ఠాహీనుడగును. ఒకసమయమున గర్భముకల్గకయే యుండును.

కొందరికి పైజెప్పిన వయోనిర్ణయమునకు ముందుపుట్టిన శిశువులుకూడ ప్రశస్తి గాంచియుండుటకూడ కలదు. కావున పైజెప్పిన వయోనిర్ణయము ప్రాయికమని యెరుంగునది.

## దుష్టశుక్రార్తవభేదము.

వాతాదికుణపగ్రంథి పూయక్షీణ మలాహ్వయమ్,
బీజాసమర్థం రేతోఽస్రం

(దుష్టముగాని శుక్రార్తవములు గర్భోత్పత్తికి కారణమైన బీజమని పైజెప్పంబడినది. అటుగాక వాతాదిదూషితములగు శుక్రార్తవములు గర్భోత్పత్తికి కారణముకానోపవు) అయ్యదివాతపిత్తకఫములచే వేరువేరుగదుష్టమైనచో వాతశుక్రము, పిత్తశుక్రము, కఫశుక్రము ననబడును. మరియు పీనుగనుబోలె దుర్గంధముకలది కుణపశుక్రము. (ఇయ్యదిదుష్టరక్తముచే దూషితము) గ్రంథినిబోలియుండునది గ్రంథిశుక్రము. చీమువలెనుండునది పూయశుక్రము. క్షీణించినది క్షీణశుక్రము. మలమూత్రములచే దుష్టమైనదిమలశుక్రము. ఇత్తెరంగున దుష్టశుక్రభేదములు ఎనిమిదివిధములగుచుండును. ఆర్తవముగూడ పైజెప్పినవిధవిధములగు వాతార్తవము, పిత్తార్తవము, కఫార్తవము, కుణపార్తవము, గ్రంథ్యార్తవము, పూయార్తవము, క్షీణార్తవమునని శుక్రార్తవము ననియెనిమిది విధముల సంజ్ఞాభేదములను, వానివాని లక్షణముల నెరుంగునది. మరియు చికిత్సయు శుక్రార్తవదోషములకు సమానముగనే యుండును. మలశుక్రము మూత్రముచే చెడినది మూత్రశుక్రమనియు, పురీషముచే చెడినది పురీషశుక్రమనియు రెండువిధములు.

వాతశుక్రాదులకు వేరు వేరు లక్షణములు.

స్వలిఙ్గైర్దోషజంవదేత్ ౧౦

రక్తేనకుణపంశ్లేష్మ వాతాభ్యాం గ్రన్థిసన్నిభం
పూయాభంరక్తపిత్తాభ్యాం క్షీణం మారుతపిత్తతః ౧౧

వాతజ, పిత్తజ, కఫజ, శుక్రలక్షణములను వాతాదులకు వేరువేరుగజెప్పిన లక్షణములబట్టి ఆయాశుక్రలక్షణములనెరుంగునది. (అందు వాతశుక్రము రూక్షగుణశ్యావారుణాది కాంతిగల్గియుండునదనియు, విస్రగంధముఉష్ణగుణముమున్నగుపిత్తలక్షణములు కల్గినది పిత్తశుక్రమనియు, స్నిగ్ధత్వము, పాండువర్ణము పిచ్ఛిలగుణము మున్నగుకఫలక్షణములు కల్గినది కఫశుక్రమనియు దోషలక్షణములచే తెలియునది) చెడినరక్తముచే దుష్టమై పీనుగవంటి దుర్గంధము కల్గినది కుణపశుక్రము. దుష్టములై కఫవాతములచే దూషితమై గ్రంథి వంటియాకారముకల్గినది గ్రంధిశుక్రము. దుష్టములగు రక్తపిత్తములచే దూషితమై చీమునుబోలినది పూయ శుక్రము. దుష్టములగు వాతపిత్తములచే దూషితమై క్షీణించినది క్షీణశుక్రము. (మూత్రమునకు సమానముగనుండునది మూత్రశుక్రము పురీషమునకుసమానముగనుండునది పురీషశుక్రము. ఈరెండును మలశుక్రములు)

మరియుం వాత, పిత్త, కఫ శుక్రలక్షణములు ప్రత్యేకముగ నాత్రేయునిచే నిట్లు చెప్పబడినది. "ఫేనిలం తనురూక్షంచ కృచ్ఛ్రేణాల్పంచమారుతాత్, భవత్యుపహతంశుక్రం నతద్గర్భాయకల్పతే, సనీల మథవాపీతం అత్యుష్ణం పూతిగన్ధివా, దహల్లిఙ్గం వినిర్యాతి శుక్రంపిత్తే నదూషితమ్, శ్లేష్మణారుద్ధమార్గన్తు భవత్యత్యర్థపిచ్ఛలమ్, ఇతి దోషాస్సమాఖ్యాతాః శుక్రస్యతు విశేషతః" వాతముచే దుష్టమైనశుక్రము నురుగుతోగూడి చుల్కనై రూక్షగుణముకల్గి మిక్కిలి కష్టముచే స్వల్పముగ వెడలును. పిత్తముచే దూషితమగుశుక్రము నీలవర్ణమైనను పచ్చనివర్ణమైనను కల్గి మిక్కిలి వేడియై దుర్గంధముకల్గి లింగమును దహించుచున్నట్లు యుండుచు వెడలును. కఫముచే దుష్టమైనశుక్రము కఫముచే నడ్డగింపబడినమార్గము కల్గి మిక్కిలి పిచ్ఛిలంబైయుండును. ఇవి వాతాదులచే దుష్టమైన శుక్రలక్షణములు.

(పైని యెనిమిదివిధములుగ దుష్టములగు శుక్రలక్షణములును వరుసగ వాతార్తవాదు లెనిమిదిటి యార్తవదోషములకును వరుసగ నెరుంగునది.)

శుక్రదోష సాధ్యాసాధ్యవివరణము.

కృచ్ఛ్రాణ్యేతాన్యసాధ్యం తు త్రిదోషం మూత్రవిట్ప్రభమ్

పైజెప్పిన వాతశుక్రము మొదలు క్షీణశుక్రమువరకుంగల శుక్రదోషము

లును, ఆర్తవదోషంబులును కృచ్ఛ్రసాధ్యములు. మూత్రముతో సమానగంధముకలది మూత్రశుక్రము. పురీషముతో సమానమైన గంధముకలది పురీషశుక్రము. ఈరెండును సన్నిపాతముచే దుష్టమైనది. ఈరెండును సన్నిపాతదుష్టమగుటంజేసి యసాధ్యము.

మూత్రపురీష దుష్టశుక్రార్తవములు సాన్నిపాతికములని "మూత్రపురీష గ్రంథి సన్నిపాతేన" అను వాక్యముచేత సుశ్రుతాచార్యులు చెప్పిరి.

### వాత, పిత్త, కఫదుష్టశుక్ర చికిత్స.

కుర్యాద్వాతాదిభి ర్దుష్టే స్వౌషధమ్

వాత, పిత్త, కఫములచే దుష్టమైన శుక్రార్తవములకు వాతాదిదోషప్రకోపమున నాయాదోషములకు వేరువేరుగ జెప్పిన సామాన్యచికిత్సలజేయునది. (వాతము ప్రకుపితమగుటచే దుష్టమైన శుక్రమునకు వాతప్రకోపమునకు జెప్పిన స్నిగ్ధోష్ణాన్నలవణాద్యౌషధములును, పిత్తదుష్టమగు శుక్రమునకు పిత్తప్రకోపమున జెప్పిన మధురశీతకషాయాదులును, కఫదుష్టమైన శుక్రమునకు కటుకరూక్షకషాయాదులును హితకరములని భావము.)

### కుణపశుక్ర చికిత్స.

కుణపే పునః. ౧౨

ధాతకీపుష్పఖదిర దాడిమార్జునసాధితమ్,
పాయయేత్సర్పిరథ వా విపక్వమసనాదిభిః. ౧౩

కుణపము శుక్రదోషమునందు ఆరెపువ్వు, చండ్రచేవ, దానిమ్మబెరడు, మద్దిపట్ట వీనినిగూర్చి సిద్ధముచేయబడిన ఘృతమును త్రాగింపనగును. లేక అసనాదిగణమున జెప్పిన ద్రవ్యములజేర్చి చేయబడిన ఘృతమునైన ద్రాగింపనగును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—వాతాది దుష్టశుక్రము నుద్దేశించి వేరువేరుగ జెప్పియున్న చికిత్సలే వాతాది దుష్టార్తవములకు సామాన్యముగ జేయందగును. అందు గ్రంథి, పూయ, కుణపార్తవములకుమాత్రము క్రింద ప్రత్యేకముగ జెప్పియున్నది కావున నీమూడిటికిని శుక్రమునకు జెప్పిన చికిత్సను వదలి ప్రత్యేకచికిత్సయే యుచితము. కావున నీచెప్పిన కుణపచికిత్స శుక్రమునకుమాత్రము ఉపయోగించునది.

### గ్రంథి, పూయశుక్రముల చికిత్స.

పలాశభస్మాశ్మభిదా గ్రన్థ్యాభే పూయరేతసి,
పరూషకవటాదిభ్యాం

గ్రంథి శుక్రమునందు మోదుగాకులభస్మముచు, పాషాణభేదినిగూర్చిసిద్ధము చేయబడిన ఘృతము నుపయోగించునది. మరియు పూయశుక్రమునందు పరూషకాది గణమునను వటాదిగణమునను జెప్పిన ద్రవ్యములగూర్చి సిద్ధముచేయబడిన ఘృతము త్రాగింపనగును.

క్షీణశుక్రచికిత్స

క్షీణే శుక్రకరీక్రియా. ౧౪

స్నిగ్ధంవాంతం విరిక్తంచ నిరూఢమనువాసితమ్,
యోజయేచ్ఛుక్రదోషార్తం సమ్యగుత్తరవస్తిభిః

శుక్రము క్షీణమైనయపుడు అట్టి మనుజునను తొలుత స్వేదవిధిప్రకారము చెమటవెడలించి పిదప వమనవిరేచనముల చేతను నిరూహణ అనువాసనవస్తికర్మలచేతను శోధనచికిత్సజేసి పిమ్మట శుక్రమును వృద్ధినొందించు వాజీకరణాదుల నుపయోగించునది. శుక్రార్తవదోషములయందు ఉత్తరవస్తి నుపయోగించుట చాల ప్రధానకృత్యము.

మరియు "ఘృతం యజ్జీవనీయోక్తం చ్యవనప్రాశ ఏవ చ, గిరిజస్య ప్రయోగశ్చ రేతోదోషాన్ వ్యపోహతి." అని యాత్రేయ వచనప్రకారము జీవనీయ గణద్రవ్యములజేర్చి సిద్ధముచేయబడిన ఘృతంబును, చ్యవనప్రాశరసాయనంబును, శిలాజితువును నుపయోగించునెడ రేతస్సునకు సంబంధించిన దోషములనన్నిటిని నివర్తింపజేయును.

పురీషశుక్రార్తవ గ్రంథ్యార్తవచికిత్స.

సంశుద్ధో విట్ప్రభే సర్పిః హిఙ్గుసేవ్యాది సాధితమ్,
పిబేత్ గ్రన్థ్యార్తవే పాఠావ్యోష వృక్షకజం జలమ్

పురీషశుక్రమునందు వమనవిరేచనములచే తొలుత శోధనచికిత్సజేసిన పిదప ఇంగువ వట్టివేళ్లు మున్నగువానిచే సిద్ధమైన ఘృతమును త్రాగించునది. గ్రంథిఆర్తవమున చిరుబొద్ది త్రికటుకములు వృక్షకము (ఓషధివిశేషము) అనువానినిజేర్చి కాచబడిన కషాయము నుపయోగించునది.

'హింగుసేవ్యాది' అను నాదిశబ్దముచే నీయర్థము నెరుంగనది.—ఇంగువ, వట్టివేళ్లు, చిత్రమూలము, ప్రేంకణము, మ్రాగచెక్క, తామరకాడలు. వీనికషాయమును గూర్చి, దాల్చిన్నిచెక్క, ఏలకులు, కచోరములు. వీని చూర్ణముఁకలిపి కాచబడిన ఘృతము నుపయోగించునది. ఈయోగము అష్టాంగసంగ్రహమున జెప్పబడినది.

మరియు మలశుక్రము అసాధ్యమని చెప్పియున్నను, మరల నిచ్చట చికిత్స జెప్పుటచేత పురీషశుక్రమునకు మాత్రము ఒకవేళ సాధ్యావస్థయుకలదని తెలిసెడిని మూత్రశుక్రము అసాధ్యమగుటంజేసి యేచికిత్సజెప్పలేదు. కాననయ్యది యసాధ్యము

### కుణప-పూయార్తవముల చికిత్స.

పేయం కుణపపూయాస్రే చన్దనం వక్ష్యతేతు యత్,
గుహ్యరోగే చ తత్సర్వం కార్యం సోత్తరవస్తికమ్. ౧౭

కుణపార్తవమునందును పూయార్తవమునందును చందనమును జలముతో నుపయోగించునది. మరియును గుహ్యరోగచికిత్సయందు జెప్పిన యుపచారములన్నియును ఉత్తరవస్తియును పైజెప్పిన యార్తవదోషముల రెండిటియందు నుపయోగించునది.

### శుద్ధశుక్రలక్షణము.

శుక్రం శుక్లం గురుస్నిగ్ధం మధురం బహలం బహు,
ఘృతమాక్షికతైలాభం సద్గర్భాయ

(మనుజులు భుజించు నానావిధాహారములు జాఠరానలముచేపక్వమైయందుండి రసము ఏర్పడును. అయ్యది పక్వమై రసధాతువుగ నేర్పడును. అట్టి రసధాతువునుండి రక్తంబును దానినుండి వరుసగ మాంస మేదోస్థిమజ్జాధాతువులు నేర్పడును. అట్టి మజ్జాధాతువువరకును అన్నిటియందును వ్యాపించిన యాహారరసముయొక్క సారము శుక్రమనబడును. అట్టి శుక్రము శరీరమునందెల్ల వ్యాపించియుండు శుక్రధరయను కలయందు పాలయందు నెయ్యివలెను, చెరకురసమున బెల్లమువలెను లీనమై సర్వశరీరమున వ్యాపించియుండును. అందును మజ్జాధాతువునందును వృషణములయందును స్తనములయందును విశేషముగ వ్యాపించియుండెను. అయ్యది సంభోగవిషయమైన హర్షమున గల్గిన సంఘర్షమువలన ప్రతియంగమునుండి వెడలి ఘనీభవించి మూత్రద్వారమూలముగ బైటవెడలును. ఈవిషయమునే సుశ్రుతాచార్యులిట్లు చెప్పిరి:—“యథాపయసిసర్పిస్తు గుడశ్చేక్షు రసేయథా, శరీరేషు తథా శుక్రం నృణాంవిద్యాద్భిషగ్వరః॥ ద్వ్యఙ్గుళే దక్షిణేపార్శ్వే వస్తిద్వారస్యచాప్యధః, మూత్రస్రోతః పథాచ్ఛుక్రం పురుషస్య ప్రవర్తతే. కృత్స్నదేహాశ్రితం శుక్రం ప్రసన్నమనసస్తథా, స్త్రీషువ్యాయచ్ఛతశ్చాపి హర్షాత్తత్సమ్ప్రవర్తతే” ఈవాక్యములవివరమె పైజెప్పబడినది.)

అట్టి శుక్రధాతువు తెల్లని (స్ఫటికమువంటి) రంగుకల్గి బరువై స్నిగ్ధమై మధురరసముకల్గి చక్కనై యధికముగనుండి నెయ్యివలె గౌరవర్ణంబైనను, తేనెవలె శ్యామవర్ణంబైనను, నూనెవలె కృష్ణవర్ణంబైనను కల్గియుండిన నయ్యది మంచి గర్భరూపము నొంద సమర్థమైయుండును.

### శుద్ధార్తవలక్షణము.

ఆర్తవంపునః ౧౮

లాక్షారసశశాస్రాభం ధౌతంయచ్చ విరజ్యతే,

(పైజెప్పినరీతిగ నాహారరసారరూపమై రక్తరూపమునంది ప్రతిమాసమునను మూడేసిదినములు గర్భకోష్ఠమునుండి బైటవెడలునది యార్తవము. అది యధికముగ వెడలినను మూడుదినములకన్న నధికకాల మనువర్తించినను రక్తప్రదరము మన్నగు వ్యాధులుగపరిణమించును) అట్టి యార్తవము లత్తుకరసమును కుందేటినెత్తురునుబోలె నెఱ్ఱనై యయ్యది గుడ్డకంటిననాడు నీళ్లుబోసి పులిమినయెడ రంగు గుడ్డకంటికొనక యుండునెడ పరిశుద్ధమని యెఱుంగునది. అయ్యది గర్భరూపమునొంద సమర్థమై యుండును.

గర్భోత్పత్తికిముందు దంపతుల నియమము.

శుద్ధశుక్రార్తవం స్వస్థం సంరక్తంమిథునంమిథః 19
స్నేహైః పుంసవనైః స్నిగ్ధం శుద్ధం శీలితవస్తికమ్,
నరం విశేషాత్ క్షీరాజ్యైః మధురౌషధ సంస్కృతైః. 20
నారీం తైలేనమాషైశ్చ పిత్తలైః సముపాచరేత్.

స్త్రీ పురుషులు (దంపతులు) పైజెప్పినరీతిగ శుద్ధమైన (దోషరహితమైన శుక్రంబును ఆర్తవంబును స్వస్థమై (రోగరహితమైన) నశరీరముకల్గి ఒకరియందొకరికి పరస్పర మనురాగము కల్గియుండవలెను. పురుషప్రజనుకల్గించుటకు సమర్థమైన ఫలఘృతము మహాకల్యాణఘృతమున్నగు స్నేహద్రవ్యముల సేవించుటచే కోష్ఠముమిక్కిలి స్నిగ్ధముగ జేసికొని వమనవిరేచనములచే శోధనముజేసి పిదప అనువాసనాదివస్తికర్మలనలవాటుగ జేయుచుండవలెను తొలుత పైజెప్పినరీతిగ స్నేహశోధనములు జేసికొనిన దంపతులలో పురుషుని మధురరసంబులును మధురప్రభావంబులునుకల జీవనీయాది మధురౌషధములచే సంస్కరింపబడిన క్షీరములచేతను ఆజ్యముచేతను విశేషముగ నుపచరించవలెను. స్త్రీని తైలముచేతను, మినుములచే జేయబడిన భక్ష్యాదులచేతను, పిత్తమును వృద్ధినొందించు నౌషధాదులచేతను ఉపచరించవలెను.

(ఇచ్చట మధురౌషధ సంస్కారమునొందిన క్షీరాజ్యములచే శుక్రమువృద్ధినొందును కావున పురుషులకు ప్రధానము. స్త్రీలకు శుక్రవృద్ధి యవసరముకాదు కావున పిత్తమునువృద్ధినొందించు ఔషధములు రక్తమునుకూడ వృద్ధినొందించును కావున వానిని తైలాదులను విశేషముగ నుపయోగించవలెను. క్షీరాజ్యములమాత్రము సామాన్యముగ నుపయోగించవలెనని భావము)

ఋతుమతియగు స్త్రీలక్షణము.

క్షామప్రసన్నవదనాం స్ఫురచ్ఛ్రోణిపయోధరామ్. 21

ప్రస్తాఽక్షీకుక్షిం పుంస్కామాం విద్యాదృతుమతీంస్త్రియం,

జ్వరాదిరోగములచే గాక స్వభావముచేతనే చిక్కి నిర్మలమైన కాంతితో గూడిన ముఖంబును, కొంచెముగ నదరుచున్న పిరుదులును స్తనములును, స్వస్థానమునుండి చలించినట్లున్న కన్నులును కుక్షియుకల్గి, పురుషునిపై నభిలాషకల్గిన యౌవనవతియగు స్త్రీ ఋతుమతియని యెరుంగునది.

## గర్భధారణమునకు నియత కాలము.

పద్మం సంకోచమాయాతి దినేఽతీతే యథాతథా. ౨౨
ఋతావతీతే యోనిస్సా శుక్రంనాతః ప్రతీచ్ఛతి,

తామరపువ్వు పగల్లెల్ల వికసించియుండి భాను డస్తమించినతోడనే మరల ముకుళించును. ఆవిధముగనే ఋతుకాలమున స్త్రీలకు యోనివివృతమైయుండును. కావున నాసమయమున శుక్రమును గ్రహింపనోపును. ఆఋతుకాలముగడచిన పిదప అస్తమయానంతరము కమలము ముకుళించుభంగి ద్వారముమూసికొనును కావున పురుషుని శుక్రమును గ్రహింపనోపదు. అందువలన నకాలమున గర్భమునిలువదు.

## ఆర్తవము వెడలుక్రమము.

మాసేనోపచితం రక్తం ధమనీభ్యామృతౌపునః. ౨౩
ఈషత్కృష్ణం విగన్ధంచ వాయుర్యోని ముఖాన్నుదేత్,

నెలదినములవరకును భుజింపబడిన యాహారము పక్వమై దానంగల్గురసము వలన పుట్టిన రక్తము నానాట నెలదినములు వృద్ధినొందియుండును. ప్రకోపమునొందక స్వభావస్థితినుండు వాతము పైజేప్పిన రక్తమును రెండునాడులనుండి ఋతుకాలమున యోని ముఖమునుండి బైటవెడలించును. ఆరక్తము స్వభావస్థితినుండు వాతముచే ప్రేరితమగుటంజేసి కొంచెముగ నలుపురంగుకల్గియుండును. పిత్తము సమస్థితినుండుటం జేసి యారక్తము దుర్గంధములేకుండును. (కఫమునకు స్థితినుండుటంజేసి శ్వేతాదివర్ణములులేకుండును. ఇదియె ఆర్తవము.)

వాతపిత్తకఫములు ప్రకుపితములుగాక సమస్థితినుండి యొకమాసమువరకును వృద్ధినొందియున్న శుద్ధరక్తము స్వభావస్థితినున్న వాతముచే ప్రేరితమై నాడీమార్గమున యోనిద్వారమునుండి బైటవెడలిన నయ్యది శుద్ధఆర్తవము. అదియే కలుగనున్న గర్భరూపమైన ఫలమునకు సూచకమగుటంజేసి పుష్పమని చెప్పనగును. ఆర్తవము యోనినుండి వెడలునపుయమున యోనిద్వారము వివృతముగనుండును.

### పుష్పవతియైనసమయమున నుండవలసిన నియమములు.

తతఃపుష్పేక్షణాదేవ కల్యాణధ్యాయినీత్ర్యహమ్. ౨౪
మృజాలంకారరహితా దర్భసంస్తరశాయినీ,
క్షైరేయంయావకంస్తోకం కోష్ఠశోధనకర్షణమ్. ౨౫
పర్ణే శరావే హస్తేవా భుఞ్జీత బ్రహ్మచారిణీ.

ఇట్లు పైజెప్పినరీతిగ పుష్పరూపమైన యార్తవము వెడలిన దానిం జూచినది మొదలు పుష్పవతియైన యాస్త్రీ శుభకరములగు విషయములనే ఆవశ్యముగ తలచుచుండవలెను. స్నానమును శరీరమునకు కటకాద్యలంకారములను పుష్పమాల్యాదులను ధరింపక దర్భలఱిచిన శయ్యపై పరుండియుండవలెను. శరీరమున మధ్యభాగముననుండు మహాస్రోతస్సునకు జేరియున్న ఆమపక్వాశయము కోష్ఠము. అట్టికోష్ఠము శోధించునదియు దోషయుక్తముల కృశింపజేయునదియునగు క్షీరముతో పక్వము చేయబడిన యవాన్నము స్వల్పముగ భుజింపవలెను. అట్టియాహారమును విస్తరియందైనను మూకుడియందైనను చేతియందైనను ఉంచి భుజింపవలెను. సంభోగమునువదలి స్వస్థచిత్తము కల్గియుండవలెను. పైజెప్పిన నియమములతో మూడురాత్రులు గడచునందాక యుండవలెను.

ఇచ్చట నలంకారశబ్దము "అలంక్రియతేఽనేన శరీరమితి అలంకారః" అను వ్యుత్పత్తిచేత శరీరము నలంకరించు కటకాదిభూషణములను గంధమాల్యాదులను బోధించుచు కావున భూషణగంధమాల్యాదుల విసర్జించి యుండవలెనని యర్థము. ఋతుమతిగనున్న మూడుదినములును భర్తను కంటనైన జూడదగదు. ఈవిషయము సుశ్రుతమున "త్ర్యహాంచభర్తుర్నసంవీక్షేత్" అను వాక్యముచే జెప్పబడినది.

### ఋతుమతి నాల్గవ నాడాచరింపదగిన నియమము

చతుర్థేఽహ్ని తతః స్నాత్వా శుక్లమాల్యామ్బరా శుచిః. ౨౬
ఇచ్ఛన్తీ భర్తృసదృశంపుత్రం, పశ్యేత్పురః పతిమ్,

పైజెప్పినరీతిగ మూడుదినములు నియమముతోగడపి నాల్గవనాడుదయమున నున్నిపిండి మొదలగువానిచే నలుగుపెట్టుకొని శుభ్రముగస్నానముజేసి తెల్లని పుష్పమాలికలను వస్త్రములనుధరించి మనస్సును శరీరమును పరిశుద్ధముగనుంచుకొని తనభర్తను సమానుడగు పుత్రుడు తనకుగల్గవలెననికోరి తానింకెవ్వరినిజూడక మునుపు తొలుతతన భర్తనుమిక్కిలి ప్రేమతో జూడవలెను.

నాల్గవ నాడుండవలసినపద్ధతి యష్టాంగసంగ్రహమున నిట్లుచెప్పబడినది:—
"చతుర్థేఽహని ఉద్వర్తితా శీతసలిలస్నాతా అనులిప్తా అలంకృతా శుక్లమాల్యా

మ్బరాకృతమంగళ స్వస్త్యయనా ఏవంవిధమేవభర్తారం పశ్యేదనన్యమనాః; తథాహి యాదృశంపశ్యతి చిన్తయతివా తాదృశమేవ ప్రసూతే” ఈవాక్యముచేత నాల్గవనాఁడు నలుగుపెట్టుకొని చల్లనినీళ్లలోఁ స్నానముచేసి చందనాదుల నలంకరించుకొని మంగళాశీర్వాదముల పెద్దలవలనబడసి ఆవిధముగనే స్నానాదులజేసి యలంకరించుకొన్న భర్తమనస్సునందలంచుచు తొలుత భర్తనుచూడవలెనని తెలిసెడిని. మరియుం ఋతుస్నానముజేసిన స్త్రీ తానెవ్వరికలంచినను చూచినను బుట్టిపుత్రుఁడుకల్గును కావున తొలుత భర్తనేతలంచుచు చూడవలెననియును తెలిసెడిని.

ఈవిషయమునే సుశ్రుతాచార్యుఁడు స్పష్టముగనిట్లుచెప్పెను:—పూర్వం పశ్యేదృతుస్నాతా యాదృశం నరమఙ్గనా, తాదృశంజనయేత్పుత్రంభర్తారందర్శయేదతః.”

ఋతుకాలము సంభోగనియమము.

ఋతుస్తు ద్వాదశనిశాః పూర్వాస్తిస్రోఽత్ర నిన్దితాః. ౨౭
ఏకాదశీచయుగ్మాసు స్యాత్పుత్రోఽన్యాసు కన్యకా,

స్త్రీఋతుమతియైన నాఁడు మొదలుజేసి పండ్రెండు రాత్రులుఋతుకాలము. అందుతొలుత మూఁడురాత్రులు సంభోగమునకర్హములుకావు. పదునొకండవ రాత్రి కూడ సంభోగమునకనర్హము. తక్కినయేడురాత్రులును సంభోగమునకు యోగ్యములు. అందు సమసంఖ్యయైననాల్గు, ఆరు, ఎనిమిది, పది, పండ్రెండు సంఖ్యలైన ఆయిదు రాత్రులయందు సంభోగించినపుత్రుఁడు కలుగును. బేసిసంఖ్యయైన, ఐదు, ఏడు, తొమ్మిది అను బేసిసంఖ్యలైన రాత్రులయందు సంభోగముజేసిన స్త్రీశిశువుకల్గును.

ఇచ్చట నీవిమర్శనము నెఱుంగునది:—పైజెప్పిన సంభోగార్థమైన ఋతుదినములలో సరిదినములయందు పురుషులకు శుక్రమధికమై స్త్రీలకార్తవము తక్కువగనుండునుకావున “స్త్రియశ్శుక్రేఽధికే స్త్రీస్యాత్ పుమాన్ పుంసోఽధికే భవేత్.” అనునిర్ణయప్రకారము శుక్రమధికముగ నుండుటంజేసి యారాత్రులయందు సంభోగించిన పురుషశిశువు కలుగును. బేసిదినములయందు పురుషులకు శుక్రము తక్కువగనుక స్త్రీలకార్తవము అధికముగనుండును కావున నారాత్రులయందు సంభోగించిన స్త్రీశిశువుకల్గును. కావున పురుషసంతతి నపేక్షించువారు సరిరాత్రులయందును స్త్రీసంతతి బడయగోరువారు బేసిరాత్రులయందును సంభోగముజేయుట యుచితము. ఒకవేళ నాహారాది విశేషమువలంజేసి పైజెప్పిన నియమము నతిక్రమించి సరిదినములయందు శుక్రమధికముగనుండక తక్కువగనున్నచో స్త్రీచిహ్నములతోఁగూడి బలహీనుఁడగు పురుషుఁడుపుట్టును. బేసిదినములయందు శుక్రమధికముగనుండినచో పురుషచిహ్నములుగల్గి బలశాలినియగు స్త్రీపుట్టును. ఏవిధమున జూచినను సరిదినములయందు పురు

షుడును జేసిదినములయందు స్త్రీసంతతియుగల్గుట నిశ్చయము. పండ్రెండుదినములు కడచినపిదప పదుమూడవరాత్రి మొదలు జేసిసంభోగము చేసినయెడ గర్భముగల్గకుండుటయకాక గర్భద్వారముచెడును! కావున మరల ఋతుకాలమువరకు సంభోగముకూడదు.

మరియు ఋతుదర్శనమైనది మొదలు మూడురాత్రులలో సంభోగముజేసినయెడ ఆర్తవము ప్రవహించుచుండుటవలన వీర్యమును గ్రహింపనేరదు. నది ప్రవహించుచుండునపుడు అందుంచబడిన వస్తువు నదీవేగముచేత వెలికింజనుగాని లోపల ప్రవేశింపదుకదా! ఆతీరుననే ఆర్తవము ప్రవహించి వెలికింజనునపుడు యెదుటవచ్చు శుక్రము వెలికింద్రోయునుగాని గ్రహింపనేరదు. కావున నామూడురాత్రులును సంభోగమున కర్హములుకావు.

ఈవిషయమును సుశ్రుతాచార్యుడు విపులముగ నిట్లు వివరించెను:—"తత్ర ప్రథమేదివసే ఋతుమత్యాం మైథున మనాయుష్యం పుంసాంభవతి; యశ్చతత్రాఽఽధీయతే గర్భః సప్రసవమానో మ్రియతే, ద్వితీయేఽప్యేవం సూతికాగృహేవా, తృతీయేఽప్యేవ మసంపూర్ణాఙ్గోఽల్పాయుర్వా భవతి, చతుర్థేహ్ని సంపూర్ణాఙ్గో దీర్ఘాయుశ్చ భవతి....... ..తస్మాన్నియమవతీం త్రిరాత్రంపరిహరేత్, అతః పరంమాసాదుపేయాత్" స్త్రీ ఋతుమతియైన నాడుసంభోగముచేసిన పురుషునకు ఆయువు క్షీణించును. ఒకవేళ నాడు గర్భము నిలిచినను ప్రసవసమయముననే గర్భము మృతిజెందును. రెండవనాడు సంభోగముచేసినయెడ నాడుధరింపబడిన గర్భము ప్రసవకాలముననైనను పురిటిలోపలనైనను మృతిజెందును. మూడవనాడు నిలిచినగర్భము అసంపూర్ణాంగముగును. లేక శిశువు అల్పాయువుగనగును. నాల్గవనాటిరాత్రి నిలచినగర్భము అవయవములన్నియు సంపూర్ణములై శిశువు దీర్ఘాయువగును. కావున పుష్పవతియైన స్త్రీ మూడు రాత్రులు బ్రహ్మచారిణియై పైజెప్పిననియమముల నాచరించుచుండవలెను. ఆసమయమున పురుషుడు సంభోగముచేయరాదు. పైజెప్పిన ఋతుదినములు పండ్రెండును కడచినపిదప మరల ఋతుకాలమువచ్చునందాక నొకమాసమునకు మరల సంభోగము చేయనగును. అనిభావము.

### ఋతుస్నానానంతర కృత్యము.

ఉపాధ్యాయోఽథ పుత్రీయం కుర్వీతవిధివ ద్విధిమ్. ౨౮
నమస్కారపరాయాస్తు శూద్రాయా మన్త్రవర్జితమ్,

పైజెప్పినరీతిగ ఋతుస్నానముచేసిన పిదప పురోహితుడు పుత్రోత్పత్తి కనుకూలమగు హోమమును శాస్త్రోక్తముగ న్యూనానతిరిక్తముగ చేయించవలెను. ఇట్టి

విధానము బ్రాహ్మణక్షత్రియవైశ్యులకు మూడువర్ణములవారికి సమానము. శూద్రస్త్రీకి నమస్కారమును ప్రధానముగ జేయించి పైజెప్పిన విధానమంతయు మంత్రములేక తంత్రమును మాత్రము జేయించునది.

### ఋతుకాలవిధానమునకు ఫలము.

అవస్థ్యైవం సంయోగః స్యాదపత్యం చ కామతః. ౨౯
సన్తోఽప్యాహురపత్యార్థం దంపత్యోస్సంగతం రహః,
దురపత్యం కులాఙ్గారో గోత్రే జాతం మహత్యపి. ౩౦

పైజెప్పిన విధిప్రకారము యథాశాస్త్రముగ నాచరించి దంపతులు ఒకటిగ కూడి భోగించినయెడ వారి సంయోగము వ్యర్థముగాక గర్భోత్పత్తి కనుకూలముగనుండును. అంతియకాక అట్టి గర్భముకూడ తన కభిమతమైన శిశువును గల్గింప సమర్థమగును. దంపతులు ఏకాంతముగ జేరుట సంతతికొరకుగాని కేవలము గ్రామ్యసుఖము ననుభవించుటకు కాదని పెద్దలగు సాధువులుచెప్పెదరు. కావున అట్టిసంయోగము ఫలవంతముగనుండుట యావశ్యకము. మరియు దుష్టమైన యపత్యము (స్త్రీశిశువైనను పురుషశిశువైనను) గొప్ప (ప్రశస్తమైన) వంశమునబుట్టినను, అయ్యది యాకులమును నిప్పుకణమునుబోలె నశింపజేయుంగాని కులమునకు పేరుప్రతిష్ఠలదెచ్చుటకు సమర్థము కానోపదు. (కావున మంచిగర్భముగల్గుటకై పైజెప్పినవిధానమును ఆచరించవలెననుట)

### ఇష్టమైన సంతానముగల్గునుపాయము.

ఇచ్ఛేతాం యాదృశంపుత్రం తద్రూపచరితాంశ్చ తే,
చింతయేతాం జనపదాం స్తదాచార పరిచ్ఛదే. ౩౧

దంపతులు ఎట్టి సంతానము కావలెనని కోరెదరో అట్టి సంతానమునకు సంబంధించిన యాచారంబుల నాచరించుచు అందుకు తగిన వస్త్రవాహన శయ్యాలంకారాదులు కల్గియుండవలెను. మరియు వారు కోరినపుత్రున కనుగుణమైన రూపమును చరిత్రములను అట్టిపుత్రుసంబంధు గ్రామాదులను మనసున విశేషముగ తలచవలెను. (అట్టిరూపాదుల తలచినచో వారికి తప్పక వారుకోరిన పుత్రుడైనను పుత్రికయైనను కల్గును.)

### దంపతుల శయ్యారోహణక్రమము.

కర్మాన్తే చ పుమాన్సర్పిః క్షీరశాల్యోదనాశితః,
ప్రాగ్దక్షిణేన పాదేన శయ్యాం మారోహర్త్విగాజ్ఞయా. ౩౨
ఆరోహేత్ స్త్రీతు వామేన తస్య దక్షిణపార్శ్వతః,
తైలమాషోత్తరాహారా తత్రమన్త్రం ప్రయోజయేత్. ౩౩

పైఁజెప్పిన పుత్త్రీయహోమమును విధ్యుక్తప్రకారము నెరవేర్చిన పిదప పురుషుఁడు నెయ్యిని క్షీరమునుగూర్చిన రాజనంపు బియ్యపు యోగిరమును భుజించి జ్యోతిష్కుని యానతివడసి మంచిలగ్నమున తన కుడికాలిచేత స్త్రీకన్న ముందు మంచమెక్కవలెను. స్త్రీ పురుషుఁడు మంచమెక్కిన పిదప ముందు నూనెయు మినుములును అధికముగగల యాహారమును భుజించి తన పురుషునకు దక్షిణపార్శ్వమున తన యెడమ కాలితో ముందు మంచమెక్కవలెను. ఇత్తెఱంగున నిరువురును మంచముఁజేరిన పిదప నీక్రిందిమంత్రమును జపించవలెను.

## మంత్రము.

అహిరసి ఆయురసి సర్వతః ప్రతిష్ఠాసి ధాతా త్వాం
దధాతు; విధాతా త్వాం దధాతు, బ్రహ్మవర్చసా భవేతి
బ్రహ్మాబృహస్పతి ర్విష్ణుః సోమస్సూర్య స్తథాశ్వినౌ,
భగోఽథ మిత్రావరుణౌ వీరందదతు మే సుతమ్.

పైఁజెప్పినరీతిగ దంపతు లిద్దరును శయ్యపైనెక్కి 'అహిరసి—మేసుతమ్' అను నీమంత్రమును జపించునది. బ్రహ్మ, బృహస్పతి, విష్ణువు, సోముఁడు, సూర్యుఁడు, అశ్వినీదేవతులు, భగుఁడు, మిత్రావరుణులు; వీరందరును మిక్కిలి శూరుఁడగుకొడుకును నాకిచ్చెదరుగాక! యని మంత్రార్థము.

## ఏకాంతనియమము.

సా త్వయిత్వా తతోఽన్యోన్యం సంవిశేతాం ముదాన్వితే,
ఉత్తానా తన్మనాః యోషిత్ తిష్ఠే దఙ్గైస్సుసంస్థితైః. 38
తథా హి బీజం గృహ్ణాతి దోషైః స్వస్థానమాస్థితైః,

పైఁజెప్పినరీతిగ మంత్రము జపించి పిదప నొకరి నొకరు ప్రియవచనసరససల్లాపాదులచే ప్రీతిని కల్గించుకొని సంతసించిన మనస్సుకలవారలై యొకటిగఁగూడి క్రీడసలుపవలెను. అందు స్త్రీ కరచరణాద్యవయవములను వంకరటింకరగ నుంచికొనక సమస్థితినుంచుకొని తనమనసునియందే పరిపూర్ణముగ మనంబునిడి వెల్లికిలపరుండవలెను. అట్లున్నయెడ వాతపిత్తకఫములు తమతమ నెలవులయం దస్వస్థములై యుండును. దానింజేసి స్త్రీ గర్భబీజమును గ్రహింప సమర్థమగును.

పైఁజెప్పిన విధముగాక పురుషుఁడు క్రిందఁ బరుండి స్త్రీ పైనున్నయెడ స్త్రీచేష్టలుకల పురుషుఁడుజనించును. లేక పురుషచేష్టలుకల స్త్రీయైన పుట్టును. కావున స్త్రీ క్రింద వెల్లికిలబరుండి పురుషుఁడు పైనుండవలెను. మరియుం పార్శ్వములబరుండి భోగింపంజనదు. కుడి

ప్రక్కపరుండి సంగమముచేసిన నాప్రక్కనుండు కఫము ఉద్రిక్తమై గర్భాశయమును మూయును. దానంజేసి గర్భబీజమును గ్రహింపనోపదు. ఎడమప్రక్కపరుండి భోగించినచో నాప్రక్కనుండు పిత్తము ప్రకోపమునొంది శుక్రశోణితములను తపింపజేయును. బోరగిలబరుండినయెడ వాతము ప్రబలమై యోనికి బాధకల్గించును. కావున పైజెప్పినరీతి వెలకిలబరుండి యావయవముల సుస్థముగ నుంచుకొనియున్నయెడ దోషము స్వస్థానములనే సుస్థములైయుండును. బీజమును గ్రహింపనోపును.

ఈవిషయము అష్టాఙ్గసంగ్రహమున నిట్లుచెప్పబడెను:—"నచాసావధస్తిష్ఠేత్, తథాహి స్త్రీ చేష్టః పుమాన్ జాయతే, పుంచేష్టావా స్త్రీచ నచన్యుబ్జాం పార్శ్వగతాంవాసేవేత, న్యుబ్జాయాః వాతో బలవాన్ సయోనింపీడయతి, దక్షిణపార్శ్వగాయాః శ్లేష్మా పీడితశ్చ్యుతః పిదధాతి గర్భాశయమ్, వామపార్శ్వగాయాః తత్పిత్తం విదహతిరక్తశుక్రే, తస్మాదుత్తానా బీజంగృహ్ణాతి" (దీనియర్థమే పైని వివరింపబడియె)

## సద్యోగృహీతగర్భలక్షణములు.

లిఙ్గం తు సద్యోగర్భాయాః యోన్యాంబీజస్యసఙ్గ్రహః ౩౫
తృప్తిర్గురుత్వం స్ఫురణం శుక్రాస్రాఽనుబన్ధనమ్,
హృదయ స్పన్దనం తన్ద్రాతృట్ గ్లానిర్లోమహర్షణమ్. ౩౬

స్త్రీ గర్భమును గ్రహించిన యుత్తరక్షణమే క్రింద వివరింపబడు లక్షణములు కానబడును:—గర్భరూపమైన బీజమును యోనిచే గ్రహించును. సంభోగమునందు తృప్తిజెందును. అవయవములు బరువుగనుండును. యోనియదరును. శుక్రశోణితములు బైటవెడలకుండును. రొమ్ముదరును. మైమరచియుండును. దప్పికల్గును. బడలికయు రోమాంచంబును కల్గును. ఈలక్షణములన్నియు గర్భమును గ్రహించునప్పుడే స్త్రీలకు కల్గును.

సుశ్రుతాచార్యుండు సద్యోగృహీతగర్భలక్షణముల నిట్లుపదేశించెను:—"తత్ర సద్యోగృహీతగర్భాయాః లిఙ్గాని:—శ్రమోగ్లానిః పిపాసాసక్థిసదనంశుక్రశోణితయోరవబన్ధః స్ఫురణంచయోనేః" ఈవాక్యముచేత శ్రమంబును, బడలికయు, దప్పియు, తొడలనొప్పియుగూడ కల్గునని తెలిసెడి.

## ప్రథమమాసగర్భలక్షణము.

అవ్యక్తః ప్రథమేమాసి సప్తాహాత్కలలీభవేత్,
గర్భః పుంసవనాన్యత్ర పూర్వంవ్యక్తేః ప్రయోజయేత్. ౩౭
బలీపురుషకారోహి దైవమప్యతి రిచ్యతే,

గర్భమును గ్రహించిననాటనుండి ముప్పదిదినములు ఒకమాసము. అందు ఏడు దినములవరకును కఫముతోఁగూడి గర్భము పిండాకారమై యుండును. పిమ్మట మాసము గడచునందాక పురుషచిహ్నంబులైనను, స్త్రీచిహ్నంబులైనను స్ఫుటముగ నేర్పడక నీటి బుడగవలె నుండదయై యుండును. అట్టియవ్యక్తస్థితియందు పుంసవన (పురుషశిశువు కల్గుటకుదగిన) ప్రయోగములనుపయోగింపజనును. (పురుషప్రయత్నము ప్రబలముగనుండు కొడ బలహీనమగు దైవప్రయత్నమునుగూడ నతిక్రమించి పురుషశిశువును కల్గించును. కావున పుంసవనప్రయోగమువలన పురుషశిశువు కల్గును.

ఇచ్చట నీవిమర్శనము నెరుంగనది:—"శుద్ధేశుక్రార్తవేసత్వః స్వకర్మక్లేశ దూషితః, గర్భస్సఞ్జాయతే. శుక్రస్య బాహుళ్యాజ్జాయతేపుమాన్ రక్తస్య స్త్రీత యోస్సామ్యేక్లీబః" అను పైజెప్పబడిన వాక్యములచేత పరిశుద్ధములగు శుక్రార్తముల సంబంధమునంజేసి జీవుడు తాను తొలిపుట్టువునజేసిన శుభాశుభకర్మానురూపముగ స్త్రీపురుషరూపమైన జన్మము నొందుననియు, అందును శుక్రమధికమైనచో పురుష జన్మంబును, ఆర్తవమధికమైనచో స్త్రీజన్మంబును కల్గుననియు నేర్పడుచున్నది. అట్టి శుక్రార్తవముల న్యూనాధిక్యములు తాజేసినకర్మానుగుణముగ కల్గును. ఈనిర్ణయమునుబట్టి స్త్రీపురుషజన్మభేదములకు దైవికమై స్వకర్మపరిపాకమే కారణముగాని వేరొండులేదని స్ఫుటమగుచున్నది. అట్లుండ పుంసవనప్రయోగముచే పురుషుడెట్లుపుట్టును? అను నాశంక కల్గును. అయినను దైవబలము తక్కువై పురుషప్రయత్నము ప్రబలముగ నున్నపుడు దైవబలమును ధిక్కరించి పురుషప్రయత్నము కొనసాగును. కావున స్వకర్మపరిపాకము స్త్రీజన్మము నిచ్చునట్టిదైనను అంతకన్న పురుషప్రయత్నము ప్రబలమైనపుడు పుంసవనప్రయోగమున పురుషజన్మము కల్గనోపును. అట్టియెడ దైవపురుషకార ప్రాబల్యమును స్త్రీపురుషజన్మమునుబట్టియె యూహింపదగును. (పుంసవనము నుపయోగించినను స్త్రీజన్మముకల్గినయెడ దైవము ప్రబలమనియు, పురుషజన్మముకల్గిననాడు పురుషకారము బలవత్తరమనియు నూహింపవలెనని భావము)

### పుంసవనయోగములు.

పుష్యేపురుషకం హైమం రాజతం వాథవాయసమ్. 3౨
కృత్వాఽగ్నివర్ణం నిర్వాప్యక్షీరే తస్యాఽఞ్జలింపిబేత్,

బంగారుతోనైనను వెండితోనైనను ఇనుముతోనైనను పురుషాకృతిగ బొమ్మను జేసి పుష్యమీనక్షత్రమునాడు నిప్పువలె కొట్టునగునట్టు ఆబొమ్మను నిప్పునకాల్చి ఆవుపాలలో మునిచి చల్లార్చి యాపాలు నాల్గుకుడులములను త్రాగునది.

## పుంసవనమునకు అపామార్గాదియోగము

గౌరదండమపామార్గం జీవకర్షభసైర్యకాః. ౩౯
పిబేత్పుష్యేజలేపిష్టాన్ ఏకద్విత్రిసమస్తశః,

ఎఱ్ఱనికాడలుకల ఉత్తరేణి, జీవము, ఋషభకము, సైర్యకము (ఓషధివిశేషము) ఈనాల్గిటిలో నొక్కొకటినైనను రెండేసినైనను మూడేసినైనను నాల్గిటినైనను చేర్చి నీళ్లతో నూరి కల్కముజేసి పుష్యమీనక్షత్రమునాడు త్రాగునది.

## బృహతీమూలయోగము.

క్షీరేణ శ్వేతబృహతీ మూలం నాసా పుటేస్వయమ్. ౪౦
పుత్రార్థందక్షిణేసిఞ్చేత్ వామేదుహితృవాఞ్ఛయా,

తెల్లనిపువ్వులుకల్గి కాయలగాచువాకుడుచెట్టు వేరును పాలతో నూరి యాకల్కరసమును పురుషశిశువు కలుగగోరినస్త్రీ కుడిముక్కురంధ్రమునను, ఆడుబిడ్డను కోరునెడ నెడమముక్కురంధ్రమునను విడువవలెను.

## లక్ష్మణాదియోగములు.

పయసా లక్ష్మణామూలం పుత్రోత్పాదస్థితిప్రదమ్. ౪౧
నాసయాస్యేనవాపీతం వటశృఙ్గాష్టకం తథా,
ఓషధీర్జీవనీయాశ్చ బాహ్యాన్తరుపయోజయేత్. ౪౨

లక్ష్మణామూలమును నలియగొట్టి కల్కముజేసి పాలతో కలిపి నోటితోనైనను నాసారంధ్రముననైనను త్రాగిన పుత్రోత్పత్తికల్గును. లేక అప్పుడు మొలచిన మఱ్ఱి మొలకల నెనిమిదిని నూరి పాలతో గల్పియైనను, జీవనీయగణమున జెప్పినవాని నూరి పాలతోగల్పియైనను లోపలికి పైకిని ఉపయోగించునెడ పుత్రుడు కల్గి ఆయుష్మంతుడుగ నుండును.

## గర్భిణికి చేయదగినయుపచారములు.

ఉపచారః ప్రియహితైః భర్త్రాభృత్యైశ్చ గర్భధృక్,
నవనీతఘృతక్షీరైః సదాచైనాముపాచరేత్. ౪౩

మనస్సు కింపైనవియు పథ్యంబులునైన యాహారావిహారాదిరూపములచే భర్తచేతను భృత్యులచేతను చేయబడిన యుపచారము గర్భమును ధరింపజేయసమర్థమగును. మరియు వెన్న నెయ్యి పాలు మున్నగుసాత్వికములైన ద్రవ్యములచేత గర్భిణీస్త్రీని యుపచరింపనగును. (వెన్న మొదలగువానితో నెయ్యిది సాత్మ్యములగునో వానిచే నుపచరించవలెనని భావము)

## గర్భిణీస్త్రీ విడువవలసినవిషయములు.

అతివ్యవాయమాయాసం భారం ప్రావరణం గురు,
అకాలజాగరస్వప్నం కఠినోత్కటకాసనమ్. ౪౪
శోకక్రోధభయోద్వేగవేగశ్రద్ధావిధారణమ్,
ఉపవాసాఽధ్వతీక్ష్ణోష్ణగురువిష్టమ్భిభోజనమ్. ౪౫
రక్తం నివసనం శ్వభ్రకూపేక్షాం మద్యమామిషమ్,
ఉత్తానశయనం యచ్చ స్త్రియో నేచ్ఛన్తి తత్త్యజేత్. ౪౬
తథా రక్తస్రుతిం శుద్ధిం వస్తిమామాసతోఽష్టమాత్,
ఏభిర్గర్భస్స్రవేదామః కుక్షౌ శుష్యేత్ మ్రియేత వా ౪౭

అధికముగ సంభోగముజేయుట, శరీరమున కలతబుట్టించు పనులజేయుట, భారమును మోచుట, భారముగనుండు గుడ్డలగట్టుట, రాత్రులయందు నిదురమేల్కొంచుట, పగలు నిదురించుట, కఠినమైనపలకమున్నగు నాసనముపైనను మిక్కిలి యున్నతమైన యాసనముపైనను కూర్చుండుట, దుఃఖపడుట, కోపపడుట, భయపడుట, మనసున కలతపడుట, మలమూత్రాదులు వెడలుచున్నపుడు వానివేగమును దేనియందైన నాసబొడమినపుడు అట్టియాసను పూర్తిగావింపక వానివేగమును నిరోధించుట, ఉపవాసముండుట, మార్గమునడచుట, తీక్ష్ణంబులును ఉష్ణంబులును అజీర్ణకరంబులును మలమును బంధించునవియునగు పదార్థములభుజించుట, ఎఱ్ఱనిగుడ్డగట్టుట, బిలములయందును బావులయందును తొంగిచూచుట, మద్యమాంసముల సేవించుట, వెలికిలబరుండుట, వీనినన్నిటిని గర్భవతియగుస్త్రీ గర్భమునుధరించిననాటనుండి విడువవలెను. మఱియును అనేకపర్యాయములు గర్భవతులై యనుభవము గాంచినస్త్రీలును, గర్భవతు లుండవలసిన పద్ధతుల జక్కగ నెఱింగినస్త్రీలును ఏయేవిషయముల నిషేధించెదరో వానినెల్ల గర్భిణీస్త్రీ విడువవలెను. మరియును రక్తమోక్షము వమనవిరేచనరూపమైన శోధనము గర్భవతి విడువవలెను. ఎనిమిదవమాసమువరకు అనువాసనవస్తికర్మను జేయుందగదు. (ఎనిమిదవమాసమున ననువాసనవస్తిజేయవచ్చునని భావము) పైనినిషేధింపబడినవాని నాచరించినయెడ గర్భము పక్వముగ కముచుపే బైలువెడలును. లేక కుక్షియందే శోషించును. లేక కుక్షియందే మృతినొందును. (కావున పైజెప్పినవానినన్నిటిని బొత్తుగ విడువవలెనని భావము).

## వాతలాద్యాహారముల వేగల్గు గర్భవికారములు.

వాతలైశ్చ భవేత్ గర్భః కుబ్జాఽన్ధజడవామనః,
పిత్తలైః ఖలతిః పిఙ్గః శ్విత్రీపాణ్డుః కఫాత్మభిః. ౪౮

వాతమును వృద్ధినొందించు నాహారముల సేవించినయెడ గర్భము కుబ్జము(గుజ్జారి) గనైనను, గ్రుడ్డిగనైనను, జడముగనైనను, పొట్టిగనైన నగును. పిత్తమును వృద్ధినొందించు నాహారముల సేవించినచో శిశువు వెండ్రుకలులేక బట్టతలగనైనను పింగళవర్ణముగనైన నగును. కఫమును వృద్ధినొందించువాని సేవించినయెడ శిశువుకు శ్విత్రకుష్ఠమైనను పాండురోగమైనను సంభవించును.

## గర్భిణీస్త్రీకి రోగచికిత్సానియమము.

వ్యాధీం శ్చాస్యాః మృదుసుఖైః అతీక్ష్ణైరౌషధైర్జయేత్. ౪౯

గర్భిణీస్త్రీకి జ్వరాదిరోగములుకల్గినయెడ ఆట్టివ్యాధులను వీర్యాములచే కర్కశములుకాక సుఖకరంబులును తీక్ష్ణములు కానివియునగు నౌషధములచే చికిత్సజేయవలెను.

## రెండవమాసమున గర్భాకారము, స్త్రీపురుషనపుంసకభేదములు.

ద్వితీయేమాసి కలలాద్ఘనః పేశ్యథవాఽర్బుదమ్,
పుంస్త్రీక్లీబాః క్రమాత్తేభ్యః

మొదటినెలయందు కలలాకారముగ నున్నగర్భము రెండవమాసమునం దంతకన్నఘనముగ (ఉండవలె) నుండును. లేక పేశి (చొకముగ)వలె నుండును. లేక అర్బుదముగ (బూరుగమొగ్గవలె) నుండును. అందు ఘనీభవించి యుండవలె గుండ్రమున నున్నయెడ పురుషగర్భమనియు పేశివలె నున్నయెడ స్త్రీగర్భమనియు, అర్బుదముగ నున్నయెడ నపుంసకగర్భ మనియు వరుసగ నెరుంగునది. (అట్టి యాకారములు చేత స్పృశించి పట్టిచూచిన తెలియనగును).

ఈవిషయమును సుశ్రుతాచార్యు డిట్లు వివరించెను. "తత్ర ప్రథమే మాసికలలంజాయతే, ద్వితీయే శీతోష్మానిలైః అభిపచ్య మానానాం మహాభూతానాం సంఘాతోఘనః సఙ్జాయతే, యది పిణ్డః పుమాన్, స్త్రీ చేత్పేశీ, నపుంసకం చేదర్బుద మితి" (గర్భమును ధరించిన తొలిమాసమున గర్భము కలలాకారముగ (గుండ్రమై పిండాకారముగ) నుండును. అట్టి పంచభూతములయొక్క సముదాయరూపమై కలలాకారమైన గర్భము రెండవమాసమున కఫపిత్తవాతములచే పరిపక్వమై గర్భాశయమునందు ఘనీభావము నొందును. అయ్యది గుండ్రముగ పిండాకారమై యుండునెడ పురుషగర్భమనియు, పేశ్యాకారముగ నుండునేని స్త్రీగర్భమనియు, అర్బుదాకారముగ నుండునేని నపుంసకగర్భమనియు నెరుంగునది.)

మరియు పేశ్యాద్యాకారములను భోజుం డిట్లు వివరించెను:—"చతురశ్రా భవే త్పేశీ వృత్తః పిణ్డో ఘనస్స్మృతః, శాల్మలీముకుళాకారం అర్బుదం సంప్రచక్షతే." చౌకముగ నాల్గుమూలలు కల్గి చదరముగ నున్నగర్భము పేశి యనబడును. (ఇదియే స్త్రీగర్భము). గుండ్రముగ పిండాకారమై కఠినముగ నుండునది పిండము. (ఇది పురుష గర్భము). బూరుగమొగ్గవలె గుండ్రనై కొంచెము నిడుపుగ నుండునది అర్బుదము (ఇది నపుంసకగర్భము)

## వ్యక్తగర్భలక్షణములు.

తత్ర వ్యక్తస్యలక్షణమ్,

క్షామతా గరిమా కుక్షేః మూర్ఛా ఛర్దిరరోచకః. ౫౦
జృమ్భాప్రసేకస్సదనం రోమరాజ్యాః ప్రకాశనమ్,
అమ్లేష్టతా స్తనౌ పీనౌ సస్తన్యౌ కృష్ణచూచుకౌ. ౫౧
పాదశోఫో విదాహోఽన్యే శ్రద్ధాశ్చవివిధాత్మికాః,

గర్భము స్ఫుటముగ దెలియునపుడు క్రింద వివరింపబడు లక్షణములు కాన్పించును. శరీరము కృశించును. కుక్షియందు బరువుగనుండును. అప్పుడప్పుడు మూర్ఛ గ్రమ్మును. వాంతి యగును. నోరు అరోచకము కల్గి మధురంబులు రుచ్యంబులు నైన పదార్థములు సైతము రుచింపకుండును. ఒడలి విరుపులును ఆవలింతలును పలుమారు వచ్చుచుండును. నోట నీరు వెడలును. ఒడలు నిస్సారమై ప్రాలుమాలిక యధికమగును. (కుక్షి వృద్ధి నొందుటంజేసి) నూగారుస్ఫుటముగ గానబడును. పులుపుపదార్థములయం దభిలాష విశేషముగ బొడమును. స్తనములుబలిసి స్తన్యముతోగూడి నాగ్రములయందు నలుపుకల్గియుండును. పాదములపై శోఫకలుగును మరియు కొందరాచార్యులు ఒడలిపై మంటబుట్టుననియు వచించెదరు. తనకు హితములైనవానియందును హితములు కానివానియందును, పలుదెరంగుల నాసబొడమును. ఇట్టిలక్షణములు కల్గినపుడు గర్భము వ్యక్తముగ గనబడుచున్నదని యెరుంగునది).

## గర్భిణీమనోరథపూరణము.

మాతృజం హ్యస్య హృదయం మాతుశ్చ హృదయేన తత్.
సంబద్ధం తేన గర్భిణ్యాః నేష్టం శ్రద్ధావిమాననమ్,

గర్భస్థశిశువుయొక్క హృదయము తల్లివలన పుట్టినది. కావున తల్లి హృదయమునకును గర్భముయొక్క చేతనాధిష్ఠానమైన హృదయమునకును సంబంధముకల్గియుండును. కావున గర్భిణీస్త్రీకి దేనిదేనియం దభిలాషకల్గునో అట్టికోర్కెలను పూర్తిగావింపవలెను. ఉపేక్షజేయరాదు.

గర్భముయొక్క అంగోపాంగములలో గొన్ని తండ్రివలనను గొన్ని తల్లివలనను కల్గును. అందు శిశువుయొక్క హృదయము తల్లివలన కల్గినది. ఈవిషయమును సుశ్రుతాచార్యు లిట్లుపదేశించిరి:—"మాంస శోణిత మేదో మజ్జా హృన్నాభి యకృ ల్లీహా న్త్రగుద ప్రభృతీని మృదూని మాతృజాని" మాంసము, రక్తము, మేదస్సు, మజ్జ, హృదయము, నాభి, యకృల్లీహములు, ప్రేవులు, గుదము మున్నగు మెత్తనియవయవములన్నియు తల్లివలన బుట్టినవి.

అహితసేవనక్రమము.

దేయమప్యహితం తస్యై హితోపహితమల్పకమ్. ౫౩
శ్రద్ధావిఘాతా ద్గర్భస్య వికృతిశ్చ్యుతి రేవ వా,

గర్భవతియైనస్త్రీ పథ్యముకాని పదార్థములకోరినను అట్టియపథ్యములను పథ్యములగు పదార్థములతోగూడ కొంచెముగకూర్చి కొంచెముకొంచెముగ నుపయోగించునది. అటుగాక గర్భిణీకోరికల పూర్తిగావింపనియెడ గర్భస్థశిశువుకు అంగవైకల్యము మున్నగువికారములు కల్గును. లేక గర్భము అకాలముననే పడిపోవును. కావున గర్భిణియభిలాషలను పూర్తిగావించుట ముఖ్యము.

ఇచ్చట నీవిమర్శనము తెలియగునది:—మాతృసంబంధమువలన గర్భమునందలి శిశువుకు హృదయ మేర్పడును. "హృదయం చేతనాస్థానమ్" అను సుశ్రుతవాక్యప్రకారము హృదయముచేతనాధాతువున కధిష్ఠానము. చేతనాధాతువన మనస్సు. అట్టి చేతనాధాతువు గర్భోత్పత్తి మొదలుజేసి యవ్యక్తరూపముగనుండి నాల్గవమాసమున వ్యక్తముగ నేర్పడును. అట్టియెడ గర్భమునందలి శిశువుకు పురాకృతకర్మానుగుణముగ నింద్రియార్థములగు శబ్దస్పర్శరూపరసగంధములయందు అభిలాషకల్గును. అట్టియెడ తనకు స్వతంత్రశక్తిలేమింజేసి తల్లియొక్కహృదయమునకునుతనహృదయమునకునుగలసంబంధమునుబట్టి తల్లిమూలముగ వెల్లడిచేయును. కావుననే తల్లి తనకు వాంఛకాలేక గర్భప్రేరణచేత లేనిపోనికోరికల కోరసాగును. ఈవిధముగ శిశువుయొక్కహృదయమునకును తనహృదయమునకు సంబంధముగల్గియుండుటచేతనే దౌహృదినీయని గర్భిణిస్త్రీ చెప్పబడును. గర్భిణీస్త్రీ యేయేయింద్రియమునకు సంబంధించినకోరికల గోరునో వానినెల్ల పూర్తిగ నెరవేర్పవలెను అట్లు నెరవేర్చినయెడల మిక్కిలి గుణవంతుడును వీర్యవంతుడును దీర్ఘాయుష్మంతుడును నగుశిశువు కలుగును. గర్భిణికోరిక కొనసాగనియెడ దానంజేసి కుబ్జుడును, కూనచేతులుకలవాడును, కుంటివాడును, జడుడును, గుజ్జువాడు, వికారమైన కండ్లుకలవాడును, లేకగ్రుడ్డివాడును, నగుశిశువులు పుట్టుదురు. అవియివి యననేల? గర్భిణీస్త్రీకి యేయింద్రియమునకు సంబంధించినకోరిక నెరవేరకుండునో

ఆయాయింద్రియమునకు గర్భమునందలి శిశువునకు బాధకలుగును. కావున గర్భిణీ కోరినవానినెల్ల నేవిధముననైన సాధించి యభిలాష కొనసాగించుట ముఖ్యమైనపని.

పైజెప్పినవిషయముసుశ్రుతాచార్యునిచే నిట్లు వివరింపబడియె:—"తస్మాచ్చతుర్థే వ్యక్తీభూతాభిప్రాయ మిన్ద్రియార్థేషు కరోతి ద్విహృదయాంచ నారీం దౌహృదినీ మాచక్షతే. దౌహృదవిమాననాత్. కుబ్జం కుణిం ఖఞ్జం జడం వామనం వికృతాక్షమనక్షం వా నారీసుతం జనయతి, తస్మాత్సా యద్యదిచ్ఛేత్ తత్తస్యైదాపయేత్. లబ్ధదౌహృదా హివీర్యవన్తంచిరాయుషంచ పుత్రం జనయతి. ఇన్ద్రియార్థాంస్తు యాన్యాన్ సా భోక్తు మిచ్ఛతి గర్భిణీగర్భాబాధభయాత్తాం స్తాన్ భిషగాహృత్యదాపయేత్, సా ప్రాప్తదౌహృదాపుత్త్రం జనయేతగుణాన్వితమ్, అలబ్ధదౌహృదా గర్భే లభేతాత్మనివా భయమ్, యేషుయేష్విన్ద్రియార్థేషు దౌహృదేవైవిమాననా, ప్రజాయేత సుతస్యార్తిః తస్మిం స్తస్మిం స్తథేన్ద్రియే" ఈవాక్యములయర్థమే పైనివివరింపబడియె.

మరియు గర్భిణీస్త్రీకి నపూర్వములగుకోరికలు కల్గుటకు కారణము గర్భమునందలి శిశువుయొక్క పూర్వజన్మకర్మవాసనాపరిపాకమువక్క వేరొండు కారణము లేదు. ఈవిషయమునుగూడ సుశ్రుతాచార్యులిట్లుచెప్పిరి. "కర్మణా చోదితం జన్తోః భవితవ్యం పునర్భవేత్. యథా యథా దైవయోగాత్ దౌహృదం జనయేద్ధ్రువి" గర్భమునందలి జీవునియొక్క ప్రారబ్ధకర్మల ననుగుణముగ దైవవశమునంజేసి కోరికలు శిశువునకు కల్గును. ఆకోరికలే గర్భవతికి పైజెప్పినరీతిగ కల్గుననిభావము.

మూడవమాసమున గర్భముయొక్క పరిస్థితి.

వ్యక్తీభవతి మాసేఽస్య తృతీయే గాత్రపఞ్చకమ్. ౫౪
మూర్ధా ద్వే సక్థినీ బాహూ సర్వసూక్ష్మాఙ్గజన్మ చ,
సమమేవహి మూర్ధాద్యైః జ్ఞానంచ సుఖదుఃఖయోః. ౫౫

మూడవమాసమున గర్భమునకు శిరస్సును రెండుకాళ్లును రెండుచేతులును మొత్తమున నైదంగములు స్ఫుటముగ నేర్పడును. మరియు ఇతరములగునంగములు సూక్ష్మములుగ నేర్పడును. శిరస్సు మున్నగు పైజెప్పినయంగములు నేర్పడునప్పుడే గర్భమునకు సుఖదుఃఖజ్ఞానంబు నుదయించును.

ఇచ్చట నొకనిర్ణయము తెలుపబడుచున్నది. గర్భమునకు ఉత్పత్తికాలముననే అంగప్రత్యంగములన్నియు సమకాలమున పుట్టును. అయ్యవి మిక్కిలి సూక్ష్మతమములగుటంజేసి (మామిడిపండెయందలి మాధుర్యము కేసరములు రసము విత్తనము జీడి మున్నగునవి సూక్ష్మములుగనుండి కనుబడనిచందమున) కొంతకాలము కనుబడకుండి గర్భము కొంచెము వృద్ధియగుసరికి (పరిపక్వమగుచున్న మామిడికాయయందు రసాదులు సూక్ష్మముగ

గానంబడుభంగి) మూడవమాసము మున్నగుకాలములయందు సుసూక్ష్మములుగ నాయా యవయవములకు దగినమాంసపిండము లేర్పడి గర్భము పరిపూర్ణమగుసరికి (పండినమామిడిపండులో మధురాదిరసంబులును దానియవాన్తరభేదములును స్ఫుటముగ గానంబడుభంగి) శిరస్సు హస్తపాదములు మున్నగునంగప్రత్యంగములన్నియుం వేర్వేరుగ స్ఫుటముగ గానంబడును. ఇదియ ధన్వన్తరిసిద్ధాన్తము. ఈక్రమము ననుసరించి అంగప్రత్యంగములన్నియుం సూక్ష్మములుగ గర్భమునకు ఉత్పత్తికాలమునుండి కల్గియున్నను అవి మూడవమాసమున అభివ్యక్తము లగునని భావము.

ఈవిషయమునే సుశ్రుతాచార్యు లిట్లుచెప్పిరి:—"సర్వాఙ్గప్రత్యఙ్గాని యుగపత్సమ్భవన్తీత్యాహ ధన్వన్తరిర్గర్భస్య సూక్ష్మత్వాన్నోపలభ్యన్తే, వంశాఙ్కురవత్ చూతఫలవచ్చ" "తృతీయే హస్తపాదశిరసాం పఞ్చపిణ్డానిర్వర్తన్తే, అఙ్గప్రత్యఙ్గవిభాగశ్చ సూక్ష్మోభవతి" దీనివివరణము పైని చెప్పబడియె.

గర్భనాడీమూలముగ గర్భపోషణము.

గర్భస్య నాభౌ మాతుశ్చ హృదినాడీ నబధ్యతే,
యయాస పుష్టిమాప్నోతి కేదార ఇవ కుల్యయా. ౫౬

గర్భముయొక్క నాభినుండి తల్లియొక్క హృదయమువరకును ఒకనాడి(గొట్టము) సంబంధముకల్గి అంటికొనియుండును. తల్లి భుజించినయాహారము తల్లియొక్క జఠరానలముచే పరిపక్వమై రసరూపమునొంది హృదయమున జేరునపుడు అట్టి యాహారరససారము పైజెప్పినగర్భనాడిమూలమున గర్భముయొక్క నాభిస్థానమునుండి లోపలికిం జని శిశువుయొక్క జఠరానలముచే పక్వమై శిశువును పోషించుచుండును. ఒకచెరువు నిండియున్నపుడు చెరువునుండి త్రవ్వబడిన చిన్నపంటకాలువనుండి వచ్చుస్వల్పజలముచేత మడికాలువనుండు పైరెల్ల నానాట వృద్ధినొంది ఫలించునట్లు పైజెప్పినరీతిగ గర్భనాడినుండి స్రవించు తల్లియొక్క యాహారరససారముచేత గర్భమునందలిశిశువు నానాట వృద్ధినొంది సర్వాంగప్రత్యంగములచే పరిపూర్ణమై దార్ఢ్యము కల్గియుండునని భావము.

గర్భమునకు నాలవమాసము నసంగప్రత్యంగములన్నియుం విభాగము లేర్పడియుండును. కావున నాలవమాసమునుండియుం పైజెప్పినరీతిగ గర్భనాడీమూలముగ గర్భమునందలి శిశువు నానాట పోషింపబడును. గర్భాధానము మొదలజేసి నాలవ మాసమువరకును అంగప్రత్యంగములు స్ఫుటముగ నుండవు. కావున అకాలమున గర్భిణియొక్క సర్వశరీరావయవములయందును అడ్డముగవ్యాపించియుండు రసరసవహంబులగుదమనులయందలి యన్నాదిరససారముయొక్క చెమ్మచేత (చెరువునిండియున్న

వుడు దానిక్రింద చేరువనున్న పైరు చెరువునుండి వెడలు ఊటచే వృద్ధినొందుభంగి) నిరపాయముగ జీవించును. ఈవిషయమును సుశ్రుతులిట్లు చెప్పిరి. "అసఞ్జాతాఙ్గప్రత్యఙ్గ విభాగం ఆనిషేకాత్ప్రభృతి సర్వశరీరావయవానుసారిణీనాం రసవహానాం తిర్యగ్గతానాం ధమనీనాం ఉపస్నేహో జీవయతి."

మరియు గర్భనాడియొక్క యుత్పత్తియు దానిమూలముగ గర్భపోషణక్రమంబును భోజునిచే నిట్లు వివరింపబడియె:—"గర్భో రుణద్ధి స్రోతాంసి రసరక్తవహానివై, రక్తా జ్జరాయుర్భవతి నాడీచైవ రసాత్మికా, సానాడీ గర్భమాప్నోతి తథా గర్భస్యవర్తనమ్, యద్భుదక్నాతిమాతాస్య భోజనం హి చతుర్విధమ్, తస్మా దత్రాద్రసీభూతం వీర్యం త్రేధా ప్రవర్తతే, భాగశ్శరీరం పుష్ణాతి స్తన్యం భాగేన వర్ధతే, గర్భః పుష్యతి భాగేన వర్ధతేచ యథాక్రమమ్, గర్భాంకుర్యేవకేదారం నాడీప్రీణాతితర్పితా" గర్భోత్పత్తియైనది మొదలు రసవహనాడులను రక్తవహనాడులను గర్భము అడ్డగించును. దానంజేసి రక్తము అడ్డగింపబడి జరాయు(మావి) రూపమునొంది గర్భము నావరించి యుండును. రసము అడ్డగింపబడి నాడీరూపముగ పరిణమించి గర్భముయొక్క నాభికజేరి తల్లిహృదయమునకు వ్యాపించియుండును. ఈరెంటి నాధారముగ జేసి గర్భము నిరపాయముగ నుండును. తల్లిచే భుజింపబడిన భక్ష్యభోజ్యచోష్యలేహ్యములను నాల్గువిధములైన యాహారపదార్థములు జఠరానలముచే పరిపక్వమైనదాని సారరూపమైనరసము మూడుభాగములుగ నేర్పడును. అందొకభాగము తల్లియొక్కశరీరమును పోషించును. రెండవభాగము తల్లికి స్తన్యమును కల్గించి వృద్ధినొందించును. మూడవభాగము పైజెప్పిన గర్భనాడీమూలముగ గర్భమునందలి శిశువును పోషించి నానాట క్రమముగ వృద్ధినొందించును. నాడిమూలమున వ్యాపించు నాహారరససారముచేత (పంటకాలువనుండి పైరు వృద్ధినొందుచాడ్పున) వృద్ధినొందును అని తాత్పర్యము.

పైజెప్పినరీతిగ తల్లియొక్కయాహారరససారము నాడీమూలముగ శిశువుయొక్క పక్వాశయమునజేరి యందలి మిక్కిలి సుసూక్ష్మముగనుండు గర్భశిశువుయొక్క కాయాగ్నిచే పక్వమై గర్భముయొక్క ధాతువులను పోషించునని ఫలితార్థము. ఈయాహారము మిక్కిలి సూక్ష్మతమంబగుటవలనను గర్భమునందలిశిశువుకు స్థూలరూపములగు మలమూత్రములుపుట్టి వెడలుటలేదు. ఈవిషయము సుశ్రుతమున నిట్లుచెప్పబడినది. "మలాల్పత్వాదయోగాచ్చవాయోః పక్వాశయస్యచ, వాతమూత్రపురీషాణి నగర్భస్థః కరోతిహి."

## నాల్గు అయిదుమాసములయందు గర్భపరిస్థితి.

**చతుర్థేవ్యక్తతాఙ్గానాం చేతనాయాశ్చపఞ్చమే,**

నాల్గవమాసమున అంతకుమునుపు సూక్ష్మములైయుండు నంగప్రత్యంగముల న్నియు స్ఫుటముగ నేర్పడు మనస్సు కపరరూపమైన చేతనాధాతువు ఐదవమాసమున స్ఫుటముగ వ్యక్తమగును.

సుశ్రుతమునందు:—"చతుర్థే సర్వాఙ్గ ప్రత్యఙ్గ విభాగః ప్రవ్యక్తతరో భవతి, గర్భహృదయ ప్రవ్యక్తభావాత్ చేతనాధాతురభివ్యక్తో భవతి" అనువాక్యముచేత నాల్గ వమాసముననే చేతనాధాతువు స్ఫుటముగ నభివ్యక్తమగునని చెప్పబడినది.

### ఆరవమాసమున గర్భపుస్థితి.

షష్ఠే స్నాయు సిరారోమ బలవర్ణ నఖత్వచామ్. ౫౭

ఆరవమాసమునందు గర్భమునందలిశిశువునకు స్నాయువులును, సిరలును, రోమం బులును, బలంబును, శరీరవర్ణంబును, గోళ్లును, చర్మంబును స్ఫుటముగ నేర్పడును.

### సప్తమమాసమునగర్భస్థితి.

సర్వై స్సర్వాఙ్గ సంపూర్ణో భావైః పుష్యతి సప్తమే,

ఏడవమాసమున గర్భము సర్వావయవములచే సంపూర్ణమై జన్మమునకును జీవిం చుటకును తగినభావములన్నిటిచే పూర్ణమై వృద్ధినొందును.

ఏడవనెలయందు జీవమున కాధారమైన యోజస్సు దృఢముగనుండి సర్వాఙ్గ ప్రత్యంగములచే పరిపూర్ణముగనుండును కావున నేడవమాసమున పుట్టిన శిశువు జీవించును. తక్కిన క్రిందిమాసములయందు బుట్టిన జీవించుటలేదు. ఎనిమిదవమాసమున బుట్టిన శిశువు జీవించుటలేదని క్రిందజెప్పంబడును.

### ఏడవమాసమున గర్భిణికి సంభవించుబాధలు.

గర్భేణో త్పీడితా దోషాగ తస్మి న్హృదయమాశ్రితాః.
కణ్డూం విదాహం కుర్వన్తి గర్భిణ్యాః కిక్కిసాని చ. ౫౮

ఏడవమాసమునందు వాతపిత్తకఫములుమూడును గర్భముచే మిక్కిలిపీడితములై హృదయమునజేరి గర్భిణికి దురదను కాలునేతులయందు మంటను పుట్టించును. కిక్కిస ములను గల్గించును. తొడలయందును స్తనములయందును ఉదరమునందును లేఖాకార ములుగగల్గు వళివిశేషములు కిక్కిసములనబడును. పైప్రదేశములయందు ముండ్లచే నిండినట్లుండుట కిక్కిసమని కొందరు చెప్పెదరు)

### పైకనినబాధకు చికిత్స.

నవనీతం హితం తత్ర లోలాన్ము మదురౌషధైః,
సిద్ధ మల్ప పటుస్నేహం లఘు స్వాదు చ భోజనమ్. ౫౯

చన్దనోశీరకల్కేన లిమ్పేదూరుస్తనోదరమ్,
శ్రేష్ఠయా చైణహారిణశశశోణితయుక్తయా. ౬౦
అశ్వఘ్నపత్రసిద్ధేన తైలేనాఽభ్యజ్య మర్దయేత్,
పటోలనిమ్బమఞ్జిష్ఠాసురసైః సేచయేత్పునః. ౬౧
దార్వీమధుకతోయేన మృజాం చ పరిశీలయేత్,

పైజెప్పినబాధలు సంభవించినపుడు లోలంబువుచేతను మధురములగు ద్రాక్షపండ్లు మున్నగువానికల్కముచేతను పక్వమై సిద్ధమైనవెన్న నుపయోగించుట మిక్కిలి హితకరము. శీఘ్రముగ జీర్ణమగునదియు మధురంబునైన యాహారమును స్వల్పపరిమాణముగ ఉప్పును స్నేహమునుగూర్చి భుజించుట చాలమంచిది. చందనమును వట్టివేళ్లను కల్కముజేసి తొడలయందును స్తనములపైనను ఉదరముపైనను పూయుట హితకరము. త్రిఫలములను లేడిరక్తముచేనైనను జింకరక్తముచేనైనను కుందేటిరక్తముచేనైనను మర్దనముజేసి యాకల్కమును పూయవలెను. గన్నేరాకునుగూర్చి పక్వము జేయబడిన తైలముచే నభ్యంజనము (పైజెప్పిన తొడలు స్తనోదరములపైని) జేసి మర్దనము జేయుట మంచిది. పెనుపొట్ల, వేపాకు, మంజిష్ఠి, తులసి, వీనిచేసిద్ధమైన తైలముతోనైనబూసి మర్దనము జేయవలెను. మ్రానిపసుపును అతిమధురమునుగూర్చి కాచబడిన కషాయముచేత కడిగి శుభ్రము చేయవలెను.

## ఎనిమిదవమాసమున గర్భస్థితి.

ఓజోఽష్టమే సంచరతి మాతాపుత్రౌ ముహుః క్రమాత్. ౬౨
తేన తౌ మ్లానముదితౌ తత్ర జాతో న జీవతి,
శిశురోజోఽనవస్థానాత్ నారీ సంశయితా భవేత్. ౬౩

(రసరక్తాది ధాతువులన్నింటి సారమైజీవమునకు ముఖ్యాధారమైనది యోజస్సు) ఎనిమిదవమాసమున గర్భమునందలి శిశువుయొక్క యోజస్సు పైజెప్పబడిన గర్భనాడి మూలముగ తల్లియొక్క హృదయమునకును అందుండి శిశువుయొక్క హృదయమునకు పలుమారు అప్పుడప్పుడు వచ్చుచు పోవుచు సంచరించుచు నిల్కడలేకుండును. అట్టియెడ శిశువుయొక్కయోజస్సు తల్లిహృదయమునకు పోయినపుడు తల్లి సుఖముగనుండును, శిశువు ప్రాణాధారమైనయోజస్సు లేమింజేసి చాలబడలియుండును. మరల తల్లి హృదయమునుండి శిశువునుజేరినపుడు శిశువు చాల సుఖముగనుండును, తల్లిబడలియుండును. అట్టిసమయమున నోజస్సు శిశువుకు నిల్కడలేకసంచరించుటంజేసి యెనిమిదవమాసమున బుట్టినశిశువు బ్రతుకనేరదు. తల్లికూడ నొకసమయము బ్రతుకుట దుస్తరముగనుండును.

### ఎనిమిదవమాసమున చేయదగినయుపచారములు.

క్షీరపేయాచ పేయాత్ర సఘృతాన్వాసనం ఘృతమ్,
మధురైస్సాధితం శుద్ధ్యై పురాణశకృతస్తథా. ౬౪

శుష్కమూలకకోలామ్ల కషాయేణ ప్రశస్యతే,
శతాహ్వా కల్కితో వస్తిః సతైల ఘృతసైంధవః ౬౫

పాలునుకూర్చి పలుచగ కాచబడిన గంజియందు నెయ్యికూర్చి త్రాగుట యెనిమిదవమాసమున మంచిది. మధురములగు ద్రాక్షపండ్లు మున్నగువానికూర్చి పక్వము జేయబడినఘృతము నుపయోగించునది. మరియు ప్రాతదియగు పేడకూర్చి ఎండినముల్లంగిని రేగుపండ్లుపులుపును కూర్చి, సదాపకల్కమును పక్వముజేయబడిన కషాయమున తైలమును నేతిని సైంధవలవణమును కల్పి యనువాసనవస్తిని కోష్ఠశుద్ధికై చేయవలెను.

### ప్రసూతికాలము.

తస్మింస్త్వేకాహయాతేఽపి కాలస్సూతేరతః పరమ్,
వర్షాద్వికారకారీస్యాత్ కుక్షౌవాతేన ధారితః. ౬౬

ఎనిమిదవమాసమునకు పిమ్మటనొక్కదినము గడచినను తొమ్మిదవమాసము మొదలుజేసి పండ్రెండవనెల పూర్తిగగడచునందాక సుఖప్రసవమునకు సరియైనయుక్తకాలము. (ఎనిమిదవమాసము కడచిన పిదప తొమ్మిది, పది, పదునొకండు, పండ్రెండుమాసములు నాల్గును ప్రసవమునకు యుక్తమైనకాలమనుట) ఒకవత్సరకాలము (పండ్రెండవనెల) కడచినపిమ్మట గర్భము కుక్షియందు వాతప్రకోపమునంజేసి ప్రసవముకాక యడ్డగింపబడి చిరకాలమువరకు ధరింపబడినయెడ నవశ్యము వికారమును కల్గించును.) గర్భమునశిశువు పండ్రెండు మాసములకుపైన నిలువక పైజెప్పిననాల్గుమాసములయందే ప్రసవమగును. అటుగాక చిరకాలము వాతప్రకోపమునంజేసి నిలచిన జబ్బుకల్గునని భావము)

ప్రసవమునకీకాలనియమమునే సుశ్రుతాచార్యులు నిట్లుచెప్పిరి:—నవమ, దశమ, ఏకాదశ. ద్వాదశానాం అన్యతమస్మిన్ జాయతే, అతోఽన్యథావికారీభవతి.

చరకాచార్యులు ప్రసవకాలమును నిర్ణయించునపుడు ఇట్లుచెప్పిరి:—ఆహారమాసిక్తియనా నగర్భః శోషంసమాప్నోతి పరిస్రుతిం వా, తంస్త్రీ ప్రసూతే సుచిరేణ గర్భం పుష్టోయదావర్షగణైరపిస్యాత్" గర్భమునందుండు శిశువు గర్భనాడీమూలమున వచ్చుతల్లియొక్క యాహారరసమువలన పుష్టినొంది వృద్ధియగునని చెప్పబడినది. అట్టి యాహారరసమున క్రమముగ వృద్ధినొందినశిశువు తొమ్మిది పది పదునొకండు పండ్రెండు మాసములయందు ప్రసవమగును. ఒకవేళ కొన్నికారణములచే గర్భమునందలి శిశువునకు పైజెప్పినప్రకారము ఆహారము గర్భనాడీమూలముగ రాని

-యెడ నాశిశువు క్రమముగ పుష్టినొందక నానాట కృశించును. అట్టియెడ నకాలమున శిశువు ప్రసవము కానోపదు; కావున నెంతకాలమునకు శిశువున కాహారసంబంధముకల్గి పుష్టిచెందునో అంతకాలమువరకును ప్రసవముకాక పరిపూర్ణముగ పుష్టికల్గిననాడు ప్రసవమగును. అట్టియెడ పైజెప్పినకాలనియమము నతిక్రమించి యనేకవత్సరముల కాలము కడచినపిదప స్త్రీ ప్రసవించును అని యర్థము. ఆహారము బొత్తుగలేనినాడు శిశువు గర్భమునుండి జారిపడును.

ఇచ్చట చరకాచార్యులు కారణాంతరములచే ననేకవత్సరకాలమువరకును ప్రసవమున కవకాశము ననుగ్రహించిరి. ప్రకృతకాలమున కొన్నిచోట్ల మూడువత్సరములకాలమునకును కొన్ని సమయముల పండ్రెండువత్సరముల కాలమునకును ప్రసవించుటకలదు. ఇది యనుభవసిద్ధము. ఇట్టిదీర్ఘకాలప్రసవములకు చరకాచార్యులు చెప్పిన కారణమే సుసంగతముగ నుండనోపును.

ఈతంత్రమున వాగ్భటాచార్యులు రెండవయధ్యాయమున నిట్లుచెప్పెను. "పుష్టోఽన్యథావర్షగణైః కృచ్ఛ్రాజ్జాయేత నైవ వా" ఈవాక్యముచేత జీవితకాలమువరకు ప్రసవించక గర్భము నిలచియుండుననియుం దెలిసెడి.

మరియు గర్భము గర్భాశయమునందుండు పద్ధతి యష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పబడెను:—"గర్భస్తు మాతృపృష్ఠాభిముఖః లలాటేకృతాఞ్జలిః సఙ్కుచితాఙ్గో గర్భకోష్ఠే దక్షిణం పార్శ్వం ఆశ్రిత్యావతిష్ఠతే పుమాన్ వామం స్త్రీ, మధ్యం నపుంసకం, తత్రస్థితశ్చ గర్భో మాతరి స్వపన్త్యాం స్వపితి, ప్రబుద్ధాయాం ప్రబుధ్యతే" (గర్భమునందలి శిశువు తల్లివీపునకు అభిముఖముగ తననుదుట రెండుచేతుల నమస్కరించువిధముగ జోడించి కాళ్లు మున్నగు నవయవముల నన్నిటిని ముడుచుకొని గర్భాశయమున దక్షిణపార్శ్వము నాశ్రయించి పురుషశిశువుండును. కుడిప్రక్కనాశ్రయించి స్త్రీశిశువుండును. కోష్ఠమున మధ్యభాగమునం దున్నయెడ నపుంసకము. ఇత్తెరంగున గర్భాశయమునందుండిన శిశువు తల్లి నిదురపోయినపుడు నిద్రించును. మేల్కాంచియుండునతరి మేల్కాని యుండును.)

## తొమ్మిదవమాసమున నాహారము, ఉపచారము.

శస్తశ్చ నవమే మాసి స్నిగ్ధో మాంసరసౌదనః।
బహుస్నేహో యవాగూర్వా పూర్వోక్తం చానువాసనమ్॥ ౬౭

తొమ్మిదవమాసమున నెయ్యి మొదలగు స్నేహపదార్థములచే మిక్కిలి స్నిగ్ధమై మాంసరసముతోఁగూడిన యన్నము గర్భిణికి నుపయోగించునది. మిక్కిలి స్నేహద్రవ్యము కలిపిన యవాగువు (గంజి) మిక్కిలి హితకరము. ఎనిమిదవమాసమునకు జెప్పిన విధముగ ననువాసనవస్తిని జేయనగును.

### నవమమాసమున నభ్యంతరోపచారములు.

తత ఏవ పిచుం చాస్యాః యోనౌ నిత్యం నిధాపయేత్,
వాతఘ్నపత్త్రభఙ్గాంభః శీతం స్నానే ऽన్వహం హితమ్. ౧౮
నిస్స్నేహాఙ్గీం న నవమాత్ మాసాత్ప్రభృతి వాసయేత్.

అనువాసనవస్తికిగా పక్వము చేయబడిన ఘృతమున ప్రత్తిని తడిపి వాతహర ముగనుండుటకై యోనిద్వారమున నుంచునది. ప్రతిదినమున నిట్లుచేయునది. మరియు వాతహరములగు చెట్లనుండు ఆకులజేర్చి నీళ్లుపొంగకాచి చల్లగ నార్చి ప్రతిదినంబును స్నానమున కుపయోగించుట చాలహితము. తొమ్మిదవమాసము మొదలుజేసి ప్రసవమగు నందాక స్నేహము నిశ్శేషమగునట్లు అనువాసనవస్తిజేయంజనదు. (స్నేహద్రవ్యము లతో జేయబడునది అనువాసనవస్తి. అట్టి యనువాసనవస్తిని చేయునపుడు స్నేహ ద్రవ్యము శరీరమున కొంచెము శేషించునట్లు చేయవలెనుగాని తైలాదుల నిశ్శేషముగ వెడలింపదగదు. వాతము ప్రకోపించినయెడ ప్రసవము కష్టమగునుగాన ప్రసవమగునం దాక వాతశాంతికై స్నేహము శేషించునట్లు అనువాసనవస్తి జేయవలెనని భావము.)

### స్త్రీపురుషప్రసవచిహ్నములు.

ప్రాగ్దక్షిణస్తనస్తన్యా పూర్వం తత్పార్శ్వచేష్టినీ. ౧౯
పున్నామదౌర్హృద ప్రశ్నరతా పుంస్త్వప్రదర్శినీ,
ఉన్నతే దక్షిణే కుక్షౌ గర్భే చ పరిమణ్డలే. ౨౦
పుత్త్రం సూతేऽన్యథా కన్యాం యా చేచ్ఛతి నృసంగతిమ్,
నృత్యవాదిత్రగాన్ధర్వగన్ధమాల్యప్రియా చ యా. ౨౧

గర్భిణికి కుడిప్రక్కనుండు స్తనమున స్తన్యము తొలుతగల్గిన నాస్త్రీకి పురుష శిశువు కలుగు. మరియు పరుండునపుడు కుడిప్రక్క తొలుతపరుండినను, నడచునపుడు తొలుత కుడికాలెత్తి నడచినను, పనులజేయునపుడు తొలుత కుడిచేత పనులజేసినను పురుషశిశువును ప్రసవించును. గర్భిణిగనుండు సమయమున కలుగనభిలాష దౌర్హృద మన బడును; అట్టి దౌహృదము పుల్లింగశబ్దవాచ్యమైన వస్తువులయందు కల్గినను, పురుషవాచ కములగు పదములచే ప్రశ్నలజేసినను, పురుషజాతియగు పసులు గజ్జములు వృషా దులుమున్నగువాని పలుమారు జూడనభిలాషకల్గియున్నను పురుషశిశువును కనును. కుక్షి యందు కుడిప్రక్క నున్నతముగనున్నను, గర్భము మండలాకారముగ (గుండ్రముగ) నున్నను కొడుకునుకనును. ఈచెప్పిన లక్షణములకు విరుద్ధములగు చిహ్నములుకల్గిన ఆడ శిశువుకలుగును. మరియు పురుషునితో సంభోగింపనిచ్ఛ విశేషముగగల్గినను, నృత్యము

నందును వాద్యములయందును సంగీతమునందును పుష్పమాలికలయందును మిక్కిలి ప్రీతి కలిగియున్నను కన్యకను కనును. (ఈలక్షణముల చక్కగ గమనించినయెడ స్త్రీపురుష శిశువుల నిర్ణయింపదగునని భావము.)

### నపుంసక-యమళగర్భలక్షణములు.

క్లీబం తత్సంకరే తత్ర మధ్యే కుక్షేః సమున్నతమ్,
యమాా పార్శ్వద్వయోన్నామాత్ కుక్షౌ ద్రోణ్యామివ స్థితే.

పైజెప్పిన స్త్రీపురుషగర్భచిహ్నములు సంకరముగ కలిసియున్నపుడు నపుంసక గర్భమని యెరుంగునది. మరియు నపుంసకగర్భమున్నపుడు కుక్షియొక్క మధ్యభాగమున నున్నతమైయుండును. మరియు ఇరుప్రక్కలను కుక్షి యున్నతమై మధ్యభాగమున తగ్గగ దొప్పవలెయున్నపుడు గర్భమున జంటగ శిశువ్వయ మున్నదని యెరుంగునది.

### గర్భిణి ప్రసవగృహమును జేరవలసిన క్రమము.

ప్రాక్చైవ నవమాన్మాసాత్ సూతికాగృహమాశ్రయేత్,
దేశే ప్రశస్తే సంభారైః సంపన్నం సాధకేఽహని. 23
తత్రోదీక్షేత సా సూతిం సూతికాపరివారితా,

పైజెప్పినరీతిగ సంపూర్ణగర్భవతియగుస్త్రీ తొమ్మిదవమాసము రాకమునుపే ప్రసవమునకు వసతిగ నేర్పరచిన ప్రసవగృహమును ప్రవేశింపదగిన శుభనక్షత్రములో గూడినదినమున చేరవలెను. అట్టి ప్రసవగృహము ప్రశస్తమైన స్థలమున కుశలులగు శిల్పులచేగట్టబడి ప్రసవసమయమున కావలసిన సంభారములతోగూడి యుండవలెను. లక్షణయుక్తమైన యాప్రసూతిగృహమున గర్భిణీస్త్రీ ప్రవేశించి, యంతకుమున్ను అనేక పర్యాయములు ప్రసవించి యనుభవమును జక్కగదెలిసినయాప్తులగు వృద్ధ స్త్రీలతోగూడి ప్రసవకాలమును నిరీక్షించుచు సంతుష్టమానసయై యుండవలెను.

ఈవిషయమై యష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పబడియె.—"బహుశః ప్రసూతాభిః అనురక్తాభి రవిషాదినీభిః అవిసంవాదినీభిః క్లేశసహాభిః పరివృతా స్వస్త్యయనపరా, అనులోమనైరాహారవిహారైః అనులోమితవాతమూత్రపురీషా, ప్రసవకాలము దీక్షేత. స్వల్పేఽపి చ చిహ్నాత్రవిఘ్నే ఫలవతీః ప్రయోజయేత్" అనేక పర్యాయములు ప్రసవించినవారును, తనయందు మిక్కిలి ప్రీతికలవారును, క్రోధమును వివాదమును లేక కష్టముల కోరువజాలినవారునగు స్త్రీలతోగూడి వారివలన స్వస్తివాచనముల యందాసక్తచిత్తయై, వాతమును అనులోమముగ ప్రవర్తింపజేయు నాహారవిహారముల జేయుచు మూత్రపురీషముల ననులోమముగా వెడలింపజేయుచు ప్రసవసమయమును

ప్రతీక్షించుచుండవలెను. స్వల్పముగనైన మూత్రపురీషములకు ప్రతిబంధముకల్గినపుడు సదుపాయములచే వానిని ధారాళముగ వెడలునట్లు చేసికొనవలెను.

### ఆసన్నప్రసలక్షణము.

అద్యశ్వః ప్రసవే గ్లానిః కుక్ష్యక్షిశ్లథతాక్లమః. ౭౪
అధో గురుత్వ మరుచిః ప్రసేకో బహుమూత్రతా,
వేదనోరూదరకటీ పృష్ఠహృద్వస్తి వంక్షణే. ౭౫
యోనిభేదరుజాతోదస్ఫురణస్రవణాని చ,
ఆవీనామనుజన్మాఽతః తతో గర్భోదకస్రుతిః. ౭౬

అప్పుడైనను మరునాడైనను ప్రసవము కానున్నపుడు గర్భిణికి బడలిక కల్గును. కుక్షిసడలిజారినట్లుండును. కన్నులులోనికిపోయియుండును. దేహమునకు శ్రమకల్గియుండును. నాభికి క్రిందిభాగమున బరువై యుండును. అరోచకముకల్గును. నోట నీరువెడలును. మూత్రము పలుమారు వెడలును. తొడలయందును, ఉదరమునందును, నడుమునందును, వీపునందును, రొమ్మునందును, వస్తియందును, గజ్జలయందును బాధ కల్గును. యోనిపగులదీయునట్లుబాధయు నొప్పియు పోటునుకల్గి యదరును. యోనినుండి స్రావముకల్గును. ఇవియన్నియు నొకటివెంట నొకటికల్గిన పిదప ప్రసవమునకు సంబంధించిన నొప్పులు వెనువెంటకల్గును. పిదగర్భమునకు సంబంధించినజలము యోనినుండి స్రవించును.

### ఆసన్నప్రసవోపచారములు.

అథోపస్థితగర్భాం తాం కృతకౌతుకమఙ్గళామ్,
హస్తస్థపున్నామఫలాం స్వభ్యక్తోష్ణాంబుసేవితామ్. ౭౭
పాయయేత్సఘృతాం పేయాం తనౌ భూశయనే స్థితామ్,
ఆభుగ్నసక్థిముత్తానాం అభ్యక్తాఙ్గీం పునః పునః. ౭౮
అధోనాభేః విమృద్నీయాత్ కారయేజ్జృమ్భచఙ్క్రమమ్,

పైజెప్పినరీతిగ నొప్పులుకల్గి గర్భజలము స్రవించిన పిదప గర్భము ప్రసవమునకభిముఖముగ నున్నదని యెరింగి మంగళార్థమైన రక్షాబంధనము గావించి గర్భిణిచేత పురుషనామనుగలదానిమ్మపండు మున్నగుఫలము నునిచి చక్కగ నభ్యంజనము చేసి వేడినీళ్లద్రావించి నేతితోగూడినకాంజికమును ద్రావించనగును. పిదప భూమిపైన మెత్తనైన పలుచనిపడకపై వెలికిల బరుండనుంచవలెను. పిదప నాగర్భిణి తొడలనువంచి ముడుచుకుని వెలికిల పరుండవలెను. పిమ్మట ఆముదముచేత నాభికిక్రిందిభాగమున మాటిమాటి

కిని అభ్యంజనముజేసి మెల్లమెల్లగ మర్దనముజేయవలెను. పిమ్మట పైకిలేచి నీల్గుచు పాదచారముగ తిన్నగ సంచరింపనగును.

### ఉపచారములచే గల్గుఫలము అనంతరకృత్యము.

గర్భః ప్రయాత్యవాగేవం తల్లిఙ్గం హృద్విమోక్షతః. ౨౯
ఆవిశ్య జఠరం గర్భో వస్తే రుపరి తిష్ఠతి,
ఆవోక్ష్య హి త్వరయ న్త్యేనాం ఖట్వామారోపయే త్తతః. ౩౦
అథ సంపీడితే గర్భే యోని మస్యాః ప్రసారయేత్,
మృదుపూర్వం ప్రవాహేత బాఢమాప్రసవాచ్చ సా. ౩౧

పైజెప్పిన మర్దనము మున్నగు నుపచారముల వరుస జేసినయెడ గర్భము తల్లి యొక్క హృదయస్థానమును వదలి క్రిందికి (ప్రసవమార్గమునకు) దిగజారును. గర్భము హృదయస్థానమునుండి క్రిందికి వెడలి జఠరమున జేరి వస్తికిపైన నిలచియుండును. వస్తికి పైభాగమున జేరుటయే హృదయమును వదలినందుకు చిహ్నము. పిదప ప్రసవమునకు సంబంధించిన నొప్పులు వరుసగ నధికమై తొందరజేసినప్పుడు మెల్లగ మంచముపై జేర్చవలెను. పిదప గర్భము మిక్కిలి యాసన్నమైయున్నపుడు ప్రసవమార్గమున ఆముదముచే జక్కగ నభ్యంజనముజేసి వాతనిరోధములేకుండ వికసింపజేయవలెను. పిమ్మట మెల మెల్లగ ముక్కుచు (గర్భము ప్రసవమార్గము చేరు సరికి) తీవ్రముగముక్కుచు ప్రసవముగు నంతవరకును అప్పటప్పటికిని గాఢతరముగ ముక్కుచుండవలెను. ప్రసవమునకు సంబంధించిన నొప్పులు నిలచినిలచి అప్పుడప్పుడు వెనువెంటవచ్చుచుండును. అట్టియెడ నొప్పులు కల్గినప్పుడు మాత్రము ముక్కవలెను కాని లేనప్పుడు ముక్కకూడదు.

వాగ్భటాచార్యులు అష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పిరి.—"శనైశ్శనైశ్చ పూర్వం ప్రవాహిష్ఠాః, నిర్గమే బాఢం, గర్భస్య యోనిముఖప్రతిపత్తౌ బాఢతరం, ఆప్రసవాత్" ప్రారంభమున వస్తిపైభాగమున గర్భముచేరినపుడు మెలమెల్లగ ముక్కవలెను. అక్కడనుండి వెడలునప్పుడు తీవ్రముగ ముక్కవలెను గర్భము యోనిముఖమున జేరుసరికి తీవ్రతరముగ ముక్కుచు ప్రసవమగునంతదనుక తీవ్రతరముగనే ముక్కుచుండ వలెను.

### గర్భిణికి హర్షము పుట్టించుట.

హర్షయే త్తాం ముహుః పుత్రజన్మశబ్దజలాఽనిలైః,
ప్రత్యాయాన్తి తథా ప్రాణాః సూతిక్లేశావసాదితాః. ౩౨

ప్రసవబాధలచే మిక్కిలి బడలికజెందు నాస్త్రీని "నీకు మంచిపుత్రుడు కల్గును. బిడ్డ మిక్కిలి రూపవంతుడును తేజోవంతుడునైయుండును" ఇవి మొదలగు సంతోష కరములైన మాటలచేతను, జలముచేతను, మంచిగాలిచేతను సేదదేరునట్లుచేయవలెను. అట్లుచేసినయెడ ప్రసవబాధలచే మిక్కిలి బడలికజెందిన ప్రాణములు మరల నెప్పటివలె సుస్థములగును. కావున చెంతనుండుస్త్రీలు తత్కాలోచితములగు హర్షమును గల్గించు మంచిమాటలచేతను ఉపచారములచేతను శ్రమమును మరపించి బడలికతీరునట్లు చేయు చుండవలెను.

## ప్రసూత్యుపచారములు.

ధూపయేద్గర్భసంగేతు యోనిం కృష్ణాహికఞ్చుకైః,
హిరణ్యపుష్పీమూలం చ పాణిపాదేన ధారయేత్. ౮౩
సువర్చలాం విశల్యాం వా జరాయ్వపతనేఽపి చ,
కార్యమేతత్, తథోత్థాప్య బాహ్వోరేనాం వికమ్పయేత్. ౮౪
కటీమాకోటయేత్పార్ష్ణ్యా స్ఫిచౌ గాఢం నిపీడయేత్,
తాలుకణ్ఠం స్పృశేద్వేణ్యా మూర్ధ్ని దద్యాత్ స్నుహీపయః.
భూర్జలాఙ్గలికీతుమ్బీసర్పత్వక్కుష్ఠసర్షపైః,
పృథక్ ద్వాభ్యాం సమస్తైర్వా యోనిలేపనధూపనమ్ ౮౫
కుష్ఠతాలీసకల్కం వా సురామణ్డేన పాయయేత్,
యూషేణ వా కులత్థానాం బిల్వజేనాఽఽసవేన వా. ౮౬

గర్భము బైటవెడలక లోపలనే నిలచియున్నపుడు కృష్ణసర్పముయొక్క కుబుసమును నిప్పుపైవైచి యోనికిపొగబట్టునది. పచ్చనిపువ్వులబూచు హిరణ్యపుష్పి (బంగారుగంటచెట్టు) యొక్కవేరును హస్తమునందును పాదమునందును ధరించవలెను. లేక ప్రొద్దుతిరుగుడు పువ్వునైనను ఉత్తరేణినైనను ధరించవలెను. మావిపడకయుండునపుడు పైజెప్పిన యోగములజేయనగును. మరియు మావిపడకుండునెడ రెండుచంకలలో చేతులతోబట్టి లేవనెత్తి కదలించునది. నడుమున పిడికిలిచే మృదువుగ పలుమారు గుద్దుచుండవలెను. తుంట్లు చేతులతోగట్టిగ బిగబట్టి పిసకవలెను. దవుడలను కంఠమును వెండ్రుకలజెడచేత తాకించవలెను. శిరస్సునందు జెముడుపాలనుంచవలెను. భూర్జపత్రము, పొత్తిగడ్డ, సొరవేరు, పాముకుబుసము, చెంగల్వకోష్టు, ఆవాలు, అనునీద్రవ్యముల నొక్కొక్కదానినైనను రెండేసిద్రవ్యములనైనను, అన్నింటినైనను నూరి యోనికి లేపనము

చేయవలెను. లేక పైజెప్పినవానిని నిప్పునవైచి పొగబట్టవలెను. మరియుం చెంగల్వ కోష్టును తాలిసపత్రిని కల్కముజేసి మద్యముపై తేటనుకలిపి త్రాగించవలెను. ఉలవలు కట్టుచేసి అందుపై కల్కమునుగూర్చి త్రాగింపనగును. లేక బిల్వవేరును ఆసవముగజేసి పైజెప్పిన కల్కమును కల్పి త్రాగింపనగును. (బిల్వవేరును నీళ్లుబోసి దంచి యానీటిని కొంతకాలము ధాన్యరాశినునిచిన నాశీతకషాయము బిల్వాసవ మనబడును.)

## మావి పడుటకు వస్తిప్రయోగము.

శతాహ్వాసర్షపాఽజాజీ శిగ్రుతీక్ష్ణకచిత్రకైః,
సహింగ్గుకుష్ఠమదనైః మూత్రే క్షీరే చ సార్షపమ్. ౮౮
తైలం సిద్ధం హితం పాయౌ యోన్యాం వాప్యనువాసనమ్,
శతపుష్పావచాకుష్ఠ కణాసర్షపకల్కితః. ౮౯
నిరూహః పాతయత్యాశు సస్నేహలవణోఽపరామ్,
తత్సఙ్గే హ్యనిలో హేతుః సా నిర్యాత్యాశు తజ్జయాత్. ౯౦

సదాప, ఆవాలు, ఓమము, మునగపట్ట, మిరియాలు, చిత్రమూలము, ఇంగువ, చెంగల్వకోష్టు, మ్రంగచెక్క, వీనినన్నిటిని కల్కముజేసి గోమూత్రమును పాలనుకూడ ఆవనూనెలోకలిపి పరిభాషానుసారముగ తైలమును పక్వముచేసి యూతైలముచేత ప్రసవించిన స్త్రీకి గుదమునందైనను ప్రసవమార్గమునందైనను అనువాసనవస్తిని విధ్యుక్తముగ జేసినయెడ మావిశీఘ్రముగపడును. లేక సదాప, వస, చెంగల్వకోష్టు, పిప్పళ్లు, ఆవాలు, వీనినన్నింటిని కల్కముజేసి అందు స్నేహద్రవ్యమును లవణమునుజేర్చి నిరూహవస్తి జేసినయెడ మావి అతిశీఘ్రముగ వెడలును. మావి బైట వెడలక నిలచుటకు వాతము కారణము కావున నిరూహవస్తి వాతహరములలో ప్రధానమగుటంజేసి వాతమును హరింపజేసినతోడనే మావి పట్టువదలి బైటవెడలునని భావము. మరియు "వాతోల్బణేషు దోషేషు వాతేవా వస్తిరిష్యతే" అనువచనముచేత వాతప్రధానముగనుండు రోగములయందు వస్తివిధానము మిగుల ప్రశస్తమని తెలిసెడి.

వస్తివిధానమునుగూర్చి యష్టాంగసంగ్రహమున నిట్లు విశేషముచెప్పబడినది.— "గర్భిణీంతు న్యుబ్జా మాస్థాపయేదనువాసయేచ్ఛ, తథాఽస్యాః వివృతమార్గతయా సమ్యగౌషధమనుప్రవిశతీతి" గర్భిణికి—ఆస్థాపన అనువాసనవస్తి కర్మలజేయునపుడు కాళ్లు ముడుంచుకుని బోరగిలపరుండనునిచి ఆస్థాపనాఽనువాసనవస్తి జేయనగును. అట్లుంచుటచేత మార్గము వివృతమై యడ్డులేకుండును. దానంజేసి యౌషధము ధారాళముగ లోనికింకని పని చేయును కావున బోరగిలచుంచవలెనని భావము.

### హస్తముచే మావిని విడదీయుపద్ధతి.

కుశలా పాణినాఽక్తేన హరేత్ కృత్తనఖేన వా,
ముక్తగర్భాఽపరాం యోనిం తైలేనాఽఙ్గం చ మర్దయేత్. ౯౧

మరియు ప్రసూతికృత్యములయందు నేర్పరియగు స్త్రీ చేతివ్రేళ్లగోళ్లను శస్త్రముచే కత్తిరించుకొని చేతికి నెయ్యి బూసికొని మెలకువతో మావిని వెలికిందీయవలెను. ఇత్తెఱంగున ప్రసవించి మావి బైట వెడలినపిదప ప్రసవమార్గమునకును శరీరమునకును తైలము బూసి మెల్లగ మర్దనము జేయనగును.

(ఇచ్చట అపరయన గర్భమునందలి శిశువు కావరణమై యుండుమావి యని యెఱుంగునది.)

### మక్కల్లము దానిచికిత్స.

మక్కల్లాఖ్యే శిరోవస్తికోష్ఠశూలే తు పాయయేత్,
సుచూర్ణితం యవక్షారం ఘృతేనోష్ణజలేన వా. ౯౨
ధాన్యామ్బ్వా గుడవ్యోషత్రిజాతకరజోన్వితమ్,

ప్రసవించినస్త్రీకి తలయందును వస్తియందును కోష్ఠమునందును శూలనొప్పి కల్గును. ఇది మక్కల్లమనురోగము. ఈరోగము కల్గినపుడు యవక్షారమును మెత్తగ చూర్ణముచేసి నేతిలో కలిపియైనను, వేడినీళ్లతో కలిపియైనను త్రాగించవలెను. లేక త్రికటుకముల (శుంఠి పిప్పలి మిరియాల)ను, త్రిజాతక (దాల్చినచెక్క లవంగపత్రి, ఏలకులు) ములను మెత్తగ పొడిచేసి ప్రాతబెల్లమును కూర్చి బియ్యపుకడుగునీళ్లతో కలిపి త్రాగించవలెను.

### బాలోపచారములు.

అథ బాలోపచారేణ బాలం యోషిదుపాఽఽచరేత్. ౯౩

పిమ్మట బాలోపచరణీయమున జెప్పినక్రమము ననుసరించి స్త్రీ అప్పుడుపుట్టిన శిశువునకు దగిన యుపచారముల జేయవలెను. అట్టి యుపచారముల జేయుస్త్రీ చాలకాలముగ ప్రసవములు అనుభవించి పసిబిడ్డల నుపచరించు విధానములయం దారి తేఱి యుండవలెను.

### బాలింతరాలి కాహారము.

సూతికా క్షుద్వతీ తైలాత్ ఘృతాద్వా మహతీం పిబేత్,

పఞ్చకోలకినీం మాత్రామను చోష్ణం గుడోదకమ్ ౯౪

ప్రసవించిన బాలింతరాలికి ఆకలి తీవ్రముగ నుండినేని పంచకోలములను చూర్ణముజేసి తైలమునందైనను ఘృతమునందైనను కలిపి గొప్పమాత్రను (ఎక్కువప్రమాణము) త్రాగించి వెంటనే పాకబెల్లమును కలిపిన వేడినీళ్లను త్రాగింపవలెను (మహతీమాత్రయన నెనుమిదియామములకాలమునను జీర్ణమగునంత పరిమాణము గల్గినది మహతీస్నేహమాత్రయని చెప్పబడును.)

వాతఘ్నౌషధతోయం వా తథా వాయుర్న కుప్యతి,
విశుధ్యతి చ దుష్టాస్రం ద్విత్రిరాత్రమయం క్రమః. ౯౫

పైజెప్పినరీతిగ స్నేహమాత్రనైనను ఘృతమాత్రనైనను త్రాగి వాతహరద్రవ్యములచే సిద్ధమైన కషాయమునైన త్రాగింపవలెను. అటుజేసినయెడల కోష్ఠము శూన్యముగ నున్నను వాతము ప్రకోపము నొందకుండును. కోష్ఠమునందుండు చెడ్డరక్తము పరిశుద్ధమగును. ఇత్తెరంగున రెండుమూడురాత్రులు గడుపవలెను.

స్నేహాయోగ్యాతు నిస్స్నేహం అముమేవ విధిం భజేత్,
పీతవత్యాశ్చ జఠరం యమకాక్తం వివేష్టయేత్. ౯౬

బాలింతరాలు స్నేహద్రవ్యము లలవాటుగా లేనిదైనయెడ తైలఘృతముల జేర్పక పంచకోలకషాయమును ఉష్ణోదకమును గాని సిద్ధకషాయమును గాని వీనిలో నొకదానిని త్రాగించి కడుపుపైన తైలఘృతముల రెండింటిని రాసి గుడ్డను చుట్టియుంచునది.

జీర్ణే స్నాతా పిబేత్పేయాం పూర్వోక్తౌషధసాధితామ్,
త్ర్యహం ద్వ్యహం విదార్యగ్రన్ధక్వాథేన సాధితా. ౯౭
హితా యవాగూః స్నేహాఢ్యా సాత్మ్యతః పయసాఽథవా,
సప్తరాత్రాత్పరం చాస్యై క్రమశో బృంహణం హితమ్, ౯౮
ద్వాదశాహేఽనతిక్రాన్తే పిశితం నోపయోజయేత్,

పైజెప్పినప్రకారము త్రాగిన స్నేహము, గుడోదకము, పంచకోలకషాయము పానముజేయించి అవి జీర్ణమైనపిదప వేడినీళ్లచే స్నానముచేయించి పైజెప్పిన పంచకోలములజేర్చి సిద్ధముచేయబడిన పేయయను గంజిని త్రాగించవలెను. ఇత్తెరంగున మూడు దినములుగడపి పిమ్మట విదార్యాదిగణమున జెప్పిన యౌషధములగూర్చి పక్వముచేయబడిన యవాగువును ఆహారమునకై త్రాగింపనగును. అట్టి యవాగువున స్నేహద్రవ్యము

నధికముగ గూర్పనగును. అలదాటుగనున్నచో పాలనుగూర్చి యుపయోగింపనగును. ఇత్తెరంగున నేడురాత్రులు కడచినపిదప నెనిమిదవదినము మొదలు జేసి క్రమముగ నానాట బృంహణముల (బలమును గల్గించి పుష్టినిజేయు క్రియలను) నుపయోగించుట మిక్కిలి హితము. మరియు పండ్రెండుదినములు కడచునందాక మాంసమును కొంచెమైన నుపయోగింపంజనదు. (పండ్రెండుదినములలోపల మాంసము నుపయోగించునెడ స్కందాదిగ్రహములు మాంసమునందభిలాష కల్గినవి కావున సాగ్రహము లావహించును. కావున పండ్రెండుదినములలోపల మాంసాహారము నిషేధింపబడినది.)

పథ్యమునకై యాహారార్థముగ నుపయోగింపబడు గంజి మండ-పేయ-విలేపి-యవాగు అని నాల్గువిధములు. అందు బియ్యమును నీళ్లనుకలిపి కాచి చక్కగ నుడికినపిదప మెతుకులులేక తేటగనుండుగంజి మండము. కొద్దిగ మెతుకులుండునట్లు కాచబడినది పేయ. మెతుకు లధికముగనుండునది విలేపి. కొంచెము ద్రవముగనుండునట్లు కాచబడినది యవాగువు. వీనిలక్షణములు చరకమున నిట్లు చెప్పబడినది:—"సిక్థైర్విరహితో మణ్డః పేయాసిక్థసమన్వితా, ఘనసిక్థా విలేపీ స్యాత్ యవాగూర్విరళద్రవా" ఈనిర్ణయప్రకారము పేయాయవాగూలక్షణముల నిచ్చట నెరుంగునది. బృంహణ మన శరీరమునకు పుష్టిని బలమును కల్గించు ఔషధ - అన్న. విహారాదులు. ప్రసవించినస్త్రీకి ఏడురాత్రులు కడచినపిదప ఆట్టి బలకరములగు జీవనీయ, బృంహణీయ గణద్రవ్యములను, మధురవర్గద్రవ్యములను యథోచితముగ గూర్చి సిద్ధముచేయబడిన తైలాదులచే నభ్యంగనము, ఉద్వర్తనము, పరిషేకము, అవగాహనము మున్నగు నుపాయములచేతను, మనోజ్ఞములును, హృద్యంబులునునగు నన్నపానములచేతను, బాలింతరాలికి నానాట బలమును వృద్ధిజేయవలెనని భావము. గర్భధారణము, ప్రసవపరిశ్రమ మున్నగువానిచే బలము చాలతగ్గియుండినశరీరము చిక్కియుండును. కావున తటాలున పూర్తిగ బృంహణము నుపయోగించునెడ వ్యత్యస్తమగునుగాన నానాట కొంచెముకొంచెముగ నలవాటుచేయవలెనని భావమును సూచించుచు "క్రమశో బృంహణం హితమ్" అని చెప్పెను.

### బాలింతరాలివ్యాధుల చికిత్సజేయునియమము.

యత్నేనోపచరేత్సూతాం దుస్సాధ్యాహి తదామయాః,
గర్భవృద్ధిప్రసవరుక్ క్లేదాస్రస్రుతిపీడనైః. ౯౯
ఏవం చ మాసాదధ్యర్థాత్ ముక్తాహారాదియన్త్రణా,

గతసూతాఽభిధానా స్యాత్ పునరార్తవదర్శనాత్. ౧౦౦

ఇతి అష్టాఙ్గహృదయసంహితాయాం.
శారీరస్థానే ప్రథమోఽధ్యాయః.

ప్రసవించినస్త్రీకి గర్భవృద్ధిచేతను ప్రసవముచేతను ప్రసవకాలమునగల్గుతన్నిమిత్తకములైననొప్పులచేతను గర్భమునకు సంబంధించిన జలంబును రక్తంబును స్రవించుట చేతనుమిక్కిలి బలహీనము కల్గియుండును. కావున ప్రసవించిన బాలింతరాలికి ఏవైన రోగములు సంభవించిన నవియెల్ల కష్టసాధ్యములై యుండును. కావున బాలింతరాలికి వ్యాధులుకల్గినపుడు మిక్కిలిపూనికతో చికిత్సజేయవలెను. (లేనిచో నపాయము కల్గును) పైజెప్పిన యాహారాదినియమము ననుసరించి యొకటిన్నర మాసమువరకును మిక్కిలి మెలకువతో నుండవలెను. ఒకటిన్నరమాసము కడచినపిదప మరల నార్తవము వెడలునందాక 'గతసూత' (ప్రసవసంబంధము లేనిది) యని చెప్పబడును.

అష్టాంగహృదయశారీరవ్యాఖ్యానమున
మొదటియధ్యాయము.

# ద్వితీయాధ్యాయము.

అవ. పూర్వాధ్యాయమున గర్భముయొక్క యుత్పత్తి శుక్రార్తవస్వరూపము మున్నగు విషయములును, ప్రసవకాలమువరకు గర్భముయొక్క పరిస్థితులు మున్నగునవి వివరింపబడియె. అట్టిగర్భము వ్యాపత్తులేక వృద్ధినొందినగాని ఫలవంతము కానోపదు. కావున మిథ్యాహారాదులచే గల్గు గర్భవ్యాపత్తులను తచ్చికిత్సాసౌకర్యమునకై వివరించు గర్భవ్యాపచ్ఛారీర మనునధ్యాయము చెప్పబడును.

సూ. అథాతో గర్భవ్యాపదం శారీరం వ్యాఖ్యాస్యామః.

గర్భావక్రాన్తి శారీరమును జెప్పినపిదప గర్భవ్యాపత్తులను బోధించు శరీరము నుద్దేశించి చెప్పబడిన యధ్యాయమును వివరించెదనని భావము.

**గర్భిణికి ఆర్తవము వెడలుటకు కారణములు దానిచికిత్స.**

గర్భిణ్యాః పరిహార్యాణాం సేవయా రోగతోఽపి వా,
పుష్పే దృష్టేఽథవా శూలే బాహ్యాన్తస్స్నిగ్ధశీతలమ్. ౧
సేవ్యామ్భోజహిమక్షీరివల్కకల్కాజ్యలేపితాః,
ధారయేద్యోనివస్తిభ్యాం ఆర్ద్రార్ద్రాః పిచునక్తకాః. ౨

పైయధ్యాయమున "అతివ్యవాయ...త్యజేత్" అనుగ్రంథముచేత గర్భిణీ స్త్రీకి నిషిద్ధములగు విషయములు నిర్దేశింపబడినవి. అట్టి నిషిద్ధవిషయముల సేవించిన యెడ దానిని కారణముగ జేసియైనను, సామాన్యములగు నపథ్యాహారవిహారాదుల జేయుటచే గల్గినరోగములచేనైనను గర్భిణీస్త్రీకి ఋతుశోణితము కనబడినను; లేక వస్తియందు పోటు మున్నగుబాధ కల్గినను, శరీరబాహ్యప్రదేశమునను, శరీరాన్తర్భాగమునను మిక్కిలి శీతలంబులును స్నిగ్ధంబులునైన యుపచారముల జేయవలెను. (శీత స్నిగ్ధములైన స్నానము పరిషేకము అభ్యంగనము మున్నగునవి బాహ్యోపచారములు. స్నిగ్ధంబులును శీతలంబులునగు నన్నపానాదులు ఆభ్యంతరోపచారములు) మరియు వట్టివేళ్లు, తామరపువ్వులు, చందనము, పాలుస్రవించునట్టి మఱ్ఱి అశ్వత్థము మున్నగు చెట్లపట్టయొక్క కల్కము, నెయ్యి, వీనినన్నిటిని మెత్తగనూరి ప్రత్తిగుడ్డకుపూసి యా ప్రత్తిగుడ్డను మిక్కిలి యార్ద్రముగ (పైజెప్పిన కల్కముచేత) జేసి దానిని యోనియం

దును వస్తియందును ధరించునది. ("పిచునక్తక" మన దూది విశేషముగనుండునట్లు మెత్తనగ నుండురీతిగ జేయబడిన దూదిగుడ్డయని యెరుంగునది. దీనినే 'లింట్' అని ఆంగ్లవైద్యశాలలయందు జెప్పెదరు.)

శతధౌతఘృతాదియోగము.

శతధౌతఘృతాక్తాం స్త్రీం తదమ్బస్యవగాహయేత్,
ససితాక్షౌద్రకుముదకమలోత్పలకేసరమ్. 3
లిహ్యాత్, క్షీరఘృతం, ఖాదేత్, శృఙ్గాటకకసేరుకమ్,
పిబేత్ కాన్తాబ్జశాలూకబాలోదుమ్బరవత్పయః. ౪
శృతేన శాలికాకోలీ ద్విబలా మధుకేక్షుభిః,
పయసా రక్త శాల్యన్నం అద్యాత్సమధుశర్కరమ్. ౫
రసైర్వ్యజాఙ్గలైః, శుద్ధివర్జం చా ప్రోక్తమాచరేత్,

మరియు పైజెప్పినరీతిగ గర్భవతికి ఆర్తవము వెడలుచున్నయెడ శతధౌత(నూరు మార్లుకడుగబడిన) ఘృతముచే నభ్యంగనముజేయించి పైజెప్పినరీతిగ వట్టివేళ్లు తామర పువ్వులు మున్నగు వానిగూర్చి కాచబడిన వేడినీళ్లయందు స్నానముచేయించవలెను.. చక్కెర తేనె కలువలయొక్కయు తామరపువ్వులయొక్కయు కేసరములు వీనినన్నిటిని నేతియందైనను పాలయందైనను కలిపి సేవించవలెను. లేక శృంగాటకమును, నమ్మదుంపను నమలవలెను. లేక ప్రేంకణము, జలమునబుట్టిన కమలములు కలువలు మున్నగునవి. చేమల కలువలు మున్నగువానిదుంపలు, లేక అత్తికాయలు, వీనినన్నిటినిగూర్చి కాచబడిన పాలను త్రాగవలెను. లేక పైరుదుంపలు, కాకోలి, చిట్టాముట్టి, పేరాముట్టి, అతిమధురము, చెఱకు, వీనినన్నిటినిగూర్చి క్షీరపాకవిధప్రకారము పక్వముజేయబడినపాలలో ఎఱ్ఱవరిబియ్యపు అన్నమునకలిపి అందు తేనెను చక్కెరను కలిపి భుజింపనగును. లేక అట్టియన్నమును జాంగల జంతువులయొక్క మాంసరసములోగూర్చియైన భుజింపనగును. మరియు రక్తపిత్తచికిత్సయందుజెప్పిన చికిత్సలలో వమనవిరేచనరూపశోధనమొకటి దక్క తక్కుంగల చికిత్సలనన్నిటిని బాహ్యమునను ఆంతరమునను ఉపయోగింపనగును.

ఇచ్చట "లిహ్యాత్ క్షీరఘృతం" అనుచోట పాలనుండి తీయబడిననెయ్యియని కొందరు అర్థముజేసెదరు. "శృతేన శాలికాకోలీ...పయసా"అనుచోట శాల్యాదిద్రవ్యములజేర్చి క్షీరపాకవిధి ప్రకారము పక్వముజేయబడిన పాలు అని యర్థము.

క్షీరపాకవిధి తంత్రాన్తరమున నిట్లు చెప్పబడినది:—"ద్రవ్యాదష్టగుణం క్షీరం క్షీరాత్తోయం చతుర్గుణం క్షీరావశేషః కర్తవ్యః క్షీరపాకే త్వయం విధిః" క్షీరమున జేర్చు ద్రవ్యమునకన్న క్షీరము ఎనిమిదిభాగములును, పాలకన్న నాల్గింతలు నీళ్ళును కలిపి పాలుమాత్రము మిగులునట్లు కాచవలెను. క్షీరపాకవిధి నెచ్చటజెప్పినను ఇదియే పద్ధతి.

శతధౌతఘృతమన—నూరుమార్లు కడగబడిన ఘృతమని యర్థము. శతశబ్దమనేకవాచియని యనేకపర్యాయములు కడగబడినది శతధౌతఘృతమని కొందరు వచించెదరు. ఈపక్షమును అవలంబించియే యష్టాంగసంగ్రహమున వాగ్భటాచార్యులు "సహస్రధౌతసర్పిషా అధోనాభేః సర్వతః ప్రదిహ్యాత్" అని చెప్పిరి. ముఖ్యమున నెయ్యిని ఎన్నిమార్లు నీళ్లతో కడిగిన నంతకంత గుణోత్తర మైయుండును.

## గర్భిణికి పుష్పదర్శనమునం దసాధ్యలక్షణము.

ఆసంపూర్ణత్రిమాసాయాః ప్రత్యాఖ్యాయ ప్రసాధయేత్. ౬
ఆమాన్వయే చ

గర్భధారణము మొదలుజేసి మూడుమాసములు పూర్తికాకమునుపే ఆర్తవము స్రవించునెడ (ఆకాలమున గర్భము సారవంతముగ నేర్పడకుండును కావున) గర్భము నిలువక పడిపోవును. కావున అప్పుడు కుదరదనిచెప్పి మిక్కిలి ప్రయత్నముతో చికిత్స జేయవలెను. మరియు ఋతురక్తము ఆమరసముతో గూడి మిశ్రముగ వెడలినయెడ విరుద్ధచికిత్స జేయవలసియుండును. కావున నాలుగైదుమాసములు నిండి గర్భము సారవంతముగనున్నను అసాధ్యమగును. కావున కుదురుట దుస్తరమని చెప్పి చికిత్స జేయునది.

రూక్షంబును తీక్ష్ణంబును ఉష్ణగుణంబును కటురసంబునైన యౌషధాదులు ఆమహరములు. అయ్యవి గర్భిణికి విరుద్ధములు. శీతంబులును స్నిగ్ధంబులును మధురంబులును నగు ఔషధాదులు గర్భిణిహితకరములు. అయ్యవి ఆమమును వృద్ధినొందించుటం జేసి యామమునకు విరుద్ధములు కావున నీరెండిటికిని అనుకూలమైన చికిత్సపొసగనేరదు. కావున ఆమానుగతము అసాధ్యము.

## ఆమస్రావమున చికిత్స.

తత్రేష్టం శీతం రూక్షోపసంహితమ్;
ఉపవాసో ఘనోశీరగుడూచ్యరలుధాన్యకాః. ౭
దురాలభాపర్పటకచన్దనాఽతివిషాబలాః,
క్వథితాస్సలిలే పానం తృణధాన్యాదిభోజనమ్. ౮

ముద్గాదియూషైరామే తు జితే స్నిగ్ధాదిపూర్వవత్,

ఆమముతోఁగూడి యార్తవము వెడలునపుడు తిక్తకషాయరూక్షాదిద్రవ్యముల తోడను గుణవీర్యములచే శీతములగు ద్రవ్యములతోడను గూడిన యన్నపానాదులు మిక్కిలి హితకరములు. మరియు నుపవాసము దేశకాలాదిసాత్మ్యము ననుసరించి చేయం దగును. మరియు తుంగగడ్డలు, వట్టివేళ్లు, తిప్పతీగె, కోలపొన్న, దనియాలు, దూల గొండి, పర్పాటకము, చందనము, అతివస, చిట్టాముట్టి, వీనిని నీటిలోనునిచి పానీయ పక్వముగ కాచి యానీటిని త్రాగవలెను. సంబారధాన్యము చామలుమున్నగు తృణ ధాన్యములచే సిద్ధమైనయన్నమును పెసలుమున్నగు వానిచే సిద్ధమైనకట్టును కలిపిభుజింప నగును. ఇట్టి యుపచారములచే నామము హరించిన పిదప ఆర్తవమునకు జెప్పిన శీత స్నిగ్ధాద్యాహారము ఔషధముమున్నగు వానిని మునుపటివలె నుపయోగింపనగును.

గర్భపాతమునం దుపచారములు.

గర్భే నిపతితే తీక్ష్ణం మద్యం సామర్థ్యతః పిబేత్. ౯
గర్భకోష్ఠవిశుద్ధ్యర్థం ఆర్తివిస్మరణాయ చ,
లఘునా పఞ్చమూలేన రూక్షాం పేయాం తతః పిబేత్. ౧౦
పేయామమద్యపా కల్కే సాధితాం పాఞ్చకాలికే,
బిల్వాదిపఞ్చకక్వాథే తతోద్దాలకతణ్డులైః. ౧౧
మాసతుల్యదినాన్యేవం పేయాదిః పతితే క్రమః,
లఘు రస్నేహలవణో దీపనీయయుతో హితః. ౧౨

పైజెప్పిన ప్రకారముగ నుపచారములజేసినను అంతట నిలువక గర్భము పడిపో యినయెడ మిక్కిలి తీక్ష్ణమైనమద్యమును బలము ననుసరించి స్త్రీకి త్రాగింపవలెను. ఆ విధముగ మద్యపానముజేసినయెడ కోష్ఠము పరిశుభ్రమై గర్భపాతమున గల్గినబాధల మరచియుండును. కావున మద్యపానము హితకరము. పిమ్మట లఘుపంచమూలముల (వాకుడువేళ్లు, పెద్దములకవేళ్లు, ముయ్యాకుపొన్నవేళ్లు, కోలపొన్నవేళ్లు, పల్లేరువేళ్లు, ఇవి యైదునుజేరి లఘుపంచమూలములు) కషాయముచే పక్వముజేయబడిన పేయను (గంజిని) స్నేహమును (నెయ్యిని) జేర్పక రూక్షముగనే త్రాగింపవలెను. మద్యపానము జేయ నలవాటులేని స్త్రీకి మహాపంచకమూలముల కల్కముజేసి మహాపంచమూలముల కషాయమున నువ్వులను ఉద్దాలకములనుధాన్యపుబియ్యమునుగూర్చి పైజెప్పినమహాపంచ మూలముల కల్కమునుకూడకలిపి పక్వముచేయబడిన పేయనుత్రాగించునది. (బిల్వము

వేరు, అడవిగుమ్ముడువేరు, తక్కెలవేరు, కలిగొట్టువేరు, దుందిలపువేరు ఇవియైదును జేరి మహాపంచమూలములు) గర్భము ఆ కాలమున పడినయెడ ఎన్నిమాసములగర్భము పడిపోవునో అన్నిదినములవరకును పైజెప్పిన పేయయందు నెయ్యి లవణమునుగూర్పక అగ్నిని దీపింపజేయు మిరియాలుమున్నగువానిని లఘువుగ జేర్చి సేవించుట యుక్తము. (మూడు మాసముల గర్భముపడినచో మూడుదినములు, నాల్గుమాసముల గర్భమునకు నాల్గుదినములు, ఇత్తెరంగున మాససంఖ్య ననుసరించి అన్నేసిదినములు పైజెప్పినక్రమముగ నాహారనియమము నాచరింపవలెనని భావము.)

## పైజెప్పినయుపచారములకు ఫలము.

దోషధాతుపరిక్లేదశోషార్థం విధిరిత్యయమ్,
స్నేహాన్నవస్తయశ్చోర్ధ్వం బల్యజీవనదీపనాః. ౧౩

దోషములయొక్కయు ధాతువులయొక్కయు ద్రవము శోషించుటకై పైజెప్పిన క్రమమున నాహారాదివిధానము నాచరించునది. అట్టి నియమముచే దోషధాతువుల ద్రవము శోషించినపిదప నెయ్యి మొదలగు స్నేహద్రవ్యములచే మిక్కిలి స్నిగ్ధములై బలకరంబులును, ఓజస్సును వృద్ధినొందించునవియు జఠరాగ్నిని దీపింపజేయునవియునగు నన్నపానంబులును, వస్తువులును మిక్కిలి హితకరములు.

(ఇచ్చట దోషశబ్దముచేత ద్రవమునుకల్గించు కఫపిత్తములుమాత్రము గ్రహింపబడును. అట్టిద్రవము శోషించినపిదప వాతము ప్రకోపము నొందకుండుటకై స్నేహములగూర్చిన యన్నపానాదుల నుపయోగింపవలెనని భావము.)

## ఉపవిష్టకము.

సఞ్జాతసారే మహతి గర్భే యోనిపరిస్రవాత్,
వృద్ధిమప్రాప్నువన్ గర్భః కోష్ఠే తిష్ఠతి సస్ఫురః. ౧౪
ఉపవిష్టకమాహుస్తం వర్ధతే తేన నోదరమ్,

గర్భము నానాట బలముకల్గి వృద్ధినొంది గొప్పదియైయున్నను యోనినుండి ద్రవము స్రవించుటవలన క్రమముగ వృద్ధినొందక గర్భమున కాధారమైన కోష్ఠమునందే కదలుచుండును. ఇయ్యది యుపవిష్టక మనబడును. దీనిచేత నుదరము వృద్ధినొందదు. (గర్భము వృద్ధినొందకయుండుటవలన దాని కాధారమైన జఠరముకూడ వృద్ధినొందదని భావము) గర్భము వృద్ధినొందకయున్నను చలనముమాత్రము కల్గియుండును.

### నాగోదరలక్షణము.

శోకోపవాసరూక్షాద్యైః అథవా యోన్యతిస్రవాత్. ౧౫
వాతే క్రుద్ధే కృశః శుష్యేత్ గర్భో నాగోదరం తు తత్,
ఉదరం వృద్ధిమప్యత్ర హీయతే స్ఫురణం చిరాత్. ౧౬

దుఃఖము, ఉపవాసము, స్నేహములేక మిక్కిలి రూక్షములైన యాహారముల సేవించుట ఇవి మున్నగు కారణములచేనైనను, గర్భిణికి నిషిద్ధములగు విషయముల నాచరించుటచేనైన యోనిస్రావ మధికమగుటచేనైనను వాతము ప్రకోపమునొందినపుడు గర్భము నానాట కృశతనొంది రూపము దెలియక శోషించును. ఇయ్యది నాగోదర మనబడును. ఈనాగోదరమను. గర్భమునందు ఉదరము వృద్ధినొందియున్నను గర్భము మాత్రము నానాట క్షీణించును. చిరకాలమునకు ఎప్పుడో ఒకవేళ కదలును. (ఉపవిష్టమను గర్భము కేవలము వృద్ధిలేకుండును గాని బొత్తుగ నశించుటలేదు.)

ఈగర్భమునందు గర్భము వృద్ధినొందుసమయమున వాతప్రకోపమునంజేసి గర్భమును వృద్ధినొందించు గర్భనాడీద్వారమునకు అడ్డముగ నిరోధము కల్గినపుడు (పంట కాలువలో నాకలములు పడియున్నపుడు దానింజేసి పైకుకు ధారాళముగ నీళ్లు పారని విధముగ) ఆహారరసము చాలినంతగర్భమునకు రానేరదు గావున పుష్టికలుగక నానాట కృశించును. తల్లికి పుష్టికల్గుటంజేసి కుక్షిమాత్ర మొకవేళ స్థూలముగ నుండవచ్చును.

### ఉపవిష్ట-నాగోదరచికిత్స.

తయోః బృంహణవాతఘ్నమధురద్రవ్యసంస్కృతైః,
ఘృతక్షీరరసైస్తృప్తిః ఆమగర్భాంశ్చ ఖాదయేత్. ౧౭
తైరేవ చ సుతృప్తాయాః క్షోభణం యానవాహనైః,

పైజెప్పబడిన ఉపవిష్టకము నాగోదరమునకు రెండు గర్భవ్యాపత్తులయందును బృంహణంబులు (బలకరంబులు)ను, వాతహరంబులును, మధురంబులును నగు ద్రాక్ష పండు చక్కెర మున్నగు ద్రవ్యములచే సంస్కరించి సిద్ధము యొనర్చబడిన ఘృతమును క్షీరమును మాంసరసమును త్రాగించుటచే మిక్కిలి తృప్తినొందింపవలెను. అట్టియాహారములచే గర్భిణి తృప్తినొందినపిదప అందుమూలమున ఆమగర్భమునకును అట్టి యాహార రసము జెందునట్టుచేసి తృప్తినొందింపనగును. అట్టి ఘృతక్షీరరసములచే దృప్తినొందిన గర్భిణిని గజాది వాహనములపై నెక్కించి శరీరము కదలునట్లు సవారి చేయించవలెను,

ఇచ్చట "బృంహణ-వాతఘ్న-మధురద్రవ్యసంస్కృతైః" అనుచోట బలమును కల్గించు గుణంబును వాతమును హరించుగుణంబును మధురరసంబును ఈమూడు గుణంబులును కల్గిన ద్రాక్ష శర్కర మున్నగు ద్రవ్యములచే ఘృతాదులు పక్వముగావలెనని యర్థము. పైజెప్పిన మూడుగుణములును వేర్వేరుగనుండు నొక్కొకద్రవ్యమును గూర్పదగదు ఎట్లులన:—ప్రేంకణము మున్నగునవి బృంహణములు, అవి వాతహరములుకావు. శుంఠి మున్నగునవి వాతహరంబులును బృంహణంబులునగును. అయినను అవి మధురరసములుకావు. తండులీయకము చిట్టిహూర చిరుసెనగలును మధురరసములు. అయినను అవి వాతహరంబులును బృంహణంబులును కానేరవు. ఇట్టిద్రవ్యముల జేర్చక బృంహణ వాతహర మధురరసంబులు మూడును సముదితముగకల్గిన ద్రాక్షచక్కెర మున్నగుద్రవ్యములచే సంస్కృతములగు ఘృతాదుల నుపయోగింపవలెనని భావము. ఈవిషయమునే యష్టాంగసంగ్రహమున వాగ్భటాచార్యులు విశదముగ నిట్లుచెప్పిరి:—"తయోర్జీవనీయబృంహణీయమధురౌషధసిద్ధానాం సర్పిషాముపయోగః"

## లీనాఖ్యగర్భచికిత్స.

లీనాఖ్యే నిస్ఫురే శ్యేనగోమత్స్యోత్క్రోశబర్హిజాః ౧౮
రసా బహు ఘృతా దేయా మాషమూలకజా అపి,
బాలబిల్వం తిలాన్ మాషాన్ సక్తూంశ్చ పయసాపిబేత్.
సమేద్యమాంసం మధువా కట్యభ్యఙ్గం చ శీలయేత్.

(పైజెప్పబడిన ఉపవిష్టక నాగోదర గర్భములయందు గర్భచలనము కలదని చెప్పబడినది. ఆరెంటియందును గర్భచలనములేక నిదురబోవు చందమున నిశ్చేష్టముగ నుండిన నదియే లీనగర్భమని చెప్పబడును. పైరెండిటికిని దీనికిని చలనాచలనమే భేదము. ఈవిషయము అష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పబడినది:—"యస్యాః పునర్వాతోపసృష్టస్రోతసః లీనో గర్భః ప్రసుప్తోన స్పందతే తం లీనమిత్యాహుః" అట్టి లక్షణమునే యిచ్చట తంత్రకారుడు "లీనాఖ్యే నిస్ఫురే" అని సంక్షేపముగ జెప్పెను.)

చలనరహితమైన లీనమను గర్భమునందు శ్యేనము (డేగ), గోవు, మత్స్యములు, ఉత్క్రోశము (పక్షివిశేషము). నెమలి అనునీపక్షులయొక్క మాంసరసమున ఘృతము నధికముగగూర్చి గర్భిణిని త్రాగింపవలెను. మినుములను ముల్లంగిని పక్వముజేసి వాని రసమున ఘృతము నధికముగ జేర్చి త్రాగింపనగును. లేక బిల్వకాయను, నువ్వులను మినుములను, సత్తుపిండిని వీనినన్నింటిని పాలలోగలిపి సాత్మ్యము ననుసరించి యుపయోగింపనగును. మిక్కిలి మేదస్సు వృద్ధినొందిన బలిసమాంసమున తేనెనుకలిపి సేవింపనగును. నడుమునం దభ్యంగనమును విడువక చేయవలెను.

గర్భము అనేకవత్సరములు అనుసరించుటకు కారణము.

హార్షయేత్సతతం చైనామేవ గర్భః ప్రవర్ధతే. ౨౦
పుష్టోఽన్యథా వర్షగణైః కృచ్ఛ్రాజ్జాయేత నైవ వా,

పైజెప్పబడిన మూడువిధములైన ఉపవిష్ట - నాగోదర - లీనాఖ్యగర్భముల మాటియందును పైజెప్పిన విధముగ నుపచరించుచును గర్భిణికి మిక్కిలి సంతోషమును గల్గించవలెను. అట్లు గల్గించినయెడ గర్భము శీఘ్రముగ వృద్ధినొందును. అట్టి యుపచారములజేయక కేవలము రూక్షములగు నన్నపానాదుల జేసినయెడ అనేకవత్సరములకు గర్భము యథోచితముగ వృద్ధినొంది మిక్కిలి కష్టముచేత ప్రసవమగును. లేక ఆగర్భము జీవదశవరకును గర్భమునందే లీనమైయుండి బైటవెడలక యుండును. (జీవమాత్రావశిష్టముగ నుండును.)

గర్భిణికి గల్గు నుదావర్తచికిత్స.

ఉదావర్తం తు గర్భిణ్యాః స్నేహైరాశుతరాం జయేత్. ౨౧
యోగ్యైశ్చ వస్తిభిర్హన్యాత్ సగర్భాం సహి గర్భిణీమ్,

గర్భిణికి ఉదావర్త మనువ్యాధి సంభవించినయెడ (గర్భము ప్రతిలోమవాతముచే నూర్ధ్వాభిముఖమగునెడ) వాతహరములగు ద్రవ్యములగూర్చి సిద్ధముచేయబడిన స్నేహముల యథోచితముగ బాహ్యాన్తరములయం దుపయోగించి అతిశీఘ్రముగ వ్యాధిని నివర్తిజేయనగును. ఆకాలమున నుచితములైన యనువాసనవస్తుల నుపయోగించుటచేనైన శీఘ్రముగ నివర్తింపజేయవలెను. "వస్తిమామాసతో ఽష్టమాత్" అనువాక్యముచేత నెనిమిదిమాసముల వరకును గర్భిణికి నుపయోగింపం జనదని నిషేధించియున్నను ఈ యుందావర్తమును క్షణకాలమైన నుపేక్షించినచో గర్భముతోగూడ గర్భిణిని చంపునుకావున నిషిద్ధమైనవస్తికర్మల నాచరించియైనను తత్కాలమున సంభవించిన యాపత్తును తొలగింపనగునని భావము.

కుక్షిలో గర్భము మృతిజెందినలక్షణము.

గర్భేఽతిదోషోపచయాత్ అపథ్యైర్దైవతోఽపి వా. ౨౨
మృతేఽన్తరుదరం శీతం స్తబ్ధం ధ్మాతం భృశవ్యథమ్,
గర్భాఽస్పన్దో భ్రమస్తృష్ణా కృచ్ఛ్రాదుచ్ఛ్వసనం క్లమః. ౨౩
అరతిస్స్రస్తనేత్రత్వం ఆవీనామసముద్భవః.

వాతపిత్తకఫములు మిక్కిలి యుత్కటములై మితిమీరి వృద్ధినొందినను, స్వభావము పరిమితికాలము మున్నగువానికి విరుద్ధములై యహితములైన యాహారవిహారాదుల

సల్పినను, గర్భము తల్లి కుక్షిలోపల నేమృతి జెందును. లేక పూర్వజన్మకృత శుభాఽశుభ కర్మరూపమైన దైవయోగముచేగూడ గర్భము మృతిజెందును. అట్టియెడ గర్భిణియొక్క ఉదరము చేత తాకిన చల్లబడియుండును. స్తంభించి గాలిచేనిండిన తోలుతిత్తివలె నుబ్బి మిక్కిలి బాధకల్గియుండును. గర్భముకదలదు. ఒడలు తిరుగునట్లుండును, దప్పియధికమగును. ఉచ్ఛ్వాసముమిక్కిలి కష్టముచే వెడలును. బడలికకల్గును. పరుండుటకును కూర్చుండుటకును నిలబడుటకును దేనియందును మనసుపొందకుండును. కన్నులు స్వస్థానమునుండి చలించినవిధముగ సడలియుండును. ప్రసవసమయమున సంభవించు ప్రసవనిమిత్తములైన నొప్పులు కల్గకుండును. ఇట్టిలక్షణములు కల్గిననాడు గర్భముకుక్షియంద మృతినొందెనని స్ఫుటముగ నెరుంగునది.

మూఢ (మృతినొందిన) గర్భమును వెలకిందీయునుపాయము.

తస్యాః కోష్ణాఽమ్బుసిక్తాయాః పిష్ట్వా యోనిం ప్రలేపయేత్.
గుడం కిణ్వం సలవణం తథాఽన్తః పూరయేన్ముహుః,
ఘృతేన కల్కీకృతయా శాల్మల్యతసిపిచ్ఛయా. ౨౧
మన్త్రైర్యోగైర్జరాయూక్తైః మూఢగర్భో నచేత్పతేత్,
అథాఽఽపృచ్ఛ్యేశ్వరం వైద్యో యత్నేనాశు తమాహరేత్.
హస్తమభ్యజ్య యోనిం చ సాజ్యశాల్మలిపిచ్ఛయా,
హస్తేన శక్యం తేనైవ గాత్రం చ విషమం స్థితం. ౨౭
ఆక్షిప్యోత్పీడ సంపీడ విక్షేపోత్క్షేపణాదిభిః,
అనులోమ్య సమాకర్షేత్ యోనిం ప్రత్యార్జవాగతమ్. ౨౮

పై జెప్పినరీతిగ గర్భము కుక్షిలో మృతినొందినపుడు కొంచెముగ వేడియైననీళ్లను స్త్రీపైజల్లి బెల్లమును సురాబీజమును ఉప్పునుకలిపి నూరి యోనిమార్గమునకు బూయవలెను! బూరుగబంకను అగసెబంకను నెయిబోసి నూరి కల్కముజేసి యోనియందు నిండింపవలెను. ఇత్తెరంగున పలుమారుచేయుచు మావిపడుటకై అథర్వవేదమున జెప్పిన మంత్రముల జపించునది. ఇట్టి యుపాయములచే మూఢగర్భము పడనియెడ పరిపాలకుడైన ప్రభువుయొక్క యాజ్ఞనొంది వైద్యుడు మిక్కిలి ప్రయత్నముతో నాగర్భమును వెలికిందీయబూనవలెను. ఎట్లనగా— బూరుగబంకను నేతితో మెత్తగనూరి చేతికి బూసికొని ప్రసవమార్గమునకుబూసి గర్భముచేత వెలికిందీయసాధ్యమైయున్నయెడ అట్టి చేతితో వెలికిందీయనగును. గర్భముయొక్క శరీరము కుక్షిలో వ్యత్యస్తముగ నున్నపుడు నిలువుగ నిలబెట్టుట, ఉత్పీడనము (పైకిచేతపిసుకుట), శరీరమునందంతట మర్దనము జేయుట, విశేషముగ కదలించుట, పైకెత్తుటమున్నగు నుపాయములచే గర్భమును అను

లోమముగ త్రిప్పికొని యోనికిసరియైన మార్గమునకు గర్భము మరలినప్పుడు గర్భమును వెలికిందీయనగును.

### విష్కంభమను మూఢగర్భము.

హస్తపాదశిరోభిర్యో యోనిం భుగ్నః ప్రపద్యతే,
పాదేన యోనిమేకేన భుగ్నోఽన్యేన గుదం చ యః. ౨౯
విష్కమ్భౌ నామ తౌ మూఢౌ శస్త్రదారణమర్హతః,

గర్భము ఒకహస్తముచేనైనను, ఒక కాలిచేనైనను, శిరస్సుమాత్రముచేనైనను వక్రముగ యోనిద్వారముజేరినను; ఒకపాదముచే యోనిద్వారమును, రెండవపాదముచే గుదద్వారమును జేరి కుటిలమైయున్నను ఈరెండును విష్కంభంబను మూఢగర్భము లనబడును. ఈ రెంటియందును శస్త్రముచే దారణము (చీల్చుట) అను శస్త్రకర్మముల జేయుంట యుచితము. (హస్తముచె వెలికిందియ వలనుపడదనుట.)

### విష్కంభమున శస్త్రప్రయోగము.

మణ్డలాఙ్గులిశస్త్రాభ్యాం తత్ర కర్మ ప్రశస్యతే. ౩౦
వృద్ధిపత్రం హి తీక్ష్ణాగ్రం న యోనావవచారయేత్,

పైజెప్పిన విష్కంభమను మూఢగర్భమునందు శస్త్రవిధ్యధ్యాయమున జెప్పబడిన మండలాగ్రము, అంగులిశస్త్రము అను శస్త్రములరెండిటిచే దారణముజేయందగును. వృద్ధిపత్రమను శస్త్రము మిక్కిలి వాడియైన యగ్రము కల్గియుండును కావున యోని యందట్టిశస్త్రము నొకప్పుడు నుపయోగింపంజనదు.

### పైజెప్పిన మూఢగర్భమున శస్త్రవిధిజేయవలసినక్రమము.

పూర్వం శిరఃకపాలాని దారయిత్వా విశోధయేత్. ౩౧
కక్షోరఃస్తాలు చిబుకే ప్రదేశేఽన్యతమే తతః,
సమాలమ్బ్య దృఢం కర్షేత్ కుశలో గర్భశంకునా. ౩౨
అభిన్నశిరసం త్వక్షికూటయోః గణ్డయోరపి,

పైజెప్పిన మూఢగర్భమును ఛ్ఛేదించునపుడు శస్త్రకర్మయందు నేర్పరియైన వైద్యుడు తొలుత తలను ఛ్ఛేదించి తలయందలి కపాలాస్థులను నిశ్శేషముగ కోష్ఠము నుండి వెలికిందిసి పిమ్మట గర్భముయొక్క చంకయందైనను, రొమ్మునందైనను, దవుడల యందైనను గర్భశంకువను సాధనముచే దృఢముగపట్టుకొని లాగి వెలికిందియవలెను. శిరస్సును ఛేదించనియెడ గర్భమునందలి శిశువుయొక్క కణతలయందైనను చెక్కిళ్ల

యందైనను గర్భశంకువుతో దృఢముగపట్టి మెలకువతో లాగి వెలికిందీయవలెను. (ఇది శిరస్సుచే నడ్డపడిన విష్కంభమూఢగర్భమున చేయదగినవిధానము.)

మరియొక శస్త్రకర్మవిధానము.

బాహుం ఛిత్త్వాఽంససక్తస్య వాతాధ్మాతోదరస్య తు. 33
విదార్య కోష్ఠమన్త్రాణి బహిర్వాసం నిరస్య చ,

ఒకచెయ్యిమాత్రము బైటవచ్చి భుజ శిరస్సుచే తగులుకొనియుండు మూఢగర్భమును అట్టిబాహువును తొలుత ఛేదించి గర్భమును గర్భశంకువుచే దృఢముగ పట్టుకొని వెలికిందీయునది. (కుడిచెయ్యి బైటవచ్చియున్నయెడ కుడిచేతిని ఎడమచెయ్యి బైటవచ్చి యున్నయెడ నెడమచెయ్యినిఛేదించి పిమ్మట గర్భమును లాగవలెననిభావము.) గర్భశిశువు వాతమునిండి కడుపుపెద్దదిగనుబ్బి బైటవెడలకుండునపుడు అట్టిశిశువుయొక్క కోష్ఠము (ఆమాశయపక్వాశయములు)ను శస్త్రముచే చీల్చి ప్రేవులను నిశ్శేషముగ వెలికిందీసి పిమ్మట శిశువును వెలికిందీయవలెను.

కటీసక్తస్య తద్వచ్చ తత్కపాలాని దారయేత్. 3౪

శిశువుయొక్క కటిభాగముచే నడ్డగింపబడియుండునపుడు పైజెప్పిన రీతిగ చీల్చి యందలి యెముకముక్కల నన్నిటిని మెలకువతో వెలికిందీసి శిశువును నిశ్శేషముగ లాగి వెలిబుచ్చునది.

మూఢగర్భమున సామాన్యముగ జేయవలసిన శస్త్రవిధానము.

యద్యద్వాయువశాదఙ్గం సజ్జేద్గర్భస్య ఖణ్డశః,
తత్తచ్ఛిత్త్వా హరేత్సమ్యక్ రక్షేన్నారీం చ యత్నతః. 3౫

మరియు వాత ప్రకోపమునంజేసి గర్భశిశువుయొక్క అంగములతో నేయేయంగ మడ్డుపడి శిశువువెలికిరాకయుండునో ఆయాయంగములనెల్ల పైజెప్పినవిధముగ శస్త్రముచే ముక్కలజేసి మిక్కిలిమెలకువతో వెలికిందీయునది. ఆవిధముగ ఛేదించునపుడు ఒకవేళ శస్త్రము తల్లియొక్క శరీరమున తగిలినయెడ స్త్రీకి నపాయము సంభవించును; కావున అటుకాకుండ తల్లికపాయముగల్గనీయక తగుజాగ్రత్తతో స్త్రీనికాపాడవలెను.

మూఢగర్భమున సమయోచితశస్త్రవిధానము.

గర్భస్య హి గతిం చిత్రాం కరోతి విగుణోఽనిలః,
తత్రాఽనల్పమతి స్తస్మాత్ అవస్థాపేక్షమాచరేత్. 3౬

వాతము ప్రకుపితమైనయెడ గర్భముయొక్క గతిని చిత్రచిత్రముగ నానావిధములుగ గల్గించును. అట్టిసందర్భమున మిక్కిలిప్రజ్ఞాశాలమైన యూహాకలవైద్యుడు ఆయా

యవస్థాభేదము ననుసరించి శస్త్రకర్మమునందు జెప్పబడని పద్ధతులనుగూడ తత్తదనుగుణముగా గల్పించి సమయోచిత కృత్యమును జేయనగును.

సజీవగర్భమున శస్త్రకర్మనిషేధము.

ఛిన్ద్యాద్గర్భం నజీవన్తం మాతరం సహి మారయేత్,
సహాత్మనా నచోపేక్ష్యః క్షణమప్య స్తజీవితః. 3౭

వైద్యుడు తొలుత గర్భమునందలి శిశువు ప్రాణముతోనున్నదా? లేదా? అను సంగతిని లక్షణములబట్టి నిశ్చయించుకొనవలెను. శిశువు మృతిజెందినయెడ పైజెప్పినరీతిగ దారణాదిశస్త్రవిధానమును జేయవలెను. ఒకవేళ మందమతియగు వైద్యుడు సజీవముగనున్న శిశువును నిర్జీవమని పొరబడి శస్త్రకర్మచేసినయెడ అశిశువు వచ్చునదియే కాక తల్లినికూడ తప్పక చంపును. కావున జీవముతోనున్నశిశువు నొకప్పుడును ఛేదింపదగదు. మరియు శిశువు కుక్షిలోనే మృతిజెందినచో నొకక్షణమైన నుపేక్షింపకతోడనే శస్త్రవిధానముచే శిశువును వెలికిందీయవలెను.

మూఢగర్భమునందసాధ్యలక్షణములు.

యోనిసంవరణభ్రంశమక్కల్లశ్వాసపీడితామ్,
పూత్యుద్గారాం హిమాఙ్గీం చ మూఢగర్భాం పరిత్యజేత్. 3౮

గర్భమున శిశువుమృతిజెందినస్త్రీకి యోనిమూసికొనియున్నను, యోనిస్వస్థానము నుండి చలించినను, మక్కల్లము (శిరస్సునందును వస్తియందును కోష్ఠమునందును శూలరూపమైన సూలికారూపము) చేతను శ్వాసముచేతను పీడింపబడినను, త్రేనుపులుదుర్గంధముతోగూడివెడలినను, శరీరమెల్ల చల్లపడియున్నను అట్టిస్త్రీ బ్రతుకుట దుష్కరము కావున చికిత్స జేయంజనదు.

మూఢగర్భమును దీసినపిదప జేయవలసినకృత్యము.

అథాఽపతన్తీ మపరాం పాతయేత్పూర్వవద్భిషక్,
ఏవం నిర్హృతశల్యాం తు సిఞ్చే దుష్ణేన వారిణా. 3౯
దద్యాదభ్యక్తదేహాయై యోనౌ స్నేహపిచుం తతః,
యోనిర్మృదుర్భవేత్తేన శూలం చాస్యాః ప్రశామ్యతి. ౪౦

పైజెప్పినరీతిగ మూఢగర్భమును శస్త్రముచే వెలికిందిసినపిదప మావి పడకయున్నయెడ మావిపడుటకుమున్ను "హిరణ్యపుష్పీ మూలంచ" ఇవిమున్నగు వాక్యములచే జెప్పిన విధానములజేయవలెను. ఇత్తెరంగున గర్భశల్యము నిశ్శేషముగ వెడలించినపిదప వేడినీళ్లచే స్త్రీకి స్నానము జేయించవలెను. పిమ్మట శరీరముపైని యభ్యంజనము జేసి ప్రత్తివత్తిని

నేతితో దడిపి ప్రసవమార్గమున నుంచవలెను. [illegible]. అందుకల్గిన పోటు నివృత్తించును.

చికిత్సలు-ఆహారాదినియమము.

దీప్యకాఽతివిషారాస్నాహింగ్వేలాపఞ్చకోలకాత్,
చూర్ణం స్నేహేన కల్కంవా క్వాథం వా పాయయేత్తతః.
కటుకాతివిషాపాఠాశాకత్వక్ హింగు తేజనీః,
తద్వచ్చ దోషస్యన్దార్థం వేదనోపశమాయ చ. ౪౨
త్రిరాత్రమేవం సప్తాహం స్నేహమేవ తతః పిబేత్,
సాయం పిబేదరిష్టం వా తథా సుకృతమాసవమ్. ౪౩
శిరీషకకుభక్వాథపిచూన్ యోనౌ వినిక్షిపేత్,
ఉపద్రవాశ్చ యే ఽన్యే స్యుః తాన్ యథాస్వముపాచరేత్.

పైజెప్పిన యుపచారములజేసిన పిదప ఓమము, అతివస, సన్నరాష్ట్రము, ఇంగువ, ఏలకులు, పంచకోలము వీనినన్నటినిచూర్ణము చేసి నెయ్యిమున్నగు స్నేహద్రవ్యములగలిపి ప్రకృత్యాదుల ననుసరించి తదనుగుణముగ త్రాగించవలెను. లేక పైజెప్పిన ద్రవ్యముల నన్నిటిని నీళ్లుబోసినూరి కల్కముజేసి స్నేహద్రవ్యమున గలిపి త్రాగించునది. లేక పైజెప్పిన ద్రవ్యములగూర్చి కషాయము పక్వముజేసియైన ద్రావింపనగును. మరియు కటుకరోహిణి, అతివస, చిరుబొద్ది, టేకుచెట్టుపట్ట, ఇంగువ, మాల్కంగిని, వీనినన్నిటిని పైజెప్పినరీతిగచూర్ణముజేసియైనను, కల్కముజేసియైనను స్నేహద్రవ్యముతోగూర్చి త్రాగింపనగును. లేక పైజెప్పినవిధముగ కషాయముకాచియైన నుపయోగింపనగును. ఇట్టి చికిత్స లోపలనుండు దుష్టరక్తము మున్నగు ద్రవముస్రవించుటకు బాధలు నెమ్మదియగుటకును జేయవలెను. ఆరీతిగ మూఢగర్భమును వెడలించిన దినముమొదలు మూడుదినము లాచరించునది. పిమ్మట నేడురాత్రులవరకును అట్టియౌషధముల నిలిపి స్నేహమును మాత్రము త్రాగించవలెను. లేక సాయంకాలమున అరిష్టమునైనను, చక్కగచేయబడిన యాసవములనైనను సేవింపనగును. మరియు దిరిసనమును కకుభమును (ఓషధివిశేషము) కలిపి కాచబడిన కషాయమున దడపబడిన వత్తులనైన యోనిమార్గమున నుంచవలెను. మరియు నాస్త్రీకి జ్వరముమున్నగు రోగములు మూఢగర్భమున కుపద్రవములుగ సంభవించిన యెడ వాని కన్నిటికిని ఆయావ్యాధులకు జెప్పినచికిత్సల జేయవలెను.

మూఢగర్భమున క్రమముగ నాహారాదినియమములు.

పయో వాతహరైః సిద్ధం దశాహం భోజనే హితమ్,
రసో దశాహం చ పరం లఘుపథ్యాఽల్పభోజినా. ౪౪

స్వేదాఽభ్యఙ్గపరా స్నేహాన్ బలాతైలాదికాన్ భజేత్,
ఊర్ధ్వం చతుర్భ్యో మాసేభ్యః సా క్రమేణ సుఖాని చ. ౪౬

ఇత్తెరంగున పదిదినములు గడచినపిదప సన్నరాష్ట్రము మున్నగు వాతహరద్రవ్యములకూర్చి పక్వముజేయబడిన పాలనుకలిపి భుజింపనగును. పిమ్మట పదిదినములవరకును మాంసరసమునుజేర్చి భోజనముజేయవలెను. పిమ్మట పథ్యములును చులకగజీర్ణమగునవియునగు నాహారముల స్వల్పముగ భుజించుచు స్వేదములను అభ్యంగనములను జేసికొనుచు బలాతైలమున్నగు స్నేహముల నుపయోగించుచుండవలెను. ఇత్తెరంగున నాల్గుమాసములు గడపి యైదవమాసము మొదలుజేసి నానాట తనకు సుఖకరములైన యన్నపానాహారవిహారాదుల సల్పునది.

## సూతికావాతములకు బలాతైలము.

బలామూలకషాయస్య భాగాష్షట్ పయసస్తథా,
యవకోలకులుత్థానాం దశమూలస్య చైకతః. ౪౭
నిఃక్వాథభాగో భాగశ్చ తైలస్య చ చతుర్దశః,
ద్వి మేదా దారుమఞ్జిష్ఠా కాకోలీ ద్వయచన్దనైః. ౪౮
సారిబాకుష్ఠతగరజీవకర్షభసైన్ధవైః,
కాలానుసార్యశైలేయవచాఽగురుపునర్నవైః. ౪౯
అశ్వగన్ధావరీక్షీరశుక్లాయష్టీవరారకైః,
శతాహ్వా శూర్పపర్ణ్యేలా త్వక్పత్రైః శ్లక్ష్ణకల్కితైః. ౫౦
పక్వం మృద్వగ్నినా తైలం సర్వవాతవికారజిత్,
సూతికాబాలమర్మాఽస్థిక్షతక్షీణేషు పూజితమ్. ౫౧
జ్వరగుల్మగ్రహోన్మాదమూత్రాఘాతాఽన్త్రవృద్ధిజిత్,
ధన్వన్తరేరభిమతం యోనిరోగక్షయాపహమ్. ౫౨

తైలమునకంటె చిట్టాముట్టివేళ్లకషాయము ఆరింతలును, ఆరింతలు ఆవుపాలును యవలు, కోలములు(రేగుకాయలు)ఉలవలు, దశమూలములు, వీనిని పదుమూడుద్రవ్యములను సమభాగములుగకూర్చి కాచబడినకషాయము తైలమునకు సమభాగము, (ఇత్తెరంగున బలాకషాయము ఆరుపాళ్లును, పాలు ఆరుపాళ్లును, యవకోలాదుల కషాయము ఒకపాలునుకలిసి ద్రవములు పదమూడుపాళ్లగును) పదునాల్గవపాలు నువ్వులనూనె, వీనినొకటిగకూర్చి యుంచునది. అందు. మేద, మహామేద, మ్రానిపసుపు, మంజిష్ఠి, కాకోలి, క్షీరకాకోలి, చందనము, సుగంధపాల, చెంగల్వకోష్టు, గ్రంథితగరము, జీవ

కము, ఋషభకము, సైంధవలవణము, కాలానుసార్యము (నల్లసుగంధపాల), శైలే
యము (రాతిపువ్వు), వస, అగరు, గలిజేరువేళ్లు, పెన్నేరుగడ్డ, వరి, (పిల్లపీచర) క్షీరశుక్ల, (తెల్లనేలగుమ్ముడు) అతిమధురము, త్రిఫలములు (కరక, తాడి, ఉశిరిక), రస(బోలము), సదాప, శూర్పపర్ణి (ఏలికచెవియాకు), ఏలకులు, లవంగపట్ట, లవంగపత్రి, వీనినన్నింటిని సమభాగములుగగూర్చి మెత్తగ చూర్ణముజేసి పైజెప్పినద్రవములతోగూడిన తైలమునకల్కముగ జేర్చునది. అట్టిద్రవకల్కద్రవములతోగూడినతైలమును పొయ్యిమీదనునిచి మృదువైన (తిన్నని) మంటచే పక్వముజేయునది. (పాలుకలిసియున్నందున శీఘ్రముగ పాకమతిక్రమించును కావున స్వల్పమైనమంటతో మెల్లగ పక్వముజేయవలెనని భావము) పరిభాషానుసారముగ తైలపాకవిధిప్రకారము పక్వమును గమనించి దింపవలెను. ఇయ్యది బలాతైలము. ఇది వాతవ్యాధులనన్నిటిని హరించును. నూతనముగ ప్రసవించిన బాలింతరాండ్రకును, పసిబాలురకును, మర్మములయందును, అస్థులయందును, దెబ్బతగిలినవారికిని రసాదిధాతువులు క్షీణించినవారికిని మిక్కిలి హితమైనవి. మరియు జ్వరము, గుల్మము, గ్రహములు, ఉన్మాదము, మూత్రాఘాతము, అంత్రవృద్ధి, అను నీవ్యాధులనన్నిటిని హరించును. మరియు యోనిరోగములను క్షయములను హరించును. ఈతైలము ధన్వన్తరిసమ్మతమైనది.

ఈతైలయోగమునకు పరిభాషానుసారముగ నీయుదాహరణము నెరుంగునది:—తైలము పదునారుపలములు కాచవలసినప్పుడు ద్రవ్యకల్పనవిధము:—చిట్టాముట్టివేళ్లు ఇరువదినాల్గుపలములు, అందు మూడువందల యెనుబదినాల్గుపలములు నీళ్లుబోసి నాల్గవపాలు మిగులునట్లు కషాయముకాచిన తొంబదియారుపలములు మిగులును. ఇది పదునారుపలముల మితమైనతైలమునకు ఆరింతలగును. ఇది బలాకషాయభాగముఆరు, ఆవుపాలును తొంబదియారు. తైలమునకు ఆరింతలగును. యవకోలాదులు పదుమూడును సమభాగములుగగూర్చిన సముదాయము నాల్గుపలములు. అందు అరువదినాల్గుపలములు నీళ్లుపోసి నాల్గవపాలు మిగులునట్లు కాచినయెడ పదునారుపలములు కషాయమగును. ఇది తైలమునకు సమభాగము. ఈద్రవద్రవ్యములన్నియుంగలిసి తైలమునకు పదుమూడుభాగములగును. తైలము పదునాలవభాగము. పదునారుపలములు. దీనికి ప్రతీవాప (కల్క) ద్రవ్యములు మేదమహామేదమున్నగునవి. వానిని ప్రత్యేకమొక్కొకటి అర్ధకర్షము అగుగురిగింజ ప్రమాణముగ గూర్చి కల్కముజేసి తైలమునగూర్చి పక్వముజేయునది. తైలపాకక్రమముగ పాకము నెరుంగునది. పైజెప్పినపద్ధతికి పరిభాషావచనముల జూపెట్టిన గ్రంథవిస్తరమగును కావున నిచ్చట విరమింపబడియె. వానినెల్ల భేషజకల్పమున జూచునది.

గర్భిణి మృతిజెందిన శిశువును వెడలించు శస్త్రవిధి.

వస్తిద్వారే విపన్నాయాః కుక్షిః ప్రస్పన్దతే యది,
జన్మకాలే తతశ్శీఘ్రం పాటయిత్వోద్ధరేచ్ఛిశుమ్. ౫౩

శిశువును ప్రసవించుసమయమున (ఆసన్నప్రసవకాలమున) గర్భిణి మృతిజెందిన యెడ అప్పుడు కుక్షి కదలినచో శిశువు సజీవముగ నున్నదని యెరింగి కుశలుడగు వైద్యుడు అతిశీఘ్రముగ వస్తి ద్వారసమీపమున శస్త్రముచే పగులంజీల్చి శిశువును బైట దీయవలెను.

గర్భస్రావమున చికిత్స.

మధుకం శాకబీజం చ పయసా సురదారు చ,
అశ్మన్తకః కృష్ణతిలాః తామ్రవల్లీ శతావరీ. ౫౪
వృక్షాదనీ పయస్యా చ లతాచోత్పలసారిబా,
అనన్తాసారిబా రాస్నా పద్మా చ మధుయష్టికా. ౫౫
బృహతీద్వయకాశ్మర్యః క్షీరిశృఙ్గత్వచాఘృతమ్,
పృశ్నిపర్ణీ బలా శిగ్రుః శ్వదంష్ట్రా మధుపర్ణికా. ౫౬
శృఙ్గాటకం బిసం ద్రాక్షా కసేరు మధుకం సితా,
సప్తైతాన్ పయసా యోగాన్ అర్ధశ్లోకసమాపనాన్. ౫౭
క్రమాత్సప్తసు మాసేషు గర్భే స్రవతి యోజయేత్,

స్త్రీలకు గర్భోత్పత్తియైన మొదటినెల మొదలుజేసి యేడవనెలవరకును గర్భము స్రవించుచున్న నవ్యాధి నివర్తించుటకై యీక్రింద "మధుకం శాకబీజం చ" అని యుపక్రమించి యేడుఅర్ధశ్లోకములయందు జెప్పబడిన యేడు ఔషధయోగములను వేరు వేరుగ పాలతోగూర్చి వరుసగ నేడుమాసములయందు నుపయోగింపవలెను. ఎట్లులన:— అతిమధురము, టేకుచెట్టుయొక్క విత్తు, దేవదారు, ఈమూడిటిని నూరి పాలతో కలిపి మొదటినెలయందు గర్భముస్రవించునెడ నుపయోగించునది. అశ్మంతకము, నల్లనినువ్వులు, మంజిష్ఠి, పిల్లిపీచర, ఈనాల్గిటిని నూరి పాలతోగలిపి రెండవనెలలో గర్భస్రావము గల్గునెడ నుపయోగించునది. బదనిక, పాలకూర, ఎఱ్ఱనిసుగంధపాల, నల్లనిసుగంధపాల, ఈనాల్గిటిని నూరి పాలతోగలిపి మూడవమాసమున గర్భస్రావము గల్గునెడ నుపయోగింపవలెను. విష్ణుక్రాంత, సుగంధపాల, సన్నరాష్ట్రము, పద్మ (ఓషధివిశేషము.) అతిమధురము ఈయైదిటిని పాలతోనూరి నాల్గవమాసమున గర్భస్రావమగునెడ నుపయోగించునది, వాకుడు, ములక, నేలగుమ్ముడు, పాలుస్రవించు వృక్షములైన మఱ్ఱి, అత్తి, రావి మున్నగు

వృక్షములయొక్క లేత ఊడలు, వానిపట్ట, వీనినైదిటిని నూరి పాలతో గలిపి అయిదవ మాసమున గర్భపాతము కల్గునెడ నుపయోగించునది. కోలపొన్న, చిట్టాముట్టి, మునగ పట్ట, పల్లేరు, మధుపర్ణిక? ఈయైదిటిని పాలతో నూరి యారవమాసమున గర్భపాతముగల్గునెడ నుపయోగించునది. శృంగాటకము, తామరకాడలు, ద్రాక్షపండు, నమ్మదుంప, అతిమధురము, చక్కెర, ఈ యారిటిని పాలతోకలిపి యేడవమాసమున గర్భపాతము కల్గునపు డుపయోగించునది.

### ఎనిమిది - తొమ్మిది - పదిమాసములయందు క్షీరప్రయోగము.

కపిత్థబిల్వబృహతీపటోలేక్షునిదిగ్ధిజైః. ౫౮
మూలైశ్శృతం ప్రయుఞ్జీత క్షీరం సామే తథాష్టమే,
నవమే మాసి వానన్తా పయస్యామధుయష్టిభిః. ౫౯
యోజయేద్దశమే మాసి సిద్ధం క్షీరం పయస్యయా,
అథవా యష్టిమధుకనాగరాఽమరదారుభిః. ౬౦

వెలగవేరు, మారేడువేరు, ములకవేరు, పొట్లవేరు, వాకుడువేరు, వీనినన్నిటిని పాలయందుగూర్చి క్షీరపాకవిధానముగ పక్వముజేసి యాక్షీరమును ఎనిమిదవమాసమున ఆమముతోగూడి స్రవించునపుడు ఉపయోగింపవలెను. విష్ణుక్రాంత, పాలకూర, అతిమధురము, ఈమూడిటినిగూర్చి కాచబడినక్షీరమును తొమ్మిదవమాసమున నుపయోగింపనగును. పదియవమాసమున పాలకూరను జేర్చి కాచబడినపాల నుపయోగించునది. లేక అతిమధురము, శుంఠి, దేవదారువు, వీనినిగూర్చి కాచబడినపాల నుపయోగించునది.

### గర్భమను వృథాభ్రాన్తి.

అవస్థితం లోహితమఙ్గనాయాః వాతేన గర్భం బ్రువతేఽనభిజ్ఞాః,
గర్భాకృతిత్వాత్ కటుకోష్ణతీక్ష్ణైః స్రుతే పునః కేవల ఏవ రక్తే.
గర్భం జడాః భూతహృతం వదన్తిభూతైర్నదృష్టంహరణం యతస్తైః
ఓజోఽశనత్వాత్ అథవావ్యవస్థైః భూతైరుపేక్ష్యేత నగర్భమాతా.

వాతము మిథ్యాహారాదులచే ప్రకోపమునొంది స్త్రీలకు ప్రతిమాసమున వెడలు ఆర్తవరక్తమును అడ్డగించి వెడలనీయక కుక్షియందు నిలుపును. అయ్యది రక్తగుల్మ రూపమునొంది హృల్లాసాది గర్భలక్షణములతో గూడియుండుటంజేసి దానిని గర్భమని భ్రమసి జ్ఞానహీనులగు కొందరు తలంచెదరు. పిమ్మట కొంతకాలమునకు కటురసంబు

లును తీక్ష్ణంబులును ఉష్ణంబులునునగు నాహారాదులచే వాతము హరించి యార్తము మాత్రము స్రవించినపుడు గర్భము భూతములచే నపహరింపబడెననియు వ్యక్తిలేక వచించెదరు. భూతములచే నపహరింపబడునది మన కగపడదుకదా? ఒకవేళ ఓజస్సును భుజించుటయందు మిక్కిలి మక్కువకల్గియుండుట భూతములకు సహజము. అట్టి యాసచే నొకవేళ భూతములు మనకును తెలియనీయక గర్భము నపహరించునేమో యని యూహింపవచ్చునుగాని అట్టియాస భూతముల కుండినయెడ గర్భము స్వల్పమైనది. అంతకన్న తల్లినే భుజింప యత్నించినయెడ నంతకన్న తృప్తి యధికమగును కదా? అధికలాభమునువదలి గర్భమునుమాత్రము భూతములు తెలివిలేక యపహరింప జూచునా! ఇట్టిపిచ్చియూహ తెలివితక్కువయగుటచే గల్గునుగాని సయుక్తికముగా దోపదు. కావున వాతప్రకోపమున కొన్నిమాసములవరకును బుతుశోణితము వెడలక నిలిచియుండును. అట్టిరక్తము తగినకారణములు సంభవించినపుడు మరల వెడలును.

# తృతీయాధ్యాయము.

అవ.—పైయధ్యాయమున గర్భవ్యాపత్తుల జెప్పుచు మూఢగర్భమునందు శస్త్ర విధానముచే గర్భాహరణక్రమము చెప్పబడినది. అయ్యది అంగప్రత్యంగ పరిజ్ఞానము నపేక్షించియుండును కావున నీయధ్యాయమున అంగప్రత్యంగ విభాగము వివరింప బడును.

సూ. అథాతోఽఙ్గవిభాగం శారీరం వ్యాఖ్యాస్యామః

గర్భవ్యాపత్తుల వివరించినపిదప శరీరముయొక్క అంగప్రత్యంగరూపమైన విభాగమును వివరించు శరీరసంబంధమగు విషయమును దెలుపునధ్యాయమును జెప్పెద ననిభావము.

## అంగప్రత్యంగవిభాగము.

శిరోఽన్తరాధిర్ద్వౌ బాహూ సక్థినీ చ సమాసతః,
షడఙ్గమఙ్గం ప్రత్యఙ్గం తస్యాక్షిహృదయాదికమ్. ౧

శరీరమున ఆరంగములు చేరియుండును:—శిరస్సు, రెండుబాహువులు, రెండు కాళ్లు, కాళ్లకును బాహు - శిరస్సులకు సంబంధించి యాధారముగనున్న మధ్యభాగం బును, ఈయారును జేరిన శరీరము షడంగమని చెప్పబడును. (అనగా ఆరుప్రధానాం గములు కల్గినది. అనిభావము.) అట్టిశరీరమునకు కన్నులు ముక్కులు చెవులు హృద యము, పాదములు మున్నగునవి ప్రత్యంగములు. నేత్రములుమున్నగునవి ప్రధానము లగుశిరస్సు మున్నగు ప్రధానాంగములకు అవయవములై యుండును, కావున అవి ప్రత్యం గములని చెప్పబడును. ఇది యంగప్రత్యంగముల సంగ్రహరూపమైన విభాగము.

## పంచభూతములు, వానిగుణములు.

శబ్దస్స్పర్శశ్చ రూపం చ రసో గన్ధః క్రమాద్గుణాః,
ఖాఽనిలాఽగ్న్యప్భువాం ఏకగుణవృద్ధ్యన్వయః పరే. ౨

ఆకాశము, వాయువు, అగ్ని, అప్పు (జలము), పృథివి (భూమి) అను నీ యైదును పంచమహాభూతములు. ఈయైదును శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, అనునీ యైదుగుణములను వరుస నొక్కొకదానియందును కల్గియుండును.

(ఆకాశమున శబ్దంబును, వాయువున స్పర్శంబును, అగ్నియందు రూపంబును, జలమున రసంబును, పృథివియందు గంధంబును గుణంబులై స్వభావసిద్ధములుగ నుండుననిభావము.) మరియు నీయైదిటిలో ఆకాశమున శబ్దంబనుగుణం బొక్కటిమాత్రమే సైజముగ నుండును. తక్కంగలవాయువు, అగ్ని, జలము, పృథివియను నాల్గిటియందును ఒక్కొక గుణము అధికముగ వృద్ధినొంది సంబంధించియుండును. ఎట్లనగ:—వాయువునందు ఆకాశగుణంబైనశబ్దంబును స్పర్శంబును ఈరెండుగుణము లుండును. అగ్నియందు వాయువునందలి శబ్దస్పర్శంబులును రూపంబును జేరి మూడుగుణంబులుండును. జలమున అగ్నియందలి శబ్దస్పర్శరూపంబులును రసంబునుకలిసి నాల్గుగుణంబు లుండును. పృథివియందు జలమునందలి శబ్ద - స్పర్శ - రూప - రసంబులు నాల్గును గంధంబు నుకలిసి యైదుగుణంబు లుండును. ఇత్తెరంగున ఆకాశమునకు వెనుకనుండు నాల్గుమహాభూతములయందును క్రమముగ ఒక్కొకగుణము వృద్ధినొందుచు సంబంధించియుండును. ఆకసమునకు ముందు వేరొండుభూతములేదు కావున ఆకాశమునందు శబ్దగుణం బొక్కటిమాత్రమే యుండును.

పంచభూతములయొక్క యుత్పత్తి క్రమము తైత్తిరీయోపనిషత్తున నిట్లు చెప్పబడినది:—పరమాత్మస్వరూపమునుండి తొలుత నాకాశమను మహాభూతము పుట్టును. పిదప నందుండి వాయువును, దానినుండి యగ్నియు, దానినుండి జలంబును, దానివలకి పృథివియు వరుసగ బుట్టును. ఈపంచమహాభూతములలో వాయువు మున్నగు నాల్గును ఆకాశమును మొదలుజేసి యొకదానినుండి వేరొకటి పుట్టుటవలన నొకదానిగుణ మింకొకదానికి సంక్రమించుచుండును. భగవంతునిసృష్టికి లోనగు చరాచరాత్మకమైనవస్తుసముదయంబెల్ల పంచభూతాత్మకమైయుండును. కావున జీవునకు పురాకృతకర్మవశమునం జేసి సంభవించు స్థూలసూక్ష్మశరీరములును పైజెప్పిన పంచభూతాత్మకమై యుండును. అట్టివిషయమును వివరించుటకై యిచ్చట పంచభూతములు జెప్పబడియె.

## పంచభూతములచే గల్గు శరీరావయవవిభాగము.

తత్ర ఖాత్ ఖాని దేహేఽస్మిన్ శ్రోత్రం శబ్దోవి విక్తతా,
వాతాత్ స్పర్శత్వగుచ్ఛ్వాసాః వహ్నేర్దృగ్రూపపక్తయః.
ఆప్యా జిహ్వా రసక్లేదాః ఘ్రాణగన్ధాస్థి పార్థివమ్,

స్థూలరూపముగ పరిణమించిన మనుష్యాదిజంతువుల శరీరమునందలి రంధ్రములును, శ్రవణేంద్రియమున కధిష్ఠానమైన శ్రోత్రంబును, నాదంబును, బయలును, పంచమహాభూతములలో సత్వగుణప్రధానమైన యాకాశమువలన కలుగును. రజోగుణ

బహుళంబైన వాయువువలన స్పర్శంబును, స్పర్శేన్ద్రియమున కధిష్ఠానమైనత్వక్కును, ఉచ్ఛ్వాసరూపమైన ప్రాణవాతంబును కల్గును. సత్వరజోగుణ బహుళంబైన యగ్ని వలన చక్షురింద్రియమున కధిష్ఠానమైనదృష్టియు, రూపంబును, పచనశక్తియుఁ గల్గును. (తేజస్సు, పిత్తము, వేడి, బుద్ధి, నీలపీతాదివర్ణములు, శౌర్యాదిగుణములుగూడ యగ్ని వలననే కల్గునుకావున నిచ్చట "త్వగ్రూపపక్తయః" అనునది యుపలక్షణము). సత్వతమోగుణ బహుళంబగు జలమువలన నాలుకయందు రసనేంద్రియమున కధిష్ఠానమైన భాగంబును, రసగుణంబును, ద్రవరూపమైన భాగంబును కల్గును. (ఇచ్చట క్లేదశబ్దము చేత స్వేదము మూత్రము మున్నగు ద్రవరూపములన్నియుఁ గ్రహింపబడును) తమోగుణ బహుళంబగు పృథివి మహాభూతమువలన నాసికయందు ఘ్రాణేంద్రియమున కధిష్ఠాన మైన యొకభాగంబును, గంధగుణంబును, అస్థిభావంబును కల్గును.

ఇచ్చట నీవిషయము నెఱుంగునది:—శరీరము పంచమహాభూతముల మిశ్రమునం జేసి కల్గును. అందు ఆకాశముచే గల్గునని చెప్పినరంధ్రములు మున్నగువాని యందును పంచభూతములభావములు కలిసియే యుండును. (అయినను ఘటము చక్రదండాది సంబంధముచే గల్గినను మృత్తు ప్రధానముగ నుండుటంజేసి మృద్వికారమని వ్యవహరింపబడువిధముగ) ఆకాశగుణంబధికముగ నుండుటవలన ఆకాశమువలన బుట్టిన దని వ్యవహరింపబడును. ఇత్తెరంగుననె తక్కినవానికిని తెలియునది.

### మాతృజ - పితృజ - ఆత్మజ వస్తువివరణము.

మృద్వత్ర మాతృజం రక్తమాంసమజ్జగుదాదికమ్. ౪
పైతృకం తు స్థిరం శుక్రం ధమన్యస్థికచాదికమ్,
చైతనం చిత్తమక్షాణి నానాయోనిషు జన్మ చ. ౫

మనుజుల పాంచభౌతికశరీరమునం దనేకసామగ్రులున్నవి. అందు రక్తము, మాంసము, మజ్జ, గుదము మున్నగు మృదువైనపదార్థములు తల్లివలన పుట్టినవి. ఆది శబ్దముచేత యకృత్తు, ప్లీహము, హృదయము, నాభి, ఆన్త్రములు మున్నగునవిగూడ తల్లివలన పుట్టునవియని యర్థము.

శుక్రము, ధమనులు, అస్థులు, వెండ్రుకలు మున్నగు కఠినపదార్థము లన్నియుఁ తండ్రివలన బుట్టినవి. ఆదిశబ్దముచేత గోళ్లు, దన్తములు, సిరలు, స్నాయువులు మున్నగు స్థిరపదార్థములును తండ్రివలన బుట్టునవియని యర్థము

చిత్తము, చక్షురాదీన్ద్రియములు, నానావిధజన్తువులయందు జనించుట మున్నగునవి ప్రాకృతశుభాఽశుభకర్మబీజభూతమగు నాత్మవలన కల్గును. మరియు జ్ఞానము,

విజ్ఞానము, ఆయుస్సు, సుఖము, దుఃఖము, కామము, క్రోధము, లోభము, భయము, మదము, హర్షము, మాత్సర్యము, ఈర్ష్య, అసూయ, ధర్మాఽధర్మస్వభావము, స్మృతి, ఇచ్ఛాద్వేషములు, మున్నగునవికూడ ఆత్మజములని యెరుంగునది.

—సాత్మ్యజములు.—

సాత్మ్యజం త్వాయురారోగ్యం అనాలస్యం ప్రభా బలమ్,

సాత్మ్యమన అన్నవిహారాదులను శరీరమునకు సుఖమును కల్గించువిధముగ నానాట వాడుకజేసి యుపయోగించుట, అట్టియుపయోగము వ్యాధి సాత్మ్యమనియు, దేశసాత్మ్యమనియు, దేహసాత్మ్యమనియు మూడు తెరంగులు. ఇచ్చట శరీరవిషయము ప్రస్తుతమగుటచేత దేహసాత్మ్యము వివక్షితము, అట్టిసాత్మ్యమువలన బుట్టినవి. సాత్మ్యజము. మనుజులకు ఆయువ్యము, ఆరోగ్యము, అనాలస్యము (పనులయం దుత్సాహము కల్గియుండుట), కాంతి, అమోఘమైనశక్తి, ఇవి మున్నగునవి సాత్మ్యమువలన బుట్టును. (తాను పైజెప్పినవాని కనుకూలములగు నాహారవిహారాదుల నలవాటుజేసియుండిన యెడ దానివలన కల్గునని భావము).

—రసజములు.—

రసజం వపుషో జన్మ వృత్తిర్వృద్ధిరలోలతా. ౬

తాను భుజించినయాహారము పక్వమై రసరూపము నొందును. అట్టియాహార రసమువలన బుట్టినది రసజము. సకలమైనశరీరముయొక్క జన్మంబును, జీవశరీరములకుగల సంబంధ రూపమైన వర్తనంబును, శరీరముయొక్క వృద్ధియు, అలోలత్వంబును, ఇవి యన్నియు శరీరపుష్టి తృప్తి మున్నగునవియు నాహారరసమువలన కల్గును.

—సత్వ-రజ-స్తమోగుణములచే గల్గులక్షణములు.—

సాత్వికం శౌచమాస్తిక్యం శుక్లధర్మరుచిర్మతిః,
రాజసం బహుభాషిత్వం మానక్రుద్దమ్భమత్సరాః. ౭
తామసం భయమజ్ఞానం నిద్రాఽఽలస్యం విషాదితా,
ఇతి భూతమయో దేహః.

(సత్వగుణమువలన బుట్టినది సాత్వికము.) శౌచమన పరిశుద్ధత. అయ్యది శరీరమునకును వాక్కునకు మనస్సునకు సంబంధించియుండుటచే మూడువిధములు. అందు సత్యవాక్యముల బల్కుట, వేదముల జదువుట మున్నగునవి వాక్కునకు సంబంధించిన శౌచము. మృత్తు జలము మున్నగువానిచే శాస్త్రోక్తముగ శరీరమును కడిగికొనుట కాయిక శౌచము. భూతదయ మున్నగునవి కల్గియుండుట మానసికశౌచము అట్టి మూడువిధము

లగు శౌచంబులును సత్వగుణమువలన కల్గును. దేవుడొకడు కర్మసాక్షిగ నున్నాడను నిశ్చయజ్ఞానము ఆస్తిక్యము. ఆయ్యాదియు సత్వగుణమువలన గల్గును. పరిశుద్ధమైన ధర్మమునం దభిరుచియు, ప్రకృష్టమైనజ్ఞానంబును సత్వగుణముచే గల్గును. (మరియు కృతజ్ఞత్వము, దాక్షిణ్యము, వ్యవసాయము, శౌర్యగాంభీర్యములు, స్మృతి, మేధ మున్నగునవియు సత్వగుణమువలన కల్గును.)

(రజోగుణమువలన బుట్టునది రాజసము) విధినియమములేక యధికముగమాటలాడుట, మానము, క్రోధము, దంభము, మత్సరము ఇవియన్నియు రజోగుణముచేబుట్టును. (దురుపచారత, పెద్దల నవమానించుట, గురువుల ధిక్కరించుటమున్నగునవియు రజోగుణముచే గల్గును.)

(తమోగుణమున గల్గునవి తామసము) భయము, అజ్ఞానము, నిద్ర, ఆలస్యము (పనులయం దుత్సాహము లేకయుండుట), విషాదము, ఇవిమున్నగునవి తమోగుణము వలన కల్గును. ఇత్తెరంగున దేహమునకు పంచభూతముల సంబంధంబును, పంచభూతము వలన పుట్టినక్రమంబును ఎరుంగునది.

## ఏడుత్వక్కుల యుత్పత్తి.

తత్ర సప్త త్వచోఽసృజః ।
పచ్యమానాత్ప్రజాయన్తే క్షీరాత్సన్తానికా ఇవ,

పై జెప్పినరీతిగ పాంచభౌతికశరీరమునందు ధాతువులకు సంబంధించిన యగ్నులచే (వేడిచే) పక్వమగుచున్న రక్తమువలన (నిప్పున కాగి చల్లారినపాలయందు దాని ఘనాంశమైనమీగడ పొరలుగ గట్టువిధముగ) నేడుత్వక్కులు (పొరలు) పుట్టును.

శుక్రశోణితములు పరిపక్వములై దానివలన నేడుత్వక్కులుపుట్టునని సుశ్రుతాచార్యులిట్లు చెప్పిరి:—"తస్య ఖల్వేవం ప్రవృత్తస్య శుక్రశోణితస్య అభిపచ్యమానస్య క్షీరస్యేవ సన్తానికాః సప్తత్వచో భవన్తి" మరియు సప్తత్వక్కుల వివరణము దాని ప్రత్యేకకృత్యములును సుశ్రుతాచార్యులిట్లు చెప్పిరి: —"తాసాం ప్రథమాఽవభాసినీ నామ; యాస్వరవర్ణానవభాసయతి. పఞ్చవిధాంచ ఛాయాం ప్రకాశయతి సా వ్రీహేరష్టాదశభాగప్రమాణా, సిధ్మపద్మకణ్టకాధిష్ఠానా. ద్వితీయా లోహితా నామ— వ్రీహిషోడశభాగప్రమాణా, తిలకాలకన్యచ్ఛ వ్యఙ్గాధిష్ఠానా. తృతీయా శ్వేతా నామ వ్రీహిద్వాదశభాగప్రమాణా చర్మదళాఽజగల్లీ మశకాధిష్ఠానా. చతుర్థీ తామ్రా నామ, వ్రీహేరష్టమభాగప్రమాణా, వివిధకిలాసకుష్ఠాధిష్ఠానా. పఞ్చమీ వేదినీ నామ, వ్రీహిపఞ్చమభాగప్రమాణా,

కుష్ఠవిసర్పాఽధిష్ఠానా. షష్ఠీరోహిణీనామ వ్రీహిప్రమాణా, గ్రన్థ్యపచ్యర్బుద శ్లీపదగళ గణ్డాధిష్ఠానా. సప్తమీ మాంసధరానామ వ్రీహిద్వయప్రమాణా, భగన్దర విద్రధ్యర్శో ఽధిష్ఠానా. యదేతత్ప్రమాణం నిర్దిష్టం తన్మాంసలేష్వవకాశేషు, న లలాటసూక్ష్మాఙ్గు ళ్యాదిషు" ఏడువిధములైన త్వక్కులలో మొదటిది అవభాసినియను పేరు కలది. ఇది భ్రాజకాగ్ని సంబంధమున గౌరాదిసప్తవర్ణములను ప్రకాశింపజేయును. పంచమహా భూతసంబంధమునకును నైదువిధములగుచ్ఛాయలను ప్రకాశింపజేయును. ఇయ్యది యొకవడ్లగింజయందు పదునెనిమిదవ భాగమంతలావు కలిగియుండును. సిధ్మమునకును, పద్మకంటకమునకును అధిష్ఠానమై యుండును.

రెండవది లోహితయనబడును. ఇదివరిగింజలో పదునారవ భాగమంత పరిమితి కలిగియుండును. తిలకాలకము, న్యచ్ఛము, వ్యంగము అనువచ్చలకు ఉత్పత్తిస్థానమై యుండును. మూడవది శ్వేత యను పేరుగలది. ఇది వరిగింజలో పండ్రెండవభాగము పరిమితికల్గి చర్మదళకుష్ఠము, అజగల్లి, మశకము, అను రోగములకు ఉత్పత్తిస్థానమై యుండును నాల్గవది తామ్రయను పేరుకలది. ఇది వరిగింజలో నెనిమిదవపాలు పరి మితికల్గి నానావిధములగు కిలాసము కుష్ఠము మున్నగువానికి ఉత్పత్తిస్థానముగ నుండును. ఐదవది వేదిని యనబడును. ఇది వరిగింజలో నైదవపాలు పరిమాణముకల్గి కుష్ఠములకును విసర్పమునకును ఉత్పత్తిస్థానమై యుండును. ఆరవది రోహిణియను పేరు కలది ఇది వరిగింజంత ప్రమాణముకల్గి గ్రన్థి, అపచి, అర్బుదము, శ్లీపదము (బోద కాలు), గళగండము, అనునీరోగములకు ఉత్పత్తిస్థానమై యుండును. ఏడవది మాంస ధరయనబడును. ఇది రెండువరిగింజలంత పరిమాణముకల్గి భగందరములకును, విద్రధికిని అర్శస్సులకును ఉత్పత్తిస్థానమై యుండును.

మరియు పైజెప్పిన యీప్రమాణములు బలిసియున్న అవయవములయందుమాత్ర ముండునుగాని నుదురుసూక్ష్మములైన వ్రేళ్లమున్నగు స్థలములయం దుండదు. ఇంతకన్న పలుచనై యుండుననిభావము. (పైజెప్పిన పరిమాణభేదముకల యేడుపొరములు జేరి చర్మమొకటిగ శరీరముపై వ్యాపించియుండును)

**సప్తకలలయుత్పత్తి.**

ధాత్వాశయాన్తరక్లేదః విపక్వః స్వం స్వమూష్మణా. ౯
శ్లేష్మస్నాయ్వపరచ్ఛన్నః కలాఖ్యః కాష్ఠసారవత్,
తాస్సప్త

రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము, అనునవి యేడు ధాతువులు. అట్టిధాతువులకును ఈక్రింద జెప్పబడు ఏడు ఆశయములకును నడుమ నుండుద్రవము ఆయాధాతువునందుండు అగ్నియొక్క వేడిమిచేత పక్వయింపబడిన

నయ్యది కలయనబడును. అట్టికలశ్లేష్మముచేతను స్నాయువులచేతను మావినిబోలియున్న పొరచేతను గప్పబడియుండును. అది మిక్కిలి సూక్ష్మమైన యూకారముకలిగి ముదిరిన కొయ్యలో చేవలోపలనుండు విధముగ గానరాకుండును. అది ధాతువులకును ఆశయములకును ఒక్కొకదానినడుమ హద్దుల నేర్పరిచినట్లుండుటంజేసి యేడువిధములనుండును. (రసధాతువు)కును ఆశయమునకును నడుమ నాశ్రయించిన ద్రవము రసధాతువునందలి వేడిచే పక్వమైనది యొకకల. ఇత్తెరంగుననే శుక్రధాతు పర్యంతముగల నొక్కొక ధాతువునకును ప్రత్యేకముగ నొక్కొకకల నూహించునది.) సుశ్రుతమున "కలాః ఖల్వపిసప్త, సమ్భవన్తి ధాత్వాశయాన్తరమర్యాదాః" అని చెప్పియుండుటచే ధాతువులకును ఆశయములకును హద్దు నేరుపరచునది కలలని తెలిసెడి.

పై జెప్పిన యేడుకలల వివరణము సుశ్రుతమున విపులముగ జెప్పబడినది. వాని నిచ్చట నుదాహరణరూపముగ నీక్రింద వివరించెద.

1. మాంసధరాకలా "తాసాం ప్రథమా మాంసధరానామ. యస్యాం మాంసగతానాం సిరాస్నాయుధమనీస్రోతసాం ప్రతానా భవన్తి. యథా బిసమృణాళాని వివర్ధన్తే సమన్తతః, భూమౌ పఙ్కోదకస్థాని తథా మాంసే సిరాదయః"

ఏడువిధములగు కలలలో మొదటికల మాంసధర (మాంసమును ధరించునది) యనబడును. దానియందలి మాంసము నాశ్రయించి సిరలును, స్నాయువులును, ధమనులును, స్రోతస్సులును (పుడమియందలి బురదనీటిని ఆశ్రయించి తామరకాడలు మున్నగునవి వృద్ధినొందు భంగి) వృద్ధినొందును.

2. రక్తధర:—"ద్వితీయా రక్తధరానామ, మాంసస్యాఽభ్యన్తరతస్తస్యాం శోణితం విశేషశ్చ సిరాసు యకృత్ప్లీహ్నోశ్చ భవతి. వృక్షదృధాభిప్రహతాత్ క్షీరిణః క్షీరమావహేత్, మాంసాదేవం క్షతాత్ క్షిప్రం శోణితం సంప్రసిచ్యతే."

రెండవకల రక్తధర (రక్తమును ధరించునది) యనబడును. అయ్యది మాంసముయొక్క లోభాగమున వ్యాపించియుండును. మరియు అట్టి రక్తధరాకలయందును, సిరలయందును యకృత్ప్లీహములయందును విశేషముగ రక్తముండును. పాలతో గూడిన మఱ్ఱిచెట్టు మున్నగువానిని ఛేదించినపుడు అందుండి పాలు గారుచందమున మాంసమును ఛేదించినపుడు రక్తము స్రవించును. (రక్తధరయను కల తెగి యందుండి రక్తముకారునని భావము.)

3. మేదోధర:—"తృతీయా మేదోధరానామ, మేదోహి సర్వభూతానాముదరస్థమణౌ, అస్థిషు చ మహత్సు మజ్జా భవతి. "స్థూలాస్థిషు విశేషేణ మజ్జాత్వభ్యన్తరాశ్రితా, అథేతరేషు సర్వేషు సరక్తం మేద ఉచ్యతే. శుద్ధమాంసస్యయస్స్నేహః సా వసా పరికీర్తితా, తస్యమానస్యవా స్నేహః మేదసస్సా వసా మతా"

మూడవకల మేదోధర (మేదస్సును ధరించునది) యనబడును. ఇయ్యది సకల ప్రాణులయుందరమునందును మిక్కిలి సూక్ష్మాకారముగ నుండును. మిక్కిలి స్థూలములై బొంగులైన యెముకలలో నడుమను, సన్నని యెముకలయందు నుండును. అందు గొప్పయెముకల నడుమనుండునది మజ్జ యనబడును. ఇతరములగు సన్నని యెముకల యందు మేదస్సు రక్తముతో గూడియుండును. శుద్ధమైనమాంసముయొక్క స్నేహము (చమురు)ను మాంసమును పక్వము జేసినప్పుడు అందుండి స్రవించుచమురు వసయన బడును.

4 శ్లేష్మధర:—"చతుర్థీ శ్లేష్మధరానామ, సర్వసన్ధిషు ప్రాణభృతాం భవతి. స్నేహాఽభ్యక్తే యథాహ్యక్షే చక్రం సాధు ప్రవర్తతే, సన్ధయస్సాధు వర్తన్తే సంశ్లిష్టా శ్లేష్మణా యథా"

నాల్గవకల శ్లేష్మధర (కఫమును ధరించునది) యనబడును. ఇయ్యది సకలప్రాణుల కును సంధుల (కీళ్ల) నాశ్రయించియుండును. అట్టి శ్లేష్మము కీళ్లయందు వ్యాపించుటచేత (ఇరుసుకు కందెనబూసినప్పుడు దానివలన చక్రము చక్కగ తిరుగువిధముగ) కీళ్లు చక్కగ చలనాదిక్రియలయందు సామర్థ్యము కల్గియుండును.

5. పురీషధర:-"పఞ్చమీ పురీషధరానామ. యా అన్తః కోష్ఠే మలమభివిభజతే పక్వాశయస్థా. యకృత్సమన్తాత్ కోష్ఠంచ తథాన్త్రాణి సమాశ్రితా, ఉన్డుకస్థం విభజతే మలం మలధరా కలా"

ఐదవకల పురీషధర (మలమును ధరించునది) యనబడును. అయ్యది పక్వాశయముననుండి కోష్ఠమునందలి మలమూత్రములను విభజించుచు యకృత్తునందును, కోష్ఠమునందును, అంత్రములయందును వ్యాపించి ఉండుకమునందలిమలమును విభజించును.

6. పిత్తధర:—"షష్ఠీ పిత్తధరానామ. యా చతుర్విధమన్నపానం ఉపయుక్తం ఆమాశయాత్ప్రచ్యుతం పక్వాశయోపరి స్థితం ధారయతి. అశితం ఖాదితం పీతం లీఢం కోష్ఠగతం నృణామ్, తజ్జీర్యతి యథాకాలం శోషితం పిత్తతేజసా"

ఆరవ కల పిత్తధర (పిత్తమును ధరించునది) యనబడును. ఇయ్యది అశితము, ఖాదితము, పీతము, లీఢము, అను నాల్గువిధములైన యన్నపానములను ఆమాశయమునుండి పక్వాశయమునుజేర్చి పక్వముగ యథాకాలమున జీర్ణింపజేసి ధరించుచుండును.

7. శుక్రధర:—"సప్తమీ శుక్రధరానామ, యా సర్వప్రాణినాం సర్వశరీర వ్యాపినీ. యథా పయసి సర్పిస్తు గుడశ్చేక్షురసే యథా, శరీరేషు తథా శుక్రం నృణాం విద్యాద్భిషగ్వరః"

ఏడవకల శుక్రధర (శుక్రమును ధరించునది) యనబడును. శుక్రము పాలయందు నెయ్యివలెను చెఱకు రసమున బెల్లమువలెను కంటికగపడక లీనమై శరీరమునంతెల్ల వ్యాపించి యుండును. ఈయేడవకల శరీరమునంతెల్ల వ్యాపించి అట్టి శుక్రమును ధరించియుండును.

పై జెప్పబడిన యేడువిధములైన కలలును ఆయా ధాతువులకును ఆశయములకును నడుమ వ్యాపించి హద్దుల నేర్పరించియుండునని యెరుంగునది.

మరియు "కృత్స్నదేహాశ్రితం శుక్రం ప్రసన్నమనసస్తథా, స్త్రీషు వ్యాయచ్ఛతశ్చాపి హర్షాత్తత్సంప్రవర్తతే" అని సుశ్రుతమున జెప్పినప్రకారము సర్వశరీరమున వ్యాపించి శుక్రము మనుజుడు క్రోధము భయము శోకము మున్నగు మనోవికారములు లేక స్వస్థచిత్తుడై స్త్రీలయందు మదనావేశము కల్గి సంభోగముచే బడలినపుడు సంతోషాధిక్యమునం జేసి బైలువెడలునని యెరుంగునది.

## సప్తాశయముల వివరణము.

సప్తచాధారాః రక్తస్యాద్యః క్రమాత్పరే. ౧౦.
కఫామపిత్తపక్వానాం వాయోర్మూత్రస్య చస్మృతాః,
గర్భాశయోఽష్టమః స్త్రీణాం పిత్తపక్వాశయాన్తరే. ౧౧
కోష్ఠాఙ్గాని స్థితాన్యేషు హృదయం క్లోమపుప్ఫుసమ్,
యకృత్ప్లీహోణ్డుకం వృక్కౌ నాభి డిమ్బాఽన్త్ర వస్తయః.౧౨

ఆశయములనగ ఆధారములు. లోకమున జలమునకు ఆధారములగు సరోవరము మున్నగునవి జలాశయములని యెట్లు చెప్పబడునో ఆవిధముగనే రక్తమునకాధారముగనుండునదిరక్తాశయమని చెప్పబడును. తక్కినయాశయములుకూడనిట్లూహించునది. అట్టి యాశయము లేడు. ఎట్లులన:-రక్తమున కాధారమైనది రక్తాశయము. కఫమున కాధారమైనది కఫాశయము. భుజింపబడి జఠరానలముచే పక్వముగాని యాహారపదార్థముల కాధారమైనది ఆమాశయము. పిత్తమునకాధారమైనది పిత్తాశయము. భుజింపబడి జఠరాగ్నిచే పక్వమైన పురీషావస్థనొందిన యాహారమున కాధారమైనది పక్వాశయము. వాతమున కాధారమైనది వాతాశయము. మూత్రమున కాధారమైనది మూత్రాశయము. ఈయేడు ఆశయములును స్త్రీలకును పురుషులకును సమానములుగ నుండును. మరియు స్త్రీలకుమాత్రము గర్భాశయమనునది యెనిమిదవ యాశయము అధికముగనుండును. అయ్యది పిత్తాశయమునకును పక్వాశయమునకును నడుమ నుండును. గర్భమున కాధారమైనది గర్భాశయము.

మరియు పుండరీకాకారమైన హృదయకమలము, క్లోమము, పుప్ఫుసము, యకృత్తు, ప్లీహము, ఉండుకము, వృక్కములు, నాభి, డింభము,ఆంత్రము, వస్తి,అనునివియుం కోష్ఠ (ఉదర)మునకు అంగములు. ఇవి యన్నియు పైజెప్పిన రక్తాశయము మున్నగు నాధారముల నాశ్రయించి యుండును.

మరియు హృదయము మున్నగువాని యుత్పత్తిస్థానాదులు తంత్రాన్తరమున నిట్లు చెప్పబడినది:—"కఫరక్తప్రసాదాత్స్యాద్ధృదయం స్థానమోజసః, చేతనానుగ భావానాం పరమం చిన్తితస్య చ. మాంసపేశీచయో రక్తపద్మాకార మధోముఖమ్ తస్య దక్షిణతః క్లోమయకృత్పుప్ఫుసమాస్థితమ్. సమానవాయు ప్రధ్మాతాత్ రక్తాద్దేహోష్మపాచితాత్, కిఞ్చిదుచ్ఛ్రితరూపస్తు జాయతే క్లోమసంజ్ఞితః. తత్తుల్యహేతుజే ప్లీహయకృతీ భిషజాంమతే, రక్తకిట్టాదుణ్డుకం స్యాత్, పుప్ఫుసో రక్తఫేనజః. మేదోఽసృజః పచ్యమానాత్ స్యాతాం వృక్కౌ ప్రసాదజౌ, నాభిస్సర్వసిరాణాం స్యాత్ ఆధారః శకృతః పునః. డింభం స్యాద్రక్తమాంసస్య ప్రసాదాదన్త్ర సంభవః, సార్ధత్రివ్యామమాత్రాణి పురుషాణాంతు తానిచ. స్త్రీణాం త్రివ్యామమాత్రాణి వస్తిర్మూత్రస్య చాశయః" కఫరక్తముల సారమువలన హృదయము పుట్టును. ఇయ్యది ఓజస్సునకు స్థానమైయుండును. చేతనమునకు సంబంధించిన భావములకును బుద్ధియొక్క కృత్యములకును ప్రధానస్థానమైన యెఱ్ఱతామరపువ్వువంటి యాకారము కల్గిన మాంసక్లోశము అధోముఖముగ నుండును. అట్టి హృదయకమలమునకు కుడిప్రక్క క్లోమంబును, యకృత్తును, పుప్ఫుసంబును నుండును. నాభిస్థానమునుండు సమానవాతముచేత నధికముగ నూదబడి కాయాగ్నిచే పచింపబడిన రక్తమువలన కొంచెముగ నున్నతమైన రూపముకల క్లోమము అనునది పుట్టును. ప్లీహంబును యకృత్తునుకూడ క్లోమమునకు జెప్పినకారణములచేతనే పుట్టును. కాయాగ్నిచే పక్వమైన రక్తముయొక్క మలము వలన ఉండుకము పుట్టును. అట్టి రక్తముయొక్క నురుగువలన పుప్ఫుసము పుట్టును. పచింపబడు మేదస్సువలనను రక్తమువలనను కల్గిన సారమువలన వృక్కములు పుట్టును. నాభి శరీరమున వ్యాపించు సిరలకన్నిటికిని ఆధారమైయుండును. డింభమనునది మలమునకు ఆధారమైయుండును. రక్తముయొక్కయు మాంసముయొక్కయు సారమువలన అంత్రము పుట్టును. (ఇయ్యది పురుషులకు మూడున్నరబారనిడివి కల్గియుండును. స్త్రీలకు మాత్రము మూడుబారనిడివి కల్గియుండును.) మూత్రమున కాధారమైనది మూత్రాశయము (మూత్రపుతిత్తి.)

మరియు నింద్రియముల యుత్పత్తి యష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పబడియె:—"కఫరక్తవాహిస్రోతసాం మహాభూతానాం చ ప్రసాదా దిన్ద్రియాణి, తేష్వపి నేత్రే

శ్లేష్మణః ప్రసాదాత్ శుక్లమణ్డలం తత్పితృజమ్, అసృజః కృష్ణమణ్డలం, తన్మాతృజమ్, మధ్యేదృష్టిమణ్డలం, తదుభయాత్మకమ్. పక్ష్మ-వర్త్మ-శుక్ల-కృష్ణ-దృష్ట్యాఖ్యాని పఞ్చ మణ్డలాని. తత్సన్ధయశ్చత్వారో ద్వౌచాపాఙ్గకనీనికయోః" కఫమును రక్తమునువహించు స్రోతస్సులయొక్కయు పంచమహాభూతములయొక్కయు సారమువలన పంచేంద్రియములును పుట్టును. అందు నేత్రములలో తెల్లగనుండుభాగము (తెల్లగుడ్డు) కఫముయొక్క సారమువలన గల్గును. అయ్యది పితృసంబంధమైనది. రక్తముయొక్క సారమువలన నల్లనిభాగము కల్గును. అయ్యది తల్లిసంబంధమైనది. నడుమనుండుదృష్టి (దృశ్యప్రపంచమును గన్గొను)భాగము మాతృపితృసంబంధమువలన నుభయాత్మకమైయుండును. అట్టినేత్రమునందును పక్ష్మమండలము (కనురెప్పలు), వర్త్మమండలము (రెప్పలకులోభాగము) శుక్లమండలము (తెల్లనిభాగము), కృష్ణమండలము (నల్లనిభాగము), దృష్టిమండలము (చూపుకల్గినభాగము), ననియైదుభాగములు కల్గియుండును. అట్టిమండలములలో రెండేసిమండలములకునడుమ నొక్కొక్క సంధివంతున నాల్గుసంధులును, నేత్రాంతములయందును కన్పాపయందును రెండుసంధులు నుండును.

## జీవితమునకు ముఖ్యస్థానములు.

దశ జీవితధామాని శిరోరసనబన్ధనమ్,
కణ్ఠోఽస్రం హృదయం నాభిః వస్తిశ్శుక్రౌజసీ గుదమ్. ౧౩

శిరస్సుయొక్క సంధిస్థానము నాలుకయొక్క సంధిస్థానము, కంఠము, రక్తము, హృదయము, నాభి, వస్తి, శుక్రము, ఓజస్సు, గుదము, అనునీపదియు ప్రాణములకు ముఖ్యములగు నాధారములైన స్థానములు.

## జాలాది సంఖ్యానిర్ణయము.

జాలాని కణ్డరాశ్చాన్యే పృథక్ షోడశ నిర్దిశేత్,
షట్కూర్చాః సప్త సేవన్యః మేఢ్రజిహ్వాశిరోగతాః. ౧౪
శస్త్రేణతాః పరిహరేత్ చతస్రో మాంసరజ్జవః,
చతుర్దశాఽస్థిసంఘాతాః సీమన్తాః ద్విగుణా నవ. ౧౫
అస్థ్నాం శతాని షష్టిశ్చ త్రీణి దన్తనఖైస్సహ,

జాలములు పదునారు. కండరములును పదునారు. కూర్చములు ఆరు. సీవనులు ఏడు. అయ్యవి మేఢ్రమునం దొకటియు, నాలుకయందొకటియు, శిరంబున నైదు నుండును. ఈసీవనులయందు శస్త్రప్రయోగముజేసిన నపాయము కల్గును. కావున శస్త్రకర్మ జేయంజనదు. మాంసరజ్జువులు నాల్గు, అస్థిసంఘాతములు పదునాల్గు, సీమన్తములు

పదుకొనిమిది. అస్థులు దంతములు గోళ్లనుగూడి మూడువందలును అరువది (ఇవియన్ని యు పైసంఖ్యానియమప్రకారము శరీరమున జేరి యుండును.)

పై జెప్పబడిన జాలకండరాదుల వివరణము తంత్రాన్తరముల గానంబడియెడు. వాని నీక్రింద వివరించెద:—

జాలములు పదియూరు.—"మాంససిరాస్నాయ్వస్థిజాలాని ప్రత్యేకం చత్వారి చత్వారి. తాని మణిబన్ధగుల్ఫసంశ్రితాని, పరస్పరనిబద్ధాని, పరస్పరసంశ్లిష్టాని, పరస్పర గవాక్షితానిచేతి యైర్గవాక్షితమిదం శరీరమ్" అని సుశ్రుతమున జెప్పబడినది. జాలములన శరీరమునకు గవాక్షులబోలె సంబంధించియుండునవి. అయ్యవి మాంసము నకు సంబంధించినవి మాంసజాలములనియు, సిరలకు సంబంధించినవి సిరాజాలము లనియు స్నాయువులకు సంబంధించినవి స్నాయుజాలములనియు, అస్థులకు సంబంధించినవి అస్థి జాలములనియు జెప్పబడును. ఈనాల్గును స్థానభేదముచే నొక్కొకటి నాల్గేసివిధముల నుండును. అందు రెండు చేతులమణికట్లుయందును నాల్గేసియు, చీలమండయందు నాల్గేసియు ఒండొంటకలసి యొకటితో నొకటి గవాక్షికములవలె నొకటితో నొకటి చేరియుండును. ఈవిధముగ రెండుమణికట్లుయందును రెండు చీలమండలయందును ప్రత్యేకముగ మాంససిరాస్నాయు అస్థిజాలములు పదునారగును. అట్టి జాలముచే శరీరముగవాక్షులు కల్గినట్లుండును. కావున జాలములని చెప్పబడుమ. ఈవివరమే తంత్రాన్తరమున నిట్లు చెప్పబడినది:—"సిరాస్నాయ్వస్థిపిశితైః చత్వారి మణిబన్ధనే, ఏకత్రైకత్ర గుల్ఫేచ జాలాన్యేవంతు షోడశ"

కనండరములు పదియూరు:—"వృత్తాస్తు కండరాస్సర్వాః విజ్ఞేయాః" అని సుశ్రుతమున జెప్పినప్రకారము వర్తులములై శరీరముపైని పరపుగ వ్యాపించియుండు స్థూలములైన స్నాయుభేదములే కండరములనబడును. తంత్రాంతరమున వానిస్థానము లిట్లు చెప్పబడినవి:—"హస్తయోర్ద్వే పాదయోర్ద్వే గ్రీవాభాగేఽథ పృష్ఠతః, ప్రతే కంతు చతస్రస్స్యుః కణ్డరా ఇతి షోడశ" అట్టి కండరములు చేతులలో నొక్కొ క్కచేతియందు మణికట్టుమొదలు చంకలవరకును రెండేసిచంతున వ్యాపించియుండును. పాదములయందు మీగాళ్లమొదలు కటిభాగమువరకు రెండేసిచంతున వ్యాపించియుం డును. మెడకు నిరువంకల వ్యాపించియుండునవి నాలుగు. వీపున వెన్నెముకకు ఇరు ప్రక్కల వ్యాపించునవి నాలుగు. ఇవి యన్నియు జేరి కండరములు పదునారు అగును.

ధమనులయొక్కయు స్నాయువులయొక్కయు గూటమి కూర్చ యనబడును. అయ్యవి ఆరు:—"కరయోర్ద్వౌ పాదయోర్ద్వౌ గ్రీవాయాం మేహనే తథా, ఏకైక శ్చేతిషట్ కూర్చాః" కూర్చములు రెండుకాళ్లయందు రెండును, రెండుచేతులయందు రెం

దును, మెడపై నొక్కటియు, మేఢ్రముపై నొక్కటియునుండును. ఇవియన్నియు గలిసి కూర్చములు ఆరు.

సీవనులు ఏడు:—"సీవన్యః సప్త కీర్తితాః, పఞ్చ మూర్ధని, ఏకా మేఢ్రేఽథ జిహ్వాయాం భవే యుః పఞ్చ మూర్ధని" ఏడుసీవనులలో నొకటి మేఢ్రమునందును, ఇంకొకటి నాలుక యందును, శిరస్సునందైదు నుండును. ఈసీవనులయందు శస్త్రకర్మ చేయంజనదు. "తాః పరిహర్తవ్యాః శస్త్రేణ" అని సుశ్రుతాచార్యులు శస్త్రకర్మను నిషేధించిరి.

మాంసరజ్జువులన మాంసవికారములైన దారములు. ఇయ్యవి అవయవముల దార్ఢ్యమునకై శరీరమున జేరియుండును. అవి నాల్గు:—"పృష్ఠవంశే హ్యుభయతః చతస్రో మాంసరజ్జవః, బాహ్యే ద్వే అంతరే ద్వే చ" నాల్గు మాంసరజ్జువులలో వీపున వెన్నెముక కుభయపార్శ్వములయందును ప్రక్కకు రెండేసివంతున వ్యాపించియుండును. అందు రెండు పైభాగమునను, రెండు లోభాగమునను ఉండును. ఈరజ్జువులు మాంసపేశులను బంధించునవి.

దృఢములైనయస్థులయొక్క సంయోగము అస్థిసంఘాతము. అయ్యది స్థానభేదముచే పదునాల్గు:—"గుల్ఫే జానుని వంక్షణే, త్రికే శిరసి కక్షాయాం కూర్పరే మణిబన్ధనే, అస్థ్నాం భవేయుస్సంఘాతాః అమీ త్వత్ర చతుర్దశ" అస్థిసంఘాతములు కాలియొక్క చీలమండయందును, మోకాలునందును, గజ్జలయందును ఉండునవి మూడు. రెండవకాలి యందును మూడు. చేతిలో మణికట్టునందును మోచేతియందును చంకయందును ఉండునవి మూడు. ఈరీతి రెండవచేతియందును మూడు. వెన్నెముకకు క్రింది భాగమున నొకటి. శిరస్సున నొకటి. ఇవియన్నియు కలిసి యస్థిసంఘాతము పదునాల్గు.

పైజెప్పిన యస్థిసంఘాతముల (అస్థులసంయోగస్థలముల) యందు కల్గు లేఖావిశేషములు సీమంతములు. అయ్యవి పదునెనిమిది:—"సీమన్తాః పఞ్చ మూర్ధ్ని స్యుః గుల్ఫాదిష్వస్థిసంఘవత్" అట్టి సీమంతములు శిరమున నైదుండును. చీలమండమున్నగు స్థలములయందు జెప్పబడిన యస్థిసంఘాతములయం దొక్కొకటివంతున నుండును. అవి యొక్కొకకాలియందును చేతియందును మూడేసివంతున పండ్రెండును, త్రిక (వెన్నెముకకు క్రింద) స్థానమున నొకటియు. అన్నియు కలిసి పదునెనిమిది యగును. సుశ్రుతాచార్యుడు "చతుర్దశైవ సీమన్తాః......సీమన్తాః ఖల్వష్టాదశైతేషామ్" అనువాక్యముచే పదునాల్గు సీమంతములని తనపక్షముకు జెప్పి పదునెనిమిది సీమన్తములను పక్షాంతరమును జూపియున్నాడు.

అస్థులు మూడువందలు అరువది:—"త్రీణి సషష్టీని అస్థిశతాని వేదవాదినో భాషన్తే. శల్యతన్త్రే తు త్రీణ్యేవాస్థిశతాని. తేషాం అష్టాదశోత్తరం శతం శాఖాసు పంచాధికం శతం శ్రోణిపార్శ్వపృష్ఠోరఃకంఠనాడీషు. గ్రీవాం ప్రత్యూర్ధ్వం సప్తషష్టిః.

ఏవమస్థ్నాం త్రీణి శతాని పూర్యన్తే" మూడువందలు అరువది అస్థులు శరీరమున నుండు నని యాయుర్వేదవేత్తలమతము. శల్యతంత్రమున మాత్రము మూడువందలు అస్థి సంఖ్యయని సిద్ధాన్తము. అందు కాళ్లయందును చేతులయందు నూటపదునెనిమిది యస్థు లుండును. పిరుదులు, ప్రక్కలు, వీపు, రొమ్ము, కంఠనాడి, అనునీ స్థలములయందు నూటఐదు అస్థు లుండును. మెడకు పైభాగమున డెబ్బది యేడస్థు లుండును. ఇవి యన్ని యు కలిసి మూడువందలస్థులు పూర్తియగును. ఈ యస్థుల వివరము తంత్రాంతరముల యందు జూచునది.

మరియు మొత్తముమీద అస్థులు స్థానభేదముచేతను ఆకృతిభేదముచేతను ఐదు విధములుగ నుండునని సుశ్రుతాచార్యు లిట్లు చెప్పిరి:—"ఏతాని పఞ్చవిధాని భవన్తి. తద్యథా - కపాల-రుచక-తరుణ - వలయ-నలకసంజ్ఞాని. తేషాం జానునితమ్బాంసగణ్డ శఙ్ఖశిరస్సు కపాలాని, దశనాస్తు రుచకాని. ఘ్రాణకర్ణ గ్రీవాక్షికోశ కణ్ఠనాడీషు తరుణాని. పాణిపాద పార్శ్వపృష్ఠోరస్సు వలయాని. శేషాణి నలకసంజ్ఞాని" పైజెప్పబడిన యస్థులు కపాలములు, రుచకములు, తరుణములు, వలయములు, నలకములునని యైదు విధములు. అందు మోకాళ్లయందును, పిరుదులయందును, భుజశిరంబులయందును, గండ స్థలములయందును, కణతలయందును, శిరస్సునందు నుండునవి కపాలాస్థులు, దంతములు రుచకములు, ముక్కు, చెవులు, మెడ, నేత్రగోళము, కంఠనాడి, అను నీస్థలములయం దుండునవి తరుణాస్థులు, హస్తములు, పాదములు, రెండుప్రక్కలు, వీపు, రొమ్ము, అను నీస్థలములయం దుండునవి వలయాస్థులు. పైజెప్పిన స్థలములు గాక తక్కినస్థలములయం దుండునవి యెల్ల నలికాస్థులని చెప్పబడును.

సంధిసంఖ్య.

ధన్వన్తరిస్తు త్రీణ్యాహ సన్ధీనాం చ శతద్వయమ్. ౧౮
దశోత్తరం సహస్రే ద్వే నిజగాదాత్రినందనః,

ధన్వంతరి అస్థులు మూడువందలని చెప్పెను. అస్థులయొక్క సంధులు (కీళ్లు, రెండువందల పదియని యును ధన్వంతరి చెప్పెను. ఆత్రేయమహర్షి రెండువేలసంధు లుండు నని చెప్పెను. (వీరిమతమున అస్థుల సంధులేగాక స్నాయువుల సంధులును పేశీలసంధు లును, సిరల సంధులును జేర రెండువేలసంధు లగునని భావము.)

స్నాయుపేశీసంఖ్యావివరము.

స్నావాం నవశతీ పఞ్చ పుంసాం పేశీశతాని చ. ౧౯
అధికా వింశతిః స్త్రీణాం యోనిస్తనసమాశ్రితాః,

స్నాయువులు మనుజుల శరీరమునందు తొమ్మిదివందలుండును. పురుషులశరీరమున పేశులు ఐదువంద లుండును. స్త్రీలకు యోనియందును స్తనములయందును గల పేశులుకూడ జేరి అయిదునూర్లకంటె నిరువది పేశు లధికముగ నుండును.

స్నాయువుల విభాగము సుశ్రుతమున నిట్లు సంగ్రహముగ జెప్పబడినది:—"నవ స్నాయుశతాని. తాసాం శాఖాసు షట్ శతాని. ద్వే శతే త్రింశచ్చ కోష్ఠే. గ్రీవాం ప్రత్యూర్ధ్వం సప్తతిః" శరీరమున స్నాయువులు తొమ్మిదివంద లుండును. అందు కాళ్లయందును చేతులయందును వ్యాపించియుండునవి ఆరువందలు. కోష్ఠమున వ్యాపించియుండునవి రెండువందలుముప్పదియు, మెడకు పైభాగమున వ్యాపించియుండునవి డెబ్బది. ఇవి యన్నియు కలిసి తొమ్మిదివందలు స్నాయువు లగును.

పేశీలవిభాగంబును సుశ్రుతమున నిట్లు చెప్పబడినది:—"పంచ పేశీశతాని భవన్తి. తాసాం చత్వారి శతాని శాఖాసు. కోష్ఠే షట్షష్టిః. గ్రీవాం ప్రత్యూర్ధ్వం చతుస్త్రింశత్." పేశీలు ఐదువందలు. అందు హస్తములయందును పాదములయందును నాలుగువందలును, కోష్ఠమునందు అరువదియారును, కంఠమునకు పైభాగమున ముప్పదినాల్గు నుండును. అన్నియు గలసి ఐదువంద లగును.

పైజెప్పబడిన స్నాయువులు వానిసన్నివేశభేదములచే నాల్గువిధములుగ సుశ్రుతాచార్యునిచే నిట్లు చెప్పబడియె:—"స్నాయుశ్చతుర్విధా విద్యాత్ తాస్తు సర్వా నిబోధ మే, ప్రతానవత్యో వృత్తాశ్చ పృథ్వ్యశ్చ సుషిరా స్తథా. ప్రతానవత్యశ్శాఖాసు సర్వసన్ధిషు చాప్యథ, వృత్తస్తు కణ్డరాస్సర్వాః విజ్ఞేయాః కుశలైరిహ. ఆమపక్వాశయాన్తేషు వస్తౌచ సుషిరాః ఖలు, పార్శ్వోరసి తథా పృష్ఠే పృథులాశ్చ శిరస్యథ నౌర్యథా ఫలకాస్తీర్ణా బన్ధనై ర్బహుభిర్యుతా, భారక్షమా భవేదప్సు నృయుక్తా సుసమాహితా. ఏవమేవ శరీరేఽస్మిన్ యావన్తస్సన్ధయస్స్మృతాః, స్నాయుభిర్బహుభి ర్బద్ధాస్తేన భారసహా నరాః."

స్నాయువులు తీగెలవలె సన్నని యాకారముకల్గి శరీరముపైని వృక్షముపై తీగెలు అల్లువిధముగ వ్యాపించునవి ప్రతానవతులని చెప్పబడును. గుండ్రమైన యాకారము కల్గి వ్యాపించునవి వృత్తము లనబడును. స్థూలములైనవి పృథులములని చెప్పనగును. లోపలసన్ననిరంధ్రములు కల్గినవి సుషిరము లనబరగు. ఇత్తెరంగున స్నాయువులు నాల్గు తెరంగులు. అందు తీగెలబోలినవి హస్త-పాదములయందును సంధులన్నిటియందును వ్యాపించును. వృత్తములు కండరముల వ్యాపించును. రంధ్రములుకలవి ఆమాశయము యొక్కయు పక్వాశయముయొక్కయు అంతములయందును వస్తియందును వ్యాపించి యుండును. లావుగనుండునవి రెండుపార్శ్వములయందును రొమ్మునందును వీపు

నందును శిరంబునందును వ్యాపించియుండును. నావ పలకల బిగిచి గట్టిదారముల నేకములచేత కట్టబడి నీటిలో నునిచి యనేకులు మనుజులు ఎక్కినను అట్టిభారమును మోసి నీటిలో మునుగక నడుచును. ఆతీరుననే శరీరమునందలి సంధులన్నియు పైజెప్పబడిన స్నాయువులచే బద్ధమై యుండుటవలన మనుజులు భారమును మోసికొనజాలియుందురు. కావున స్నాయువులు శరీరమునకు దార్ఢ్యమును గల్గించునవి.

మరియు శరీరమునందు అస్థులును పేశీలును సిరలును సంధులును అనేకములుగ గలవు. అవియును శరీరమున కాధారములే యగును. అయినను పడవకు పలకలు కొయ్యలు మున్నగునవి యనేకముగ నున్నను వాని నన్నిటిని బంధించు దారములు చెడినంతట నావ యుపయోగములేక చెడిపోవునుకదా? ఆవిధముగనే శరీరమునకు స్నాయువులు ముఖ్యాధారములు కావున అస్థులు మున్నగునవి చెడినను కొంతదనుక సహింపనగునుగాని స్నాయువులకు భంగముకల్గిన నవశ్యము అపాయమును గల్గింపక మానదు. కావున స్నాయువులను ముఖ్యముగ కాపాడ ప్రయత్నము జేయనగును. ఈవిషయము సుశ్రుతాచార్యునిచే నిట్లుచెప్పబడినది:—"న హ్యస్థీని న వా పేశ్యః న సిరా న చ సన్ధయః వ్యాపాదితాః తథా హన్యుః యథా స్నాయుశ్శరీరిణామ్. యస్స్నాయూః ప్రవిజానాతి బాహ్యాశ్చాభ్యన్తరాస్తథా, స గూఢం శల్యమాహర్తుం దేహాచ్ఛక్నోతి దేహినామ్."

### సిరాసంఖ్య.

దశ మూలసిరాః హృత్స్థాః తాస్సర్వం సర్వతో వపుః,
రసాత్మకం వహన్త్యోజః తన్నిబద్ధం హి చేష్టితమ్. ౧౮

(సిరలన శరీరమున భుజింపబడిన యాహారరసమును వ్యాపింపజేయు సన్నని నరములు. వీనియందు సన్ననిద్వారములు కల్గియుండును. తామరకాడలలో సన్నని రంధ్రములనుండి నీళ్లుప్రవహించు విధముగ ద్రవమును శరీరమునందెల్ల వ్యాపింపజేసి పోషించుచుండును.)

అయ్యవి యనేకములైనను అందు ప్రధానములుగ పదిసిర లుండును. వానినాశ్రయించి తక్కిన సిరలుండుటం జేసి యవి మూలసిర లనబడును. వానికి హృదయము ముఖ్యస్థానము. అందుండి వెడలి శరీరమునందెల్ల వ్యాపించుచు భుజింపబడిన యాహారము పాచకాగ్నిచే పక్వమై సారకిట్టములు వేరువేరుగ నేర్పడినప్పుడు అట్టియాహారరసరూపమైన యోజస్సును శరీరమునందెల్ల వ్యాపింపజేయును. వాక్కు శరీరము మనస్సు ఈమూటికిని సంబంధించిన చేష్టలన్నియు పైజెప్పిన సిరల నాశ్రయించి జరుగుచుండును.

సిరల నుద్దేశించి సుశ్రుతమున నిట్లు చెప్పబడినది:—"సప్త సిరాశతాని భవన్తి. యాభి రిదం శరీరమారామ ఇవ జలహారిణీభిః కేదార ఇవ చ కుల్యాభిః ఉపస్నిహ్యతే అనుగృహ్యతే చ ఆకుఞ్చన ప్రసారణాదిభిః విశేషైః ద్రుమపత్ర సేవనీనామివచ తాసాం ప్రతానాః తాసాం నాభిర్మూలం,తతశ్చ ప్రసరన్త్యూర్ధ్వమధస్తిర్యక్చ." సిరలు ఏడు వందలు. అయ్యవి (నీటిని ప్రవహింపజేయు కాలువలు తోటలయందును వరిచేలయందును నీటిని వ్యాపింపజేసి యందలి చెట్టు చేమలను పైరులను నానాట వృద్ధినొందించి పోషించి కాపాడుభంగి) శరీరమున పాదములు మొదలు జేసి శిరస్సువరకును వ్యాపించి భుజింపబడు ఆహారరసమును వ్యాపింపజేసి శరీరమునకు సంబంధించిన ముడుచుట చాచుట మున్నగు చలనాది వ్యాపారముల గల్గించి పోషించుచుండును. అయ్యవి నాభిస్థానమున ప్రధానముగ జేరి యందుండి (చెట్టుయొక్క ఆకులయందలి నరములు ఆకు నడుమనుండి నలుగెడల ఆకున వ్యాపించురీతి) శరీరమునందెల్ల నూర్ధ్వముగను, క్రిందుగను, అడ్డముగను వ్యాపించును. (ఈవాక్యము చేత సిరల కన్నిటికిని నాభి ముఖ్యస్థానమని చెప్పబడినది.)

### ఉపసిరలు, వానిసంఖ్య.

స్థూలమూలాస్సుసూక్ష్మాగ్రాః పత్రరేఖాప్రతానవత్. ౧౮
భిద్యన్తే తాస్తతస్సప్త శతాన్యాసాం భవన్తి తు,

ఆకులలో నరములు మొదళ్లయందు స్థూలములై కొనలయందు మిక్కిలి సన్నవిగ నుండువిధముగ సిరలు మొదళ్లయందు స్థూలములై కొనలయందు మిక్కిలి సన్ననై శరీరమునందెల్ల వ్యాపించును. కావున నవి యనేకవిధములై శాఖోపశాఖలుగ (ఆకులయందు నరములబోలె) చీలి వ్యాపించును. దానంజేసి యనేక విధములైనను ఏడువందల సంఖ్య కల్గియుండును.

సిరల సంఖ్యావిభాగములు సుశ్రుతమున నిట్లుచెప్పబడినవి:—"తాసాం మూలసిరాశ్చత్వారింశత్.—తాసాం వాతవాహిన్యో దశ, పిత్తవాహిన్యో దశ, కఫవాహిన్యో దశ, దశ రక్తవాహిన్యః, తాసాంతు వాతవాహినీనాం వాతస్థానగతానాం పఞ్చసప్తతి శతం భవతి. తావత్య ఏవ పిత్తవాహిన్యః పిత్తస్థానే, కఫవాహిన్యశ్చ కఫస్థానే,రక్తవాహిన్యశ్చ యకృత్ప్లీహోః. ఏవమేతాని సప్త సిరాశతాని" సిరలలో ప్రధానములైనవి నలువది. అందు వాతమును వహించునవి పది. పిత్తమును వహించునవి పది. కఫమును వహించునవి పది. రక్తమును వహించునవి పది. ఈనలువదియు ప్రధానములైన సిరలు. అందు వాతస్థానమునుండి వెడలి వాతమును వహించు నుపసిరలతో గూడినవి నూట డెబ్బదియైదు సిరలు. ఇత్తెరంగుననే పిత్తస్థానమునుండి పిత్తమును వహించునవియును, కఫస్థానములనుండి కఫమును వహించునవియు, రక్తమునకు స్థానమైన యకృత్ప్లీహముల

నుండి రక్తమును వహించునవియు ప్రత్యేకము నూటడెబ్బదియై దగును. ఇత్తెరంగున నేడు వందల సిరలు శరీరమున వ్యాపించును.

### శాఖా (హస్తపాద) గతసిరా సంఖ్యావివరణము.

తత్రైకైకం చ శాఖాయాం శతం తస్మిన్న వేధయేత్. ౨౦
సిరాం జాలంధరాం నామ తిస్రశ్చాఽభ్యన్తరాశ్రితాః,

పై జెప్పిన యేడువందల సిరలలో కాళ్లుచేతులు నాల్గింటియందు ఒక్కొక దానియందు నూరేసివంతున వ్యాపించి యుండును. (కాళ్లు చేతులయందు వ్యాపించిన సిరలు నాల్గువందలు) అట్టి నాల్గు అవయవములలో నొకదానియందలి జాలంధర మను (మాంసాదిజాలముల ధరించినది) సిరయును, అంతర్ముఖములై యాభ్యంతరము లగు మూడు సిరలును సిరావ్యధనమున కర్హములు కావు. ఇత్తెరంగున నాల్గు అవ యవములయందును జేరి పదునారు సిరలను వేధింప దగదని భావము.

ఈజెప్పబడిన సిరలసంఖ్యలలో కాళ్లు చేతులలో నొక్కొకదానియందు ఒక్కొక నూరుసిరలు వ్యాపించునని ఫలితార్థము. అందు నాల్గవ వంతుసిరలు (ఇరు వదియైదు) వాతముతో గూడినరక్తమును వహించును. ఇరువదియైదుసిరలు పిత్తముతో గూడిన రక్తమును, ఇరువదియైదు కఫముతోగూడిన రక్తమును వహించును. తక్కిన యిరువదియైదును వాతాదిసంబంధములేని శుద్ధరక్తమును వహించును. ఇత్తెరంగున తక్కిన యవయవముల మూటియందును వ్యాపించు సిరలవిభాగము నెరుంగునది. ఈ విధముగనే శ్రోణ్యాదులయందలి సిరలకును విభాగము నెరుంగునది. ఈవిషయము క్రింద జెప్పబడు "తాసాంశతానాం... స్థితామలాః" అను ముప్పదియైదవ శ్లోకముచే నేర్పడును.

### శ్రోణిగతసిరాసంఖ్య.

షోడశద్విగుణాః శ్రోణ్యాం తాసాం ద్వే ద్వే తు వంక్షణే. ౨౧
ద్వే ద్వే కటీకతరుణే శస్త్రేణాష్టౌ స్పృశేన్న తాః,

ఒక్కొక పిరుదునందు పదునారు సిరలవంతున రెండు పిరుదులయందును ముప్పదిరెండు సిరలు వ్యాపించును. అందు గజ్జలయందు రెండేసివంతున నాల్గుసిరలును, కటిభాగములయందు రెండేసివంతున నాల్గుసిరలును మొత్తమున నెనిమిదిసిరలు శస్త్ర ముచే తాకజనదు.

### పార్శ్వగతసిరాసంఖ్య.

పార్శ్వయోష్షోడశైకైకామూర్ధ్వగాం వర్జయేత్సిరామ్. ౨౨

ఇరుపార్శ్వములయందును పదునారుసిరలు వ్యాపించును. అందు ఒక్కొక పార్శ్వమునందును పైకి వ్యాపించిన పార్శ్వసంధ సిరనొక్కొకదానిని శస్త్రకర్మయందు విడువందగును.

### పృష్ఠగతసిరాసంఖ్య.

ద్వాదశద్విగుణాః పృష్ఠే పృష్ఠవంశస్య పార్శ్వగే,
ద్వే ద్వే తతోర్ధ్వగామిన్యౌ న శస్త్రేణ పరామృశేత్. ౨౩

వీపునందు వెన్నెముక కిరుప్రక్కల నొక్కొక్కప్రక్కన పండ్రెండువంతున యిరువదినాల్గుసిర లుండును. ఇరు ప్రక్కలయందును పైకి వ్యాపించియుండు రెండేసి సిరలు శస్త్రముచే స్పృశింపదగదు.

### జఠరగతసిరాసంఖ్య.

పృష్ఠవజ్జఠరే తాసాం మేహనస్యోపరి స్థితే,
రోమరాజీముభయతో ద్వే ద్వే శస్త్రేణ న స్పృశేత్. ౨౪

కడుపుపైన వీపునుబోలె నిరువదినాల్గు సిరలుండును. అందు మేఢ్రమునకు పైభాగమున నూగారు కిరుకెలంకుల పైకి వ్యాపించియుండు రెండేసిసిరలు శస్త్రముచే స్పృశింపదగవు. (నాల్గుసిరలు శస్త్రకర్మమున కనర్హములని భావము)

### ఉరస్స్థితసిరాసంఖ్య.

చత్వారింశదురస్యాసాం చతుర్దశ న వేధయేత్,
స్తనరోహితతన్మూలహృదయే తు పృథగ్ద్వయమ్. ౨౫
అపస్తమ్భాఖ్యయోరేకాం తథాపాలాపయోరపి,

రొమ్ముపైని నలువదిసిరలు వ్యాపించును. అందు స్తన రోహితములందు ప్రత్యేకముగ రెండేసిసిరలును, స్తనమూలములయందు ప్రత్యేకము రెండేసిసరలును, హృదయమున రెండుసిరలును,అపస్తంభముల ప్రత్యేక మొక్కొకసిరయును, అపలాపములయందు ప్రత్యేక మొక్కొక్కసిరయును,జేరి మొత్తమున పదునాల్గు సిరలువేధింపందగవు.

### మెడయందలిసిరాసంఖ్య.

గ్రీవాయాం పృష్ఠవత్ తాసాం నీలే మన్యే కృకాటికే. ౨౬
విధురే మాతృకాశ్చాష్టౌ షోడశేతి పరిత్యజేత్,

మెడయందు వీపువలె నిరువదినాల్గు సిరలుండును. నీలలు అను పేరుగల రెండు సిరలును, మన్యలనునవి రెండును, కృకాటికలయందలిసిరలు రెండును, విధురములను నవి రెండును, మాతృకలను మన్యసిరలెనిమిదియు, అన్నియుజేరి పదునారుసిరలు సిరావ్యధనమున విడువదగును.

### తాలుసంధిగతసిరాసంఖ్య.

హన్వోష్షోడశ తాసాం ద్వే సన్ధిబన్ధనకర్మణీ. ౨౭

తాలువుల సంధులలో నొక్కొకదానియందు ఎనిమిదేసివంతున పదునారు సిరలుండును. వానిలో దవుడల సంధులబంధించు వ్యాపారముగల సిరలురెండును శస్త్రకర్మయందు విడువందగును.

సుశ్రుతమున "తాసాంతు సన్ధిధమన్యౌ ద్వేద్వే పరిహరేత్" అని యుండుటంజేసి సంధుల రెండిటియందును రెండేసి ధమనులవంతున నాల్గుసిరల విడువందగునని యర్థము నిర్ణయింపదగును. ప్రకృతము "ద్వే సంధిబంధనకర్మణీ" అనుచోట ద్విశబ్దమునకు ద్విరుక్తిలేనందున నాల్గు అనునర్థము చెప్పుటకు క్లిష్టముగనున్నది.

జిహ్వాగత సిరాసంఖ్య.

జిహ్వాయాం హనువత్ తాసాం అధో ద్వే రసబోధనే,
ద్వే చ వాచః ప్రవర్తిన్యౌ

నాలుకయందు తాలు సంధులయందువలె పదునారుసిర లుండును. వానిలో నాలుకకు క్రిందిభాగమున మధురాదిరసముల దెలియంజేయు రెండుసిరలును, మాటల వెడలించు రెండుసిరలును జేరి నాల్గుసిరలు సిరావ్యధనమున విడువందగును.

సుశ్రుతమున "షట్త్రింశ జ్జిహ్వాయాం" అని నాలుకయందు ముప్పదియారు సిరలుండునని చెప్పబడియె.

నాసాగత సిరాసంఖ్య.

నాసాయాం చతురుత్తరా. ౨౮
వింశతిర్గన్ధవేదిన్యౌ తాసామేకాం చ తాలుగామ్,

నాసికయందు ఇరువదినాల్గు సిరలుండును. అందు పరిమళమును తెలిసికొను సిరలు రెండును, తాలువులవరకు వ్యాపించిన సిర యొకటియు జేరి మూడుసిరలు వ్యధనమున విడువందగును.

నేత్రగత సిరాసంఖ్య.

షట్పఞ్చాశన్నయనయోః నిమేషోన్మేషకర్మణీ. ౨౯
ద్వే ద్వే అపాఙ్గయోర్ద్వే చ తాసాం షడితి వర్జయేత్,

రెండు నేత్రములయందును (ఒక్కొకదానియందు ఇరువదియెనిమిదివంతున) ఏబదియారు సిరలుండును. వానిలో కనురెప్పల మూయుటయు తెరచుటయు పనిగాగల్గినవి రెండేసిసిరలును, కన్గొనలయందలి రెండుసిరలును జేరి ఆరుసిరలు శస్త్రకర్మయందు విడువందగును.

### లలాటగత సిరాసంఖ్య.

నాసానేత్రాశ్రితాష్షష్టిః లలాటే స్థపనీశ్రితామ్. 3౦
తత్రైకాం ద్వౌ తథాఽఽవర్తౌ చతస్రశ్చ కచాన్తగాః,
సప్తైవం వర్జయేత్తాసాం

నుదుటియందు అరువది సిరలుండును. అయ్యవి నాసికను నేత్రములను ఆశ్రయించి యుండును. అందు నుదుట స్థపనియను మర్మము నాశ్రయించిన సిరయొకటియు, ఆవర్తములను మర్మముల నాశ్రయించినవి రెండుసిరలును, వెండ్రుకలవరకు వ్యాపించిన సిరలు నాల్గును చేరి యేడుసిరలు శస్త్రకర్మానర్హములు.

### చెవులయందలి సిరాసంఖ్య.

కర్ణయోష్షోడశాత్ర తు. 3౧
ద్వే శబ్దబోధనే శఙ్ఖా సిరాస్తా ఏవ చాశ్రితాః,
ద్వే శఙ్ఖసన్ధిగే తాసాం

ఒక్కొక చెవియందు ఎనిమిదేసివంతున రెండుచెవులయందును పదునారు సిరలుండును. వానిలో శబ్దమును బోధించుసిరలు ఒక్కొక చెవియందు ఒక్కొకటివంతున రెండుసిర లుండును. ఆరెండును శస్త్రకర్మ కర్హములు కావు. చెవులయందు వ్యాపించిన పదునారుసిరలే కణతలయందును వ్యాపించియుండును. అందు కణతలసంధిస్థానమునకు సంబంధించిన రెండుసిరలును శస్త్రకర్మకు అర్హములు కావు.

సుశ్రుతాచార్యుడు "కర్ణయోర్దశ" "శఙ్ఖయోర్దశ" అని చెవులయందు పదిసిరలును కణతలయందు పదిసిరలును ఉండునని చెప్పెను.

### శిరోగత సిరాసంఖ్య.

మూర్ధ్ని ద్వాదశ తత్ర తు. 3౨
ఏకైకాం పృథగుత్క్షేపసీమన్తాఽధిపతిస్థితామ్,

శిరస్సున పండ్రెండు సిరలుండును. వానిలో ఉత్క్షేపమను మర్మముల రెంటిలో వ్యాపించిన యొక్కొకసిరయును, ఐదు సీమంతమర్మముల వ్యాపించిన యైదుసిరలును, అధిపతిమర్మమున వ్యాపించిన యొకసిరయును కలిసి యెనిమిదిసిరలు శస్త్రకర్మకు అర్హములు కావు.

### అవేధ్యసిరాపరిగణనము.

ఇత్యవేధ్యవిభాగార్థం ప్రత్యఙ్గం వర్ణితాస్సిరాః 33
అవేధ్యాస్తత్ర కాత్స్న్యేన దేహేఽష్టానవతి స్తథా,

సంకీర్ణాః గ్రథితాః క్షుద్రాః వక్రాః సన్ధిషు చాశ్రితాః. 3౪

ఇత్తెరంగున శరీరమునందు శస్త్రములచే వేధింపందగని సిరల విభజించి తెలుపుటకై పాదములు మొదలు శిరస్సువరకుంగల యంగప్రత్యంగములయందు వ్యాపించియుండుసిరలు వేరువేరుగ జెప్పంబడియె. పైజెప్పిన విభాగప్రకారము శరీరమునందెల్ల వేధింపందగని సిరలు తొంబదియెనిమిదియని యెరుంగునది. మరియును నివియే కాక యొకటితోనొకటి పెనగొనియుండు సిరలును, గ్రంథివలె ముడిగొనియుండు సిరలును, మిక్కిలి సన్నవియగు సిరలును, వంకరటింకరగ వ్యాపించియుండు సిరలును, అస్థిసంధుల (కీళ్ల)యందు వ్యాపించియుండు సిరలును, శస్త్రకర్మమున కర్హములు కావు. మరియు నవేధ్యసిరల విభాగము సుశ్రుతమున సంగ్రహరూపముగ నిట్లు చెప్పబడియె:—"శాఖాసు షోడశసిరాః కోష్ఠే ద్వాత్రింశ దేవతు, పంచాశజ్జత్రుణశ్చోర్ధ్వం అవేధ్యాః పరికీర్తితాః" హస్తపాదములయందు పదునారును, కోష్ఠమునందలి సిరలు ముప్పదిరెండును, కంఠమునకు పైభాగమునందలి సిరలలో నేబదియును శస్త్రముచే వేధింపందగదు అనిభావము. అన్నియుం కలిసి అవేధ్యసిరలు తొంబదియెనిమిది యగును.

### వాతవహాది సిరోవిభాగము.

తాసాం శతానాం సప్తానాం పాదోఽస్రం వహతే పృథక్,
వాతపిత్తకఫైర్జుష్టం శుద్ధం చైవం స్థితా మలాః. 3౫
శరీరమనుగృహ్ణన్తి పీడయన్త్యన్యథా పునః,

శరీరమునందాపాదమస్తక పర్యంతము వ్యాపించియుండు సిరలన్నియుం గలిసి యేడువందలగునని పైజెప్పబడినది. ఆయేడువందల సిరలలో నాల్గవవంతు (నూటడెబ్బదియైదు) సిరలు వాతముతోగూడిన రక్తమును, వహించును. మరియు నన్ని (నూటడెబ్బదియైదు) సిరలు పిత్తముతోగూడిన రక్తమును, అన్నియే కఫముతోగూడిన రక్తమును, అన్నియే వాతాదుల సంబంధములేక శుద్ధమైన రక్తమును వహించుచు శరీరమునందెల్ల పైజెప్పినవిధముగ వ్యాపించును. ఇత్తెరంగున వాతపిత్తకఫములు శరీరమునందెల్ల వ్యాపించుచు శరీరమును కాపాడును. అటుగాక కొన్నికారణములచే శరీరమున వ్యత్యస్తముగ సంచరించిన ఆయారోగములచే బాధింపం దొడంగును.

సిరలు అన్నియుం వాతపిత్త కఫరక్తములను మూటిని వహించుచుండును. అయినను ఆట్టి వాత, పిత్త, కఫ, రక్తములలో నేభాగము అధికముగ దేనియందుండునో అయ్యది దానిని వహించునదియని చెప్పబడును. ఈవిషయమును సుశ్రుతాచార్యు డిట్లు

చెప్పెను:—నహి వాతం సిరాః కాశ్చిత్ న పిత్తం కేవలం తథా,శ్లేష్మాణంవావహన్త్యేతాః అతస్సర్వవహాస్స్మృతాః."

వాతవహాది సిరాలక్షణము.

తత్ర శ్యావారుణాః సూక్ష్మాః పూర్ణరిక్తాః క్షణేన్సిరాః. 36
ప్రస్పన్దిన్యశ్చ వాతాస్రం వహన్తే పిత్తశోణితమ్,
స్పర్శోష్ణాశ్శీఘ్రవాహిన్యో నీలపీతాః కఫం పునః. 37
గౌర్యస్స్నిగ్ధాః స్థిరాశ్శీతాః సంసృష్టం లిఙ్గసంకరే,
గూఢాః సమస్థితాః స్నిగ్ధాః రోహిణ్యశ్శుద్ధశోణితమ్. 38

వాతరక్తముల వహించుసిరలు శ్యామారుణవర్ణము కల్గి సూక్ష్మాకారము లై క్షణకాలమున పూర్ణములై క్షణకాలమున నేమియులేక విశేషముగ చలించుచుండును. (అన్ని సిరలయందును చలనము కల్గియుండుట సాధారణలక్షణమైనను వాతరక్తవహములయందు చలనము విశేషముగ నుండునని భావము.) పిత్తరక్తముల వహించు సిరలు తాకినచో మిక్కిలి వేడికల్గి అతిశీఘ్రముగ శరీరమున వ్యాపించును. నీలపీతవర్ణములు కల్గియుండును. కఫరక్తములవహించు సిరలు గౌరవర్ణములై స్నిగ్ధఛాయకల్గి చలనములేక స్థిరములై తాకినయెడల చల్లనైయుండును. పైజెప్పిన లక్షణములు సంకరములుగ నున్నపుడు వాతపిత్తాదుల మిశ్రముగ వహించువియని యెరుంగునది. వాతాది సంబంధములేక శుద్ధమైనరక్తమును వహించుసిరలు గూఢములుగ (పై కగపడక) లోపలనే లీనములై సమములుగనుండి స్నిగ్ధఛాయకల్గి రక్తవర్ణములై యుండును.

మరియు సిరలు శరీరమున నాభిస్థానమున బుట్టి (నీటియందు తామరదుంపనుండి వెడలు తామరకాడలు నీటిలోనెల్ల వ్యాపించు విధముగ) శరీరమునందెల్ల వ్యాపించును. ఈవిషయమును సుశ్రుతు డిట్లు చెప్పెను:—"వ్యాప్నువన్త్యభితో దేహం నాభితః ప్రసృతాస్సిరాః,ప్రతానాః పద్మినీకన్దాత్ బిసాదీనాం యథా జలమ్."

ధమనులవివరణము.

ధమన్యో నాభిసంబద్ధాః వింశతిశ్చతురుత్తరాః,
తాభిః పరివృతో నాభిః చక్రనాభిరివారకైః 39
తాభిశ్చోర్ధ్వమధస్తిర్యగ్దేహోఽయమనుగృహ్యతే,

(ధమనులన తామరకాడలకు స్వభావసిద్ధముగ సన్ననిరంధ్రములు కల్గియుండునట్లు పుట్టుకతోడనే లోపలరంధ్రములు కల్గి గొట్టములవలె నుండి యారంధ్రములమూలమున సర్వశరీరమునందును ఆహారరసాదుల వ్యాపింపజేసి శరీరమును

కాండు నాడీవిశేషములు. ఈవిషయము సుశ్రుతమున నిట్లు చెప్పబడినది:—"యథా స్వభావతః ఖాని మృణాళేషు సేషు చవిధమనీంవా తథాఖాని రసో య్యైరుపచీయతే"

అట్టిధమనులు శరీరమునందు మధ్యభాగమైన నాభిస్థానమున నిరువదినాల్గు పుట్టును. (బండిచక్రముయొక్క నడిమిబొడ్డైన బండికుండయందు అరములు (ఆకులు) ఆధారముగజేసికొని నిలిచి బండి కాధారమై భారమును మోచుటకును బండినడచుటకును ముఖ్యసాధనములైనభంగి) పైజెప్పిన యిరువదినాలుగు ధమనులును నాభిస్థానము నాధారముగజేసి బైలువెడలి శరీరమునం దూర్ధ్వముగను క్రింది భాగమునను అడ్డముగను వ్యాపించి, వానియందలి సన్ననిరంధ్రముల మూలముగ శబ్దస్పర్శాదుల గ్రహించుచు, వాతమూత్రపురీషాదుల విసర్జించుచు, స్వేదాదుల బ్రవర్తింపజేయుచు శరీరమునకు బాసటయై నిరపాయముగ పోషించుచుండును.

పైజెప్పబడిన యిరువదినాల్గు ధమనులును శరీరమున వ్యాపించు విభాగమును సుశ్రుతాచార్యు లిట్లుచెప్పిరి:—"తాసాంతు నాభిప్రభవానాం ధమనీనాం ఊర్ధ్వగాః దశ, దశ చాఽధోగామిన్యః, చతస్రస్తిర్యగ్గాః" ఇరువదినాలుగు ధమనులలో నాభికి పైభాగమున పదిధమనులును, క్రిందిభాగమున పదిధమనులును, అడ్డముగ నాల్గు ధమనులును వ్యాపించును.

పై జెప్పబడిన యిరువదినాల్గు ధమనులును ప్రధానములు. వీనినుండిపుట్టుధమనులు పెక్కులు కలవు. వానియుత్పత్తిక్రమంబును, కృత్యములు మున్నగునవియు సుశ్రుతమున విపులముగ వివరింపబడియె. వాని నిచ్చట పాఠకులసుబోధమునకై యుదహరించెద:—

ఊర్ధ్వగామిధమనులు. "ఊర్ధ్వగాః శబ్ద స్పర్శ రూపరసగన్ధ ప్రశ్వాసోచ్ఛ్వాస జృమ్భిత క్షుత్ హసిత కథిత రుదితాదీన్ అభివహన్త్యః శరీరం ధారయన్తి. తాస్తు హృదయ మభిప్రపన్నాః త్రిధా జాయన్తే. తాస్త్రింశత్. తాసాంతు వాతపిత్తకఫ శోణితరసాన్ ద్వేద్వే వహతః, తా దశ శబ్దరూప రసగన్ధాన్ అష్టాభిర్గృహ్ణీతే. ద్వాభ్యాం భాషతే. ద్వాభ్యాం ఘోషం కరోతి. ద్వాభ్యాం స్వపితి. ద్వాభ్యాం ప్రతిబుధ్యతే. ద్వేచాఽశ్రువాహిన్యౌ. ద్వే స్తన్యం స్త్రియాః వహతః, స్తనసంశ్రితే. తేఏవ శుక్రం నరస్య స్తనాభ్యా మభివహతః. తాస్త్వేతాస్త్రింశత్సవిభాగాః వ్యాఖ్యాతాః. ఏతాభి రూర్ధ్వం నాభేః ఉదర పార్శ్వపృష్ఠోరస్స్కన్ధగ్రీవాబాహవో ధార్యన్తే యాప్యన్తేచ."

శరీరమున నాభికూర్ధ్వభాగమున వ్యాపించియుండుధమనులు శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, నిశ్వాసము, ఉచ్ఛ్వాసము, ఆవలింత, తుమ్ము, నవ్వు, మాటలు

రోదనము మున్నగువానిని ప్రవర్తింపజేయుచు పనుల నిర్వహించుచు శరీరధారణముసేయుచుండును.ఊర్ధ్వముగ వ్యాపించు ధమనులు పదియు నాభినుండి వెడలి హృదయమున జేరి యొక్కొకటి మూడేసిగ చీలి వ్యాపించును.వానిమొత్తము ముప్పది ధమను లగును. అందు రెండుదమనులు వాతమును, రెండుధమనులు పిత్తమును, రెండుధమనులుకఫమును, రెండుధమనులు రక్తమును,రెండుధమనులుఆహారరసమును వహించుచు శరీరమున వ్యాపింపజేయును.ఇవ్వవి పదిధమనులు. మరియు రెండుధమనులు శబ్దమును,రెండుధమనులు రూపమును,రెండుధమనులు రసమును, రెండుధమనులు గంధమును గ్రహించుచుండును.ఇయ్యవి యెనిమిది.రెండుధమనులచే మాటలాడును. రెండుధమనులు ఘోషమును కల్గించును.రెండుధమనులచే నిద్రపోవును. రెండుధమనులచే మేల్కాంచును. రెండుధమనులచే కన్నీరు వెడలును. స్తనములజేరియుండు రెండుధమనులు స్తన్యమును వెడలించును. స్తనముల నాశ్రయించిన ఈరెండు ధమనులే పురుషులకు స్తనముల నుండి శుక్రమును వహించును. ఇవియన్నియు జేరి నాభికూర్ధ్వముగ వ్యాపించుధమనులు ముప్పది సవిభాగముగ జెప్పబడియె. ఈముప్పది ధమనులచేత నాభికి పైభాగమున నుండు ఉదరము, ఇరుప్రక్కలు, వీపు, వక్షస్స్థలము, భుజశిరస్సులు, కంఠము, హస్తములు, ఇవియన్నియు ధరింపబడును. వానివానికి సంబంధించిన పనులన్నియు నీముప్పది ధమనులచేతనే సాగుచుండును.

అధోగామిధమనులు:—"అధోగమాస్తు వాతమూత్రపురీషశుక్రార్తవాదీని అధోవహన్తి. తాస్తు పిత్తాశయమభిప్రపన్నాః తత్రస్థమేవాన్నపానరసం విపక్వం ఔష్మ్యాద్వివేచయన్త్యః అభివహన్త్యః శరీరం తర్పయన్తి.అర్పయన్తి చోర్ధ్వగతానాం తిర్యగ్గతానాం రసస్థానం చాభిపూరయన్తి.మూత్రపురీషస్వేదాంశ్చ విరేచయంతి.ఆమపక్వాశయాన్తరే చ త్రిధాజాయన్తే. తాస్త్రింశత్.తాసాంతు వాత పిత్తకఫశోణితరసాన్ ద్వేద్వే వహతః.తాదశ. ద్వే అన్నవాహిన్యావన్త్రాశ్రితే. తోయవహే ద్వే.మూత్రవస్తిమభిప్రపన్నే మూత్రవహే ద్వే, శుక్రవహే ద్వే శుక్రప్రాదుర్భావాయ. ద్వే విసర్గాయ.తేఏవ రక్తమభివహతో నారీణామార్తవసంజ్ఞం.ద్వేవర్చో నరసిన్యౌ స్థూలాన్త్రప్రతిబద్ధే, అష్టావన్యాస్తిర్యగ్గానాం ధమనీనాం స్వేదమర్పయన్తి,తాస్త్వేతాస్త్రింశత్ సవిభాగా వ్యాఖ్యాతాః. ఏతాభిరధో నాభేః పక్వాశయకటిమూత్రపురీషగుదవస్తిమేఢ్రసక్థీని ధార్యన్తే యాప్యన్తే చ."

నాభికి క్రిందిభాగమున వ్యాపించుధమనులు వాతము, మూత్రము, పురీషము, శుక్రము, ఆర్తవము మున్నగు వానిని అధోభాగమున వహించుచుండును. అవి పిత్తాశయమున జేరి యందలి జాఠరానలముయొక్క వేడివలన పరిపక్వమైన యన్నపాన

రసమును విభజించి ఆయాస్థలమునకు దగినట్లుగు అన్నరసమును దీసికొనిపోయి యూర్ధ్వముగను అడ్డముగను వ్యాపించియుండు ధమనుల రసస్థానమును అన్నాదిరసముచేఁ బూరింపజేసి శరీరమునెల్ల పోషించుచుండును. మూత్రమును పురీషమును స్వేదమును శరీరమునుండి బైట వెడలింపజేయును. అట్టి మూలభూతములై నాభికి క్రింద వ్యాపించిన పది ధమనులును ఆమాశయమునకును పక్వాశయమునకు నడుమఁ జేరి యొక్కొకటి మూఁడేసిగ చీలి ముప్పది ధమనులగును. ఆముప్పది ధమనులలో పదిధమనులు వాత-పిత్త-కఫ-రక్త-రసములను నైదటిలో నొక్కొకదానిని రెండేసి ధమనులవంతున వహించుచుండును. రెండుధమనులు అంత్రము (ప్రేవు) నాశ్రయించి అన్నమును (భుజింపబడిన యాహారము) వహించుచుండును. త్రాగబడినజలమును వహించుధమనులు రెండు. మూత్రవస్తినిజేరి మూత్రమును వహించుధమనులు రెండు. శుక్రమును పుట్టించి శుక్రమును ధరించుధమనులు రెండు. శుక్రమును వెడలించునవి రెండు. ఈ ధమనులు రెండును స్త్రీలకు ఆర్తవమును వెడలించును. రెండు ధమనులు స్థూలమైన పెద్దప్రేగుకు సంబంధించియుండి పురీషమును వెడలించును. తక్కిన యెనిమిది ధమనులును అడ్డముగ వ్యాపించియుండు ధమనులకు చెమటను జేర్చి బైట వెడలింపజేయును. ఇత్తెరంగున బొడ్డుకు క్రిందిభాగమున వ్యాపించు ముప్పది ధమనులును విభజించి చెప్పబడినవి. ఇయ్యవి నాభికి దిగువనుండు పక్వాశయమును, కటిప్రదేశమును, గుదమును, వస్తిని, మేఢ్రమును, మూత్రపురీషములను, ఊరువులను ధరించి వానివానికృత్యముల జక్కఁగ నెరవేర్చుచుండును.

తిర్యగ్గతధమనులు:—"తిర్యగ్గానాం తు చతసృణాం ధమనీనాం ఏకైకా శతధా సహస్రధా చోత్తరోత్తరం విభజ్యన్తే. తాస్త్వసంఖ్యేయాః. తాభిరిదం శరీరం గవాక్షితం విబద్ధమాతతం చ. తాసాం ముఖాని రోమకూపప్రతిబద్ధాని. యైస్స్వేద మభివహన్తి, రసం చాపి సన్తర్పయన్త్యన్తర్బహిశ్చ. తైరేవ చాభ్యంగపరిషేకావగాహాలేపన వీర్యాణ్యన్తశ్శరీర మభిప్రతిపద్యన్తే త్వచి విపక్వాని. తైరేవ త్వచి సుఖమసుఖం వా గృహ్ణాతి. తాస్త్వేతాశ్చతస్రో ధమన్యస్సర్వాఙ్గగతాస్సవిభాగాః వ్యాఖ్యాతా."

నాభినుండి యడ్డముగ వ్యాపించియుండు నాల్గుధమనులలో నొకటొకటి నూరువిధములుగను వేయివిధములుగను క్రమముగ భిన్నములై సంఖ్యకు నలవి గాకుండును. అట్టి ధమనులచే నీశరీరము గవాక్షము కమ్ములచే నావరింపబడినట్లు వ్యాపించి చుట్టబడియుండును. వానిద్వారములు రోమరంధ్రములకు సంబంధించి చెమటను బైట వెడలింపజేయుచు శరీర బాహ్యస్థలమునను లోభాగమునను ఆహారరసమును వ్యాపింపజేసి తృప్తిని కల్గించుచుండును. మరియు శరీరముపైన చేయబడు అభ్యంగనము స్నానము

అవగాహము ఆలేపనము మున్నగునవి చర్మముపై పరిపక్వమైనపుడు వాని సారమును శరీరమునందు లోభాగమున ప్రవేశింపజేయును. చర్మమునకు స్పర్శముచే గల్గు సుఖంబైనను దుఃఖంబైనను ఈధమనులవలననే కలుగును. ఇత్తెరంగున సర్వాంగమున వ్యాపించు తిర్యగ్గతధమనులు విభాగపూర్వకముగ వివరింపబడియె.

### స్రోతోవివరణము

స్రోతాంసి నాసికే కర్ణే నేత్రే పాయ్వాస్యమేహనమ్. ౮౦
స్తనౌ రక్తపథశ్చేతి నారీణామధికం త్రయమ్,

స్రోతస్సుల ద్వారములు. అయ్యవి నాసాద్వారములు రెండు. శ్రోత్రద్వారములు రెండు. నేత్రద్వారములు రెండు. గుదద్వార మొక్కటి. నో రొకటి. మూత్రద్వార మొకటి. ఈ తొమ్మిదిద్వారములు స్త్రీలకును పురుషులకును సాధారణముగ నుండును. స్త్రీలకు స్తనములయందు స్తన్యము వెడలు ద్వారములు రెండును, ప్రతిమాసమునందును ఋతురక్తము కెడలుమార్గ మొకటియును, ఈమూడును అధికముగ నుండును. (ఇవి శరీరమున బైట కనబడు ద్వారములు. ఇవియే స్రోతస్సులని చెప్పబడును).

### అన్తస్స్రోతోవివరణము.

జీవితాయతనాన్యన్తః స్రోతాంస్యాహుస్త్రయోదశ. ౮౧
ప్రాణధాతుమలామ్భోన్నవాహీన్యహితసేవనాత్,
తాని దుష్టాని రోగాయ విశుద్ధాని సుఖాయ చ. ౮౨

శరీరమునందు లోభాగమున ప్రాణవాయువును, రసాదిధాతువులను, మలమూత్రములను, జలమును, భుజింపబడిన యాహారమును వహించుస్రోతస్సులు పదుమూడుండును. అయ్యవి జీవితమునకు ముఖ్యముగ నాధారమైయుండును. ఆస్రోతస్సులు ద్వారములు బైటి కగపడక యాన్తర్ముఖములై యుండును. అయ్యవి మిథ్యాహార విహారములచేసిననాడు దుష్టములై రోగముల గల్గించును. హితకరములగు నాహార విహారాదుల జేయుచున్నచో మిక్కిలి శుద్ధములై సుఖమును గల్గించును.

ప్రాణవహాది స్రోతోవివరణము అష్టాంగసంగ్రహమున నిట్లు చెప్పబడినవి:—
"తత్ర ప్రాణవాహినాం హృదయం మూలం మహాస్రోతశ్చ. తాని క్షయరౌక్ష్యపిపాసాక్షుద్వ్యాయామవేగవిధారణాదిభిః దుష్యన్తి. తతోఽతిసృష్టం ప్రతిబద్ధం కుపితమల్పాల్పమభీక్ష్ణం సశబ్దశూలముచ్ఛ్వసనం. తత్ర శ్వాసవత్సాధనమ్. ఉదకవాహినాం తాలుమూలం క్లోమ చ. తాన్యామయాతిపానశుష్కాన్న విద్గ)హాదిభిర్దుష్యన్తి. తతోఽతితృష్ణా ముఖశోషః వర్ణస్స్వేదనం తమోదర్శనం చ. తత్ర తృష్ణోక్తమౌష

థం అన్నవాహినా మామాశయోమూలం వామపార్శ్వంచ. తేషాం సర్వం మాత్రాశతీయోక్తమనుగచ్ఛేత్, రసవాహినాం హృదయం.మూలం దశధమన్యశ్చ. రక్తవాహినాం యకృత్ప్లీహా చ, మాంసవాహినాం స్నావాని త్వక్చ. మేదోవాహినాం వృక్కామాంసంచ. అస్థివాహినాం జఘనం మేదశ్చ. మజ్జవాహినాం పర్వాణ్యస్థీని చ. శుక్రవాహినాం స్తనౌ ముష్కౌ మజ్జా చ. మూత్రవాహినాం వస్తిః వంక్షణౌచ. శకృద్వాహినాం పక్వాశయః స్థూలాన్త్రంచ. స్వేదవాహినాం మేదోమూలం రోమకూపాశ్చేతి.”

ప్రాణవాయువును వహించు స్రోతస్సులు ప్రాణవహములు. వానికి హృదయంబును మహాస్రోతస్సును మూలాధారములు. అయ్యవి ధాతుక్షయము, రూక్షత్వము, దప్పి, ఆకలి, దేహమునకు శ్రమబుట్టించుపనులు, మలమూత్రాది వేగమును నిరోధించుట మున్నగువానిచే దుష్టములగును. అప్పుడు ఉచ్ఛ్వాసవాతము అధికముగ వెడలును లేక బద్ధగించియైన వెడలును. ప్రకోపమునొంది మిక్కిలి స్వల్పముగనైనను అధికముగనైనను ఉత్పత్తి స్థానమున శబ్దముతోఁగూడి వెడలును. అట్టియెడ శ్వాసమునకు జెప్పిన చికిత్స జేయునది.

త్రాగబడిన జలమును వహించుస్రోతస్సులు ఉదకవహములు. వానికి తాలువులును క్లోమంబును మూలాధారములు అయ్యవి వ్యాధి విశేషములచేతను, అధికముగ నీళ్లదాగుట ద్రవము చేసి యన్నాదుల భుజించుట, మలబంధము మున్నగు కారణములచే దుష్టములగును దానివలన మిక్కిలి దప్పి కల్గును, నోట ద్రవములేక యెండును. చెవియందు గుమ్మనిధ్వని పుట్టును. చీకటి గ్రమ్మిన విధముగ కన్నులు గానరాకుండును. అట్టియెడ దప్పికి చెప్పిన చికిత్స చేయుట యుక్తము.

భుజింపబడిన యాహారపదార్థముల వహించు స్రోతస్సులు అన్నవహంబులును వానికి ఆమాశయంబును ఎడమపార్శ్వంబును మూలాధారము. అయ్యవి దుష్టములైనపుడు మాత్రాశితీయాధ్యాయమున జెప్పినవిధానమునెల్ల నాచరించునది.

రసాది ధాతువులవహించు స్రోతస్సులు ధాతువహములు. అందు రసధాతువును వహించు స్రోతస్సులకు హృదయంబును పదిధమనులు మూలాధారములు. రక్తవాహి స్రోతస్సులకు యకృత్తును ప్లీహంబును మూలాధారములు. మాంసవహ స్రోతస్సులకు స్నాయువులును త్వక్కును మూలాధారములు, మేదస్సును వహించు స్రోతస్సులకు వృక్కములు మాంసంబును మూలము. అస్థివహస్రోతస్సులకు పొత్తికడుపును మేదస్సును మూలము. మజ్జనువహించు స్రోతస్సులకు పర్వము (గణుపు) లును అస్థులును మూలములు. శుక్రమునువహించు స్రోతస్సులకు స్తనంబులును వృషణంబులును మజ్జయును మూలములు. మూత్రమును వహించు స్రోతస్సులకు వస్తియు గెజ్జలును మూలములు. పురీషమును వహించు

స్రోతస్సులకు పక్వాశయంబును స్థూలాంత్రంబును మూలము. చెమటనువహించు స్రోతస్సులకు మేదస్సును రోమరంధ్రంబులును మూలములు.

ఇత్తెరంగున ప్రాణ-ఉదక - అన్న-రస-రక్త - మాంస - మేదః-అస్థి - మజ్జ, శుక్ర-మూత్ర-పురీష-స్వేదముల పదిమూటిని వహించు స్రోతస్సులు పదిమూడు. వాని మూలాధారంబులును వాని కృత్యములును వివరింపబడియె. ప్రకృతసూలమున 'ప్రాణధాతు మలామ్భోఽన్నవాహీని' అనుచోట ప్రాణశబ్దముచేత ప్రాణవాయువును, ధాతుశబ్దముచేత రసాదిధాతువు లేడును, అంభశ్శబ్దముచేత జలంబును, మలశబ్దముచేత మలమూత్రస్వేదములు మూడును, అన్నశబ్దముచేత నాహారంబును గ్రహింపబడును. కావున నాపదిమూడింటి వహించు స్రోతస్సులు పదిమూడగును కావున "స్రోతాంస్యాహుః త్రయోదశ" అని పరిగణనము చేయబడియె.

ఇచ్చట సిరామార్గనము నెఱుంగవలెను:—సిరలు ధమనులు స్రోతస్సులు. అనునవి మూడును సమానములగు కృత్యముల జేయుచు శరీరమునందెల్ల వ్యాపించియుండును. కావున నీమూడును ఏకరూపములై భేదములేకుండునని కొందరు వచించెదరు. రసాది ధాతువుల వ్యాపింపజేయునవి సిరలు. పూరించునవి ధమనులు. స్రవింపజేయునవి స్రోతస్సులునని పరస్పరభేదమును కొందరు వచించెదరు. ఈ విషయము చరకమున "ధ్మానాద్ధమన్యః స్రవణాత్ స్రోతాంసి సరణాత్సిరాః" అనువాక్యముచే నిర్ణయింపబడెను. ముఖ్యముగ నీమూడును రంధ్రములుగల్గి రసాదులవహించుటంజేసి యేకరూపములుగనేయుండును; గాని వానివానిస్థానభేదమును బట్టియు వానిమూలములబట్టియు కించిద్భేదము కల్గియేయుండును. కావుననే తంత్రకారులును వేరువేర పఠించిరి. ఈ విషయమునె సుశ్రుతాచార్యులు—"అన్యా ఏవహి ధమన్యః స్రోతాంసి చ సిరాభ్యః. కస్మాత్ ? వ్యఞ్జనాన్యత్వాత్, మూలసన్నియమాత్, కర్మవైశేష్యాత్, ఆగమాచ్చ" అని చెప్పిరి.

### స్రోతస్సుల లక్షణము.

స్వధాతుసమవర్ణాని వృత్తస్థూలాన్యణూనిచ,
స్రోతాంసి దీర్ఘాణ్యాకృత్యా ప్రతానసదృశాని చ. 43

స్రోతస్సులు రసరక్తాది ధాతువుల కాధారములై ఆయాధాతువును వహించుచుండునని పైజెప్పబడినది. అందు ఏస్రోతస్సు ఏధాతువున కాధారమై దానిని ధరించునో అట్టిస్రోతస్సు దాని కాధేయమైన ధాతువుకు సమానమైన వర్ణముకల్గియుండును. (రసధాతువును వహించు రసవహాస్రోతస్సు రసధాతువున కాధారమైయుండును. కావున ఆ స్రోతస్సు రసధాతువునకు సమానమైన వర్ణముకల్గియుండును. ఇత్తెరంగుననే రక్తవహాస్రోతస్సు రక్తధాతువునకు సమానవర్ణమైయుండును. శుక్రమువరకుగల తక్కిన ధాతు

వుల వహించు స్రోతస్సులును ఆయా ధాతువునకు సమానమైన వర్ణమును గల్గియుండు నని భావము.) మరియు వానిలో కొన్ని గుండ్రములై గొట్టములవలె నుండును. కొన్ని స్థూలములయ్యును, కొన్ని సన్నవిగను ఉండును. అన్ని స్రోతస్సులును నిడుదలై యుండును. ఆకులయందు నరములు శాఖోపశాఖలుగ చీలికలుకల్గి దట్టముగ వ్యాపించుభంగి స్రోతస్సులును పలుదెరంగుల చీలికలై ఆయా ధాతువును వహించుచు శరీరమున వ్యాపించును.

## స్రోతస్సులు చెడుటకు కారణములు.

ఆహారశ్చ విహారశ్చ యస్స్యాద్దోషగుణైస్సమః,
ధాతుభిర్విగుణో యశ్చ స్రోతసాం స ప్రదూషకః ౪౪

పానము అన్నము మొదలగునవి యాహారములు. వాక్కునకు మనస్సునకు శరీరమునకును సంబంధించిన చేష్టా విశేషములు విహారములు. అట్టి యాహారములును విహారములును వాతపిత్తకఫములయొక్క రూక్షాదిగుణములకు సమానములైనగుణములు కల్గియుండెనేని దానివలన స్రోతస్సులు చెడును. మరియు నాయాహారవిహారములు రసాదిధాతువులకు విరుద్ధములైనగుణములు కల్గియుండునెడ నాయాధాతువును వహించు స్రోతస్సులు చెడును. (ఆహారవిహారములు రసధాతువునకు విరుద్ధములగు గుణములు కల్గియుండునెడ అట్టి రసధాతువును వహించు రసవహస్రోతస్సు చెడును. ఇత్తెరంగుననే తక్కినధాతువులలో నేధాతువునకు విరుద్ధములైన యాహారవిహారములు సేయబడునో అప్పుడు ఆయాధాతువును వహించు స్రోతస్సు చెడునని భావము.)

## దుష్టస్రోతోలక్షణములు.

అతిప్రవృత్తిస్సఙ్గో వా సిరాణాం గ్రన్థయోఽపి వా,
విమార్గతో వా గమనం స్రోతసాం దుష్టిలక్షణమ్. ౪౫

స్రోతస్సులలోనే స్రోతస్సు ఏవస్తువును వహించునో అట్టివస్తువు అధికముగ వెడలినను కొంచెముగ వెడలినను బొత్తుగ వెడలకున్నను ఆస్రోతస్సు చెడినదని యెరుంగునది. (మూత్రము అధికముగ వెడలినను స్వల్పముగ వెడలినను బొత్తుగ వెడలకున్నను మూత్రమును వహించుస్రోతస్సు చెడినదనియు, మలమధికముగ వెడలినను స్వల్పముగ వెడలినను బొత్తుగ వెడలకున్నను మలమును వహించు స్రోతస్సు చెడినదనియు నెరుంగనగును. ఇత్తెరంగున నేస్రోతస్సు దేనినివహించునో దాని యతిప్రవృత్తిని అప్రవృత్తినిబట్టి ఆయా స్రోతస్సు చెడినది యని యూహింపదగునని భావము.) మరియు అట్టి స్రోతోనాళములయందు గ్రంథులు కల్గినను స్రోతస్సులు చెడినవని యెర్గుంగునది. మరియు ఆయాస్రో

తస్సును వహించు మలమూత్రాదులు దానిదాని మార్గములను వదలి యితరమార్గముల నుండి వెడలినను ఆయాస్రోతస్సు చెడినదని యూహించునది.

## స్రోతోద్వారములు.

బిసానామివ సూక్ష్మాణి దూరం ప్రవిసృతాని చ,
ద్వారాణి స్రోతసాం దేహే రసో యైరుపచీయతే. ౪౬

తామరకాడలయందు మిక్కిలి సూక్ష్మములైన ద్వారములు కల్గి అట్టి ద్వారములు కాడలపొడుగున వ్యాపించియుండు విధముగ స్రోతస్సులయందు సూక్ష్మములైన రంధ్రములుకల్గి యారంధ్రములు అట్టి సిరలనిడుపుకు పూర్తిగ వ్యాపించి యుండును. అట్టి రంధ్రములనుండి యాహారసారరూపమైన రసము మిక్కిలి వృద్ధినొందింపబడును.

## స్రోతోవ్యధిచే గల్గునుపద్రవములు.

వ్యధేతు స్రోతసాం మోహాకమ్పాధ్మానవమిజ్వరాః,
ప్రలాపశూలవిణ్మూత్రరోధాః మరణమేవ చ. ౪౭
స్రోతోవిద్ధమతో వైద్యః ప్రత్యాఖ్యాయ ప్రసాధయేత్,
ఉద్ధృత్య శల్యం యత్నేన సద్యః క్షతవిధానతః. ౪౮

పై జెప్పబడిన స్రోతస్సులయందు దెబ్బతగిలినయెడ మూర్ఛగ్రమ్మును. శరీరము వణకును. కడుపుబ్బరించును. వాంతియగును. జ్వరమువచ్చును. అసంబద్ధముగ మాటలువెడలును. పోటుపుట్టును. మలమూత్రములు బంధింపబడును. కడపట మరణము కూడ సంభవించును. అట్టి స్రోతస్సులయందు ముండ్లు మొదలగు శల్యములు గ్రుచ్చుకొనియుండునెడ వైద్యుడు రోగిబ్రతుకుట కష్టమని చెప్పి మిక్కిలి ప్రయత్నముతో మెలకువతో శల్యమును విడదీసి సద్యోవ్రణప్రతిషేధనమున జెప్పినవిధముగ నుపచరించుచు చికిత్స జేయవలెను.

## గ్రహణీస్వరూపము.

అన్నస్య పక్తా పిత్తం తు పాచకాఖ్యం పురేరితమ్,
దోషధాతుమలాదీనామూష్మేత్యాత్రేయశాసనమ్. ౪౯
తదధిష్ఠానమన్నస్య గ్రహణాత్ గ్రహణీ మతా,
సైవ ధన్వన్తరిమతే కలా పిత్తధరాహ్వయా. ౫౦
ఆయురారోగ్యవీర్యౌజోభూతధాత్వగ్నిపుష్టయే,
స్థితా పక్వాశయద్వారి భుక్తమార్గార్గళేవ సా. ౫౧

నానావిధములైన యాహారపదార్థములను భుజించినపుడు వానినెల్ల పచింపజేయునది పాచకమను పిత్తము. అది యే జాఠరాగ్ని అని పూర్వము దోషభేదీయాధ్యాయమున "తత్ర పక్వామాశయమధ్యగం......పాకాదికర్మణానలశబ్దితమ్. పచత్యన్నం విభజతే......పాచకం నామ తత్ స్మృతమ్" అను గ్రంథముచేత చెప్పబడినది. ఇదియె ధాన్వన్తరీయమతము. వాతపిత్తములయొక్కయు, రసరక్తాది ధాతువులయొక్కయు, మూత్రపురీషస్వేదాదిమలములయొక్కయు వేడియె ఆహారపదార్థముల పచించు అగ్నియనబడునని ఆత్రేయమహర్షి శాసించిరి. అట్టి పాచకాగ్నికి ఆధారమై భుజించునపుడు గళబిలమునుండి లోనికింజను నాహారపదార్థమును గ్రహించునది గ్రహణియని యన్వర్థముగ జెప్పబడును. ఇదియే పిత్తధరయను కలయని ధన్వన్తరిమతము. అయ్యది పక్వాశయద్వారముననుండి మనుజుల గళబిలమునుండి క్రిందికి కోష్ఠమునుండి పక్వాశయమునకు దిగి వచ్చుచుండు భుజింపబడిన యాహారపదార్థమును (తలుపును గడియమాను అడ్డగించువిధముగ) ఆపి తటాలున గ్రహించి తనయందలి యగ్నిచే పచింపంజేసి పక్వాశయమున జేర్చును. శరీరము ఇంద్రియములు సత్వము ఆత్మ వీనియొక్క చేరికయే ఆయువు. ధాతుసామ్యము ఆరోగ్యము, పనులనిర్వహించు సామర్థ్యము వీర్యము, ఆహారరసముయొక్క సారము ఓజస్సు, ఆయువు మున్నగు నీవాల్గింటి పుష్టికిని, పంచభూతముల సంబంధమైన యగ్నియొక్క పుష్టికిని, రసాదిధాతువులనుసంబంధించిన యగ్నియొక్క పుష్టికిని ముఖ్యముగ నాధారభూతమైనది పైజెప్పబడిన గ్రహిణియని భావము.

### గ్రహణీకృత్యము.

భుక్తమామాశయే రుద్ధ్వా సా విపాచ్య నయత్యధః,
బలవత్యబలా త్వన్నమామమేవ విముఞ్చతి. ౫౨
గ్రహణ్యాః బలమగ్నిర్హి స చాపి గ్రహణీబలః,
దూషితేఽగ్నావతో దుష్టా గ్రహణీ రోగకారిణీ. ౫౩

పైజెప్పినవిధముగ గ్రహణి భుజింపబడిన యాహారమును ఆమాశయమునందే యడ్డగించి ఆగ్రహణి మిక్కిలి బలిష్ఠమైయున్నయెడ నాయాహారమును పచింపజేసి క్రిందికి వెడలించును. అట్టి గ్రహణి కొన్నికారణములచే బలహీనమైయున్నయెడ నాహారమును పచింపకయే (పక్వముగాని యాహారమును) క్రిందికి వెడలించును. గ్రహణికి బలము అగ్ని, అగ్నికి ఆధారమగుటంజేసి గ్రహణి బలకరము. కావున జాఠరాగ్ని చెడినయెడ గ్రహణి చెడును. దానంజేసి రోగముల గల్గించును. ఆధారభూతమగు గ్రహణి చెడిననాడు ఆధేయమైన జాఠరాగ్నియు జెడి రోగముల గల్గించును.

ఇచ్చట నీవిమర్శనము కెరుంగునది:—పాచకపిత్తరూపమైన జాఠరాగ్ని భుజింపబడిన యాహారమును గ్రహణియందుండి పచింపజేయును. ఈవిషయమే "పాకాదికర్మణాఽనల శబ్దితమ్. పచత్యన్నం విభజతే" ఇది మున్నగు వాక్యములచే పైన చెప్పబడినది. ఇట్లుండ "సా విపాచ్య నయత్యధః" అను వాక్యము చేత ఆహారమును గ్రహణియామాశయమున పచింపజేయునని చెప్పుట యెట్లు సంగతము? అనుశంక కల్గును. కాని దీనికిది సమాధానము:—"తదధిష్ఠానమన్నస్య గ్రహణాద్గ్రహణీమతా, సైవ ధన్వన్తరిమతే కలా పిత్తధరాహ్వయా" అని చెప్పబడిన పైవాక్యముచేత పాచకపిత్తరూపమైన జాఠరాగ్నికి ఆధారమై భుజింపబడిన యాహారమును గ్రహించునది గ్రహణియనియు అదియే పిత్తధరయనుకలయనియు తెలియుచున్నది. కావున జాఠరాగ్నికి గ్రహణి ఆధారమనియు,దాని నాధారముగ జేసి పాచకాగ్నియుండుననియు స్పష్టమగుచున్నది. అట్టి యాధారమైన గ్రహణీ సంబంధములేక కేవలము అగ్నిమాత్రము ఆహారమును పచింపనోపదు. కావున అగ్నికి ఆధారమైన గ్రహణి యాహారమును తనయందలి జాఠరానలముచే పచింపజేయునని చెప్పుట సమంజసము.

మరియు తన కాధారమైన గ్రహణికి సామర్థ్యము అగ్నిచే గల్గును. కావున అగ్ని చెడినపుడు గ్రహణి బలహీనమగును. ఆధారమైన గ్రహణి సుస్థముగనుండునపుడు అగ్నియు బలవత్తరమైయుండును. గ్రహణి చెడినపుడు దాని నాధారముజేసికొని యుండు అగ్నియు బలహీనమగును. ఇత్తెరంగున గ్రహణియు అగ్నియు నాధారాధేయము లగుటంజేసి పరస్పరోపకారకములై స్వకృత్యముల నిరపాయముగ నిర్వహించుచుండును.

### జాఠరాగ్ని శరీరపోషణమునకు కారణము.

యదన్నం దేహధాత్వోజో బలవర్ణాదిపోషణమ్,
తత్రాగ్నిర్హేతురాహారాత్ న హ్యపక్వాద్రసాదయః. ౫౪

ఆహారమువలన శరీరమునందలి రసరక్తాదిధాతువులును ఓజస్సును శరీరబలము వర్ణము మున్నగునవియు నానాట వృద్ధినొంది పోషింపబడును. ఈవిషయమున జాఠరాగ్ని కారణము. జాఠరాగ్ని ఆహారమును పచింపజేసినపుడు అట్టి పక్వమైన యాహారమువలన రసరక్తాదిధాతువులు క్రమముగ వృద్ధినొంది పుష్టినొందును. అట్టి యాహారము పక్వముకానిచో దానివలన రసాదిధాతువులు కొంచెమైన వృద్ధినొందజాలవు. ఆయాహారము జాఠరాగ్నిచేతనే పక్వమగును కాని వేరొండు సాధనముచేత పక్వము కాజాలదు. కావున ఆహారము ధాత్వాదుల పోషించుటకు జాఠరాగ్ని అవశ్యకారణమగును.

### జాఠరాగ్ని యాహారమును పచింపజేయుక్రమము.

అన్నం కాలేఽభ్యవహృతం కోష్ఠం ప్రాణాఽనిలాహృతమ్,
ద్రవైర్విభిన్నసఙ్ఘాతం నీతం స్నేహేన మార్దవమ్. ౫౫
సంధుక్షితః సమానేన పచత్యామాశయస్థితమ్,
ఔదర్యోఽగ్నిఃయథాబాహ్యః స్థాలీస్థం తోయతణ్డులమ్. ౫౬

మాత్రాశితీయాధ్యాయమున "కాలే సాత్మ్యం శుచిహితం—అశ్నీయాచ్ఛుచి భక్తజనాహృతమ్"అను వాక్యముచేజెప్పిన నియమము ననుసరించి సకాలమున భుజింపబడిన యాహారపదార్థమును ప్రాణవాతము కోష్ఠమున (ఆమాశయపక్వాశయ హృదయాదులకు ఆధారమైన పెద్దప్రేగున) జేర్చును.అయ్యది నీళ్లమున్నగు ద్రవపదార్థముల సంబంధమునంజేసి పిండాకారముగనుండునది యొండొంట కలియకవిరళముగను, నెయ్యిమున్నగు స్నేహద్రవ్యముల సంబంధముచే మెత్తపడును. అట్టి యాహారపదార్థము పక్వాశయమున జేరియున్నపుడు కాయాగ్నికి సమీపముననుండు సమానవాతముచే రాజి వృద్ధినొందింపబడిన జాఠరాగ్ని (బాహ్యస్థలముననుండు అగ్ని పాత్రలో బియ్యమును బోసి నీళ్లు నింపి పొయిమీద బెట్టి మంటవేసినప్పుడు ఆబియ్యమును ఉడికించు విధముగ) పచింపజేయును.

### ఆహారపరిపాకకాలమున గల్గు అవస్థాత్రయము.

ఆదౌ షడ్రసమప్యన్నం మధురీభూతమీరయేత్,
ఫేనీభూతం కఫం యాతం విదాహాదమ్లతాం తతః. ౫౭
పిత్తమామాశయాత్కుర్యాత్ చ్యవమానం చ్యుతం పునః,
అగ్నినా శోషితం పక్వం పిణ్డితం కటు మారుతమ్. ౫౮

మధురము (తీపి), అమ్లము (పులుపు), లవణము (ఉప్పు), కటువు (కారము) కషాయము (వగరు), తిక్తము (చేదు), అను నీయారురసములైనను, వానిలో కొన్ని రసములైనను కల్గి భక్ష్యభోజ్యాది భేదములుకల యాహారమును భుజించినపుడు పైజెప్పిన విధముగ నామాశయమున జాఠరాగ్నిచే పక్వమై తొలుత మధురరసము కలిగినదిగ పరిణమించును. అట్టి యవస్థయందు (పొయిమీద బాహ్యాగ్నిచే పక్వమగునపుడు తొలుత నురుగుకట్టుట యనుభవసిద్ధముగదా? ఆవిధముగ) అందుండి ఫేన (నురుగు) రూపముగ కఫమును కల్గించును. (ఇది యాహారపాకమునకు ప్రథమావస్థ). పిదప విదాహము (విరుద్ధమైనదాహము) వలన నాయాహారము అమ్లత్వము (పులుపు) నొంది

యామాశయమునుండి పక్వాశయమునకు జారుచు పిత్తమును కల్గించును. (ఇది పాకమునకు మధ్యమావస్థ). పిదప పక్వాశయమునకు జేరి జాఠరాగ్నిచే మిక్కిలి శోషింపబడి పక్వమై ఘనీభవించి కటురసముకల్గి వాతమును కల్గించును. (ఇది మూడవయవస్థ.)

ఇచ్చట సంగ్రహము నెరుంగునది:—మధురాది రసభూయిష్ఠమైన యాహారపదార్థము భుజింపబడి గ్రహణీమూలముగ ప్రాణవాతముచే నామాశయమున జేర్పబడును. అచ్చట జాఠరానలముచే పక్వమై తొలుత మధురరసముగ పరిణమించి కఫమును ప్రేరేపించును. ఇదియ ఆహారపరిపాకమునకు ప్రథమావస్థ. పిదప నాయాహారపదార్థము జాఠరాగ్నిచేనైన విదాహమునంజేసి యామాశయమునుండి పక్వాశయమునకు జారుచు అమ్లపాకమునొంది పిత్తమును ప్రేరేపించును, ఇది మధ్యమావస్థ. పిదప పక్వాశయమునజేరి యందును వ్యవహితమైన (ఆమాశయమున నుండుటంజేసి కొంచెము దూరముననున్న) జాఠరానలముచే మరల పచింపబడి ద్రవమును పీల్చుటంజేసి ఘనీభవించి కటురసముగ పరిణమించి వాతమును ప్రేరేపించును. ఇది యాహారపరిణామమునకు మూడవయవస్థ. ఆహారపదార్థములయందు ఏయే రసమున్నను అట్టి యాహారపరిపాకకాలమున పైజెప్పిన యవస్థాభేదప్రకారము తొలుత మధురముగను, పిదప అమ్లముగను, కడపట కటువుగను పరిణమించును. మధురాదిరసము లారుగనున్నను ఇట్టి విపాకభేదమునుబట్టియే మధుర-అమ్ల-కటువిపాకములు మూడుగనుండునని త్రివిధపాకములు చెప్పబడినవి. లేనియెడ నారురసముల ననుసరించి యారువిపాకములు చెప్పవలసియుండును. విపాకదశయందు పైజెప్పినవిధముగ మధుర - అమ్ల-కటుభేదములు మూడుదక్క వేరొండురసమున కవకాశము కల్గుటలేదు. కావున మూడు విపాకముల కిది బీజమని యెరుంగునది.

## ధాత్వగ్నులు వానికృత్యములు.

భౌమాప్యాగ్నేయవాయవ్యాః పఞ్చోష్మాణస్సనాభసాః,
పఞ్చాహారగుణాన్ స్వాన్ స్వాన్ పార్థివాదీన్ పచన్త్యను. ౫౯
యథాస్వం తే చ పుష్ణంతి పక్వా భూతగుణాన్ పృథక్,
పార్థివాః పార్థివానేవ శేషాః శేషాంశ్చ దేహగాన్. ౬౦

పృథివి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశము, అనునీపంచభూతముల సమష్టిరూపము శరీరమని మును చెప్పబడినది. అట్టిపంచభూతములకును సంబంధించినది యగ్నిగుణమైన వేడి శరీరమున నైదువిధములుగ నుండును. అందు భూమికిసంబంధించినది భౌమము. ఉదకమునకు సంధించినది ఆప్యము, అగ్నికిసంబంధించినది యాగ్నేయము. వాయుసంబంధమైనది వాయవ్యము. ఆకసమునకు సంబంధించినది నాభసము,

ఈయైదు అగ్నులును శరీరమున నుండును. ఇవియే పంచమహాభూతాగ్నులు. ఆహార పదార్థములును పంచభూతాత్మకములై యుండును. అట్టిభుజింపబడిన యాహారపదార్థములు జాఠరాగ్నిచే పైజెప్పినరీతిగ పచింపబడినపిదప పంచభూతాత్మకములైనయాహారములయందలి భూతసంబంధములైన ఆయాగుణములను ఆయామహాభూతమునకు సంబంధించిన భూతాగ్నులు పచింపజేయును. (ఆహారమునందలి పృథివీసంబంధమైన గుణములను పృథివీ సంబంధమైన యగ్ని పచింపజేయును. ఇత్తెరంగుననే నాప్యాదిగుణములను ఆప్యాద్యగ్నులు పచింపజేయును.)

అట్టి పంచమహాభూతములయందలి గుణములు తమతమయగ్నులచే శరీరమునందలి పంచమహాభూతగుణములను పచింపజేసి ఆయాగుణములను వృద్ధినొందించును. (భుజింపబడిన యాహారముపృథివి సంబంధమైన (పార్థివమైన) యెడ దానియందలి పృథివీసంబంధమైన గుణములు పృథివీసంబంధమైన భూతాగ్నిచే పచింపబడి, శరీరమునందలి పృథివీ సంబంధములైన గుణముల వృద్ధినొందించును. ఇత్తెరంగుననే తక్కిన వానికి నూహించునది.)

పైజెప్పినరీతిగ ఆహారనిష్ఠములైన పార్థివగుణములు పృథివీ సంబంధమైన యగ్నిచే పచింపబడి శరీరమునందలి పార్థివగుణముల మాత్రమే వృద్ధినొందించును గాని ఆప్యాది గుణముల వృద్ధినొందింపజాలవని భావము. తక్కిన ఆప్య-ఆగ్నేయ-వాయవ్య-నాభసగుణంబులును - శరీరమునందలి ఆప్యాదిగుణములనే వృద్ధినొందించునని భావము.

మరియు గుణిసంబంధములేక గుణములు ప్రత్యేకముగనుండుట యసంభవము కావున పైజెప్పినరీతిగ మహాభూతగుణములు శరీరమునందలి మహాభూతగుణములతోజేరిన పృథివ్యాది భాగములను పైజెప్పిన నియమప్రకారము వృద్ధినొందించునని యర్థముజెప్పుట సమంజసము. ఆకసము నిరాకారము కావున దానికి సంబంధించి యగ్ని యుండుట యసంభవము. అయినను నాసారంధ్రములయందున్న ఛిద్రములను దాహపాకాదుల గల్గించుటకలను కావున ఆట్టిసూక్ష్మము నాభసనని యౌపచారికముగ జెప్పబడెనని యెరుంగునది.

పైజెప్పబడిన ప్రకారము పంచభూతములను సంబంధించిన యగ్నులు ఐదును కాయాగ్నియొకటియు, క్రిందజెప్పబడు ప్రకారము రసాది సప్తధాతువులను వేరువేరుగ సంబంధించిన యగ్నులు ఏడును. ఇవియన్నియును కలసి శరీరమున పదమూడు అగ్నులుండునని యెరుంగునది.

(పంచమహాభూతాత్మకములగు నాహారములు జాఠరానలముచే పక్వమైన పిదప అట్టియాహారమునందలి సారరూపముగ రసమేర్పడినపిదప అట్టిరసమునందలి పంచభూతాగ్నులచే పైజెప్పినవిధముగ నాయాభాగము పక్వమై శరీరమునందలి పంచభూతాత్మకగుణముల వృద్ధినొందించునని నిష్కృష్టమైనఫలితార్థము.)

### సారకిట్టములు.

కిట్టం సారశ్చ తత్పక్వం అన్నం సంభవతి ద్విధా,

భుజింపబడిన పాంచభౌతికాహారము పైజెప్పినరీతిగ జాఠరాగ్నిచే పక్వమై కిట్టమనియుం సారమనియుం రెండువిధములుగ నేర్పడును. (ఆహారముయొక్క నీరసమైనభాగము (పిప్పి) కిట్టము. దానియందలిస్థిరాంశము సారము.)

### కిట్టద్వైవిధ్యము.

తత్రాచ్ఛం కిట్టమన్నస్య మూత్రం విద్యాత్ ఘనం శకృత్. ౬౧

పైజెప్పినకిట్టము రెండువిధములు అందొకటి అన్నముయొక్క ద్రవరూపమైన కిట్టము మూత్రము. ఘనీభవించిన కిట్టము మలము. (ఈరెండును జాఠరాగ్నిచే పక్వమైన యాహారముయొక్క నిస్సారమైన భాగములు.)

### రసాదిధాతూత్పత్తిక్రమము.

సారస్తు సప్తభిర్భూయో యథా స్వం పచ్యతేఽగ్నిభిః,
రసాద్రక్తం తతో మాంసం మాంసాన్మేదస్తతోఽస్థి చ. ౬౨
అస్థ్నో మజ్జా తతశ్శుక్రం శుక్రాద్గర్భః ప్రజాయతే,

భుజింపబడిన యాహారము జాఠరాగ్నిచేతను ధాత్వగ్నులైదిటిచేతను పచింపబడి సారకిట్టములుగ నేర్పడునని పైజెప్పబడినది. అట్టియాహారసారము మరల శరీరమునందలి రసాదిధాతునిష్ఠములగు ధాత్వగ్నులేడిటిచే నాయాధాతువులకు సంబంధించిన సారము ఆయాధాత్వగ్నులచే వరుసగ పచింపబడును. ఆవిధముగ పచింపబడునప్పుడు ఆహారసారము రసధాతువునందలి యగ్నిచే పచింపబడి రసధాతువుగ పరిణమించును. అట్టి రసధాతువునందలి రక్తధాతువునకు మూలమైనసారము రక్తధాతువునందలి యగ్నిచే పక్వమై రక్తముగ పరిణమించును. అట్టిరక్తధాతువునందలి మాంసమునకు మూలమైన సారము మాంసమునందలి యగ్నిచే పక్వమై మాంసముగ పరిణమించును. ఇత్తెరంగున మాంసమువలన మేదస్సును, మేదస్సువలన అస్థియుం, అస్థులవలన మజ్జయుం, మజ్జవలన శుక్రంబును, శుక్రముయొక్క సారమువలన గర్భంబును వరుసగ కల్గును.

ఇది ఫలితార్థము. దీనివివరణ మీరీతి నెరుంగునది:—మనుజులు భుజించు నాహారపదార్థములన్నియుం పంచభూతవికారము లైయుండును. దాన జనించినశరీరంబును పాంచభౌతికము. పాంచభౌతికమగు షడ్రసలి విశిష్టమైన యాహారమును భుజించినపుడు దానిని శిరస్సునందు ప్రాణవాతము గ్రహణీమూలముగ తొలుత ఆమాశయమున జేర్చును. అందలి పాచకపిత్తమను కాయాగ్నిచే తొలుత పచింపబడును. పిదప నావిధముగ జాఠరాగ్నిచే పక్వమైన యాహారము పక్వాశయమునజేరును.పిదప పాంచభౌతిక శరీరమునందలి మహాభూతాగ్నులైదిటిచే నాహారమునందలి పంచభూతగుణములు పచింపబడును. ఇట్లు జాఠరాగ్నిచేతను భూతాగ్నులచేతను పక్వమైన యాహారము సారముగను కిట్టముగను రెండువిధముల నేర్పడును. అందు ఆహారమునందలి ద్రవరూపమైన సారము ముఖ్యమైనది. ఇదియే ఆహారరసమనియుం చెప్పబడును. ఇది రసాదిధాతువుల కన్నిటికిని మూలకారణము.

అట్టిసారము (ఆహారరసమునందలి స్వచ్ఛభాగము)తొలుత హృదయమున జేరును. పిదప నాహృదయమునుండు వ్యానవాతముచే విక్షిప్తమై యచ్చటనుండు పది మూలసిరలయందు (రసవహ సిరలయందు) జేరి శరీరమునందెల్ల వ్యాపింపబడుచు శరీరమునందలి రసధాతువుతో నేకీభవించి రసధాత్వాశయమునందు రసధాతువుకు సంబంధించినయగ్నిచే (భూతాగ్ని సహాయమునంజేసి)పచింపబడి రక్తధాతువుకు మూలకారణమైన సారముగ పరిణమించును. ఇదియే రసధాతువు. అట్టి రక్తధాతుమూలకారణమైన రసధాతువు శరీరమునందలి రక్తముతో నేకమై రక్తధాత్వాశయమునందు రక్తధాత్వగ్నిచే భూతాగ్నిసాహాయ్యమున పచింపబడి మాంసధాతువునకు మూలకారణమైన సారముగ పరిణమించును. అదియ రక్తధాతువు.అయ్యది మాంసముతో నేకమై మాంసధాతువుకు సంబంధించినయగ్నిచే పచింపబడి మేదస్సుకు మూలకారణమైన సారముగ పరిణమించును. ఇత్తెరంగుననే మేదస్సును, మేదస్సారమువలన నస్థులును, దానివలన మజ్జయు,దానివలన శుక్రంబును వరుసగ నాయాధాతువులసంబంధములగు నాయాధాత్వగ్నులచే భూతాగ్నిసాహాయ్యమున పచింపబడి మాంసమువలన మేదస్సును, మేదస్సువలన అస్థులును, అస్థులవలన మజ్జయు, మజ్జవలన శుక్రంబును కల్గును. ఇదియ సప్తధాతువుల యుంత్పత్తిక్రమము. అందు శుక్రధాతువు శుక్రధాతునిష్ఠమైన ధాత్వగ్నిచే పచింపబడి గర్భమున గర్భోత్పత్తికి కారణమై గర్భమును కల్గించును.

పైజెప్పిన విషయమునే సంగ్రహముగ నగ్నిచిత్తను మునిపుంగవు లిట్లు చెప్పిరి:—
'తత్రాహారాత్సారపూర్వం రసధాతుర్వివర్ధతే, రక్తం ధాతురసాచ్చైవ రక్తాఖ్యా

స్తాంసమేవ చ. మేదోధాతుస్తతో మాంసాత్ అస్థ్యాఖ్యో మేదసస్తథా, మజ్జాధాతుస్తతోఽస్థ్యాఖ్యాత్ మజ్జశ్శుక్రస్య ఏవచ, శుక్రాత్పరంచ గర్భస్యసమ్భవః పరికీర్తితః."

పైవాక్యముల చేత ఆహారరసమునుండి రసధాతువుపరిణమించి రసధాతువును వృద్ధినొందించుననియు, ఇత్తెరంగుననే రక్తాదిధాతువులుగ పరిణమించి దాని దానికి సమానజాతియగు ఆయాధాతువును వృద్ధినొందించుననియు, కడపట శుక్రధాతువవలన గర్భము కల్గుననియు తెలియుచున్నది.

ఇచ్చట నీవిమర్శనము నెరుంగునది:—ఆహారసారము రసధాత్వగ్నిచే పచింపబడి రసధాతురూపముగ పరిణమించినది. రసధాతువు పచింపబడి రక్తముగను, అయ్యది పచింపబడిన మాంసముగను, ఈక్రమముగ నొకధాతువునుండి యొకధాతువు పుట్టునని "రసాద్రక్తంతతో మాంసం... ప్రజాయతే" అను పైవాక్యముచే స్ఫుటమగుచున్నది. చరకాదిమహర్షులును ఈ యానుపూర్వినే జెప్పియున్నారు. ఆహారరసము పక్వమై రసధాతువగును. అది పక్వమై రక్తమగును. ఈరీతిగ నొక్కొకధాతువు పక్వమై మరియొక ధాతువుగ పరిణమించును. అట్లుండ 'సారస్తుసప్తభిర్భూయోయథాస్వంపచ్యతేఽగ్నిభిః" అనువాక్యముచే నాహారరసము సప్తధాతువులచే పక్వమగుననుట యెట్లు సంగతమగును. రక్తాదిధాత్వగ్నులచేత రక్తాదిధాతువులు పక్వములగునుగాని యాహారసారము పక్వమగుట లేదుగదా? అని యాశంకకల్గును. కాని యిదియుక్తముకాదు—ఆహారసారము పక్వమై రసధాతువుగ పరిణమించెను. అట్టి యాహారరస పరిణామరూపాన్తరమై రక్తమైనది. ఇత్తెరంగున వరుసగ పరిణమించునపుడు అన్నిటికిని మూలకారణమైనది యాహారసారము కావున అట్టి సారకార్యములైన రసరక్తాదిధాతువులు పచింపబడునపుడు అన్నిటియందును (మృద్వికారములయందు మృత్తు వ్యాపించి యుండునట్లు) అనుస్యూతమై వ్యాపించియుండు ఆహారసారము పచింపబడినది యగును కావున సారము సప్తధాత్వగ్నులచే పచింపబడునని చెప్పినది సుసంగతము.

## ధాతువుల మలములు.

కఫః పిత్తం మలః ఖేషు ప్రస్వేదో నఖరోమ చ. ౬౩
స్నేహోఽక్షిత్వగ్విశామోజో ధాతూనాం క్రమశో మలాః,

పైజెప్పినరీతిగ రసాదిధాతువులు ఆయాధాత్వగ్నిచే రచింపబడి ఆహారము సారకిట్టములుగ నేర్పడినట్లు సారముగను మలముగను ఏర్పడును. అందు ఒక్కొక ధాతువుయొక్క సారము ఇంకొక ధాతువుగ మారుచుండును. ఆధాతువుల మలములీక్రింద వివరింపబడు విధముగ నెరుంగునది.—అందు రసధాతువుయొక్క మలము కఫము. రక్తధాతువుయొక్క మలము పిత్తము. నాసారంధ్రములు మున్నగు ద్వారములయందు

పుట్టుమలములు మాంసమునకు సంబంధించినది. రోమరంధ్రములనుండి స్రవించుచెమట మేదస్సుయొక్క మలము. గోళ్లును రోమములును అస్థులకు మలములు. కన్నులయందును చర్మమునందును పురీషమునందునుగలజిడ్డు మజ్జకు సంబంధించినమలము. రసధాతువు మొదలుజేసి శుక్రధాతువు వరకుంగల యేడుధాతువుల సారరూపమైన యోజస్సు శుక్రధాతువుకు సంబంధించినమలము.

## ధాతువులసారకిట్టములు, స్నేహశాత్కృష్ట్యము.

ప్రసాదకిట్టౌ ధాతూనాం పాకాదేవం ద్వివిధర్ఛతః. ౬౪
పరస్పరోపసంస్తంభాత్ ధాతుస్నేహపరంపరా,

రసరక్తాదిధాతువులకు ఆయాధాత్వగ్నులచే పాకము కల్గుటవలన ఆహారమునకు కల్గినవిధముగ సారకిట్టములుగ ద్వైవిధ్యము కల్గును. (ధాత్వగ్నిపాకమునంజేసి సారముగను కిట్టముగను రెండువిధములుగ నగుననిభావము). మరియు నీధాతువులు పాకవిశేషమువలన పరస్పర సంబంధమునంజేసి స్నేహముయొక్క పరంపర కల్గును. (రసధాతువు పక్వమైనపుడు దానిసారము (పాలయందు మీగడకల్గువిధముగ) స్నేహరూపమైన రక్తమగును. రక్తము పక్వమై (మీగడనుండి వెన్నకల్గువిధముగ) అంతకన్న స్నేహమైన మాంసమగును. ఇత్తెరంగున ధాత్వగ్ని పాకమునంజేసి స్నేహపరంపర కల్గుననిభావము). ఇత్తెరంగున నొక ధాతువుకన్న నొకటి యుత్తరోత్తర స్నేహమధికమై సారాధికముగ నుండును.

## ఆహారపరిపాకకాలనియమము.

కేచిదాహురహోరాత్రాత్ షడహాదపరే పరేః. ౬౫
మాసేన యాతి శుక్రత్వం అన్నం పాకక్రమాదిభిః,

భుజింపబడిన యాహారము పైజెప్పిన రీతిగ తొలుత జాఠరాగ్నిచేత పచింపబడి పిదప ధాత్వగ్నులచే పచింపబడి సారకిట్టములుగ నేర్పడి పిమ్మట ధాత్వగ్నులచే పచింపబడి రసరక్తాదిరూపముగ పరిణమించుచు క్రమముగ నొక యహోరాత్రమునకు శుక్రరూపముగ పరిణమించునని కొందరాచార్యులు చెప్పెదరు. పైజెప్పినక్రమముగ జాఠర ధాత్వగ్నులచే పచింపబడుచు పరిణామక్రమముగ నాయాధాతురూపము నొందుచు ఆరుదినములకు శుక్రముగ పరిణమించునని మరికొందరాచార్యులుచెప్పెదరు. భుజించిన దినముమొదలు పైజెప్పిన క్రమముగ నగ్నులచే పచింపబడుచు నాయాధాతురూపముగ పరిణమించుచు నొక మాసమునకు శుక్రధాతు రూపముగ బరిణమించునని కొందరాచార్యులు వచించెదరు.

పరాశరులు ఆహారపరిణామకాలము నిట్లునిరూపించెను.—"ఆహారోఽద్యతనో యశ్చశ్వో రసత్వంసగచ్ఛతి, శోణితత్వం తృతీయేఽహ్ని చతుర్థే మాంసతామపి. మేద స్త్వం పఞ్చమే, షష్ఠేత్వస్థిత్వం, సప్తమేవ్రజేత్, మజ్జాత్వం, శుక్రతామేతి దివసే త్వష్టమే నృణామ్. తస్మాద్ధి పథ్యాఽపథ్యాభ్యాం ఆహారాభ్యాం నృణాంధ్రువమ్, సప్తరాత్రేణ శుద్ధ్యన్తి ప్రదుష్యన్తి చ ధాతవః." భుజింపబడిన యాహారము నాటిదిన ము జాఠరభూతాగ్నులచే పచింపబడును. మరుసటిదినమున రసధాతువుగ పరిణమించు ను. అదిమొదలు ఒక్కొకదినమున నొక్కొక భూతాగ్నిచే పచింపబడుచు మూడవ నాటికి రక్తముగను, నాల్గవనాడు మాంసముగను, ఐదవనాడు మేదస్సుగను, ఆరవదిన ము అస్థిగను, ఏడవదినము మజ్జగను, ఎనిమిదవదినమునకు శుక్రముగను పరిణమించునని భావము. ఇత్తెరంగున నేడుదినములకు ఆహార పరిణామము పూర్తియగును. కావుననే పథ్యాహారముల నేడుదినములు చేసిన ధాతువులు పరిశుద్ధములగును. అపథ్యాహారముల నేడుదినములు చేసిన ధాతువులు దుష్టములగును. (భుజింపబడిన యాహారము నాడు మొదలుజేసి యెనిమిదవనాటికి శుక్రముగ పరిణమించునని వీరిమతము. ఇదియ యుంత్త మమని తోచెడి.)

## —భోజ్యధాతు పరివర్తననియమము.—

సతతం భోజ్యధాతూనాం పరివృత్తిస్తు చక్రవత్ ౬౬

(పైజెప్పిన ప్రకారము ధాత్వగ్నిచే పాకమునొందు ధాతువు ఇంకొకధాతువు కు ఆహారమగును. శరీరముననుండు కాయాగ్ని భుజించునాహారమును పచింపజేసి శరీరమునకు బలమును కల్గించువిధముగ రసధాతువు శరీరమునందలి రసధాతు నిష్ఠధాత్వ గ్నిచే పచింపబడి రక్తధాతువునకు నాహారమగును. కావుననే యాహారసారము రసధా తువుతోగలిసి యాధాతువును వృద్ధినొందించును. ఇత్తెరంగుననె తక్కిన ధాతువులును పాకావస్థయందు భోజ్యములుగనుండి పక్వమైన పిదప ఇంకొక ధాతువుగ మారుచుం డును. ఈవిషయమును చరకాచార్యు లిట్లుపదేశించిరి.—"స్రోతసా చ యథా స్వేన ధాతుః పుష్యతి ధాతునా" "ధాతవో హి ధాత్వాహారాః ప్రకృతి మనువర్తన్తే" ఆ ధాత్వగ్నులచే పచింపబడు ధాతువులు శరీరమునందలి ఆయాధాతువులకు నాహారరూప ములుగనుండి ప్రకృతిభూతములగు (శరీరనిష్ఠములైన) ఆయాధాతువుల ననుగమిం చును. ఆహారరూపములగు నాయాధాతువులచేతను, వాని కాధారములగు నాయాస్రో తస్సుల చేతను ఆయాధాతువులు పుష్టినొందును అనియర్థము.)

ఇత్తెరంగున భోజ్యరూపములైన ధాతువులు ప్రకృతిధాతువుల ననుగమించు చుండుతరి నొకదానికొకటి భోజ్యములై ధాత్వంతరముగ మారుచుండును. భోజ్యధా

తువుల కీమార్పు అనాదిగ చక్రభ్రమణమువలె మారుచుండును. (రసధాతువు రక్తధాతువునకు భోజ్యముగనుండి పాకవిశేషమునంజేసి రక్తధాతువుగ మారుచుండును. ఆరక్తధాతువును భోజ్యమై మాంసముగ మారును. ఇత్తెరంగున ధాతువులకు భోజ్యావస్థ చక్రభ్రమణమువలె నెల్లప్పుడును మారుచునే యుండునుగాని యీపరివర్తనమునకు మార్పు లేదనుట.)

## వృష్యాది ద్రవ్యపరిణామకాలము.

వృష్యాదీని ప్రభావేణ సద్యశ్శుక్రాది కుర్వతే,

పాలు, మాంసరసము, అతిమధురము, ఉద్దులు, గుమ్మడికాయ మున్నగువృష్యములు (సంభోగమునందు శక్తిని వృద్ధి నొందించునవి) అయ్యవి తమయందలి యనిర్వాచ్యమగు నమోఘప్రభావమునంజేసి పరిణామకాలనియతి నపేక్షింపకయే శుక్రమును ఆక్షణముననే వృద్ధినొందించును. మరియు మూఢగర్భమును వెడలించు నౌషధవిశేషంబులును, మావినివెడలించు శక్తిగల యౌషధంబులును అతిశీఘ్రముగ (పరిణామకాలము నపేక్షింపక) పని చేయును. ఇందుకు కారణము ప్రభావమే యగును.

## ఔషధవిశేష పరిణామకాలము.

ప్రాయః కరోత్యహోరాత్రాత్కర్మాన్యదపి భేషజమ్. ౬౭

మరియు కొన్ని చూర్ణములు గుటికలు మున్నగునవి ఒక యహోరాత్రమునకు ప్రాయికముగ వాయూ దీపనాది కృత్యముల జేయును.

ఇచ్చట ప్రాయః అనుటవలన కొన్ని యౌషధములు అహోరాత్రమునకు పిమ్మట పని నేయుననియు, కొన్ని వీర్యాతిశయముచే ముందుగనే పని సేయుననియు భావమును దెలియ జేయును.

## శరీరములో నేకదేశమున వ్యాధికల్గుటకు కారణము.

వ్యానేన రసధాతుర్హి విక్షేపోచితకర్మణా,
యుగపత్సర్వతోఽజస్రం దేహే విక్షిప్యతే సదా. ౬౮
క్షిప్యమాణః ఖవైగుణ్యాత్ రసస్సజ్జతి యత్ర సః,
తస్మిన్ వికారం కురుతే ఖే వర్షమివ తోయదః. ౬౯

(పైజెప్పబడిన ప్రకారము జాఠరాగ్నిచే పక్వమైన యాహారమునయొక్క రసము రసధాతువులో గలిసి యేకరూపముగనుండి రసరక్తాది ధాతురూపముగ పరిణమించుచు శుక్రముయొక్క సారముగనై, గర్భరూపమున నగునని పైజెప్పినయానుపూర్విచే నేర్పడును. సర్వశరీరమునందు రసధాతువు ఆపాదకేశము వ్యాపించియుండ శరీరము

నందొక్కచోట నొకసమయమున వ్యాధియెట్లు సంభవించును? రసధాతువు చెడి వ్యాధి సంభవించునపుడు అయ్యది శరీరమునందెల్ల వ్యాపించియుండుటవలన శరీరమునందెల్ల వ్యాధికల్గుట సహజము ఏకదేశమునందు మాత్రము ఎట్లు సంభవించును? మరియు ధాతువులలో నొకదానికి వృద్ధిక్షయము లెట్లు సంభవించును? అన్నచో దానికి సమాధానము పైవాక్యముచే జెప్పబడినది)

వ్యానవాతము హృదయస్థానమున నుండును. అయ్యది ప్రేరణమే యుచితమైన వ్యాపారముగ గల్గినది. కావున ఆహార సారప్రసాదరూపమైన రసధాతువును ప్రేరేపించి రసవహస్రోతోమూలముగ సర్వశరీరమునం దేకకాలమున నెల్లపుడును వ్యాపింప జేయుచుండును. అట్టియెడ రసధాతువు వ్యాపించు స్రోతోవైపరీత్యముచేత దానిమార్గమున వ్యానవాతముచేగాని పోవబడు రసధాతువున కడ్డుకల్గి నిరుద్ధమైనపుడు ఎచ్చట నయ్యదిచేరునో అచ్చట వ్యాధి సంభవించునుగాని శరీరమునందెల్ల సంభవింపనేరదు. ఆకసమునందు మేఘబృందమునల్లడల వ్యాపించియున్నను ఏకదేశమున వర్షమును వర్షించునుకాని అంతటను ఏకకాలమున వర్షించుటలేదుకదా? ఆవిధముగనే రసధాతువునకు వ్యత్యయముకల్గిన స్థలమునమాత్రము వ్యాధిసంభవించునుగాని శరీరమునందెల్ల నేకకాలమున సంభవింపదు. మరియు రసాదిధాతువులలో నేధాతువునకు సంబంధించిన స్రోతస్సు విగుణమగునో ఆధాతువునకు సంబంధించిన వికారము కల్గును.

దోషాణామపి చైవం స్యాత్ ఏకదేశప్రకోపణమ్,
అన్నభౌతికధాత్వగ్నికర్మేతి పరిభాషితమ్. ౭౦

వాతపిత్తకఫములును పైజెప్పినవిధముగ వ్యానవాతముచే ప్రేరితమై వ్యాపించునప్పుడు పైజెప్పిన కారణముచేతనే యేకదేశమున ప్రకోపించి వికారముల గల్గించును. కావుననే దద్రుసిధ్మము శోఫమున్నగునవి యేకదేశమున సంభవించును. ఇత్తెరంగున అన్నమునకును పచింపజేయు జాఠరాగ్నియొక్కయు, పృథివ్యాది భూతములకు సంబంధించిన పంచభూతాగ్నుల యొక్కయు, రసాది ధాతువులకు సంబంధించిన ధాత్వగ్నుల యొక్కయు కృత్యములు వేరువేరుగ నిర్ణయించి చెప్పబడినది.

('అన్నం కాలే ఒభ్యవహృతం' అని యుపక్రమించి 'కటుమారుతమ్' అనునంత వరకుగల గ్రంథముచేత అన్నమునుపచించు జాఠరాగ్ని కృత్యంబును, "భౌమాప్యాగ్నేయ......శేషాశ్చపాంశ్చ దేహజాన్" అనుగ్రంథముచేత భూతాగ్నికృత్యంబులును, "సారస్తునత్తభిర్భ్యాయః......ప్రసాదకిట్టౌ ధాతూనాం" అను గ్రంథముచేత ధాత్వగ్నికృత్యములును వివరింపబడినవని భావము.)

### జాఠరాగ్ని ప్రాధాన్యము.

అన్నస్య పక్తా సర్వేషాం పక్తౄణామధిపో మతః,
తన్మూలాస్తే హి తద్వృద్ధిక్షయవృద్ధిక్షయాత్మకాః. ౭౧
తస్మాత్తం విధివద్యుక్తైః అన్నపానేన్ధనైర్హితైః,
పాలయేత్ప్రయతస్తస్య స్థితౌ హ్యాయుర్బలస్థితిః. ౭౨

భుజింపబడిన యన్నమును పచింపజేయు పాచకాగ్ని తక్కిన ధాత్వగ్నులకును భూతాగ్నులకును (వృక్షముయొక్క శాఖోపశాఖలకు జన్మకారణమైనవిధముగ) మూలకారణమగు. ఆయగ్నులయొక్క వృద్ధిక్షయములు జాఠరాగ్ని వృద్ధిక్షయముల నాధారముగజేసి యుండును. (జఠరాగ్ని వృద్ధి నొందియున్నపుడు తక్కినయగ్నులు వృద్ధినొందును. అయ్యది క్షీణమగునపుడు తక్కినయగ్నులు క్షీణించుననిభావము.) కావున భూతధాత్వగ్నులకన్న జాఠరపాచకాగ్ని మిక్కిలి యధికమైనది. కావున శాస్త్రసమ్మతములును, యుక్తియుక్తములు, హితంబులునైన యన్నపానము లనుసమిధల చేత మిక్కిలి ప్రయత్నముతో చెడనీయక వృద్ధినొందించుచు కాపాడవలెను. "అగ్నిమూలం బలం పుంసాం బలమూలం హి జీవితమ్" అనువచన ప్రకారము శరీరబలము అగ్నిని ఆధారముగ జేసికొనియుండును. అట్టిబలము నాధారముజేసి జీవితముండును. కావున నాయువునకును బలమునకును మూలకారణమైనది పాచకాగ్ని. కావున దానిని మిక్కిలి జాగ్రతతో పైజెప్పినవిధముగ నాహారాదులచే చెడనీయక కాపాడుట ముఖ్యమైన పనియని భావము.

### జాఠరాగ్ని భేదములు.

సమస్సమానే స్థానస్థే విషమోఽగ్నిర్విమార్గగే,
పిత్తాభిమూర్ఛితే తీక్ష్ణో మన్దోఽస్మిన్ కఫమూర్ఛితే. ౭౩
సమోఽగ్నిర్విషమస్తీక్ష్ణః మన్దశ్చైవం చతుర్విధః,

(సమానవాతము జాఠరపాచకాగ్నికి సమీపమున ప్రధానముగనుండి కోష్ఠమును నందంతట సంచరించుచు భుజింపబడిన యాహారమును గ్రహించి జాఠరాగ్నికి తోడై వృద్ధినొందించి యాహారమును పచింపజేయును. సారకిట్టముల వేరుజేసి కిట్టమును విసర్జించుచును.)

జాఠరాగ్నికి దోడైన సమానవాతము తనకు స్వస్థానమైన యగ్నికి సమీపముననే యున్నపుడు జాఠరాగ్ని సమమని చెప్పబడును. సమానవాతము తనస్థానమును వదలి యుత్పథముగ సంచరించినయెడ విషమాగ్నియని చెప్పబడును, అయ్యది (సమాన

వాతము) పిత్తముతో గలిసి వ్యాపించునెడ తీక్ష్ణాగ్ని యనబడును. కఫముతో గలిసి సమానాగ్ని సంచరించునేని మందాగ్నియని చెప్పబడును. ఇత్తెరంగున జాఠరాగ్ని సమ-విషమ-తీక్ష్ణ-మందభేదములచే నాల్గువిధముల నుండును.

## సమ-విషమ-తీక్ష్ణ-మందాగ్నుల ప్రత్యేకలక్షణములు.

యః పచేత్సమ్యగేవాన్నం భుక్తం సమ్యక్సమస్త్వసౌ. ౨౪
విషమోఽసమ్యగప్యాశు సమ్యక్ క్వాపి చిరాత్పచేత్,
తీక్ష్ణో వహ్నిః పచేచ్ఛీఘ్రం అసమ్యగపి భోజనమ్. ౨౫
మన్దస్తు సమ్యగప్యన్నం ఉపభుక్తం చిరాత్ పచేత్,
కృత్వాఽఽస్యశోషాటోపాన్త్ర కూజనాధ్మానగౌరవమ్. ౨౬

దేశకాలాదుల ననుసరింప సరియైన ప్రమాణముగ విధ్యుక్తప్రకారము భుజింపబడిన యన్నమును చక్కగ సకాలమున పచింపజేయు జాఠరాగ్ని సమాగ్ని యనబడును. (పైజెప్పినవిధముగ భుజింపబడిన యాహారము యుక్తకాలమున చక్కగ జీర్ణమగుచున్నయెడ జాఠరాగ్ని సమస్థితి నున్నదని తెలియనగును. తక్కినవానికి నిట్లే చూచుకొనునది.)

దేశకాలమాత్రావిధుల ననుసరింపక భుజింపబడిన యన్నమును ఒకప్పు డతిశీఘ్రముగ పచింపజేసి, దేశకాలమాత్రావిధుల ననుసరించి యుక్తముగ భుజింపబడిన యన్నమునుకూడ నొకప్పుడు చిరకాలమునకు పచింపజేసిన నయ్యది విషమాగ్ని యనబడును.

దేశకాల మాత్రావిధుల ననుసరింపక భుజింపబడిన యాహారమునుకూడ నతిశీఘ్రముగ పచింపజేయునది తీక్ష్ణాగ్నియని యెరుంగునది.

దేశకాలాద్యనుసారముగ భుజింపబడిన యన్నమునుకూడ ఆస్యశోషమును (నోరెండుటను), ఆటోపమును (కడుపుళో గడబిడను), ప్రేవులయందు కూతలను, కడుపుబ్బరమును, గురుత్వమును గల్గించి చిరకాలమునకు పచింపజేయు జాఠరాగ్ని మందాగ్ని యనబడును.

మరియు "సభక్తమౌషధం తస్మాన్మందాగ్నేరవచారయేత్" అని యష్టాంగ సంగ్రహమున జెప్పియున్నది కావున మందాగ్నియందు అన్నముతోగూడ చేర్చి యౌషధము నుపయోగించుట యుచితము.

## దేహబలత్రైవిధ్యము.

సహజం కాలజం యుక్తికృతం దేహబలం త్రిధా,
తత్ర సత్త్వశరీరోత్థం ప్రాకృతం సహజం బలమ్. ౨౭

వయస్కృతమృతూత్థం చ కాలజం యుక్తిజం పునః,
విహారాహారజనితం తథోర్జస్కరయోగజమ్. ౭౮

శరీరబలము సహజము (శరీరముతోకూడ జన్మకాలమున బుట్టినది), కాలజము (కాలవిశేషమువలన కల్గినది), యుక్తికృతము (యుక్తిచేకల్గినది) నని మూడువిధములు. అందు సత్వరజస్తమోగుణముల శరీరమునకుకల్గిన బలము సహజము. ఇదియే త్రిగుణాత్మకమగు ప్రకృతి సంబంధమున జన్మకాలముననే పుట్టుటంజేసి ప్రాకృతమనియుసహజమనియుం జెప్పబడును. బాల్యము యౌవనము కౌమారమునను వయోఽవస్థలచే నాకాలమున బుట్టినదియు, హేమంతాది ఋతువిశేషములయందు ఋతుస్వభావంబునంజేసి కల్గినదియు కాలజమగుబలము. పలుదెరంగులైన వాఙ్మనస్సులకు సంబంధించిన చేష్టావిశేషరూపములగు విహారముల చేతను, బలకరములగు నాహారవిశేషముల చేతను కల్గిన బలమును, బలకరములగు రసాయనాది యోగముల చే గల్గిన బలంబును యుక్తిజము.

బలిష్ఠులైన పురుషులుకల దేశమునపుట్టుటయు, సుఖము, బీజక్షేత్రములయొక్క గుణములు, శరీరాహారముల సంపత్తి, రసాయన వాజీకరణాదులు, ఇవియన్నియుం యుక్తులు. అట్టివానివలనగల్గినది యుక్తజము.

## జాంగల-అనూప-సమ దేశములు.

దేశోఽల్పవారిద్రునగో జాఙ్గలస్స్వల్పరోగదః,
అనూపో విపరీతోఽస్మాత్ సమస్సాధారణస్స్మృతః. ౭౯

దేశము జాంగలము, అనూపము, సాధారణమునని మూడువిధములు. అందు జలంబును వృక్షంబులును పర్వతములును స్వల్పముగనుండు ప్రదేశము జాంగలదేశము. (ఇచ్చట రోగములు స్వల్పముగ గల్గును. జలవృక్ష పర్వతములు అధికముగ నుండునది యానూపదేశము. ఈదేశము రోగముల నధికముగ కల్గించును. జలవృక్షపర్వతములు మిక్కిలి యధికముగ నుండక మితముగనుండు దేశము సమదేశము. ఈదేశమున రోగములు మిక్కిలి యధికములు గాకుండును.

## మజ్జ, మేదస్సుమున్నగువాని పరిమాణము.

మజ్జమేదోవసామూత్రపిత్తశ్లేష్మశకృన్త్యసృక్,
రసో జలం చ దేహేఽస్మిన్ ఏకైకాఞ్జలివర్ధితమ్. ౮౦

శరీరమునందలి మజ్జ, మేదస్సు, వస, మూత్రము, పిత్తము, శ్లేష్మము, పురీషము, రక్తము, రసము, జలము, అను నీపదియును ఒకదానికన్న నొకటి అంజలి పరిమితిచే నధికముగనుండును. (మజ్జ అంజలి పరిమితము. మేదస్సు రెండు అంజలుల పరి

మితము. వస మూడు అంజలులపరిమితము. మూత్రము నాలుగంజలులు. పిత్తము ఐదంజలులు. శ్లేష్మము ఆరంజలుల పరిమితము. పురీషము ఏడంజలుల పరిమితము. రక్తము ఎనిమిది అంజలుల పరిమితము. రసము తొమ్మిది అంజలుల పరిమితము. జలము పదియంజలుల పరిమితముగా నైయుండునని భావము.)

ఓజస్సు, మస్తిష్కము, రేతస్సు, స్తన్యము, ఆర్తవము, వీనిపరిమితి.

పృథక్ స్వప్రసృతం ప్రోక్తం ఓజోమస్తిష్కరేతసామ్,
ద్వావఞ్జలీతు స్తన్యస్య చత్వారో రజసస్త్రియాః. ౨౧
సమధాతోరిదం మానం విద్యాద్వృద్ధిక్షయావతః.

శరీరమునందలి సర్వధాతు ప్రసాదరూపమైన యోజస్సును, శిరస్సునందలి బుద్ధికి స్థానమైన మస్తిష్కంబును, ఏడవధాతురూపమైన రేతస్సు (శుక్రము)ను ప్రతిమనుజునకు వానివాని చేరతో నొక్కొక చేరెడేసి యుండును. స్త్రీలకు స్తనములయందు వారి వారి దోసిలిచే రెండు దోసిలుల పరిమిత స్తన్యముండును. ఆర్తవరక్తము నాల్గుదోసిలుల పరిమితముండును. మజ్జాదులకుచెప్పిన పరిమాణము శరీరమునందలి ధాతువులు సమస్థితి నుండువారికి నియతము. అటుకాక ఏకదోష ద్విదోషాదులు అధికములైన ప్రకృతులు కలవారికి పైజెప్పిన పరిమాణమునకన్న వృద్ధిక్షయములు కల్గియుండును.

ఇచ్చట "స్వప్రసృతమ్" అనుటచేత ప్రసృతంబును అంజలియు తనచేతితో పరిమితిజూచుకొనవలెనని యర్థము జెప్పనగుగాని మానపరిభాషలో "రెండుపలములు ప్రసృతము, నాల్గుపలములు అంజలి" యనుసాంకేతిత పరిమాణము గ్రహింపగూడదు. లేనిచో స్వశబ్దము వ్యర్థమగును.

మరియు కఫపిత్తములు మూర్తిమంతము లగుటవలన నీ రెండిటికిని పరిమాణము చెప్పబడినది. వాతమున కాకారములేదు కావున పరమితి జెప్పలేదు. కావున వాతమునకుజెప్పిన లక్షణములమాత్రము బట్టి దాని సమన్యూనాధికస్థితిని గమనింపనగును. ఈవిషయమును చరకాచార్యు లిట్లుపదేశించిరి.—

"సమానోన్మానతా వాయోః అరూపత్వాత్తు యుజ్యతే."

సప్తవిధప్రకృతులు వానికారణములు.

శుక్రాసృగ్గర్భిణీభోజ్యచేష్టాగర్భాశయర్తుషు,
యస్స్యాద్దోషోఽధికస్తేన ప్రకృతిస్సప్తధోదితా. ౨౩

శుక్రమునందును ఆర్తవమునందును, గర్భిణియొక్క ఆహారవిహారములయందును గర్భాశయమునందును, గర్భోత్పత్తి కాలమైన ఋతుకాలదినములయందును వాతాది

దోషములలో నేదోషము అధికముగనుండునో అట్టి దోషముచేత శరీర ప్రకృతికల్గును. అట్టి ప్రకృతి వాతాదిభేదములచే నేడువిధములగును.

ఇచ్చట నీవివరణము నెరుంగునది. శరీరోత్పత్తికి తల్లి తండ్రులయొక్క శుక్రార్తవములు ప్రధానకారణములు కావున వానియందు వాతాదిదోషములలో నేదియధికముగ నుండునో అట్టి ప్రకృతి ఆ శుక్రార్తవములచే గల్గినవారికి సంభవించును. మరియు తల్లి గర్భవతిగ నున్నతరి ఆహారవిహారముల వల్లనపుడు అవి యేదోషమధికముగనుండునో ఆ దోషమునకు సంబంధించిన ప్రకృతికల్గును. గర్భాశయమునం దేదోషము ప్రబలముగ నుండునో అట్టి ప్రకృతికల్గును. గర్భోత్పత్తికి కాలమైనఋతుదినములో నేదోషము ప్రబల ముగనుండునో అట్టిప్రకృతిసంభవించును. ఆశిశువుకు జననకాలమునకు గర్భావస్థయందే అట్టిదోషము సంక్రమించి యవిచ్ఛిన్నముగనుండును. కావునఅయ్యదిప్రకృతియనిచెప్ప బడును. అందువలననే విషమున బుట్టిన పురుగు విషముచే నపాయము లేకుండు భంగి సహజసిద్ధమైన యీ ప్రకృతిచే మనుజున కొకప్పుడును వికారముకల్గదు. కాని చికిత్సా కాలమునందుమాత్ర మట్టి ప్రకృతిని గమనించి చికిత్స జేయుట ముఖ్యము. ఈ విష యమే ఆయుష్కామీయాధ్యాయమున "శుక్రార్తవస్థైర్జన్మాదౌ విషేణేవ విషక్రిమేః" అని సూచింపబడినది.

అట్టిప్రకృతి పైజెప్పిన శుక్రార్తవాదులయందు వాతమధికముగనున్నచో వాత ప్రకృతియనియు, పిత్తమధికముగనుండుతరి పిత్తప్రకృతియనియు, శ్లేష్మమధికముగ నుండునెడ కఫప్రకృతియనియు, వాతపిత్తములు రెండు నధికముగనుండునేని వాత పిత్తప్రకృతియనియు, వాతకఫము లధికముగనుండునెడ వాతకఫ ప్రకృతియనియు, పిత్తకఫము లధికమైనచో పిత్తకఫ ప్రకృతియనియు, మూడుదోషములును సమములుగ నధికములైనచో నది త్రిదోషప్రకృతియనియు చెప్పబడు. ఇవియే సప్తవిధ ప్రకృతి భేదములు.

సన్నిపాతప్రకృతియందు మూడుదోషములును సమస్థితి నుండును. కావున నాధిక్యమెట్లు తెలియనగునననిన వాతపిత్త కఫములుమూడును స్వప్రమాణమునకన్న నధికములుగ నుండును. కావున సమప్రకృతియందును ఆధిక్యము నెరుంగనగును. లేక 'అధికః' అనుచోట బాహుల్యముగ నధికముగనుండును. అని చెప్పి సమధాతు ప్రకృతి యందు దోషాధిక్యము లేక సమస్థితినుండునని యర్థము చెప్పుట సమంజసము.

పైజెప్పబడిన ప్రకృతులలో వాతప్రకృతి హీనమనియు పిత్తప్రకృతి మధ్యము మనియు, కఫప్రకృతియుత్తమమనియు, సమప్రకృతి యన్నిటికన్న యుత్తమోత్తమం

బనియు, తక్కిన సంసర్గజప్రకృతులు నింద్యములనియు నెరుంగునది. ఈవిషయము ఆయుష్కామీయాధ్యాయమున నిట్లు చెప్పబడినది.—

"తైశ్చ తిస్రః ప్రకృతయో హీనమధ్యోత్తమాః పృథక్,
సమధాతుస్సమః తాసు శ్రేష్ఠః నిన్ద్యాః ద్విదోషజాః."

## వాతమునకు ప్రాధాన్యము.

విభుత్వాదాశుకారిత్వాత్ బలిత్వాదన్యకోపనాత్,
స్వాతన్త్ర్యాద్బహురోగత్వాత్ దోషాణాం ప్రబలోఽనిలః

వాతము సుసూక్ష్మస్థలములయందును వ్యాపించు స్వభావము కల్గినది. శీఘ్రముగ వ్యాపించి పని చేయునది. ప్రశస్తమైన బలముకల్గినది. పిత్తకఫములను ప్రకోపింపజేయు శక్తికల్గినది. కావుననే స్వతంత్రమైనది. అనేకరోగములను గల్గించునది. ఇట్టిగుణములు కల్గియుండుటంజేసి తక్కినదోషములకన్న ప్రబలమైనది. (కావున ప్రధానమైన దనిభావము.)

"అశీతిర్వాతజా రోగాః చత్వారింశచ్చ పిత్తజాః వింశతి శ్లేష్మజాః" అనువాక్యమున వాతజనితరోగములు ఎనుబదియని పరిగణనము చేయబడినది. ఈసంఖ్య పిత్తకఫములకన్న నధికము కావున "బహురోగత్వాత్" అని నిర్దేశింపబడినది.

## వాతప్రకృతిలక్షణములు.

ప్రాయోఽత ఏవ పవనాధ్యుషితాః మనుష్యాః
దోషాత్మకాః స్ఫుటితధూసరకేశగాత్రాః,
శీతద్విషః చలధృతిస్మృతిబుద్ధిచేష్టా
సౌహార్దదృష్టిగతయోఽతిబహుప్రలాపాః. ౮౫
అల్పపిత్తబలజీవితనిద్రాః సన్నసక్తచలజర్జరవాచః,
నాస్తికాః బహుభుజః సవిలాసాః గీతహాసమృగయాకలిలోలాః.
మధురామ్లకటూష్ణసాత్మ్యకాంక్షాః
కృశదీర్ఘాకృతయః సశబ్దయాతాః,
న దృఢా న జితేన్ద్రియా నచార్యాః
న చ కాంతాదయితాః బహుప్రజా వా. ౮౭
నేత్రాణి చైషాం ఖరధూసరాణి
వృత్తాన్యచారూణి మృతోపమాని,

ఉన్మీలితానీవ భవన్తి సుప్తే
శైలద్రుమాంస్తే గగనం చ యాన్తి. ౮౮
అధన్యామత్సరాధ్మాతాః స్తేనాః ప్రోద్బద్ధపిణ్డికాః,
శ్వసృగాలోష్ట్రగృధ్రాఖుకాకానూకాశ్చ వాతికాః. ౮౯

పై జెప్పినగుణములు వాతమునకు కల్గియుండుటవలన వాతప్రకృతిగల మనుజులు ప్రాయికముగ దుష్టస్వభావము కల్గియుందురు. వారివెండ్రుకలును శరీరంబును చీలికలై ధూళిగ్రమ్మినవిధముగ రంగుకల్గియుండును. వారు శీతపదార్థములయందును శీతస్పర్శమునందును ద్వేషముకల్గి యుష్ణమునే కోరుదురు. వారికి ధైర్యంబును, స్మృతి (జ్ఞాపకశక్తి)యు, బుద్ధియు (తత్కాలోచితమైన యూహయు), ఆంగికాదిచేష్టలును నిల్కడలేక చంచలములై యుండును. మరియు స్నేహభావంబును, దృష్టియు,నడకయుంగూడ చంచలములై యుండును. అధికముగ బహువిధముల తమకిచ్చవచ్చినట్లు మాటలాడెదరు. వారికి పిత్తంబును, శరీరబలంబును, జీవితంబును, నిద్రయు మిక్కిలి స్వల్పముగనుండును. అందు కొందరు హీనస్వరముగను, కొందరు నత్తిగను, కొందరు చంచలవాక్కుగను, కొందరు నిలిపినిలిపియు మాటలాడెదరు. దేవుడు లేడు అను నాస్తికమతము నవలంబించియుందురు. మితిమీరి భుజించెదరు. విలాసముతోగూడి సంగీతమునందును, పరిహాసమునందును, వేటయందును, జూదమాడుటయందును ఆసక్తి కలిగియుందురు. మధురము అమ్లము కటువునను రసములను ఉష్ణపదార్థములను అలవాటుగ నుపయోగించుటయం దభిలాషకల్గియుందురు. కృశించి నిడుదయైన శరీరముకల్గి నడచునపుడు ధ్వని (చప్పుడు) అగునట్లు నడచెదరు. దృఢగాత్రులు కారు. జితేంద్రియులుగారు. దుష్టకృత్యముల జేయుచుందురు. స్త్రీలకు ప్రియులుకారు. స్వల్పసంతానము కల్గియుందురు. వీరికి కన్నులు కర్కశములై ధూళిగ్రమ్మినట్లుండి గుండ్రములై రమ్యములుగాక చచ్చినవానికన్నులబోలె నిదురబోవునపుడు మూతబడక తెఱచికొనియుండును. వీరికి స్వప్నములయందు ఆకసముననుచెట్లపైని పోవునట్లు కనబడును, వారు అదృష్టహీనులై మత్సరముచేనిండిన మనస్సుకలవారై దొంగతనమున నభిలాషకల్గియుండును. పిక్కలు మిక్కిలి యున్నతములై యుండును. కుక్కలు, నక్కలు. ఒంటెలు, గద్దలు, పందికొక్కులు, కాకులు, అను జంతువులవంటి స్వభావముకల్గియుందురు. (ఇచ్చట 'కాకాఽనూకాః' అనుచోట అనూకశబ్దమునకు స్వభావమని యర్థము) పై జెప్పినగుణములు కలవారు వాతప్రకృతికలవారని యెరుంగునది.

ఇచ్చట "ప్రాయః" అని యుండుటచే పై జెప్పినలక్షణములలో కొన్ని లేకున్నను ఉండవచ్చునని తెలిసెడి.

### పిత్తప్రకృతిలక్షణము.

పిత్తం వహ్నిర్వహ్నిజం వా యదస్మాత్
పిత్తోద్రిక్తః తీక్ష్ణతృష్ణాబుభుక్షుః,
గౌరోష్ణాంగః తామ్రహస్తాఙ్ఘ్రివక్త్రః
శూరో మానీ పిఙ్గకేశోల్పరోమా. ౯౦

దయితమాల్యవిలేపనమణ్డనః సుచరితః శుచిరాశ్రితవత్సలః,
విభవసాహసబుద్ధిబలాన్వితో భవతి భీషుగతిర్ద్విషతామపి ౯౧

మేధావీ ప్రశిథిల సన్ధిబన్ధమాంసో
నారీణామనభిమతోఽల్పశుక్రకామః,
ఆవాసః పలితతరఙ్గనీలికానాం
భుఙ్క్తేఽన్నం మధురకషాయతిక్తశీతమ్. ౯౨

ధర్మద్వేషీ స్వేదనః పూతిగన్ధిః
భూర్యుచ్చార క్రోధపానాశనేర్ష్యః,
సుప్తః పశ్యేత్ కర్ణికారాన్ పలాశాన్
దిగ్దాహోల్కా విద్యుదర్కానలాంశ్చ. ౯౩

తనూని పిఙ్గాని చలాని చైషాం
తన్వల్పపక్ష్మాణి హిమప్రియాణి,
క్రోధేన మద్యేన రవేశ్చ భాసా
రాగం వ్రజన్త్యాశు విలోచనాని. ౯౪

మధ్యాయుషో మధ్యబలాః పణ్డితాః క్లేశభీరవః,
వ్యాఘ్రర్క్షకపిమార్జారయక్షానూకాశ్చ పైత్తికాః. ౯౫

పిత్తము అగ్నిస్వరూపము ("పాకాదికర్మణాఽనల శబ్దితమ్" అని చెప్పిన ధన్వంతరిమతమున పిత్తము అగ్నిరూపమని భావము.) లేక అగ్నివలన పుట్టినది పిత్తము. (ధాత్వగ్నిచే పచింపబడిన రక్తమునకు కిట్టరూపమైనది పిత్తము కావున వహ్నిజమనుట) అట్టి యగ్నిరూపమైన పిత్తము ప్రకృతిగాకల మనుజుడు మిక్కిలి తీవ్రమైన దప్పియు ఆకలియు కల్గియుండును. గౌరవర్ణమై యుష్ణమైన శరీరముకల్గి ఎఱ్ఱనైన హస్తంబులును పాదంబులును ముఖంబును కలవాడై శూరుండును కోపముకలవాడును పచ్చని వెండ్రుకలు కల్గి స్వల్పమైన రోమములు కల్గినవాడునై యుండును.

మరియుం పుష్పమాలికలయందును చందనము మున్నగు మైపూతలయందును ఆభరణములయందును మిక్కిలి ప్రీతిగల్గి మంచిచేష్టలు కలవాడును పరిశుద్ధుడును తన్నాశ్రయించినవారియందు మిక్కిలి ప్రీతికల్గి వారికి హితము చేయువాడునునగును. విభవము సాహసము బుద్ధిబలము అనువానితోఁగూడి శత్రువులకైనను భయముకల్గినప్పుడు వారికిని ముఖ్యముగ నాధారమై వారిభయమును పోగుట్టుస్వభావము కల్గియుండును.

మరియుం మిక్కిలి మేధావంతుడును, సంధిబంధములును (కీళ్లు), మాంసమును శిథిలమైనవాడును, స్త్రీలకు మిక్కిలి ప్రీతిపాత్రుడును స్వల్పముగ ప్రీతిగలవాడును, స్వల్పమైన శుక్రంబును కామంబును స్త్రీలయం దభిలాషయు కలవాడునగును. వెండ్రుకలు నెరయుటకును శరీరముపై ముడతలు పడుటకును రేఖలు కల్గుటకును ఉనికిపట్టై యుండును. (అవియెల్ల వీనియం దధికముగ నుండునని భావము). మధురంబును కషాయ (వగరు) రసంబును చేదును కల్గి చల్లనైన యన్నాదుల భుజించును.

మరియుం ఎండయందు ద్వేషముకల్గియుండును. వాని శరీరమున చెమట యధికముగ బట్టును. శరీరమున దుర్గంధము కల్గియుండును. మూత్రము అధికముగ విడలును. క్రోధంబును పానంబును అశనంబును ఈర్ష్యయుం వీనికి మిక్కిలి యధికముగనుండును. వాడు నిదురించునపుడు స్వప్నములయందు గన్నేరులను మోదుగపువ్వులను దిక్కులగ్నిచే మండువిధముగను పిడుగులను మెరపులను సూర్యునినిప్పును విశేషముగ జూచును.

మరియుం వీని కన్నులు మిక్కిలి సూక్ష్మములై పింగళవర్ణంబులును, చంచలంబులును, స్వల్పమైన రెప్పవెండ్రుకలుకల్గినవియు, చలవకోరునవియునై యుండును. ఆ నేత్రములు కోపమువచ్చినపుడును, మద్యమును త్రావినపుడును, సూర్యుని రశ్మి సోకినపుడును, అతి శీఘ్రముగ నెఱ్ఱవారును.

మరియు నాపిత్తప్రకృతి కలమనుజులు మధ్యాయుస్సును మధ్యబలంబునుగల్గి మిక్కిలి పండితులై కష్టమన్న నోరువజాలక భయపడుచుండురు. పెద్దపులి, ఎలుగుబంటి, కోతి, పిల్లి, అను నీజంతువుల స్వభావముకల్గియుండును. (పై జెప్పిన లక్షణములుకలవారు పిత్తప్రకృతులని యెరుంగునది.)

### శ్లేష్మప్రకృతి లక్షణము.

శ్లేష్మా సోమః శ్లేష్మల స్తేన సౌమ్యః
గూఢస్నిగ్ధశ్లిష్టసన్ధ్యస్థిమాంసః,
క్షుత్తృట్ దుఃఖక్లేశ ఘర్మైరతప్తో
బుద్ధ్యాయుక్తః సాత్త్వికః సత్యసంధః. ౯౬

ప్రియఙ్గుదూర్వాశరకాణ్డశస్త్రగోరోచనాపద్మసువర్ణవర్ణః,
ప్రలమ్బబాహుః పృథుపీనవక్షాః మహాలలాటో ఘననీలకేశః. ౯౭
మృద్వఙ్గః సమసువిభక్తచారువక్త్రా బహ్వోజోరతిరసశుక్రపుత్రభృత్యః, ధర్మాత్మా వదతి న నిష్ఠురం చ జాతు ప్రచ్ఛన్నం వహతి దృఢం చిరం చ వైరమ్. ౯౮
సమదద్విరదేన్ద్రతుల్యయాతో జలదామ్భోధిమృదఙ్గసింహఘోషః, స్మృతిమానభియోగవాన్ వినీతో న చ బాల్యేఽప్యతిరోదనో న లోలః. ౯౯

తిక్తం కషాయం కటుకోష్ణరూక్షమల్పం స భుఙ్క్తే బలవాంస్తథాపి,
రక్తాన్తసుస్నిగ్ధవిశాలదీర్ఘసువ్యక్తశుక్లాఽసితపక్ష్మలాక్షః. ౧౦౦
అల్పవ్యాహారక్రోధపానాశనేర్ష్యః ప్రాజ్ఞాయుర్విత్తో దీర్ఘదర్శీ వదాన్యః, శ్రాద్ధో గమ్భీరః స్థూలలక్ష్యః క్షమావాన్ ఆర్యో నిద్రాళుః దీర్ఘసూత్రః కృతజ్ఞః. ౧౦౧
ఋజుర్విపశ్చిత్ సుభగః సులజ్జో భక్తో గురూణాం స్థిరసౌహృదశ్చ, స్వప్నే సపద్మాన్ సవిహంగమాలాన్ తోయాశయాన్ పశ్యతి తోయదాంశ్చ. ౧౦౨

బ్రహ్మరుద్రేన్ద్రవరుణతార్క్ష్యహంసగజాధిపైః,
శ్లేష్మప్రకృతయస్తుల్యాః తథా సింహాశ్వగోవృషైః ౧౦౩

శ్లేష్మము సోమాత్మకమైనది. కావున శ్లేష్మప్రకృతికల మనుజుడు సౌమ్యస్వభావము కలిగియుండును. వానిశరీరమునందలి కీళ్లు పైకి తెలియక నిగూఢములై యొండొంట గలసియుండును. అస్థులు మాంసము స్నిగ్ధములై యొకటితోనొకటి చేరియుండును. ఆకలి, దప్పి, దుఃఖము, కష్టములు, ఎండ, వీనిచే క్లేశమునొందక వానినోర్వజాలియుండును. మంచి తీవ్రమైన బుద్ధికల్గియుండును. సత్త్వగుణము ప్రధానముగ గల్గియుండును. సత్యమైన ప్రతిజ్ఞ కలిగియుండును.

మరియు వానిశరీరము చాయలు, గఱిక, రెల్లుకాడలు, శస్త్రము (కత్తిమున్నగునాయుధవిశేషములు), గోరోచనము, తామరపువ్వు, బంగారు అను వానిలో నేదైననొకదాని రంగుకల్గియుండును. బాహువులు మోకాళ్లవరకు వ్రేలుచుండును. వక్షస్స్థలము విశాలమై బలిసియుండును. నుదురు విశాలముగ నుండును. వెండ్రుకలు నల్లనై దట్టముగ నుండును.

వానియవయవములు మిక్కిలి కోమలములై సమములుగ విభజింపబడి సుందరములై యుండును. ఓజస్సును, సంభోగశక్తియు, రసధాతువును, శుక్రంబును మిక్కిలి యతిశయముగనుండును. అనేక పుత్రులు కలుగుదురు. భృత్యులనేకులు వాని సేవించుచుందురు. వాడు మదపుటేనుగువలె సుందరముగ నడచును. వాని కంఠస్వరము మేఘస్తనితమును, సముద్రఘోషమును, మృదంగధ్వనిని, సింహనాదమును బోలె మిక్కిలి గంభీరముగనుండును. జరిగినసంగతుల జ్ఞాపకమున నుంచుకొను శక్తికల్గియుండును. యుక్తాయుక్త వివేకము కల్గియుండును. మిక్కిలి వినయసంపన్నుడగును. పసితనమునందును అధికముగ నేడువకుండును. చంచల స్వభావము లేక దృఢమనస్కుడగును.

మరియు తిక్తకషాయ కటురసంబులును ఉష్ణంబులును రూక్షంబులునైన పదార్థముల భుజించును. ఆహారమును మిగుల స్వల్పముగ భుజించును. ఐనను మిక్కిలి బలము కల్గియుండును. వానికన్నులు కొసలయందు ఎఱ్ఱనై స్నిగ్ధవర్ణములై విశాలంబులును దీర్ఘంబులునై కండ్లయందు శుక్లభాగంబును కృష్ణభాగంబును కనురెప్పలును స్ఫుటముగ నేర్పడి రెప్పవెండ్రుకలు దట్టమైయుండును. వాడు స్వల్పముగ మాటలాడును. కోపము స్వల్పముగనుండును. నీళ్లు మున్నగువానిని కొంచెముగ త్రాగును. కొంచెముగ భుజించును. ఓర్పుకల్గియుండును. వానికి ఆయువును ధనంబును అధికముగ కల్గియుండును. చాల దీర్ఘకాలము యోచించువాడగును. (రాగల హానివృద్ధుల యోచించువాడనిభావము). దానశీలుడుగ నుండును. ఉచితములగు పనులయందు మిక్కిలి శ్రద్ధకల్గియుండును. గంభీరమగు స్వభావంబును దానముచేయుటయం దభిలాషయు ఓర్పును కల్గియుండును. సత్ప్రవర్తనుండై నిద్రాసక్తుండునునగును. పనులజేయునపుడు సాహసింపక చాలకాలము యోచించి పనులజేయును. ఒరులుచేసిన యుపకారమును మరువకుండును. కుటిలస్వభావము లేకుండును. పండితుడును, సుందరుడును, అయుక్తములైన విషయములయందు లజ్జకల్గినవాడును, గురువులయందు భక్తికలవాడును, స్థిరమైన స్నేహభావము కలవాడును నగును. వాడు నిదురించుకాలమున స్వప్నములయందు తామరపుష్పలతోడను హంసములు మున్నగు జలవిహంగములతోడను గూడిన తటాకాదులను మేఘబృందమును విశేషముగ జూచును.

మరియు బ్రహ్మ, ఈశ్వరుడును, ఇంద్రుడు, వరుణుడు, గరుడుడు, హంసము, ఏనుగు, అనువానింబోలిన స్వభావముకల్గియు, సింహములు, గుఱ్ఱములు, వృషభములు, వీనికి సమానమైన స్వభావములగల్గియుండును. (కఫప్రకృతికల మనుజులు పై జెప్పబడిన లక్షణములు కల్గియుందురనిభావము).

### ద్వంద్వజసన్నిపాతజప్రకృతిలక్షణములు.

ప్రకృతీర్ద్వయసర్వోత్థాః ద్వన్ద్వసర్వగుణోదయే,

వాతాదిప్రకృతులకు వేరువేరుగ జెప్పిన లక్షణముల రెండేసి ప్రకృతుల లక్షణము లొకటిగ మిశ్రములై కానవచ్చిన ద్వంద్వప్రకృతులనియుం మూడింటికిని వేరు వేరజెప్పిన లక్షణములన్నియు గానవచ్చిన సన్నిపాతప్రకృతియనియు చెప్పనగును.

(వాతపిత్తప్రకృతుల లక్షణములు మిశ్రములై యుండునెడ వాతపిత్తప్రకృతి యనియుం, వాతకఫముల ప్రకృతులకు జెప్పినలక్షణములు మిశ్రములుగ నున్నపుడు వాతకఫప్రకృతియనియుం, పిత్తకఫప్రకృతులలక్షణములు గానవచ్చినచో పిత్తకఫప్రకృతి యనియుం, మూడిటిలక్షణములును సంకరముగ గనబడుచున్న సన్నిపాతప్రకృతి యనియుం నెరుంగవలెననిభావము).

### సత్వాదిగుణమయ ప్రకృతులు.

శౌచాస్తిక్యాదిభిశ్చైవం గుణైర్గుణమయీర్భవేత్. ౧౦౪

(సత్వము, రజస్సు, తమస్సు, అను మూడుగుణములు ప్రకృతికి సంబంధించినవి. ఈమూడుగుణములచేగూడ ప్రకృతి మారుచుండును. అయ్యది సత్వప్రకృతియనియు, రజఃప్రకృతియనియు, తమఃప్రకృతియనియు మూడువిధములును, ఈమూడిటిలో రెండేసిగుణముల సంసర్గమునగల్గినవి మూడును, త్రిగుణసామ్యముచేగల్గినది యొకటియుం, అన్నియుం జేరి గుణప్రకృతులును ఏడువిధములగును.)

అట్టి త్రిగుణములకును వేరువేరుగ శౌచము, ఆస్తిక్యము మున్నగుగుణములు ఏర్పడియుండును. అట్టిగుణములబట్టి సత్వాదిప్రకృతుల నిర్ణయించునది.

### వయోభేదములు.

వయస్త్వాసోడశాద్బాలం తత్ర ధాత్విన్ద్రియౌజసామ్,
వృద్ధిరాసప్తతేర్మధ్యం తత్రావృద్ధిః పరం క్షయః. ౧౦౫

మనుజులకు వయస్సు (శరీరావస్థ) బాల్యము మధ్యమము వృద్ధత్వమునని మూడువిధములు. అందు జననకాలము మొదలు పదునారు వత్సరములవరకును బాల్యము. పిమ్మట డెబ్బదివత్సరములకుముందు అరువదితొమ్మిదవవత్సరమువరకును మధ్యమవయస్సు. డెబ్బదియవవత్సరము మొదలు వృద్ధవయస్సు.

పైమూడిటిలో బాలవయస్సున రసాదిధాతువులును, చక్షురాదీన్ద్రియములును సర్వధాతుప్రసాదరూపమై ధాతువుల కన్నిటికిని ఆప్యాయ్యతకు కారణమైన యోజ

స్సును నానాట వృద్ధినొందును. (అట్టిబాలవయస్సున శ్లేష్మమధికముగ నుండుటంజేసి పిల్లవాండ్రకు శరీరమున స్నేహము (జిడ్డు), మృదుత్వము, సౌకుమార్యంబును, సౌందర్యంబును కల్గును), మధ్యమ వయస్సునందు అందుకు మున్ను వృద్ధినొందిన ధాత్వింద్రియౌజస్సులు వృద్ధినొందక పరిపూర్ణములై హానియు లేకయుండును. డెబ్బదియవ వత్సరమునకుపై నాయుఃపరిమితివరకును ధాత్వింద్రియాదులు నానాట క్షీణత నొందును.

మధ్యమవయస్సు యౌవనము, సంపూర్ణత, అపరిహానియని మూడు అవస్థల కల్గియుండును. అందు పదునేడవవత్సరము మొదలు ముప్పదియవవత్సరమువరకును యౌవనము. ఈయవస్థయందు పిత్తము బలిష్ఠముగనుండుటంజేసి అగ్నిదీప్తమైయుండును. విజ్ఞానాది గుణములన్నియు సంపూర్ణత నొందును. అదిమొదలు నలువదియవ వత్సరము వరకును సంపూర్ణత. ఈయవస్థయందును సర్వధాత్వింద్రియములును బలవీర్యపౌరుషాదులును, స్మరణవిజ్ఞాన ప్రశ్రయాది గుణంబులును సంపూర్ణత నొందును. అందుపై డెబ్బదియవ వత్సరమువరకును అట్టి పరిపూర్ణతకు హానిలేక అంతకన్న నధికముగ వృద్ధినొందక యుండును.

డెబ్బదియవ వత్సరము మొదలు ఆయుఃపరిమితివరకును అంతకుమున్ను వృద్ధినొంది పరిపూర్ణదశయందున్న ధాత్వింద్రియౌజస్సులును, బలవీర్యపౌరుషవచనస్మరణ విజ్ఞానప్రశ్రయ గుణంబులును నానాట క్షీణతనొందును. దానంజేసి శరీరమున వలీపలితకాసశ్వాసాగ్నిసాదములు మున్నగునవి బాధింపసాగును. అట్టి యవస్థయందు వాతము ప్రబలముగ నుండును. కావున మాంససంధి అస్థ్యాదులయందు సారముచెడి శిథిలములై శరీరమున వణకు మున్నగునుపాధులుకల్గి శరీరము నానాట జీర్ణమగును.

## శరీరపరిమాణము.

స్వం స్వం హస్తత్రయం సార్ధం వపుః పాత్రం సుఖాయుషోః,
న చ యద్యుక్తముద్రిక్తైః అష్టాభిర్నిన్దితైః నిజైః. ౧౦౬
అరోమశాసితస్థూలదీర్ఘత్వైః సవిపర్యయైః,

మనుజుల శరీరము వారివారి హస్తప్రమాణముచే మూడున్నర హస్తముల పరిమాణము కల్గియుండినయెడ నాశరీరము దీర్ఘాయుష్యమునకు సుఖమునకు పాత్రమైయుండును. మరియు వెండ్రుకలు బొత్తుగ లేకుండుట, నల్లగనుండుట, మిక్కిలి స్థూలముగ నుండుట, మిక్కిలి దీర్ఘముగ నుండుట, ఈ నాల్గిటికిని విపరీతముగ శరీరముపై

డుట, మిక్కిలి పొట్టిగనుండుట, అను నీయెనిమిది లక్షణములు శరీరమునకు నింద్యములు. పైజెప్పిన పరిమితి కల్గియున్నను నింధితములగు నీయెనిమిది లక్షణములలో నేదియైన నున్నచో నాశరీరము దీర్ఘాయువునకును సుఖమునకును పాత్రము కానోపదు.

శరీరమునందలి యవయవవిశేషముల లక్షణములు.

సుస్నిగ్ధాః మృదవస్సూక్ష్మాః నైకమూలాః స్థిరాః కచాః ౧౦౭
లలాటమున్నతం శ్లిష్టశఙ్ఖమర్ధేన్దుసన్నిభమ్,
కర్ణౌ నీచోన్నతౌ పశ్చాన్మహాన్తౌ శ్లిష్టమాంసలౌ. ౧౦౮
నేత్రే వ్యక్తాఽసితసితే సుబద్ధఘనపక్ష్మణీ,
ఉన్నతాగ్రా మహోచ్ఛ్వాసా పీనర్జుర్నాసికా సమా. ౧౦౯
ఓష్ఠౌ రక్తావనుద్వృత్తౌ మహాన్తౌ నోల్బణే హనూ,
మహదాస్యం ఘనాః దన్తాః స్నిగ్ధాః శ్లక్ష్ణాః సితాస్సమాః. ౧౧౦
జిహ్వా రక్తాయతా తన్వీ మాంసలం చిబుకం మహత్,
గ్రీవా హ్రస్వా ఘనా వృత్తా స్కన్ధావున్నతపీవరౌ. ౧౧౧
ఉదరం దక్షిణావర్తగూఢనాభిసమున్నతమ్,
తను రక్తోన్నతనఖం స్నిగ్ధమాతామ్రమాంసలమ్. ౧౧౨
దీర్ఘాచ్ఛిద్రాఙ్గులి మహత్పాణిపాదం ప్రతిష్ఠితమ్,

ఈ క్రింద జెప్పంబడు లక్షణములు ఆయా అవయవములకు గల్గియున్న యెడ అట్టి శరీరము దీర్ఘాయుష్యమునకును సుఖమునకును ఆస్పదముగనుండునని యన్వయించునది:—

తలవెండ్రుకలు మిక్కిలి నునుపుకల్గి నిగనిగలాడుచు కోమలములై సూక్ష్మములై అనేక మూలములై రూఢమూలములునై యుండవలెను. నుదురు ఉన్నతమై కణతలతో చేరి కలిసి అర్ధచంద్రునివలె నుండవలెను. చెవులు క్రింది భాగమున హ్రస్వములును పై భాగమున నున్నతములును వెనుప్రక్క విశాలములును రమ్యములును మాంసలములునై యుండవలెను. కన్నులు తెల్లగుడ్డును నల్లగుడ్డును వ్యక్తముగ నేర్పడి రంగు మారక చక్కగ నొండొంటజేరిన రెప్పలు కల్గియుండవలెను. ముక్కు అగ్రభాగమున నున్నతమై గొప్ప నిశ్వాసముకల్గి శిథిలంబును వక్రంబును గాక నిమ్నోన్నతముగాకసమముగ నుండవలెను. పెదవులు రక్తవర్ణములై బైలుప్రేలాడక నోటికి ఇమిడినట్లుండవలెను. దౌడలు విశాలములై యున్నతములు కాకయుండవలెను. నోరు చిన్నది గాక గొప్పదిగ నుండవలెను. దన్తములు నునుపుకల్గి స్నిగ్ధవర్ణములై తెల్లని కాంతికల్గి సమములుగ

వరుసగ నుండవలెను. నాలుక రక్తవర్ణంబును దీర్ఘంబునునై పలుచనై యుండవలెను. గడ్డము బలిసి పెద్దదిగ నుండవలెను. మెడ మిక్కిలి పొడవు గాక పొట్టిదై బలిసి గుండ్రనై యుండవలెను. మూపు లున్నతములై బలిసియుండవలెను. ఉదరము దక్షిణావర్తముగ దిరిగి లోపల గూఢముగ నడగియుండిన బొడ్డుతో గూడి యున్నతమై యుండవలెను. హస్తపాదములు పలుచనై యున్నతములును రక్తవర్ణంబులునైన గోళ్లు కల్గి స్నిగ్ధంబును పూర్ణముగ రక్తవర్ణంబును మాంసలంబులునై, నిడివిలును సందులు లేనివియు నైనవ్రేళ్లతో గూడి యుండవలెను. ఇట్టి లక్షణములు గల్గియున్న చాల ప్రశస్తము.

> గూఢవంశం బృహత్పృష్ఠం నిగూఢాస్సన్ధయో దృఢాః. ౧౧౩
> ధీరః స్వరోఽనునాదీ చ వర్ణః స్నిగ్ధః స్థిరప్రభః,
> స్వభావజం స్థిరం సత్వం అవికారి విపత్స్వపి. ౧౧౪

వీపునను౦డు వెన్నెముక కంటికగపడక యణగి వీపు విశాలముగ నుండుట మంచిది. కీళ్లు అగపడక యణగి శిథిలములు గాక దృఢములై యుండవలెను. కంఠస్వరము దైన్యము లేక ధీరమై అనునాదము (గంటవాయించి నిలిపిన పిదప కల్గు సన్నని నాదము వంటి నాదము) కలిగియుండుట శ్రేష్ఠము. శరీరవర్ణము స్నిగ్ధమై స్థిరమైన (చెదని) కాంతి కల్గియుండుట ప్రశస్తము. ధైర్యము పుట్టుకతో తనంతట కలిగి యెట్టి కారణములు సంభవించినను చలింపక యాపత్తులు సంభవించినను వికారము జెందకయుండిన మిక్కిలి శ్లాఘ్యము.

## ఉత్కృష్టశరీరలక్షణము.

> ఉత్తరోత్తరసుక్షేత్రం వపుర్గర్భాదినీరుజమ్,
> ఆయామజ్ఞానవిజ్ఞానైః వర్ధమానం శనైశ్శుభం. ౧౧౫

"స్వం స్వం హస్తత్రయం" అని యుపక్రమించి చెప్పబడిన పైగ్రంథముచేత శరీర ముండవలసిన పరిమాణంబును, "లలాటమున్నతం" అని వాక్యములచేత శరీరమునందలి అవయవముల సులక్షణంబులును, "స్వభావజం స్థిరంసత్వం" అను వాక్యముచేత సత్వమునకు సంబంధించిన సులక్షణంబును చెప్పబడినది. ఈ మూటిలో నొకదానికన్న నొకటి యుత్తమమైన సుక్షేత్రము. (శరీరప్రమాణ లక్షణయుక్తమైన శరీరము సుక్షేత్రము, అవయవ లక్షణ యుక్తమైనది అంతకన్న సుక్షేత్రతరము, సత్వలక్షణయుక్తము అంతకంటె సుక్షేత్రతమము నగునని భావము) సుక్షేత్రమన మంచి శరీరము. అట్టి యుత్తమమైన శరీరము గర్భమునందును బాల్యాది వయస్సునందును రోగము

లేక యుండి ధైర్యముచేతను లోకజ్ఞానముచేతను శాస్త్రపఠనమున జనించినపరమార్థప్రాప్తివరకుంగల సకల విషయములకును సాధనమైన విజ్ఞానముచేతను నానాట వృద్ధినొందుచున్న మిక్కిలి శ్రేష్ఠమై యుండును.

ఇతి సర్వగుణోపేతే శరీరే శరదాం శతమ్,
ఆయురైశ్వర్యమిష్టాశ్చ సర్వే భావాః ప్రతిష్ఠితాః. ౧౧౬

ఇత్తెరంగున పైజెప్పబడిన సకల గుణములచే నొప్పియుండు శరీరమున నూరు సంవత్సరముల పరిమితమైన పరమాయుష్యంబును, ఐశ్వర్యంబును తన మనస్సు కిష్టములైన సకలవిషయంబులును ప్రకర్షముగ నిలచి అట్టి శరీరము నాధారముగ జేసికొని యుండును.

("శరీరేన్ద్రియసత్వాత్మసంయోగాదాయురుచ్యతే" అను వచనప్రకారము శరీరము ఇంద్రియములు సత్వము ఆత్మ వీనియొక్క అవినాభావ సంబంధము (కూటమి) ఆయుశ్శబ్దవాచ్యమని యెరుంగునది.)

## బలప్రమాణజ్ఞానోపాయము.

త్వగ్రక్తాదీని సత్వాన్తాన్యగ్ర్యాణ్యష్టౌ యథోత్తరమ్,
బలప్రమాణజ్ఞానార్థం సారాణ్యుక్తాని దేహినామ్. ౧౧౭
సారైరుపేతస్సర్వైస్స్యాత్ పరం గౌరవసంయుతః,
సర్వారమ్భేషు చాశావాన్ సహిష్ణుః సమ్మతిః స్థిరః ౧౧౮

శరీరమునందలి త్వక్కు, రక్తము, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్రము, సత్వము, అను నీయెనిమిదియును మనుజులకు సారములై యుండును. అయ్యవి యుత్తరోత్తరము ఒకటికన్న నొకటి మిక్కిలి శ్రేష్ఠములై యుండును. ఈ సారములు మనుజుల శరీరబలముయొక్క పరిమితిని తెలిసికొనుటకై చెప్పబడినవి. పైజెప్పబడిన యెనిమిది సారములును కల్గినమనుజుడు మిక్కిలి భారము కల్గియుండును. నానావిధములగు పనుల నారంభించుటయందాస కల్గియుండును. సకల క్లేశములను ఓర్చునట్టి స్వభావము కల్గియుండును. (సహనశీలుడగుటం జేసి శరీరమునకును మనస్సునకును సంబంధించిన దుఃఖములచే వికృతిజెందకుండును.) మంచి బుద్ధికల్గి కర్తవ్యాంశములయందు నిశ్చలమైన బుద్ధికల్గియుండును. అట్టి మనుజుడు పూర్ణమైన బలము కల్గియుండును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—మనుజులకు నూరు సంవత్సరములు పరమాయుష్యము. అట్టి పరమాయుష్యము నుద్దేశించి బాల మధ్యమవృద్ధ భేదములచే వయ

స్సు మూడు విధములుగ విభజించి వాని పరిమితియుం జెప్పబడినది. ఇకాలమున మానవుల కర్మవశమునంజేసి నూరు వత్సరముల కధికముగను తక్కువగను కూడ నాయుంవు మారుచుండును. అట్టి యెడ మనుజులయొక్క వాతాది ప్రకృతి భేదములను పైజెప్పిన లక్షణములచే నిర్ణయించి తదనుగుణముగ నాయువును నిర్ణయించి అట్టి యాయుంవును పైజెప్పిన రీతి మూడువిధములుగ విభజింపనగును. అట్టియెడ శరీరమాత్రమును జూచి శరీరము మాంసముగ నున్నపుడు మిక్కిలి బలవంతుడనియు, శరీరము కృశించియున్నపుడు బలహీనుడనియు నిర్ణయించినయెడ నొకవేళ పొరబాటుచే వ్యత్యస్తముగ నగును. కావున నట్టి బలప్రమాణమును నిష్కృష్టముగ నిర్ణయించుటకై త్వగ్రక్తాది సారముల యుత్కృష్టత యిచ్చట జెప్పబడినది.

రసాదిధాతువులును సత్వంబును ఈ యెనిమిదియు నొకదానికన్న నొకటి శ్రేష్ఠముగ నుండును. అవి యెనిమిదియు పూర్తిగ నెవనియం దుండునో అట్టిమనుజుడు కృశించియున్నను మిక్కిలి భారముకల్గి సహిష్ణుతాదిలక్షణములు కల్గియుండును. శరీరముపచితముగ నున్నను పైజెప్పిన సారములు పూర్తిగ లేనపుడు శరీరమున భారము తగ్గి సహిష్ణుతాదిలక్షణములు లేక యుండును. కావున అట్టి లక్షణములచే శరీరబల పరిమాణమును నిర్ణయించి దానిమూలమున నాయువును నిర్ణయించునది.

## సత్వాది ప్రకృతులు సుఖదుఃఖముల ననుభవించు క్రమము.

అనుత్సేకమదైన్యం చ సుఖం దుఃఖం చ సేవతే,
సత్వవాంస్తస్యమానస్తు రాజసో నైవ తామసః. ౧౧౯

సత్వగుణము ప్రకృతిగ గల మానవుడు సుఖము కల్గినపుడు గర్వము లేక నేనె సుఖమనుభవించువాడనను అహంకారము లేక సుఖము ననుభవించును. కాదాచిత్కముగ కష్టము సంభవించినపుడు కష్టము వశవలసివచ్చెనని విసుగు జెందక దీనుడును కాక దాని ననుభవించును. రాజసగుణ ప్రకృతిగల మనుజుడు సుఖము సంభవించినపుడు నాకన్న సుఖి వేరెవ్వడును లేడని చెప్పుచు సుఖము ననుభవించును. కష్టము కల్గినపుడు కష్టము వచ్చెనని దుఃఖించుచు నాకంటె కష్టములు పొందినవారు లేరని గర్వించుచు అనుభవించును. తామసగుణ ప్రకృతిగల మనుజుడు సుఖము లేశమునైన కంటు జూడడు. ఒకవేళ లేశమాత్రము కల్గినను దుఃఖముగనే అనుభవించును.

సాత్వికాది లక్షణములు గీతాశాస్త్రమున నిట్లు చెప్పబడినది:—'ముక్తసంగో ఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః, సిద్ధ్యసిద్ధ్యోః నిర్వికారః కర్తా సాత్వికఉచ్యతే.

రాగీ కర్మఫలప్రేప్సుః లుబ్ధో హింసాత్మకోఽశుచిః, హర్షశోకాన్వితః కర్తారాజసః పరికీర్తితః. అయుక్తః ప్రాకృతస్తబ్ధః శఠో నైకృతికోఽలసః, విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే" ఈశ్లోకములసారమె పైని చెప్పబడినది.

ఆయుంవును వృద్ధినొందించుగుణములు.

దానశీలదయాసత్వబ్రహ్మచర్యకృతజ్ఞతాః,
రసాయనాని మైత్రీ చ పుణ్యాయుర్వృద్ధికృద్గుణః. ౧౨౦

ఎల్లప్పుడును ఒరులకు దానముచేయు స్వభావముకల్గియుండుట, భూతదయ కల్గియుండుట, సత్వగుణంబును బ్రహ్మచర్యంబును కృతజ్ఞతయు కల్గియుండుట, రసాయనముల సేవించుట, అందరియందును మిత్రభావము (స్నేహము) కల్గియుండుట, ఇవి యన్నియు పుణ్యమును ఆయుంవును వృద్ధినొందించుగుణములు.

ఇతి శ్రీఅష్టాఙ్గహృదయశారీరే తృతీయోఽధ్యాయః.

# చతుర్థాధ్యాయము.

అవ: మర్మములు అంగప్రత్యంగముల నాధారములుగ జేసికొనియుండును. కావున అంగప్రత్యంగవిభాగము మునుపై యధ్యాయమున జెప్పి యీయధ్యాయమున అంగముల నాశ్రయించిన మర్మములు చెప్పబడును.

సూ. అథాతో మర్మవిభాగం శారీరం వ్యాఖ్యాస్యామః.

అంగ విభాగమును జెప్పినపిదప వాని నాశ్రయించిన మర్మవిభాగమును దెల్పు నట్టి శారీరమను నధ్యాయమును వివరించెదనని భావము.

**మర్మసంఖ్య, వానిస్థానములు.**

సప్తోత్తరం మర్మశతం తేషామేకాదశాదిశేత్,
పృథక్ సక్థ్నోః తథా బాహ్వోస్త్రీణి కోష్ఠే నవోరసి. ౧
పృష్ఠే చతుర్దశోర్ధ్వం తు జత్రోస్త్రింశచ్చ సప్త చ,

("మ్రియతే (అస్మిన్నంగే) ఉపహతే ఇతి-మర్మ" అను వ్యుత్పత్తిచేత ఏ అవ యవవిశేషమునం దభిఘాతము కల్గినపుడు మృతిజెందునో అట్టి అనయవవిశేషము మర్మశబ్దముచే వాచ్యము. ముఖ్యముగ ప్రాణాధారమైనది మర్మమని భావము.)

అట్టి మర్మములు నూటయేడు శరీరమునందలి యంగప్రత్యంగముల నాశ్రయించియుండును. అందు తొడలు చేతులు ఈనాల్గు అంగములయందును ఒక్కొక దానియందు పదునొకండు వంతున నాల్గింటియందును చేరి నలువదినాల్గు మర్మము లుండును. కోష్ఠమునందు మూడును, రొమ్మున తొమ్మిదియు, వీపున పదునాల్గును, కంఠమునకు పైభాగమున ముప్పదియేడును ఉండును. (ఇవి యన్నియు కలిసి నూటయేడు మర్మములగును.)

**కాలియందలి మర్మములవిభాగము, అందభిఘాతముచే గల్గునుపద్రవములు.**

మధ్యే పాదతలస్యాహురభితో మధ్యమాఙ్గులిమ్. ౨
తలహృన్నామ రుజయా తత్ర విద్ధస్య పఞ్చతా,
అఙ్గుష్ఠాఙ్గులిమధ్యస్థం క్షిప్రమాక్షేపమారణమ్. 3
తస్యోర్ధ్వం ద్వ్యఙ్గులే కూర్చః పాదభ్రమణకంపకృత్,

పాదములు మొదలు శిరస్సువరకును కల శరీరావయవములయందు గల మర్మములకు ఆధారములైన యంగములును అందలి మర్మముల సంఖ్యయు పైన సంగ్రహ

ముగ జెప్పబడినది. ఈ క్రింద వానియవాంతరభేదములును, వానిప్రత్యేక నామకృత్య ములును వివరింపబడును.

అందు ఒకకాలియందు పదునొకండు మర్మములుండును. అందు పాదమునందలి నడిమివ్రేలి కభిముఖముగ పాదమధ్యమున మీగాలియందు తలహృదయమను మర్మముండును. ఆమర్మమున దెబ్బ తగిలినపుడు తీవ్రమైన నొప్పికల్గి మరణమునొందును. బొటనవ్రేలికిని తక్కినవ్రేళ్లకును నడుమ క్షిప్రమను మర్మముండును. అచ్చట నభిఘాతము కల్గినయెడ నాక్షేపవాతమనువ్యాధి సంభవించి దానిచేతనే మరణము సంభవించును. ఆక్షిప్రమర్మమునకు పైభాగమున రెండంగుళములకు పైన కూర్చమను మర్మముండును. దాని కభిఘాతము కల్గిననాడు పాదమున కంపము పుట్టును.

గుల్ఫసన్ధేరధః కూర్చశిరః శోఫరుజాకరమ్. ౪
జఙ్ఘాచరణయోస్సన్ధౌ గుల్ఫో రుక్ స్తమ్భమాన్ద్యకృత్,
జఙ్ఘాన్తరే త్విన్ద్రవస్తిః మారయత్యసృజః క్షయాత్. ౫

చీలమండ సంధికి దిగువ కూర్చశిరంబను మర్మముండును. అచ్చట నభిఘాతము కల్గిననాడు వాపును నొప్పియుం కల్గును. పిక్కకును పాదమునకును నడుమనుండు కీలునందు గుల్ఫమను మర్మముండును. అందు వేధ కల్గినపుడు తీవ్రమైన నొప్పికలిగి కీలుకదలక స్తంభించి చలనాదికృత్యములయందు మందత కలుగును. పిక్కకు మధ్యభాగమున ఇంద్రవస్తియను మర్మముండును. అచ్చట దెబ్బతగిలినప్పుడు రక్తము వెడలి క్షీణించిన యెడ నయ్యది చంపును. కావున నట్టియెడ రక్తము క్షీణించ కుండునట్టి చికిత్స చేయవలెను.

(మర్మస్థానమున నభిఘాతము కలిగినపుడు ఎట్టియుపాధిచే మరణముకలుగునని చెప్పబడునో అట్టియుపాధిని కలగనీయక తగు చికిత్స జేయవలెను. ప్రకృతమున రక్తము క్షీణించుటచే మరణము కల్గునని చెప్పబడియెను. కావున రక్తస్తంభనమున కనుకూలమగు చికిత్స యవశ్యకర్తవ్యము. ఇత్తెరంగుననే తక్కిన స్థలములయందు నూహించునది.)

జఙ్ఘోర్వోస్సంగమే జాను ఖఞ్జతా తత్ర జీవతః,
జానునః త్ర్యఙ్గులాదూర్ధ్వం ఆణ్యూరు స్తమ్భశోఫకృత్. ౬
ఉర్వ్యూరుమధ్యే తద్వేధాత్ సక్థిశోషో౽స్రసంక్షయాత్,
ఊరుమూలే లోహితాఖ్యం హన్తి పక్షమసృక్ క్షయాత్. ౭
ముష్కవంక్షణయోర్మధ్యే విటపం షణ్డతాకరమ్,

పిక్కకును తొడకును నడమనుండు కీలునందు జానుమర్మముండును. అచ్చట నభిఘాతము కలిగినయెడ మృతినొందును. ఒకవేళ జీవించినయెడల కుంటియగును. జాను

సంధికి మూడంగుళములకు పైభాగమున ఆణియను మర్మముండును. అచ్చట నభిఘాతము కలిగినయెడ ఊరువు స్తంభించును. వాపు కలుగును. తొడయొక్క మధ్యభాగమున ఊర్వియను మర్మముండును. అచ్చట నభిఘాతముకలిగినచో రక్తక్షయము కలిగినయెడ తొడ కృశించును. తొడలకుపైభాగమున గెజ్జలకు క్రింద లోహితమను మర్మముండును. అందు అభిఘాతము కలిగిననాడు రక్తము క్షీణించినచో నాపక్షమున పక్షవధమను వాతవ్యాధి కలుగును. వృషణములకును గెజ్జలకును నడుమ విటపమను మర్మముండును. అందభిఘాతముచే పుంస్త్వము చెడును.

## బాహువులయందలి మర్మముల విశేషము.

ఇతి సక్థ్నో స్తథా బాహ్వోః మణిబన్ధోఽత్ర గుల్ఫవత్. ౮
కూర్పరం జానువత్కోణ్యాం తయోర్విటపవత్పునః,
కక్షోఽక్షమధ్యే కక్షాధృక్ మణిత్వం తత్ర జాయతే. ౯

ఇత్తెరంగున నొకకాలియందు పదునొకండు మర్మములు చెప్పబడియె. రెండవ కాలియందును ఈవిధముగ నెరుంగునది. మరియు బాహువులయందును కాళ్లకుచెప్పిన విధముగ నాయాస్థలములయం దాయామర్మముల నెరుంగునవి. అందు చీలమండ యందువలె మణికట్టునను, మోకాలియందువలె మోచేతియందును మర్మములుండును. అందుమణికట్టునయుండునది మణిబంధము. మోచేతిమర్మముకూర్పరము. ఈరెండుమర్మములయం దభిఘాతము కల్గిననాడు కాళ్లుచేతులయందు వ్రేళ్లుముడుంచుకొనును. మోచేతికి పైభాగమునకు చంకలకునునడుమ విటపమర్మమువలె మర్మముండును. ఇయ్యది కక్షధృత్తనుపేర చెప్పబడును. ఇం దభిఘాతము కల్గిన కుంటియగును. (ఇత్తెరంగున కాళ్లుచేతులయందలి నలువదినాల్గు మర్మములు చెప్పబడినవి.)

## కోష్ఠగతమర్మములు మూడు, అందు గుదమర్మము.

స్థూలాన్త్రమధ్యః సద్యోఘ్నో విడ్వాతవమనో గుదః,

శరీరమునందలి అంత్రములు (ప్రేవులు) స్థూలసూక్ష్మభేదములచే రెండువిధములు. అందు స్థూలాన్త్రమున మధ్యభాగమున గుదమనుమర్మముండును. ఇందభిఘాతము కల్గిననాడు పురీషంబును అపానవాతంబును అడ్డులేక యెల్లపుడును వెడలుచుండును. ఈ మర్మము నభిఘాతము కల్గినప్పుడే చంపునది.

## వస్తి-నాభి-మర్మములు, వానియభిఘాతమున గల్గునుపద్రవములు.

మూత్రాశయే ధనుర్వక్రో వస్తిరల్పాస్రమాంసగః. ౧౦
ఏకాధోవదనో మధ్యే కట్యాః సద్యో నిహన్త్యసూన్,

ఋతేఽశ్మరీవ్రణాద్విద్ధస్తత్రాప్యుభయతశ్చ సః ౧౧
మూత్రస్రావ్యేకతో భిన్నః వ్రణో రోహేచ్చ యత్నతః,
దేహామపక్వస్థానానాం మధ్యేసర్వసిరాశ్రయః. ౧౨
నాభిః సోపిహి సద్యోఘ్నః

మూత్రమున కాధారమైనస్థానము మూత్రాశయము. అందు ధనుస్సువలె వంకరగ స్వల్పముగ రక్తమాంసముండుస్థలముననుండునది వస్తియనబడును. అయ్యది అధోముఖముగ నొకద్వారముకల్గి కటిమధ్యభాగమున నుండును. ఇదియ వస్తిమర్మము. ఇయ్యది అశ్మరీవ్రణ మొక్కటియందు దక్క తక్కినవ్యాధులయం దభిఘాతముకల్గిన యెడ అప్పుడే తప్పక చంపును. అశ్మరీవ్రణమందును రెండుపార్శ్వములయందును వ్రణముకల్గిన నప్పుడే హింసించును. ఒకప్రక్కమాత్ర మభిఘాతముచే వ్రణము కల్గిన దానినుండియు మూత్రము స్రవించును. అట్టియెడ మిక్కిలి ప్రయత్నముతో చికిత్స జేసిన కష్టముచే మానును. మరియు దేహమునకు మధ్యభాగమునను పక్వాశయమునకు ఆమాశయమునకు నడుమను నాభియను మర్మముండును. అయ్యది శరీరమున వ్యాపించు సిరలకన్నిటికిని ఆధారముగ నుండును. అం దభిఘాతముకల్గిననాడు అప్పుడే ప్రాణముల హింసించి చంపును. (పైజెప్పబడిన గుద-వస్తి-నాభిమర్మములు మూడును కోష్ఠమునందలి మర్మములు.)

## ఉరస్సున తొమ్మిదిమర్మములు. అందు హృదయమర్మము.

ద్వారమామాశయస్య చ,
సత్వాదిధామ హృదయం స్తనోరః కోష్ఠమధ్యగమ్. ౧౩

రెండుస్తనములకును ఉరస్థలమునకును కోష్ఠమునకును నడుమ ఆమాశయమునకు దారియై సత్వరజస్తమోగుణములకును జ్ఞానవిజ్ఞానములకును ఇంద్రియవ్యాపారములకును స్థానమైనది హృదయము. ఈమర్మమునందభిఘాతము కలిగినయెడ నొకక్షణకాలమైన జీవించుటలేదు.

## స్తనరోహిత-స్తనమూలమర్మములు.

స్తనరోహితమూలాఖ్యే ద్వ్యఙ్గులే స్తనయోర్వదేత్,
ఊర్ధ్వాఽధోఽస్రకఫాపూర్ణకోష్ఠో నశ్యేత్తయోః క్రమాత్.

స్తనములకు పైభాగమున రెండంగుళములదూరమున స్తనరోహితములను మర్మంబులును, స్తనములకు క్రిందిభాగమున రెండంగుళములదూరముగ స్తనమూలంబులను మర్మంబులు రెండును ఉండును. అందు స్తనరోహితములయం దభిఘాతము కల్గినప్పుడు

దానంజేసి రక్తము కోష్ఠముననిండిన మృతిజెందును. స్తనమూలములయందు దభిఘాతము కల్గినయెడ దానివలన కఫము కోష్టమున నిండినచో మృతినొందును. (స్తనములకు రెండిటికిని పైభాగమున రెండును క్రిందిభాగమున రెండు నుండునవి. కావున నీమర్మములు నాల్గు)

### అపస్తంబ మర్మములు.

అపస్తమ్భౌ పురఃపార్శ్వే నాడ్యావనిలవాహినీ,
రక్తేన పూర్ణకోష్ఠోఽత్ర శ్వాసాత్కాసాచ్చ నశ్యతి. ౧౫

రొమ్మునకు రెండుప్రక్కలయందును వాయుసంచారనాడులు రెండుండును. ఆరెండును అపస్తంబములనుమర్మములు. ఈరెండుమర్మములయందును అభిఘాతము కలిగినపుడు రక్తముచే కోష్ఠమునిండును. అట్టియెడ శ్వాసకాసములు కలిగినచో మనుజుడు మృతిచెందును.

### అపాలాపమర్మములు.

పృష్ఠవంశోరసోర్మధ్యే తయోరేవ చ పార్శ్వయోః,
అధోఽంసకూటయోర్విద్యాత్ అపాలాపాఖ్యమర్మణీ ౧౬
తయోః కోష్ఠేఽసృజా పూర్ణే నశ్యేద్వా తేన పూయతామ్,

వెన్నెముకకును రొమ్మునకును నడుమ వానికిరుప్రక్కలయందును అంసకూటములకుదిగువ అపాలాపములను రెండు మర్మము లుండును. వానియందభిఘాతము కల్గినపుడు కోష్ఠమునందు రక్తము నిండియుండును. అట్టి రక్తము చీముగ పరిణమించునెడ అప్పుడు మృతినొందును. (కోష్ఠమున రక్తము నిండియున్నను చీముగ పరిణమించు నందాక బ్రతికియుండును. అయ్యది చీముగ మారునరికి మనుజుడు మృతినొందునని భావము.)

(ఇత్తెరంగున నురస్థలమందలి తొమ్మిదిమర్మములును, వానియందభిఘాతమున గలుగునుపద్రవములును వివరింపబడియె.)

### వీపునందలిమర్మములు పంద్రెండు. అందు కటీకతరుణాస్థులు.

పార్శ్వయోః పృష్ఠవంశస్య శ్రోణీకర్ణౌ ప్రతిష్ఠితే. ౧౭
వంశాశ్రితే స్ఫిచోరూర్ధ్వం కటీకతరుణే స్మృతే,
తత్ర రక్తక్షయాత్పాణ్డుః హీనరూపో వినశ్యతి ౧౮

వీపు నాశ్రయించియుండు మర్మములు పంద్రెండు. అందు వెన్నెముక కిరుప్రక్కలనుండు పిరుదులకు పైభాగములయందలి కర్ణములవలెనుండు అస్థులు రెండును

కటీకతరుణములను అస్థిమర్మములు. వానియందు అభిఘాతము కలిగినయెడ రక్తము క్షీణించుటంజేసి పాండురోగము సంభవించి రూపుచెడి మృతినొందును.

### కుకుందర మర్మములు.

పృష్ఠవంశం హ్యుభయతో యౌ సన్ధీ కటిపార్శ్వయోః,
జఘనస్య బహిర్భాగే మర్మణీ తే కుకున్దరే. ౧౯
చేష్టాహానిరధః కాయే స్పర్శాజ్ఞానం చ తద్వ్యధాత్,

వెన్నెముక కిరుప్రక్కలయందును పిరుదులకు పైభాగమున సంధిస్థలము వెన్నెముక కిరుచెంతల వెలుపట రెండుగుంటలుండును. అవి కుకుందరములను మర్మములు. వీనియం దభిఘాతము కలిగినయెడ అధశ్శరీరమున చాచుట ముడుచుట మున్నగు చేష్టలుడుగును. చేత తాకిన స్పర్శము తెలియకుండును.

### నితంబమర్మములు.

పార్శ్వాన్తరనిబద్ధౌ యౌ ఉపరి శ్రోణికర్ణయోః. ౨౦
ఆశయచ్ఛాదనౌ తౌ తు నితమ్బౌ తరుణాస్థిగౌ,
అధశ్శరీరే శోషో ఽత్ర దౌర్బల్యం మరణం తతః. ౨౧

(పిరుదుల కాధారములై వెన్నెముక కిరుకెలంకుల సంబద్ధములై చెవులబోలె యుండు అస్థులు శ్రోణికర్ణములు) వానికి పైభాగమున పార్శ్వ మధ్యభాగమున ప్రతిబద్ధములై మూత్రాశయము మున్నగునాశయముల గప్పి తరుణాస్థియందుండునవి రెండు నితంబములను మర్మములుండును. వానియం దభిఘాతముకలిగినవాడు క్రింది శరీరమున వాపు కలుగును. నానాట బలహీనంబును మరణంబును సంభవించును.

### పార్శ్వసంధియను మర్మములు.

పార్శ్వాన్తరనిబద్ధౌ చ మధ్యే జఘనపార్శ్వయోః,
తిర్యగూర్ధ్వం చ నిర్దిష్టౌ పార్శ్వసన్ధీ తయోర్వ్యధాత్. ౨౨
రక్తపూరితకోష్ఠస్య శరీరాన్తరసమ్భవః,

ఇరుప్రక్కలయొక్క మధ్యప్రదేశమున జేరియుండు సంధులు పార్శ్వసంధులు. ఇవి రెండు మర్మములు. అయ్యవి ఒక్కప్రక్కనుండు పిరుదునకు ఒకపార్శ్వమునకును నడుమ నడ్డముగ పైకి వ్యాపించి యుండు సంధియొకటి. ఈరీతిగనె రెండవ ప్రక్కనుండు సంధి ఇంకొకటి. ఈరెండును జేరి పార్శ్వసంధిమర్మములని చెప్పనగును. ఈమర్మములయం దభిఘాతము కలిగినయెడ రక్తముచే కోష్ఠము నిండును. దానంజేసి మృతిజెందును.

### బృహతీ మర్మములు.

స్తనమూలార్జవే భాగే పృష్ఠవంశాశ్రయే సిరే ౨౩
బృహత్యౌ తత్ర విద్ధస్య మరణం రక్తసంక్షయాత్,

స్తనమూలమునుండి వెన్నెముకవరకు వ్యాపించినసిర లుభయపార్శ్వముల రెండుండును ఆరెండును బృహతీమర్మములని చెప్పబడును. అందభిఘాతము కల్గిననాడు రక్తము క్షీణించినయెడ తప్పక మరణము సంభవించును. (రక్తక్షయముకానియెడ మరణము కలగబోదు.)

### అంసఫలక మర్మములు.

బాహుమూలాఽభిసంబద్ధే పృష్ఠవంశస్య పార్శ్వయోః. ౨౪
అంసయోః ఫలకే బాహుస్వాపశోషౌ తయోర్వ్యధాత్.

వీపుకు పైభాగమున వెన్నెముకకిరుప్రక్కలయందును బాహుమూలముల కభిముఖముగనుండు అంసఫలకములు రెండును మర్మములు. ఈరెండుమర్మములయందు అభిఘాతము కలిగినయెడ బాహువులు చేష్టలదక్కి శుష్కించును.

### అంసమర్మములు.

గ్రీవాముభయతః స్నావ్నీ గ్రీవాబాహుశిరోఽన్తరే. ౨౫
స్కన్ధాంసపీఠసంబంధావంసౌ బాహుక్రియాహరౌ,

భుజశిరస్సులకును మెడకును నడుమ నుభయపార్శ్వములయందును అంసపీఠములకును భుజశిరస్సులకు సంబద్ధములైన స్నాయువులు రెండును అంసమర్మములు. ఈయంసమర్మములయందు అభిఘాతముకలిగినయెడ బాహువులకుసంబంధించిన క్రియలన్నియు నిలచిపోవును.

(ఈచెప్పబడిన పదునాలుగును వీపుకు సంబంధించిన మర్మములు)

కంఠమునకు పైభాగమున ముప్పదియేడు మర్మములుండును.

### అందు నీల మన్యామర్మములు

కణ్ఠనాడీముభయతః సిరా హనుసమాశ్రితాః. ౨౬
చతస్రః తాసు నీలే ద్వే మన్యే ద్వే మర్మణీ స్మృతే,
స్వరప్రణాశవైకృత్యం రసాఽజ్ఞానం చ తద్వ్యధే. ౨౭

కంఠమునకు పైభాగమున ముప్పదియేడుమర్మము లుండును. అందు కంఠనాడి కిరుప్రక్కల అంకిటల నాశ్రయించిన నాలుగుసిరలుండును. అందు నీలములనుసిరలు రెండును మన్యలనుసిరలురెండును మర్మములు. ఈనాలుగుమర్మములయందు అభిఘాతము

కలిగినప్పుడు కంఠస్వరము నశించును. లేక మామూలుగనుండు స్వరముమారి వికృతముగ నుండును. మధురాదిరసములు నోటికి తెలియదు.

### మాతృకామర్మములు ఎనిమిది.

కణ్ఠనాడీముభయతో జిహ్వానాసాగతాస్సిరాః,
పృథక్చతస్రః తాస్సద్యో ఘ్నన్త్యసూన్ మాతృకాహ్వయాః.

కంఠనాడి కిరుప్రక్కల ప్రక్కకునాల్గేసినంతున నాలుకకును నాసారంధ్రములకును జేరి యెనిమిదిసిరలు వ్యాపించియుండును. ఆయెనిమిది సిరలును మాతృకామర్మములని చెప్పబడును. వానియం దభిఘాతము కల్గినయెడ నాక్షణముననే తప్పక చంపును.

### కృకాటికా విధురమర్మములు.

కృకాటికే శిరోగ్రీవాసన్ధీ తత్ర చలం శిరః,
అధస్తాత్కర్ణయోర్నిమ్నే విధురే శ్రుతిహారిణీ.

మెడకును శిరస్సుకును సంధిస్థానములు రెండుప్రక్కల రెండుండును. అవి రెండును కృకాటికలను మర్మములు. అచ్చట నభిఘాతము కల్గిననాడు తల వణకుచుండును.

చెవులరెండిటికిని దిగువ పల్లముగై రెండుస్థలము లుండును. అవి విధురములను మర్మములు. అచ్చట నభిఘాతముకల్గిననాడు చెవులు వినబడదు.

### ఫణమర్మములు.

ఫణావుభయతో ఘ్రాణమార్గం శ్రోత్రపథానుగౌ,
అన్తర్గలస్థితౌ వేధాత్ గన్ధవిజ్ఞానహారిణౌ. 30

నాసామార్గమున కిరుప్రక్కల చెవులమార్గముల ననుసరించి పాముపడగవంటి యాకారముకల రెండుమర్మము లుండును. ఆరెండును పాముపడగవలెనుండుటం జేసియే ఫణములని చెప్పబడును. వానియందు అభిఘాతము కల్గిననాడు ఘ్రాణేంద్రియమునకు గంధమును తెలిసికొనుశక్తి బొత్తుగ చెడును.

### అపాంగ-ఆవర్తమర్మములు.

నేత్రయోర్బాహ్యతోఽపాఙ్గౌ భ్రువోః పుచ్ఛాన్తయోరధః,
తథోపరి భ్రువోర్నిమ్నావావర్తావాన్ధ్యమేషు తు. 31

కనుబొమల రెంటికొనలయొక్క క్రిందను కన్నులచివరలయందు కన్నులకు వెలుపల అపాంగములను మర్మము లుండును. కనుబొమలచివరల పైభాగములయందు

పల్లములై యావర్తములను రెండుమర్మము లుండును. ఈనాల్గు మర్మములయందును అభిఘాతము కల్గినచో నంధత్వము సంభవించును.

**శంఖమర్మములు.**

అనుకర్ణం లలాటాన్తే శఙ్ఖౌసద్యోవినాశినౌ,

నుదుటి యంతములయందు కనుబొమలచివరలయందు చెవులకు సమీపమున శంఖములను మర్మము లుండును. (ఇవియేకణతలు) వీనియందు లేశమైన నభిఘాతము కల్గినచో క్షణముననే మృతిజెందును.

**ఉత్క్షేప-స్థపనీమర్మములు.**

కేశాన్తే శఙ్ఖయోరూర్ధ్వం ఉత్క్షేపౌ స్థపనీ పునః. 3౨
భ్రువోర్మధ్యే త్రయోఽప్యత్ర శల్యే జీవేదనుద్ధృతే,
స్వయంవా పతితే పాకాత్ సద్యో నశ్యతి నోద్ధృతే. 33

శంఖమర్మములకు పైభాగమున వెండ్రుకలు వ్యాపించియుండుస్థలముయొక్క చివరను ఉత్క్షేపములను మర్మము లుండును. కనుబొమల రెంటికినడమ స్థపతియను మర్మముండును. ఈమూడుమర్మములయందును ఏదైన కంటకాదిశల్యములు గ్రుచ్చుకొనిన యెడ వానిని వెలికిందీయకున్నంతవరకును బ్రతికియుండును. శల్యమును విడదీసినచో వాతప్రకోపమునంజేసి తత్కాలముననే మృతినొందును. లేక కొంతకాలమునకు తనంతనే పుండై శల్యము తనంతనే యూడిపడుచెడ ఒకసమయమున జీవించును.

**శృంగాటకమర్మములు.**

జిహ్వాఽక్షినాసికా శ్రోత్రఖచతుష్టయసంగమే,
తాలున్యాస్యాని చత్వారి స్రోతసాం తేషు మర్మసు. 3౪
విద్ధశ్శృఙ్గాటకాఖ్యేషు సద్యస్త్యజతి జీవితమ్,

నాలుక, కన్నులు, నాసికలు, చెవులు, ఈనాల్గిటిని తృప్తినొందించు స్రోతస్సులు నాల్గు. ఈనాల్గు స్రోతస్సులును తాలువులయం దొకటితో నొకటిచేరును. అట్లు ఒండొంటకలయు నాల్గుస్థలములును శృంగాటకములను నాలుగుమర్మములు. ఈమర్మములయం దభిఘాతముకలిగినచో నొకనిమిషమైన జీవింపడు.

**సీమంత మర్మములు.**

కపాలే సన్ధయః పఞ్చ సీమన్తాస్తిర్యగూర్ధ్వగాః. 3౫
భ్రమోన్మాదమనోనాశైః తేషువిద్ధేషు నశ్యతి,

శిరస్సున ఐదు అస్థిఖండములు ఒండొంటజేరియుండును. అవి యొకటితో నొకటిచేరుసంధులు రేఖలబోలె నడ్డముగను పైకిని వ్యాపించియుండును. ఈయైదును

సీమంతములను మర్మములు. వీనియందు అభిఘాతము కల్గినయెడ భ్రమంబును ఉన్మాదంబునుకల్గి మనశ్శక్తి బొత్తుగ చెడి మృతినొందును.

## అధిపతిమర్మము.

అన్తరోమస్తకస్యోర్ధ్వం సిరాసన్ధి సమాగమః. 3౬
రోమావర్తోఽధిపో నామ మర్మ సద్యో హరత్యసూన్,

శిరస్సుకులోపల పైభాగమున శరీరమునవ్యాపించు సిరలన్నిటియొక్క సంధులను చేరునట్టి స్థలముండును. అచ్చట వెంట్రుకల సుడియుండును. ఇయ్యది మర్మముల కన్నిటికి నాశ్రయముగ నుండుటంజేసి యధిపతిమర్మ మనిచెప్పబడును. దీనియం దభిఘాతము కలిగినయెడ నాక్షణముననే ప్రాణములహరించును. (ఇత్తెరంగున ముప్పది యేడు మర్మములు కంఠమునకు పైభాగమునందుకలవి వివరింపబడినవి.)

మరియు తలహృదయము మొదలుజేసి యధిపతిమర్మమువరకును శరీరమునం దాపాదమస్తకపర్యంతము వ్యాపించు మర్మములు నూటయేడును వివరింపబడినవి.

## మర్మసామాన్యలక్షణము.

విషమం స్పన్దనం యత్ర పీడితే రుక్చ మర్మ తత్. 3౭

శరీరమునం దేస్థలమున విషమముగ నదరునో అది మర్మస్థలము. ఏప్రదేశమున గట్టిగ నొత్తినయెడ విషమముగ నొప్పి తీవ్రముగగలుగునో అయ్యదియు మర్మస్థలమని యెరుంగునది.

మర్మములు రెండువిధములు. అందొకటి విషమముగ నదరునది. ఈలక్షణము ప్రాయికముగ సిరాధమన్యాదులకు సంబంధించిన మర్మములయందుండును. రెండవది పీడనముచే తీవ్రముగ బాధగలుగునది. ఈలక్షణము తరుచుగ మాంసమునకును అస్థులకును సంబంధించిన మర్మములయందుండును. మరణమును కలిగించునదియు, మరణాన్తకమైన బాధగలిగించునదియు మర్మమని మర్మసామాన్యలక్షణము.

## మర్మములు మాంసాదిభేదములచే నారువిధములు

మాంసాస్థిస్నాయుధమనీసిరాసన్ధిసమాగమః,
స్యాన్మర్మేతి చ తేనాత్ర సుతరాం జీవితం స్థితమ్. 3౮

మాంసము, అస్థులు, స్నాయువులు, ధమనులు, సిరలు, సంధులు, అను నీయారును ఆయాజాతికి సంబంధించినవానితో పరస్పరము కలుగుసమాగమస్థలములు మర్మములు. అట్టి మర్మములయందు జీవితము ప్రధానముగ నాధారముగజేసికొని నిలిచియుండును.

మాంసమునకు పేశీలకును కలిగినపరస్పరసంబంధము మాంసమర్మములు. అస్థులు ఒండొంటజేరు స్థలములు అస్థిమర్మములు. స్నాయువు లొకటితోనొకటి కలయుస్థలములు స్నాయుమర్మములు. ధమనులొకటితో నొకటి చేరుస్థలములు ధమనీమర్మములు. సిరలొకటితో నొకటిచేరుస్థలములు సిరామర్మములు. సంధు లొండొంట కలయుస్థలములు సంధిమర్మములు. ఇత్తెరంగున మర్మములు మొత్తముమీద ఆరువిధములుగ నుండునని భావము.

అన్నిమర్మముల కేకరూపత.

బాహుల్యేన తు నిర్దేశః షోఢైవం మర్మకల్పనా,
ప్రాణాయతనసామాన్యాత్ ఐక్యంవా మర్మణాం మతమ్. ౩౯

పైజెప్పినవిధముగ నారువిధముల గల్పింపబడిన మర్మములు వాని అవాంతర భేదములచే సంఖ్యాతీతములగును. అందుముఖ్యముగ నూటయేడును పరిగణనముజేసి, పిదప వాని సంగ్రహముగ మాంసాదిభేదములచే నారువిధములుగ విభజింపబడినది. శరీరమునందెన్ని మర్మములున్నను, అవియెల్ల ప్రాణములకు ముఖ్యాధారములై యుండును. కావున ఈలక్షణమునుబట్టి మర్మములన్నియు నొక్కజాతియై యొక్కలక్షణముచే లక్షితములై యేకరూపముగ నుండును.

మాంసజ మర్మములు పది. వాని వివరణము.

మాంసజాని దశేన్ద్రాఖ్యతలహృత్స్తనరోహితాః,

రెండుకాళ్లయందును రెండుచేతులయందును కలయింద్రవస్తి మర్మములు నాలుగును, తలహృదయములను మర్మములును, స్తనముల రెంటియందునుకల రెండు స్తనరోహితమర్మములును జేరి పది మర్మములు మాంసమునకు జేరినవి. (గుదమర్మమును మాంసమర్మములతో జేరి పదునొకండుగ సుశ్రుతాచార్యులు విభజించిరి.

ఎనిమిది అస్థిమర్మములు, వానివివరణము.

శఙ్ఖౌ కటీకతరుణే నితమ్బావంసయోః ఫలే. ౪౦
అస్థ్న్యష్టౌ

శంఖమర్మములు రెండును, కటీకతరుణమర్మములు రెండును, నితంబమర్మములు రెండును, అంసఫలకమర్మములు రెండునుజేరి యస్థులయందలి మర్మములు ఎనిమిది.

ఇరువదిమూడు స్నాయుమర్మములు. వాని వివరణము.

స్నావమర్మాణి త్రయోవింశతి రాణయః,
కూర్చకూర్చశిరో ఉపాణ్ణకక్షధరక్షిప్రవస్తయః. ౪౧

ఊరువులయందును బాహువులయందును ఒక్కొకటివంతుననుండు అణిమర్మములు నాల్గు. హస్తములయందును పాదములయందు నొక్కొకటివంతుననుండు కూర్చమర్మములు నాల్గు. హస్తపాదములయందుండు కూర్చశిరస్సులను మర్మములు నాలుగు అపాంగమర్మములు రెండు. హస్తపాదముల నాలిగిటియందుండు క్షిప్రమర్మములు నాలుగు ఉత్క్షేపమర్మములు రెండు. అంసమర్మములు రెండు. వస్తిమర్మమొకటి. ఈయిరువదిమూడును స్నాయుమర్మములు.

ధమనిగతమర్మములు తొమ్మిది. వాని వివరణము.

గుదోఽపస్తమ్భవిధురశృంగాటాని నవాదిశేత్,
మర్మాణిధమనీస్థాని

గుదమర్మమొకటి. అపస్తంబ మర్మములు రెండు. విధురమర్మములు రెండు. శృంగాటకమర్మములు నాల్గు. ఈతొమ్మిదియు ధమనులకు సంబంధించిన మర్మములు.

సిరాశ్రయమర్మములు ముప్పదియేడు. వానివివరణము.

సప్తత్రింశత్సిరాశ్రయాః. ౪౨
బృహత్యౌ మాతృకాః నీలే మన్యే కృకాటికే ఫణౌ,
విటపే హృదయం నాభిః పార్శ్వసన్ధీస్తనాధరే. ౪౩
అపాలాపౌ స్థపన్యూర్వ్యః చ తస్రోలోహితాని చ,

బృహతీమర్మములు రెండు. మాతృకామర్మములు ఎనిమిది. నీలములు రెండు. మన్యలు రెండు. కృకాటికములు రెండు. ఫణమర్మములు రెండు. విటపమర్మములు రెండు. హృదయమర్మమొకటి. నాభియొకటి. పార్శ్వసంధి మర్మములు రెండు. అపాలాప మర్మములు రెండు. స్థపనీమర్మమొకటి. ఉర్వీమర్మములు నాలుగు లోహితాక్షమర్మములు నాలుగు, ఇవి యన్నియుజేరి ముప్పదియేడుమర్మములు సిరల నాశ్రయించినవి.

సంధిగతమర్మములు ఇరువది. వానివివరణము.

సన్ధౌ వింశతిరావర్తౌ మణిబన్ధౌ కుకున్దరౌ. ౪౪
సీమన్తాః కూర్పరౌ గుల్ఫౌ కృకాటిక్యౌ జానునీ పతిః,

ఆవర్తమర్మములు రెండు. మణిబంధమర్మములు రెండు. కుకుందరమర్మములు రెండు. సీమంతమర్మములు ఐదు. కూర్పరమర్మములు రెండు. గుల్ఫమర్మములు రెండు. కృకాటికామర్మములు రెండు. జానుమర్మములు రెండు. అధిపతిమర్మమొకటి. ఈ యిరువదిమర్మములును సంధుల (కీళ్ల) నాశ్రయించినవి.

ఇత్తెరంగున నూటయేడుమర్మములకును మాంసాద్యాశ్రయభేదముల ననుసరించి వేరువేరుగ పరిగణనముచేయబడినది. (సుశ్రుతమునందలి విభాగమునకును, ఈవిభాగమునకును భేదము కన్పట్టుచున్నది.)

మతాన్తరము.

మాంసమర్మ గుదోఽన్యేషాం స్నావ్నీ కక్షాధరౌ తథా. ४४
విటపౌ విధురాఖ్యే చ శృఙ్గాటాని సిరాసు తు
అపస్తమ్భావపాఙ్గా చ ధమనీస్థం న తైస్స్మృతమ్. ४౬

మాంసమర్మ మిచ్చట ధమనీమర్మమున జెప్పబడినది. దీనిని కొందరాచార్యులు మాంసమర్మమని చెప్పిరి. మరియు కక్షధరమర్మముల రెంటిని, విటపమర్మముల రెంటిని, విధురమర్మముల రెంటిని ఈయారిటిని స్నాయుమర్మములని చెప్పిరి. శృంగాటకమర్మములు నాలుగును, అపస్తంబములు రెండును, అపాంగమర్మములు రెండును, ఈయెనిమిది మర్మములును సిరామర్మములయందు చెప్పబడినవి. మరియు వీరిమతమున ధమనీమర్మములు ప్రత్యేకముగ జెప్పబడలేదు.

(పైకనబరిచిన భేదము సుశ్రుతసంహితయందు గానంబడుచున్నది. ఆభేదము నే వాగ్భటాచార్యులు చూపిరి)

మాంసమర్మవ్యధలక్షణము.

విద్ధేఽజస్రమసృక్స్రావః మాంసధావనవత్తనుః,
పాణ్డుత్వమిన్ద్రియాఽజ్ఞానం మరణంచాశు మాంసజే. ४౭

మాంసమర్మములయందు శస్త్రాదులవేధకలిగినపుడు మాంసమును కడిగిన నీళ్లవలె నెత్తురు నిరంతరముగ కారుచుండును. శరీరము తెల్లవడును. చక్షురాదీంద్రియములు వానివాని విషయముల గ్రహింపనోపవు. ఒకసమయమున శీఘ్రముగ మరణమును సంభవించును.

అస్థిమర్మవ్యధలక్షణము.

మజ్జాన్వితోఽచ్ఛో విచ్ఛిన్నస్రావోరుక్చాఽస్థిమర్మణి,

అస్థిమర్మమునం దభేఘాతము కలిగినయెడ రక్తము మజ్జతోగూడి తేటగ నిరంతరముగ లేక అప్పుడప్పుడును స్రవించును. నొప్పి మిక్కిలి తీవ్రముగ కలుగును.

స్నాయుమర్మవ్యధలక్షణము.

ఆయామాక్షేపకస్తమ్భాః స్నావజేఽభ్యధికా రుజా. ४౮
యానస్థానాఽసనాశక్తిః వైకల్యమథవాన్తకః,

స్నాయుమర్మములయం దభిఘాతము కలిగినపుడు ఆయంగమున లాగునట్లు బాధకలుగును. ఆక్షేపకవాతము కలుగును. స్తంభించును. మిక్కిలి తీవ్రముగ నొప్పి కలుగును. నడచుటకును నిలచుటకును కూర్చొనుటకును శక్తిలేకయుండును. ఆయంగమున వికలత్వము కలుగును. ఒకవేళ మరణముకూడ సంభవించును.

### ధమనీమర్మవ్యధలక్షణము.

రక్తం స శబ్దఫేనోష్ణం ధమనీస్థే విచేతనః. ౪౯

ధమనీమర్మములయందభిఘాతము కలిగినయెడ రక్తము నురుగుతోగూడి శబ్దము చేయుచు వెడలును. శరీరముపై ప్రజ్ఞతప్పును.

### సిరామర్మవ్యధలక్షణము.

సిరామర్మవ్యధే సాన్ద్రం అజస్రం బహ్వసృక్ స్రవేత్,
తత్క్షయాత్తృట్ భ్రమశ్వాసమోహహిధ్మాభిరంతకః. ౫౦

సిరామర్మములయం దభిఘాతముకలిగిననాడు రక్తము మిక్కిలి చిక్కనైయధికముగ నిరంతరముగ స్రవించును. అట్టిరక్తము క్షీణించుటవలన దప్పియు భ్రమంబును, శ్వాసంబును, మోహంబును వెక్కిళ్లును కలిగి మృతిజెందును.

### సంధిమర్మవ్యధలక్షణము.

వస్తు శూకైరివాకీర్ణం రూఢే చ కుణిఖంజతా,
బలచేష్టాక్షయశ్శోషః పర్వశోఫశ్చ సన్ధిజే. ౫౧

సంధి మర్మములయందు దెబ్బతగిలినయెడ ఆచోట ముండ్లతో నిండియుండునట్లు బాధ కల్గును. అట్టిగాయముమానినను కుంటియగును. లేక అవయవములు ముడుంచుకొనును బలంబును చేష్టలు నుడుగును. శరీరము శుష్కించును. కీళ్లయందు వాపు కల్గును.

### సద్యఃప్రాణహరమర్మములు పందొమ్మిది.

నాభిశఙ్ఖాఽధిపాఽపానహృచ్ఛృఙ్గాటకవస్తయః,
అష్టౌచ మాతృకాః సద్యో నిఘ్నన్త్యేకాన్నవింశతిః. ౫౨
సప్తాహః పరమస్తేషాం కాలః కాలస్య కర్షణే,

నాభిమర్మమొకటి, శంఖమర్మములు రెండు, అధిపతిమర్మమొకటి, గుదమర్మమొకటి, వస్తిమర్మమొకటి, హృదయమర్మమొకటి,శృంగాటకమర్మములునాల్గు,మాతృకామర్మములు ఎనిమిది ఈపందొమ్మిది. మర్మములును అభిఘాతముకలిగినతోడనే చంపును. కావున నివి సద్యఃప్రాణహరమర్మము లనబడును. ఈమర్మములయందభిఘాతము కలిగి

నపుడు మృత్యువు హింసించుటకు ఏడుదినములకాలము పరమావధియైయుండును. ఏడు దినములకులోపల మృతిబెందునని భావము.)

### కాలాన్తరప్రాణహరమర్మములు ముప్పదిమూడు.

త్రయస్త్రింశదపస్తమ్భతలహృత్పార్శ్వసన్ధయః. ౪౩
కటీతరుణసీమన్తస్తనమూలేన్ద్రవస్తయః,
క్షిప్రాపాలాపబృహతీనితమ్బస్తనరోహితాః. ౪౪
కాలాన్తరప్రాణహరాః మాసమాసార్ధజీవితాః,

అపస్తంబమర్మములు రెండు, తలహృదయమర్మములు నాలుగు, పార్శ్వసంధిమర్మములు రెండు, కటీకతరుణమర్మములు రెండు, సీమంతమర్మములు ఐదు, స్తనమూలమర్మములు రెండు, ఇంద్రవస్తిమర్మములు నాలుగు, క్షిప్రమర్మములు నాలుగు, అపాలాపమర్మములు రెండు, బృహతీమర్మములు రెండు, నితంబమర్మములు రెండు, స్తనరోహితమర్మములు రెండు. ఈముప్పదిమూడుమర్మములును అభిఘాతముకలిగినపిదప కాలాంతరమున నొక మాసమునకైనను ఒకటిన్నరమాసమునకైన ప్రాణములహరించును. కావుననే ఇవి ముప్పదిమూడుమర్మములును కాలాంతరప్రాణహరములని చెప్పబడును.

### విశల్యప్రాణహరమర్మములు మూడు.

ఉత్క్షేపౌ స్థపనీ త్రీణి విశల్యఘ్నాని తత్ర హి. ౪౫
వాయుర్మాంసవసామజ్జమస్తులుఙ్గాని శోషయన్,
శల్యాపాయే వినిర్గచ్ఛన్ శ్వాసాత్కాసాచ్చ హన్త్యసూన్. ౪౬

ఉత్క్షేపమర్మములు రెండు, స్థపనీమర్మమొకటి. ఈ మూడుమర్మములయందు శల్యాదులు గ్రుచ్చుకొని యభిఘాతము కల్గినయెడ శల్యముల విడదీసినచో ప్రాణము పోవును. శల్యమును విడదీసినతోడనే వాతము దానివెంట బైటవెడలివచ్చుచు శరీరమునందలి మాంసమును, వసను, మజ్జను, మస్తులుంగమును (తలయందలి మెదడును), వీనినన్నిటిని శోషింపజేయుచు వెడలును. కావున శల్యమును విడదీసినంతట చంపును. విడదీయకున్నయెడ మృత్యువు కలుగును.

### వైకల్యకరమర్మములు నలుబదినాల్గు.

ఫణావపాఙ్గౌ విధురౌ నీలే మన్యే కృకాటికే,
అంసాంసఫలకావర్తవిటపోర్వీకుకున్దరాః, ౪౭
సజానులోహితాక్ష్యాణి కక్షాధృక్కూర్చకూర్పరాః,
వైకల్యమితి చత్వారి చత్వారింశచ్చ కుర్వతే ౪౮
హరన్తి తాన్యపి ప్రాణాన్ కదాచిదభిఘాతతః,

ఫణమర్మములురెండు, అపాంగమర్మములురెండు, విధురమర్మములురెండు, నీలమర్మములురెండు, మన్యామర్మములురెండు, కృకాటికామర్మములురెండు, అంసమర్మములురెండు, అంసఫలకమర్మములురెండు, ఆవర్తమర్మములురెండు, విటపమర్మములురెండు, ఉర్వీమర్మములునాల్గు, కుకుందరమర్మములురెండు, జానుమర్మములురెండు, లోహితమర్మములునాల్గు, ఆణిమర్మములునాల్గు, కక్షాధరమర్మములురెండు, కూర్చమర్మములునాల్గు కూర్పరమర్మములురెండు, ఈనలువదినాల్గుమర్మములును అభిఘాతము కల్గినపుడు ఆయాఅంగములకు వైకల్యమును కల్గించును. ఒకసమయమున నభిఘాతముచే నీమర్మములు నలువదినాల్గును మరణమును కల్గించుటకూడ కలదు.

రుజాకరమర్మములు ఎనిమిది.

అష్టౌ కూర్చశిరోగుల్ఫమణిబన్ధాః రుజాకరాః. ౫౯

కూర్చశిరస్సులు రెండుపాదములయందును రెండుకాళ్లయందును జేరి నాల్గు. గుల్ఫమర్మములురెండు, మణిబంధమర్మములురెండు. ఈయెనిమిది మర్మంబులును మిక్కిలి బాధకల్గించునవి. పైజెప్పిన యెనిమిదిమర్మములును అగ్నిసోమవాయువులగుణములు విశేషముగ గల్గియుండును. దానంజేసి అగ్నివాయుగుణములవలన తీవ్రమైన మంటపోటుమున్నగుబాధల గల్గించును. సౌమ్యగుణము ప్రాణముల కవలంబకము. కావున ప్రాణములకపాయములేక కాపాడును అనిభావము.

మర్మములకు వేరువేరుగ పరిమాణము.

తేషాం విటపకక్షాధృక్ ఉర్వ్యః కూర్చశిరాంసి చ,
ద్వాదశాఙ్గులమానాని ద్వ్యఙ్గులే మణిబన్ధనే. ౬౦
గుల్ఫౌచ స్తనమూలే చ త్ర్యఙ్గులౌ జానుకూర్పరౌ,

పై నిర్దేశింపబడిన నూటయేకమర్మములలో విటపమర్మములురెండును, కక్షాధరమర్మములురెండును, ఉర్వీమర్మములు నాల్గును, కూర్చశిరోమర్మములునాల్గును ఇవియన్నియు కలిసి పండ్రెండు మర్మములును, తన చేతియంగుళపరిమాణముచే నొక్కొకయంగుళము ప్రమాణము కల్గియుండును. మణిబంధన మర్మములురెండును, గుల్ఫమర్మములురెండును, స్తనమూలమర్మములురెండును, ఈ యారుమర్మములును ప్రత్యేకము రెండేసియంగుళముల పరిమితికల్గియుండును. జానుమర్మములురెండును, కూర్పరమర్మములురెండును ఒక్కొకటి మూడేసియంగుళములపరిమాణముకల్గియుండును.

అపానవస్తిహృన్నాభినీలాస్సీమన్తమాతృకాః. ౬౧
కూర్చశృఙ్గాటమన్యాశ్చ త్రింశదేకేన వర్జితాః,
ఆత్మపాణితలోన్మానాః

గుదమర్మమొకటి, వస్తిమర్మమొకటి, హృదయమర్మమొకటి, నాభిమర్మమొకటి, నీలమర్మములురెండు, సీమన్తమర్మములు ఐదు, మాతృకామర్మములు ఎనిమిది

కూర్చమర్మములునాల్గు, శృంగాటమర్మములునాల్గు, మన్యామర్మములురెండు ఈయిరువదితొమ్మిదిమర్మములును ఒక్కొకటి తనయరచేతిపరిమాణముపొడవుకల్గియుండును. (ఇత్తెరంగున నేబదియొకమర్మములకు వేరువేరుగ పరిమాణముచెప్పబడినది.)

శేషాణ్యర్ధాఙ్గులం వదేత్. ౬౨

పఞ్చాశత్ షట్చ మర్మాణి తిలవ్రీహిసమాన్యపి.

ఇష్టాని మర్మాణ్యన్యేషాం

తక్కినయేబదియారుమర్మములును ఒక్కొకటి అర్ధాంగుళపరిమాణము కల్గియుండును. ఈ మర్మములు నువ్వుగింజంతపరిమాణమైనను వరిగింజంతపరిమాణమైనను కల్గియుండునని కొందరాచార్యులు చెప్పెదరు. (ఈమతమును నిషేధించకయుండుటవలన 'అప్రతిషిద్ధమనుమతం భవతి' అనున్యాయముచేత నీతంత్రకారునకును అభిమతమని తోచెడిని.

మర్మాభిఘాతమున మరణము సంభవించుటకు కారణము.

చతుర్థో స్రాస్సిరాస్తు యాః. ౬౩

తర్పయన్తి వపుః కృత్స్నం తా మర్మాణ్యాశ్రితాస్తతః,

తత్క్షతాత్ క్షతజాఽత్యర్థప్రవృత్తేః ధాతుసంక్షయే. ౬౪

వృద్ధశ్చలో రుజస్తీవ్రాః ప్రతనోతి సమీరయన్,

తేజస్తదుద్ధృతం ధత్తే తృష్ణాశోషమదభ్రమాన్. ౬౫

స్విన్నస్రస్తశ్లథతనుం హరత్యేనం తతోఽన్తకః,

సిరల ప్రత్యేకముగ విభజించిచెప్పునపుడు వాతవహ, పిత్తవహ, కఫవహ, రక్తవహ భేదములచే నాల్గువిధములుగ విభజింపబడినవి. అట్టియేడువందల సిరలును శరీరమునందెల్ల వ్యాపించి శరీరమును కాపాడుచుండును. అవియన్నియు పైజెప్పినమర్మముల నాశ్రయించియుండును. కావున నామర్మములయందు గాయము తగిలినను అభిఘాతము కల్గినను ప్రాణమునకు ముఖ్యాధారమైనరక్త మధికముగ స్రవించును. రక్తము వలన తక్కిన ధాతువలు వరుసగ వృద్ధినొందును కావున రక్తము అధికముగ స్రవించుటంజేసి తక్కినధాతువులును క్షీణించును. ధాతుక్షయమువలన వాతము మిక్కిలి వృద్ధినొంది తేజోరూపమైనపిత్తమును ప్రేరణచేయుచు మిక్కిలి తీవ్రమైన మంట పోటు మున్నగు బాధల గల్గించును. వాతముచే వృద్ధినొందింపబడినపిత్తము ఉత్కటమై తీవ్రమైన దప్పిని, శోషమును, మదమును, భ్రమమును కల్గించును. పిదప మనుజుండు శరీరముపై చెమటపట్టి సడలి సంధిబంధములన్నియు శిథిలములై మృతినొందును.

మర్మాభిఘాతమునకు చికిత్స.

వర్జయేత్సన్ధితో గాత్రం మర్మణ్యభిహతే ద్రుతమ్. ౬౬

ఛేదనాత్సన్ధి కేశస్య సఙ్కుచన్తి సిరా హ్యతః,
జీవితం ప్రాణినాం తత్ర రక్తే తిష్ఠతి తిష్ఠతి. ౬౭

మర్మస్థానమునం దభిఘాతము కలిగినపుడు ఆక్షణముననే సంధిస్థానమున శరీరమును కొంచెము ఛేదించవలెను. అట్లు ఛేదించుటచేత సిరలు ద్వారముల మూసికొనును. దానంజేసి ప్రాణమున కాధారమైనరక్తము స్రవించకయుండును. ఆరక్తము స్రవించక నిలబడినచో జీవితమునకు హానికలుగదు.

మర్మములయందు క్షారాదులనిషేధము.

సువిద్ధోఽన్యతో జీవేత్ అమర్మణి న మర్మణి,
ప్రాణఘాతిని జీవేత్తు కశ్చిద్వైద్యగుణేన చేత్. ౬౮
అసమగ్రాఽభిఘాతాచ్చ సోఽపి వైకల్యమశ్నుతే,
తస్మాత్ క్షారవిషాఽగ్న్యాదీన్ యత్నాన్మర్మసు వర్జయేత్. ౬౯

మర్మముకానిస్థలమున పూర్తిగ గాయము తగిలినను జీవించును. ప్రాణహరమర్మమునందు అభిఘాతము ఎంతమాత్రము కలిగినను జీవింపజాలడు. ఒకవేళ పూర్తిగ నభిఘాతము కలుగక స్వల్పముగ కల్గినను వైద్యాదిగుణసంపత్తిచే నొకవేళ జీవించినను ఆయంగములకు వైకల్యముకల్గును. కావున మర్మస్థలములయందు క్షారములచేతను విషముచేతను నిప్పు శస్త్రములు మున్నగువానిచేతను అభిఘాతము కల్గనీయక యత్నముతో కాపాడవలెను.

మర్మాభిఘాతప్రాబల్యము.

మర్మాభిఘాతస్స్వల్పోఽపి ప్రాయశో బాధయే త్తరామ్,
రోగామర్మాశ్రితా స్తద్వత్ ప్రక్రాన్తా యత్నతోఽపి చ. ౭౦

మర్మస్థలములయందభిఘాతము మిక్కిలి స్వల్పముగ గల్గినను మిక్కిలి తీవ్రముగ బాధకలుగును. మరియు మర్మస్థానముల నాశ్రయించి సంభవించినరోగములును మిక్కిలి ప్రయత్నముతో చికిత్సజేసినను తీవ్రముగ బాధింపసాగును. (కావున శ్రద్ధతో చికిత్స జేయవలెనఁట.)

ఈవిషయమునే సుశ్రుతాచార్యు లిట్లు వివరించిరి.—

"మర్మాణ్యధిష్ఠాయహి యే వికారాః మూర్ఛన్తి కాయే వివిధా నరాణామ్, ప్రాయేణ తే కృచ్ఛ్రతమా భవన్తి నరస్య యత్నైరపి సాధ్యమానాః" మర్మముల నాధారముగజేసికొని వృద్ధినొందురోగములు మిక్కిలిపూనికతో చికిత్స జేసినను అవి మిక్కిలి కష్టసాధ్యము లగునని భావము.

ఇతి అష్టాంగహృదయశారీరే చతుర్థోఽధ్యాయః.

# పఞ్చమాధ్యాయము.

అవ: మరణమునొందించునది మర్మమని పైయధ్యాయమున చెప్పబడిన వ్యుత్పత్తి ప్రకారము అభిఘాతము కల్గినప్పుడు మరణమునొందించునది మర్మము. అట్టిమరణమునకు కారణములైన మర్మముల విభాగము పైయధ్యాయమున జెప్ప బడినది. అయ్యది వికృతిచె ముందు సూచింపబడును. కావున అట్టి మరణసూచకములగు వికృతు లీయధ్యాయమున వివరింపబడును

**సూ. అథాతో వికృతివిజ్ఞానీయం శారీరం వ్యాఖ్యాస్యామః.**

ప్రకృతియన స్వభావము. దానికి వ్యతిరేకమైనది వికృతి. (స్వభావమునకు విరుద్ధముగ మారియుండుట) అట్టి వికృతియొక్క విశేషజ్ఞానముకలశారీరాధ్యాయమును వివరించెదనని భావము.

## రిష్టలక్షణము.

పుష్పం ఫలస్య ధూమోఽగ్నేః వర్షస్య జలదోదయః,
యథా భావిభవస్యేహ లిఙ్గం రిష్టం మృతేస్తథా ధ్రువమ్. ౧

లోకమున చెట్టున పుష్పము కల్గినప్పుడు ఫలము కల్గనున్నదని తెలియును. కావున కాలాంతరమున గల్గబోవుఫలమును పుష్పము సూచించును. అరణిని మథించునపుడు పొగ వెడలును. అయ్యది అందు కలుగబోవు అగ్నిని సూచించును మేఘోదయమైనపుడు వర్షించునని మనమూహింపగలము. కావున రాబోవువర్షమును మేఘోదయము సూచించును. ఆవిధముగనే రిష్టలక్షణము రాబోవుమరణమును సూచించును. రిష్టమన అశుభలక్షణము. అయ్యది నియతముగ మరణమును సూచించునని భావము.

ఇచ్చట "ధ్రువమ్" అని చెప్పుట చేత నిశ్చయరిష్టలక్షణము కల్గినచో నది రాగల మరణమును సూచించునుగాని రిష్టలక్షణమునుబోలె నున్నపుడు మరణము సంభవింప నేరదని భావము.

అరిష్టం నాస్తిమరణం దృష్టరిష్టం చ జీవితమ్,
అరిష్టే రిష్టవిజ్ఞానం న చ రిష్టేఽప్యనైపుణాత్. ౨

రిష్ట (అశుభ) లక్షణములు లేక మరణము సంభవించుట లేదు. రిష్టలక్షణములు కనుబడినపుడు జీవించుటయు లేదు. రిష్టలక్షణములు కానప్పుడు రిష్టలక్షణములని పొరబడుటయు, రిష్టలక్షణములయందు రిష్టలక్షణములు కావని భ్రమించుటయు మనుజుని బుద్ధిమాన్ద్యమున కల్గును. (కావున రిష్టలక్షణములు లేనపుడు రిష్టమని భ్రమసినంతమాత్రమున మరణము సంభవింపదు. రిష్టలక్షణము వాస్తవ్యముగ కల్గినపుడు భ్రమసి రిష్టలక్షణము కాదనుకొనినను మరణము తప్పదు. కావున రిష్టలక్షణము లేక మరణము సంభవింపదు. రిష్టలక్షణము కల్గిననాడ మరణము తప్పదు.)

ఈవిషయమునే సుశ్రుతు లిట్లు చెప్పిరి:—"ధ్రువంహి రిష్టే మరణం బ్రాహ్మణైస్తత్కిలామలైః, రసాయనతపోదానతత్పరైర్వా నివార్యతే" రిష్టలక్షణము కానవచ్చిననాడు మరణము సంభవించుట నిశ్చయము. అట్టియెడ సదాచారసంపన్నులగు బ్రాహ్మణులు తపోదానాదివిధులజేసినను, రసాయనౌషధముల సేవించినను నివర్తించును.)

—రిష్టము రెండువిధములు.—

కేచిత్తు తత్ ద్విధేత్యాహుః స్థాయ్యస్థాయివిభేదతః,

రిష్టము (మరణమును సూచించులక్షణము) స్థాయి యనియు, అస్థాయియనియు రెండు తెరంగులు.

—స్థాయి, అస్థాయి రిష్టలక్షణములు.—

దోషాణామపి బాహుల్యాత్ రిష్టాభాసస్సముద్భవేత్. 3
స దోషాణాం శమే శామ్యేత్ స్థాయ్యవశ్యంతు మృత్యవే,

కొన్నిసమయములయందు వాతాదిదోషముల ప్రాబల్యముచే రిష్టలక్షణములు కానబడును. అయ్యది దోషములు శమించినతోడనే శాంతినొందును. ఇది నిల్కడలేకుండునదికావున అస్థాయియనబడును. దీనియందు మరణము సంభవింపదు. దోషసంబంధమునగాక సంభవించు రిష్టలక్షణము స్థాయి. ఇయ్యది అవశ్యము మరణమును కల్గించును.

ఇచ్చట నీనిర్ణయము నెరుంగునది. "అరిష్టం నాస్తి మరణమ్" అనువాక్యముచేత రిష్టలక్షణము కాన్పించక మరణము సంభవించదని చెప్పబడినది. ఆకస్మికముగ అగ్నిజలముమున్నగు కారణములచే నకాలమున సంభవించు మరణమున కాలవ్యవధి లేకుండుటంజేసి రిష్టమున కవకాశములేదు. కావున రిష్టలక్షణము లేక మరణము సంభవింపదనుట యెట్లు సంగతము?—పైజెప్పిననియమము కాలమరణముననేగాని యకాల

మరణమునకు లేదు. కావుననే "సర్వే తే కాలచోదితాః" "వశగా స్సమవర్తినః" ఇవి మున్నగువచనములు కాలమరణమునకే యన్వయించును.

## రిష్టసామాన్యలక్షణము.

రూపేన్ద్రియస్వరచ్ఛాయాప్రతిచ్ఛాయాక్రియాదిషు. ౪
అన్యేష్వపి చ భావేషు ప్రాకృతేష్వనిమిత్తతః,
వికృతిర్యా సమాసేన రిష్టం తదితి లక్షయేత్. ౫

దేహప్రకృతికి సంబంధించి నీలపీతశ్యామాదివర్ణంబులును చక్షురింద్రియముచే గ్రహింపదగినవస్తువులయొక్క విన్యాసభేదంబును రూపమనబడును. చక్షుశ్శ్రోత్రాదులు ఇంద్రియములు. కంఠధ్వనివిశేషము స్వరము. దేహకాంతివిశేషము ఛాయ. తనశరీరాకారముయొక్కనీడ ప్రతిఛాయ. దేహమునకును వాక్కునకును మనస్సునకును సంబంధించినవ్యాపారములు క్రియ పైజెప్పబడిన రూపములయందును, ఇంద్రియములయందును కంఠస్వరమునందును, ఛాయయందును, ప్రతిఛాయయందును, క్రియలయందును, ఇవిగాక యితరములగు స్వాభావిక విషయములయందును కారణములేకయే కల్గునట్టివికారము (మామూలుగ నుండుపద్ధతికన్న వ్యతిరేకముగ మార్పు) రిష్టమని గుర్తించునది. ఇది సంగ్రహముగ రిష్టలక్షణము.

## రూపమునకు సంబంధించినరిష్టము.

కేశరోమ నిరభ్యంగం యస్యాభ్యక్తమివేక్ష్యతే,

తలవెండ్రుకలును శరీరమునందలిరోమములును నూనెమొదలగువానిని పూయకున్నను నూనెపూసినవిధముగ నిగనిగలాడుచు జిడ్డుకల్గినట్లు కనబడిన అట్టిమనుజుడు కాలచోదితుడని యెరుంగునది. (మృతినొందుననుట) ఇది రూపముయొక్కవికృతి.

## ఇంద్రియములకు సంబంధించినరిష్టము.

యస్యాత్యర్థం చలే నేత్రే స్తబ్ధాన్తర్గతనిర్గతే. ౬
జిహ్మే విస్తృతసంక్షిప్తే సంక్షిప్తవినతభ్రుణీ,
ఉద్భ్రాన్తదర్శనే హీనదర్శనే నకులోపమే. ౭
కపోతాభే అలాతాభే స్రుతే లులితపక్ష్మణీ,
నాసికాఽత్యర్థవివృతా సంవృతా పిటికాచితా. ౮
ఉచ్ఛూనా స్ఫుటితా మ్లానా

చక్షురింద్రియమున కధిష్ఠానమైన నేత్రములు కారణములేకయె మిక్కిలి చంచలములై యున్నను కదలక స్తంభించియున్నను, లోనికి లాగికొనిపోయి యున్నను, లేక

వెలుపలికివచ్చియున్నను, వక్రములుగ నున్నను, మామూలుకన్న విశాలములుగ నున్నను, లేక సంకుచితములుగ నున్నను, కనుబొమలు సంకుచితములై కండ్లపైకి వ్రాలినట్టు వంగియున్నను, భయభ్రాంతునివలె బెదరచూచునట్లున్నను, చూపు అగుపడకున్నను, ముంగిసకన్నులబోలియున్నను, పావురములకన్నుల బోలియున్నను. కొరివికట్టెలోని నిప్పువలె నున్నను, నీళ్లుగారుచున్నను, కనురెప్పలు సడలియున్నను, ముక్కురంధ్రములు మిక్కిలి విశాలములైనను, లేక మూసికొనియున్నను, బొబ్బలచే నావరింపబడియున్నను, పైకున్నతముగ వాచియున్నను, పగిలినను, వాడియున్నను, మనుజుడు మృతిజెందును. (ఇవియన్నియు నింద్రియాధిష్ఠానములైనకన్నులకును నాసికకును సంబంధించిన రిష్టలక్షణములు.)

### ఓష్ఠాదుల వికృతి.

యస్యోష్ఠో యాత్యధోఽధరః,
ఊర్ధ్వం ద్వితీయః స్యాతాం వా పక్వజమ్బూనిభావుభౌ. ౯
దన్తాస్సశర్కరాః శ్యావాః తామ్రాః పుష్పితపంకితాః,
సహసైవ పతేయుర్వా జిహ్వా జిహ్మా విసర్పిణీ. ౧౦
శ్యేతా శుష్కా గురుశ్శ్యావా లిప్తా సుప్తా సకంటకా,

క్రింది పెదవి క్రిందికి వ్రేలినను, పై పెదవి మీదికి లాగియున్నను, రెండు పెదవులును పండిన నేరేడుపండువలె నల్లనైయున్నను, దంతము శర్కరలతో కూడియున్నను, లేక శ్యావవర్ణంబైనను, తామ్రవర్ణంబైన కల్గియున్నను, పూచియున్నను, బురదపూసినవిధముగ నున్నను, కారణములేకయే రాలినను, నాలుక వక్రమై మార్గము తప్పిపోవుచున్నను, తెల్లనైనను, చెమ్మలేకయెండినను, భారముగనున్నను. శ్యామవర్ణంబైనను, జిగురుకల్గియున్నను, రుచిదెలియక మొద్దువలెనున్నను, ముండ్లవలె కరకుబారియున్నను; ఆమనుజులు కాలచోదితులని యెఱుంగునది

### శిరస్సు, కంఠము మున్నగువానివికృతి.

శిరశ్శిరోధరాం వోఢుం పృష్ఠం వా భారమాత్మనః ౧౧
హనూ వా పిణ్డమాస్యస్థం శక్నువన్తి న యస్య చ,
యస్యాఽనిమిత్తమఙ్గాని గురూణ్యతిలఘూని వా ౧౨
విషహోషాద్వినా యస్య ఖేభ్యో రక్తం ప్రవర్తతే,
ఉత్సిక్తం మేహనం యస్య వృషణావతి నిస్సృతౌ. ౧౩
అతోఽన్యథా వా యస్య స్యాత్ సర్వే తే కాలచోదితాః,

మెడ తలను ధరింపజాలకున్నను, వీపు తనభారమును సహింపజాలకున్నను, నోట నుంచబడిన కబళమును నోటనుంచుకొనుటకు తాలువులకు శక్తిలేకున్నను, కారణము లేకయే అవయవములన్నియు భారముగనైనను తేలికగనైన నున్నను, విషదోషములేక నిష్కారణముగ శరీరమునందలిరంధ్రములనుండి నెత్తురుగారుచున్నను, మేహనము ఉన్నతిజెందిన వృషణములు మిక్కిలిజారినను లేక వృషణములు పైకిలాగి మేహనము అవనతిజెందినను. ఈలక్షణములుకల్గినమానవు లందరును కాలునిచే ప్రేరితులని యెఱుంగునది. (యమునికిస్వాధీనులగుదురని భావము).

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—రిష్టలక్షణములు గానవచ్చినప్పుడు కాల నియమము చెప్పనిచోట ఒకసంవత్సరమునకు లోపల దానిఫలము జూపునని యెఱుంగు నది. కాలనియమమును చెప్పినచోట నానియమప్రకారము ఫలించును.

### ఆరుమాసములలో మృతినొందించురిష్టలక్షణములు.

యస్యాఽపూర్వాః సిరాలేఖాః బాలేన్ద్వాకృతయోఽపివా. ౧౪
లలాటేవ స్తిశీర్షేవా షణ్మాసాన్న స జీవతి,
పద్మినీపత్రవత్తోయం శరీరే యస్య దేహినః. ౧౫
ప్లవతే ప్లవమానస్య షణ్మాసం తస్య జీవితమ్,

రోగములచే బీడితుడుకాని యేమనుజునకు నుదుటియందైనను వస్తిశిరస్సునం దైనను అపూర్వములుగ క్రొత్తలైనసిరములరేఖలు బొడమునో ఆమనుజుడు ఆరుమాస ములలో మృతిజెందును. మరియును పైజెప్పినస్థలములయందు క్రొత్తబాలచంద్రునివలె వక్రములైనరేఖలుకల్గినను ఆరుమాసములలో మృతినొందును. మరియు నేమనుజుడు నీళ్లలో స్నానముచేసినప్పుడు శరీరముపైని తామరాకుపైనుండు నీళ్లవలె నిల్కడ లేక నీళ్లు చంచలమై యుండునో అట్టిమనుజుడు ఆరుమాసములకు మిమ్మట జీవింపడు.

### సిరలు రోమకూపములు వీనివికృతి.

హరితాభాస్సిరాః యస్య రోమకూపాశ్చ సంవృతాః. ౧౬
సోఽమ్లాభిలాషీ పురుషః పిత్తాన్మరణ మశ్నుతే,

ఏమనుజునకు శరీరమునందలిసిరలు ఆకుపచ్చనిరంగుకల్గి రోమరంధ్రములు మూసికొనియుండునో అట్టిమనుజుడు పులుపునందు మిక్కిలి యభిలాషకలవాడై పిత్తప్రకోపముచేత మరణమునొందును.

### శిరస్సుకు సంబంధించినవికృతి.

యస్య గోమయచూర్ణాభం చూర్ణం మూర్ధ్నిముఖేఽపివా. ౧౭

సస్నేహం మూర్ధ్ని ధూమోవా మాసాన్తం తస్య జీవితమ్,

ఏమనుజునకు శిరస్సునందైనను ముఖముపైనైనను నూనెతోఁగూడిన పిడక పొడివంటిచూర్ణము కారణములేకయే పుట్టునో, ఎవ్వనిశిరంబుపైని పొగ వెడలున ట్లుండునో అట్టి మనుజుడు ఒకమాసమునకుపై జీవింపనోపడు.

### రేఖారూపములైన వికృతి.

మూర్ధ్ని భ్రువోర్వా కుర్వన్తి సీమన్తావర్తకాః నవాః ౧౮
మృత్యుం స్వస్థస్య షడ్రాత్రాత్ త్రిరాత్రాదాతురస్యతు,

ఏమనుజుని శిరస్సునందైనను కనుబొమలయందైనను నూతనముగ సుడివంటి రేఖలు కల్గునో అట్టిమనుజుడు రోగములేక స్వస్థుడై యున్నచో నారురాత్రులకు మరణమునొందునని సూచించును.అటుగాక రోగపీడితుడై యున్నప్పుడు పైజెప్పినచోట్ల సుడి రేఖగకల్గినయెడ మూడురాత్రులలో మృతినొందును.

### కొన్ని యరిష్టములు.

జిహ్వా శ్యావా ముఖం పూతి సవ్యమక్షి నిమజ్జతి. ౧౯
ఖగా వా మూర్ధ్ని లీయన్తే యస్య తం పరివర్జయేత్,

ఎవనికి నాలుకనల్లనై యుండునో, ఎవనికి నోట దుర్గంధము కల్గునో, ఎవనికి ఎడమకన్ను లోనికి లాగికొని యుండునో, ఎవనితలపైని పక్షులుతాకునో, అట్టిమనుజుడు మృతినొందును.

### ఉరోవికృతి.

యస్య స్నాతానులిప్తస్య పూర్వం శుష్యత్యురో భృశం. ౨౦
ఆర్ద్రేషు సర్వగాత్రేషు సోఽర్ధమాసం న జీవతి,

ఏమనుజుడు స్నానముచేసి చందనాదుల బూసికొనినప్పుడు తక్కిన అవయవము లన్నియు మిక్కిలి తడిసియున్నప్పుడు రొమ్ముమాత్రము మిక్కిలి యెండునో అట్టి మనుజుడు అర్ధమాసు (పదునైదు దినముల) కాలమునకుపైన జీవింపడు.

### వర్ణ భేదాదుల వికృతి.

అకస్మాద్యుగపద్గాత్రే వర్ణౌ ప్రాకృతవైకృతౌ. ౨౧
తథైవోపచయగ్లానిరౌక్ష్యస్నేహాది మృత్యవే,
యస్య స్ఫుటేయురఙ్గుళ్యో నాకృష్టా న స జీవతి. ౨౨
క్షవథుకాసాదిషు తథా యస్యాపూర్వో ధ్వనిర్భవేత్,
హ్రస్వో దీర్ఘోఽతివోచ్ఛ్వాసః పూతిస్సురభిరేవ వా. ౨౩

ఆప్లుతాఽనాప్లుతే కాయే యస్య గన్ధోఽతిమానుషః,
మలవస్త్రవ్రణాదౌ వా వర్షాన్తం తస్య జీవితమ్. ౨౪

ప్రకృతిసంబంధములగు గౌరాదివర్ణంబులును వికృతిసంబంధములగు నీలాది వర్ణంబులును ఎవనిశరీరమున కారణములేకయే మిశ్రములైయుండునో, శరీరమున బలాతిరేకంబును బడలికయు, రౌక్ష్యస్నేహంబులును, ఇవి మున్నగు పరస్పరవిరుద్ధ గుణములు కారణములేకయే సమకాలముననుండునో, అట్టిమనుజులు మృతినొందెదరు. ఎవనికి వేళ్లుపట్టిలాగినపుడు గణుపులయందుజారక నిట్రబొడిచియుండునో వాడు జీవింపడు. ఎవనికి తుమ్ము దగ్గు మున్నగునవి వెడలునపుడు మామూలుప్రకారము లేక ధ్వని మిక్కిలితీవ్రముగ గల్గునో అట్టిమనుజుడు బ్రతుకడు. ఎవనికి శ్వాసము వెడలు నప్పుడు మిక్కిలి హ్రస్వముగనైనను మిక్కిలి తీవ్రముగనైనను వెడలునో లేక ఉచ్ఛ్వాసము దుర్గంధమైనను సుగంధమైనను కల్గి వెడలునో ఆమానవుడు బ్రతుకడు. శరీరము స్నానముజేసినప్పుడును, స్నానము చేయకున్నప్పుడును మానుషసంబంధముకాని దివ్య పరిమళము కల్గియున్నను, లేక మనుజులకోరుపరాని దుర్గంధము కల్గియున్నను, ఒకవత్సర కాలమునకుపై జీవింపడు. మరియు మలముననైనను కట్టుబట్టలయందైనను వ్రణము మున్నగువానియందైనను అమితపరిమళమైనను అధికదుర్గంధమైనను కల్గిన అట్టిమనుజుడు ఒకవత్సరకాలమునకుపైని జీవింపనోపడు.

### యూకామత్కుణాదిరూపమైన వికృతి.

భజన్తేఽత్యగ్నసౌరస్యాద్యం యూకామత్కుణాదయః,
త్యజన్తి వాతివైరస్యాత్ సోఽపి వర్షం న జీవతి. ౨౫
సతతోష్ణసు గాత్రేషు శైత్యం యస్యోపలక్ష్యతే,
శీతేషు భృశమౌష్ణ్యం వా స్వేదస్తమ్భోఽప్యహేతుకః. ౨౬

ఎవ్వనిశరీరమున మిక్కిలి రుచికల్గియుండుటంజేసి పేలును చీమలును మున్నగునవి (అట్టి రుచియుండాసగొని) విశేషముగ చేరునో, లేక రుచి బొత్తుగ లేకుండుటంజేసి చేరకుండునో అట్టిమనుజుడు ఒకసంవత్సరకాలమునకుపైన జీవింపడు. మరియు శరీరము ఎల్లప్పుడును మిక్కిలి వేడికల్గియున్నపుడు చల్లగనుండునట్లు కనబడినను, ఎల్లపుడును మిక్కిలి చల్లగనున్నపుడు మిక్కిలి వేడిగనున్నట్లుకనబడినను, కారణములేకయే శరీరముపై మిక్కిలి చెమటబట్టుచున్నను, లేక చెమటవెడలక స్తంభించియున్నను, అట్టి మనుజుడు వత్సరకాలమునకుపై జీవింపడు,

## స్పర్శాదివికృతి.

యో జాతశీతపిటికః శీతాఙ్గో వా విదహ్యతే,
ఉష్ణద్వేషీ చ శీతార్తః స ప్రేతాధిపగోచరః. ౨౭
ఉరస్యూష్మా భవేద్యస్య జఠరే చాతిశీతతా,
భిన్నం పురీషం తృష్ణా చ యథాప్రేతస్తథైవ సః ౨౮
మూత్రం పురీషం నిష్ఠ్యూతం శుక్రం చాప్సు నిమజ్జతి,
నిష్ఠ్యూతం బహువర్ణం వా యస్య మాసాత్స నశ్యతి. ౨౯

కఫప్రకోపముచే శీతలములగుపిటికలు కల్గినమనుజుడును లేక శరీరమంతయు చల్లగనుండుమనుజుడైనను మంటతోగూడియున్నను, మిక్కిలి చలిచే బాధపడువాడు వేడిని ద్వేషించినను, అట్టిమనుజుడు యమునిబారిలో పడినవాడని యెరుంగునది. రొమ్ముపైని మిక్కిలివేడియు కడుపుపైని మిక్కిలిచల్లదనంబును కల్గినవాడును, మలము కారణము లేకయే ఉండలుగ వెడలువాడును, మిక్కిలి తీవ్రమైనదప్పికలవాడును చచ్చినవానితో సమానుడగును. (శీఘ్రముగ మృతుడగునుట.) ఎవ్వనిమూత్రమైనను పురీషమైనను ఉమియునపుడు నోటనుండి వెడలుకఫాదులైనను శుక్రమైనను నీట నుంచినచో మునిగి పైకి తేలకుండునో ఆమనుజుడు ఒకనెలకులోపల మృతినొందును. మరియు ఉమిసినప్పుడు వెడలుకఫాదులు అనేకవర్ణములు కల్గియున్నను మనుజుడు ఒకమాసమునకులోపల మృతినొందును.

## చక్షురింద్రియ వికృతిరూపమైనయరిష్టము.

ఘనీభూత మివాకాశం ఆకాశమివ యో ఘనమ్,
అమూర్తమివ మూర్తంచ మూర్తం చామూర్తవత్ స్థితమ్. ౩౦
తేజస్వ్యతేజస్తద్వచ్చ శుక్లం కృష్ణమసచ్చ సత్,
అనేత్రరోగశ్చన్ద్రంచ బహురూపమలాంఛనమ్. ౩౧
జాగ్రద్రక్షాంసి గన్ధర్వాన్ ప్రేతానన్యాంశ్చ తద్విధాన్,
రూపం వ్యాకృతి తద్వచ్చ యః పశ్యతి స నశ్యతి ౩౨

ఆకసమును (బయలును) ఘనీభవించినదానివలెను, ఘనపదార్థములను ఆకసముగను, చూచినను, ఆకారములేక కేవలము స్పర్శమాత్రగోచరమగుగాలి మున్నగువాని ఆకారముతోకూడినదానిగ జూచినను, ఆకారముకల్గి చక్షుర్గోచరమగు అగ్ని మున్నగుమూర్తిమత్పదార్థము ఆకారములేనిదానివలె నగపడినను, తేజోవిశిష్టమైన అగ్ని మున్నగుభాస్వరపదార్థములు తేజోహీనములుగ నగపడినను, తెల్లనిపదార్థము

నల్లగనగపడినను, సత్పదార్థమును అసత్పదార్థముగ జూచినను, నేత్రరోగములేని మనుజుడు చంద్రుని అనేకరూపములుగనైనను, కళంకరహితముగనైనను జూచినను ఆమనుజుడు మృతినొందును. మరియు నిదురమేల్కాంచియుండుకాలమున రాక్షసులనైనను, గంధర్వులనైనను ప్రేతములనైనను వానితోసమానములగు నితరరూపములనైనను, చూచుటకు మిక్కిలి వికృతములగు నితరరూపములనైనను ఏమనుజుడు కంట జూచునో వాడు త్వరితముగ మృతినొందును.

సప్తర్షీణాం సమీపస్థం యో న పశ్యేత్యరున్ధతీమ్,
ధ్రువమాకాశగఙ్గాం వా స న పశ్యతి తాం సమామ్. 33

ఏమానవుడు సప్తర్షిమండలమునకు సమీపముననుండు అరుంధతిని కంటజూడకుండునో. అరీతిగనే ధ్రువుని ఆకాశగంగను జూడకుండునో ఆమనుజుడు మరుసంవత్సరము జూడలేడు. (అరుంధతియు ధ్రువుడును ఆకాశగంగయు కంటికగపడనియెడ మానవుడు సంవత్సరకాలమునకు లోపలనే మృతినొందుననిభావము).

శ్రోత్రేన్ద్రియ వ్యత్యయమున గల్గురిష్టములు.

మేఘతోయౌఘనిర్ఘోషవీణాపణవవేణుజాన్,
శృణోత్యన్యాంశ్చ యశ్శబ్దాన్ అసతో న సతోఽపి వా. 34
నిష్పీడ్య కర్ణౌ శృణుయాత్ న యో ధుకధుకస్వనమ్,

మేఘగర్జనము, ప్రవాహఘోషము, వీణానాదము, తమ్మెటలధ్వని, వేణునాదము, ఇవి వాస్తవ్యముగ లేకున్నను అట్టిధ్వనులు చెవులకు వినబడినను, ఇవికాక యితరశబ్దములు లేకున్నను ఉన్నట్లు చెవులకు వినబడినను, అట్టి మేఘగర్జనము మున్నగుధ్వనులు కల్గియున్నపుడు అవి చెవులకు వినబడకయున్నను, అట్టిమనుజుడు మృతినొందును. మరియు చెవులను బొటనవ్రేళ్లతో మూసినప్పుడు గుమ్మగుమ్మనుధ్వని వినబడకున్న నామనుజుడు మృతినొందును.

గంధరసస్పర్శవిపర్యయరూపరిష్టలక్షణములు.

తద్వద్గన్ధరసస్పర్శాన్ మన్యతే యో విపర్యయాత్. 35
సన్వశో వా నయో యశ్చ దీపగన్ధం న జిఘ్రతి,

మరియు పైజెప్పినమేఘగర్జనాదులను వ్యత్యయముగ గ్రహించువిధముగనే గంధమును రసమును స్పర్శమును విపరీతములుగ దోచినను, స్ఫుటముగ గానవచ్చు గంధరసస్పర్శములు బొత్తుగ దెలియకున్నను అట్టిమనుజుడు మృతినొందును. మరియు వెలుగు

చుండుదీపము ఆరినతోడనే అందుండి (కొడిమండి) వచ్చుపరిమళము ఘ్రాణేంద్రియమునకు తెలియకున్నను ఆమనుజుడు బ్రతుకడు.

గంధాదుల విపర్యయము నిట్లెరుంగునది:—సుగంధము దుర్గంధముగను, దుర్గంధము సుగంధముగను దోచుట గంధవిపర్యయము, మధురము అమ్లముగను, అమ్లము మధురముగను దోచుట రసవిపర్యయము శీతస్పర్శము వేడిగను, ఉష్ణస్పర్శము చల్లగను దోచుట స్పర్శవిపర్యయము. అట్టి గంధరసస్పర్శములు బొత్తుగ దెలియకుండుట అరోగరూపమైనరిష్టము.

### చికిత్సాది వ్యతిరేకరూపరిష్టములు.

విధినా యస్య దోషాయ స్వాస్థ్యాయాఽవిధినా రసాః. ౩౬
యః పాంసునేవ కీర్ణాఙ్గో యోఽఙ్గఘాతం న వేత్తి వా,

మధురాదిరసములను శాస్త్రోక్తవిధి ననుసరించి యుపయోగించినయెడ ఆయ్యవి స్వస్థతను కల్గించుట సహజము. అటుగాక వ్యతిరేకముగ నెవరికి రోగము గలిగించునో, శాస్త్రవిధినతిక్రమించి యుపయోగింపబడిన మధురాదిరసములు రోగము గలిగింపవలసినది సహజము. అటుగాక వ్యతిరేకముగ స్వస్థత యెవరికి కల్గునో అట్టిమనుజుడు మృతి నొందును. శరీరముపై ధూళిగ్రమ్మినవిధముగ నుండినను, శరీరముపై దెబ్బకొట్టినచో తెలియకున్నను ఆమనుజుడు బ్రతుకడు.

### జ్ఞానవ్యతిరేకరూపారిష్టము.

అన్తరేణ తపస్తీవ్రం యోగం వా విధిపూర్వకమ్ ౩౭
జానాత్యతీన్ద్రియం యశ్చ తేషాం మరణమాదిశేత్,

మనుజుడు మిక్కిలి తీవ్రమైనతపస్సు జేసినను, చిత్తరోధరూపమైనయోగమును విధ్యుక్తప్రకారము జేసినను, లేక రసాయనాది యోగముల శాస్త్రోక్తవిధి ప్రకారము జేసినను ఇంద్రియములకు గోచరములుగాని స్వర్గాదిపదార్థములను పరమాత్మస్వరూపమును జూడగల్గును. అటుగాక తపస్సును యోగమును చేయకయే యేమనుజుడు అతీంద్రియపదార్థముల జూచునో ఆమానవుడు నిశ్చయముగ మరణమొందును.

### స్వరవికృతిరూపరిష్టలక్షణము.

హీనో దీనస్స్వరోఽవ్యక్తో యస్య స్యాద్గద్గదోఽపి వా. ౩౮
సహసా యో విముహ్యేద్వా వివక్షుర్న స జీవతి,

ఎవనికి కంఠస్వరము కారణములేకయే హీనముగనైనను, దీనముగనైనను, అస్ఫుటముగనైనను, గద్గదముగనైన నుండునో, ఎవడు ఏదైననొకవిషయమును జెప్పదలంచి

అతిశీఘ్రముగ మూర్ఛనొంది తా జెప్పదలచినవిషయమును జెప్పలేకుండునో ఆమనుజుడు జీవింపడు.

స్వరస్య దుర్బలీభావం హానిం వా బలవర్ణయోః. ౩౯
రోగవృద్ధిమయుక్త్యా చ దృష్ట్వా మరణమాదిశేత్,

కంఠస్వరము మిక్కిలి దుర్బలముగనున్నను, కారణము లేకయే శరీరబలంబును వర్ణంబును హీనమైయున్నను, కారణములేకయే రోగము మిక్కిలి వృద్ధినొందుచున్నను మరణ మవశ్యముగ సంభవించునని యెరుంగునది.

అపస్వరం భాషమాణం ప్రాప్తం మరణమాత్మనః. ౪౦
శ్రోతారం చాస్య శబ్దస్య దూరతః పరివర్జయేత్,

తాను మామూలుగ మాటలాడు స్వరమునకు మారుబాటుగ హీనస్వరముతో తనమరణమును (నేను బ్రతుకను అని) వెల్లడిగ జెప్పువాడును. అట్టిశబ్దమును వినువాడును మరణమునొందెదరు. కావున వారికి చికిత్స జేయంజనదు.

శరీరచ్ఛాయాసంబంధమైన రిష్టలక్షణము.

సంస్థానేన ప్రమాణేన వర్ణేన ప్రభయాపి వా. ౪౧
ఛాయావివర్తతే యస్య స్వప్నేఽపి ప్రేత ఏవ సః,

శరీరముయొక్క ఆకృతివిన్యాసము చేతను, పరిమాణము చేతను, వర్ణము చేతను, కాంతివిశేషము చేతను ఏమనుజునినీడ మారియుండునో ఆమనుజుడు స్వప్నావస్థయందైన బ్రతికినట్టు కనబడడు. (అవశ్యము ఎమునికడ కేగువాడని భావము).

దీనివివర మిట్లు తెలియునది:—మనుజుని శరీరము సమముగనున్నపుడు నీడవిషమముగ నున్నయెడ నయ్యది రిష్టము. శరీరము విషమముగ నున్నపుడు నీడమాత్రము సమముగనున్నయెడ నయ్యదియు రిష్టము. శరీరము దీర్ఘప్రమాణముగ నున్నపుడు నీడమాత్రము హ్రస్వముగ నున్నయెడ నదియు రిష్టము. శరీరము హ్రస్వముగ నున్నపుడు నీడ దీర్ఘముగనున్నయెడ నదియు రిష్టము. శరీరము ఆకసమునకుసంబంధించినఛాయ కలిగియున్నపుడు అగ్నిసంబంధమైనవర్ణము కలిగియున్నయెడ ఇయ్యది వర్ణవ్యత్యయరూపమైనరిష్టము. (ఇత్తెరంగుననే పార్థివాదిచ్ఛాయలయందును వర్ణములమార్పు నూహించునది). శరీరమునందలికాంతివిశేష మొక్కతీరుండ వేరొక్కతీరుగ ఛాయయందుకన్పడిన నయ్యది ప్రభచే గల్గినవివర్తము. ఇవియన్నియు ఛాయ (శరీరముయొక్కనీడ)కు సంబంధించిన రిష్టలక్షణములు. అట్టి రిష్టములు (ఛాయాసంబంధములగునవి) జనించినచో స్వప్నావస్థయందైనను వాడు బ్రతుకునని తలంపవలదని భావము.

## ఛాయా-ప్రతిచ్ఛాయాలక్షణము.

ఆతపాదర్శతోయాదౌ యా సంస్థానప్రమాణతః. ౪౨
ఛాయాజ్జాత్సంభవత్యుక్తా ప్రతిచ్ఛాయేతి సా పునః,
వర్ణప్రభాశ్రయా యా తు సా ఛాయైవ శరీరగా. ౪౩

ఎండ అద్దము నీళ్లు నూనెమొదలగు ద్రవపదార్థములయందు తనశరీరముయొక్క విన్యాసమునకును పరిమాణమునకును అనుగుణముగ ప్రతిఫలించిన తనయొడలి నీడ ప్రతిచ్ఛాయయనబడును. (ఇదియే ప్రతిబింబము). శరీరముయొక్క వర్ణమును కాంతిని ఈ ప్రతిచ్ఛాయ ఆశ్రయించియుండదు. శరీరముయొక్క వర్ణమును కాంతిని ఆశ్రయించి జనించుఛాయ శరీరమునందియే [illegible] కావున శరీరచ్ఛాయయనే చెప్ప బడును. ఇయ్యది ప్రతిబింబమువలె నీళ్లు [illegible]దలగువానియందు కాక శరీరము నందే కనబడును. ఇత్తెరంగున ఛాయా [illegible]చ్ఛాయలకు భేదము నెరుంగునది.

## ప్రతిచ్ఛాయావి[illegible]నైన రిష్టలక్షణములు.

భవేద్యస్య ప్రతిచ్ఛాయా చ్ఛిన్నాభిన్నాధికాఽఽకులా,
విశిరాః ద్విశిరాః జిహ్మా వికృతా యది వాఽన్యథా. ౪౪
తం సమాప్తాయుషం విద్యాత్ న చేల్లక్ష్యనిమిత్తజా,
ప్రతిచ్ఛాయామయీ యస్య న చాఽక్ష్ణి క్షేత కన్యకా. ౪౫

పైజెప్పినరీతిగ ఎండ అద్దము మున్నగువానియందు ప్రతిబింబరూపమైన ప్రతిచ్ఛాయ రెండుచీలికలుగ కనబడినను, ఎచ్చటనైన నొకఅవయవమున భిన్నమై కనబడినను, మామూలుగనుండుపరిమాణమునకన్న నధికముగ నున్నను, చంచలమైన స్వరూపము కల్గియున్నను, తలలేనట్లు నీడకనబడినను, లేక రెండుతలలున్నట్లు కనబడినను, వక్రముగ గనబడినను, పైజెప్పినవానికన్న వేరువిధముగ వికృతరూపమై కనబడినను, అట్టిమనుజునకు ఆయువు పూర్ణమై చెల్లినదని యెరుంగునది. ప్రతిబింబము శరీరాకృతికి న్యూనాతిరిక్తముగాక కనబడుట సహజము కావున లక్ష్యఘాతముగ నున్నశరీరము నందెట్టి లోపమున్నను అయ్యది ప్రతిబింబమున తప్పక కానబడును. అట్టిలక్ష్యమున (శరీరమున) పైజెప్పినలోపములు లేనప్పుడు అట్టిలక్షణములు కనబడినచో నవి మరణ సూచకములగును. అట్టివికృతములు శరీరమునందే యున్నతరిరిష్టలక్షణములుగావు.

మరియు ప్రతిఛాయారూపము కంటిలో కన్పించలని కనబడును. అయ్యది అద్దమున చూచునప్పుడు తనకన్నులయందు గనబడకున్నచో వాడు బ్రతుకడు.

## ఛాయాభేదములు వాని ప్రత్యేకలక్షణములు.

ఖాదీనాం పఞ్చ పఞ్చానాం ఛాయాః వివిధలక్షణాః,
నాభసీ నిర్మలాఽఽనీలా సస్నేహా సప్రభేవ చ. ౪౮
వాతాద్రజో ఽరుణా శ్యావా భస్మరూక్షాహతప్రభా,
విశుద్ధరక్తా త్వాగ్నేయీ దీప్తాభా దర్శనప్రియా. ౪౯
శుద్ధవైదూర్యవిమలా సుస్నిగ్ధా తోయజా సుఖా,
స్థిరా స్నిగ్ధఘనా శుద్ధా శ్యామా శ్వేతా చ పార్థివీ. ౫౦

(ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి, అను పంచమహాభూతముల సమష్టిచే శరీరము కల్గునని చెప్పబడినది. ఇట్టి పాంచభౌతికశరీరమున ఛాయయనియు ప్రభయనియు రెండు అంశములుండును. అందు శరీరమునకు సంబంధించిన నీలపీతాదివర్ణముల దిరస్కరించి నిగనిగయని ప్రకాశించునది (ప్రకాశము) ఛాయయనబరగు. శరీరమునకుసంబంధించిన నీలపీతాదివర్ణముల ప్రకాశింపజేయునది ప్రభయనబడును)

అట్టి ప్రకాశరూపమైనచ్ఛాయ ఆకాశమున్నగు పంచమహాభూతములకు సంబంధించియుండును కావున నైదువిధముల నుండును. వానిలక్షణములును వేరువేరుగ నుండును.

అందు ఆకసమునకుసంబంధించినఛాయ నాభసియనబడును. అయ్యది నిర్మలమై కొంచెము నీలవర్ణమై స్నిగ్ధమై శుభకరమై యుండును. వాయుగుణమువలన గల్గినది వాయవీఛాయ. ఇయ్యది ధూళిగ్రమ్మినట్లును అరుణవర్ణంబును శ్యామవర్ణంబును బూడిదవలె రూక్షంబునై శుభకరముగాకయుండును. అగ్నిగుణమువలన గల్గినఛాయ ఆగ్నేయి. ఇయ్యది శుద్ధమైనరక్తవర్ణముకల్గి మిక్కిలి ప్రకాశమునకాంతికల్గి చూచుటకు మిక్కిలియింపుగనుండును. ఉదకమువలన బుట్టినఛాయ శుభ్రమైనవైడూర్యమణివలె నిర్మలమై స్నిగ్ధమై మిక్కిలి సుఖకరమై యుండును. భూమివలన బుట్టినఛాయ పార్థివి. ఇయ్యది స్థిరంబును స్నిగ్ధంబును ఘనంబును విశుద్ధంబును శ్యామవర్ణంబును శ్వేతవర్ణంబునై యుండును.

ఇచ్చట నొకవిమర్శనము నెరుంగునది:—శరీరమునందలి నీలపీతాదివర్ణములవలన బుట్టునది ఛాయ. అగ్నిజలపృథివి అను మూడుభూతములును మూర్తిమంతము లగుటం

జేసి నీలపీతాదివర్ణములు సంభవించును. అట్టి వర్ణవిశేషమువలన ఛాయయుం సంభవించును. ఆకాశవాయువులురెండును రూపవంతములు కామింజేసి యీరెండిటికిని వర్ణము అసంభావితము. వర్ణములేనినాడు దానినాశ్రయించిన ఛాయయనునది వంధ్యాపుత్రునివలె ననంభావితము. అట్టియెడ నాభసీవాయవిచ్ఛాయలనునవి యెట్లు సంగతమగును? అను నాశంకకల్గును. అయినను మధురాదిరసములు అమూర్తమైన కాలమువలన సంభవించును. అట్టిరసములును ఉపలభ్యములై యుండుట యనుభవసిద్ధము. ఆతీరుననే ఆకాశ-అగ్నిసంభవములైనచ్ఛాయలును అనిర్వాచ్యములైన ప్రభావాతిశయమునంజేసి పుట్టును. కావున నాభసీ ఆగ్నేయీచ్ఛాయలును సంభావితములనియే యెరుంగునది.

### ఛాయాగుణములు.

వాయవీ రోగమరణక్లేశాయాఽన్యాః సుఖోదయాః,

పైజెప్పబడినఏనువిధములైనచ్ఛాయలలో వాయవీచ్ఛాయమాత్రము రోగములను మరణమును క్లేశములనుగల్గించును. తక్కిన నాల్గుచ్ఛాయలును సుఖకరములు.

### ప్రభాభేదములు.

ప్రభోక్తా తైజసీ సర్వా సా తు సప్తవిధా స్మృతా. ౪౯
రక్తా పీతా సితా శ్యామా హరితా పాణ్డురాఽసితా,
తాసాం యాస్స్యుర్వికాసిన్యః స్నిగ్ధాశ్చ విమలాశ్చ యాః. ౫౦
తాశ్శుభాః మలినాః రూక్షాః సంక్షిప్తాశ్చాఽసుఖోదయాః,

శరీరవర్ణమును ప్రకాశింపజేయుస్వభావముకల ప్రభయనునది రక్త, పీత, సిత, శ్యామ, హరిత, పాండు, నీలభేదములచే నేడువిధములు. ఈ యేడువిధములనుండు ప్రభలన్నియు అగ్నిసంబంధముచే గల్గుట కావున తైజసాత్మకమై యేకరూపముగనే యుండును. పైజెప్పిన యేడువిధములైనప్రభలలో నానాట వికాసముకల్గి వ్యాపించునవియు, స్నిగ్ధంబులును, నిర్మలంబులునునగు ప్రభలు సుఖకరములు. మలినంబులును రూక్షంబులును నానాట వ్యాపించి వికాసముజెందక సంక్షిప్తములుగ నుండునవియునగు ప్రభలు సుఖముకల్గింపనోపవు.

### ఛాయాప్రభలపరస్పరభేదములు, వానివిశేషములు.

వర్ణమాక్రామతి ఛాయా ప్రభా వర్ణప్రకాశినీ. ౫౧
ఆసన్నే లక్ష్యతే ఛాయా వికృష్టే భా ప్రకాశతే,
నాఽచ్ఛాయో నాఽప్రభః కశ్చిత్ విశేషాశ్చిహ్నయన్తి తు.
నృణాం శుభాఽశుభోత్పత్తిం కాలే ఛాయాసమాశ్రయాః,

శరీరమునందలి నీలపీతాదివర్ణములనుండి పుట్టి అట్టివర్ణముల మించి ప్రకాశించునది ఛ్చాయ. అట్టి నీలపీతాదివర్ణముల ప్రకాశింపజేయుస్వభావముకల్గినది ప్రభ. ఛాయయనునది సమీపముననే కనబడును. ప్రభ దూరమున ప్రకాశించును. లోకమున నెవ్వరేనియు ఛాయయు ప్రభయు లేకయుండరు. అట్టిఛాయను ఆశ్రయించిన ఆయావిశేషములు ఆయాకాలమున మనుజులకు శుభాఽశుభములయుత్పత్తిని సూచించు చిహ్నములను కల్గించును.

### కొన్నిరిష్టలక్షణములు.

నికషన్నివ యః పాదౌ చ్యుతాంసః పరిసర్పతి. ౫౩
హీయతే బలతశ్శశ్వత్ యోఽన్నమశ్నన్ హితం బహు,
యోఽల్పాశీ బహువిణ్మూత్రః బహ్వాశీ చాల్పమూత్రవిట్. ౫౪
యోఽల్పాశీ వా కఫేనార్తో దీర్ఘం శ్వసితి చేష్టతే,
దీర్ఘముచ్ఛ్వస్య యో హ్రస్వం నిశ్వస్య పరితామ్యతి. ౫౫
హ్రస్వంచ యః ప్రశ్వసితి వ్యావిద్ధం స్పన్దతే భృశమ్,
శిరో విక్షిపతే కృచ్ఛ్రాత్ యోఽఞ్చయిత్వా ప్రపాణికౌ. ౫౬
యో లలాటాత్ స్రుతస్వేదః శ్లథసన్ధానబన్ధనః,
ఉత్థాప్యమానస్సమ్మోహ్యేత్ యో బలీ దుర్బలోఽపి వా. ౫౭
ఉత్తాన ఏవ స్వపితి యః పాదౌ వికరోతి చ,
శయనాసనకుడ్యాదౌ యోఽసదేవ జిఘృక్షతి. ౫౮
అహాస్యహాసీ సమ్ముహ్యన్ యో లేఢి దశనచ్ఛదౌ,
ఉత్తరోష్ఠం పరిలిహన్ ఫూత్కారాంశ్చకరోతి యః. ౫౯
యమభిద్రవతి ఛ్చాయా కృష్ణా పీతాఽరుణాఽపి వా,
భిషగ్భేషజపానాన్న గురుమిత్రద్విషశ్చ యే. ౬౦
వశగాస్సర్వ ఏవైతే విజ్ఞేయాస్సమవర్తినః,

ఎవడు పాదముల క్రింద రాగుంచు సకలినమూపులుకలవాడై పుడమిపయిం బడి నలుదెసల దిరుగులాడుచుండునో వాడు యముని వశముననున్నాడని యెరుంగునది. మరియును మిక్కిలిసత్కారమైనయన్నమును అధికముగ భుజించినను బలము నానాట నశించుచున్నను కొంచెముగ భుజించినను అధికముగ మలమూత్రములు వెడలుచున్నను, అధికముగ భుజించునపుడు మలమూత్రములు మిక్కిలికొంచెముగ వెడలుచున్నను, కొంచెముగ భుజించినపుడును కఫముచేపీడితుడై దీర్ఘముగ శ్వాసమునువిడచుచు పొరలాడుచున్నను, మిక్కిలిదీర్ఘముగ ఊర్ధ్వముగ శ్వాసమును విడచి నిశ్వా

సమును హ్రస్వముగ విడచి యూపిరాడక కష్టపడుచున్నను, మిక్కిలి హ్రస్వముగ శ్వాసమును విడచినను, అభిఘాతముచే నాడులు మిక్కిలి యదరుచున్నను, మీాజేతులను చేర్చుకొని శిరస్సును మిక్కిలికష్టముచే పలుదెరంగుల ద్రిప్పుచున్నను, నుదుటినుండి చెమటకారుచు సంధిబంధములన్నియు సడలియున్నను, బలశాలియైనను బలహీనుడైనను బలాత్కారముగ నెత్తికూర్చుండబెట్టినను మూర్ఛనొంది క్రిందపడుచున్నను, ఒత్తగిలిపరుండక యెప్పుడును వెలికిలబరుండి నిద్రించుచున్నను, పాదములను వికృతముగ ద్రిప్పుచున్నను, శయనమునందును ఆసనమునందును గోడ మున్నగువానియందును వాస్తవ్యముగ లేనివస్తువులను చేతులతో గ్రహింప నభినయించుచున్నను, కారణములేకయే వికృతముగనవ్వుచు, మూర్ఛనొందుచు పండ్లచే పెదవులకొరకుచున్నను, పైపెదవును పండ్లతో కొరకుచు ఘూత్కారముల పలువిధములుగ జేయుచున్నను, అట్టి మనుజులందరును యమునిబారి బడియున్నవారని యెరుంగునది.

మరియు నెవ్వనివెంబడించి కృష్ణవర్ణంబును పీతవర్ణంబును అరుణవర్ణంబునైన నీడపోవుచుండునో, ఎవ్వడు వైద్యులను, ఔషధములను, అన్నపానములను, గురువులను, మిత్రులను, కారణములేకయే ద్వేషించియుండునో, వారందరును యమునివశమున నున్నవారని స్పష్టముగదెలియునది.

గ్రీవాలలాటహృదయం యస్య స్విద్యతి శీతలమ్. ౬౧
ఉష్ణోఽపరః ప్రదేశశ్చ శరణం తస్య దేవతా,

ఏమనుజునకు మెడయు నుదురును రొమ్మును చల్లబడి చెమటబట్టి శరీరమున తక్కిన ప్రదేశములయందు మిక్కిలివేడి కల్గియుండునో, ఆమనుజుని దేవుడే కాపాడవలెను. (మరణమునకు సిద్ధముగ నుండును కావున కాపాడ వైద్యునకు అలవికాదనుట).

యోఽణుజ్యోతిరనేకాగ్రో దుశ్ఛాయో దుర్మనాస్సదా. ౬౨
బలిం బలిభృతో యస్య ప్రణీతం నోపభుఞ్జతే,
నిర్నిమిత్తం చ యో మేధాం శోభాముపచయం శ్రియమ్. ౬౩
ప్రాప్నోత్యతోవా విభ్రంశం స ప్రాప్నోతి యమక్షయమ్,

ఏమనుజుడు స్వల్పమైనచూపుకల్గియైనను, మనసు చంచలముగనైనను, శరీరచ్ఛాయ చెడియైనను, మనస్సునందెల్లపుడును వ్యసనముకల్గియైన నుండునో వాడు అంతకపురమున జేరును. ఎవనిచే నీయబడినబలిని కాకులుమున్నగునవి భుజింపకుండునో, ఎవడు కారణములేకయే అతిశయమైనమేధను, కాంతిని, శరీరపుష్టిని, సంప

త్తును, పొందునో, లేక కారణములేకయే పైజెప్పినశోభాదులు నశించునో, అట్టి పురుషులెల్ల యమాలయమును జేరుదురు.

## గుణప్రకృతులవికృతి.

గుణదోషమయీ యస్య స్వస్థస్య వ్యాధి తస్య వా. ౬౪
యాత్యన్యథాత్వం ప్రకృతిః షణ్మాసాన్న స జీవతి,

సత్వరజస్తమోగుణాత్మకములు ప్రకృతియైనను వాతపిత్తశ్లేష్మరూపములైన శరీరప్రకృతులైనను రోగములేనివానికైనను రోగికైనను మామూలుకన్న వేరువిధముగ మారినయెడ అట్టిమనుజుడు ఆరుమాసములలోపల మృతినొందును.

## భక్తి-శీలము మున్నగువానివికృతి.

భక్తిశ్శీలం స్మృతిస్త్యాగః బుద్ధిర్బలమహేతుకమ్. ౬౫
షడేతాని నివర్తన్తే షడ్భిర్మాసైర్మరిష్యతః,
మత్తవద్గతివాక్కమ్పమోహో మాసాన్మరిష్యతః. ౬౬

దేవతాభక్తియు, ఆచారమును, జ్ఞాపకశక్తియు, దానధర్మాదులవిషయమైన బుద్ధియు, స్వాభావికబుద్ధియు, శరీరబలమును, ఈ యారును ఏకకాలమునందెవనికి నశించునో ఆమనుజుడు ఆరుమాసములలో మృతినొందును. ఎవడు మదించినవానివలె నడచుచు మాటలాడుచు వణకుచు మోహమునొందునో వాడు నెలదినములలోమరణ మొందును.

## వేదనాది వ్యత్యయరూప వికృతి.

నశ్యత్యజానన్ పదహాత్ కేశలుఞ్చనవేదనామ్,
న యాతి యస్య చాహారః కణ్ఠం కణ్ఠామయాదృతే. ౬౭
ప్రేష్యాః ప్రతీపతాం యాన్తి ప్రేతాకృతిరుదీర్యతే,
యస్య నిద్రా భవేన్నిత్యం నైవ వా న స జీవతి. ౬౮
వక్త్రమాపూర్యతేఽశ్రూణాం స్విద్యతశ్చరణౌ భృశమ్,
చక్షుశ్చాఽఽకులతాం యాతి యమరాజ్యం గమిష్యతః. ౬౯
రైః పురా రమతే భావైః అరతిస్తైర్న జీవతి,

వెండ్రుకల నూడబెరుకునప్పుడు దానగిల్లుబాధ తెలియకుండువాడును, కంఠరోగము లేనప్పుడు నోటనుంచబడినయాహారకబలము లోనికి (గొంతులోపల) పోకుండినవాడును ఆరుమాసములలో మృతినొందును. ఏమనుజునకు భృత్యులు తాను చెప్పినట్టులు వినక ప్రతికూలముగ నటింతురో, ఎవనికి ప్రేతముయొక్క ఆకారము

కంటికి కానబడునో, ఎవనికి రేయింబవలును విరామములేక నిద్రపూనియుండునో, ఎవనికి నొకప్పుడైనను బొత్తుగ నిదురబట్టకయుండునో, అట్టిమానవులు జీవింపరు. ఎవనికి కన్నీళ్లు స్రవించుమార్గము నిండియుండునో, ఎవనిపాదములు కారణములేకయే చెమటపట్టునో, ఎవనికన్నులు నిర్నిమిత్తముగ కలకబారియుండునో, ఆమనుజులు యమపట్టణమునకు మూటగట్టినవారు. ఎవనికి తాను మామూలుగ ప్రీతితోననుభవించు పదార్థములయందు కారణములేకయే అరతి (ఆసక్తిలేమి) కలుగునో ఆమానవుడు నిజముగ జీవింపడు.

### రోగవ్యత్యయరూపనిష్కృతి.

సహసా జాయతే యస్య వికారస్సర్వలక్షణః. ౨౦
నివర్తతే వా సహసా సహసా స వినశ్యతి,

జ్వరాదిరోగములు వానికి జెప్పినపూర్ణలక్షణములతోగూడి కారణము లేకయే తటాలున సంభవించినను, అట్టిరోగములు తనంతటనే తటాలున నివర్తించినను ఆ మనుజుడు అతిశీఘ్రముగమృతినొందును.

### రోగములకుసంబంధించిన రిష్టలక్షణములు. అందు జ్వరమునకుసంబంధించిన రిష్టములు.

జ్వరో నిహన్తి బలవాన్ గమ్భీరో దైర్ఘరాత్రికః. ౨౧
సప్రలాపః భ్రమశ్వాసః క్షీణం శూనం హతానలమ్,
అక్షామం సక్తవచనం రక్తాక్షం హృది శూలినమ్. ౨౨
సంశుష్కకాసః పూర్వాహ్ణే యో౽పరాహ్ణే౽పి వా భవేత్,
బలమాంసవిహీనస్య శ్లేష్మకాససమన్వితః ౨౩

జ్వరము మిక్కిలి బలిష్ఠములగు కారణములచేత ప్రబలముగ కల్గినను, రసాదిధాతువులలో మిక్కిలి లోభాగమునుండు మేదోమజ్జాదులనాశ్రయించి కల్గినజ్వరంబును, రాత్రివేళల బొత్తుగ నిదురపట్టనీయక బాధించుజ్వరంబును ప్రలాపముతోడను భ్రమముతోడను శ్వాసముతోడను గూడినజ్వరంబును, ధాతువులుక్షీణించిన మానవుని, వాపుజూపినవానిని, అగ్నిదీప్తి బొత్తుగ నశించినవానిని, శరీరముశుష్కించకుండువానిని, మాటలు కొతుకపుట్టినవానిని, కన్నులెఱ్ఱవారినవానిని, హృదయమునందు శూలనొప్పికల్గినవానిని తప్పక చంపును. మరియు పొడిదగ్గుతోగూడినజ్వరము పూర్వాహ్ణమునందైనను అపరాహ్ణమునందైనను కల్గిన నయ్యది తప్పకచంపును. శ్లేష్మకాసముతోగూడినజ్వరము శరీరమునందలిబలంబును మాంసంబును నశించినవానికి సంభవించిన నాజ్వరము చంపకమానదు.

## రక్తపిత్తమునగల్గు రిష్టలక్షణములు.

రక్తపిత్తం భృశం రక్తం కృష్ణమిన్ద్రధనుఃప్రభమ్,
తామ్రహారిద్రహరితం యానం రక్తం ప్రదర్శయేత్. ౨౪
రోమకూపప్రవిస్మృతం కణ్ఠాస్యహృదయే ఽజత్,
వాసో ఽరఞ్జనం పూతి వేగవచ్చాతిభూరి చ. ౨౫
వృద్ధం పాణ్డుజ్వరచ్ఛర్దికాసశోఫాతిసారిణామ్,

రక్తపిత్తరోగమున రక్తము మిక్కిలి యెఱ్ఱనైనను, నల్లగానైనను, ఇంద్రధనుస్సుబోలె చిత్రవర్ణము కలిగియైనను, తామ్రవర్ణము కలిగియైనను, పసుపురంగుకలిగియైనను, ఆకుపచ్చనిరంగు కలిగియైనను, వెడలినయెడ నీరక్తపిత్తము రోగినిచంపును. మరియు రక్తపిత్తము పైజెప్పినవర్ణములు లేకున్నను రోమద్వారములనుండి విశేషముగ స్రవించినను, కంఠమునందును నోటియందును హృదయమునందును చిక్కి యడ్డుపడి ధారాళముగ బైటకెడలకున్నను చంపును. అట్టి రక్తపిత్తము గుడ్డకంటకున్నను చంపును. దుర్గంధముతో గూడియున్నను, మిక్కిలి వేగముతో వెడలినను, మిక్కిలి అధికముగ వెడలినను, మరణమునొందించును. మరియు పాండురోగము జ్వరము వమనరోగము దగ్గు నంజు అతిసారము అనునీవ్యాధులు కలవారికి రక్తపిత్తము మిక్కిలి వృద్ధినొందినయెడ మరణమును కలిగించును.

ఇచ్చట వాసోరంజనమనుచోట అరంజనమని అకారప్రశ్లేషము తెలియునది. రక్తపిత్తము గుడ్డకు తగిలినపిమ్మట నీళ్లతో కడిగినయెడ రంగు గుడ్డకంటకుండునది చంపుననిభావము. రంగు గుడ్డ కంటియుండునది చంపనేరదు. జీవమున కాధారమైన రక్తము నిర్మలమై శుద్ధముగనుండును. కావున నయ్యది గుడ్డకంటినపుడు నీళ్లుబోసిపులిమినయెడ రంగుఅంటక అట్టి జీవరక్తము వెడలుటంజేసి మానవుడు బ్రతుకజాలడు. గుడ్డకు రంగు అంటినప్పుడు ఆరక్తము జీవాధారమైనది కాదు. కావున అట్టియెడ చంపనోపదనిభావము.

## కాసశ్వాసముల రిష్టలక్షణములు.

కాసశ్వాసౌ జ్వరచ్ఛర్దితృష్ణాతీసారశోఫినమ్. ౨౬

కాసశ్వాసములు జ్వరము, వాంతి, దప్పి, అతిసారము, శోఫ, అనునీయైదుపద్రవములతో గూడియున్న తప్పక చంపును.

## రాజయక్ష్మరిష్టలక్షణము

యక్ష్మా పార్శ్వరుజానాహరక్తచ్ఛర్దగ్ంసతాపినమ్,

రాజయక్ష్మమున ఇరుప్రక్కల నొప్పియు కడుపుబ్బరంబును రక్తవమనంబును కల్గినయెడ మనుజుడు బ్రతుకనోపడు.

—— ఛర్దిరిష్టలక్షణములు. ——

ఛర్ది ర్వేగవతీ మూత్రశకృద్గన్ధిః సచన్ద్రికా.
సాస్రవిట్పూయరుక్కాసశ్వాసవత్యనుషఙ్గిణీ,

వాంతి మిక్కిలి తీవ్రమైనవేగముతో వెడలినను, మలమూత్రములవంటి దుర్వాసనకల్గియున్నను, (నూనెచుక్కనీళ్లలోవైచిన తళతళమనివ్యాపించుబిందువుచంద్రిక) వమనములో నట్టిచంద్రిక కల్గియున్నను, రక్తముతోనైనను మలముతోనైనను కూడి వెడలినను, చీముతో గూడియున్నను, నొప్పియు శ్వాసకాసంబులును కల్గియున్నను, మనుజుని చంపును. చాలకాలమునుండియు అనువర్తించియుండువాంతియుచంపును.

—— తృష్ణారోగమున రిష్టలక్షణములు. ——

తృష్ణాఽన్యరోగక్షపితం బహిర్జిహ్వం విచేతనమ్. ౭౮

ఇతరరోగములతో శరీరము కృశించి నాలుక బైటవెడలి ప్రజ్ఞతప్పియుండు వానికి గలిగినదప్పి చంపును.

—— మదాత్యయమున రిష్టలక్షణములు. ——

మదాత్యయోఽతిశీతార్తం క్షీణం తైలప్రభాననమ్,

మదాత్యయమున మిక్కిలి చలిచే బాధకలిగినను, శరీరము మిక్కిలి కృశించినను, నోరు నూనెపూసినవిధముగ జిడ్డుకలిగియున్నను తప్పక చంపును.

—— అర్శోరోగమున రిష్టలక్షణములు. ——

అర్శాంసి పాణిపన్నాభిగుదముష్కాస్యశోఫినమ్. ౭౯
హృత్పార్శ్వాఙ్గరుజాచ్ఛర్దిపాయుపాకజ్వరాతురమ్,

అర్శోరోగమునందు పాదములు హస్తములు నాభి గుదస్థానము వృషణములు ముఖము ఈస్థలములయందు వాపుకలిగినయెడ చంపును. మరియు హృదయమునందును ఇరుప్రక్కలయందును ఇతరావయవములయందును నొప్పికలిగినను, వాంతి యధికమైనను, గుదము పుండైనను జ్వరము తీవ్రముగ నుండినను అర్శోరోగము మనుజుని తప్పక చంపును.

—— అతిసారమునగలుగు రిష్టలక్షణములు. ——

అతీసారో యకృత్పిణ్డమాంసధావనమేచకైః ౮౦
తుల్యస్నైలఘృతక్షీరదధిమజ్జవసాఽసృవైః,

మస్తులుఙ్గవసాపూయవేసవారామ్బుమాంసకైః ౮౧

అతిసారరోగమున యకృత్పిండమును, మాంసమును కడిగిననీళ్ల ను బోలినయు, నల్లగను విరేచనములగుచున్న మరణమునొందును. తైలమును, నేతిని, పాలను, పెరుగును, మజ్జను, వస (మాంసరసము)ను, మద్యమును, మస్తులుంగమును, మషిని, చీమును, వేసవారమును కాంజికమును, తేనెను బోలి విరేచనములగుచున్నను, అతిసారము తప్పక చంపును.

అతిసారమున మరికొన్ని రిష్టలక్షణములు.

అతిరక్తసితస్నిగ్ధపూత్యచ్ఛఘనవేదనః,
కర్బురః స్రవన్ ధాతూన్ నిష్పురీషోఽథవాఽతివిట్. ౮౨
తనుమాన్ సక్తి సంక్రాన్తో రాజీమాంశ్చన్ద్రికైర్యుతః,
శీర్ణపాయువలిం ముక్తనాలం పర్వస్థిశూలినమ్ ౮౩
స్రస్తపాయుం బలక్షీణమన్నమేవాతి వేశ్మనః,
సతృట్ శ్వాసజ్వరచ్ఛర్దిదాహానాహప్రవాహికః. ౮౪

మిక్కిలి రక్తవర్ణంబును సితవర్ణంబును స్నిగ్ధంబును దుర్గంధయుక్తంబును నీళ్లవలె పలుచనిదియునై మిక్కిలి తీవ్రమైన వేదనతోఁగూడి నానావిధవర్ణములు కలిసిన చిత్రవర్ణముకలిగి రసరక్తాదిధాతువులను పురీషములేకయే స్రవింపఁజేయుచున్నను, లేక అధికముగ పురీషముతోఁగూడి ధాతువులను స్రవింపఁజేసినను, తంతివలె తీగెలు సాగుచు చీమలు వ్యాపించి రేఖలతోఁగూడి నీళ్లలోఁబోసిన తైలబిందువులవలె తళతళలాడుచు విరేచనములైనను, గుదమునందు వళులు శిథిలములైయున్నను, గుదనాళము బంధనములేకయున్నను, కీళ్లయందును, అస్థులయందును, పోటుకలిగియున్నను, గుదద్వారము జారియున్నను, శరీరబలముక్షీణించియున్నను, భుజించినయన్నము జీర్ణముకాక విరేచనమగుచున్నను, అట్టివిరేచనములగునపుడు దప్పియు, శ్వాసంబును, జ్వరంబును, వాంతియు, మంటయు, కడుపుబ్బరంబునుకలిగి మిక్కిలి ముక్కుచు విరేచనములైనను అట్టియతిసారము చంపును.

అశ్మరీరోగమున గలుగు రిష్టలక్షణములు.

అశ్మరీ శూనవృషణం బద్ధమూత్రం రుజార్దితమ్,

అశ్మరీరోగమున వృషణములు వాచి మూత్రము బంధించి మిక్కిలి తీవ్రమైన నొప్పితోఁ బాధకలిగినయెడ నట్టియశ్మరీరోగను మనుజుని తప్పక చంపును.

ప్రమేహమున గలుగు రిష్టలక్షణములు.

మేహస్త్వక్ దాహపిటికా మాంసకోథాఽతిసారిణమ్. ౮౫

ప్రమేహమునందు దప్పి, మంట, పిటిక, మాంసము కుళ్లి అధికముగ మూత్రమున వెడలుట, ఈ యుపద్రవములు కలిగినయెడ నట్టిప్రమేహము చంపును.

## ప్రమేహపిటికారిష్టలక్షణములు.

పిటికా మర్మహృత్పృష్ఠస్తనాంసగుదమూర్ధగాః,
పర్వపాదకరస్థా వా మన్దోత్సాహిం ప్రమేహిణమ్. ౮౬
సర్వం చ మాంససంకోచదాహతృష్ణామదజ్వరైః,
విసర్పమర్మసంరోధహిధ్మాశ్వాసభ్రమక్లమైః. ౮౭

ప్రమేహపిటికలు మర్మస్థలములయందైనను హృదయమునందైనను వీపునందైనను భుజశిరములయందైనను గుదమునందైనను శిరస్సునందైనను కలిగిన చంపును. మరియుం కీళ్లయందును పాదములయందును చేతులయందును బుట్టినపిటికలు ఉత్సాహము మందగించి ప్రమేహవ్యాధిచే పీడితుని చంపును. మరియుం ప్రమేహపిటికకలిగినవానికి శరీరమున మాంసము ముడుచుకొనుట, మంట, దప్పి, మదము, జ్వరము, విసర్పము, మర్మరోధము, ఎక్కిళ్లు, శ్వాసము, భ్రమము, బడలిక, అను నీయుపద్రవములు కలిగినచో, ఆట్టిపిటికలు చంపును.

## గుల్మమునగలుగు రిష్టలక్షణములు.

గుల్మః పృథుపరీణాహః ఘనః కూర్మ ఇవోన్నతః,
సిరానద్ధో జ్వరచ్ఛర్ది హిధ్మాధ్మానరుజాన్వితః. ౮౮
కాసపీనసహృల్లాసశ్వాసాఽతీసారశోఫవాన్,

గుల్మము గొప్పదై మిక్కిలి విశాలముగనుండి తాబేలువలె నున్నతమై సిరలచే వ్యాపింపబడి, జ్వరము, వాంతి, ఎక్కిళ్లు, కడుపుబ్బరము, నొప్పి, కాసము, పీనసము, హృల్లాసము, శ్వాసము, అతిసారము, శోఫము, అను నీయుపద్రవములు కలిగినయెడ ఆగుల్మము చంపును.

## ఉదరరోగమున రిష్టలక్షణములు.

విణ్మూత్రసంగ్రహశ్వాసశోఫహిధ్మా జ్వరభ్రమైః ౮౯
మూర్ఛాచ్ఛర్ద్యతిసారైశ్చ [illegible] హ ని దుర్బలమ్,
[illegible] ౯౦
విరేచనహ[illegible],

ఉదరవ్యాధికల [illegible] బలహీనుడై [illegible] కృశణములుమున్నగునవి వక్రములై శరీరము [illegible] చర్మము [illegible] విరేచనములె నపుడు కడుపుబ్బరముతగ్గి మరల [illegible] చుచుండుతగ, [illegible]

వ్యాధి తప్పక చంపును. మరియు మలమూత్రములు బంధించుట, శ్వాసము, శోఫము, ఎక్కిళ్లు, జ్వరము, భ్రమము, మూర్ఛ, వాంతి, అతిసారము, అను నీయుపద్రవములు కలిగినయెడ ఉదరవ్యాధి చంపును.

### పాండురోగమున రిష్టలక్షణములు.

పాణ్డురోగః శ్వయథుమాన్ పీతాక్షినఖదర్శనమ్. ౯౧

పాండురోగమునందు వాపుకలిగి కన్నులును గోళ్లును పచ్చనై కంటికగపడు పదార్థములన్నియు పచ్చగ నగపడుచున్నయెడ అట్టిపాండురోగము రోగిని చంపును.

### శోఫమునగలుగు రిష్టలక్షణములు.

తన్ద్రాదాహోఽరుచిచ్ఛర్దిమూర్ఛాధ్మానాఽతిసారవాన్,
అనేకోపద్రవయుతః పాదాభ్యాం ప్రసృతో నరమ్. ౯౨
నారీం శోఫో ముఖాద్ధన్తి కుక్షిగుహ్యాదుభావపి,
రాజీచితస్స్రవన్ ఛర్దిజ్వరశ్వాసాఽతిసారిణమ్ ౯౩

మైకము, తాపము, అరోచకము, వాంతి, మూర్ఛ, కడుపుబ్బరము, అతిసారము అను నివికలిగి జ్వరముమున్నగు ననేకోపద్రవములతో గూడి పురుషులకు పాదముల నుండి పైకివ్యాపించినశోఫము పురుషుల జంపును. స్త్రీలకు ముఖమునుండి క్రిందికి వ్యాపించి పైజెప్పినలక్షణములతో గూడినశోఫము చంపును. కుక్షియందైనను గుహ్యము నందైననుపుట్టి శరీరమునందెల్ల వ్యాపించుశోఫము స్త్రీకైనను పురుషునకైనను అవశ్యము చంపును. మరియు వాపునందు వాంతి, జ్వరము, శ్వాసము, అతిసారము, అను నీయుపద్రవములుకలిగిన శోఫరోగిని, రేఖలతోగూడి నీరుమున్నగువానిని స్రవించు వాపుతప్పక చంపును.

### శోఫరోగమున రిష్టలక్షణములు.

జ్వరాఽతిసారౌ శోఫాన్తే శ్వయథుర్వాతయోః క్షయే,
దుర్బలస్య విశేషేణ జాయన్తేఽన్తాయ దేహినః. ౯౪

శోఫము స్వతంత్రముగ తొలుతపుట్టి దానియంతమున నుపద్రవములుగ జ్వరంబును అతిసారంబును కలిగినను, జ్వరంబును అతిసారంబును స్వతంత్రములుగ తొలుత సంభవించి వానికి ఉపద్రవముగ శోఫకలిగినను రోగి యంతము నొందును. పైజెప్పిన జ్వర, అతిసార, శోఫములుమూడును ఒక్కనికి కలిగినవాడును మృతినొందును. ఈ మూడును బలహీనునకు కలిగినచో నారోగి అతిశీఘ్రముగ మృతుడగును.

### శోఫరోగవికృతి.

శ్వయథుర్యస్య పాదస్థః పరిస్రస్తే చ పిణ్డికే,
సీదతస్సక్థినీ చైవ తం భిషక్ పరివర్జయేత్. ౯౫

వాపు పాదములపై కలిగి పిక్కలు స్వస్థానమునుండి జారి తొడలు సన్నగించిన యెడ నారోగిని చికిత్సజేయందగదు. (ఆవ్యాధిచంపునుకావున చికిత్స జేయమానవలెనని భావము.)

ఆననం హస్తపాదం చ విశేషాద్యస్య శుష్యతః,
శూయేతే వా వినా దేహాత్ సమాసాత్ యాతిపంచతామ్ ౯౬

ఎవనికి ముఖంబును హస్తపాదములును విశేషముగ కృశించి తక్కినశరీరము కృశతనొందకున్నను, పైజెప్పినస్థలములయందుమాత్రము వాపుకలిగియున్నను ఆట్టి మనుజుడు ఒకమాసమునకులోపల మృతినొందును.

### విసర్పమునగలుగు రిష్టలక్షణములు.

విసర్పః కాసవైవర్ణ్యజ్వరమూర్ఛాఙ్గభఙ్గవాన్,
భ్రమాస్యశోషహృల్లాసదేహసాదాఽతిసారవాన్. ౯౭

విసర్పరోగమున కాసము, వివర్ణత, జ్వరము, మూర్ఛ, అంగభంగము, భ్రమము, నోరెండుట, ఓకరింతలు, శరీరము కృశించుట, అతిసారము, అను నీయుపద్రవములు కలిగినయెడ రోగిని చంపును.

### కుష్ఠవ్యాధిరిష్టలక్షణములు.

కుష్ఠం విశీర్యమాణాఙ్గం రక్తనేత్రం హతస్వరమ్,
మన్దాగ్నిం జన్తుభిర్జుష్టం హన్తి తృష్ణాఽతిసారిణమ్. ౯౮

కుష్ఠరోగమున అవయవములు కుళ్లియూడుచున్నను, కంఠస్వరము మారి కన్ను లెఱ్ఱనై జఠరాగ్ని మందగించి శరీరమునందలి వ్రణములలో పురుగులుపట్టినను నాక్రూర వ్యాధి చంపును. మరియు తీవ్రమైనదప్పియు అతిసారంబును కలిగినను చంపును.

### మరికొన్ని వ్యాధులరిష్టలక్షణములు.

వాయుస్సుప్తత్వచం భగ్నం కఫశోఫరుజాతురమ్,
వాతాస్రంమోహమూర్ఛాయ మదస్వప్నజ్వరాన్వితమ్. ౯౯
శిరోగ్రహాఽరుచిశ్వాససంకోచస్ఫోటకోథవత్,
శిరోరోగోఽరుచిశ్వాసమోహావిడ్భేదతృట్ భ్రమైః. ౧౦౦

వాతము చర్మముపై స్పర్శజ్ఞానములేకయుండినను, శరీరమునందలి యెముకలు విరిగినను, కఫమునకును శోఫమునకును సంబంధించినరోగములు కలిగియున్న

చంపును. మోహము (చిత్తనాశము), మూర్ఛ, మదము (తిక్కయెత్తినట్లుండుట) నిద్ర, జ్వరము, అను నీయుపద్రవములతోఁగూడిన వాతరక్తము చంపును. మరియు శిరోగ్రహము, అరోచకము, శ్వాసము, అవయవములు ముడుచుకొనుట, పగులుట కుళ్లుట, అను నీయుపద్రవములు కలిగిన వాతరక్తంబును చంపును. అరుచి, శ్వాసము మోహము, మలము ఉండపలె వెడలుట, దప్పి, భ్రమము, అను నీయుపద్రవములతో గూడినశిరోరోగము చంపును.

### రోగసామాన్యముగ రిష్టలక్షణములు.

ఘ్నన్తి సర్వామయాః క్షీణస్వరధాతుబలానలమ్,

శరీరబలములు క్షీణించి కంఠస్వరంబును రసాదిధాతువులును అగ్నిబలంబును నశించినవారికి ఏరోగములు స్వల్పములుగ వచ్చినను అవి చంపక మానవు.

### వాతాదివ్యాధులయందు రిష్టలక్షణములు.

వాతవ్యాధిరపస్మారీ కుష్ఠీ రక్త్యుదరీ క్షయీ. ౧౦౧
గుల్మీ మేహీ చ తాన్ క్షీణాన్ వికారేఽల్పేఽపి వర్జయేత్,

వాతవ్యాధి, అపస్మారము, కుష్ఠవ్యాధి, రక్తపిత్తము, ఉదరరోగము, క్షయరోగము, గుల్మము, ప్రమేహము, ఈవ్యాధులలో నేవ్యాధికలవారైనను రక్తమాంసబలములు క్షీణించియుందురేని వారికిస్వల్పమైనవికారము,కల్గినను మృతినొందెదరు. కావున వారికి చికిత్స జేయదగదు.

### వ్యాధిసామాన్యముగ వేరొక రిష్టలక్షణము.

బలమాంసక్షయస్తీవ్రః రోగవృద్ధిరరోచకః. ౧౦౨
యస్యాతురస్య లక్ష్యన్తే త్రీన్ పక్షాన్న స జీవతి,

ఏరోగికి శరీరమునందలి బలమును మాంసంబును మిక్కిలి తీవ్రముగ క్షీణించి, రోగము తీవ్రముగ వృద్ధినొంది, అరోచకము కల్గియుండునో ఆరోగి మూడుపక్షములకు పైని జీవింపడు.

### వాతాష్ఠీల రిష్టలక్షణములు.

వాతాష్ఠీలాఽతిసంవృద్ధా తిష్ఠన్తీ దారుణా హృది. ౧౦౩
తృష్ణయా తు పరీతస్య సద్యో ముష్ణాతి జీవితమ్,

వాతాష్ఠీలయనువ్యాధి మిక్కిలి వృద్ధినొంది మిక్కిలిదారుణమై హృదయమునసేయుండి అట్టిరోగి మిక్కిలి తీవ్రమైనదప్పిచే బాధపడుచుండిన అప్పుడే మృతినొందును.

### వాతము యొక్క వికృతిచేగల్గు రిష్టలక్షణములు.

శైథిల్యం పిణ్డికే వాయుః నీత్వా నాసాంచ జిహ్మతామ్. ౧౦౪
క్షీణస్య యస్య మన్యే వా సద్యో ముష్ణాతి జీవితమ్,

వాతము ప్రకుపితమై పిక్కలను శిథిలములుగ జేసి, ముక్కును వంకరగ జేసి, మెడ వెనుక ప్రక్కనుండును నాడులనునరములను లాగికట్టిన యెడ శరీరధాతువులు క్షీణించి యుండు రోగి యాక్షణముననే మృతిజెందును.

### వాతవైకృతి రిష్టలక్షణములు.

నాభిగుదాన్తరం గత్వా వంక్షణౌ వా సమాశ్రయన్ ౧౦౫
గృహీత్వా వాయుహృదయే క్షీణదేహస్య వా బలీ,
మలాన్ వస్తిశిరోనాభిం విబధ్య జనయన్ రుజామ్. ౧౦౬
కుర్వన్ వంక్షణయోశ్శూలం తృష్ణాం భిన్నపురీషతామ్,
శ్వాసం వా జనయన్ వాయుః గృహీత్వా గుదవంక్షణమ్. ౧౦౭
వితత్య పర్శుకాగ్రాణి గృహీత్వోరశ్చ మారుతః,
స్తిమితస్యాతతాక్షస్య సద్యో ముష్ణాతి జీవితమ్. ౧౦౮

వాతము నాభికిని గుదమునకును మధ్యప్రదేశమున జేరి గజ్జలయందు వ్యాపించినయెడ నపుడే చంపును. వాతము బలిష్ఠమై గుదమును హృదయమును బంధించినపుడు మనుజుడు క్షీణించిన శరీరముకల్గియున్నయెడ అప్పుడే మృతినొందును. వాతము మలములను వస్తిద్వారమును నాభిని బంధించి తీవ్రమైనబాధ కల్గించినయెడ అప్పుడేమృతి నొందును. గజ్జలయందు తీవ్రముగ నొప్పిని కల్గించి దప్పినిపుట్టించి మలమును ఉండలుగ వెడలించిన అప్పుడే మృతినొందును. వాతము గుదమును గజ్జలను బంధించి శ్వాసమును పుట్టించినయెడ అప్పుడే ప్రాణముల హరించును. వాతము బలిష్ఠమై ప్రక్కలనుండుపర్శుకాస్థులకొనలను వ్యాపించి రొమ్మునుపట్టినపుడు మనుజుడు నిశ్చలముగనుండి కన్నులు పెద్దవిగ (మిడిగుడ్లుపడి) నున్నపుడు వాతము అప్పుడే తప్పక జీవితమును హరించును.

### జ్వరవికృతిచేగల్గు రిష్టలక్షణము.

సహసా జ్వరసన్తాపః తృష్ణామూర్ఛాబలక్షయః,
విశ్లేషణం చ సన్ధీనాం ముమూర్షో రుపజాయతే. ౧౦౯

జ్వరసంతాపము శీఘ్రముగ వ్యాపించి దప్పియు మూర్ఛయు కలిగి శరీరబలము క్షీణించి కీళ్లు సడలియున్నయెడ అప్పుడే మృతినొందును.

కఫజ్వరమునఁగలుగు రిష్టలక్షణము.

గోసర్గేవదనాద్యస్య స్వేదః ప్రచ్యవతే భృశమ్,
లేపజ్వరోపతప్తస్య దుర్లభం తస్య జీవితమ్. ౧౧౦

పశువులను విడచు (ప్రభాత) సమయమున కఫజ్వరముచేబాధింపబడిన వానికి ముఖమునుండి చెమట మిక్కిలి వడియుచున్నయెడ వాఁడు జీవించుట యరుదు. (బ్రతుకడనిభావము.)

మసూరికలఁగలుగు రిష్టలక్షణము.

ప్రవాళగుళికాభాసా యస్య గాత్రే మసూరికాః,
ఉత్పద్యాఽఽశు వినశ్యన్తి న చిరాత్స వినశ్యతి. ౧౧౧

ఎవనిశరీరమున పవడపుపూసలవంటికాంతియు ఆకారమునుకలిగిన మసూరికలు పుట్టి అప్పుడే కనుబడక :యణఁగిపోవునో ఆమనుజుఁడు శీఘ్రముగ మృతినొందును.

విస్ఫోటకములఁగలుఁగు రిష్టలక్షణములు.

మసూరవిదళప్రఖ్యాః తథా విద్రుమసన్నిభాః,
అన్తర్వక్త్రాః కిణాభాశ్చ విస్ఫోటా దేహనాశనాః. ౧౧౨

స్ఫోటకములు చిరుసెనగల బద్దలవలెనుండి పగడములవంటికాంతికలిగి వాని ముఖములు లోపలనే యణఁగి మచ్చలవలె నున్నయెడ శరీరమును నశింపజేసి రోగిని చంపును.

కామలా రిష్టలక్షణములు.

కామలాక్ష్ణోర్ముఖం పూర్ణం శఙ్ఖయోర్ముక్తమాంసతా,
సంత్రాసశ్చోష్ణతాఙ్గే చ యస్య తం పరివర్జయేత్. ౧౧౩

కామల కన్నులయందు వ్యాపించి ముఖము స్థూలమై కణతలయందు మాంసము నశించి శరీరమునంతెల్ల ఉష్ణముకలిగి రోగి యులికి పడుచున్నయెడ ఆరోగి జీవింపఁడు.

మరియొక రిష్టలక్షణము.

అకస్మాదనుధావచ్చ విఘృష్టం త్వక్సమాశ్రయమ్,

ఏదైన చర్మము నాశ్రయించియున్నప్పుడు దానిని చేత తుడిచినను మరల నిష్కారణముగ వ్యాపించుచున్న నామనుజుఁడు బ్రతుకఁడు.

వ్రణసామాన్యమునందు రిష్టలక్షణములు.

యో వాతజో న శూలాయ స్యాన్న దాహాయ పిత్తజః. ౧౧౪
కఫజో న చ పూయాయ మర్మజశ్చ రుజేన యః,

అచూర్ణశ్చూర్ణకర్ణాభో యత్రాకస్మాచ్చ దృశ్యతే. ౧౧౫
రూపం శక్తిధ్వజాదీనాం సర్వాంస్తాన్ వర్జయేద్వ్రణాన్,

వాతప్రకోపమునఁబుట్టినవ్రణమున నొప్పిలేకున్నను, పిత్తమువలనఁబుట్టినవ్రణమున మంటలేకున్నను, కఫమునఁబుట్టినవ్రణమునందు చీములేకున్నను, మర్మస్థలములఁబుట్టినవ్రణమునందు తీవ్రమైనబాధలేకున్నను, ఆవ్రణములు మరణమునొందించును. మరియుం వ్రణముపై కారణములేకయే పొడిచల్లినవిధముగనున్నను, వ్రణముయొక్క రూపము శక్తిధ్వజము మున్నగువానియాకారమును బోలియున్నను, ఆవ్రణములన్నియుం మరణమునొందించును కావున చికిత్స జేయందగదు.

ఇచ్చట నీనిర్ణయము నెఱుంగునది:—వ్రణములయందు వాతముచే శూలంబును, పిత్తముచేతాపంబును, కఫముచే చీమును కలుగుట సహజము. దానికి వ్యత్యయముగ వాతవ్రణమున శూలాభావము, పిత్తవ్రణముల మంటయుం, కఫవ్రణముల చీమును కలుగకుండుట స్వభావవిరుద్ధము కావున నివి రిష్టలక్షణములు. మరియుం మర్మస్థలములఁబుట్టినవ్రణములయందు తీవ్రమైనబాధ యవశ్యముకలుగవలసియుండ కలుగకుండుటయుం స్వభావవిరుద్ధము. కావున నీలక్షణములబట్టి బాధలేకున్నదనితలచి సంతసింపక రిష్టలక్షణములుగ నెఱుంగవలెనని భావము.

### భగందరమున రిష్టలక్షణములు.

విణ్మూత్రమారుతవహం క్రిమిణం చ భగన్దరమ్. ౧౧౬

భగందరద్వారముండి మలమూత్ర వాతములు వెడలుచున్నను, అట్టివ్రణమున పురుగులు పుట్టినను భగందరము అవశ్యము చంపును.

### రోగసామాన్యములైన కొన్నిరిష్టములు.

ఘట్టయన్ జానునా జాను పాదావుద్యమ్య పాతయన్,
యోఽపాస్యతి ముహుర్వక్త్రం ఆతురో న స జీవతి. ౧౧౭

వ్యాధిచేపీడితుడగుమనుజుడు మోకాలిచే మోకాలునొరయుచున్నను, పాదములపైకెత్తి క్రింద కొట్టుచున్నను, కారణములేకయె నోరునిటునటు త్రిప్పుచున్నను. ఆరోగి బ్రతుకడు.

దన్తైశ్ఛిన్దన్నఖాగ్రాణి తైశ్చ కేశాన్ తృణాని చ,
భూమిం కాష్ఠేన విలిఖన్ లోష్టం లోష్టేన తాడయన్. ౧౧౮
హృష్టరోమాసాన్ద్రమూత్రః శుష్కకాసీ జ్వరీ చ యః,
ముహుర్హ్వాసన్ ముహుః క్ష్వేడన్ శయ్యాం పాదేన హన్తి యః.

ముహుశ్ఛిద్రాణి విమృశన్ ఆతురో నసజీవతి. ౧౧౯

జ్వరమునందు ఒడలు పులకరిత్తి మూత్రము చిక్కనై వెడలుచు పొడిదగ్గుకలిగిన రోగి తనపండ్లచేత గోళ్లను కొరుకుచున్నను, దన్తములచేనైనను గోళ్లచేనైనను వెండ్రుకలను తృణములను త్రుంచుచున్నను, భూమిని పుల్లచే గీచుచున్నను, మట్టిపెళ్లను ఇంకొకమట్టిపెళ్లచేత తాడించుచున్నను, కారణములేకయే మాటిమాటికి నవ్వుచున్నను, లేక యేడ్చుచున్నను, పడకను తనపాదముచే కొట్టుచున్నను, నిష్కారణముగ తన శరీరమునందలి నాసాదిరంధ్రములతడవికొనుచున్నను, ఆరోగి నిశ్చయముగ జీవింపడు.

## కొన్నిసామాన్య రిష్టలక్షణములు.

మృత్యవే సహసాఽఽర్తస్య తిలకవ్యంగవిప్లవః. ౧౨౦
ముఖేదన్తనఖే పుష్పం జఠరే వివిధాస్సిరాః,

రోగికి తటాలున తిలకము (మచ్చ) ఐనను వ్యంగము (మంగు) ఐనను ముఖముపై పుట్టినయెడ మరణమునొందును. దన్తములయందైనను గోళ్లయందైనను పువ్వువంటి మచ్చపుట్టినను ఉదరముపై పలుదెరంగులైనసిరలు తటాలున బుట్టినను మృతినొందును.

ఊర్ధ్వశ్వాసంగతోష్మాణం శూలోపహతవంక్షణమ్. ౧౨౧
శర్మ నాఽఽవధిగచ్ఛన్తం బుద్ధిమాన్ పరివర్జయేత్,

రోగికి ఊర్ధ్వశ్వాసముకల్గి శరీరముపై వేడియుండిగ చల్లబడి గజ్జలయందు పోటుపుట్టి యించుకైన సుఖములేక కష్టముపడుచున్న నారోగి బ్రతుకడు. కావున బుద్ధిమంతుడగు వైద్యుడు ఆరోగిని విడచుట మంచిది

వికారాః యస్య వర్ధన్తే ప్రకృతిః పరిహీయతే. ౧౨౨
సహసా సహసా తస్య మృత్యుర్హరతి జీవితమ్,

ఏరోగికి జ్వరాదిరోగములు కారణములేకయే శీఘ్రముగ వృద్ధినొందుచు తనవు స్వభావసిద్ధములై వాడుకలోనుండుగుణములు మారునో ఆరోగిని మృత్యుదేవత తప్పక చంపును.

యముద్దిశ్యాఽఽతురం వైద్యః సమ్పాదయితుమౌషధమ్. ౧౨౩
యతమానో న శక్నోతి దుర్లభం తస్య జీవితం,

ఏరోగి నుద్దేశించి వైద్యుండు ఔషధము సంపాదింప యత్నించి సంపాదింపలేకుండునో ఆరోగి జీవింపడు.

విజ్ఞాతం బహుశస్సిద్ధం విధివచ్చావచారితమ్ ౧౨౪
నసిధ్యత్యౌషధం యస్య నాస్తి తస్య చికిత్సితమ్,

ఔషధమును చక్కఁగదెలిసి శాస్త్రోక్తప్రకారము పక్వముజేసి పాకమునుదెలిసి దించినను ఔషధముచెడినయెడ ఆయౌషధము ఏరోగినుద్దేశించి చేయబడునో ఆరోగికి చికిత్సలేదు. (బ్రతుకడని భావము.)

భవేద్యస్యౌషధేఽన్నే వా కల్ప్యమానే విపర్యయః. ౧౨౫
అకస్మాద్వర్ణగన్ధాదేః స్వస్థోఽపి న స జీవతి,

ఏరోగినుద్దేశించి కషాయఘృతలేహాద్యౌషధములనైనను, ఆహారపదార్థములనైనను పక్వముజేయునప్పుడు వర్ణముగంధమున్నగునవి కారణములేకయే విరుద్ధముగ మారునో అట్టిమనుజుడు స్వస్థతనున్నను జీవింపడు.

నివాతే సేన్ధనం యస్య జ్యోతిశ్చాప్యుపశామ్యతి. ౧౨౬
ఆతురస్య గృహే యస్య భిద్యన్తే వా పతన్తి వా,
అతిమాత్రమమత్రాణి దుర్లభం తస్య జీవితమ్. ౧౨౭

గాలిలేక నిశ్చలమైనప్రదేశమునందుఅగ్నులుమున్నగునవి సమిధలు మున్నగునవి వృద్ధికరపదార్థములున్నను తనంతనచే నిష్కారణముగ నణగిపోయిన నాగృహమునందురోగియైనను స్వస్థుడైనను తప్పక మృతినొందును. మరియునెవ్వనిగృహమునందు పాత్రలుమున్నగునవి కారణములేకయే పగులునో లేక పైనుండి క్రిందపడునో ఆగృహమునందురోగి బ్రతుకుటలేదు.

ఆత్రేయమతమున రిష్టలక్షణములు.

యం నరం సహసా రోగో దుర్బలం పరిముఞ్చతి,
సంశయం ప్రాప్తమాత్రేయో జీవితం తస్య మన్యతే. ౧౨౮

మిక్కిలి బలహీనస్థితినుండు ఏరోగిని రోగము హఠాత్తుగ విడచిపోవునో అట్టిరోగిజీవితము సంశయమున నుండునని యాత్రేయమహర్షి సమ్మతము.

రోగిమరణనిర్ణయమును చెప్పదగదనుట.

కథయేన్నైవ పృష్టోఽపి దుర్జ్ఞేయం మరణం భిషక్,
గతాసోః బన్ధుమిత్రాణాం న చేచ్ఛేత్తం చికిత్సితుమ్. ౧౨౯

రోగి మరణమునకు సిద్ధముగనున్నప్పుడు వానిబంధువులును మిత్రులును 'ఈ రోగిజీవించునా? లేదా?' అని వైద్యుని అడిగినను వైద్యుడు వానిమరణమును వారికి చెప్పకూడదు. అట్టిమరణవార్తవిని రోగిబంధుమిత్రాదులు సంతాపింతురు కావున చెప్పదగదు. కాని అట్టిస్థితినుండురోగికిమాత్రము చికిత్స చేయంజనదు.

రిష్టలక్షణములు కల్గినప్పుడు రోగినివిడచుటకు కారణములు.

యమదూతపిశాచాద్యైః యత్పరాసురపాస్యతే,
ఘ్నద్భిరౌషధవీర్యాణి తస్మాత్తం పరివర్జయేత్. ౧౩౦

రోగికి రిష్టలక్షణములు కానవచ్చినపుడు యమదూతలు పిశాచములు మున్నగు వారు ఔషధములవీర్యమును నిష్ఫలములుగ చేయుందురు. కావున వీర్యవంతములగు నౌషధములు తమతమకృత్యముల జేయనేరక నిర్వీర్యములబోలె ప్రయోజనదూరములై యుండును. కావున అట్టిస్థితియందు వైద్యుడు రోగికి చికిత్స జేయక విడుచుట చాల మంచిది.

రిష్టలక్షణపరిజ్ఞానావశ్యకత.

ఆయుర్వేదఫలం కృత్స్నం యదాయుర్జ్ఞే ప్రతిష్ఠితమ్,
రిష్టజ్ఞానాదృతస్తస్మాత్ సర్వదైవ భవేద్భిషక్. ౧౩౧

ధాతువులను సమస్థితినుంచి రోగాదుల నివర్తింపజేసి ఆయుంవును పరిపాలించుట ఆయుంర్వేదమునకు ముఖ్యమైన ప్రయోజనము. అట్టియాయుర్వేదఫలము ఆయుంవు యొక్కపరిస్థితిని చక్కగ తెలిసినవైద్యునియధీన మైయుండును. ఆయుంవుయొక్క పరిస్థితి రిష్టలక్షణముల నెరుంగనివైద్యునకు దెలియబోదు. కావున వైద్యుడు ఎల్లప్పుడు రిష్టలక్షణ పరిజ్ఞానమునందు మిక్కిలి యాదరముకల్గియుండుట యావశ్యకము.

మరణముసంభవించుటకు ముఖ్యకారణము.

మరణం ప్రాణినాం దృష్టం ఆయుః పుణ్యోభయక్షయాత్,
తయోరప్యక్షయాద్దృష్టం విషమాపరిహారిణామ్. ౧౩౨

సకలప్రాణులకును, ఆయువును, తొలిజన్మమున తాజేసినపుణ్యమువలనను ఈ రెండిటిసముదాయమువలనను వృద్ధినొందును. అట్టి ఆయుంవును, పూర్వము జేసినపుణ్యం బును లేక ఆయుఃపుణ్యములురెండును క్షీణించినపుడు మనుజులకు మరణము సంభవిం చును. మరియు అట్టిఆయుంవును పుణ్యంబును క్షీణించకున్నను విషమములగు మదించిన యేనుగులు సింహములు పెద్దపులులు సర్పములుమున్నగువానివలన నాపత్తులు సంభవింప నీయక కాపాడకున్నప్పుడు మరణముసంభవించును. (ఆయుంవుక్షీణించకున్నను పుణ్యము నశింపకున్నను విషజంతువులుమున్నగువానివలన నాపత్తులు సంభవింపక కాపాడుకొనని పక్షమున నట్టియాగంతుకారణములచే మరణము సిద్ధముగ సంభవించుననిభావము).

ఇతిశ్రీవాగ్భటవిరచితే అష్టాంగహృదయశారీరే పంచమోఽధ్యాయః

# షష్ఠాధ్యాయము.

అవ:—పై యధ్యాయమున మరణము కాలనియతి ననుసరించి నిర్ణయముగ దెలియజేయు రిష్టలక్షణములు వివరింపబడియె. ఈ యధ్యాయమున రోగిచే బంపబడిన సేవకునిమూలమునను రోగియింటికి పోవునప్పుడు త్రోవలోగల్గుశకునవిశేషముల చేతను సంభవించుశుభాఽశుభఫలములు తెలుపబడును.

సూ. అథాఽతో దూతాదివిజ్ఞానీయం శారీరం వ్యాఖ్యాస్యామః.

వికృతివిజ్ఞానీయాధ్యాయమును జెప్పినపిదప దూతాదివిజ్ఞానమునకుసంబంధించిన శారీరమును దెలుపునధ్యాయమును జెప్పెదనని భావము.

రోగిచే వైద్యునియొద్దకు బంపబడిన స్త్రీయైనను పురుషుడైనను దూతశబ్దముచే చెప్పబడును. ఆదిశబ్దముచేత వైద్యుడు తనయిల్లు వెడలి రోగియింటికి బోవునంతలో మార్గమధ్యమునను, పోయి చేరినవెనుకను వైద్యునకు గానంబడువినబడు శుభాశుభసూచకశకునములన్నియు గ్రహింపబడును. అట్టిదూతాదులకు సంబంధించిన నిశ్చయజ్ఞానమునకు హితమైనయధ్యాయము దూతాదివిజ్ఞానీయము. దూతాదివిజ్ఞానమునకు అనుకూలమై శరీరసంబంధమైనవిషయమును దెలుపునధ్యాయము వివరముగ జెప్పెదనని భావము.

### దూతలక్షణము.

పాషణ్డాశ్రమవర్ణానాం సవర్ణాః కర్మసిద్ధయే,
త ఏవ విపరీతాస్స్యుః దూతాః కర్మవిపత్తయే. ౧

శివకేశవులయందు భేదబుద్ధిచే పరస్పరద్వేషబుద్ధికలవారు పాషండులు. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసమునని నాల్గు ఆశ్రమములు. బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులను నాల్గుజాతులు. (ఇవియే నాల్గువర్ణములు). అట్టిపాషండులకును, బ్రహ్మచర్యాది ఆశ్రమస్థులకును బ్రాహ్మణాదివర్ణములవారికిని వారివారికి సమానవర్ణములైనవారు వైద్యునకు బంపు దూతలుగనున్నయెడ ఆరోగ్య రూపకర్మసిద్ధి చేకూరునని యెరుంగునది. (అనగా పాషండులకు పాషండులును, బ్రహ్మచారికి బ్రహ్మచారియు, బ్రాహ్మణునకు బ్రాహ్మణుడును దూతగనుండవలెననుట. ఇత్తెరంగుననే గ్రహ

ష్ఠాదిఆశ్రమస్థులకును క్షత్రియాదివర్ణస్థులకును సమానవర్ణమువారే దూతలుగ నుండిన కార్యసిద్ధి కలుగునని యెరుంగునది.)

అటుగాక పాషండులకు బ్రాహ్మణాదులు, బ్రహ్మచారి గృహస్థమున్నగువారికి తద్భిన్నులును దూతలుగనున్నచో వైద్యునకు కర్మసిద్ధి కలుగక రోగికి విపత్తును కలిగించును.

## అగ్రాహ్యదూతలక్షణము.

దీనం భీతం ద్రుతం త్రస్తం రూక్షామంగళవాదినమ్,
శస్త్రిణం దణ్డినం షణ్డం ముణ్డశ్మశ్రుం జటాధరమ్. ౨
అమఙ్గళాహ్వయం క్రూరకర్మాణం మలినం స్త్రియమ్,
అనేకవ్యాధితం వ్యఙ్గం రక్తమాల్యానులేపనమ్. 3
తైలపఙ్కాఙ్కితం జీర్ణవివర్ణార్ద్రైకవాససమ్,
ఖరోష్ట్రమహిషారూఢం కాష్ఠలోష్టాదిమర్దినమ్. ౪
నానుగచ్ఛేద్భిషగ్దూతం ఆహ్వయన్తం చ దూరతః,

రోగిచే బంపబడిన సేవకుడు దీనుడుగనున్నను, భయపడియున్నను, తొందరపడుచున్నను, భయముతోఁగూడి పరుషంబులును అశుభకరంబులు నగుమాటల బల్కుచున్నను, ఆయుధమును చేతబట్టుకొనియున్నను, కఱ్ఱను చేతబట్టియున్నను, నపుంసకుడుగనున్నను, మీసములను క్షౌరము చేసికొనియున్నను, జడల ధరించియున్నను, అమంగళమైన పేరుకలవాడుగనున్నను, క్రూరమైనపని చేయుచున్నను, మలినమైనశరీరముకలిగియున్నను, ఆడుదియైయున్నను, అనేకరోగములు కలిగినవాడైనను, అంగహీనుడైనను, ఎఱ్ఱనిపుష్పమాలికలును మైపూతలును కలిగియున్నను, ఒడలిపై నూనెచేతను బురదచేతను పూసికొనియున్నను, చింపిగుడ్డలచేతను విపర్ణములైనగుడ్డలచేతను, తడిసినగుడ్డలచేతను కట్టుకొనియున్నను, గాడిదనైనను, ఒంటెనైనను, ఎనుబోతునైనను ఎక్కియున్నను, కట్టెలు మట్టిపెళ్లలు మున్నగువానిని చేతితో మర్దనము చేయుచున్నను, దూరముననిలిచి పిలుచుచున్నను అట్టిదూతతోఁగూడి వైద్యుడు రోగికడకు పోదగదు, (పిలువను వచ్చుటకు వచ్చినభటుడు పైజెప్పినలక్షణములు కలిగియుండునేని రోగము నివర్తికానోపదు కావున చికిత్సజేయుటకై పోదగదనుట.)

## వైద్యునిస్థితినిబట్టి శుభాశుభశకుననిర్ణయము.

అశస్తచిన్తావచనే నగ్నే ఛిన్దతి భిన్దతి. ౫
జుహ్వత్యగ్నే పావకం పిణ్డాన్ పితృభ్యో నిర్వపత్యపి,

సుప్తే ముక్తకచేఽభ్యక్తే రుదత్యప్రయతే తథా. ౬
వైద్యే దూతాః మనుష్యాణాం ఆగచ్ఛన్తి ముమూర్షతామ్,

వైద్యుడు అప్రశస్తమైనచింతతో కూడియున్నపుడును, ప్రశస్తముకాని మాటల బల్కుచున్నను, వస్త్రహీనుడైయున్నను, కట్టెలుమున్నగువాని చ్ఛేదించుచు నైనను చీల్చుచునైన నున్నపుడును, అగ్నియందు హోమము చేయుచున్నపుడును, పితృదేవతలకు పిండముల బెట్టుచున్నపుడును, నిదురించునపుడును, వెండ్రుకల విరబోసి యున్నపుడును, అభ్యంగనము జేసికొనునప్పుడును, ఏడ్చుచున్నపుడును, మనస్సు నిల్కడ లేకున్నపుడును, రోగిపంపినదూతలు వైద్యునిపి లువబోయినయెడ అట్టి రోగులు మరణమునకు సిద్ధముగ నున్నవారని యెఱుంగునది.

రోగముయొక్క గుణములబట్టి శకునపరీక్ష.

వికారసామాన్యగుణే దేశే కాలేఽథవా భిషక్. ౭
దూతమభ్యాగతం దృష్ట్వా నాతురం తముపాచరేత్,

రోగికి ఎట్టిగుణములుకలరోగము సంభవించియుండునో అట్టిగుణములుకల దేశమునందైనను కాలమునందైనను వైద్యుడు రోగిచే బంపబడిన సేవకుని చూచినయెడ ఆరోగము మిక్కిలి యసాధ్యము కావున చికిత్స జేయ బోజనదు.

కఫము చేగలిగిన జ్వరాదిరోగములు కలరోగిచే బంపబడినసేవకుడు నెయ్యి నీళ్లు మున్నగుద్రవద్రవ్యములసమీపమునన్నైనను అనూపదేశమందైనను ఉదయకాల మునందైనను వైద్యునిజూచి పిలిచినయెడ వైద్యుడు చికిత్సజేయ గడంగదగదు. రోగి పిత్తము చేగలిగినరోగముచే పీడితుడైనయెడ వానిచే బంపబడినసేవకుడు అగ్నిసమీపమునను మధ్యాహ్నకాలమునందును వైద్యునిపిలచినచో రోగము కుదరదు. వాతరోగమునందు రూక్షాదిగుణయుక్తమైన యిసుక రాళ్లుమున్నగునవికలప్రదేశమునందైనను సాయంకాలమునందైనను వైద్యునికడ కేగి పిలచిన రోగము అసాధ్యమగును. కావున అట్టిలక్షణముల గమనించి వైద్యుడు చికిత్సజేయ గనుకంపవలెను. తక్కినరోగవిశేషములకన్నిటికిని ఆయాగుణములబట్టి దేశకాలములగుణముల ననుసరించి పైజెప్పిన రీతిగ నిర్ణయించునది.

దూతయొక్క చేష్టావిశేషరూపమైన శకునములు.

స్పృశన్తో నాభినాసాస్యకేశరోమనఖద్విజాన్. ౮
గుహ్యపృష్ఠస్తనగ్రీవాజఠరానామికాఙ్గులీ,
కార్పాసబుసనీసాస్థికపాలముసలోపలమ్. ౯

మార్జనీశూర్పచైలాస్థిభస్మాఙ్గారదశాతుషాః,
రజ్జూపానత్తులాపాశమన్యద్వా భగ్నవిచ్యుతమ్. ౧౦
తత్పూర్వదర్శనే దూతాః వ్యాహరన్తి మరిష్యతామ్,

బొడ్డు, తల, ముక్కు, నోరు, వెండ్రుకలు, శరీరముపైనుండురోమములు, గోళ్లు, దంతములు, గుహ్యము, వీపు, స్తనములు, కంఠము, ఉదరము, చిటికెనవ్రేలికిప్రక్క వ్రేలు, ప్రత్తి, ఊక, సీసము, అస్థి, నుండుపెంకులు, రోకలి, రాయి, చీపురుకట్ట, చేట, గుడ్డచెరగు, బూడిదె, బొగ్గులు, వత్తి, పొట్టు, త్రాడు, చెప్పులు, త్రాసు, పాశము, భగ్నములును చ్యుతములునగు ఇతరద్రవ్యములు, వీనిలో దేనినైన చేతతాకుచు వైద్యుని తొలుదొలుత చూచి మాట్లాడి చికిత్సకై సేవకుడు పిలిచిన నారోగి చావసిద్ధముగనున్నవాడని యెరుంగునది.

## కాలవిశేషము చేతనైన శుభాఽశుభములు.

తథాఽర్ధరాత్రే మధ్యాహ్నే సన్ధ్యయోః పూర్వవాసరే. ౧౧
షష్ఠీచతుర్థీనవమీరాహుకేతూదయాదిషు,
భరణీకృత్తికాశ్లేషాపూర్వార్ద్రాపిత్ర్యనైరృతే. ౧౨

మరియు రోగిచే వైద్యుని పిలుచుటకై పంపబడినమనుష్యుడు అర్ధరాత్రియందును, మధ్యాహ్నమునందును, ఉభయసంధ్య (ప్రాతఃకాలసాయంకాలము) లయందును, తొలివారము (ఆదివారము) నాడును, షష్ఠి చవితి నవమి అనుతిథులయందును, రాహుకేతువుల ఉదయకాలమునందును, భరణి కృత్తిక ఆశ్లేష పూర్వాషాఢ పూర్వాభాద్ర పూర్వఫల్గుని ఆర్ద్ర మఖ మూల అనునక్షత్రములతోకూడినదినములయందును, వైద్యునితొలుదొలుత చూచి పిలచిన ఆరోగి బ్రతుకుటదుస్తరము కావున వైద్యుడు చికిత్సజేయ నరుగదగదు.

## వైద్యునితో సంభాషించునపుడు దుశ్శకునములు కానవచ్చినచో చికిత్సజేయ దగదనుట.

యస్మింశ్చ దూతే బ్రువతి వాక్యమాతురసంశ్రయమ్,
పశ్యేన్నిమిత్తమశుభం తం చ నానువ్రజేద్భిషక్. ౧౩

రోగిచేబంపబడినదూత వైద్యునియొద్దజేరి రోగికిసంబంధించినమాటల బల్కు సమయమున వైద్యుడు అశుభసూచకమైనదుశ్శకునమును జూచినను ఆవచ్చినమనుజుని వెంబడి వైద్యుడు పోదగదు.

## వైద్యుని బిలచునపుడు అపశకునములు.

తద్యథా వికలః ప్రేతః ప్రేతాలంకార ఏవ వా,

ఛిన్నం దగ్ధం వినష్టంవా తద్వాదీని వచాంసి వా. ౧౪
రసోవా కటుకస్తీవ్రః గన్ధోవా కౌణపో మహాన్,
స్పర్శోవా విపులః క్రూరః యద్వాన్యదపి తాదృశమ్. ౧౫
తత్సర్వమభితో వాక్యం వాక్యకాలేఽథవా పునః,
దూతమభ్యాగతం దృష్ట్వా నాతురం తముపాచరేత్. ౧౬

రోగిచే పంపబడినవాడు వైద్యునితో రోగివిషయములగూర్చి మాట్లాడునపుడును మాటలముందుగనైనను వెనుకనైనను గ్రుడ్డి, కుంటి మున్నగు అంగహీనులైనను, చచ్చిన ప్రేతములైనను, ప్రేతమునకు సంబంధించిన యలంకారములైనను, తెగినదారము మున్నగు వానినైనను, కాలినవస్త్రము మున్నగువానినైనను, పగిలిన కుండమున్నగువానినైనను, చూచినను; లేక అట్టివిషయముల దెలుపు మాటల వినినను; మిక్కిలి తీవ్రమైన కారము కల వినయాంలు మున్నగు ద్రవ్యములను చూచినను, పీనుగకంపు ఘ్రాణేంద్రియమునకు గోచరమైనను, మిక్కిలి క్రూరమైన స్పర్శము గానవచ్చినను, పైజెప్పినవానికి సమానములైనయితరవిషయములు ఏవియైన యింద్రియములకు గోచరములైనను అప్పుడు వచ్చిన సేవకునితోగూడిపోయి రోగికి చికిత్స చేయదగదు.

(పైజెప్పినదుశ్శకునములు రోగివిషయములను వైద్యునితో చెప్పునపుడు గానవచ్చినచో రోగము నివర్తింపనేరదు కావున ఆరోగికి చికిత్స చేయ జనదని భావము.)

### మరికొన్ని యపశకునములు.

హాహాక్రందితముత్కృష్టం రుదితం స్ఖలనం క్షుతమ్,
వస్త్రాతపత్రపాదత్రవ్యసనం వ్యసనీక్షణమ్. ౧౭
చైత్యధ్వజానాం పాత్రాణాం పూర్ణానాం చ నిమజ్జనమ్,
హతాఽనిష్టప్రవాదాశ్చ దూషణం భస్మపాంసుభిః. ౧౮
పథశ్ఛేదోఽహిమార్జారగోధాసరటవానరైః,
దీప్తాం ప్రతిదిశం వాచం క్రూరాణాం మృగపక్షిణామ్. ౧౯
కృష్ణధాన్యగుడోదశ్విత్ లవణాసవచర్మణామ్,
సర్షపాణాం వసాతైలతృణపఙ్కేన్ధనస్య చ. ౨౦
క్లీబక్రూరశ్వపాకానాం జాలవాగురయోరపి,
ఛర్దితస్య పురీషస్య పూతిదుర్దర్శనస్య చ. ౨౧
నిస్సారస్య వ్యవాయస్య కార్పాసాదేరరేరపి,
శయనాసనయానానాం ఉత్తానానాంతు దర్శనమ్. ౨౨
న్యుబ్జానామితరేషాంచ పాత్రాదీనామశోభనమ్,

మరియు హాహా అనిబిగ్గరరోదనము వినబడుట, బిగ్గరగ నాక్రోశరూపమైన మాటవినబడుట, వైద్యుడు బైలువెడలునపుడు అడుగులుతడబడుట, తుమ్ముట, వస్త్రము, గొడుగు, చెప్పులు ఇవి క్రిందపడుట, లేక చెడుట, వ్యసనముపడుచుండువారు తనకుకనబడుట, రచ్చమాను ధ్వజము ఇవి కూలుట, నీళ్లుమొదలగువానిచే నిండిన పాత్రలు విరగబడుట, చచ్చెను పోయెను అనునవి మున్నగునమంగళవాక్యములు వినబడుట, బూడిదె ధూళి మున్నగువానిచేత వైద్యునిశరీరము గ్రమ్మబడుగ, సర్పము పిల్లి ఉడుముతొండ కోతి అనునీజంతువులు త్రోవకడ్డముగ పోవుట, ఇవియన్నియు అశుభమును దెలుపుశకునములు.

మరియు (సూర్యుడుండుతూర్పుదిక్కు దీప్తదిశయనబడును.) జంతువుల హింసించునట్టి నక్కలు కుక్కలు మున్నగు క్రూరమృగములును, శ్యేనముమున్నగు క్రూరములైనపక్షులును తూర్పుమళ్లి సూర్యునకభిముఖముగ నూయుచుండుటయు నపశకునము. మరియు నల్లనిధాన్యములు, బెల్లము, మజ్జిగ, ఉప్పు, మద్యము, చర్మము, ఎఱ్ఱని పూవులు, వస, తైలము, గడ్డిపోచలు, బురుద, కట్టెలు, నపుంసకుడు, నిష్ఠురోక్తుల బల్కుమనుష్యుడు, మాదిగవాడు, మత్స్యములబట్టువల, మృగములబోను, వమనముచే వెడలినయుచ్ఛిష్టము, పురీషము, దుర్గంధము, చూడశక్యముగాక కరాళాదివికృత వస్తువులు, సారములేనిద్రవ్యములు,సంగమము, ప్రత్తిమున్నగునవి, శత్రువు, తలక్రిందుగ త్రిప్పి యుంచబడినమంచములు, ఆసనములు యానములుమున్నగునవి, బోరగిలనుంచబడిన పాత్రములుమున్నగునవి, వీనిని చూచుట యపశకునము.(వైద్యుడు రోగియింటికి బోవునపుడైనను, బైలుదేరునపుడైనను, మార్గముననైనను పైజెప్పినవానిలో నేదియైన కనబడినయెడ శుభకరముకాదు కావున రోగికి చికిత్సజేయజనదనుట.)

### పక్షిశకునభేదములు.

పుంసంజ్ఞాః పక్షిణో వామాః స్త్రీసంజ్ఞా దక్షిణాశ్శుభాః ౨౩

పుంలింగవాచ్యములైనపక్షులు ఎడమప్రక్కనున్నయెడ శుభకరములు, స్త్రీలింగవాచ్యములగుపక్షులెల్ల కుడిప్రక్కనున్నయెడ చాలమంచిది.

### మృగములయొక్కయు పక్షులయొక్కయు గమనభేదముచే గలుగుశకునములు.

ప్రదక్షిణం ఖగమృగాః యాన్తో నైవం శ్వజమ్బుకాః,
అయుగ్మాశ్చ మృగాశ్శస్తాః శస్తా నిత్యం చ దర్శనే. ౨౪
చాషభాసభరద్వాజనకులచ్ఛాగబర్హిణః,
అశుభం సర్పశోలూకబిడాలసరటేక్షణమ్. ౨౫

కాకిమున్నగుపక్షులును లేంకమున్నగుమృగములును ప్రదక్షిణముగ (ఎడమనుండి కుడిప్రక్కకు) పోయిన శుభకరము. కుక్కనక్క ఈ రెండుమాత్రము అటుగాక కుడినుండి యెడమప్రక్కకు బోయిన మంచిది. మరియు మృగములు బేసిసంఖ్యగ నగుపడిన శుభము. చాషము(పాలపిట్ట) భాసపక్షి, భారద్వాజము, ముంగిస, మేకపోతు, నెమలి, ఈజంతువులు కుడిప్రక్కనైనను ఎడమప్రక్కనైనను ఉండిన వానినిచూచుట మిక్కిలి ప్రశస్తము. గుడ్లగూబ, పిల్లి, ఊసరవల్లి వీనిని చూచుట యెప్పటికిని మంచిది కాదు.

### కొన్ని జంతుశకునభేదములు.

ప్రశస్తాః కీర్తనే కోలగోధాఽహిశశజాహకాః,
న దర్శనే నవిరుతే వానరర్క్షా అతోఽన్యథా. ౨౬

పంది, ఉడుము, సర్పము, కుందేలు, జాహకమనుజంతువిశేషము, వీనిని చెప్పుట మాత్రము మంచిది. కోతిని ఎలుగుబంటిని చూచుటయు వానిశబ్దమును వినుటయు మంచిదికాదు. పైజెప్పినరెంటిని పేరెత్తి చెప్పుటమాత్రము మంచిదని భావము.

### ఇంద్రధనుస్సు మున్నగువానిశకునములు.

ధనురైన్ద్రం చ లాలాటం అశుభం శుభమన్యతః,
అగ్నిపూర్ణాని పాత్రాణి భిన్నాని విశిఖాని చ. ౨౭

ఇంద్రధనుస్సు తనకు ఎట్టయెదుట నున్నయెడ మంచిదికాదు. పార్శ్వములయందైనను వెనుకప్రక్కనైనను ఇంద్రధనుస్సుండిన చాలమంచిది. నిప్పుచే నిండిన పాత్రలును పగిలినపాత్రలును ఏమియు లేకయుండుపాత్రలును ఎదుట వచ్చుట అశుభము.

### వైద్యుడు రోగియింటనుండి వచ్చునపుడు శకునభేదములు.

దధ్యక్షతాది నిర్గచ్ఛన్ వక్ష్యమాణం చ మంగళమ్,
వైద్యో మరిష్యతాం వేశ్మ ప్రవిశన్నేవ పశ్యతి. ౨౮

పెరుగు అక్షతలు చెప్పబడు మున్నగువానిని వైద్యుడు రోగియింటికిబోవునప్పుడు త్రోవలోనైనను ఇంట ప్రవేశించునప్పుడైనను చూచుట చాల మంచిది. ఈవిషయము క్రిందజెప్పబడును. అట్టి దధ్యక్షతాదులను రోగియింటినుండి బైటవచ్చునపుడే చూచునెడరోగికి రాగలమరణమును సూచించునని భావము.

### శకునఫలములు.

దూతాద్యసాధు దృష్టైవం స్యాదేదార్తమతోఽన్యథా,

కరుణాశుద్ధసన్తానో యత్నతస్సముపాచరేత్. ౨౯

ఇత్తెరంగున జెప్పబడిన దూతలక్షణములను శకునములను చక్కగ గమనించి అందు అశుభలక్షణములు గనబడినపుడు రోగికి చికిత్స జేయక మానునది. అయ్యవి శుభలక్షణములుగ నున్నపుడు మిక్కిలి కరుణారసార్ద్రమైనమనస్సుకలవాడై వైద్యుడు మిక్కిలి శ్రద్ధతో రోగికి శాస్త్రీయమై యుక్తియుక్తమైనచికిత్స జేయనగును.

## శుభశకునములు.

దధ్యక్షతేక్షునిష్పావప్రియఙ్గుమధుసర్పిషామ్,
యావకాఞ్జనభృఙ్గార ఘణ్టాదీపసరోరుహామ్. ౩౦
దూర్వార్ద్రమత్స్యమాంసానాం లాజానాం ఫలభక్ష్యయోః,
రత్నేభపూర్ణకుమ్భానాం కన్యాయాః స్యన్దనస్య చ. ౩౧
నరస్య వర్ధమానస్య దేవతానాం నృపస్య చ,
శుక్లానాం సుమనోవాలచామరామ్బరవాజినామ్. ౩౨
శఙ్ఖసాధుద్విజోష్ణీషతోరణస్వస్తికస్య చ,
భూమేస్సముద్ధృతాయాశ్చ వహ్నేః ప్రజ్వలితస్య చ. ౩౩
మనోజ్ఞస్యాఽన్నపానస్య పూర్ణస్య శకటస్య చ,
నృభిర్ధేన్వాస్సవత్సాయాః బడబాయాః స్త్రియా అపి. ౩౪
జీవంజీవకసారఙ్గసారసప్రియవాదినామ్,
రుచకాదర్శసిద్ధార్థ రోచనానాం చ దర్శనమ్. ౩౫
గన్ధస్సురభిః వర్ణస్సుశుక్లో మధురో రసః,
గోపతేరనుకూలస్య స్వర స్తద్వద్వామపి. ౩౬
మృగపక్షినరాణాం చ శోభినాం శోభనా గిరః,
ఛత్రధ్వజపతాకానాం ఉత్క్షేపణమభిష్టుతిః. ౩౭
భేరీమృదఙ్గశఙ్ఖానాం శబ్దాః పుణ్యాహనిస్స్వనాః,
వేదాధ్యయనశబ్దాశ్చ సుఖో వాయుః ప్రదక్షిణః. ౩౮
పథి వేశ్మప్రవేశే చ విద్యాదారోగ్యలక్షణమ్,

పెరుగు, అక్షతలు, చెఱుకుగెడలు, అనుములు, కొఱ్ఱలు, తేనె, నెయ్యి, లత్తుక, కాటుక, కొమ్ముచెంబు, గంట, దీపము, తామరపువ్వులు, గరిక, ఎండక పచ్చిగనుండు మత్స్యమాంసములు, బొరుగులు, పండ్లు, భక్ష్యములు, వజ్రాదిరత్నములు, ఏనుగులు, నిండుకుండలు, కన్యక, రథము, దానధర్మాదులచే సత్కీర్తివడసి నానాట వృద్ధి నొందుచున్నమనుజుడు, ఇంద్రాదిదేవతలు, రాజ్యమునేలుచుండు ప్రభువు, తెల్లగ

నుండుపుష్పములు, తెల్లనిచామరములు, తెల్లనివస్త్రములు, తెల్లనిగుఱ్ఱములు, శంఖము, సాధువులు, బ్రాహ్మణులు, తలగుడ్డ, తోరణము, స్వస్తికము, పైకెత్తబడినభూమి, మండుచుండుఅగ్ని, మనసుకింపై రమ్యముగనుండు నన్నపానములు, మనుష్యులచే నిండియుండుబండి, దూడతోగూడియుండుఆవు, దూడతోగూడినగుఱ్ఱము, బిడ్డనుచేతనుంచుకొని యున్నస్త్రీ, జీవంజీవము (వన్నెపులుగు అనుపక్షి,)చాతకము, బెగ్గురుపక్షి, ప్రియవాది (పక్షివిశేషము), చిత్రపురంగులు, అద్దము, తెల్లనిఆవాలు, గోరోచనము, పైజెప్పబడినవానిలో దేనినైన వైద్యుడు రోగియింటికి బోవునపుడు త్రోవయందైనను, రోగియింట ప్రవేశించునపుడైనను చూచినయెడ ఆరోగికి ఆరోగ్యము శీఘ్రముగ జేకూరునని యెరుంగునది.

మరియును మంచి పరిమళము, ఘ్రాణమునకు గోచరమైనను, మిక్కిలి తెల్లనికాంతి కనుబడినను, మధురమైనరసము గోచరమైనను, మిక్కిలి సాధువైయుండు వృషభముయొక్క అనుకూలమైన కంఠస్వరము, సాధువులైన ఆవులస్వరము, మంగళకరమైనమృగములయొక్కయు పక్షులయొక్కయు మనుజులయొక్కయు మంగళకరములైనధ్వనులు, ఇవి వినబడినను, ఛత్రమును ధ్వజమును పతాకమును పైకెత్తుట జూచినను, స్తుతిపాఠకులు స్తుతించుధ్వనియు, భేరీమృదంగశంఖములధ్వనియు, పుణ్యాహస్వనంబును, వేదములజదువుశబ్దంబును, చెవులకు వినవచ్చినను, ప్రదక్షిణముగ సంచరించువాయువు వగపడినను, రోగికి ఆరోగ్యము కలుగునని యెరుంగునది.

పైజెప్పినశుభశకునములు రోగియింటికి వైద్యుడు పోవునప్పుడు గన్పడిన ఆరోగ్యము తప్పక కలుగుననిభావము.

## స్వప్ననిరూపణము.

ఇత్యుక్తం దూతశకునం స్వప్నానూర్ధ్వం ప్రచక్షతే. ౩౮

ఇత్తెరంగున దూతసంబంధించిన శుభాఽశుభసూచకలక్షణంబులును, చేతనాఽచేతనరూపములగు శుభాఽశుభసూచకశకునలక్షణంబులును పైని వివరింపబడినవి. ఈ క్రిందస్వప్నములును వానివలనగలుగు శుభాశుభములును వివరింపబడుననియర్థము.

జాగ్రదవస్థయందు మనస్సు ఇంద్రియములతోగూడి ఆయాపనుల నిర్వర్తించి యలసి యాత్మయందు లీనమై మనస్సుకును ఇంద్రియములకును సంబంధించిన వ్యాపారములనన్నిటినిమాని విశ్రమించియుండును. ఇదియే నిద్రావస్థ. జాగ్రదవస్థయందైనను, పూర్వజన్మమునందైనను సంకల్పించియుండు విషయములు ఆత్మయందు బీజభావము నొందియుండ సుషుప్తియందు రజోగుణసంబంధమునంజేసి మనస్సు ప్రబోధమునొంది యింద్రియముల గూడి మున్ను బీజభావము నొందియున్నవిషయములనన్నిటినిస్మృజించి యనుభవింపజేయును. ఇదియే స్వప్నావస్థ. ఈవిషయము అష్టాంగసంగ్రహమున నిట్లు

చెప్పబడియె.—"శ్లేష్మావృతేషు స్రోతస్సు శ్రమాదుపరతేషు చ, ఇన్ద్రియేషు స్వకర్మభ్యో నిద్రావిశతి దేహినామ్" "సర్వేన్ద్రియవ్యుపరతౌ మనోఽనుపరతం యదా విషయేభ్య స్తదా స్వప్నం నానారూపం ప్రపశ్యతి"

### జ్వరమును కలిగించుస్వప్నము

స్వప్నే మద్యం సహ ప్రేతైః యః పిబన్ కృష్యతే శునా,
స మర్త్యో మృత్యునా శీఘ్రం జ్వరరూపేణ నీయతే. ౮౦

ఏమనుజుడు స్వప్నావస్థయందు ప్రేతములతోగూడి మద్యమును ద్రావి కుక్కచే లాగబడునో ఆట్టిమనుజుడు జ్వరరూపమునొందిన మృత్యువుచేత లోకాంతరమునకు గొనిపోవబడును.

### రక్తపిత్తమును గలిగించుస్వప్నము.

రక్తమాల్యవపుర్వస్త్రః యో హసన్ హ్రియతే స్త్రియా,
సోఽస్రపిత్తేన

ఎఱ్ఱని పుష్పమాలికలను వస్త్రములను ధరించి శరీరమునకు రక్తమును బూసికొని నవ్వుచు స్త్రీచేత తాను లాగబడినట్లు స్వప్నమును గాంచినయెడ రక్తపిత్తరూపమైన మృత్యువుచేత శీఘ్రముగనే లోకాన్తరమునకు గొనిపోవబడును.

### రాజయక్ష్మమును గలిగించుస్వప్నము.

మహిషశ్వవరాహోష్ట్రగర్దభైః. ౮౧
యః ప్రయాతి దిశం యామ్యాం మరణం తస్య యక్ష్మణా,

ఏమనుజుడు స్వప్నమునందు ఎనుబోతులమీదను కుక్కలపైని పందులమీదను ఒంటెలమీదను గాడిదలమీదను ఎక్కి దక్షిణదిక్కునకు పోవునో ఆమనుజుడు రాజయక్ష్మవ్యాధిచే శీఘ్రముగ మృతినొందును.

### గుల్మరోగమును గలిగించుస్వప్నము.

లతా కణ్టకినీ వంశః తాలో వా హృది జాయతే. ౮౨
యస్య తస్యాశు గుల్మేన

తనహృదయమున ముండ్లతోగూడినతీగెయైనను వెదురైనను తాటిచెట్టైనను పుట్టినట్లు స్వప్నమును గాంచినమనుజుడు గుల్మరోగముచేత శీఘ్రముగ మరణమునొందును.

అష్టాంగసంగ్రహమున నిట్లుచెప్పబడియె:—"యస్య కణ్టకినీలతా వంశస్తాలో వా హృది జాయతే సగుల్మేన, యస్య శిరసి స శిరోరోగేణ వా శిరశ్ఛేదనేనేతి" ఈ వాక్య

ముచేత ముండ్లతీగెయైనను వెదురైనను తాటిచెట్టైనను శిరస్సున బుట్టినట్లు స్వప్నమును గాంచినవాడు శిరోరోగముచేనైనను శిరశ్ఛేదముచేనైనను మృతినొందునని తెలిసెడి.

కుష్ఠమును గలిగించుస్వప్నము.

యస్య వహ్నిమనర్చిషమ్,
జుహ్వతో ఘృతసిక్తస్య నగ్నస్యోరసి జాయతే. ౪౩
పద్మం స నశ్యేత్కుష్ఠేన

మనుజుడు తాను దిగంబరుడై శరీరముపై నెయ్యి బూసికొని మంటలేనియగ్నిలో హోమము జేయుచు తనరొమ్ముపై తామరపువ్వు పుట్టినట్లు స్వప్నమును జూచినవాడు కుష్ఠరోగముచేత శీఘ్రముగ మృతినొందును.

ప్రమేహమును గలిగించుస్వప్నము.

చణ్డాలైస్సహ యః పిబేత్,
స్నేహం బహువిధం స్వప్నే స ప్రమేహేణ నశ్యతి. ౪౪

తాను చండాలురతో గూడి నూనె నెయ్యిమున్నగు ననేకస్నేహద్రవ్యములను తాగినట్లు స్వప్నమును జూచినవాడు ప్రమేహరోగముచేత శీఘ్రముగ మృతినొందును.

ఉన్మాదమును గలిగించుస్వప్నము.

ఉన్మాదేన జలే మజ్జేత్ యో నృత్యన్ రాక్షసైస్సహ,

మనుజుడు రాక్షసులంగూడి నృత్యము చేయుచు నీళ్లలో మునిగినట్లు కలగాంచినచో నున్మాదరోగముచే మృతినొందును.

అపస్మారమును గలిగించుస్వప్నము.

అపస్మారేణ యో మర్త్యో నృత్యన్ ప్రేతేన నీయతే, ౪౫

ప్రేతముతో గూడి నృత్యముజేయుచు నాప్రేతముచే తాను గొనిపోబడినవిధముగ కలగన్నచో నపస్మారరోగముచే మనుజుడు మృతినొందును.

మరణము నొందించుస్వప్నము.

యానం ఖరోష్ట్రమార్జారకపిశార్దూలసూకరైః,
యస్య ప్రేతైస్సృగాలైర్వా స మృత్యోర్వర్తతే ముఖే. ౪౬

గాడిదెలు, ఒంటెలు, పిల్లులు, కోతులు, పెద్దపులులు, పందులు, ప్రేతములు, నక్కలు, అను నీజంతువులపైనెక్కి సవారి చేసినట్లు స్వప్నముగాంచిన నామానవుడు మృత్యువుయొక్క నోట బడియుండునని యెరుంగునది.

### మరియొక మరణసూచకస్వప్నము.

అపూపశష్కులీర్జగ్ధ్వా విబుద్ధస్తద్విధం వమన్,
న జీవతి

అపూపములనైనను చక్కిలములనైనను నమలి తినినట్లు కలగాంచి నిదుర మేల్కొని వానినే వాంతి జేసినయెడ ఆమానవుఁడు జీవింపఁడు.

### నేత్రరోగము గలిగించుస్వప్నము.

అక్షిరోగాయ సూర్యేన్దుగ్రహణేక్షణమ్. ౪౭

స్వప్నమున సూర్యచంద్రుల గ్రహణమును చూచినయెడ నేత్రరోగము సంభవించును.

### నేత్రహాని గలుగుస్వప్నము.

సూర్యాచన్ద్రమసోః పాతదర్శనం దృగ్వినాశనమ్.

సూర్యచంద్రులు ఆకసమునుండి క్రిందపడినవిధముగ స్వప్నము కనఁబడినచో నేత్రములు పోవును.

### అశుభకరములగు కొన్నిస్వప్నములు.

మూర్ధ్ని వంశలతాదీనాం సమ్భవో వయసాం తథా. ౪౮
నీలయో ముణ్డితా కాకగృధ్రాద్యైః పరివారణమ్,
తథా ప్రేతపిశాచస్త్రీద్రవిడాన్ధ్రగవాశనైః. ౪౯
సఙ్గో వేత్రలతావంశతృణకణ్టకసంకటే,
శ్వభ్రశ్మశానశయనం పతనం పాంసుభస్మనోః ౫౦
మజ్జనం జలపఙ్కాదౌ శీఘ్రేణ స్రోతసా హృతిః,
నృత్యవాదిత్రగీతాని రక్తస్రగ్వస్త్రధారణమ్. ౫౧
వయోఽఙ్గవృద్ధిరభ్యఙ్గో వివాహః శ్మశ్రుకర్మ చ.
పక్వాన్నస్నేహమద్యాశః ప్రచ్ఛర్దనవిరేచనే. ౫౨
హిరణ్యలోహయోర్లాభః కలిర్బన్ధపరాజయౌ,
ఉపానద్యుగనాశశ్చ ప్రపాతః పాదచర్మణోః. ౫౩
హర్షో భృశం ప్రకుపితైః పితృభిశ్చావభర్త్సనమ్,
ప్రదీపగ్రహనక్షత్రదన్తదైవతచక్షుషామ్. ౫౪
పతనం వా వినాశో వా భేదనం పర్వతస్య చ,
కాననే రక్తకుసుమే పాపకర్మనివేశనే. ౫౫
చితాన్ధకారసమ్బాధే జనన్యాం చ ప్రవేశనమ్,

పాతః ప్రాసాదశైలాదేః మత్స్యేన గ్రసనం తథా ౫౬
కాషాయిణామసౌమ్యానాం నగ్నానాం దణ్డధారిణామ్,
రక్తాక్షాణాం చ కృష్ణానాం దర్శనం జాతు నేష్యతే. ౫౭

మరియు శిరస్సునందు వెదురు తీగెలు మున్నగునవి మొలచుట, పక్షులుగూండ్లు గట్టుట, తలబోడిచేసికొనుట, కాకులు గ్రద్దలు మున్నగు పక్షులు తనచుట్టును పరివేష్టించుట, ప్రేతములును పిశాచములును స్త్రీలును ద్రవిడులును ఆంధ్రులును గోమాంసమును తినువారును తన్నుచుట్టియుండుట, పేముపొదలు తీగెలు వెదురుపొదలు తృణములు ముండ్లు మున్నగువానియందు చిక్కుబడి బైటవెడలనేరక యుండుట, బొరియలయందును శ్మశానములయందును పడుచుండుట, ధూళియందును భస్మమునందును పడుట, నీళ్లు బురదమున్నగువానియందు దిగబడుట, వేగముగ ప్రవహించు ప్రవాహమున కొట్టుకొని పోవుట, నృత్యవాద్యగీతముల వినుట, ఎఱ్ఱనిపుష్పమాలికలను వస్త్రములను ధరించుట, వయస్సును శరీరావయవంబులును వృద్ధినొందుట అభ్యంగనము జేసికొనుట, పెండ్లిచేసికొనుట, మీసముల దిద్ది ముఖక్షౌరము చేసికొనుట పక్వమైన యన్నమును స్నేహద్రవ్యములను మద్యమును భుజించుట, వాంతిని విరేచనమును జేసికొనుట, బంగరును ఇనుము మొదలగు లోహంబులును దొరకుట, కలహమును బంధనంబును అపజయంబును కలుగుట, చెప్పులు జోడు కనబడకుండుట, పాదంబును చర్మంబును పడిపోవుట, మిక్కిలి సంతోషముకల్గుట, మిక్కిలి కోపగించిన పితృదేవతలచేత బెదరింపబడుట, దీపము గ్రహములు నక్షత్రములు దన్తములు దేవతలు నేత్రములు. ఇవి క్రిందపడుట, లేక అవి నశించుట, పర్వతము బ్రద్దలైపగులుట, ఎఱ్ఱని పువ్వులుకలఅడవియందైనను, పాపకృత్యముల జేయువారియింటియందైనను, శ్మశానమునందైనను, చీకటిచేనిండియుండు ఇంటియందైనను, తనతల్లిగర్భమునందైనను తాను ప్రవేశించుట, మిద్దెలు పర్వతములుమున్నగునున్నతస్థలములనుండి క్రిందపడుట, మత్స్యముచే తాను మ్రింగబడుట, కాషాయవస్త్రముల ధరించినవారిని, మిక్కిలి క్రూరస్వభావము కలవారిని, దిగంబరులను, కట్టెలచేతబట్టినవారిని, కన్నులెఱ్ఱనైనవారిని, నల్లని యాకారము కల్గినవారిని జూచుట పైజెప్పినవియన్నియు స్వప్నమున నొకప్పుడును జూడదగదు. (చూచినచో నపాయమైనను అశుభమైనను సంభవించుననిభావము.)

స్వప్న కాలరూపము, స్వప్నముల సముదితఫలము.

కృష్ణా పాపాననాచారా దీర్ఘకేశనఖస్తనీ,
విరాగమాల్యవసనా స్వప్నకాలనిశా మతా. ౫౮

మనోవహానాం పూర్ణత్వాత్ స్రోతసాం ప్రబలైర్మలైః,
దృశ్యన్తే దారుణాః స్వప్నాః రోగీ యైర్యాతి పఞ్చతామ్. ౪౯
ఆరోగస్సంశయం ప్రాప్య కశ్చిదేవ విముచ్యతే,

స్వప్నకాలమునందలి కాళరాత్రి నల్లనివర్ణముగల్గి పాపకరమైన ముఖంబును ఆచారంబునుకల్గి మిక్కిలి దీర్ఘములైన వెండ్రుకలును గోళ్లును స్తనంబులునుకల్గి రంగులేని పుష్పమాలికలును వస్త్రంబులునుకల్గి చూచుటను భయంకరముగనుండును. మిక్కిలి బలిష్ఠములైన వాతపిత్త కఫములచేత మనోవహములగు స్రోతస్సులు నిండియుండుతరి మిక్కిలి దారుణములైన స్వప్నములు అగపడును. అట్టిస్వప్నములు (పైజెప్పబడినవి) రోగికి అగుపడినయెడ తప్పక మరణముపొందును. రోగములేక స్వస్థతయున్నవానికి కానంబడినచో ప్రాణసంశయమునొంది యెట్టకేలకు నొకానొకడుమాత్రము మరణమునుండి విముక్తుడగును.

## సప్తవిధస్వప్నభేదములు.

దృష్టశ్శ్రుతోఽనుభూతశ్చ ప్రార్థితః కల్పితస్తథా. ౫౦
భావితో దోషజశ్చేతి స్వప్నః సప్తవిధో మతః,

పైజెప్పబడిన స్వప్నము, దృష్టము, శ్రుతము, అనుభూతము, ప్రార్థితము, కల్పితము, భావితము, దోషజమునని యేడువిధముల నుండును.

అందు జాగ్రదవస్థయందు కన్నులతో జూచి సుషుప్తికాలమున తా మున్ను జూచినవస్తువులను జ్ఞానమాత్ర గోచరముగ జూచి యనుభవించుట దృష్టస్వప్నము. జాగ్రదవస్థయందు తాను ప్రత్యక్షముగ కంట జూడకున్నను చెవులచే విన్నవిషయములను సుషుప్తియందు మనః ప్రబోధమునంజేసి చూచుట శ్రుతస్వప్నము. జాగ్రదవస్థయందు తాను అనుభవించిన విషయములను సుషుప్తియందు మరల మనః ప్రబోధముచే మున్ననుభవించినరీతిగ జ్ఞానమాత్రమునే ననుభవించుట అనుభూతస్వప్నము. తానుజాగ్రదవస్థయందు చూచినదానినైనను విన్నదానినైనను అనుభవించినదానినైనను మరల తాననుభవింపవలెనని మనస్సుచే కోరినప్పుడు అయ్యది సుషుప్తియందు జ్ఞానగోచరమై యనుభవమున నుండినచో ప్రార్థితస్వప్నము. జాగ్రదవస్థయందు దృష్ట-శ్రుత-అనుభూత ప్రార్థితములుగాక యుండు విషయములను సుషుప్తియందు మనస్సు ప్రబుద్ధమై తనకల్పనాశక్తిచేత నపూర్వవిషయముల గల్పించియనుభవించుట కల్పితస్వప్నము. దృష్టశ్రుతాది స్వప్నములకంటె విలక్షణమైనస్వప్నము సుషుప్తియందు అనుభవగోచరమైయుండి జాగ్రదవస్థయందు మరల నాస్వప్నమునే మనస్సున భావనచేయ మరలనా

స్వప్నమే గానవచ్చిన నది భావిత స్వప్నము. వాత-పిత్త-కఫరూపదోషములచే తత్తదనుగుణముగననుభవింపఁబడిన స్వప్నము దోషజము. ఇది సప్తవిధస్వప్నములవివరణము.

నిష్ఫలస్వప్నములు.

తేష్వాద్యాః నిష్ఫలా, పంచ యథా స్వప్రకృతిర్ది వా. ౬౧
విస్మృతో దీర్ఘహ్రస్వోఽతి

పైఁజెప్పబడిన యేడువిధములగు స్వప్నములలో దృష్ట - శ్రుత - అనుభూత-ప్రార్థిత-కల్పితస్వప్నములైదును ఫలవంతములు కావు. మరియు వాతాదిప్రకృతికి అనురూపముగ గల్గిన స్వప్నమును, పగటియందు గాన్పించినస్వప్నంబును, మరచిన స్వప్నంబును ఫలమును కలిగింపనోపదు. మరియు మిక్కిలిదీర్ఘంబును మిక్కిలిహ్రస్వంబునునగు స్వప్నము నిష్ఫలము.

శుభశకునమున ఫలమునకు కాలనియమము.

పూర్వరాత్రే చిరాత్ఫలమ్. ౬౨
దృష్టః కరోతి తుచ్ఛం చ గోసర్గేతదహర్మహత్,
నిద్రయా చానుపహతః ప్రతీపైర్వచనైస్తథా,

అర్ధరాత్రికిముందు గాన్పించిన స్వప్నము చిరకాలమునకు ఫలమును జూపును. లేక స్వల్పముగ ఫలము నిచ్చును. పశువులను మేతకు విడచు (ప్రభాత) సమయమున గన్పించిన స్వప్నము నాటిదినమే గొప్పఫలమును కల్గించును. అట్టి స్వప్నమును గాంచి మేల్కొని మరల నిదురబోవకుండి ప్రతికూలములగు మాటలచే ప్రతిహతము గాకుండిన శీఘ్రఫలము నిచ్చును.

దుస్స్వప్నములశాన్తి.

యాతి పాపోఽల్పఫలతాం దానహోమజపాదిభిః. ౬౪
అకల్యాణమపి స్వప్నం దృష్ట్వా తత్రైవ యః పునః,
పశ్యేత్సౌమ్యం శుభం తస్య శుభమేవ ఫలం భవేత్. ౬౫

మరియు దుష్టమైన స్వప్నమును గాంచినను దానములచేతను హోమములచేతను జపము మున్నగువానిచేతను శాంతపడి క్రూరమైన పూర్ణఫలము నియ్యక స్వల్పముగ ఫలమునుజూపును. మరియు దుష్టమైనఫలమునుగాంచి మేల్కొని మరల నచ్చటనే పరుండి శుభసూచకమగు స్వప్నమునుగాంచిన దుస్స్వప్నఫలము పోయి శుభఫలముమాత్రము కల్గును. ఇటులనే తొలుత శుభస్వప్నముగాంచి మేల్కొని మరల నచ్చటనే క్రూరస్వప్నమును గాంచిన దుష్టఫలముమాత్రము కల్గునేగాని శుభఫలము కలుగబోదు.

సౌమ్యములగుస్వప్నములు.

దేవాన్ ద్విజాన్ గోవృషభాన్ జీవతస్సుహృదో నృపాన్,

సాధూన్ యశస్వినో వహ్నిమిద్ధం స్వచ్ఛాన్ జలాశయాన్. ౬౬
కన్యాన్ కుమారకాన్ గౌరాన్ శుక్లవస్త్రాన్ సుతేజసః,
నరాఽశనం దీప్తతనుం సమన్తాద్రుధిరోక్షితః. ౬౭
యః పశ్యేల్లభతే యో వా ఛత్రాదర్శవిషాఽఽమిషమ్,
శుక్లాస్సుమనసో వస్త్ర మమేధ్యాలేపనం ఫలమ్. ౬౮
శైలప్రాసాదసఫలవృక్షసింహనరద్విపాన్,
ఆరోహేద్గోఽశ్వయానం చ తరేన్నదహ్రదోదధీన్. ౬౯
పూర్వోత్తరేణ గమనం అగమ్యాగమనం మృతమ్,
సంబాధాన్నిస్సృతిర్దేవైః పితృభిశ్చాఽభినన్దనమ్. ౭౦
రోదనం పతితోత్థానం ద్విషతాం చాఽవమర్దనమ్,
యస్య స్యాదాయురారోగ్యం విత్తం బహు చ సోఽశ్నుతే ౭౧

మనుజుడు స్వప్నమున ఇంద్రాదిదేవతలను, బ్రాహ్మణులను, గోవులను, వృషభములను, ప్రతికియుండు తన స్నేహితులను, ప్రభువులను, సాధువులను, కీర్తిమంతులను, జ్వలించుచుండు అగ్నిని, స్వచ్ఛములైన జలముచేనిండిన తటాకాదులను, కన్యకలను, కుమారుల (బాలుర)ను, గౌరవర్ణము కలవారిని, తెల్లని వస్త్రములధరించి మంచి తేజస్సుకలవారిని, వీనిని చూచినను, తాను రక్తమును శరీరమునందెల్ల పూసికొని మిక్కిలి కాంతియుక్తమైన సింహమును స్వప్నమున జూచినను, ఆయువును ఆరోగ్యమును అమితమైనధనమును పొందగలడు.

మరియు గొడుగును, అద్దమును, విషమును, మాంసమును, తెల్లనిపువ్వులను, తెల్లనివస్త్రమును, అమేధ్యమును, చందనము మున్నగు నాలేపనములను, ఫలమును, వీనిని ఎవడు స్వప్నమున పొందునో వాడు ఆయురారోగ్యసంపత్తులనొందును.

మరియు పర్వతములను, మేడలను, ఫలములతోగూడిన వృక్షములను, సింహములను,మనుజుని, ఏనుగును, వీనిని స్వప్నమున తాను ఎక్కినట్లు గాంచిన ఆయురారోగ్యసంపత్తుల నొందును.వృషభముపైన గుఱ్ఱముపైన సవారిచేసినట్లు స్వప్నమైనను మంచిది. మరియు నదులను, బావులను, సముద్రమును స్వప్నమున దాటినను మంచిది.

మరియు తూర్పుదిక్కునకైనను ఉత్తరదిక్కునకైనను పోయినట్లును, పొందదగని స్త్రీనిపొందినట్లును, చచ్చిన శవమును జూచినట్లును, మిక్కిలి కష్టములనుండి తొలగినట్లును, దేవతలచేతను పితృదేవతలచేతను గౌరవమునొందినట్లును, ఏడ్చినట్లును

క్రిందపడి లేచినట్లును, శత్రువుల మర్దించినట్లును స్వప్నమును గాంచిన ఆయువును ఆరోగ్యమును ధనమును బొందును.

## ఆరోగ్యలక్షణము.

మఙ్గళాచారసమ్పన్నః పరివారస్తథాతురః,
శ్రద్ధధానోఽనుకూలశ్చ ప్రభూతద్రవ్యసంగ్రహః. ౭౨
సత్వలక్షణసంయోగః భక్తిర్వైద్యద్విజాతిషు,
చికిత్సాయామనిర్వేదః తదారోగ్యస్య లక్షణమ్. ౭౩

"ప్రశస్తాచరణం నిత్యమప్రశస్తవిసర్జనమ్, ఏతద్ధిమఙ్గళం ప్రోక్తం ఋషిభిస్తత్వదర్శిభిః" అను వచనము ననుసరించి శాస్త్రవిహితములగు పనులజేయుటయు, శాస్త్రనిషిద్ధములగు వాని విసర్జించుటయు మంగళమని తత్త్వజ్ఞానులగు మునిపుంగవులు చెప్పిరి. అట్టిమంగళములైన యాచారములుకల పరిజనముండుటయు, రోగి తనకు చేయుచున్న చికిత్సచే తన వ్యాధి నివర్తించునను నమ్మకముకల్గి అనుకూలులగు పరిజనములగూడి ద్రవ్యోపపత్తి సమృద్ధిగగల్గి సత్వగుణమునకుజెప్పిన లక్షణములుకల్గి వైద్యునియందును బ్రాహ్మణులు మున్నగువారియందును కపటము లేని భక్తికల్గి, చికిత్సయందు పూర్ణమైన యుత్సాహము కల్గియుండుటయు ఆరోగ్యమునకు ముఖ్యమైనలక్షణము.

## శారీరస్థానము అనుటకు కారణము.

ఇత్యత్ర జన్మమరణం యతస్సమ్యగుదాహృతమ్,
శరీరస్య తతస్స్థానం శారీరమిదముచ్యతే. ౭౪

ఇతి శ్రీవైద్యపతిసింహగుప్తసూనోః వాగ్భటస్య కృతౌ
అష్టాఙ్గహృదయసంహితాయాం శారీరస్థానం
సమాప్తమధ్యాయశ్చ షష్ఠః.

---

పైజెప్పబడిన ఆరధ్యాయములచే నీ శారీరస్థానమున శరీరమునకు సంబంధించిన జననక్రమంబును, మరణమును సూచించు రిష్టాదిలక్షణంబులును, విపులముగ జెప్పంబడియె; కావున నీయది శారీర (శరీరమునకు సంబంధించిన) స్థానము (ప్రకరణము) అని చెప్పబడును.

ఆయుర్వేదమంతయు శరీరమునకు సంబంధించిన విషయమునే బోధించును; అయినను ఈస్థానమున శరీరముయొక్క పుట్టుక మున్నగునవి విపులముగ జెప్పబడినది. కావున విషయప్రాధాన్యమును బట్టి శారీరస్థానమని చెప్పబడునని భావము.

ఇతి విశ్వనాథరచితా వ్యాఖ్యా హ్యష్టాఙ్గహృదయస్య,
అష్టాఙ్గచన్ద్రికాఖ్యా జీయాదాచన్ద్రతారకం చాన్ధ్రీ.

ఇతి శ్రీశ్రీ శ్రీకాళహస్తిసంస్థానాధిపాస్థానవిద్వద్వరేణ్యులును సర్వతన్త్రస్వతంత్రులునగు బ్రహ్మశ్రీ కుంభకోణము లక్ష్మీనృసింహశాస్త్రుల వారిచరణకమల సంసేవా సమాసాదిత పాణినీయాదిశాస్త్రవిజ్ఞానసముల్లసితుఁడును, చెన్నపురి ఆయుర్వేదాశ్రమమునందాస్థానవిద్వాంసుఁడుగ నున్నవాఁడును, కౌణ్డిన్యగోత్రవిరాజమాన నుదురుపాటి వంశపయఃపారావారసుధాకరుండను, బ్రహ్మశ్రీ అగ్నిచిత్ సీతారామవాజపేయయాజి సీతాంబాసోమపీథినీనూభవుండునగు వైయాకరణవిద్వాన్ బ్రహ్మశ్రీ పండిత విశ్వనాథశాస్త్రిచే విరచితంబగు అష్టాఙ్గహృదయసంహితాంధ్రవ్యాఖ్యానమున శారీరస్థానము సమాప్తము.

శ్రీరస్తు

# అష్టాంగహృదయము.

## సాంధ్రతాత్పర్యము.

# నిదానస్థానము.

## ప్రథమాధ్యాయము.

అవ: శారీరస్థానమును జెప్పినపిదప నిదానస్థానము చెప్పబడును: ఏలయన:— ఆయుర్వేదమున హేతుస్కంధము, లక్షణస్కంధము, ఔషధస్కంధమునని మూడు భాగములు చేరియుండును. ఇవి సూచనామాత్రముగా సూత్రస్థానమున జెప్పబడియె. పిదపవ్యాధులకును, వాని నివర్తింపజేయుటకై తగిన చికిత్స జేయుటకును ఆధారమైనశరీర విభాగములదెలుపు శారీరస్థానము చెప్పబడినది. పిమ్మట ఔషధముల వివరముగ జెప్పుట యావశ్యకమైనను రోగమియ్యదియని నిర్ణయింపక ఔషధమునుపయోగింపవలను పడదు. కావున ఔషధములజెప్పుటకు ముందు వ్యాధిలక్షణములదెలుపు నిదానస్థానము చెప్పబడును. ఈవిషయమును "రోగమాదౌపరీక్షేత తతోఽనన్తర మౌషధమ్" అనువాక్యముచే చరకమున చెప్పియున్నది. అందును నిదానము, పూర్వరూపము, రూపము, ఉపశయము, సంప్రాప్తియునను ఐదులక్షణములును జ్వరాదిరోగముల కన్నిటికిని సమానములైయుండును. కావున అట్టి (పంచ) లక్షణముల దెలుపునట్టి సర్వరోగనిదానమను నధ్యాయము తొలుదొలుత జెప్పబడును.

సూ. అథాతస్సర్వరోగనిదానం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

శరీరవిభాగముల వివరించు శారీరస్థానమును జెప్పినపిదప, పరమప్రాచీనులగు ఆత్రేయాది మహర్షులుచెప్పిన పద్ధతులను ప్రమాణములుగజేసి వారిమతములననుసరించి, సర్వరోగ నిదానమును (జ్వరాదిరోగము లన్నింటియందును సామాన్యముగ గల్గునిదానమును) విశదముగ జెప్పెదను.

ఈ తంత్రకారుడగు వాగ్భటాచార్యుడు అధ్యాయముల యారంభమునందు అథ శబ్దమును మంగళార్థమై చెప్పుచు పైవిషయమునకును చెప్పబోవు విషయమునకును పౌర్వాపర్య సంబంధమునుకూడ సూచించుటకై యథశబ్దమును ప్రయోగించును. ఈ విషయమును అధ్యాయము లన్నిటియందును గమనించునది. "ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ, బ్రహ్మణః పురా, కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగలికావుభౌ" అను వాక్యముచేత మహాభాష్యమున అథశబ్దము మంగళవాచకమని చెప్పబడినది.

ఇతిశబ్దము యథా అను నర్థమునఁ జెప్పఁబడినది. ఆత్రేయుండు మున్నగుమునిపుంగవులు ఎట్లు చెప్పిరో ఆపద్ధతి నతిక్రమింపక చెప్పెదననియర్థము. ఇట్లు చెప్పుటచేత తాఁ జెప్పఁదలంచిన విషయములన్నియు పురాతన ప్రమాణముల ననుసరించి యుండునుగాని స్వకపోలకల్పిత మొకింతయైన నుండదనిభావము.

### రోగ పర్యాయనామములు.

రోగః పాప్మా జ్వరో వ్యాధిర్వికారో దుఃఖమామయః,
యక్ష్మాతఙ్కగదాబాధశబ్దాః పర్యాయవాచినః ౧

రోగము, పాప్మ, జ్వరము, వ్యాధి, వికారము, దుఃఖము, ఆమయము, యక్ష్మము, ఆతంకము, గదము, ఆబాధము, అనుపేరులు రోగసామాన్యమునకు పర్యాయవాచకములు. (ఈశాస్త్రమునం దెచ్చటనైన పైఁజెప్పఁబడిన శబ్దములలో నేదైననొకటి యున్నచో రోగసామాన్యమని యర్థమును జేయవలెనని భావము.

పైఁగనబరిచిన శబ్దములకు అర్థము వేరువేరుగ నుండినను ఏవిధముననైన శరీరమునకును మనస్సుకును బాధఁగల్గించి కష్టముఁ గల్గించునది యను నర్థము అన్నిపదములకును సంగమై యుండును. కావున ఈశబ్దములచే మనశ్శరీరములకు కష్టమును కల్గించువ్యాధి బోధింపఁబడునని యెఱుంగునది.

### వ్యాధి నెఱుంగ నుపాయములు.

నిదానం పూర్వరూపాణి రూపాణ్యుపశయస్తథా,
సంప్రాప్తిశ్చేతి విజ్ఞానం రోగాణాం పఞ్చధా స్మృతమ్. ౨

నిదానము, పూర్వరూపము, రూపము, ఉపశయము, సంప్రాప్తియు ననునైదును రోగములస్వరూపలక్షణాదుల దెలుపు నుపాయములని ప్రాచీన మునిపుంగవులచే జెప్పఁబడెను.

పైఁజెప్పఁబడిన నిదానాదులైదిటిచేనైనను కొన్నింటిచేనైనను రోగమియ్యదియని గుర్తింపఁదగియుండునని యెఱుంగునది. పాఠక్రమము చేతనే నిదానాదు లైదని సంఖ్య తెలియుచున్నను, రోగములఁదెలిసికొన నుపాయము లీయైదుదక్క వేరొండుపాయము ఆరవది లేదని నియమము దెలియుటకై 'పంచధా' అని మరల సంఖ్యానిర్దేశింపఁబడినది.

నిదానమన:—జ్వరాది రోగములకు మిథ్యాహార విహారాదులు, పూర్వరూపములన.—రాఁబోవు జ్వరాదిరోగములను సూచించుశ్రమము, అరతి, వివర్ణత్వము మున్నగునవి. జ్వరాదిరోగములకు జెప్పఁబడుచుండులక్షణములు వాతాదిదోష సంబంధమును దెలుపకయే సూక్ష్మముగ గానవచ్చిన నయ్యది రూపము. వ్యాధులకు కారణములైన వాతాది దోషములకైనను, జ్వరాదిరోగములకైనను ఆరెండిటికైనను విరుద్ధగుణములగు

ఔషధములైనను అన్నములనైనను విహారములనైన సేవించుటచే గల్గు వ్యాధిశమనము ఉపశయము. మిథ్యాహారవిహారాదులచేత దోషములు ప్రకోపమునొంది శరీరమున వ్యాపించి రోగముల గల్గించుక్రమముసంప్రాప్తి. ఇవియే నిదానాదులకు సంగ్రహలక్షణములు. ఇవి యీక్రింద విపులముగ జెప్పబడును.

పైజెప్పబడిన యైదింటిలో నిదానమనునది సన్నికృష్టము, విప్రకృష్టమునని రెండుతెరంగులు. అందు రోగములకు సమీపించిన కారణము సన్నికృష్టము. అయ్యది జ్వరాదిరోగములకు ప్రకోపమునొందిన వాతాదిదోషములు. అట్టిదోషములను ప్రకోపింపజేయు అపథ్యభోజనము. విహారములుమున్నగునవి విప్రకృష్టకారణములు. వ్యాధులకన్నిటికిని ఆయా నిదానములకు భేదముల నిట్లూహించునది.

### నిదానలక్షణము, పర్యాయనామములు.

నిమిత్తహేత్వాయతనప్రత్యయోత్థానకారణైః,
నిదానమాహుః పర్యాయైః

(ఏరోగమునకైనను మొట్టమొదట పుట్టుట కేదికారణమగునో అయ్యది ఆరోగమునకు నిదానమనబడును.) ఆనిదానము, నిమిత్తము, హేతువు, ఆయతనము, ప్రత్యయము, ఉత్థానము, కారణమునను నామభేదములచే నీశాస్త్రమున పిలువంబడును.

లోకమున బుద్ధి, ధీ, జ్ఞానము మున్నగు పర్యాయపదములచే నెట్లు బుద్ధియను పదార్థము నెరుంగుదుమో ఆరీతిగ నిమిత్తాదిశబ్దము లారిటిచేతను నిదానమను నర్థము నెరుంగదగునని భావము.

### పూర్వరూపము.

ప్రాగ్రూపం యేన లక్ష్యతే. 3
ఉత్పిత్సురామయో దోషవిశేషేణానధిష్ఠితః,

అపథ్యాహారాదులచే వ్యాధి వ్యాపింప సిద్ధముగనున్నపుడు దోషములకు సంబంధించిన లక్షణములుమాత్రము స్ఫుటముగ గానరాక వ్యాధిలక్షణములుమాత్రము సూక్ష్మముగ గనబడుచున్న నయ్యది ఆవ్యాధికి పూర్వరూపమని యెరుంగునది.

(వాతాదిదోషలక్షణములు స్ఫుటముగ గాన్పించక జ్వరాదిరోగములకు జెప్పిన లక్షణములుమాత్రము మిక్కిలి సూక్ష్మముగ గనబడిన నయ్యది పూర్వరూపమని భావము.)

అట్టి సూక్ష్మములగు వ్యాధిలక్షణముల గమనించి రామన్నవ్యాధి యియ్యదియని నిశ్చయించి, అట్టి పూర్వరూపావస్థయందే చికిత్స జేసినచో ప్రారంభదశయందుండు

వ్యాధి కేవలము స్వల్పప్రయత్నముచేతనే నివర్తింపదగియుండును. కావున అట్టిదాని సౌలభ్యమునకై పూర్వరూపము నెరయుట ముఖ్యము.

"సర్వేషామేవ రోగాణాం నిదానం కుపితా మలాః" అని చెప్పియుండుటచేత వాతాదిదోష సంబంధములేక వ్యాధి సంభవించుట యసంభవము; కావున "దోషవిశేషేణానధిష్ఠితః" అని చెప్పుట యసంగతమగునని కొందరందురు; కాని స్ఫుటముగ దోషలక్షణములు గానరాక సూక్ష్మములుగనుండు (ప్రారంభదశనుండు) వ్యాధిని దెల్పునది పూర్వరూపమని యర్థము చేయుట సమంజసము.

మరి యిట్టి పూర్వరూపము సామాన్యమనియు, విశేషమనియు రెండువిధములు. దోషలక్షణములు గానరాక దోషప్రకోపమునకు మునుపుకలుగు శ్రమము, అరతి, వివర్ణతయున్నగునది జ్వరమునకు సామాన్యపూర్వరూపము. పిత్తముచే కండ్లుమంట, కఫముచే నరోచకము, మున్నగు దోషలక్షణములు సూక్ష్మముగనున్నచో నయ్యది విశేష పూర్వరూప లక్షణము. ఇత్తెరంగుననే తక్కిన వ్యాధులకు నూహించునది.

పూర్వరూపవివరణము.

లిఙ్గమవ్యక్తమల్పత్వాద్వ్యాధీనాం తదయథాయథమ్. ౪

పైజెప్పబడిన పూర్వరూపము ఆయా వ్యాధులు ప్రారంభదశయందుండుటంజేసి వానికి జెప్పనలక్షణములే సూక్ష్మరూపముగనుండును. (ప్రారంభదశయందే మిక్కిలి సూక్ష్మముగ గానవచ్చిన ఆయావ్యాధిలక్షణములే పూర్వరూపమని భావము.)

రూపము.

తదేవ వ్యక్తతాం యాతం రూపమిత్యభిధీయతే,

పైజెప్పబడిన పూర్వరూపమే వాతాదులకు జెప్పనలక్షణములు స్ఫుటముగగలిగి స్పష్టముగ గానవచ్చినచో నదియే రూపమని చెప్పబడును.

(ఆయావ్యాధులయందుగలుగు వాతాదిలక్షణములు సూక్ష్మములుగ నున్నచో పూర్వరూపమనియు, అయ్యవి వ్యక్తములుగ గనబడినచో రూపమనియు నీరెండిటికిని లక్షణభేదము తెలుసుకొనది.)

రూపపర్యాయనామములు.

సంస్థానం వ్యఞ్జనం లిఙ్గం లక్షణం చిహ్నమాకృతిః ౫

సంస్థానము, వ్యంజనము, లింగము, లక్షణము, చిహ్నము, ఆకృతి, అను నీపర్యాయపదములచేత నీశాస్త్రమునందు రూపము చెప్పబడును.

పైజెప్పిన యీరుపర్యాయపదములను పూర్వరూపమునకు గూడ జేర్చునది. ఎట్లనగా:— పూర్వసంస్థానము, పూర్వవ్యంజనము, పూర్వలింగము, పూర్వలక్షణము,

పూర్వచిహ్నము, పూర్వాకృతి యనుపదములచే గూడ పూర్వరూపము చెప్పనగునని భావము.

## ఉపశయము.

హేతువ్యాధివిపర్యస్తవిపర్యస్తార్థకారిణామ్,
ఔషధాన్నవిహారాణాముపయోగం సుఖావహమ్. ౮
విద్యాదుపశయం వ్యాధేస్సహి సాత్మ్యమితి స్మృతః,

జ్వరాదిరోగముల గలిగించుటకు సమర్థములైన కారణములకైనను, రోగములకైనను, హేతువ్యాధుల రెండిటికైనను విరుద్ధంబులును, పైజెప్పిన హేతువులకైనను వ్యాధులకైనను హేతువ్యాధుల రెండిటికైనను విరుద్ధములు గాకున్నను వ్యాధిశమనరూపమైన (హేతువ్యాధులకు విరుద్ధమయిన) ప్రయోజనమును గలిగించునవియునై శరీరమునకు (వ్యాధిశమనరూపమైన) సుఖమును గలిగించు ఔషధములనైనను, ఆహారపదార్థములనైనను, శరీరపరిశ్రమమునైనను ఉపయోగించుట ఉపశయమనంబడును. అట్టి యుపయోగమే వ్యాధికి సాత్మ్యమనియు మునివరులచే నిర్ణయింపబడెను.

(హేతువునకు విరుద్ధములగు నౌషధాన్నవిహారముల నుపయోగించుటయు, వ్యాధులకు విరుద్ధములైన యౌషధాదుల నుపయోగించుటయు, హేతువ్యాధుల రెండిటికిని విరుద్ధములగు నౌషధాదుల నుపయోగించుటయు ఉపశయమనంబడును. మరియు హేతువునకైనను రోగమునకైన రెండిటికైనను విరుద్ధములుగా (గుణాదులచేత) గనబడకున్నను, హేతువునకైనను వ్యాధికైనను, రెండిటికైనను విరుద్ధమైన (వ్యాధిశమనరూప) ఫలమును గల్గించు నౌషధములనైనను, ఆహారపదార్థములనైనను, శరీరవ్యాయామమునైనను ఉపయోగించుటయు నుపశయమనంబరగు. అట్టియుపయోగముచే శరీరమునకు రోగనివృత్తి రూపమైన సుఖము కలుగవలెను. దీనినే వ్యాధిసాత్మ్యమనియు మునివరులు వచించెదరని భావము.)

అట్టియుపయోగము హేతువునకు విరుద్ధముగనున్నచో హేతువిపరీతమనియు, వ్యాధికి విరుద్ధముగనున్నచో వ్యాధివిపరీతమనియు, ఈరెండిటికిని విరుద్ధముగనున్నచో హేతువ్యాధివిపరీతమనియు మూడు తెరంగులు. మరియు హేతువునకువిరుద్ధము గాకున్నను హేతువునకు విరుద్ధమైన (రోగానుత్పత్తిరూప) ప్రయోజనమును గల్గించు ఔషధాదులనుపయోగించుట హేతువిపరీతార్థకారి యనియు, వ్యాధికనుగుణమైనను వ్యాధినివృత్తిరూపవిరుద్ధఫలమును గల్గించునౌషధాదులయుపయోగము వ్యాధివిపరీతార్థకారి యనియు, హేతువ్యాధులరెండిటికి ననుగుణములైనను ఆరెండిటికిని విరుద్ధములగు

ఫలమును గలిగించు నౌషధాన్నవిహారముల యుపయోగము హేతువ్యాధి విపరీతార్థకరంబనియు మూఁడువిధములు. ఇవియన్నియు గలిసి.

హేతువిపరీతార్థకరములు:—పిత్తము ప్రధానముగనుండి జనించిన వ్రణశోఫయందు పాకావస్థనున్నపుడు పిత్తమున కనుగుణమైన ఉష్ణవీర్యద్రవ్యముల జేర్చి కట్టుగట్టుట హేతువిపరీతార్థకరౌషధము. పిత్తవ్రణమునందు విదాహకరములైన యన్నాదులు హేతువిపరీతార్థ కరాహారములు. వాతమునగల్గిన యున్మాదమున వాతమును వృద్ధినొందించు భయమునుజూపుట హేతువిపరీతార్థకరమగు విహారము. (ఇచ్చట పిత్తమునగలిగిన వ్రణాదులయందు పిత్తమును వృద్ధినొందించు ఔషధాన్నవిహారములు పిత్తశమనరూపమైన పిత్తవిరుద్ధకార్యమును కలిగించుటంజేసి హేతువిపరీతార్థకరములని యెరుంగునది.

వ్యాధివిపరీతార్థకరములు:—వమనములగునపుడు వమనకరములగు మంగకాయ మున్నగువాని నుపయోగించుట వ్యాధివిపరీతార్థకరౌషధము. విరేచనములగునపుడు పాలనుపయోగించుట వ్యాధివిపరీతార్థకరాహారము. వమనము లగునపుడు జీర్ణము కాని యాహారమును బైటవెడలించుటకై వ్రేళ్లచే వెల్లగించి వమనమును జేసికొనుట వ్యాధివిపరీతార్థకరవిహారము.

హేతువ్యాధులకు విపరీతార్థములు:—నిప్పున కాలినవ్రణమున నుష్ణగుణప్రధానములగు అగరు మున్నగువానిబూయుట హేతువ్యాధులకు విపరీతార్థకరములగునౌషధములు. (ఇచ్చట అగరు ఉష్ణగుణము ప్రధానమైనది. ఇయ్యది వ్రణమునకు హేతువైన నిప్పునకును, దానగల్గినవ్రణమునకును అనుగుణమైనను విరుద్ధముగ వ్రణమునుమాంచును. కావున హేతువ్యాధి విపరీతార్థకరము.) విషమునకు విషము నుపయోగించుటయు హేతువ్యాధి విపరీతార్థ కరము. మద్యపానమునకలిగిన మదాత్యయమున మద్యము ద్రాగుట హేతువ్యాధి విపరీతార్థకరాహారము. నీటియందీదుటచేగలిగిన నష్టువాతమున నీటియందు మరలనీదుట హేతువ్యాధులకు విపరీతార్థకరవిహారము. ఇత్తెరంగున వ్యాధులన్నిటియందును హేత్వాది విపరీతములును విపరీతార్థ కరంబులునునగు నౌషధాన్నవిహారముల నూహించునది.

హేతువిపరీతము, వ్యాధివిపరీతము, హేతువ్యాధివిపరీతము, హేతువిపరీతార్థకారి, వ్యాధివిపరీతార్థకారి, హేతువ్యాధివిపరీతార్థకారియునని ఉపశయము ఆరు తెరంగులనుండునని ఫలితార్థము.

అందు ఔషధము కరకకాయమున్నగునవి. ఆహారపదార్థములు ఎఱ్ఱవది వడ్లు మున్నగునవి. వాక్కుచేతను శరీరముచేతను మనస్సుచేతను చేయబడిన చేష్టావిశేషములు

వ్యాయామము. (అయ్యది కుస్తీ, స్త్రీసంగమము, నిదురమేల్కాంచుట, చదువుట, సంగీతము పాడుట, మాటలాడుట, మనసున ధ్యానముచేయుట మున్నగునవి.)

పైజెప్పిన హేతువిపరీతాది ఔషధాన్నవిహారముల కుదాహరణము లీక్రింద జెప్పబడువిధముగ నెరుంగునది.

హేతువిపరీతములు:—కఫముచేగలిగిన జ్వరాదిరోగములయందు శీతకఫములకు విరుద్ధముగ నుష్ణగుణముగలశుంఠి మున్నగునవి హేతువిపరీతౌషధములు. శ్రమముచేగలిగిన జ్వరమునందు శ్రమహరంబైన మాంసరసముతోగూడినయన్నము హేతువిపరీతాన్నము. పగలు నిదురించుటచే గలిగినవ్యాధియందు రాత్రివేళ నిదురమేల్కాంచుటయు, రాత్రిపూట నిదురలేకుండుటచే గలిగిన రోగమునందు పగటివేళ నిదురించుటయు హేతువిపరీతవిహారము.

వ్యాధివిపరీతములు:—అతిసారవ్యాధికి బంధనరూపప్రభావముకల చిరుబొద్దియు, విషమునకు విషహారమగు దిరిసనంబును, కుష్ఠవ్యాధికి కుష్ఠములహరించు ప్రభావముకలచంద్రయు వ్యాధికివిపరీతములైన యౌషధములు.(పైజెప్పినవి మూడునునయందలి వ్యాధిహరప్రభావముచేత దోషముల దిరస్కరించి వ్యాధిని హరింపజేయును). అతిసారమున స్తంభనకరములగు చిరుసెనగలు మున్నగునవి వ్యాధివిపరీతాన్నము. ఉదావర్తవ్యాధియందు వాతమును అధోముఖముగ వెడలింపజేయుటకై ముక్కుట వ్యాధివిపరీతవిహారములు.

హేతువ్యాధులకు రెంటికి విపరీతములు:—వాతప్రకోపమునగలిగిన శోఫరోగమున వాతమును శోఫను రెంటి విహరించుగుణములుకల దశమూలములు హేతువ్యాధుల రెంటికిని విపరీతమైన యౌషధము. వాతకఫములచే సంభవించిన గ్రహణీరోగమునందు మజ్జిగనుపయోగించుట హేతువ్యాధుల రెంటికిని విపరీతమగు నాహారము. స్నిగ్ధపదార్థములచేతను పగలు నిదురించుటచేతను కలిగిన తంద్రయందు రాత్రిపూట నిదురమేల్కాంచియుండుట హేతువ్యాధుల రెండిటికిని విపరీతమైన విహారము.

## అనుపశయము.

విపరీతోఽనుపశయో వ్యాధ్యసాత్మ్యాభిసంజ్ఞితః. 2

పై జెప్పబడినలక్షణమునకు విరుద్ధముగ శరీరమున వ్యాధినివృద్ధినొందించి సుఖమునకు బదులు కష్టమును గలిగించునెడ అట్టి యౌషధాన్నవిహారముల యుపయోగము అనుపశయమనియు, వ్యాధికి అయ్యది యసాత్మ్యమనియుం జెప్పనగును.

ఇచ్చట నీవిషయము సెరుంగునది:—ఏవైననొకవ్యాధినిదానప్రాగ్రూపరూపము లచేదెలియ వలనుపడక, అవ్యాధిలక్షణములు మిక్కిలిగూఢములై యున్నపుడు వ్యాధి స్వరూపమును నిశ్చయించుటకై యుపశయానుపశయములుసాహాయ్యమొనర్చును. ఎట్టు లనః:—జ్వరముయొక్క లక్షణములు పూర్తిగ గమనింప వలనుపడనియప్పుడు, అట్టి జ్వరమునకువిరుద్ధములగుపర్పాటకముమున్నగు నౌషధాదుల నుపయోగించినపుడు రోగము శాంతినొందినచో నయ్యది జ్వరమని నిర్ణయించునది. ఇది యుపశయము. ఆయౌషధా దులనుపయోగించుటచే వ్యాధివృద్ధినొందెనేని అయ్యది అనుపశయమనియు నిశ్చయించు నది. ఈవిషయమునే చరకాచార్యులు "గూఢలిఙ్గం వ్యాధిం ఉపశయానుపశయాభ్యాం పరీక్షేత" అనువాక్యముచే శాసించిరి.

## సంప్రాప్తి.

యథా దుష్టేన దోషేణ యథా చానువిసర్పతా,
నిర్వృత్తిరామయస్యాసౌ సంప్రాప్తిర్జాతిరాగతిః. ౮

జ్వరాదిరోగములకు ఆయాప్రకరణమున జెప్పిన మిథ్యాహార విహారాదులచే ప్రకోపమునొంది, ఆయాదోషమునకు జెప్పిన ఆమాశయాది స్థానములవ్యాపించుచున్న వాతాదిదోషములచేత, ఆయారోగమునకు జెప్పినలక్షణములన్నియు సంపూర్ణముగ వ్యాపించు క్రమమునకు సంప్రాప్తియనిపేరు. ఇదియే జాతి. ఆగతి యనునామభేదము లచేగూడ జెప్పబడును.

సంప్రాప్తి లక్షణము నిట్లు గమనించునది:—మిథ్యాహారవిహారములచేత వాతాది దోషములు ప్రకోపమునొంది యామాశయమునజేరి కాయాగ్నిని బైటవెడలించును. అయ్యది శరీరమున వ్యాపించుటచే శరీరమెల్ల వేడికల్గియుండును. రోమరంధ్రము లన్నియు నడ్డగింపబడుటచే శరీరమున చెమ్మటపట్టదు. మలమూత్రాదులును సరళముగ వెడలదు. అవయవములన్నియు నొప్పికల్గియుండును. ఈలక్షణములన్నియు సమకాల మున నేరోగమునకల్గునో అయ్యది జ్వరము. ఇదియె జ్వరసంపూర్ణలక్షణము. ఇచ్చట వాతాదులు దుష్టములై ఆమాశయమున తొలుత వ్యాపించి కాయాగ్నిని బైటవెడ లించినప్పుడు పైజెప్పిన స్వేదావరోధాదులతో శరీరమునందెల్ల పైభాగమున వేడి వ్యాపించిన నదియే జ్వరమునకు సంప్రాప్తియగును. ఈరీతిగనే తక్కినరోగముల కన్నిటి కిని సంప్రాప్తి నూహించునది.

## సంప్రాప్తిభేదములు.

సంఖ్యావికల్పప్రాధాన్యబలకాలవిశేషతః,
సా భిద్యతే యథాత్రైవ వక్ష్యన్తేఽష్టౌ జ్వరా ఇతి. ౯

సంఖ్య, వికల్పము, ప్రాధాన్యము, బలము, కాలము, అనునీయైదిటియొక్క విశేషలక్షణములచే నీ సంప్రాప్తి పలుతెరంగుల మారుచుండును. అందు సంఖ్యాభేదము జ్వరప్రకరణమున "అష్టౌ జ్వరాః" అను వాక్యముచే జ్వరమెనిమిది విధములని చెప్పబడినది.

ఇత్తెరంగుననే 'పంచకాసాః' 'పంచశ్వాసాః' 'అష్టౌ గుల్మాః' ఇవి మున్నగు సంఖ్యాభేదములను ఆయా ప్రకరణమున నూహించునది.

## వికల్పము.

**దోషాణాం సమవేతానాం వికల్పోఽంశాంశకల్పనా,**

ఏదైన నొకరోగమునందు వాతపిత్తకఫ లక్షణములు మూడును సంకరముగ జేరియుండునెడ, అట్టిలక్షణములయొక్క తారతమ్యమును గల్పించుటయే వికల్పము. అట్టితారతమ్యమునుబట్టి రోగముయొక్క సంప్రాప్తియు మారుచుండును.

## ప్రాధాన్యము.

**స్వాతన్త్ర్యపారతన్త్ర్యాభ్యాం వ్యాధేః ప్రాధాన్యమాదిశేత్. ౧౦**

వ్యాధియొక్క స్వతంత్ర పరతంత్ర భేదములచే ప్రధానత్వమును నిర్ణయించునది.

జ్వరాదిరోగములలో నేదైనను ఆవ్యాధికి జెప్పియుండు సంప్రాప్తిక్రమము ననుసరించి జనించి, ఆవిధముగనే ఇంక కొన్నివ్యాధులు దానికి దోడుగ సంక్రమించియుండునెడ, స్వతంత్రముగ తొలుత బుట్టినవ్యాధి ప్రధానమనియు, పరతంత్రముగ (తొలుత బుట్టినవ్యాధి ననుసరించి)కల్గినది అప్రధానమనియు, సంప్రాప్తిక్రమమునుబట్టి నిర్ణయించునది. ఎట్లనగా?—జ్వరము ప్రధానముగ జనించినపుడు దానిననుసరించి తలనొప్పి మున్నగు నితరరోగములును కల్గును. అట్టియెడ జ్వరము స్వతంత్రముగ బుట్టినది కావున ప్రధానంబనియు, దానికనుగుణముగ జనించిన తలనొప్పి మున్నగునవి పరతంత్రమగుటంజేసి యప్రధానమనియు సంప్రాప్తిభేదముచే నెరుంగనది. అందు ప్రధానము అనుబంధ్యమనియు, అప్రధాన మనుబంధమనియు జెప్పనగును.

అట్టివ్యాధి సంకరమునందు ప్రధానమును నిర్ణయించి దానికి దగిన చికిత్స జేసినచో నప్రధానము ప్రధానవ్యాధితోగూడ శమించును. ఒకవేళ అప్రధానమునకు చికిత్స జేయవలసివచ్చినచో ప్రధానరోగమునకు విరోధము లేకుండునట్లు చికిత్స జేయనగును. ఈవిషయమునే "ప్రధానమవిరోధయన్"అని యాచార్యులు శాసించిరి. ఇట్టి చికిత్సాసౌకర్యమునకే ప్రధాన అప్రధాన నిర్ణయ మవశ్యమరయనగును. ఇదియే ప్రయోజనము.

## బలాఽబలనిర్ణయము.

### హేత్వాదికార్త్స్న్యావయవైర్బలాఽబలవిశేషణమ్,

వ్యాధి జనించునపుడు ఆయావ్యాధి జనించుటకు జెప్పిన కారణములన్నిటిచే జనించినదియా? లేక కొన్నికారణములచేతనే జనించినదియా? యని పరిశీలించి, అన్ని కారణములచే జనించినపుడు వ్యాధి ప్రబలమనియు, కొన్నిటిచేతనే కల్గియుండుతరి స్వల్పబలమనియు వ్యాధియొక్క బలాఽబలముల నిర్ణయించునది (అట్టి బలాబలము లనుబట్టియు సంప్రాప్తిగూడ భిన్నముగ నుండుననిభావము.)

(సంప్రాప్తి భేదమునుబట్టి పైజెప్పినరీతిగ వ్యాధి బలాబలమును నిర్ణయించి బలిష్ఠముగనున్నచో ప్రబలమైన చికిత్స నరయుటయు, స్వల్పబలముగ దోచినపుడు స్వల్ప చికిత్సజేయ యత్నించుటయు సమంజసము. ఇదియే బలాబల నిర్ణయప్రయోజనము).

## కాలనిర్ణయము.

### నక్తందినర్తుభుక్తాంశై ర్వ్యాధికాలో యథామలమ్. ౧౧

రాత్రి,పగలు, వసంతాదిఋతువులు, ఆహారజీర్ణసమయము, అనునాలిగింటిభాగ భేదమునుబట్టి వ్యాధికాలము ఆయాదోషముల ననుసరించియుండును.

ఇచ్చట నీనిర్ణయము నెఱుంగునది:— "వయోఽహోరాత్రి భుక్తానాం తేఽన్తమధ్యాదిగాః క్రమాత్" అని సూత్రస్థానమున జెప్పినరీతిగ మనుజులకు నిర్ణీతమైన వయస్సుయొక్కయు, పగటియొక్కయు, రాత్రియొక్కయు, భుజింపబడిన యాహారము జీర్ణసమయముయొక్కయు అంతమున వాతంబును, మధ్యకాలమున పిత్తంబును, మొదటికాలమున కఫంబును వ్యాపించును. మరియు "వర్షాశరద్వసన్తేషు వాతాద్యైః ప్రాకృతః క్రమాత్." అనువచనము ననుసరించి వర్షర్తువున వాతంబును, శరదృతువున పిత్తంబును, వసన్తర్తువున కఫంబును ప్రబలముగ నుండును. వాతాదులకు పైజెప్పిన నిర్ణయకాలములలో నేకాలమున జ్వరాదిరోగములు సంప్రాప్తించునో,ఆకాలభేదమునుబట్టి వాతికపైత్తికశ్లైష్మికభేదముల నిర్ణయించునది. (రాత్రియొక్కయు పగటియొక్కయు ఆహారజీర్ణకాలముయొక్కయు అంతమున (మూడవభాగమున) జ్వరము వ్యాపించినచో వాతజనితమనియు, మధ్యకాలమున వ్యాపించినచో పిత్తమున బుట్టినదనియు,మొదటిభాగమున కలిగినచో కఫమునగలిగినదనియు సంప్రాప్తి కాలమునుబట్టి నిర్ణయించునది. ఋతుభేదమునకును ఇట్లు నిర్ణయించునది. ఇట్టి దోషవిభాగము రోగసంప్రాప్తికాలమునుబట్టి నిర్ణయింప వలనుపడుననిభావము.)

### ఇతి ప్రోక్తో నిదానార్థస్తం వ్యాసేనోపదేక్ష్యతి,

ఇత్తెరంగున రోగసామాన్యమున గమనింపదగిన నిదానార్థము వివరింపబడియె. పిదప నీక్రింద నాయావ్యాధుల ప్రకరణములయందు ఆయావ్యాధులకు సంబంధించిన నిదానములు విస్తరముగ నీతంత్రకారునిచే జెప్పంబడును.

(రోగములకన్నిటికిని సామాన్యముగనుండు నిదానాదుల (రోగము గమనింప సాధనములగు నుపాయముల) నీసర్వరోగ నిదానాధ్యాయమున వివరింపబడినదనియు, ఆయారోగముల నిదానాదులను ఆయాప్రకరణములయందు విస్తరముగ జెప్పబడునని భావము).

### సర్వరోగములకును ముఖ్యకారణములు

సర్వేషామేవ రోగాణాం నిదానం కుపితా మలాః. ౧౨
తత్ప్రకోపస్య తు ప్రోక్తం వివిధాహితసేవనమ్,

జ్వరాదిరోగముల కన్నిటికిని ప్రకోపమునొందిన వాతపిత్తకఫములు మూడును కారణములగును. సమస్థితినుండు వాతాదిదోషములు ప్రకోపించుటకు పలుదెరంగులైన యపథ్యపదార్థముల సేవించుటయే కారణమగును.

(అపథ్యములగు నాహారవిహారాదులచేత వాతాదులు ప్రకోపించుననియు, అట్టి ప్రకుపితములైన త్రిదోషములు ఆయారోగముల గల్గించుననియు భావము.)

ఇచ్చట రోగములకన్నిటికిని ప్రకుపితవాతాదులు సన్నిహితకారణము లగుటచే సన్నిహితనిదానమనియు, వానిని ప్రకోపింపజేయునపథ్యాహారాదులు వ్యవహితము లగుటంజేసి విప్రకృష్టనిదాన మనియు నెరుంగునది.

### అహితభేదములు.

అహితం త్రివిధో యోగస్త్రయాణాం ప్రాగుదాహృతః ౧౩

పైజెప్పబడినఅహిత (హితముకాని) సేవనముకాలము, అర్థముకర్మమునైయుండును. అట్టికాల-అర్థ-కర్మములు మూడును ఒక్కొకటి (హీన-మిథ్యా-అతియోగ భేదములచే) మూడేసి భేదములుకల్గియుండునని యీతంత్రమున సూత్రస్థానమునందలి పనిరెండవ యధ్యాయమున వివరింపబడియె. సూత్రస్థానమునందలి పనిరెండవయధ్యాయమున నిట్లు చెప్పబడెను:—

“తేషాంకోపేతు కారణమ్, అర్థైరసాత్మ్యైస్సంయోగః కాలఃకర్మచదుష్కృతమ్. హీనాతిమిథ్యాయోగేన భిద్యతేతత్పునస్త్రిధా” ఇంద్రియములకు విషయములగుశబ్దము, స్పర్శము,రూపము,రసము, గంధమునను నైదునుఅనుచితములై శరీరప్రకృత్యాదులకుఇమడ కుండుతరి వానితోశ్రోత్రము, త్వక్కు, నేత్రములు, రసనము, ఘ్రాణమునను పంచే

క్రియములకును వేరువేరసంబంధము కల్గుట, శీతకాలము, ఉష్ణకాలము, వర్షకాలము
అనిమూడుతెరంగులైన కాలంబునకును, ఈజన్మమునందైనను మునుపటిజన్మములయం
దైనను చేయబడిన పాపకర్మంబునకును సంబంధముకల్గుట, ఈమూడును (కాల-అర్థ-
కర్మములసంబంధము) వాతాదిదోషములు ప్రకోపించుటకు కారణములగును. అట్టి
కాలార్థకర్మముల సంబంధము హీన-మిథ్యా-అతియోగ భేదములచే వేర్వేరుగమూడేసి
విధములనుండును. అర్థాదులతో సంబంధము బొత్తుగలేకుండుట హీనయోగము, ప్రతి
కూలములైన విషయాదులతో గల్గుసంబంధము మిథ్యాయోగము, విషయాదులతో
నధికముగగల్గు సంబంధము అతియోగమునని యెఱుంగునది. ఈవిషయమునే చరకా
చార్యులు "కాలార్థకర్మణాం యోగో హీనమిథ్యావచాతి చ" అని సంగ్రహముగ
జెప్పిరి. ఈవిషయమై యాతంత్రముననే సూత్రస్థానమున పదిరెండవయధ్యాయమున
విపులముగ జెప్పబడినది. కావున విస్తరభీతిచే నిట వివరింపబడదయ్యె.

### వాతప్రకోపకారణములు.

తిక్తోషణకషాయాల్పరూక్షప్రమితభోజనైః,
ధారణోదీరణనిశాజాగరాత్యుచ్చభాషణైః. ౧౪
క్రియాతియోగభీశోక చింతావ్యాయామమైథునైః,
గ్రీష్మాహోరాత్రిభుక్తాన్తే ప్రకుప్యతి సమీరణః. ౧౫

చేదు, కారము, వగరు, అనుసిరసములు కలపదార్థములను భుజించుట, తనకు వలసిన పరిమితికన్న మిక్కిలి తక్కువగ భుజించుట, జిడ్డులేనిపదార్థముల భుజించుట, కాలనియమములేక భుజించుట, మలమూత్ర వాతాదులను వెడలనీయక బిగబట్టుట, అయ్యవి వెడలకుండునపుడు బలవంతముగ వానిని వెడలింపచేయుట, రాత్రులయందు నిదురమేల్కొంచుట, మిక్కిలి బిగ్గరగమాటలాడుట, వమనవిరేచనాది పంచకర్మములను వానివాని పరిమితికన్న నధికముగ సేవించుట, భయముపడుట, దుఃఖించుట, మనసున వ్యాకులపడుట, శరీరపరిశ్రమమును తనబలమును మించిచేయుట, అధికముగ సంభోగము చేయుట, ఈ కారణములచే వాతము ప్రకోపమునొందును. మఱియు గ్రీష్మఋతువునందును, రాత్రియొక్కయు పగటియొక్కయు కడపటిభాగమునను, భోజనము చేసిన యాహారము జీర్ణించు కాలముయొక్క అంతమునను గూడ వాతము ప్రకోపించును. (పైజెప్పబడిన యన్నపాన విహారములచేత వాతము ప్రకోపించునని భావము).

### పిత్తప్రకోపకారణములు.

పిత్తం కట్వమ్లతీక్ష్ణోష్ణపటుక్రోధవిదాహిభిః,
శరన్మధ్యాహ్నరాత్ర్యర్ధ విదాహసమయేషు చ. ౧౬

కారము పులుపుకలపదార్థముల సేవించినను, తీక్ష్ణగుణముకల ఆవాలు మున్నగు వానిని, ఉష్ణవీర్యంబును గుణంబును కలపదార్థములను, ఉప్పుకలపదార్థములను, మంట బుట్టించుపదార్థములను భుజించినను, కోపపడినను పిత్తము ప్రకోపించును. మరియు శరదృతువునందును పగటిమధ్యకాలమునందును అర్ధరాత్రికాలమునందును, మిక్కిలి సంతాపము గల్గుసమయనందును పిత్తము ప్రకోపించును.

## కఫప్రకోపకారణములు.

స్వాద్వమ్లలవణస్నిగ్ధగుర్వభిష్యన్దిశీతలైః,
ఆస్యాస్వప్నసుఖాజీర్ణదివాస్వప్నాతిబృంహణైః. ౧౭
ప్రచ్ఛర్దనాద్యయోగేన భుక్తమాత్రవసన్తయోః,
పూర్వాహ్ణే పూర్వరాత్రే చ శ్లేష్మా

మధురరసంబులును, అమ్లరసంబులును, లవణరసంబులునగు పదార్థముల భుజించినను, స్నిగ్ధంబులును (మిక్కిలిజిడ్డు కల్గినవియు), గురుత్వముకల్గి (అజీర్ణమునుకల్గించు) నవియు, ముక్కురంధ్రములుమున్నగు స్రోతోమార్గముల ద్రవమును బుట్టించు నవియు, గుణవీర్యములచే శీతలంబులునగు పదార్థముల భుజించినను; ఎల్లపుడు కూర్చొనియుం డుటచేతను నిదురించుటచేతను, సుఖమనుభవించుచున్నను, అజీర్ణముకల్గినను, పగలు నిదురించినను, శరీరమును బలియజేయు నౌషధాదుల నధికముగ నుపయోగించినను, ఆవసరముకలిగినపుడు వమనవిరేచనాదులచే శోధనకర్మను చేసికొనకున్నను, కఫము ప్రకోపమునొందును. మరియు భుజించినమాత్రముననను, వసన్తఋతువునను, పగటి మొదటిభాగముననను, రాత్రి మొదటి భాగముననను కఫము ప్రకోపించును.

## దోషద్వయప్రకోపకారణములు.

ద్వన్ద్వస్తు సంకరాత్. ౧౮

పైజెప్పినరీతిగ వాతపిత్తకఫములను ప్రత్యేకముగ ప్రకోపింపజేయు కారణములలో రెండేసి దోషములకు జెప్పిన కారణములు సంక్రమించినపుడు రెండేసి దోషములు ప్రకోపించును. ఇదియే ద్వంద్వజ వ్యాధికి కారణమగును.

ఇచ్చట నీనిర్ణయము నెరుంగునది:—చేదు మున్నగురసములు వాతమును వృద్ధి నొందించును. కారము పులుపు మున్నగురసములు పిత్తమును వృద్ధినొందించును. ఈ రెండిటిని సేవించినయెడ వాతపిత్తములు రెండును ప్రకోపించును. వాత ప్రకోపనములగు తిక్తాదులను, కఫప్రకోపనములగు మధురాదులనుజేర్చి యుపయోగించుటచే వాతకఫములు రెండును ప్రకోపించును. పిత్తమును వృద్ధినొందించు కట్వాదిరసములను

కఫవర్ధకములగు మధురాదిరసములను జేర్చి యుపయోగించునెడ పిత్తకఫములు రెండును ప్రకోపమునొందును. ఇత్తెరంగుననే విహారాముల సంకరమునుగూడ నూహించునది.

### త్రిదోషప్రకోపకారణములు.

మిశ్రీభావాత్సమస్తానాం సన్నిపాతస్తథా పునః,
సంకీర్ణాఽజీర్ణవిషమవిరుద్ధాఽధ్యశనాదిభిః. ౧౯
వ్యాపన్నమద్యపానీయశుష్కశాకామమూలకైః,
పిణ్యాకమృద్యవసురాపూతిశుష్కకృశామిషైః. ౨౦
దోషత్రయకరైస్తైస్తైః తథాన్నపరివర్తతః,
ధాతోర్దుష్టాత్పురోవాతాద్గ్రహావేశాద్విషాద్గరాత్. ౨౧
దుష్టాన్నాత్పర్వతాశ్లేషాత్ గ్రహైర్జన్మర్క్షపీడనాత్,
మిథ్యాయోగాచ్చ వివిధాత్ పానానాం చ నిషేవణాత్. ౨౨
స్త్రీణాం ప్రసవవైషమ్యాత్ తథా మిథ్యోపచారతః,

పైజెప్పబడిన త్రిదోషములను వేర్వేరవృద్ధినొందించు కారణములన్నియు నొకటిగ సంకరమైయుండునెడ దోషములు మూడును సమకాలమున సమములుగ ప్రకోపించును. ఇదియే సన్నిపాతకారణము. మరియు—పథ్యములును అపథ్యములునైన అనేక పదార్థముల నొకటిగ జేర్చి భుజించుట, అజీర్ణముగనున్నపుడు భుజించుట, విషమాశనము (అకాలమున భుజించుట, లేక పరిమాణమున కధికముగనైనను మిక్కిలి యల్పముగనైనను భుజించుట) పరస్పరవిరుద్ధములగు క్షీరమత్స్యాదుల నొకటిగ జేర్చి భుజించుట, భుజించినతోడనే మరల భుజించుట,ఇవి మున్నగు భోజనక్రియలచేతను త్రిదోషములను ప్రకోపించును. పురుగులు మున్నగువాని సంబంధమునం జేసి దుష్టములగు మద్యము, త్రాగుడునీళ్లు,మున్నగు ద్రవపదార్థముల త్రాగినను,ఎండినకూరగాయలను దుంపలను భుజించినను, తెలికపిండి, మట్టి, యవలు, సారాయి, దుర్గంధముపుట్టినదియు ఎండినదియు కృశించినజంతువులకు సంబంధించినదియునగు మాంసమును భుజించినను త్రిదోషములు ప్రకోపించును. మరియు రసగంధకాది ధాతుసంబంధముచే దుష్టమైన గాలిచేతను, తూర్పుగాలిచేతను, భూతనాదిగ్రహము లావేశించుటచేతను, స్థావరజంగమరూపమైన విషసంబంధముచేతను, శరీరముననిమిడిజీర్ణింపకుండు విషముచేతను, అట్టి విషాదులసంసర్గమున దుష్టమైనయన్నముచేతను, కొండపైనెక్కుటచేతను, సూర్యాదిగ్రహములలో క్రూరములగు గ్రహములచే జన్మనక్షత్రసంబంధము కలుగుటచేతను, పలుదెరంగులైన విహారాదులను క్రమముదప్పిచేసినను, నానావిధములైన పానద్రవ్యములను విధినియమములేక సేవించినను, స్త్రీలకు సాధారణముగ గాక అక్రమప్రసవము కలుగుటచేతను,

ప్రసవించినబాలింతరాండ్రు అపథ్యములగు నాహారవిహారాదుల నల్పుటచేతను కూడ వాతాదిదోషములు మూడును సమకాలమున ప్రకోపించును. (ఇట్టి కారణములచే ప్రకోపించిన మూడుదోషములచే గలిగినరోగములు సాన్నిపాతికములని చెప్పబడును.)

### వాతాదులు రోగముల గలిగించుక్రమము.

ప్రతిరోగమితి క్రుద్ధాః రోగాధిష్ఠానగామినీః. ౨౩
రసాయినీః ప్రపద్యాశు దోషా దేహే వికుర్వతే,

పైజెప్పినరీతిగ వాతాదిదోషములు ఒక్కొకటియైనను రెండేసియైనను అన్నియు నైనను వానివానికి జెప్పినకారణములచే ప్రకోపమునొంది, శరీరమునందలి రోగముల కధిష్ఠానములైన రసరక్తాదిధాతువుల యందు వ్యాపించు స్వభావముకల రసవహములగు నాడులలో బ్రవేశించి, అతిశీఘ్రముగ శరీరమునందు ఆయారోగముల గలిగించును.

ఇత్తెరంగున సర్వరోగనిదానము చెప్పంబడియె. దీనికే పంచలక్షణనిదానమనియు పేరుగలదు. ఈప్రకరణమున వివరింపవలసిన విషయము లనేకములుకలవు. ఆవిషయము లన్నియు నాచే విరచితమగు మాధవనిదానాంధ్రవ్యాఖ్యానమున సమర్థకములుగ పరిశీలించి వ్రాయబడినవి. గ్రంథవిస్తరభీతిచే నింతట విరమించితి. ప్రేక్షకులు మాధవనిదానమునందలి పంచలక్షణ నిదానవ్యాఖ్యానమున గమనించెదరుగాత !

వాగ్భటాచార్యవిరచితాష్టాంగహృదయనిదానస్థానమున ప్రథమాధ్యాయము.

సమాప్తము.

# ద్వితీయాధ్యాయము.

అవ: పైయధ్యాయమున రోగములకన్నిటికిని సామాన్యముగు సర్వరోగనిదానము చెప్పబడినది. పిదప నాయారోగములకు సంబంధించిన నిదానమును వేరువేర నిరూపించుట యావశ్యకము. అందు "జ్వరో రోగాణామ్" అను చరకవాక్యముచేత రోగముల కన్నిటికిని జ్వరము ప్రధానమని చెప్పియుండుటచే తొలుత జ్వరనిదానము చెప్పబడును. రోగములలో జ్వరము ప్రధానమని ప్రకృత గ్రన్థమునగూడ "జ్వరో రోగపతిః" ఇది మున్నగు వాక్యములచే జెప్పబడియున్నది. కావున నీయధ్యాయమున జ్వరనిదానము చెప్పబడును:—

సూ. అథాతో జ్వరనిదానం వ్యాఖ్యాస్యామః,

సర్వరోగనిదానమును జెప్పినపిదప జ్వరనిదానమును విపులముగ జెప్పెదను.

## జ్వరస్వరూపము.

జ్వరో రోగపతిః పాప్మా మృత్యురోజోఽశనోఽన్తకః,
క్రోధో దక్షాధ్వరధ్వంసీ రుద్రోర్ధ్వనయనోద్భవః. ౧
జన్మాన్తయోర్మోహమయః సన్తాపాత్మాఽపచారజః,
వివిధైర్నామభిః క్రూరో నానాయోనిషు వర్తతే. ౨

జ్వరము తక్కినరోగములకన్నిటికిని ప్రధానమైనది. ప్రాణులశ్రమపెట్టుటంజేసి మిక్కిలి పాపస్వభావముకలది. ప్రాణుల హింసించుటయందు సమర్థమైనది కావున మృత్యుస్వరూపమైనది. శరీరమున రసాదిధాతువుల కన్నిటికిని పుష్టిని కలిగించి శరీరమును పోషించుటంజేసి జీవితమునకు ప్రదానాధారమైన యోజస్సును నిర్మూలము చేయునది. కావుననే యమునిబోలె ప్రాణాన్తకమైనది. రుద్రుని మూడవనేత్రమున బుట్టి క్రోధరూపమై దక్షునియాగమును ధ్వంసముచేసినది. ప్రాణులు పుట్టునప్పుడును ట్టునప్పుడును అజ్ఞానస్వరూపముగ వ్యాపించునది. సంతాపస్వరూపమైనది. అపథ్యములగు నాహారవిహారాదులచే గలుగునది. ఇట్టి క్రూరమైన జ్వరమనురోగము సృష్టికిలోనగు స్థావరజంగమరూపమైన వస్తువులయందు పలుతెరంగులైన పేర్లుకలిగి వ్యాపించును.

ఇచ్చట నీవిషయముల నెరుంగునది:—పూర్వకాలమున కృతయుగమునందు దక్షప్రజాపతి పరమేశ్వరుని పిలువక యాగముచేయ సమకట్టెను. తన్నవమానించుటచే

నీశ్వరుడు మిక్కిలి కోపోద్దీపితుడై ఫాలనేత్రమును దెరచెను. అప్పుడందుండి రుద్రుని కోపము అగ్నిస్వరూపముదాల్చి పుట్ట జ్వలించుచు దక్షునియాగమును ధ్వంసముచేయు చుండ దక్షాదులు పరమేశుని శరణంబువేడిరి. పరమకారుణికుండగు నాజగదీశుడు ఆకోపము నుపసంహరించుచు లోకమున పాపిజంతువులను జ్వరరూపమున బాధింప నానతిచ్చెను. నాటంగోలె నానావిధనామభేదముల గాల్చి యారుద్రకోపము తాను వ్యాపింపనవకాశము కల్గినపుడు జ్వరరూపమున బ్రాణుల బాధింపసాగెను. అనిపురాణ ప్రసిద్ధము. ఇదియేజ్వరమునకు మొట్టమొదటి కారణము స్వరూపము. ఈవిషయమునే "రుద్రోర్ధ్వనయనోద్భవః" అని తన్త్రకారుడు నుడివెను. ఈరుద్రకోపము జ్వరమునకు ప్రాథమిక కారణమగుటంజేసియే విప్రకృష్టనిదానమని చెప్పబడును. ఈవిషయము చరకమున విపులముగనున్నది.

జ్వరము రుద్రకోపము కారణముచే కృతయుగమున తొలుత బుట్టి బాధింపుచుండె. పిదప త్రేతద్వాపరయుగములలో ధర్మమున నొక్కొక పాదము అంతరించుటంజేసి పెద్దలనవమానించుట మున్నగు నపచారములచేత గల్గుచుండెను. ఈకలియుగమున మిథ్యాహారవిహార రూపమైన యపచారమున గల్గుచున్నది. ఈయభిప్రాయమునే 'అపచారజః' అని తంత్రకారుడు చెప్పెను.

మరియు నీజ్వరము సంతాపరూపమైనను ప్రాణులు పుట్టునపుడును చచ్చునపుడును అజ్ఞానాంధకార రూపముగ తప్పక వ్యాపించును. దానంజేసియే ప్రాణిసామాన్యముగ పూర్వజన్మజ్ఞానము ఇతరజన్మమున లేకుండుట, ఈయజ్ఞానమునే మాయయని వేదాన్తవేత్తలు నుడివెదరు. ఈయభిప్రాయమునే "జన్మాన్తయోర్మోహమయః"అని తంత్రకారుడుపదేశించెను.

అట్టిరుద్రకోపము జన్తుసామాన్యముగ వ్యాపించునని తంత్రాన్తరమున నిట్లు చెప్పబడినది:—"పాకలస్తు యథేభానాం, అభితాపో హయేషు చ. గవాంగోకర్ణకశ్చైవ, పక్షిణాం మకరస్తథా, వాస్తాదానామలర్కస్స్యాత్, అప్స్విన్ద్రమదస్స్మృతః, ఓషధీషు తథా జ్యోతిః, చూర్ణకో ధాన్యజాతిషు, జలేషు నీలికా, చూషో భూమౌ, నృణాం జ్వరో మతః, ఋతే దేవ మనుష్యేభ్యో నాన్యే విషహతే, తుతమ్, శేషాస్సర్వే విపద్యన్తే తిర్యగ్యోనౌ జ్వరార్దితాః, కర్మణాలభతే జన్తుః దేవత్వం మానుషాదపి, పునశ్చైవ చ్యుతస్స్వర్గాత్ మానుష్యమభిపద్యతే, తస్మాత్స దేవభావాచ్చ సహతే మానవో జ్వరమ్." జ్వరము ఏనుగులకు పాకలమనియు, గుఱ్ఱములకు అభితాపమనియు, గోజాలికి గోకర్ణకమనియు, పక్షులకు మకరమనియు, వాస్తాదము (కుక్క) లకు అలర్కమనియు, జలజన్తువులకు ఇంద్రమదంబనియు, పైరుమున్నగు నోషధులకు జ్యోతి యు

నియు, వజ్రమున్నగుధాన్యజాతికి చూర్ణకమనియు, ఉదకమునకు నీలికయనియు, భూమికి చూషంబనియు, మనుజులకు జ్వరంబనియు నామభేదములు కలిగి సంభవించి తనస్వభావమున కనుగుణముగ బాధించుచుండును. అట్టిజ్వరమును దేవతలుమనుష్యులు దక్క_తక్కినజన్తువులోరుపజాలవు. మనుజులు తమపుణ్యకర్మపరిపాకముచే దేవత్వమును బొందగలరు. అట్టిపుణ్యఫలము పూర్ణమైనపిదప మరల పుడమింబడి మనుష్యజన్మమును పొందగలరు. ఈవిషయము గీతాశాస్త్రముననిట్లుపదేశించిరి.—"త్రైవిద్యామాం సోమపాః పూతపాపా యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే. తే పుణ్యమాసాద్యసురేన్ద్రలోకమశ్నన్తి దివ్యాన్ దివి దేవభోగాన్, తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" అట్టికారణముచేత దేవతలును మనుజులును జ్వరమున కోరువజాలుదురు. తక్కిన తిర్యగ్జన్తువులు తాళజాలక తుదకు దానివలననే మరణము నొందగలవు."

### జ్వరభేదములు, సంఖ్య.

స జాయతేఽష్టధా దోషైః పృథఙ్మిశ్రైస్సమాగతైః,
ఆగన్తుశ్చ

పైజెప్పినరీతిగ సంతాపరూపమైన జ్వరము వాతపిత్తకఫములచే వేరువేరుగను, రెండేసిదోషముల సంసర్గముచేతను, మూడిటి సన్నిపాతముచేతను, అభిఘాతము మున్నగు నాగంతుక కారణములచేతను జనించుటంజేసి యెనిమిదివిధములగును.

(వాతపిత్తకఫములచే వేర్వేరజనించునవిమూడును వాతపిత్త, వాతకఫ, పిత్తకఫముల సంసర్గమున బుట్టునవిమూడును, సన్నిపాతమున బుట్టునదియొకటియు, ఆగంతుకంబొకటియు గలసి జ్వరము ఎనిమిదివిధములని భావము.)

### జ్వరసంప్రాప్తి.

మలాస్తత్ర స్వైస్స్వైర్దుష్టాః ప్రదూషణైః. 3
ఆమాశయం ప్రవిశ్యామ మనుగమ్య పిధాయ చ,
స్రోతాంసి పక్తిస్థానాచ్చ నిరస్య జ్వలనం బహిః. ౪
సహ తేనాభిసర్పన్తస్తపన్తస్సకలం వపుః,
కుర్వన్తో గాత్రమత్యుష్ణం జ్వరం నిర్వర్తయన్తి తే. ౫
స్రోతోవిబన్ధాత్ప్రాయేణ తతస్స్వేదో న జాయతే,

వాతపిత్తకఫములు వానివానికి ప్రత్యేకముగ జెప్పబడిన కారణములచే ప్రకోపమునొంది యామాశయమున (స్తనములకు క్రిందనాభికి పైభాగమున) జేరి యచ్చట

నుండు ఆమరసమునగూడి రోమరంధ్రములుమున్నగు స్రోతోమార్గములమూసి, భుజింపబడిన యాహారమును పచింపజేయు జాఠరాగ్నిని స్వస్థానమునుండి బైట వెడలింపజేసి, అట్టిజాఠరాగ్ని వేడితోగూడ దానునుగూడి శరీరమునందెల్ల వ్యాపించి శరీరమున మిక్కుటముగ వేడినివ్యాపింపజేయును. అదియే జ్వరమని చెప్పబడును. శరీరమునందలి రంధ్రములన్నియు నడ్డగింపబడియుండుటచే నొడలిపై చెమట ప్రాయికముగ బొడమదు. (ఇదియే జ్వరముయొక్క సంప్రాప్తిక్రమము.)

వాతాదిదోషములు తిక్తోషణాదికారణములచే ప్రకుపితములై పైజెప్పినక్రమమున జ్వరమునుగల్గించును. ఆగంతుక జ్వరమునందును అభిఘాతముమున్నగు నాగంతుకారణములచే నేదైనదోషము ప్రకోపమునొందియే యాగంతుక జ్వరంబును కల్గును. గాని నైజజ్వరమున తొలుత దోషము ప్రకోపించి జ్వరమును దాని సంబంధములగు బాధలను గల్గించును. ఆగంతుకమున నటుగాక తొలుత బాధకల్గి పిమ్మట వాతాదులు ప్రకోపించును. ఇదియే యీరెండిటికిని భేదము. వాతాదిదోష సంబంధములేక యొకప్పుడును ఏవ్యాధియు గల్గుటలేదు.

శరీరమునందు జీవదశయందుసామాన్యముగ వేడియుండుటసాజము. జ్వరమువ్యాపించునపుడు ఆవేడియేమిక్కిలి యధికముగ వ్యాపించునని తెలియుటకై "కుర్వన్తో గాత్రమత్యుష్ణం" అనిచెప్పబడెను. మరియు వాతికజ్వరమునందు వాతము యోగవాహి (దేనితోగూడిన నావస్తువుగుణముగలిగియుండునది) యగుటంజేసి జాఠరాగ్నిగూడినపుడు దానియందలి వేడిగుణముకల్గి అట్టియుష్ణము శరీరముపై వ్యాపింపజేయుటయుక్తము. పిత్తజ్వరమునందును అగ్నికిసమానగుణమైనపిత్తము వేడినిపుట్టించుట సాజము. కఫజ్వరమున అగ్నికివిరుద్ధముగ జలస్వభావమైనకఫముచే నెట్లువేడివ్యాపించునని కొందఱుశంకించెదరు; గాని జ్వరముపుట్టుకచేతనే తీవ్రమైన యగ్నిస్వరూపమగుటంజేసి స్వభావముచేతనే యుష్ణమును గలిగించును. కావున నైసందేహమున కవకాశము కలుగదు.

"స్రోతోనిబద్ధాత్ప్రాయేణ తతస్స్వేదో న జాయతే" అనుచోట 'ప్రాయః' అనుటచేత నొకప్పుడు చెమటగూడ జ్వరమున పట్టుననిభావము. కావుననే పిత్తజ్వరమున చెమట గలుగునని 'స్వేదోనిశ్వాస వైగన్ధ్యం' అని క్రింద చెప్పబడును.

## జ్వరపూర్వరూపము.

తత్ర ప్రాగ్రూపమాలస్యమరతిర్గాత్రగౌరవమ్. ౬
ఆస్యవైరస్యమరుచిర్జృమ్భా సాస్రాకులాక్షతా,
అఙ్గమర్దోఽవిపాకోఽల్పప్రాణతా బహునిద్రతా. ౭
రోమహర్షో వినమనం పిణ్డికోద్వేష్టనం క్లమః,

హితోపదేశేష్వక్షాన్తిః ప్రీతిరమ్లపటూషణే. ౮
ద్వేషస్స్వాదుషు భక్ష్యేషు తథా బాలేషు తృట్ భృశమ్,
శబ్దాగ్నిశీతవాతామ్బుచ్ఛాయోష్ణేష్వనిమిత్తతః ౯
ఇచ్ఛా ద్వేషశ్చ తదను జ్వరస్య వ్యక్తతా భవేత్,

జ్వరము వ్యాపించుటకుముందు వాక్కు మనస్సు శరీరము అను నీత్రికరణములకు సంబంధించిన పనులయందు ప్రయత్నము కలుగదు. మనసుకు దేనియందును ఆసక్తిబొడమదు. అవయవములు బరువుగనుండును. నోటికి మధురాదిరసములు దెలియవు. అరోచకము కలుగును. ఒడలివిరువులు ఆవలింతలు కలుగును. కన్నులనీరు గ్రమ్ముచు కలకబారియుండును. ఒడలి నొప్పులు కలుగును. భుజించినయాహారము జీర్ణముగానోపదు. బలముహీనమగును. నిద్ర అధికముగవచ్చును. రోమాంచముకలుగును. అవయవములువంగును. వ్రేళ్లు కొంకరబోవును. బడలికకలుగును. తలిదండ్రులు మున్నగు పెద్దవారు హితమునుజెప్పినను అట్టివిషయమై యోర్పుకలుగదు. పులుపు ఉప్పు కారము అనునీరసములుకల వస్తువులపై మిక్కిలి ప్రీతి కలుగును. మధురములైన భక్ష్యాదులయందును పసిబిడ్డలయందును ద్వేషముకలుగును. దప్పి మిక్కుటముగ గలుగును. ధ్వనులయందును అగ్నియందును చలువయందును గాలియందును నీటియందును నీడయందును ఉష్ణపదార్థములయందును కారణములేకయే ఇష్టంబును ద్వేషంబును నియమములేక కారణములేకయే కలుగును. (ఇవియన్నియు జ్వరమునకు ముందుకలుగు పూర్వరూపములు.) ఇవి కలిగినపిదప జ్వరము సంపూర్ణలక్షణములతోగూడి వ్యాపించును.

ఆలస్యలక్షణము సుశ్రుతమున నిట్లు చెప్పబడెను:—“సుఖస్పర్శప్రసంగిత్వం దుఃఖద్వేషణలోలతా, శక్తస్య చాప్యనుత్సాహః కర్మణ్యాలస్యముచ్యతే” (సుఖమైన స్పర్శమునందు ఆసక్తియు కష్టమైనస్పర్శమునందు ద్వేషంబును పనులజేయుశక్తి కలిగియుండియు పనులయందు నిరుత్సాహంబును ఆలస్యమనబడును.)

### వాతజ్వరలక్షణములు.

ఆగమాపగమక్షోభమృదుతా వేదనోష్మణామ్. ౧౦
వైషమ్యం తత్రతత్రాఙ్గే తాస్తాస్స్యుర్వేదనాశ్చలాః,
పాదయోస్సుప్తతా స్తమ్భః పిణ్డికోద్వేష్టనం శ్రమః. ౧౧
విశ్లేష ఇవ సన్ధీనాం సాదః ఊర్వోః కటీగ్రహః,
పృష్ఠం క్షోదమివాప్నోతి నిష్పీడ్యత ఇవోదరమ్. ౧౨
ఛిద్యన్త ఇవ చాస్థీని పార్శ్వగాని విశేషతః,
హృదయస్య గ్రహస్తోదః ప్రాజనేనేవ వక్షసః. ౧౩

స్కన్ధయోర్మథనం బాహ్వోర్భేదః పీడనమంసయోః,
అశక్తిర్భక్షణే హన్వోః జృమ్భణం కర్ణయోస్స్వనః. ౧౪
నిస్తోదశ్శఙ్ఖయోర్మూర్ధ్ని వేదనా విరసాస్యతా,
కషాయాస్యత్వ మథవా మలానా మప్రవర్తనమ్. ౧౫
రూక్షారుణత్వగాస్యాక్షినఖమూత్రపురీషతా,
ప్రసేకారోచకాశ్రద్ధావిపాకాऽస్వేదజాగరాః. ౧౬
కణ్ఠౌష్ఠశోషస్తృట్ శుష్కచ్ఛర్దికాసౌ విషాదితా,
హర్షో రోమాఙ్గదన్తేషు వేపథుః క్షవథోర్గ్రహః. ౧౭
భ్రమః ప్రలాపో ఘర్మేచ్ఛా వినామశ్చానిలజ్వరే,

వాతజ్వరమునం దీక్రిందవివరింపబడులక్షణములుకనబడును:—జ్వరముయొక్క ప్రారంభము, నివర్తి, తీవ్రత, మృదుత్వము, వేదన, వేడి, ఇవి నియమములేక వ్యత్యస్తముగనుండును. (జ్వరము శరీరమునందలి వ్యాపించునపుడు సర్వాంగమునందును ఒకటేరీతిగ ప్రారంభింపక ఒకసమయమున శిరస్సునందును ఒకప్పుడు మధ్యభాగమునందును వేరొకసమయమున పాదములయందును వేడి యారంభించును. జ్వరమువిడుచు సమయమునను నియమములేక పైజెప్పినవిధముగ తనకిచ్చవచ్చినట్లు విడువనారంభించును. జ్వరముయొక్క తీవ్రతయు మృదుత్వంబును నియమములేక ఒకప్పుడు తీవ్రముగను ఒకప్పుడు స్వల్పముగను వేడికలిగియుండును. జ్వరముచే గలుగువేడియు శరీరమునందలి యవయవములలో నొకప్పుడు శిరమునందును, ఒకప్పుడు పాదములయందును వ్యాపించియుండును. జ్వరమునగలుగుబాధలు శరీరమునందెల్ల వ్యాపింపక ఒక్కొకప్పుడు ఒక్కొక అవయవమున వ్యాపించి బాధించును. ఇవియే ఆగమాపగమాదుల వైషమ్యము). వాతము చలస్వభావమగుటంజేసి ఆయాయంగముల నుద్దేశించి క్రిందచెప్పబడిన సుప్తిమున్నగు వేదనలు ఆయా అవయవములయందు నిల్కడలేక చంచలములైయుండును. అరకాలులయందు సూదితో గ్రుచ్చినను స్పర్శము తెలియక మొద్దుబారియుండును. కాళ్లు స్తంభించియుండును. పిక్కలయందలి మాంసభాగము మెలిబెట్టినట్టులు బాధకలుగును. శరీరమున శ్రమముపుట్టును. కీళ్లు సడలి యొండొంట సంబంధములేనట్టులు, బాధ కలుగును. తొడలుచలనాది వ్యాపారములయందు సామర్థ్యములేకుండును. నడుముపట్టుకున్నట్లు బాధకలుగును వీపునలియగొట్టినట్టులు బాధకలుగును. కడుపున పడద్రిప్పినరీతిగ నొప్పిపుట్టును. ఇరుప్రక్కలయందలి యెముకలు రంపమున కోసినట్లు నొప్పికలుగును. రొమ్మునట్టిగ బిగపట్టినట్లు నొప్పికలుగును. రొమ్మున ముసికోలతో బొడిచినవిధముగ పోటుబుట్టును. మూపులయందు, (అరణులతో నగ్నిని మథించినచందమున) బాధకలు

గును. భుజదండముల పగులదీయువిధముగను, అంసప్రదేశములవదదీసిపిండినవిధముగను బాధకలుగును. తాలువులు అన్నాదుల భుజించుటకైన శక్తిలేకుండును. ఆవలింతలు విశేషముగ వెడలును. చెవులయందు ధ్వనికలుగును. కణతలయందు సూదులబొడిచినట్లు పోటుపుట్టును. తలనొప్పి విశేషముగకలుగును. నోటికి మధురాదిరసములు దెలియకుండు ను. లేక నోరువగరైయుండును. మలమూత్ర పురీషాదులు సకాలమున వెడలక బంధిం పబడియుండును. శరీరముపైచర్మంబును ముఖంబును కన్నులును గోళ్లను మూత్రపురీ షంబులును జిడ్డులేకరూక్షంబులై అరుణవర్ణంబులై యుండును. నోట జొల్లుకారును, అన్నము రుచింపకయు తినవలెనను శ్రద్ధలేకయునుండును. ఒకవేళ బలాత్కారముగ భుజించినను జీర్ణముకానోపదు. ఒడలిపై చెమటపుట్టదు. రాత్రులయందు కంటికినిదుర పట్టదు. కుత్తుకయు పెదవులును ద్రవములేకయుండును. దప్పియధికమగును. ద్రవము లేక పొడిశ్వాసంబును పొడిదగ్గును కలుగును. మనసున కలతగనుండును. రోమాంచము విశేషముగకలుగును. శరీరముపై నచ్చటచ్చట నవరును. పండ్లు పులిసినట్లుండును. శరీరమువణకును, తుమ్ములురాక బంధింపబడును. చక్రమునందున్నవానివలె నొడలు తిరుగును. అసంబద్ధముగ మాటలాడును. ఎండలోనుండవలెనని యిచ్ఛపొడమును. అవయవములు వంగును. (ఈలక్షణము లన్నియుఁకలిగినది వాతప్రకోపమున జనించిన జ్వరమని యెరుంగునది.)

## పిత్తజ్వరలక్షణములు.

యుగపద్వ్యాప్తిరఙ్గానాం ప్రలాపః కటువక్త్రతా. ౧౮
నాసాస్యపాకశ్శీతేచ్ఛా భ్రమో మూర్ఛా మదోఽరతిః,
విట్స్రంసః పిత్తవమనం రక్తష్ఠీవనమమ్లకః. ౧౯
రక్తకోఠోద్గమః పీతహారితత్వం త్వగాదిషు,
స్వేదో నిశ్వాసవైగన్ధ్యం అతితృష్ణా చ పిత్తజే. ౨౦

(పైని సంప్రాప్తియందు జెప్పినరీతిగ పిత్తము తనకు సంబంధించిన కారణములచే ప్రకుపితమై ఆమాశయమునజేరి కోష్ఠాగ్నిని బైటవెడలించి యచ్చట జెప్పిన క్రమ ముగ శరీరమున సంతాపమును కలిగించును. అయ్యది పిత్తజ్వరము). అట్టి పిత్తజ్వరము వ్యాపించునపుడు (వాతజ్వరమునుబోలె విషమముగ వ్యాపించక)సర్వాంగములయందును సమకాలమున వ్యాపించును. సంబంధములేని మాటల బల్కును. నోరుచేదు కలిగియుం డును. ముక్కులయందును నోటియందును పుండగును. చలువగోరుచు శీతోపచారముల యం దిచ్ఛవొడమును. ఒడలు తిరుగును. మూర్ఛ గ్రమ్మును. తిక్కయెత్తినట్లుండును. దేనియందును ఇచ్ఛబొడమదు. మలమూత్రాదులు వెడలును. పిత్తపసరు వమనమగును.

ఉమియునప్పుడు రక్తము వెడలును. పుల్లనిత్రేనుపులు వెడలును. గుండ్రనై యెఱ్ఱగనుండు పొక్కులు లేచును. చర్మము ముఖము కన్నులు గోళ్లు మలమూత్రములు, ఇవి పచ్చని రంగైనను పసుపురంగైనను కలిగియుండును. శరీరముపై చెమటపట్టును. నిట్టూర్పుగాలి దుర్గంధముకలిగి వెడలును. మిక్కిలి దప్పికలుగును.

(ఇట్టి లక్షణములు కలిగినది పిత్తజ్వరమని యెరుంగునది.)

ఇచ్చట సీవిమర్శనము నెరుంగునది:—త్రిదోషములచే జ్వరము సంభవించునని పైని చెప్పబడినది. పిత్తజ్వరమున అగ్నిస్వభావము కలపిత్తము కాయాగ్నితో జేరిన పుడు రెండును సమానగుణములగుటంజేసి కాయాగ్ని యినుమడించును గాని మందగించదు. ఈ విషయమే "వృద్ధిస్సమాసైస్సర్వేషాం విపరీతైర్విపర్యయః" అను వాక్యమున ఈ మూలకారుడు శాసించెను. అట్టియెడ అజీర్ణము కలుగబోదు. అజీర్ణమును కారణముగజేసి సంభవించు జ్వరము తలసూపనేరదు. అని కొందరు శంకించెదరు. కాని యిది యుక్తిదూరము:—కాయాగ్ని స్వస్థానముననుండియే వృద్ధినొందినచో మందాగ్ని గలుగబోదు. పిత్తము ప్రకుపితమై కాయాగ్నిని స్వస్థానమునుండి వెడలించి దానితో గూడి శరీరమున వేడిని వ్యాపింపజేయును. అట్టియెడ స్వస్థానమున జలములేని కాయాగ్నికి పాచకశక్తి యెట్లుకలుగును. కావున జ్వరముతప్పక పిత్తమున కలుగును. పిత్తమగ్నితోగలిసి యినుమడించుటచేతనే తక్కిన జ్వరములకన్న పిత్తజ్వరమున శరీరమున వేడి యధికమగునని యెరుంగునది.

## కఫజ్వరలక్షణము.

విశేషాదరుచిర్జాడ్యం స్రోతోరోధోఽల్పవేగతా,
ప్రసేకో ముఖమాధుర్యం హృల్లేపశ్వాసపీనసాః. ౨౧
హృల్లాసశ్ఛర్దనం కాసః స్తమ్భశ్శ్వైత్యం త్వగాదిషు,
అఙ్గేషు శీతపిటికాః తన్ద్రోదర్దః కఫోద్భవే. ౨౨

పైని సంప్రాప్తియందు చెప్పబడిన క్రమముగవ్యాపించిన కఫజ్వరమునందు అరోచకము వాతపిత్తజ్వరములకంటె నధికముగనుండును. జడత్వము (శరీరము మొద్దుబారియుండుట) కలుగును. శరీరమునందలి స్రోతస్సులు (నాసారంధ్రములు రోమరంధ్రములు మున్నగునవి) యడ్డగింపబడును. జ్వరవేగము స్వల్పముగనుండును. నోట జొల్లు కారును. నోరు తీపికలిగియుండును. హృదయస్థానమున (కఫము జేరియుండుటచే) అడ్డుపడినట్లుండును. శ్వాసమధికముగ వెడలును. పడిసెముబట్టి ముక్కులు బీగదీసియుండును. ఓకళింతలు కలుగును. వాంతియగును. దగ్గుకలుగును. శరీరము స్తంభించియుండును. చర్మము, ముఖము, కన్నులు, గోళ్లు, మలమూత్రములు మున్నగునవి తెల్లగనుండును.

శరీరమునం దచ్చటచ్చట తెల్లనిపొక్కులు పుట్టును. మైకము గ్రమ్మును. ఉదర్దము (కణుదురీగెలు కుట్టినవిధముగ కఫసంబంధమున గలుగు దద్దులు) కలుగును. (ఇట్టిలక్షణములు కలిగిన జ్వరము కఫప్రకోపమున గలిగినది యని యెఱుంగునది.)

ఉదర్దలక్షణము తంత్రాన్తరమున నిట్లు చెప్పబడినది:—"వరటీ దష్టసంస్థానః శోథస్సంజాయతే బహిః, సకణ్డూస్తోదబహుళః ఛర్దిజ్వరవిదాహవాన్, ఉదర్దమితి తంవిద్యాత్" (కణుదురీగె కుట్టుటచే గలుగు దద్దువంటి యాకారముకలిగి, దురదయు పోటును బుట్టి, వాంతి, జ్వరము, మంటయు కలిగియుండు వాపు ఉదర్దమని చెప్పబడును.)

## జ్వరసామాన్యలక్షణములు.

కాలే యథాస్వం సర్వేషాం ప్రవృత్తిర్వృద్ధిరేవ వా,
నిదానోక్తానుపశయో విపరీతోపశాయితా, ౨౩

పైజెప్పిన వాతపిత్తకఫజ్వరములు క్రమముగ నాయాదోషమునకు జెప్పిన (సాయంకాలము, మధ్యాహ్నము, పూర్వాహ్నము, రాత్రి మూడవభాగము, మధ్యరాత్రి మొదటియామము, గ్రీష్మఋతువు, శరదృతువు, వసన్తఋతువు) కాలమున నాయాదోషమున గలుగు జ్వరము వ్యాపించుచు. ఒకవేళ యితరకాలమున ప్రారంభించినను ఆయాదోషమునకు జెప్పినకాలమున ఆయాదోషమున గలుగు జ్వరము వృద్ధినొందును).

మరియు నేయేదోషము ప్రకోపించుటకు ఏయేది నిదానముగ జెప్పబడెనో ఆయాదోష ప్రకోపమునగలుగు జ్వరమునకు ఆయానిదానము అపశయముగనుండును. ఆయాదోషమునకు జెప్పిన నిదానమునకు విరుద్ధగుణముగల వస్తుసేవనముచేత నాయాజ్వరము శాన్తినొందును.

ఇచ్చట నీవివరణము నెఱుంగునది.—వాతప్రకోపమునకు రాత్రియందును పగటియందును మూడవభాగంబును గ్రీష్మఋతువును కాలముగ జెప్పబడినది. అట్టివాతప్రకోపమున గలిగిన జ్వరము వాతప్రకోపమునకు పైజెప్పిన కాలముననే వ్యాపించును. లేక వృద్ధినొందును. పగటియొక్కయు రాత్రియొక్కయు మధ్యాకాలంబును, శరదృతువును పిత్తప్రకోపకాలము. పిత్తప్రకోపమున జనించిన జ్వరము పైజెప్పిన పిత్తప్రకోపకాలమున వ్యాపించును. లేక ఆకాలమున వృద్ధినొందును. అహోరాత్రముల మొదటిభాగమునను వసన్తకాలమునను కఫము ప్రకోపించును. కఫమున జనించు జ్వరము ఆకాలమున వ్యాపించును. లేక వృద్ధినొందును.

మరియు తిక్తోషణకషాయాదిరసములు మున్నగునవి వాతమును ప్రకోపింపజేసి వాతజ్వరమును కలిగించును. అట్టి వాతజ్వరమున తిక్తోషణాదుల నుపయోగించినచో

నాజ్వరమునకు అనుపశయములై (జ్వరమును వృద్ధినొందించి శరీరమునకు కష్టమును కలిగించునవి) యుండును. వాతప్రకోపణములగు తిక్తోషణాది కారణములకు విరుద్ధగుణములు కలవానిని సేవించినయెడ, వాతజ్వరము శాంతినొంది శరీరమునకు సుఖమును కలిగించి ఉపశయములగును. ఇదియే జ్వరమునకు సాత్మ్యము. ఇత్తెరంగుననే పిత్తకఫజ్వరములకు గూడ నుపశయానుపశయముల నెఱుంగునది. (పైజెప్పిన నిర్ణయప్రకారము జ్వరము వ్యాపించుకాలమునుబట్టియు,జ్వరమున కుపశయానుపశయ భేదముల బట్టియు వాతాదిజ్వరముల నిర్ణయింపనగునని ముఖ్యభావము).

దోషద్వయసంసర్గజజ్వరసామాన్యలక్షణము.

యథాస్వ లిఙ్గసంసర్గే జ్వరస్సంసర్గజః

వాతాదిజ్వరములకు వేర్వేరుగ పైజెప్పిన లక్షణములలో రెండేసి దోషముల లక్షణములు మిశ్రముగ కలిసియున్నచో ద్వంద్వజనితజ్వరమని యెఱుంగునది.

(వాతపిత్తజ్వరములకు వేరువేరుగజెప్పిన లక్షణములుకలిసియున్నచో వాతపిత్తజ్వరమనియు, వాతకఫజ్వరముల రెండిటిలక్షణములు కలిసియున్నచో వాతకఫజ్వరమనియు, పిత్తకఫజ్వరముల రెండిటిలక్షణములు కలిసియుండునెడ పిత్తకఫజ్వరమనియు నెఱుంగదగునని భావము.)

వాతపిత్తజ్వర విశేషలక్షణము.

అపి చ. ౨౩

శిరోఽర్తిమూర్ఛావమిదాహమోహ
కణ్ఠాస్యశోషాఽరతిపర్వభేదాః,
ఉన్నిద్రతా తృట్ భ్రమరోమహర్షా
జృమ్భాతివాక్త్వం చ చలాత్సపిత్తాత్. ౨౪

మరియు పిత్తముతోగూడిన వాతమున గలిగిన జ్వరమునందు తలనొప్పియు, మూర్ఛయు, వాంతియు, తాపంబును కలుగును. చీకటిసున్నట్లు నేమియు దోచకుండును. కుత్తుకయు నోరును ద్రవములేక యుండును. అన్నిపనులయందు నాసక్తిబొడమదు. సంధిబంధముల (కీళ్ల)యందు పగులదీయునట్లు బాధకలుగును. నిదురపట్టదు. దప్పియధికమగును. చక్రముపైనున్నవానివలె నొడలుతిరుగునట్లుండును. రోమాంచము కలుగును. ఆవలింతలు విశేషముగ వెడలును. తనకిచ్చవచ్చినట్లెల్ల విశేషముగ మాటలాడును. (ఇవి యన్నియు కలిగినది వాతపిత్తజ్వరమని యెఱుంగునది.)

పైజెప్పిన లక్షణములలో తలనొప్పి, నిద్రాహాని, జృంభణము, రోమాంచము, కంఠాస్యశోషము, ఇవి వాతజ్వరమున సంభవించునవి. ప్రలాపము, భ్రమము, మూర్ఛ,

అరతి, వమనము, దప్పి, ఈలక్షణములు పిత్తజ్వరమున గలుగునవి. ఇత్తెరంగుననే తక్కిన రెండు సంసర్గజ్వరములయందు నూహించుకొనది.

## కఫవాతసంసర్గజజ్వరము.

తాపహాన్యరుచిపర్వశిరోరుక్ పీనసశ్వసనకాసవిబన్ధాః,
శీతజాడ్యతిమిరభ్రమతన్ద్రాః శ్లేష్మవాతజనితజ్వరలిఙ్గమ్. ౨౫

కఫవాతముల సంసర్గమునగల్గిన జ్వరమునందు శరీరతాపము (వేడి) తక్కువగ నుండును. అరోచకంబును, కీళ్లనొప్పియు, తలనొప్పియు, పడిసెంబును, శ్వాసకాసంబులును కలుగును. మలమూత్రములు బద్ధగించును. చలిపుట్టును. తడిగుడ్డ గప్పినవిధముగ శరీరము స్తంభించియుండును. చీకటియున్నరీతిగ కన్నులు కనబడకుండును. మైకము గ్రమ్మును. ఈలక్షణములు కల్గినది కఫవాతజ్వరమని యెఱుంగనది.

## కఫపిత్తసంసర్గజ్వరము.

శీతస్తమ్భస్వేదదాహాఽవ్యవస్థాస్తృష్ణా కాసః శ్లేష్మపిత్తప్రవృత్తిః,
మోహస్తన్ద్రా లిప్తతిక్తాస్యతా చ జ్ఞేయం రూపం శ్లేష్మపిత్తజ్వరస్య.

కఫపిత్తముల సంసర్గమున గల్గిన జ్వరమునందు చలియు, స్తంభంబును, చెమటయు, తాపంబును కాలనియమములేక పలుమారు కల్గుచుండును అధికముగ దప్పికలుగు. దగ్గువచ్చును. కఫంబును పిత్తరసరును నోటవెడలును. చిత్తభ్రమముకల్గును. మైకము గ్రమ్మును. నోట జిగురుకల్గును. (ఇట్టిలక్షణములబట్టి కఫ పిత్తజ్వరమని యెరుంగునది.

ఇచ్చట నీవిమర్శనము నెరుంగునది:—వాతజ్వరలక్షణమును జెప్పునపుడు శిరస్సు పాదములు మున్నగునవయవభేదములయందు నిర్ణయముగ లేక ఒకప్పుడు శిరమునందును, ఇంకొకప్పుడు వేరొక అవయవమునందును లోలుత జ్వరము వ్యాపించుననియు, పిత్తజ్వరమున సర్వాంగమునందును సమకాలమున వ్యాపించుననియు, జ్వరము విడచునప్పుడును పైజెప్పినరీతిగనే విడువనారంభించుననియు పైని చెప్పబడినది. వాతపిత్తముల సంసర్గమునగల్గు జ్వరమున వాతమునకు జెప్పినరీతిగ జ్వరము వ్యాపించుటయు, విడువనారంభించుటయు వ్యవస్థ లేకుండునా? లేక పిత్తమునకు జెప్పిన విధముగ సమకాలమున సర్వాంగముల వ్యాపించి, అలాగుననే విడువనారంభించునా? యని యాశంకకల్గును. ఇచ్చట రెండిటిచేగల్గిన జ్వరమున రెండిటికి జెప్పిన లక్షణములు కల్గుటయుక్తము; అయినను రెండులక్షణములును పరస్పరవిరుద్ధములగుటంజేసి సమకాలమున సంభవించుట యసంభావితము. కావున వాతపిత్తములలో వాతము బలిష్ఠముగ నున్నాడు వాతమునకు జెప్పినరీతిగ వ్యవస్థలేక జ్వరము వ్యాపించి విడచును. పిత్తము ప్రబలముగ నున్నవాడు పిత్తజ్వరమునుబోలె సమకాలమున సర్వాంగముల వ్యాపించి

యూలాగుననే విడచును. వాతపిత్తములు రెండును సమస్థితి నుండునెడ దేశకాలాదుల ననుసరించి యేదోషమునకు బలవత్త్వముండునో అట్టిదోషమునకు జెప్పినలక్షణము కానంబడుననియు నెరుంగునది. సన్నిపాతజ్వరమునమాత్రము సమకాలమున శరీరమునం దెల్ల వ్యాపించును.

### సన్నిపాతజ్వరము.

సర్వజో లక్షణైస్సర్వైః దాహోఽత్ర చ ముహుర్ముహుః,
తద్వచ్ఛీతం మహానిద్రా దివా జాగరణం నిశి. ౨౭
సదా వా నైవ వా నిద్రా మహాస్వేదోఽతి నైవ వా,
గీతనర్తనహాస్యాదివికృతేహాప్రవర్తనమ్. ౨౮
సాశ్రుణీ కలుషే రక్తే భుగ్నే లులితపక్ష్మణీ,
అక్షిణీ పిణ్డికాపార్శ్వమూర్ధపర్వాస్థిరుగ్భ్రమః. ౨౯
సస్వనౌ సరుజౌ కర్ణౌ కణ్ఠశ్శూకైరివాచితః,
పరిదగ్ధా ఖరా జిహ్వా గురుస్రస్తాఙ్గసన్ధితా. ౩౦
రక్తపిత్తకఫష్ఠీవో లోలనం శిరసోఽతిరుక్,
కోఠానాం శ్యావరక్తానాం మణ్డలానాం చ దర్శనమ్. ౩౧
హృద్వ్యథా మలసంసర్గః ప్రవృత్తిర్వాఽల్పశోఽతి వా,
స్నిగ్ధాస్యతా బలభ్రంశః స్వరసాదః ప్రలాపితా. ౩౨
దోషపాకశ్చిరాత్తన్ద్రీ ప్రతతం కణ్ఠకూజనమ్,
సన్నిపాతమభిన్యాసం తం బ్రూయాచ్చ హృతౌజసమ్. ౩౩

వాత పిత్త కఫములు మూడును ప్రకోపించుటచే గల్గిన జ్వరము సన్నిపాతజ్వర మనబడును. ఈ జ్వరమున వాతాదుల మూడిటికిని వేరువేర చెప్పబడిన లక్షణము లన్నియు సంభవించును. ఇంతియకాక యీ క్రింద జెప్పబడు లక్షణములు విశేష ముగ నగుపడును:—జ్వరసంతాపంబును చలియు నియతి లేక మార్చిమార్చి పలుమారు వ్యాపించును. పగటియందు గాఢముగ నిదురబట్టును. రాత్రులయందు బొత్తుగ నిదుర బట్టదు. లేక రేయింబవలును విరామము లేక గాఢముగ నిద్రబట్టును. లేక నిదుర బొత్తుగ బట్టకుండును. శరీరమునందెల్ల ప్రబలముగ చెమటబట్టును. లేక బొత్తుగ చెమట బట్టకుండును. సంగీతము, నాట్యము, నవ్వు మున్నగు వికారపుచేష్టల జేయును. కన్నుల నీరుగ్రమ్ముచు కలకబారి యెఱ్ఱనై వక్రములై కూరుకుబాటు కల్గియుండును. పిక్కల యందును, ఇరుప్రక్కలయందును, తలయందును, నీళ్లయందును, అస్థులయందును తీవ్రమైన నొప్పికల్గును. చక్రముపై నున్నవానింబోలె నొడలు తిరుగుచుండును. చెవు

లలో నొకవిధమైన ధ్వనికల్గి పోటుపుట్టును. కుత్తుకయందు ముండ్లు గుచ్చినవిధముగ నుండును. నాలుక ద్రవములేక యెండి కొరాకువలె కఱకఱకల్గియుండును. అవయవములు బరువుగనుండును. కీళ్లన్నియు సడలియుండును. రక్తంబును పిత్తపసరును కఫంబును ఉమియునప్పుడు నోట వెడలును. తలవిటునటు త్రిప్పుచుండును. అధికముగ తలనొప్పి పుట్టును. శ్యామవర్ణంబులును రక్తవర్ణంబులునైన పొక్కులైనను పొడలైనను కల్గును. గొంతు ప్రబలమైన నొప్పికల్గియుండును. మలమూత్రాదులు వెడలక బద్ధములై బలవంతముచే వెడలును. లేక స్వల్పముగ వెడలును. లేక అధికముగనైన వెడలును. లేక బొత్తుగ వెడలకుండును. నోరు ఆముదముబూసిన విధముగ నిద్దుగల్గియుండును. శరీర బలము చాలహీనముగనుండును. కంఠస్వరము మిక్కిలి హీనముగనుండును. సంబంధము లేనిమాటల నిచ్చలవిడిగ మాటలాడును. ప్రకోపించిన వాతాదిదోషములు చాల కాలమునకు పరిపాకమునొందును. మైకము గ్రమ్మును. దీర్ఘముగ మూలుగుచుండును. ఇవియన్నియు సన్నిపాతజ్వరమునగల్గు విశేషలక్షణములు ఈ సన్నిపాతజ్వరమును అభిన్యాసమనియు, హృతౌజసమనియు మునులు చెప్పెదరు.

ఇచ్చట హృతౌజసమనునది యన్వర్థకము:—శరీరమునందలి రసాదిధాతువుల సారరూపమై శరీరస్థితికి నాధారమై స్నిగ్ధమైన సారము ఓజస్సు. అయ్యది కొంచెము పీతవర్ణంబును రక్తవర్ణంబునై హృదయస్థానమున నియతముగనుండి శరీరమునంతెల్ల వ్యాపించుచుండును. అయ్యది నాశమునొందినచో శరీరము నశించును. శుభ్రముగ నున్నచో శరీరమును పోషించును. అట్టి శరీరాధారమైన యోజస్సును ఈ సన్నిపాత జ్వరము బొత్తుగ జెరచును కావున హృతౌజసమనబడును. ఈ యోజోలక్షణము ప్రకృత గ్రంథమున సూత్రస్థానమున నిట్లు చెప్పబడినది:—

"ఓజస్తు తేజో ధాతూనాం శుక్రాన్తానాం పరం స్మృతం
హృదయస్థమపి వ్యాపి దేహస్థితినిబన్ధనమ్
స్నిగ్ధం సోమాత్మకం శుద్ధం ఈషల్లోహితపీతకమ్
యన్నాశే నియతం నాశో యస్మింస్తిష్ఠతి తిష్ఠతి
నిష్పద్యన్తే యతో భావాః వివిధా దేహసంశ్రయాః"

### సన్నిపాతజ్వరాఽసాధ్యత్వలక్షణము.

దోషే విబద్ధే నష్టేఽగ్నౌ సర్వసంపూర్ణలక్షణః,
అసాధ్యస్సోఽన్యథా కృచ్ఛ్రో భవే ద్వైకల్యదోఽపి వా. 38

వాతము పిత్తము, కఫము, మలము, మూత్రము, మున్నగుదోషములు బైటసరశముగ వెడలక బద్ధగించి జఠరాగ్ని పూర్తిగ నశించియుండి, సన్నిపాతజ్వరమునకు

పైనిచెప్పబడిన లక్షణములన్నియుఁ గానవచ్చినచో నట్టి సన్నిపాతజ్వరము సాధింపనలవి కాదు. కాయాగ్ని నశించియున్నను సన్నిపాతజ్వరమునకు జెప్పినలక్షణములన్నియుం లేక కొన్నిమాత్రము గానవచ్చినచో మిక్కిలి పూనికతో మెలకువచే చికిత్సచేసిన నొకసమయమున కష్టముచే సాధింపనగుచుండును. ఒకవేళ నయ్యాదియుం నసాధ్యమై యాపత్తును గలిగించును.

(సన్నిపాతజ్వరము సామాన్యముగనే కృచ్ఛ్రసాధ్యము. అందును దోషములు విడలక బద్ధగించి, కాయాగ్ని పొత్తుగ నశించియుండి సన్నిపాత లక్షణములన్నియుం పూర్తిగ గానంబడినవాడు అసాధ్యమగుననియుం, అటుగాక సాన్నిపాతిక లక్షణములలో గొన్నిమాత్రము సంభవించినవాడు కృచ్ఛ్రసాధ్య మగుననియు భావము.)

ఇచ్చట దోషశబ్దమునకు "దూషయన్తి (వ్యాపన్నాః) శరీరం ఇతి దోషాః" అనువ్యుత్పత్తిచేత త్రిదోషంబులును మూత్రపురీషాదులును గ్రహింపబడును. దోషము లనేకములైనను దోషశబ్దము జాతిమాత్రవివక్షితము గాన ఏకవచనముగ ('దోషే'యని) నిర్దేశించినది సంగతము. మరియుం జ్వరసామాన్యముగ జాఠరానలము నశించియే యుం డును. సన్నిపాతజ్వరమున జ్వరసామాన్యమువలె గాక అంతకన్న నధికముగ సన్నిపాత జ్వరమున నశించియుండుననుభావము దెలుపుటకై "నష్టేఽగ్నౌ" అని ప్రత్యేకముగ మరల చెప్పబడెను.

## దాహ-శీతపూర్వ సన్నిపాతజ్వర సంప్రాప్తి.

అన్యచ్చ సన్నిపాతోత్థో యత్ర పిత్తం పృథక్ స్థితమ్,
త్వచి కోష్ఠేఽథవా దాహం విదధాతి పురోఽను వా. 3౫

వాతపిత్తకఫములు మూడును ప్రకోపించిజ్వరము సంభవించినను, అందుపిత్తము మాత్రము వాతకఫములతో గలియక వేరుగనుండి జ్వరము ప్రారంభమగునపుడు లోలుతనైనను, విడచునపుడు అంతముననైనను, చర్మముపైనైనను కోష్ఠమునందైనను వ్యాపించి తాపమునుబుట్టించును. ఇయ్యది వేరొక సన్నిపాతజ్వరము. (ఇచ్చట అన్యత్ అనునది అన్యశబ్దార్థకమైన యవ్యయము)

ఇచ్చట నీవివరము నెరుంగునది:—సన్నిపాతజ్వరమున వాతాదులు మూడును ప్రకోపించుట సాజము. అందు పిత్తముమాత్రము వాతకఫములతో గలియక స్వతంత్ర ముగనుండి జ్వరప్రారంభముననే చర్మముపై వ్యాపించును. అట్టియెడశరీరముపైని తాప మధికముగను, శరీరములోభాగమున కొద్దిగనుండును. అట్టిపిత్తముకోష్ఠము(శరీరాన్తర్భా గము)నజేరి లోలుత వ్యాపించునెడ లోపల తాపమధికమై బైటస్వల్పముగనుండును.

పిదప వాతకఫములు ప్రకోపించి వ్యాపించి పిత్తమును తిరస్కరించి శీతమును (చలిని) బుట్టించును. ఇదియే దాహపూర్వసన్నిపాతము.

పైజెప్పినరీతిగ పిత్తము వేరుగ ప్రకోపించి జ్వరముయొక్క అంతమున చర్మముపై వ్యాపించి తీవ్రమైన సంతాపమును బైటకలిగించును. కోష్ఠమునజేరినచో తీవ్రతాపమును అంతశ్శరీరమున గలిగించును. ఇందులోలంత వాతకఫములు ప్రకోపించి చలినిపుట్టించును. పిదప పిత్తప్రకోపమునంజేసి జ్వరము తీవ్రముగ వ్యాపించును. ఇయ్యదిశీతపూర్వసన్నిపాతజ్వరము.

## దాహశీత పూర్వజ్వరములలో తారతమ్యము.

తద్వద్వాతకఫౌ శీతం దాహాదిర్దుస్తరస్తయోః,

పైని పిత్తమునకు జెప్పినరీతిగ వాతకఫములు రెండును పిత్తమున జేరక ప్రకుపితములై జ్వరము ప్రారంభించుటకుమున్ను చలిని పుట్టించును. పిదప పిత్తము ప్రకుపితమై తాపమును బుట్టించి జ్వరమును వ్యాపింపజేయును. ఇయ్యది శీత పూర్వసన్నిపాతము. అలాగుననే వాత కఫములు జ్వరాంతమున ప్రకుపితములై జ్వరము విడచు సమయమున చలిబుట్టించును. ఇయ్యదియే దాహపూర్వ సన్నిపాతము. ఈ రెంటిలో దాహపూర్వ సన్నిపాతము మిక్కిలి కష్టసాధ్యము.

## శీతపూర్వసన్నిపాతలక్షణము.

శీతాదౌ తత్ర పిత్తేన కఫే స్యన్దితశోషితే. 3౬
శీతే శాన్తేఽమ్లకో మూర్ఛా మదస్తృష్ణా చ జాయతే,

పైజెప్పిన రెండిటిలో శీతపూర్వసన్నిపాతమున ప్రకోపించి బలిష్ఠమైన పిత్తముచే కఫము సూర్యతాపముచే మంచుగడ్డ బోలె కరిగి పలుచనై ద్రవించును. లేక శోషించును. శీతము శాన్తినొందును. దానంజేసి పుల్లనిరసము వాంతియగును. మూర్ఛ గ్రమ్మును. లొక్కయెత్తినవిధముగనుండును. దప్పి యధికమగును.

## దాహపూర్వసన్నిపాతలక్షణము.

దాహాదౌ పునరన్తే స్యుస్తన్ద్రాష్ఠీవవమిక్లమాః. 3౭

జ్వరతాపము ముందు వ్యాపించి చలిజ్వరాంతమునగల్గు దాహపూర్వజ్వరమున జ్వరాంతమున కునికిపాటుకల్గును, కఫము నుమియును. వాంతియగును. బడలిక కల్గును.

ఇచ్చట పిత్తప్రకోపమున తొలుత జ్వరము వ్యాపించునపుడు పిత్తముచే కఫము కలుగును. పిదప కఫము ఉద్రేకించి పిత్తమును శమింపజేసి వ్యాపించును. అట్టి కఫోద్రేకముననే తంద్ర మున్నగు లక్షణములు జ్వరాంతమున కనబడునని భావము.

### ఆగంతుజ్వరభేదములు.

**ఆగన్తురభిఘాతాభిషఙ్గశాపాఽభిచారతః,**
**చతుర్ధా**

మిథ్యాహారాదులు గాక బాహ్యకారణములచే గల్గినది యాగంతుజ్వరము. అయ్యది అభిఘాతము (దెబ్బతగులుట మున్నగునవి), అభిషంగము (భూతావేశము మున్నగునవి), శాపము (అపచారాది కారణములచే పెద్దలు కోపించి యొసగిన శాపాదులు), అభిచారము (క్రూరదేవతా ప్రయోగాదులు) అను నీనాల్గుకారణములచే జనించుటంజేసి నాలుగువిధములుగనుండును.

### అభిఘాతజ్వరసంప్రాప్తిలక్షణము.

**అత్ర క్షతచ్ఛేదదాహాద్యైరభిఘాతజః. ౩౮**
**శ్రమాచ్చ తస్మిన్ పవనః ప్రాయో రక్తం ప్రదూషయన్,**
**సవ్యథాశోఫవైవర్ణ్యం సరుజం కురుతే జ్వరమ్. ౩౯**

పైజెప్పిన యాగంతుజ్వరభేదములలో నభిఘాతజ్వరము గాయములు తగులుట చేతను, కత్తిమొదలగు నాయుధములచే నరుకుటచేతను, నిప్పునకాలుట మున్నగు బాహ్యకారణములచేతను కలుగును. త్రోవనడచుట మున్నగు శరీరమున కాయాస మును గలిగించు పనులజేసినను ఆగంతుజ్వరము సంభవించును. ఈ యభిఘాతజ్వరమును ప్రాయికముగ పైజెప్పిన కారణములచే వాతము ప్రకోపించి రక్తమును జెరిచి బాధను వాపును వివర్ణతను నొప్పిని కలిగించుచు జ్వరమును కలిగించును.

ఇచ్చట "పవనః ప్రాయః" అని చెప్పుటచేత నీ యభిఘాతజ్వరమునందు తరుచుగ వాతము ప్రకోపించును. ఒకసమయమున నితరదోషములు ప్రకోపించినను వాతము ప్రధానమై యుండునని యెరుంగునది.

### అభిషంగజ్వరకారణములు.

**గ్రహావేశౌషధివిషక్రోధభీశోకకామజః,**
**అభిషంగాత్**

భూతనాదిగ్రహముల యావేశముచేనైనను, క్రూరమైన యౌషధములనుండి వచ్చు గాలి నాఘ్రాణించుటచేనైనను, స్థావర జంగమరూప విషసంబంధముచేనైనను, క్రోధముచేనైనను, భయముచేనైనను, దుఃఖముచేనైనను, కామోద్దీపనముచేనైనను కలిగినజ్వరము అభిషంగజమని యెరుంగునది.

### గ్రహావేశాభిషంగజ్వరలక్షణము.

**గ్రహేణాస్మిన్ అకస్మాద్ధాసరోదనే. ౪౦**

పైజెప్పిన యభిషంగజ్వరములలో గ్రహావేశమున గలిగిన జ్వరమునందు కారణము లేకయే నవ్వును ఏడుపును వచ్చును.

ఓషధి-విషాదులచేగలిగిన జ్వరలక్షణములు.

ఓషధీగన్ధజే మూర్ఛాశిరోరుగ్వేపథుః క్షవః,
విషాన్మూర్ఛాతిసారాస్యశ్యావతా దాహహృద్గదాః. ౪౧
క్రోధాత్కమ్పః శిరోరుక్చ ప్రలాపో భయశోకజే,
కామాద్భ్రమోఽరుచిర్దాహో హ్రీ నిద్రాధీధృతిక్షయః. ౪౨

విషౌషధుల పుష్పము మున్నగు వానినుండి వచ్చు గంధమును మూర్కొనుటచే గలిగిన జ్వరమునందు మూర్ఛగ్రమ్మును. తలనొప్పి కలుగును. శరీరము వణకును. తుమ్ములు వెడలును. విషముచే గలిగినజ్వరమునందు మూర్ఛగలుగును. విరేచనములు కలును. ముఖము నల్లబడును. తాపమధికమగును. రొమ్మునొప్పిపుట్టు. క్రోధాతిశయముచేగలిగిన జ్వరమునందు కంపముపుట్టును. తలనొచ్చును. భయముచేతను దుఃఖముచేతను కలిగిన జ్వరమునందు నోటికివచ్చినట్లు లెల్ల నసంబద్ధముగవదరును. మదనవికారమున గలిగినజ్వరమున అరోచకంబును తాపంబును కలుగును. లజ్జయు నిద్రయు బుద్ధియు ధైర్యంబును నశించును.

అభిషంగజ్వరములయందు దోషసంబంధము.

గ్రహాదౌ సన్నిపాతస్య, భయాదౌ మరుతస్త్రిషు,
కోపః కోపేఽపి పిత్తస్య

గ్రహావేశము, ఓషధిసంబంధము, విషము, అనునీమూడు కారణములచే గల్గిన జ్వరముల మూడిటియందును మూడుదోషంబులును సమముగ బ్రకోపించును. భయము, శోకము, కామము, అనునీకారణములచే గల్గిన జ్వరముల మూడిటియందును వాతము ప్రకోపించును. కోపమునగల్గిన జ్వరమునందు పిత్తము ప్రకోపించును.

(ఇచ్చట 'కోపేఽపి పిత్తస్య' అనుచోట అపిశబ్దముచేత కోపమునగలిగిన జ్వరమునందు వాతమునుగూడ బ్రకోపించునని తెలిసెడిని.)

శాప-అభిచారజజ్వరలక్షణములు.

యౌ తు శాపాభిచారజౌ. ౪౩
సన్నిపాతజ్వరౌ ఘోరౌ తావసహ్యతమౌ మతౌ,

పెద్దలశాపమున గలిగిన జ్వరమందును, అభిచారమున (గ్రహప్రయోగాదులచే) గల్గినజ్వరమునందును వాతపిత్తకఫములు మూడును బ్రకోపించును. అట్టిసన్నిపాత జ్వరములురెండును మిక్కిలి క్రూరములై యోర్వరాని బాధల గలిగించును.

సన్నిపాతజ్వరములన్నియు క్రూరములై యోరువనశక్యములైయుండును. అందు నీయభిఘాతాభిచార జ్వరములురెండును మిక్కిలి క్రూరములై యితరసన్నిపాతములకన్న నధికముగ నోరువశక్యములుగాకుండునని తెలియుటకై "తావసహ్యతమౌ మతౌ" అని చెప్పబడెను.

ఆభిచారికజ్వరసంప్రాప్తిక్రమము.

తత్రాభిచారికైర్మన్త్రైః హూయమానస్య తప్యతే. ౪౪
పూర్వం చేతస్తతో దేహః తతో విస్ఫోటతృడ్భ్రమైః,
సదాహమూర్ఛైర్గ్రస్తస్య ప్రత్యహం వర్ధతే జ్వరః. ౪౫

కొందరు దుష్టస్వభావముకలవారు విరోధముచేత నధర్వణ వేదమంత్రముల నుచ్చరించి తనకు శత్రువైనవానిపేరుజెప్పి హోమముజేయుదురు; అట్టియెడ నెవ్వని పేరుచ్చరింపబడునో వానిమనసున తొలుత సంతాపము కలుగును. పిమ్మట దేహముపై జ్వరము వ్యాపించును. పిమ్మట స్ఫోటకములును, దప్పియు, భ్రమంబును వరుసగ జనించును. తాపమధికమగును. మూర్ఛగ్రమ్మును. ఇత్తెరంగున ప్రతిదినంబును నానాట జ్వరము వృద్ధినొందును.

జ్వరసామాన్యద్వైవిధ్యము.

ఇతి జ్వరోఽష్టధా దృష్టః సమాసాద్ద్వివిధస్తు సః,
శారీరో మానసస్సౌమ్యః తీక్ష్ణోఽన్తర్బహిరాశ్రయః. ౪౬
ప్రాకృతో వైకృతస్సాధ్యోఽసాధ్యః సామో నిరామకః,

ఇత్తెరంగు వాతాదిదోషములలో వేర్వేరుగను సంసర్గమునను సన్నిపాతముచేతను జనించుజ్వరములేడును, ఆగంతుజ్వర మొకటియు గలిసి జ్వరభేదము లెనిమిదియు వానియవాంతర భేదములతో సవిస్తరముగ జెప్పంబడియె. ఇవియే ప్రాచీనులగు ఋషిపుంగవులచే కనిపెట్టబడినవి. మరియు నీజ్వరములన్నియు. శారీరమానసభేదములచే రెండువిధంబులును; సౌమ్య-తీక్ష్ణభేదములచే రెండువిధంబులును; అంతరాశ్రయ బహిరాశ్రయభేదములచే రెండువిధంబులును, ప్రాకృత-వైకృతభేదములచే రెండువిధంబులును; సాధ్య-అసాధ్యభేదములచే రెండువిధంబులు నగును.

శారీరమానసజ్వరలక్షణము.

పూర్వం శరీరే శారీరే తాపో మనసి మానసే. ౪౭

శారీరజ్వరమున తొలుత శరీరమున తాపముకలిగి పిమ్మట మనస్సున సంతాపము కలుగును. మానస (మనస్సంబంధమైన) జ్వరమునందు తొలుత మనస్సున సంతాపము కలిగి పిమ్మట శరీరమున తాపముకలుగును.

### సౌమ్యతీక్ష్ణజ్వరములు.

పవనే యోగవాహిత్వాచ్ఛీతం శ్లేష్మయుతే భవేత్,
దాహః పిత్తయుతే మిశ్రం మిశ్రే

వాతము యోగవాహి:—అనగా నయ్యది దేనితో జేరునో దానియందలి గుణమును కలిగియుండును. (వాతము ఉష్ణగుణముకలదానితో జేరిన నుష్ణము వాతమునకు సంక్రమించును. శీతగుణముకలదాని సంబంధము కలిగినచో శీతగుణము సంక్రమించును.) కావున అట్టివాతము కఫమునకలిసి యున్నపుడుకలిగిన జ్వరమున (వాతకఫజనితజ్వరమున) చలికూడ మిశ్రముగనుండును ఆట్టియోగవాహియగువాతము(ఉష్ణగుణప్రధానమైన) పిత్తముతో గూడినపుడు కలిగిన (వాతపిత్త) జ్వరమునందు తాపము అధికముగనుండును. ఆట్టివాతము కఫపిత్తముల రెండిటిగూడి జ్వరమును గలిగించినచో తాపంబును చలియుకలిసి యొకసమయమున చలియు మరియొకసమయమున తాపంబును కలుగుచుండును.

(పైజెప్పినరీతిగ వాతకఫజ్వరము సౌమ్యంబనియు, వాతపిత్తజ్వరము తీక్ష్ణంబనియు, పిత్తకఫముల రెంటితోగూడిన వాతమునగలిగిన జ్వరముమిశ్రంబనియు నెరుంగునది.)

### అంతరాశ్రయ బహిరాశ్రయజ్వరములు.

అన్తస్సంశ్రయే పునః. ౭౮
జ్వరేఽధికవికారాస్స్యు రన్తఃక్షోభో మలగ్రహః,
బహిరేవ బహిర్వేగే తాపోఽపి చ సుసాధ్యతా. ౭౯

శరీరమునందు లోభాగము నాశ్రయించికలిగినది యంతరాశ్రయజ్వరము. ఈ జ్వరమునందు నానావిధములైన వికారములు శరీరాన్తర్భాగమున విశేషముగగలుగును. కడుపులో తాపమధికముగనుండును. మలమూత్రాదులు బంధింపబడి బైటవెడలకుండును, (ఇయ్యది కష్టసాధ్యము). బహిర్వేగజ్వరమున శరీరమున పైభాగమున తాపమధికముగ నుండును. ఈజ్వరమునం దంతస్తాపంబును మలమూత్రాది బంధంబును కలుగదు. దానం జేసియె యీజ్వరము సుఖసాధ్యమగును.

### ప్రాకృత వైకృతజ్వరములు.

వర్షాశరద్వసన్తేషు వాతాద్యైః ప్రాకృతః క్రమాత్,
వైకృతోఽన్యస్స దుస్సాధ్యః ప్రాయశ్చ ప్రాకృతోఽనిలాత్. ౮౦

వర్షాశరద్వసన్త ఋతువులయందు క్రమముగ వాతపిత్తకఫములచే గలిగిన జ్వరములు ప్రాకృతమనబడును. (వర్షర్తువున వాతముచేగలిగిన జ్వరంబును, శరదృతువున పిత్తముచే గలిగినజ్వరంబును, వసన్తఋతువున కఫముచే గలిగినజ్వరంబును ప్రాకృతమని

భావము). ఆటుగాక గ్రీష్మశిశిరహేమన్తములయందు కలిగినజ్వరంబును,వర్షాశరద్వసన్త ఋతువులయందును పైజెప్పిన క్రమమునగాక దోషవ్యత్యయమున జనించిన జ్వరంబును వైకృతమనబడును. ఆట్టి వైకృతజ్వరము దుస్సాధ్యము. మరియు వాతముచేగలిగిన ప్రాకృతజ్వరంబును ఒక సమయమున దుస్సాధ్యమగును

వైకృతజ్వరము కష్టసాధ్యమనుటచే ప్రాకృతజ్వరము సుఖసాధ్యమనియర్థముచే లభించును.ఈవిషయమునే చరకాచార్యులు "ప్రాకృతస్సుఖసాధ్యస్తు వసన్తశరదుద్భవః" అనువాక్యముచే నుపదేశించెను.

ఇచ్చట నీవిషయమును గమనించునది:—వర్షర్తువునందు వాతంబును, శరదృతువున పిత్తంబును, వసన్తఋతువున కఫంబును స్వభావముచేతనే ప్రకోపించియుండును. వర్షఋతువునకలిగిన వాతజ్వరమునను, శరదృతువునకలిగిన పిత్తజ్వరమునను, వసన్తర్తువునకలిగిన కఫజ్వరమునను ఆయాఋతువునకును వాతాదిదోషములకును గుణములు సమానములై యుండును. కావున ఆట్టి ప్రాకృతజ్వరము సుఖసాధ్యమై యుండును. ఈ విషయము తన్త్రాన్తరమున నిట్లు చెప్పబడినది:—"జ్వరే తుల్యర్తుదోషత్వం ప్రమేహే తుల్యదూష్యతా, రక్తగుల్మే పురాణత్వం సుఖసాధ్యస్య లక్షణమ్" (ఋతుధర్మమునకును దోషమునకును గుణములు సమానములుగ నున్నచో జ్వరము సుసాధ్యమనిభావము.)

## వర్షాకాలప్రాకృతజ్వరము.

వర్షాసు మారుతో దుష్టః పిత్తశ్లేష్మాన్వితో జ్వరమ్,
కుర్యాత్

వర్షర్తువునందు వాతము స్వకారణములచే ప్రకోపమునొంది పిత్తకఫములతో గూడి జ్వరమును గలిగించును. ఇయ్యది ప్రాకృతజ్వరము.

ఇచ్చట వర్షర్తువున బుట్టునట్టి ప్రాకృతజ్వరమున వాతము ప్రకుపితమై ప్రధానముగనుండును. దానికి పిత్తకఫములు రెండును దోడై యనుబలముగ నుండునుగాని సన్నిపాతజ్వరమునుబోలె ప్రధానములై జ్వరమును గలిగింపవు. కావున సన్నిపాతమున కంటె భేదము నీరీతి నెరుంగునది.

## శరత్కాలప్రాకృతజ్వరము.

పిత్తం చ శరది తస్య చానుబలం కఫః ౫౧
తత్ప్రకృత్యా విసర్గాచ్చ తత్ర నానశనాద్భయమ్,

శరదృతువునందు పిత్తము ప్రకుపితమై ప్రాకృతజ్వరమును కలిగించును. (వర్షఋతువునచయావస్థనొందిన పిత్తము శరదృతువున ఋతుస్వభావముచేతనే ప్రకోపము నొంది జ్వరమును గలిగించును. అయ్యది ప్రాకృతమనిభావము). జ్వరమునకు ప్రధాన

కారణమైన పిత్తమునకు అనుబలము (సహకారి)గ కఫముండును. (లోకమున నొక ప్రభువు ప్రధానుడై దండయాత్ర వెడలినపుడు చతురంగబలమును వెడలి యుద్ధసమయమున దోడ్పడు భంగి ప్రకుపితమై ప్రధానముగ నుండు పిత్తము జ్వరమును గలిగించు తరి కఫము సహకారియై యుండుననని భావము). అట్టి వర్షాశరత్కాలముల బుట్టిన వాతిక పైత్తిక జ్వరముల స్వభావముచేతను, అట్టికాలము విసర్గ (బలమును గలిగించు సౌమ్య) కాలమగుటంజేసియుం అనశనరూపమైన లంకణముచేయించినను అపాయము లేదు.

పైజెప్పిన రెండు ఋతువులును మనుజులకు బలమును కలిగించుకాలము. అట్టి పిత్తమునకుపబలముగనుండునది కఫము. కావున నీరెండు కారణములనుబట్టి అట్టి ప్రాకృత జ్వరమున లంకణము చేయించినచో ప్రత్యవాయముండదు. ఇతరకాలమైన విసర్గ కాలమున వాతపిత్తములచే గలిగినజ్వరమునందు లంకణముచేయించినచో భయముకలుగుననియుం భావము.

వసన్తకాలప్రాకృతజ్వరము.

కఫో వసన్తే తమపి వాతపిత్తం భవేదను. ౫౨

కఫమువసన్తఋతువున ప్రకోపించి ప్రాకృతజ్వరమును కల్గించును. అట్టికఫమునకు వాతపిత్తములు రెండును ఉపబలములై సహకారులుగ నుండును.

ఇచ్చట జ్వరమునకు ప్రధానకారణమైన కఫముఒక్కటి సౌమ్యస్వభావమైనను, కాలము ఆదానకాల (ఆగ్నేయ)మై, అనుబలములగు వాతపిత్తములును ఆగ్నేయములగుటంజేసి లంకణముచేయించినచో ధాతువులు శోషించును. కావున వసన్తకాలమున గలుగు ప్రాకృతజ్వరము లంకణమొకప్పుడును జేయుందగదు. వర్షాశరత్కాలముల జనించిన ప్రాకృతజ్వరమునందు సౌమ్యమైనకఫము అనుబలముగనుండును. విసర్గకాలము సౌమ్యము. ఈరెండుకారణముల బలమునుజేసి యకాలమునగలుగు ప్రాకృతజ్వరమున అనశనరూపమైన లంకణమును జేయించినను ధాతువులు క్షీణింపవు; కావున లంకణముచే నపాయము కలుగబోదు.

కొందరు ఈజ్వరము ఆమాశయమునగలుగుటంజేసియు, వాతకఫములచేగలుగుటచేతను సామాన్యముగ నీజ్వరమునందును లంకణముచే భయములేదని చెప్పెదరు.

సాధ్య-అసాధ్యజ్వరలక్షణములు.

బలవత్స్వల్పదోషేషు జ్వరస్సాధ్యోఽనుపద్రవః,
సర్వథా వికృతిజ్ఞానే ప్రాగసాధ్య ఉదాహృతః. ౫౩

రోగులు బలవంతులై (యౌవనాదిసంపత్తిచేత బలశాలులై) యుండుతరి వాతాదిదోషములు మిక్కిలి బలిష్ఠములు గాక స్వల్పము లైయుండి శ్వాసమున్నగు నుపద్రవములు లేక యున్నచో సాజ్వరము సుఖముగ సాధింపందగినదియుండును. మరియు ఎట్టిరోగికి ఏవిధమైనజ్వరము సంభవించినచో నసాధ్యమగునో అట్టి యసాధ్యలక్షణములు శారీరస్థానమునందలి వికృతివిజ్ఞానీయాధ్యాయమున జెప్పబడినది.

సామజ్వరలక్షణము.

జ్వరోపద్రవతీక్ష్ణత్వం అగ్లానిర్బహుమూత్రతా,
న ప్రవృత్తిర్న విట్ జీర్ణా న క్షుత్ సాఽఽమజ్వరాకృతిః. ౫౪

జ్వరమునగలుగు ప్రలాపము భ్రమము మున్నగు నుపద్రవములు మిక్కిలి తీవ్రములుగనుండుట, శరీరము వాడకుండుట, మూత్రము మితిమీరి వెడలుచుండుట, మలము వెడలకుండుట,ఒకవేళ వెడలినను అయ్యది జీర్ణము గాకుండుట,ఆకలి బొత్తుగ లేకుండుట, ఇట్టి లక్షణములున్నపుడు జ్వరము జీర్ణముకాని దశయందున్నదని యెరుంగునది.

పచ్యమానజ్వరలక్షణము.

జ్వరవేగోఽధికస్తృష్ణా ప్రలాపశ్శ్వసనం భ్రమః,
మలప్రవృత్తి రుత్క్లేశః పచ్యమానస్య లక్షణమ్. ౫౫

జ్వరము పరిపక్వమగుసమయమున జ్వరవేగము మిక్కిలి తీవ్రముగనుండును. దప్పియధికమగును. అసంబద్ధముగ మాటలాడును. శ్వాసమధికముగ వెడలును. చక్రముపైనున్నవానివలె నొడలుతిరుగును. మలమూత్రాదులు ధారాళముగ వెడలును. ఓకలింతలువచ్చును. ఈలక్షణములు గాన్పించినపుడు జ్వరము పాకావస్థ నొందుచున్నదని యెరుంగునది.

జ్వరసామాన్యమును నిర్దేశించునపుడు శారీరమానసాదిభేదములచే రెండేసివిధముల పరిగణింపబడియె. అందు పచ్యమానజ్వరమును జెప్పియుండలేదు. అట్టియెడ పచ్యమానజ్వరమును వానిలోజేర్చి చెప్పుటయెట్లు సంగతమగునని యాశంక కలుగును. దానికి సమాధానము నెరుంగునది:—పచ్యమానావస్థ యన జ్వరము పరిపక్వమున కభిముఖముగనుండు నవస్థావిశేషము. జ్వరము పరిపాకము నొందినపిదప నిరామ మగును. అంతకుమునుపు పరిపక్వమునొందు సమయమునకూడ జ్వరము సామముగనే యుండునుగాన సామనిరామభేదముల రెంటినిమాత్రము ఆచార్యులు నిర్దేశించిరి. పచ్యమానావస్థకూడ సామమనియే వారి యభిమతము. అయినను మతాన్తరమున జెప్పబడిన పచ్యమానలక్షణమును ప్రకృత గ్రంథకర్త యనువదించెనని యెరుంగునది.

## నిరామజ్వరలక్షణము.

జీర్ణతాఽఽమవిపర్యాసాత్ సప్తరాత్రం చ లఙ్ఘనాత్,

పైజెప్పిన సామజ్వరలక్షణములకన్న విపరీతములగు లక్షణములు కల్గినజ్వరము జీర్ణ (నిరామ) జ్వరమని యెరుంగునది. మరియు జ్వరము ప్రారంభించిన దినము మొదలు ఏడు రాత్రులు గడచినపిదప నెనిమిదవనాఁడు జ్వరము దోషములమలములు పక్వములై నిరామము లగును.

పైజెప్పిన ఆమజ్వరలక్షణములకు విపరీతములైన లక్షణము లెవ్వియన:—జ్వరమున నుపద్రవములైన ప్రలాపము భ్రమము మున్నగునవి తీవ్రములుగాక వేగము తగ్గియుండుట, ఒడలు ముఖము వాడినట్లుండుట, పక్వమైనమలము ధారాళముగ వెడలుట, మూత్రమల్పముగ వెడలుట, ఆకలి పుట్టి యన్నముపై నిచ్ఛబొడముట, ఈలక్షణములు కల్గిననాఁడు జ్వరము నిరామమని యెరుంగునది.

మరియు:—"సప్తాహేన తు పచ్యన్తే సప్తధాతుగతా మలాః, నిరామశ్చాప్యతః ప్రోక్తో జ్వరః ప్రాయోఽష్టమేఽహని" అను చరకవచనప్రకారము జ్వరము ప్రారంభించిననాటి మొదలు ఏడుదినములవరకు రసరక్తమాంసమేదోఽస్థిమజ్జశుక్రములను సప్తధాతువులకు సంబంధించినమలము ఒక్కొకటిగ జీర్ణమగుచుండును. పిమ్మట నెనిమిదవనాఁడుదయమునకు జ్వరము నిరామమగునని యెరుంగునది.

ఇచ్చట నిరామజ్వరలక్షణములు రెండుతెరగుల జెప్పబడినవి. అందొకటి సామజ్వరలక్షణములకు విరుద్ధములగు లక్షణములుగల్గియుండుట. రెండవది యేడురాత్రుల నతిక్రమించియుండుట. ఈరెంటిలో సప్తరాత్రముల దాటినయెడ జ్వరము నిరామమగుచుండ ఆమవిపర్యయ రూపలక్షణమును ప్రత్యేకముగ జెప్ప నవసరములేదని కొందరాశంకింతురు. సన్నిపాతజ్వరమునందు ఏడుదినములదాటి చాలకాలము మలములు పక్వము గాకుండును. గాన నట్టిచోట నీలక్షణమునుబట్టి నిర్ణయింపవలనుపడదు. కావున సన్నిపాతజ్వరముల నిరామత్వమును గమనించుటకై ఆమవిపర్యయరూప లక్షణమావశ్యకము.

మరియు స్వల్పదోషమున గలిగినజ్వరము సప్తాహమునకు మున్నె నిరామమగును. ప్రబలదోషమున జనించినజ్వరము ఎనిమిదవనాఁడు నిరామమగును. ఏడుదినములకులోపల నిరామలక్షణముల గుర్తించి స్వల్పదోషమని నిర్ణయించుటకై యామవిపర్యయలక్షణ మావశ్యకము. ఎనిమిదవనాఁడు నిరామముగనున్నది. ప్రబలదోషజ్వరమని నిర్ణయించుటకై రెండవలక్షణ మావశ్యకము. ఈవిషయము ఖరనాదునిచే నిట్లు చెప్పబడినది—"న చ నిస్సప్తతైవేహ నిరామజ్వరకారణమ్, చిరాదపిహి పచ్యన్తే సన్నిపాతజ్వరే

మలాః. సప్తరాత్రాతివృత్తిశ్చ క్షామతాది చ లక్షణమ్, తస్మాత్తదుభయం దృష్ట్వా నిరామం జ్వర మాదిశేత్”

పైజెప్పిన సామనిరామలక్షణములు చికిత్సా సౌకర్యమునకై జెప్పబడినది. జ్వరము సామముగ నుండుతరి యౌషధము నియ్యకూడదు. ఉపయోగించినచో నా యౌషధము జీర్ణము గానేరక జ్వరమునుమరింత వృద్ధినొందించును. జ్వరము జీర్ణదశయం దున్నపుడు చికిత్స జేసినచో సుఖముగ నౌషధము జీర్ణమై జ్వరమును నివర్తింపజేయును. ఈవిషయమును సుశ్రుతాచార్యు డిట్లు చెప్పెను:—“మృదౌ జ్వరేలఘౌ దేహే ప్రచలేషు మలేష్వపి, పక్వం దోషం విజానీయాత్ జ్వరే దేయం తదౌషధమ్” (జ్వరము తీవ్రత నుడిగి స్వల్పమై, శరీరము బరువుగ లేక తేలికయై, మలములు చంచలములై యథావిధిగ వెడలుచున్నపుడు దోషము పక్వమైనదని యెఱింగి అప్పుడు ఔషధము నియ్యవలెను) నిరామజ్వరమును జీర్ణజ్వరము, పక్వజ్వరము, పురాణజ్వరముననియు జెప్పవచ్చును.

## సంతతాదిజ్వరపంచకము.

జ్వరః పఞ్చవిధః ప్రోక్తో మలకాల బలాఽబలాత్. ౫౬
ప్రాయశస్సన్నిపాతేన భూయసా తూపదిశ్యతే,
సన్తతస్సతతోఽన్యేద్యుస్తృతీయకచతుర్థకౌ. ౫౭

సంతతము, సతతము, అన్యేద్యుష్కము, తృతీయకము, చతుర్థకము, నని జ్వరములు ఐదుతెరంగుల నుండును. అందు సంతతజ్వరమును పూర్వాహ్ణాది సర్వకాలముల యందును వాతాదిదోషములు ప్రబలములై కలిగించును. పూర్వాహ్ణాదికాలములయందు వాతాదిదోషముల బలాబలముచే సతతక - అన్యేద్యుష్క-తృతీయక-చతుర్థకజ్వరములు నాలుగును కలుగును. పైజెప్పిన సంతతాది జ్వరములైదును మూడుదోషముల సన్నిపాతముచే గలుగును. ఆమూటిలో నేదోషము ప్రబలమైయుండునో ఆదోషమును ప్రధానముగజేసి వాతిక-పైత్తిక-శ్లైష్మికాది వ్యవహారములు కలుగును.

ఇచ్చట నీవివరణము నెఱుంగునది:—“మలకాలబలాబలాత్” అనుచోట “బలంచ, బలంచ-బలం, అని యేకశేషము. పిదప బలంచ, అబలంచ-బలాబలం; కాలే బలాబలం-కాలబలాబలం; మలానాం కాలబలాబలమ్-మలకాలబలాబలమ్” అని విగ్రహవాక్యము నెఱుంగునది. ఇట్టి విగ్రహముచేత దోషములు పూర్వాహ్ణాదికాలములయందు ప్రబలములైయుండుటచే సంతతజ్వరము సంభవించుననియు, అట్టి (పూర్వాహ్ణాది) కాలములయందు వాతాదిదోషములు బలిష్ఠములుగనున్నను, బలహీనములుగనున్నను వృద్ధిక్షయములుకల సతతకాది విషమజ్వరముల నాలిగిటిఁ గలిగించుననియు, నిర్ణయ మేర్పడును. ఇట్టి విమర్శనము ఈక్రింద జెప్పబడు సంతతాదిజ్వరలక్షణములచే స్పష్ట

మగును.ఎట్టులన:-"బలినో గురవ స్తస్మాద్ధా...సంతతం నిష్ప్రతిద్వన్ద్వాః జ్వరం కుర్యుస్సుదుస్సహమ్" ఈవాక్యముచేత వాతాదిదోషములు బలవత్తరములై సంతత జ్వరమును కలిగించునని తెలియుచున్నది. మరియు సతతాది విషమ జ్వరలక్షణమునందు "కృశానాం...అల్పోపిదోషోదూష్యాదేః లబ్ధ్వాన్యతమతో బలం సవిపక్షో జ్వరం కుర్యాత్ విషమం క్షయవృద్ధిభాక్"అని చెప్పియుండుటచేత దోషములు పూర్వాహ్ణాదికాలమున బలిష్ఠములై సతతాది విషమజ్వరముల గలిగించుననియు, అయ్యవి బలహీనములుగ నున్నను దూష్యములగు రసరక్తాదులచే బలిష్ఠములై క్షయవృద్ధి యుక్తములుగ సతతాది విషమజ్వరముల గలిగించుననియు దెలిసెడి.

మరియు నీజ్వరములు సన్నిపాతమున జనించినను వానిలో వాతమధికముగ నున్నపుడు వాతికమనియు, పిత్తమధికముగ నున్నపుడు పైత్తికమనియు, కఫమధికముగ నున్నపుడు శ్లేష్మికమనియు చెప్పబడును. ఈవిషయమునే "ప్రాయశ స్సన్నిపాతేన భూయసా తూపదిశ్యతే"అని ప్రకృతగ్రంథమున జెప్పెను.

సంతతాదిజ్వరములకు వాతాది విభాగమిట్లు తంత్రాన్తరమున గానంబడియెడు:—
"సన్తతో మారుతాత్ప్రాయః పిత్తాత్ప్రాయస్తృతీయకః,అన్యేద్యుశ్చ కఫాత్ప్రాయః సన్నిపాతాచ్చతుర్థకః, సన్నిపాతకృతత్వాత్తు దుశ్చికిత్స్యశ్చతుర్థకః" "పృష్ఠేఽనిలకఫోద్భూతః శ్లేష్మపిత్తోద్భవః త్రికే,శిరస్యనిలసంభూతో గృహ్ణాతీహ తృతీయకః,చతుర్థకస్తు శ్లేష్మోత్థః ప్రతిగృహ్ణాతి జంఘయోః, వాతికశ్శిరసోఽభ్యేతి ద్విధైవాయం స్వభావతః, ప్రస్కన్ధతస్తు విజ్ఞేయో విపరీతశ్చతుర్థకః" (సంతత జ్వరము వాతబహుళముగను తృతీయకము పిత్తబహుళముగను, అన్యేద్యుష్కము కఫబహుళముగను నుండును. చతుర్థకజ్వరము కేవలము సన్నిపాతముననే కలుగును. అందువలననే చికిత్సకసాధ్యమగును.తృతీయకము వాతకఫముల సంసర్గమున గలిగినచో తొలుత వీపున వ్యాపించును. కఫపిత్తముల సంసర్గమునగలిగినాడు త్రిక(వెన్నెముకకు క్రింది) భాగముగ తొలుత బొడమును. వాతప్రాబల్యమున జనించినచో శిరస్సున పుట్టును. చతుర్థజ్వరమున కఫము ప్రబలముగనున్నపుడు తొలుత పిక్కలయందు వ్యాపించును. వాతము ప్రబలముగ నున్నపుడు శిరస్సున తొలుత వ్యాపించును.చతుర్థకవిపర్యయజ్వరమున తొలుత స్కంధదేశమున (మూపుల) జనించును).

మరియు చతుర్థకవిపర్యయ మనుజ్వరము చతుర్థకమునకు విరుద్ధలక్షణముగ నుండును. కావున నయ్యది చతుర్థకజ్వరముచేతనే గ్రహింపబడునని ప్రత్యేకముగ బరిగణనము చేయలేదు.

## సంతతజ్వరసంప్రాప్తి.

ధాతుమూత్రశకృద్వాహిస్రోతసాం వ్యాపినో మలాః,
తాపయన్తస్తనుం సర్వాం తుల్యదూష్యాదివర్ధితాః. ౫౮
బలినో గురవస్తబ్ధాః విశేషేణ రసాశ్రితాః,
సన్తతం నిష్ప్రతిద్వన్ద్వాః జ్వరం కుర్యుస్సుదుస్సహమ్. ౫౯

వాతపిత్త కఫరూపములైన మలములు మూడును రసరక్తాదిధాతువులను మూత్రమును మలమును వహించునట్టి స్రోతోరంధ్రములను వ్యాపించి, వానికి సమానగుణములైన దూష్యములచేతను జాంగలాదిదేశములచేతను కాలముచేతను మిక్కిలి వృద్ధినొంది మిగుల బలవత్తరములును, ఆమసహితంబులగుటచే గురుత్వరూపగుణము కలిగినవియు, ఊర్ధ్వాధోమార్గముల వెడలకుండుటంజేసి నిశ్చలంబులునునై రసాదిధాతువుల నన్నిటియందును వ్యాపించినను విశేషముగ రసధాతువు నాశ్రయించి శరీరమునెల్ల తాపము నొందించి, మిక్కిలి యోరువ సాధ్యముకాని జ్వరమును గలిగించును. ఇయ్యది రాత్రియు పగలును విరామములేక వ్యాపించియుండుటంజేసి సంతతజ్వరమని చెప్పబడును. ఈజ్వరమునందు వాతాదిమలములు మూడును ప్రకోపించియుండునుగాన పరస్పరవిరుద్ధగుణములగుటంజేసి చికిత్సజేయ వలనుపడకయుండును. కావున నసాధ్యమనిభావము.

ఇచ్చట దోషశబ్దమును జెప్పక దానికిబదులు 'మలాః'అని చెప్పుటచేత వాతపిత్తకఫములు మలినీకరణభావమునొందియున్నపుడు సంతతజ్వరమును గలిగించునుగాని దోషరూపములును ధాతురూపములును నైనపుడు సంతతజ్వరము గలిగింపవని భావమును సూచించును.

మరియు వాతాదులకును దేశకాల దూష్యములకును తుల్యత్వము నీరీతి నెరుంగునది:—ధన్వదేశము వాతమునకు సమానములగు రూక్షాదిగుణములు కలిగియుండుటంజేసి సమానగుణమగును. కావున వాతమును వృద్ధినొందించును. కఫమునకు విరుద్ధగుణమగుటంజేసి క్షయకారణమగును. ఆనూపదేశము కఫమునకు సమానగుణమగుటంజేసి దానిని వృద్ధినొందించును. వాతమునకు సమానగుణము కాదు కావున క్షీణింపజేయును. తక్కిన కాలదూష్యాదులకు నిత్తెరంగుననే తుల్యత్వము నూహించునది.

## మలధాతుపాకావస్థ.

మలం జ్వరోష్మా ధాతూన్వాస శీఘ్రం క్షపయేత్,

(లోకమున నగ్నికి స్వతస్సిద్ధమగు నుష్ణగుణము సకలవస్తువులను నశింపజేయును.) జాఠరానల స్వరూపమైన జ్వరముచేగలిగిన తీవ్రమైన వేడి శరీరమునందలి మలమూత్ర వాతపిత్తకఫములను మలములను ఈ సన్తతజ్వరమునందలి శీఘ్రముగ నొకసమయమున

క్షీణింపజేయును. అట్టి జ్వరముయొక్క వేడి యొకసమయమున శరీరమునందలి రసాది ధాతువుల నేడిటిని శీఘ్రముగ క్షీణింపజేయును. (ఇట్లు మలములైనను ధాతువులైనను క్షీణించుటకు అదృష్టమే కారణముగాని వేరొండు కారణము లేదు.)

ఇచ్చట మలాదుల సామనిరామ లక్షణములబట్టి ధాతుక్షయమును మలాది క్షయము నెరుంగునది. అట్టి సామనిరామలక్షణములు సూత్రస్థానమున దోషోపక్రమణీయాధ్యాయమున నిట్లు చెప్పబడినవి:—నాసారంధ్రములుమున్నగు స్రోతస్సుల కడ్డులేకుండుట, శరీరమున బలముకలిగియుండుట, శరీరము బరువులేక తేలికయైయుండుట, వాతమనులోమముగ సంచరించుట, వాక్కునకును శరీరమునకును మనస్సునకును సంబంధించిన పనులయందు అలసతలేకుండుట, జఠరాగ్ని దీపించి యాకలికలిగియుండుట, మలమూత్రాదులు ధారాళముగ వెడలుట,బడలిక లేకుండుట. ఈలక్షణములు ఇంచుకేనియుం గనబడినచో జ్వరోష్మము మలముల క్షీణింపజేయుచున్నది, గాని ధాతువుల క్షీణింప నుద్యమించలేదని యెరుంగునది. మరియు:—పైజెప్పిన లక్షణములకు విరుద్ధముగ స్రోతోమార్గము లడ్డగింపబడుట,బలహీనము, గురుత్వము,వాతము చక్కగ సంచరించకుండుట, కునికిపాటు, అన్నాదులు జీర్ణములు గాకయుండుట, నోట నీరువెడలుట, మలమూత్రాదులు వెడలకుండుట, అరోచకము, బడలిక, ఇట్టిలక్షణములు గాన్పించుతరి జ్వరోష్మము మలాదుల వృద్ధినొందించుచు రసాదిధాతువులను క్షీణింపజేయుచున్నవని యెరుంగునది.

## సన్తతజ్వరవిముక్తికాలనియమము.

తతః

సర్వాకారం రసాదీనాం శుద్ధ్యాఽశుద్ధ్యాపి వా క్రమాత్,
వాతపిత్తకఫైస్సప్తదశద్వాదశవాసరాః,
ప్రాయోఽనుయాతి మర్యాదాం మోక్షాయ చ వధాయ చ ౬౧
ఇత్యగ్నివేశస్య మతం, హారీతస్య పునస్స్మృతిః,
ద్విగుణా సప్తమీ యావన్నవమ్యేకాదశీ తథా. ౬౨
ఏషా త్రిదోషమర్యాదా మోక్షాయ చ వధాయ చ,

పైజెప్పినరీతిగ రసాదిధాతువులును మలములును దోషములును జ్వరోష్మముచే పరిపక్వములై పూర్తిగ మలరహితములై పరిశుభ్రములుగ నున్నపుడు వాతముచే జనించిన సన్తతజ్వరము, జ్వరము ప్రారంభించిననాడు మొదలుజేసి యేడవదినమునందు శమించును. పిత్తమునకలిగిన సన్తతజ్వరము పదియవనాడు శమించును. కఫమున కలిగియుండిన పెద పండ్రెండవనాడు శమించును. అటుగాక (మలములు పక్వములుగాక)

ధాతువులు క్షీణించి పూర్తిగ పరిశుద్ధములు గాకుండునేని వాతమున జనించిన సన్తత జ్వరము ఏడవనాడు చంపును. పిత్తముచేగలిగిన సంతతజ్వరము పదియవనాడు చంపును. కఫమున జనించినది పండ్రెండవనాడు చంపును. సంతతజ్వరమున వాతాదిదోషముల ననుసరించి శమించుటకును చంపుటకును కాలనియమమును పైజెప్పినరీతి నెరుంగునది. ఈకాలనియమము ప్రాయికము. ఒకసమయము పైజెప్పిన కాలనియమమునకు ముందుగనైనను వెనుకనైనను, జ్వరవిముక్తియుం లేక అపాయంబైనను కల్గవచ్చును. (అట్టి వ్యత్యాసము కలుగుటకు మలధాతువుల శుద్ధ్యశుద్ధులకు కాలవ్యత్యయమే కారణమగును.) పైజెప్పిన కాలనిర్ణయము అగ్నివేశసమ్మతము. ఈనిర్ణయమునే తంత్రాన్తరమున నిట్లు నుడివిరి:—"పిత్తకఫానిలవృద్ధ్యా దశదివసద్వాదశాహసప్తాహాత్, హన్తి విముఞ్చతి వాశు జ్వరోష్మణా ధాతుమలపాకాత్"

మరియు హారీతుం డిట్లు కాలనియమమును నిర్ణయించెను—వాతమున జనించిన సన్తతజ్వరము పైజెప్పినరీతిగ ధాతుమల శుద్ధ్యశుద్ధిభేదములచే పదునాల్గవనాడు విడచును, లేక చంపును. పిత్తమున జనించినయెడ పదునెనిమిదవనాడు విడచును, లేక చంపును. కఫమున జనించినచో నిరువదిరెండవదినము నివర్తించును, లేక చంపును. సంతతజ్వరమున వాతపిత్తకఫాధిక్యముల ననుసరించి విముక్తికైనను చంపుటకైనను ఇది యే కాలనియమము.

సంతతజ్వరమునకు దీర్ఘకాలవ్యాప్తికారణము.

శుద్ధ్యశుద్ధౌ జ్వరః కాలం దీర్ఘమప్యనువర్తతే. ౬౩

పైజెప్పినరీతిగ రసాదిధాతువులలో కొన్ని మల రహితములై పరిశుద్ధములుగను, కొన్ని మలములతోగూడి యశుద్ధములుగను ఉన్నపుడు సన్తతజ్వరము పైజెప్పిన కాలనియమమును అతిక్రమించి చాలకాలమువరకును అనుసరించి విడువక బాధించుచుండును.

విషమజ్వరసామాన్యకారణములు.

కృశానాం వ్యాధిముక్తానాం మిథ్యాహారాదిసేవినామ్,
అల్పోఽపి దోషో దూష్యాదేః లబ్ధ్వాన్యతమతో బలమ్. ౬౪
సవిపక్షో జ్వరం కుర్యాత్ విషమం క్షయవృద్ధిభాక్,

ఏదైన నొకవ్యాధిచే బీడితులై శరీరము కృశించినవారలు అపథ్యములగు నాహారవిహారౌషధముల సేవించినయెడ వాతపిత్తకఫములలో నేదైన బలిష్ఠముగనున్నను లేక బలహీనమైయున్నను రసాదిదూష్యములలో నొకదాని సంబంధముచేనైనను దేశకాల సంబంధముచేనైనను మిక్కిలి బలమునొంది, జ్వరమును గలిగించును. అట్టి దోష

మునకు విరుద్ధములైన గుణాదులుకల దూష్యాదుల సంబంధము కలిగినపుడు హీనబలమై యుండును. కావున నాసమయమున జ్వరము అణగియుండును. ఇదియే విషమ జ్వర మనబడును.

విషమజ్వరకాలనియతికి కారణము.

దోషః ప్రవర్తతే తేషాం స్వే కాలేజ్వరయన్ బలీ. ౬౧
నివర్తతే పునశ్చైషః ప్రత్యనీకబలాఽబలః,

పైజెప్పినరీతిగ వ్యాధిముక్తులై కృశించి యపథ్యాహారాదుల జేసినవారికి వాతాది దోషములలో నొకటి తన కాలమున వృద్ధినొంది బలిష్ఠమై జ్వరమును కలిగించును. అట్టి దోషము తనకు విరుద్ధమైన గుణాదులుకల దూష్యాదులయొక్క సంబంధమునంజేసి దానిబలముచే నిజబలము తగ్గి తనవ్యాపారము (జ్వరమును గలిగించుకార్యము)నుండి నివర్తించును.

ఇచ్చట నీవిమర్శనము నెరుంగునది:—లోకమున మఱ్ఱిచెట్టు మున్నగు వృక్షములనుండి విత్తనము పుడమిపయింబడి యుదకసంబంధము లేని కాలమున మొలక లెత్తక యూరకుండును. యుక్తకాలమున వర్షము కురిసి జలముతో సంబంధము కల్గిననాడు మొలచును. అట్టిచెమ్మ యుండునంత కాలము పైరై పిదప చెమ్మ యెండి నప్పుడు ఎండును. ఆతీరుననే వాతాదిదోషములు వానివానికి హితములైన సాయంతనాది కాలములయందు తమకు సమాన గుణములగు దూష్యాదుల సంబంధమునంజేసి బలిష్ఠములై జ్వరమును గల్గించును. మరల తమకు విరుద్ధములైన దూష్యాదులతో సంబంధము కల్గినపుడు దానిబలముచే తనబలము చెడుటంజేసి తనవ్యాపారమునుండి విరమించును. కావున జ్వరము నివర్తించును. అని భావము. ఈవిషయమునే ఖరనాదుడిట్లు చెప్పెను:—"భువ్య త్రస్య యథా కాలం బీజం కాలే ప్రరోహతి, తథా కాలక్రమా ద్దోషః కాలే జ్వరకరో భవేత్"

విషమజ్వరవేగము లీనమగుటకు కారణము.

క్షీణే దోషే జ్వరసూక్ష్మో రసాదిష్వేవ లీయతే. ౬౨
లీనత్వాత్కార్శ్యవైవర్ణ్యజాడ్యాదీనాదధాతి సః,

విషమజ్వర కారకమగుదోషము పైజెప్పిన ప్రకారము విరుద్ధదూష్యాది బలము చేత హీనబలమైనపుడు దానజనించిన విషమజ్వరంబును మిక్కిలి సూక్ష్మమైరసాది ధాతువులయందు లీనమై (పుట్టలోపామువలె) అణగియుండును. దానంజేసి శరీరము కృశతనొందును. ముఖవర్ణము మారును. జాడ్యము మున్నగులక్షణములు కలుగును.

(విషమజ్వరములయందు ఏదోషముచే జ్వరము కలుగునో అట్టిదోషము క్షీణించినపుడు దానగలిగిన జ్వరము రసాదిధాతువులయందు లీనమగునుగాని బొత్తుగ హరింపదు. లీనముకానిచో కార్శ్యముతై వర్ణ్యముమున్నగు జ్వరమునకు సంబంధించిన కార్యములుకలగవు. కావున అట్టికార్శ్యాదులంబట్టి జ్వరము లీనముగనున్నదని యూహింపదగునని భావము)

సంతతాదిజ్వరములు కాలభేదముచే గలుగుటకు హేతువులు.

ఆసన్నవివృతాస్యత్వాత్ స్రోతసాం రసవాహినామ్. ౬౭
ఆశు సర్వస్య వపుషః వ్యాప్తిర్దోషేణ జాయతే,
సన్తతస్సతతస్తేన విపరీతో విపర్యయాత్. ౬౮

వాతాదిదోషములలో నేదైననొకటి రసధాతువు నాశ్రయించి సన్తతజ్వరమును కలిగించును. అట్టిరసధాతువును వహించునాడులు మిక్కిలి సన్నిహితమైనముఖముకలిగి తెరవబడిన ద్వారము కలిగి యుండుటంజేసి శీఘ్రముగ శరీరమునందెల్ల జ్వరమును వ్యాపింపజేయును. దానివలననే ఆజ్వరము ఎడతెగక నిరంతరముగ నియమితకాలము వరకు వ్యాపించును. సతతాది విషమజ్వరములయందు పైజెప్పినదానికన్న విరుద్ధలక్షణములు గలిగియుండుటంజేసి కాలవిళంబముగమారి విడచి మరల వచ్చుచుండును.

ఇచ్చట నీవివరణము నెరుంగునది.—పైజెప్పిన సంతతాదిజ్వరములైదిటిలో సంతతజ్వరమును దోషములు రసధాతువు నాశ్రయించియు,సతతకజ్వరమును రక్తమును వహించునాడుల నాశ్రయించియు, అన్యేద్యుష్కమును మాంసధాతువును వహించునాడుల నాశ్రయించియు, తృతీయకజ్వరమును మేదోవహనాడి నాశ్రయించియు, చతుర్థకజ్వరమును మేదోమజ్జాస్థి ధాతువుల నాశ్రయించియు కలిగించును. చతుర్థకజ్వరభేదముతో జేరిన చతుర్థకవిపర్యయమును అస్థిమజ్జల నాశ్రయించి కలిగించును. ఇట్లుండ రసధాతువును వహించునాడులు ద్వారములు అడ్డులేక వివృతములై శరీరమున పైభాగము (చర్మము) ననే యుండును; కావున ఆనాడులలో దోషము సులభముగ ప్రవేశించి చెరచి శరీరమునందెల్ల నతిశీఘ్రముగ వ్యాపించి జ్వరమును శరీరమునందెల్ల నొక్కపెట్టున వ్యాపింప సమర్థము లగును. అట్లు వ్యాపించినజ్వరము దోషము పరిపక్వము లగనందాక పైజెప్పిన సప్తాహాదికాలనియమమును నిరీక్షించి యందాక విడువక వ్యాపించియెడలేక బాధించును. రసధాతువు శరీరమున పైభాగముననే యుండును. కావున ఒకప్పుడైన శరీరముపై వ్యాప్తి తగ్గదు.

సతతకజ్వరమున కాశ్రయములగు రక్తవహనాడులు మిక్కిలి సూక్ష్మాకారములును మూసికొన్నద్వారములు కల్గినవియునై రసధాతువునకన్న లోపలిభాగమున

నుండును; కావున దోషములు అందు ప్రవేశించి కదలుటకును శరీరమున జ్వరవేగమును వ్యాపింపజేయ కొంచెము కాలవిళంబమగును. అట్లు మెలమెల్లగ వ్యాపించి మరల రక్తధాతువున దోషము చేరుసరికి కొంతకాలము పైవ్యాపకము లేక యణగియుండి మరల వ్యాపించును. అట్టికారణముచేతనే శరీరమునందెల్ల నొక్కసరి వ్యాపించక కొంచెము కొంచెముగ వ్యాపించును. అట్టికారణముచేతనే దినమున రాత్రి యొకపర్యాయమును పగలు ఒకపర్యాయమును శరీరముపై నీజ్వరము వ్యాపించి దోషము మరలినప్పుడు ఆరక్తనాడులయందే జ్వరముకూడ నణగియుండును.

అన్యేద్యుష్కజ్వరమున కాశ్రయమైన మాంసవహనాడులు రక్తనాడులకన్న సూక్ష్మాకారంబులును శరీరమున లోభాగమున వ్యాపించినవియు నగును. కావున వాతాదిదోషములు అందు ప్రవేశించుటకును జ్వరమును వ్యాపింపజేయుటకు, సతతజ్వరమునకన్న విళంబ మధికమగును; కావుననే దినమొకతూరి శరీరమున మెలమెల్లగ వ్యాపించి దోషము స్వస్థానము జేరుసరికి జ్వరము మరల మాంసవహనాడులయందే అణగియుండును. (ఈజ్వరము దినమున కొకసరి శరీరముపైని వ్యాపించును.)

తృతీయకజ్వరమునకు ఆశ్రయమైన మేదస్సును వహించునాడులు మాంసవహనాడులకంటె మిక్కిలి సూక్ష్మములును, మూసికొనినద్వారము కల్గినవియునై లోభాగమున నుండును. కావున జ్వరమును కల్గించుదోషమునకు ఆస్థానమును జేరుటకు కాలవిళంబము నధికముగ నుండును. దానంజేసి యొకదినమును విడచి మరుసటిదినము మరల జ్వరము వ్యాపించును. దోషము వేగమును చూపి స్వస్థానమును జేరునప్పటికి జ్వరముగూడ మరల తన జనకస్థానమగు మేదోవహనాడులందు లీనమై యణగియుండును. ఇత్తెరంగున దినమును విడిచి దినము వ్యాపించునది తృతీయకజ్వరము మేదోధాతువును వహించునాడి శరీరాంతర్భాగమున నుండును. కావున జ్వరము లీనమైనసమయమున శరీరము జ్వరముచేనైన వేడిమియుండదు.

చతుర్థకజ్వరమున కాశ్రయములైన అస్థిమజ్జాధాతువులు మేదోధాతువునకన్న దూరమున నుండుటంజేసి దోషములు జ్వరము వ్యాపించి విడచిననాడుగాక నడుమ రెండుదినములు దాటి నాల్గవనాటికి అస్థిమజ్జలకేరి జ్వరమును వ్యాపింపజేయును. జ్వరము వ్యాపించిన నాల్గవనాడు మరల వ్యాపించుటంజేసి చతుర్థకజ్వర మనబడును.

చతుర్థకవిపర్యయమునగూడ పైజెప్పినవిధముగనే రెండుదినములు విడువక జ్వరము వ్యాపించి యామరుసటిదిన మొకనాడు విడచియుండి మరల రెండుదినములు వ్యాపించును. తృతీయకాదిజ్వరములు దినములమార్చి వ్యాపించుటంజేసియే వీనిని వరుసజ్వరములనియుం లోకమున వాడెదరు.

పైగనబరచిన జ్వరములన్నియు రసరక్తాదిధాతువుల నన్నిటి నాశ్రయించి పుట్టును; అయినను ఆయాజ్వరమునకు చెప్పినధాతువున వాతాదిదోషములు విశేషముగ వ్యాపించి ఆయాజ్వరమును గల్గించును. ఈవిషయము ప్రాయశ్శబ్దప్రయోగముచే దెలిసెడి.

## విషమజ్వరసామాన్యలక్షణము.

విషమో విషమారమ్భక్రియాకాలోఽనుషఙ్గవాన్,

విషమమైన యారంభమును, విషమములగు క్రియలును, విషమమైన ప్రారంభకాలమునుకల్గి చిరకాలమువరకును అనుసరించుచు బాధించునది విషమజ్వర మనబడును.

పైజెప్పిన విషమారంభాదివివర మిట్లు తెలియునది:—జ్వరము ప్రారంభించునపుడు తొలుత శిరంబున ప్రారంభించును. కొన్ని వీపునను, కొన్ని పిక్కలయందును వ్యాపించును. ఇదివిషమారంభము ఒకసమయమున చలికలుగును. ఇంకొకసమయమున తాపమధికముగనుండును. ఇది పనులచే విషమమగుటంజేసి విషమక్రియ యనబడును. ఒకజ్వరము పూర్వాహ్ణమునందును, వేరొకటి మధ్యాహ్నకాలమునందును, ఇంకొకటి సాయంకాలమునను, ఇంకొకటి యర్ధరాత్రికాలమునను వ్యాపించును. ఇది కాలముచే విషమము.

## సతతజ్వరాశ్రయము; లక్షణము.

దోషో రక్తాశ్రయః ప్రాయః కరోతి సతతం జ్వరమ్. ౬౯
అహోరాత్రస్య సద్విస్స్యాత్

వాతాదిదోషములు రక్తవహంబులగునాడులను విశేషముగ నాశ్రయించి సతతకమనువిషమజ్వరమును గలిగించును. ఈజ్వరము ఒకరాత్రి పగలు లోపల రెండుమార్లు విడచి వ్యాపించును. ఈజ్వరమునందును సంతతజ్వరమునుబోలె దోషములు రసాదిధాతువుల నన్నిటి నాశ్రయించియున్నను రసధాతువుచే విశేషముగ నాశ్రయించును. ఇచ్చటి రాత్రియైనను పగలైన రెండుమార్లీజ్వరము వ్యాపించును. ఒకసమయమున పగటిపూట నొకసారియు రాత్రివేళ నొకసారియు వ్యాపించును. ఒకవేళ రాత్రి రెండు పర్యాయములును పగటివేళ రెండుసారులునుగూడ వ్యాపించును. కావున రాత్రి యొకసారియు పగ లొకసారియు వ్యాపించుననియే నియమములేదు.

## అన్యేద్యుష్కజ్వరము.

సకృదన్యేద్యురాశ్రితః,
తస్మిన్ మాంసవహా నాడీః

అన్యేద్యుష్కమను విషమజ్వరము ఒక యహోరాత్రమున (రాత్రియైనను పగ

తైనను) ఒకసారి వ్యాపించును. ఈజ్వరమునందునుదోషము రసాదిధాతువుల నన్నిటినాశ్రయించియున్నను మాంసవహములగు నాడులను విశేషముగ నాశ్రయించి యుండును.

తృతీయకజ్వరము.

మేదోనాడీ స్తృతీయకే. ౭౦

గ్రాహీ పిత్తానిలామూర్ధ్నః త్రికస్య కఫపిత్తతః,
సపృష్ఠస్యానిలకఫాత్ సచైకాహాన్తరః స్మృతః ౭౧

మేదోవహము లగునాడులలో దోషము విశేషముగ జేరి తృతీయకజ్వరమును కల్గించును. ఈజ్వరము ఒకదినము మార్చి మరుసటిదినమున (జ్వరమువిడచిన మూడవ నాడు) మరల జ్వరము వ్యాపించును. ఈజ్వరమునందును త్రిదోషములు ప్రకోపించును; అయినను అందు వాతపిత్తములు రెండును ప్రబలములుగ నున్నచో తొలుత శిరస్సున వ్యాపించి తలనొప్పి పుట్టించి పిదప శరీరమునందెల్ల వ్యాపించును. కఫపిత్తము లధికముగ నున్నచో వెన్నెముకకు క్రిందిభాగమున వ్యాపించి తొలుత బాధ కల్గించును. కఫవాతము లధికములుగ నున్నపుడు తొలుత వీపునందును వెన్నెముకకు క్రింది భాగమునను నొప్పిని కల్గించి పిమ్మట వ్యాపించును. ఈజ్వరమునందును రసాదిధాతువు లన్నిటియందును దోషములు వ్యాపించియున్నను మేదోవహము లగునాడులను విశేషముగ నాశ్రయించి యుండును.

చతుర్థకజ్వరము.

చతుర్థకో మలే మేదోమజ్జాస్థ్యన్యతమస్థితే,
మజ్జస్థ ఏవేత్యపరే ప్రభావం స తు దర్శయేత్. ౭౨
ద్విధా కఫేన జఙ్ఘాభ్యాం స పూర్వం శిరసోఽనిలాత్,

దోషములు మేదస్సునందైనను మజ్జయందైనను అస్థులయందైనను జేరియున్నపుడు చతుర్థకజ్వరము కల్గును. కేవలము మజ్జయందుమాత్రము దోషములు చేరినపుడు చతుర్థకజ్వరము సంభవించునని కొందరాచార్యులు వచించెదరు. (ఈజ్వరము ఒకదినమున వ్యాపించి విడచి రెండుదినములు ధాతువులయందు దాగియుండి మరల (జ్వరము విడిచిననాటనుండి నాల్గవదినమున వ్యాపించును. కావున చతుర్థకమనబడును) ఈజ్వరమున కఫ మధికముగ నున్నపుడు పిక్కలయందు తొలుత నొప్పికల్గి పిమ్మట శరీరమునందెల్ల వ్యాపించును. వాతమధికముగ నున్నపుడు తొలుత శిరస్సున నొప్పిపుట్టి పిమ్మట శరీరమునందెల్ల వ్యాపించును. ఈచతుర్థకజ్వరం బిత్తెరంగున రెండువిధముల ప్రభావమును జూపును.

### చతుర్థకవిపర్యయము.

అస్థిమజ్జోభయగతే చతుర్థకవిపర్యయః. ౨౩
త్రిధా ద్వ్యహం జ్వరయతి దినమేకం తు ముఞ్చతి,

అస్థిమజ్జల రెండిటి నాశ్రయించి వాతాదిదోషములు చతుర్థకవిపర్యయ మను విషమజ్వరమును గల్గించును అయ్యది త్రిదోషసన్నిపాతమున జనించినను వానిలో నొక్కొకదోషము అధికముగ నుండుటంజేసి వాతపిత్తకఫభేదములచే మూడుతెరంగుల నుండును, ఈజ్వరమున దోషములు అస్థిమజ్జల రెండిటి నాశ్రయించియుండును కావున రెండుదినములు వ్యాపించి ఆమరుసటిదిన మొకనాడు ధాతువులయందణగి మరల రెండు దినములవంతున వ్యాపించును. చతుర్థకజ్వరము రెండుదినములు లేకుండి మరుసటినాడు వ్యాపించును. ఈజ్వరము దానికి విపరీతముగ రెండుదినములు వ్యాపించి యొకదిన మణగి మరల రెండునాళ్లు వ్యాపించునది కావున చతుర్థకవిపర్యయమని యన్వర్థముగ జెప్పబడియె.)

### విషమజ్వరవిశేషములు.

బలాఽబలేన దోషాణాం అన్నచేష్టాదిజన్మనా. ౨౪
జ్వరస్స్యన్దనసన్తద్వత్కర్మణశ్చ తదా తదా,
దోషదూష్యర్త్వహోరాత్రప్రకృతీనాం బలాజ్జ్వరః. ౨౫
మనసో విషయాణాం చ కాలం తం తం ప్రపద్యతే,

అన్నపానాదివిశేషములచేతను శరీరమునకును వాక్కునకును మనస్సునకును సంబంధించినపనులచేతను, కాలదూష్యాదులసంబంధముచేతను వాతపిత్తకఫములకు బలాబలమును కల్గును. త్రిదోషములకు పైజెప్పినకారణములచే గల్గినబలాబలముచేత సతతకాదివిషమజ్వరములు అప్పుడప్పుడును సంభవించును. మరియు మనస్సుకు సంబంధించినదోషములయొక్కయు విహారరూపమైన కర్మలయొక్కయు బలాబలములచేగూడ అప్పుడప్పుడును పైజెప్పిన విషమజ్వరములు కల్గును. మరియు వాతాదిదోషములయొక్కయు, రసాదిదూష్యముల యొక్కయు, వసన్తాదిఋతువులయొక్కయు, అహోరాత్రములయొక్కయు, వాతపిత్తకఫప్రకృతులయొక్కయు, మనస్సుయొక్కయు, శబ్దస్పర్శరూపరసగంధంబులను ఇంద్రియవిషయంబులయొక్కయు బలవిశేషముచేత ఆయాజ్వరమునకు నియతమైన కాలమును వదలి ఇతరకాలము నాశ్రయించి రూపాన్తరమును బొందుచుండును. (సతతజ్వరము తొలుత ప్రారంభమై కొంతకాలమునకు దోషదూష్యాదిబలము ననుసరించి జ్వరకాలముమారి తృతీయకజ్వరముగను, అయ్యది చతుర్థకముగను, అదియుం

తృతీయకాదిభేదముగను మారుచుండునని భావము. అట్లు మారుటకు దోషదూష్య కాలాదులబలముచే గల్గినమార్పు కారణము.)

ఇచ్చట 'మనసస్తద్వశ్చకర్మణశ్చ' అనుచోట కర్మశబ్దమునకు పురాకృత కర్మ మని యర్థముజేసి పూర్వజన్మకర్మముయొక్క బలాబలముచే సతతకాది విషమజ్వరములు కల్గునని యర్థము చేసెదరు.

జ్వరము విడచునప్పుడు కల్గులక్షణములు.

ధాతూన్ ప్రక్షోభయన్ దోషో మోక్షకాలే విలీయతే. ౭౬
తతో నరశ్శ్వసన్ స్విద్యన్ కూజన్ వమతి చేష్టతే,
వేపతే ప్రలపత్యుష్ణైః శీతైశ్చాఙ్గైర్హతప్రభః. ౭౭
విసంజ్ఞో జ్వరవేగార్తః సక్రోధ ఇవ వీక్షతే,
సదోషశబ్దం చ శకృత్ ద్రవం సృజతి వేగవత్. ౭౮

జ్వరము తనవేగమును పూర్తిగజూపి విడచుసమయమున అట్టిజ్వరమును కల్గించిన వాతపిత్తకఫములలో నొకదోషము(చెరువుమొదలగు ప్రదేశములగలనీటిని చండవాతము అల్లకల్లోలముచేయుభంగి) రసాదిధాతువుల నన్నిటిని కలతనొందించి లీనమగును. అట్టి సంక్షోభమునంజేసి రోగి నిశ్వాసము తీవ్రముగ నిగుడించుచు ఒడల చెమట వడియుచుండ వికారముగమూల్గి కూకలిడుచు కాంతిజేసికొనును. పడకపై పొర్లాడును. వణకును. తనకిచ్చవచ్చినట్లు సంబంధములేక మాటలాడుచుండును. అవయవములలో కొన్ని యుష్ణంబులును కొన్ని చల్లనివియునై శరీరకాంతితప్పి ప్రజ్ఞతప్పి జ్వరవేగముచే పీడితుడగుటంజేసి మిక్కిలి కోపముకలవానివలె క్రూరముగ జూచును. మలము పక్వము గాక శబ్దముతోగూడి ద్రవమై మిక్కిలి వేగముతో వెడలును. ఈలక్షణము లన్నియైనను కొన్నియైనను జ్వరము విడచుకాలమున కల్గును.

జ్వరవిముక్తలక్షణములు.

దేహో లఘుర్వ్యపగతక్లమమోహతాపః
పాకో ముఖే కరణసౌష్ఠవమవ్యథత్వమ్,
స్వేదః క్షవః ప్రకృతియోగి మనోన్నలిప్సా
కణ్డూశ్చ మూర్ధ్ని విగతజ్వరలక్షణాని ౭౯

జ్వరము నివర్తించినమనుజునకు శరీరము బరువులేక తేలికగానుండును. బడలికయు మూర్ఛయు తాపంబును నివర్తించును. నోరు పుండగును. కన్నులు చెవులు మున్నగునవి వానివాని కృత్యములయందు సమర్థములై యుండును. మనసున వ్యథ

లేకుండును. శరీరమున చెమటబట్టును. తుమ్ములు వెడలును. మనస్సు వికృతిజెందక సత్వ రజస్తమోగుణములలో నేగుణము పూర్వము కల్గియుండెనో అట్టి స్వాభావిక గుణము కల్గియుండును. ఆహారముపై నభిలాష బొడమును. తలపై జిలపుట్టును. ఈలక్షణములు జ్వరముచే విడువబడినవానికి కలుగును.

మరియు నష్టాంగసంగ్రహమునను హారీతాది గ్రంథములయందును అశ్విన్యాది నక్షత్రములలో నేనక్షత్రమున రోగము గలుగునో అట్టినక్షత్రమునుబట్టి సాధ్యాసాధ్యభేదములను, జ్వరవిముక్తికాలపరిమాణమును చెప్పబడినవి

ఇచ్చట నిది విచారణీయము:—ఆయారోగముల నిదానాదులబట్టియు లక్షణములబట్టియు సాధ్యాసాధ్య విభాగము. నెరుంగుపద్ధతు లాయుర్వేదీయశస్త్రములయందు తరుచుగ గానంబడియెడు. నక్షత్రములబట్టియే సాధ్యాసాధ్యత లెరుంగవలెనా? లేక విదానాదులబట్టి నియతముగ నెరుంగనగునా? యని యాశంక కలుగును. ఇచ్చట నుభయము వివక్షితము;—జన్మాంతరకృత కర్మపరిపాకవశమున అట్టినక్షత్రమున వ్యాధి జనించును. మిథ్యాహారవిహారాదులజేసియు వ్యాధి కలుగును. కావున నీయుభయమును గమనించి వ్యాధుల సాధ్యాసాధ్యవిభాగమును నిర్ణయింపవలెనని ప్రాచీన ఋషిపుంగవుల యాశయము. ఈవిషయమును చరకాచార్యులు:—"కదాచిత్కర్మణో బలవత్వం, కదాచిత్పురుషకారస్యేత్యుభయథా జ్వరస్య సాధ్యాఽసాధ్యవిభాగో న్యాయ్యః" అను వాక్యముచే నుపదేశించిరి.

ఇట్లు జ్వరలక్షణములు ఈయధ్యాయమున సామాన్యముగ జెప్పబడియె. మరియు గొన్ని జ్వరలక్షణంబులును సన్నిపాత జ్వరభేదంబులును, సాధ్యాసాధ్యలక్షణంబులును మున్నగునవి మాచే విరచితమగు మాధవనిదానాంధ్ర వ్యాఖ్యానమున విపులముగ జెప్పబడినది. విస్తరభీతిచే నీవ్యాఖ్యానమున విడువబడియె.

ఇతి వాగ్భటాచార్యకృతే అష్టాఙ్గహృదయే నిదానస్థానే ద్వితీయోఽధ్యాయః.

---

# తృతీయాధ్యాయము.

అవ: "ఊష్మా పిత్తాదృతే నాస్తి జ్వరో నాస్త్యూష్మణావినా" అను ప్రమాణము ననుసరించి శరీరమునందలి జాఠరానలముయొక్క వేడియే జ్వరముగ పరిణమించును. అట్టివేడి అగ్నిస్వరూపమగు పిత్తసంబంధములేక కల్గబోదు; కావున ఊష్మప్రధానమైన జ్వరనిదానమును పైయధ్యాయమున జెప్పి వేడికి కారణమగు పిత్తమునకు సంబంధించిన రక్తపిత్తనిదానము ఈయధ్యాయమున జెప్పబడును.

సూ. అథాతో రక్తపిత్తనిదానం వ్యాఖ్యాస్యామః.

జ్వరనిదానమును జెప్పినపిదప రక్తపిత్తనిదానమును వివరించెదనని భావము.

### రక్తపిత్త కారణములు.

భృశోష్ణతీక్ష్ణకట్వమ్లలవణాదివిదాహిభిః,
ద్రవోద్దాలకకైర్చాన్నైః తద్యుక్తైరతిసేవితైః ౧
కుపితం పిత్తలైః పిత్తం ద్రవం రక్తం చ మూర్ఛితే,
తే మిథస్తుల్యరూపత్వమాగమ్య వ్యాప్నుతస్తనుమ్. ౨

గుణవీర్యములచే మిక్కిలి యుష్ణంబులును, తీక్ష్ణంబులును, కటురసంబులును, ఆమ్లరసంబులును, లవణరసంబులును, మిక్కిలి మంటబుట్టించునవియునగు నన్నములనైనను; ఆరుకలు ఉద్దాలకములు వీనిచే చేయబడిన యన్నములను, భృశోష్ణాదిద్రవ్యములతోఁగూడిన యన్నములనైనను అధికముగ సేవించుటచేతను, పిత్తమును వృద్ధినొందించు ఇతరపదార్థముల సేవించుటచేతను ద్రవరూపమైన పిత్తంబును రక్తంబును మిక్కిలి ప్రకోపమునొంది రెండును నేకరూపముగ నొండొంట కలిసి శరీరమున వ్యాపించును.

ఇచ్చట "అతిసేవితైః" అని చెప్పుటచేత పైజెప్పిన యన్నములను విశేషముగ సేవించుటచే రక్తపిత్తము కల్గునని భావము. అతిసేవనమున ఒక్కపరి మిక్కుటముగ సేవించుట, లేక దీర్ఘకాలముగ సేవించుట, పిత్తము ద్రవరూపంబును కఠినరూపంబునై రెండువిధములనుండును కావున అందు ద్రవరూపమైన పిత్తము ప్రకోపమునొంది రక్తపిత్తమును కల్గించునను విషయమును సూచించుటకై "ద్రవం" అని విశేషముగ జెప్పంబడియె.

—— రక్తమునకును పిత్తమునకును అభేదము. ——

పిత్తం రక్తస్య వికృతేః సంసర్గాద్దూషణాదపి,
గంధవర్ణానువృత్తేశ్చ రక్తేన వ్యపదిశ్యతే. 3

పిత్తము రక్తముయొక్క రూపాంతరముగ రక్తముచే జనించినది. రక్తపిత్తములు రెండును ఒకటిలో నొకటి కలియును. పిత్తముచే రక్తము చెడును. పిత్తము చెరుచు కారణములచే రక్తంబును చెడును. ఈరెండింటికిని గంధంబును వర్ణంబును సమానములై యుండును. కావున పైజెప్పినకారణములచేత పిత్తంబును రక్తంబును సమానధర్మములై యుండును. దానంజేసియే రక్తమను పదముచే పిత్తము ముఖ్యముగ వ్యవహరింపబడును.

పైజెప్పినరీతిగ రక్తపిత్తము ఆరెండిటికిని భేదము కానరాదు. కావున "అధోగం యాపయేద్రక్తం" ఇది మున్నగుస్థలములయందు రక్తపదముచేత రక్తపిత్తమని యర్థము జెప్పుట సమంజసమని భావము.

—— రక్తము వృద్ధియగుటకు కారణములు. ——

ప్రభవత్యసృజస్థ్సానాత్ ప్లీహాతో యకృతశ్చ తత్,

పిత్తము ప్రకుపితమై రక్తమునకు స్థానములైన ప్లీహమునుండియు యకృత్తు నుండియు బైలువెడలి మిక్కిలి వృద్ధినొందును.

(రక్తము ఎనిమిది అంజలులపరిమితి కల్గియుండునని చెప్పబడినది. అట్టిరక్తము స్వస్థానమునుండి ప్రకోపమునొంది వెడలినచో నింకయు నధికప్రమాణము కల్గియుం డును. కావున రక్తపిత్తవ్యాధియందు దుష్టమై యధికముగ వృద్ధినొందునని భావము).

—— రక్తపిత్తపూర్వరూపము. ——

శిరోగురుత్వమరుచిః శీతేచ్ఛా ధూమకోఽమ్లకః. ४
ఛర్దిశ్ఛర్దితబైభత్స్యం కాసశ్శ్వాసో భ్రమః క్లమః,
లోహాలోహితమత్స్యాభగన్ధాస్యత్వం స్వరక్షయః. ౫
రక్తహారిద్రహారితవర్ణతా నయనాదిషు,
నీలలోహితపీతానాం వర్ణానామవివేచనమ్. ౬
స్వప్నేతద్వర్ణదర్శిత్వం భవత్యస్మిన్ భవిష్యతి,

రక్తపిత్తరోగము సంభవించుటకు మునుమున్ను తల బరువుగ నుండును. నో రుచి చెడును. చల్లనిపదార్థములయందును శీతోపచారములయందును అభిలాష కల్గును. నోట పొగవెడలునట్లుండును. పుల్లనిత్రేపులు వెడలును. వాంతియగును. వాంతియైన పుడు అసహ్యత తోచును. దగ్గును శ్వాసంబును వెడలును. ఒడలు తిరుగును, బడలిక

కల్గును. నోరు ఇనుముయొక్కయు రక్తముయొక్కయుం మత్స్యములయొక్కయుం గంధము కల్గియుండును. కంఠస్వరము క్షీణించుచు. కన్నులును మలమూత్రంబులును రక్తవర్ణములైనను పచ్చనిరంగు కల్గియైనను చిలుకపచ్చనిరంగు కల్గియైన నుండును. నలుపు ఎరుపు పసుపు అనువర్ణములను వేరువేరు గమనించలేకుండును. స్వప్నమున పదార్థములను రక్తవర్ణములుగ జూచును. ఈలక్షణములన్నియుం రక్తపిత్తవ్యాధి కల్గుటకు మున్ను జనించును. ఇదియే పూర్వరూపము.

రక్తపిత్తత్రైవిధ్యము.

ఊర్ధ్వం నాసాక్షికర్ణాస్యైః మేఢ్రయోనిగుదైరధః. 2
కుపితం రోమకూపైశ్చ సమస్తైస్తత్ప్రివర్తతే,

పైజెప్పిన రక్తపిత్తము ఊర్ధ్వగతమైనపుడు నాసికారంధ్రములనుండియుం నేత్రములనుండియుం కర్ణరంధ్రములనుండియుం నోటనుండియుం వెడలును. అధోగతమైనచో మేఢ్రమునుండియుం యోనిరంధ్రమునుండియు గుదద్వారమునుండియు వెడలును. ఊర్ధ్వాధోభాగముల రెండిటియందును జేరినరక్తపిత్తము రోమద్వారములనుండియుం పైజెప్పిన నాసికారంధ్రాదిమార్గము లన్నిటినుండియుం వెడలును.

(ఇచ్చట నీవిషయము నెరుంగునది:—"తతః ప్రవర్తతే రక్తం ఊర్ధ్వం చాధో ద్విధాపివా" అని తంత్రాంతరమున జెప్పినరీతి రక్తపిత్తము ఊర్ధ్వగతమనియుం, అధోగతమనియుం, ఉభయగతమనియు మూడువిధములు. అందు ఊర్ధ్వగతరక్తపిత్తమున నాసారంధ్రములు కన్నులు మున్నగు నేడురంధ్రములనుండియుం రక్తము వెడలును. అధోగతరక్తపిత్తమున మేఢ్రయోని గుదముల మూటినుండియుం రక్తము వెడలును. ఉభయగతరక్తపిత్తమున నాసారంధ్రాదిద్వారముల పదిటినుండియుం, రోమరంధ్రములనుండియుం రక్తము వెడలును).

ఊర్ధ్వగతరక్తపిత్తసాధ్యత్వము.

ఊర్ధ్వం సాధ్యం కఫాద్యస్మాత్తద్విరేచనసాధనాత్. ౮
బహ్వౌషధం చ పిత్తస్య విరేకో హి వరౌషధమ్,
అనుబన్ధీ కఫో యశ్చ తత్ర తస్యాపి శుద్ధికృత్. ౯
కషాయాస్స్వాదవో యస్య విశుద్ధశ్లేష్మణో హితాః,
కిము తిక్తాః కషాయా వా యే నిసర్గాత్కఫాపహాః. ౧౦

ఊర్ధ్వగతరక్తపిత్తము కఫాధిక్యముచే గల్గును. అట్టిరక్తపిత్తము "విరేకః పిత్తహరాణామ్" అను చరకవాక్యప్రకారము పిత్తమునకుప్రధానమైన విరేచనరూపచికిత్స

చే సాధింప నర్హమైనది. కావున సాధ్యమై యుండును. మరియు మధురకషాయ తిక్త రసములుగల యౌషధము లనేకములచే సాధింపందగియుండును. పిత్తమునకు ప్రధాన మైనది విరేచనౌషధము. కావున నీకారణములచేగూడ నూర్ధ్వగతము సాధ్యమగును. మరియు నీయూర్ధ్వగతమునందు కఫ మనుబంధముగ నుండును. అట్టికఫమును విరేచన రూపమగుచికిత్స శుద్ధముగ జేయును. కావున అనుబంధ్యమగు పిత్తమునకును అనుబంధ మగు కఫమునకును అనుకూలమైన చికిత్స జేయ వీలుండుటంజేసియు సాధ్యమగు. అను బంధమైన కఫములోగూడ వాతముజేరక కఫముమాత్రము శుద్ధమై యుండును. అట్టి పిత్తకఫముల రెంటికిని వ్యాధి విపరీతమగు మధురరసముకల ద్రవ్యములచే సిద్ధములైన స్వరస-కల్క-శృత-శీత-ఫాంటరూపములగు కషాయములు పిత్తకఫములరెండిటికిని హిత కరములై యుండుటవలనగూడ సాధ్యమగును. తిక్తరసముకల ద్రవ్యములచే సిద్ధములగు కషాయములును స్వభావముచేతనే కఫహరములు కావున వ్యాధికిని దోషమునకును విపర్యస్తమైనచికిత్సయగును. (పైజెప్పిన కారణములన్నిటిచే నూర్ధ్వగతమైన రక్తపిత్తము సాధ్యమని భావము).

## అధోగతరక్తపిత్తయాప్యత్వము.

అధో యాప్యం చలాద్యస్మాత్ తత్ప్రచ్ఛర్దనసాధనమ్,
అల్పౌషధం చ పిత్తస్య వమనం న వరౌషధమ్. ౧౧
అనుబన్ధీ చలో యశ్చ శాన్తయేఽపి న తస్య తత్,
కషాయాశ్చ హితా స్తస్య మధురా ఏవ కేవలమ్. ౧౨

అధోగతరక్తపిత్తము వాత మనుబంధమైన పిత్తముచే గల్గును. అట్టి యధోగత రక్తపిత్తమున వమనరూపచికిత్స జేయవలసియుండును. అట్టి వమనచికిత్స పిత్తమునకు విరేచనౌషధమువలె వాతముకాదు. అనుబంధముగ నుండువాతమునకును శాంతికరము కాదు. కేవలము వ్యాధికి ప్రత్యనీకమై యుండునుగాని పిత్తవాతరూపములగు దోషము లకు విపర్యస్తముకానోపదు. కావున నీవ్యాధికి చికిత్సలు విశేషముగ నుండవు. మరియు నీవ్యాధియందు కేవలము మధురరసముకల ద్రవ్యములచే సిద్ధములైన స్వరసకల్కాది కషాయములు మాత్రమే హితములై యుండును. తిక్తరససిద్ధములగు కషాయములు వాతప్రకోపనము లగుటంజేసి హితము కావు. ఇట్టి కారణములచే నధోగతరక్తపిత్తము యాప్యమగునుకాని సాధ్యం బెొకప్పుడును కానేరదు.

## ఉభయగతరక్తపిత్తము అసాధ్యము.

కఫమారుతసంస్పృష్టమసాధ్యముభయా(త్మకమ్) యనమ్,

అశక్యప్రాతిలోమ్యత్వాత్ అభావాదౌషధస్య చ. ౧౩

కఫవాతములరెండిటి సంసర్గముచే నుభయాత్మకమైన రక్తపిత్తము సంభవించును. ఈవ్యాధియందు ఊర్ధ్వమార్గములనుండియు అధోమార్గములనుండియు రక్తము వెడలును. (రక్తపిత్తము ఊర్ధ్వముగ వెడలునపుడు అధోమార్గమున విరేచనములరూపముగు శోధనచికిత్సయు, అధోగతమున వమనరూపచికిత్సయుం హితకరములు) ఉభయగత రక్తపిత్తమున అట్టి ప్రతిలోమహరణరూపమైన శోధనచికిత్స కవకాశము లేమింజేసియుం, మూడుదోషములకును శామకములగు నౌషధములు లేమింజేసియుం నీవ్యాధి యసాధ్యము. ఈసాధ్యాసాధ్యవివరము నే తంత్రాంతరమున సంగ్రహముగ నిట్లు చెప్పబడియె:—"ఊర్ధ్వం సాధ్యమధో యాప్యం అసాధ్యం యుగపద్గతమ్."

ఉభయగతరక్తపిత్తమున శోధనచికిత్సానుపపత్తి.

నహి సంశోధనం కిఞ్చిదస్త్యస్య ప్రతిలోమనమ్,
శోధనం ప్రతిలోమం చ రక్తపిత్తే భిషగ్జితమ్. ౧౪

రక్తపిత్తవ్యాధియందు వ్యాధికి ప్రతిలోమమైన శోధనచికిత్స జేయుట యుక్తమైనచికిత్స. ఉభయమార్గమున వెడలురక్తపిత్తమునం దట్టిశోధనచికిత్స కవకాశము లేదు. ఏలయన:—ఊర్ధ్వగతరక్తపిత్తమునకు విరేచనచికిత్సయుం, అధోగతమునకు వమనరూపచికిత్సయుం ప్రతిలోమశోధన మగును. కావున నటు జేయుంట యుక్తము. ఉభయమార్గముల వమనవిరేచనరూపముగ రక్తము వెడలునప్పుడు ఊర్ధ్వగమున కనుకూలముగ విరేచనౌషధ ముపయోగించినచో నధోగతరక్తపిత్తము వృద్ధినొందును. అధోగతమున కనుకూలముగ వమనౌషధము నుపయోగించినచో నూర్ధ్వగతము వృద్ధి నొందును, కావున నీరెంటికి ననుకూలమైన శోధనచికిత్స యొకప్పుడు సంభవించదు. కావున నుభయగత మసాధ్యము.

ఉభయగతరక్తపిత్తమున శమనచికిత్సానుపపత్తి.

ఏవమేవోపశమనం సర్వశో నాస్య విద్యతే,
సంసృష్టేషు హి దోషేషు సర్వజిచ్ఛమనం హితమ్. ౧౫

ఉభయగతరక్తపిత్తమున శమనరూపచికిత్సయుం సంభావితము కాదు ఊర్ధ్వాధోమార్గములరెంటియందును ఏకకాలమున రక్తము వెడలుతరిని ఈరెంటికి కారణములగు కఫవాతముల రెంటిని ఏకకాలమున శమింపజేయు నేకాకారమైన శమనచికిత్స యొకప్పుడును సంభవింపదు. కావున నసాధ్యము.

ఇచ్చట నీవివరణము తెలియంగునది:—ఊర్ధ్వగతరక్తపిత్తము కఫప్రకోపమున

కల్గును. అధోగతరక్తపిత్తము వాతప్రకోపమున గల్గును. ఈరెండుమార్గముల రక్తము సమకాలమున వెడలునప్పుడు కఫవాతములు రెండును ప్రకోపము నొందియుండును. ఈమూటియందును పిత్తము ప్రధానముగ నుండును. ఇట్లుండ నీయుభయములకును శమనచికిత్స జేయవలెనన్న శమనము సంతర్పణమనియు అపతర్పణమనియు రెండువిధములు. సంతర్పణము వాతశామకము. అపతర్పణము కఫశామకము. ఉభయగతరక్తపిత్తమునం దధోమార్గముగ, రక్తమును వెడలించువాతమును శమింపజేయ నుద్దేశించి సంతర్పణ (బృంహణ) రూపచికిత్స జేసినచో కఫము ప్రకోపించి యూర్ధ్వగతమును వృద్ధినొందించును. ఊర్ధ్వగతమునకు కారణమైనకఫమును శమింపజేయ నుద్దేశించి అపతర్పణచికిత్స జేసినను వాతము ప్రకోపించి యధోగతమును వృద్ధినొందించును. కావున ఏకకాలమున నీరెంటిని శమింపజేయు శమనచికిత్స (నరసింహరూపముబోలె) ఉభయప్రభావముకలది యెప్పుడును సంభవింపదు. కావున శమనరూపచికిత్సకుకూడ నవకాశములేదు కావున నీయుభయగతరక్తపిత్తము అసాధ్యము.

### రక్తపిత్తమున గల్గుదోషలక్షణములు.

తత్ర దోషానుగమనం సిరాస్ర ఇవ లక్షయేత్,
ఉపద్రవాంశ్చ వికృతిజ్ఞానతః

ఈరక్తపిత్తవ్యాధియందు వాతాదిదోషసంబంధమును సిరావిధ్యధ్యాయమున వాతపిత్తకఫములకు వేరువేరుగ జెప్పినలక్షణములబట్టి యూహించునది. మరియు నీవ్యాధియందు గల్గునుపద్రవములను వికృతివిజ్ఞానీయాధ్యాయమున జెప్పినవాని నెరుంగునది.

రక్తమునకు దోషాసారముగగల్గు లక్షణములు సిరావ్యధవిధ్యధ్యాయమున నిట్లు చెప్పబడెను. వాతమువలన రక్తము వ్యామవర్ణంబును ఎరుపురంగును రూక్షంబును నిర్మలంబును నై తీవ్రముగ వెడలును. పిత్తముచేత పీతవర్ణంబును, నీలవర్ణంబును దుర్గంధంబును, పలుచనయు నై వెడలును. కఫముచేత స్నిగ్ధంబును, పాండువర్ణంబును, తంతివలె నుండునదియు, పిచ్ఛిలంబును ఘనీభూతంబు నైనరక్తము వెడలును.

మరియు తంత్రాంతరమున రక్తపిత్తోపద్రవము లిట్లుచెప్పబడినవి:—బలహీనము, శ్వాసము, దగ్గు, జ్వరము, వాంతి, మదము (తిక్కయెత్తిన ట్లుండుట), శరీరము తెల్లవడుట, తాపము, మూర్ఛ, భుజించునపుడు మంట, అధైర్యము, రొమ్మునొప్పి, దప్పి, కోష్ఠము పగలదీయునట్లుండుట, తల మంటపుట్టుట, అన్నద్వేషము, అజీర్ణము ఇవి యన్నియు రక్తపిత్తమున గల్గునుపద్రవములు.

## కాసరోగము.

తేషు చాధికమ్. ౧౬

ఆశుకారీయతః కాసః తమేవాతః ప్రచక్షతే,

పైజెప్పబడిన రక్తపిత్తోపద్రవములలో కాసము మిక్కిలి తీవ్రముగ హింసించు నది. కావున నీక్రింద కాసనిదానము సలక్షణముగ వివరింపబడును.

## కాసభేదములు.

పఞ్చ కాసాః స్మృతాః వాత-పిత్త-శ్లేష్మ-క్షత-క్షయైః. ౧౭

క్షయాయోపేక్షితాస్సర్వే బలినశ్చోత్తరోత్తరమ్,

కాస మనగా దగ్గు. అయ్యది వాత-పిత్త-కఫములచే వేర్వేరుగను ఉరఃక్షతము చేతను, ధాతుక్షయముచేతను జనించుటంజేసి అయిదువిధములగును. ఈయైదువిధముల కాసములలో నొకటికన్న నొకటి యుత్తరోత్తరము మిక్కిలి బలవత్తరములై యుండును. వీనికి దగినచికిత్స జేయక యుపేక్షించునెడ నివియన్నియు ధాతుక్షయమును గల్గింప సమర్థము లగును.

## కాసపూర్వరూపములు.

తేషాం భవిష్యతాం రూపం కణ్ఠే కణ్డూరరోచకః. ౧౮

శూకపూర్ణాభకణ్ఠత్వం

పైజెప్పినకాసములు కల్గుటకుమున్ను కుత్తుకలో జిలపుట్టును. అరోచకము కల్గును. కుత్తుకలో ముండ్లు నిండియుండున ట్లుండును. (ఇవి యన్నియు కాసములకు పూర్వరూపములు.)

## కాససంప్రాప్తి

తత్రాధో విహతోఽనిలః,

ఊర్ధ్వం ప్రవృత్తః ప్రాప్యోరస్తస్మిన్ కణ్ఠే చ సంసజన్,

శిరస్స్రోతాంసి సంపూర్య తతోఽఙ్గాన్యుత్క్షిపన్నివ,

క్షిపన్నివాక్షిణీ పృష్ఠమురః పార్శ్వే చ పీడయన్. ౨౦

ప్రవర్తతే సవక్త్రేణ భిన్నకాంస్యోపమధ్వనిః,

హేతుభేదాత్ప్రతీఘాతభేదో వాయోస్సరంహసః ౨౧

యద్రుజాశబ్దవైషమ్యం కాసానాం జాయతే తతః,

పైజెప్పినకాలములయందు వాతము (నిశ్వాసవాతము) క్రిందికి అభిహతమై మరల వచ్చుటనుండి పైకి ఎగరగొట్టబడి వ్యాపించి కంఠమునజేరి యచ్చుటనుండి శిర

స్సునఁజేరి యందలి నాసాదిస్రోతోరంధ్రములును నిండించి పిమ్మట నవయవముల నన్నింటిని పైకి ఎగరగొట్టునట్లును, కన్నులను పెకలించునట్లు వీపును రొమ్మును ఇరుపార్శ్వములను పీడించునట్లు బాధకల్గించుచు నోటినుండి బైటవెడలును. అప్పుడు పగిలినకంచుపాత్ర ధ్వనించువిధముగ ధ్వని కంఠమునుండి వెడలును. ఇదియు కాససామాన్యసంప్రాప్తి. ఈసంప్రాప్తియందు కాసమునకు కారణమును అనుసరించి దానిభేదముచేతను ప్రతిఘాభేదము కల్గును. దానంజేసి వాతమునకు వేగముకూడ మారుచుండును. మరియు కాసమయమున నొప్పి పోటు మున్నగుబాధలును కంఠస్వరంబును కాసమునకు కారణములైన ఆయాదోషముల కనుగుణముగ మారి వ్యాధి సంప్రాప్తించును.

## వాతకాసలక్షణము.

కుపితో వాతలై ర్వాతః శుష్కోరఃకణ్ఠవక్త్రతామ్. ౧౨
హృత్పార్శ్వోరశ్శిరశ్శూలం మోహక్షోభస్వరక్షయాన్,
కరోతి శుష్కం కాసం చ మహావేగరుజాస్వనమ్. ౧౩
సోఽజ్గహర్షీ కఫం శుష్కం కృచ్ఛ్రాన్ముక్త్వాల్పతాం వ్రజేత్,

వాతము మిక్కుటముగ వృద్ధినొంది మిథ్యాహారాదికారణములచేత వాతము మిక్కిలి ప్రకోపమునొంది హృదయమును కుత్తుకను, నోటిని ద్రవములేక యెండింపజేసి రొమ్మునందును ఇరుప్రక్కలయందును, వక్షఃస్థలమునందును శిరస్సునందును నొప్పిని కల్గించుచు, మిక్కిలి వేగముతోను నొప్పితోను ధ్వనితోను కూడినపొడిదగ్గును కల్గించును. మరియు నీవ్యాధియందు మూర్ఛ కల్గును. గాలిచే తటాకాదిజలము కలతనొందుభంగి నంగాంగములన్నియు కలకపారును. రోగియొక్క శరీరమున పులకలు బొడమి ద్రవములేక యెండినకఫము నోటినుండి బైటవెడలినపుడు ఆదగ్గు కొంచెము తగ్గును. ఇది వాతప్రకోపమున జనించినకాసము.

(కాసము లన్నిటియందును వాతము ప్రకోపమునొందియే యుండును. అందు వాతికకాసమున వాతవృద్ధికరములగు కారణములచే వాతము మిక్కుటముగ ప్రకోపించునని యెరుంగునది.)

## పిత్తకాసలక్షణము.

పిత్తాత్పీతాక్షికఫతా తిక్తాస్యత్వం జ్వరో భ్రమః ౧౪
పిత్తాసృగ్వమనం తృష్ణా వైస్వర్యం ధూమకో మదః,
ప్రతతం కాసవేగేన జ్యోతిషామివ దర్శనమ్. ౧౫

పిత్తమును వృద్ధినొందించు నాహారవిహారాదులచే పిత్తము ప్రకుపితమై కాసము

(దగ్గు)ను కల్గించును. ఈపిత్తకాసమున కన్నులును కఫంబును పచ్చనై యుండును. నోరు చేదైయుండును. జ్వరముకల్గును. ఒడలు తిరుగును. రక్తముతోఁగూడిన పిత్తపసరు వాంతి యగును. దప్పి యధికమగును. నోట పొగ వెడలునట్లావిరివచ్చును. కంఠస్వరము మారి వికారస్వరముగ నుండును. తిక్కయెత్తినవానివలె వికారముగ నుండును. మిక్కిలి తీవ్రమైన కాసవేగముచేత కండ్లకు నక్షత్రము కనుబడునట్లు బూచులు గ్రమ్మును.

### కఫజకాసలక్షణము.

కఫాదురోఽల్పరుజ్మూర్ధ్నహృదయం స్తిమితం గురు,
కణ్ఠోపలేపః సదనం పీనసచ్ఛర్ద్యరోచకాః. ౨౬
రోమహర్షో ఘనస్నిగ్ధశ్వేతశ్లేష్మప్రవర్తనమ్,

స్వవర్ధకములైన కారణములచే కఫము ప్రకోపించి కాసమును కల్గించును. ఈ కాసము నందు రొమ్మున కొంచెముగ నొప్పి కల్గును. తలనొప్పి పుట్టును. హృదయము కఫముచే నాక్రమింపబడి బిరుసుగనుండును. కుత్తుకయందు కఫము చిక్కి అడ్డుపరచును. ఒడలెల్ల నొప్పికల్గును. పడిసెముపట్టి ముక్కురంధ్రములు బిగదీసియుండును. వాంతి యగును. అరోచకము కల్గును. ఒడలు పులకరెత్తును. ఘనీభవించి స్నిగ్ధంబును శ్వేతవర్ణంబును నగుకఫము నోట వెడలును. (ఈలక్షణము లన్నియు కల్గినది కఫమున జనించినకాసమని యెరుంగునది.)

### క్షతజకాసనిదాన-లక్షణములు.

యుద్ధాద్యైస్సాహసైస్తైస్తైః సేవితైరయథాబలమ్ ౨౭
ఉరస్యన్తఃక్షతే వాయుః పిత్తేనానుగతో బలీ,
కుపితః కురుతే కాసం కఫం తేన సశోణితమ్ ౨౮
పీతం శ్యావం చ శుష్కం చ గ్రథితం కుథితం బహు,
ష్ఠీవేత్కణ్ఠేన రుజతా విభిన్నేనేవ చోరసా. ౨౯
సూచీభిరివ తీక్ష్ణాభిః తుద్యమానేన శూలినా,
పర్వభేదజ్వరశ్వాసతృష్ణావైస్వర్యకమ్పవాన్. ౩౦
పారావత ఇవాకూజన్ పార్శ్వశూలీ తతోఽస్య చ,
క్రమాద్వీర్యం రుచిః పక్తిః బలం వర్ణశ్చ హీయతే. ౩౧
క్షీణస్య సాసృఙ్మూత్రత్వం స్యాచ్చ పృష్ఠకటీగ్రహః,

మల్లయుద్ధము (కుస్తీ) భారముగలవిల్లు నాకర్షించడము అధికమైన భారమును

మోచుట మున్నగు సాహసకృత్యములను తనబలమునకు మిక్కుటముగ జేసినచో రొమ్ము లోభాగమున నభిఘాతముచే గాయము కల్గును. దానంజేసి వాతము పిత్తముతోఁగూడి ప్రకోపమునొంది పిత్తసంబంధమునంజేసి మిక్కిలి బలిష్ఠమై కాసమును కల్గించును. పిత్తసంబంధమునంజేసి పీతవర్ణంబును, శ్యామవర్ణంబును, ద్రవములేక యెండినదియు, దుర్గంధయుక్తంబునునై రక్తముతోఁగూడి యుండవలె ఘనీభవించిన కఫము నోట వెడలును. దగ్గు వెడలుసమయమున కంఠమున నొప్పికల్గును. రొమ్ము పగులదీయునట్లుండును. సూదులచే బొడిచినవిధముగ శరీరమున రొమ్మునందును పోటు పుట్టును. కీళ్లు విడదీయబడినట్లు సడలి నొప్పిపుట్టును. జ్వరంబును శ్వాసంబును దప్పియు పుట్టును. కంఠస్వరము మారియుండును. శరీరము వణకును. పావురమువలె గుఱ్ఱుగుఱ్ఱుమనుధ్వని కంఠమున పుట్టునట్లు కూకలిడును. ఇరుప్రక్కలయందు నొప్పిపుట్టును. ఈ వ్యాధిచే పీడింపబడినరోగికి నానాట వీర్యంబును, శరీరబలంబును, రుచియు, జీర్ణశక్తియు శరీరకాంతియు వరుసగ హరించును. పిమ్మట మూత్రము రక్తముతోఁగూడి వెడలును. వీపును నడుమును పట్టినట్లు నొప్పికల్గును.

ఇయ్యది వాతపిత్తములచే గల్గినను రొమ్మునందభిఘాతమున గాయముకల్గి జనించును. కావున క్షతజకాస మనబడును. మరియు "తైస్తైస్సాహసైః" అనుపదముచేత గుఱ్ఱము మున్నగు వాహనములపై నెక్కి బలమునకు మిక్కుటముగ సవారిచేయుట, బిగ్గరగ మాటలాడుట, అధికమైన భారముమోచుట ప్రవహించునదుల కెదురీదుట మున్నగు సాహసకృత్యములచే హృదయమునం దభిఘాతము కల్గి దానంజేసి కాసము కల్గునని తెలిసెడి.

## క్షయజకాసలక్షణము.

వాయుప్రధానాః కుపితాః ధాతవో రాజయక్ష్మిణః. 32
కుర్వన్తి యక్ష్మాయతనైః కాసం ష్ఠీవేత్కఫం తతః,
పూతిపూయోపమం పీతం విస్రం హరితలోహితమ్. 33
లుఞ్చ్యేతే ఇవ పార్శ్వే చ హృదయం పతతీవ చ,
అకస్మాదుష్ణశీతేచ్ఛా బహ్వాశిత్వం బలక్షయః. 34
స్నిగ్ధప్రసన్నవక్త్రత్వం శ్రీమద్దర్శననేత్రతా,
తతోఽస్య క్షయరూపాణి సర్వాణ్యావిర్భవన్తి చ. 35

రాజయక్ష్మచే పీడితుడగు మనుజునకు అట్టి రాజయక్ష్మమునకు కారణములైన సాహసాదికారణములచేతనే వాతపిత్తకఫములు ప్రకోపమునొంది తీవ్రమైనకాసమును

కలిగించును. ఈ కాసమునందు దుర్గంధముతోఁగూడిన చీమునుబోలి పచ్చనై యామగంధముగలిగి అకుపచ్చనిరంగైనను రక్తవర్ణముగనైనను కఫము వెడలును. ఇరుప్రక్కలును స్వస్థానమునుండి జారిపడునట్లుండును. హృదయముకూడ జారునట్లుండును. కారణము లేకయే ఒకప్పుడు శీతమునందును వేరొకప్పుడు ఉష్ణమునందును ఇచ్ఛపోడమును. (అనగా నెప్పుడు శీతార్తుఁడయ్యును ఉష్ణమునందభిలాషలేక శీతమునందే యభిలాష కలిగియుండును. ఇంకొకప్పు డుష్ణపీడితుడయ్యును ఉష్ణమునే కోరుచుండుననుట.) ఆహారము నధికముగ గోరుచుండుస్వభావముకలిగి అధికముగనే భుజించును. శరీర బలము హరించును. ముఖము స్నిగ్ధంబై ప్రసన్నముగనుండును. దంతములును కన్నులును కాంతి యుక్తములై యుండును. పిదప నారోగికి క్షయమునకు జెప్పినపీనసము శ్వాసము మున్నగు క్షయవ్యాధి లక్షణములన్నియు సంభవించును. ఇయ్యది క్షయజకాస మన బడును.

## క్షయజ-క్షతజకాసముల సాధ్యాసాధ్యత.

> ఇత్యేష క్షయజః కాసః క్షీణానాం దేహనాశనః,
> యాప్యో వా బలినాం తద్వత్ క్షతజోఽభినవౌ తు తే. 38
> సిధ్యేతామపి సానాథ్యాత్

ఇత్తెరంగున పైజెప్పబడిన క్షయజకాసంబును క్షతజకాసంబును శరీరబలంబును ధాతువులును క్షీణించినవానిని శరీరమును చేడగొట్టిచంపును. మిక్కిలి బలశాలులకు కల్గినయెడ యాప్యమైయుండును. ఒకసమయమున చంపినను చంపును. పైజెప్పిన కాసములు రెండును నూతనముగ జనించినచో నతిశీఘ్రముగ ప్రారంభముననే తగిన చికిత్స జేసిన యెడ చతుష్పాద సంపత్తి కల్గియుండుటంజేసి సాధ్యములగును.

## కాససామాన్య సాధ్యాసాధ్యత్వము.

> సాధ్యా దోషైః పృథక్త్రయః,
> మిశ్రా యాప్యాద్వయాత్సర్వే జరసా స్థవిరస్య చ. 39

పైజెప్పిన కాసములన్నిటిలో వాత-పిత్త-కఫములచే వేరువేర నొక్కొకదోషముచే గల్గినకాసములు మూడును సాధ్యములు. తొలుత నొక్కదోషముచేగల్గినను పిదప కొంతకాలమునకు మిథ్యాహారవిహారాములచే నింక దోషమును ప్రకోపించి యా దోషములు రెండును సంక్రమించి యున్నపుడు నవి యాప్యము లగును. పైజెప్పినసాధ్యము లగుకాసములుకూడ ముదుసలులకు సంభవించినయెడ జరాదోషముచే నవియు యాప్యములగును.

ఇచ్చట నీవిషయము తెలియఁగునది:—కాసములు ఒక్కొకదోషముచే గలిగినవి మూఁడును క్షతజక్షతజకాసములు రెండునుగూడి యైదువిధములు కావున "పంచకాసాః" అని చెప్పబడినది. అందు ఒక్కొకదోషమున కల్గిన వాతిక-పైత్తిక-శ్లైష్మికకాసముల మూఁడింటియందును కొంతకాలమునకు నపథ్యసేవంజేసి యింకొకదోషముకూడ ప్రకోపించి తొల్లింటి దోషముతో నేకీభవించును. అయ్యవి వాతపిత్త-వాతకఫ-పిత్తకఫ-రూపమిశ్రభావముచే మూఁడువిధములును, రెండుదోషములు ప్రధానదోషముతో సంక్రమించినది యొకటియుం కలిసి నాల్గువిధముల నుండును. ఇయ్యవి కాలాంతరమున సంక్రమించినవి కాని వ్యాధికల్గునమయమునసే ప్రధానముగ రెండేసిదోషములైనను మూఁడు దోషములైనను ప్రకోపించి కల్గినవి కావు. కావున నీభేదములను పరిగణింపక కాసము లైదువిధములుగనే లెక్కింపఁబడినవి. ఈనాలిగింటిలో దోషద్వయమిశ్రములైన మూఁడు కాసములుమాత్రము యాప్యములు. మూఁడుదోషములును చేరినది యాప్యముకాక యసాధ్యమగును. ఈయభిప్రాయమునసే "మిశ్రా యాప్యాద్వయాత్సర్వే" అని తంత్రకారులు చెప్పిరి.

### కాసోపేక్షచే గల్గునుపద్రవములు.

కాసా చ్ఛ్వాసక్షయచ్ఛర్దిస్వరసాదాదయో గదాః,
భవన్త్యుపేక్షయా యస్మాత్తస్మాత్తం త్వరయా జయేత్. 30

పైజెప్పినకాసములకు తగినచికిత్స నకాలమున జేయక యుపేక్షించునెడ శ్వాసంబును, క్షయంబును, వాంతియు, స్వరహీనంబును కలుగును; కావున కాసమును కలిగిన తోడనే మక్కలి మెలకువతో శీఘ్రమున తగినచికిత్స జేసి నివర్తింపజేయుట ముఖ్య కర్తవ్యము.

ఇతి నిదానే తృతీయోఽధ్యాయః.

# చతుర్థాధ్యాయము.

## శ్వాసనిదానము.

అవ: పైయధ్యాయాంతమున “కాసాచ్ఛ్వాసక్షయ...భవన్త్యుపేక్షయా యస్మాత్” అనిచెప్పినప్రకారము కాసమునుపేక్షించిన శ్వాసము సంభవించునని తెలిసెడి. కావున కాసశ్వాసములకు పౌర్వాపర్యసంబంధము కలదు. మరియు హిక్క శ్వాసమును బోలె ప్రాణాన్తకమై శ్వాసమునకు సమానకారణమైయుండును. కావున అట్టిసంబంధమునుబట్టి యీయధ్యాయమున తొలుత శ్వాసనిదానంబును పిదప హిక్కానిదానంబును జెప్పబడును.

**సూ. అథాతశ్శ్వాసనిదానం వ్యాఖ్యాస్యామః,**

కాసనిదానమును చెప్పినపిదప నీయధ్యాయమున శ్వాసనిదానమును జెప్పెద నని భావము.

## శ్వాససామాన్యకారణములు.

కాసవృద్ధ్యా భవేచ్ఛ్వాసః పూర్వైర్వా దోషకోపనైః,
ఆమాతిసారవమథువిషపాణ్డుజ్వరైరపి. ౧
రజోధూమానిలైర్మర్మఘాతాదతిహిమామ్బునా,
క్షుద్రకస్తమకశ్ఛిన్నో మహానూర్ధ్వశ్చ పఞ్చమః. ౨

పైజెప్పినకాసమునకు ప్రారంభమున తగినచికిత్స జేయక యుపేక్షించినచో నయ్యది మిక్కిలి వృద్ధినొంది శ్వాసమును గలిగించును. మరియు సర్వరోగనిదానమున “తిక్తోషణకషాయామ్ల” అని యుపక్రమించి వాతపిత్తకఫములకు వేరువేరుగ జెప్పబడిన దోషప్రకోపకారణములచే గూడ శ్వాసము కలుగును. మరియు ఆమాతిసారము, వమనము, విషము, పాండురోగము, జ్వరము అను నీరోగములచేతను, ధూళి, పొగ, గాలి వీనియొక్క సంబంధముచేతను, కణత మున్నగు మర్మస్థానములయం దభిఘాతము కలుగుటచేతను, మిక్కిలి చల్లనైననీళ్లను సేవించుటచేతను గూడ శ్వాసము కలుగును. అయ్యది క్షుద్రశ్వాసము, తమకశ్వాసము, ఛిన్నశ్వాసము, మహాశ్వాసము, ఊర్ధ్వశ్వాసము నని యైదువిధములగును.

## శ్వాససంప్రాప్తి.

కఫోపరుద్ధగమనః పవనో విష్వగాస్థితః,
ప్రాణోదకాన్నవాహీని దుష్టస్స్రోతాంసి దూషయన్. 3
ఉరస్థః కురుతే శ్వాసం ఆమాశయసముద్భవమ్,

వాతము సంచరించుమార్గములను కఫము అడ్డగించును. దానంజేసి వాతము ప్రకోపించి శరీరమునందెల్ల వ్యాపించును. పిదప ప్రాణములను ఉదకమును అన్నమును వహించునాడులనుమార్గములను బొత్తుగ చెరచుచు వాతము ఉరస్థానమున విశేషముగ జేరి యామాశయమున శ్వాసమును బుట్టించును. ఇదియే శ్వాసము జనించుక్రమము.

ఇచ్చట వాతము వాతశరీరమునందెల్ల వ్యాపించినను ఉరస్థానమున ప్రధానముగ నుండునని తెలుపుటకై 'ఉరస్థః' అని ప్రత్యేకముగ జెప్పబడియె. మరియు నీవ్యాధి వాతమును ప్రధానముగజేసి ఆమాశయమున కలుగునని చెప్పుటచేత వాతహరంబును పాచనదీపనంబులును నగుఔషధముల జేయవలెనని శాస్త్రకర్త సూచించెను. సకలవ్యాధులయందు నిత్తెరంగుననే సంప్రాప్తినిబట్టి తత్తదనుగుణముగ చికిత్స నూహించునది.

## శ్వాస పూర్వరూపము.

ప్రాగ్రూపం తస్య హృత్పార్శ్వశూలం ప్రాణవిలోమతా. ౪
ఆనాహశ్శఙ్ఖభేదశ్చ

శ్వాసము పుట్టుటకుముందు హృదయమునందును పార్శ్వములయందును నొప్పి కలుగును. ప్రాణవాతము సాధారణముగ సంచరించక ప్రతిలోమముగ సంచరించ నారంభించును. కడుపులో గుడగుడ యనుశబ్దముతో గూడి యుబ్బరించును. కణతల యందు నొప్పిపుట్టును. ఇది శ్వాసమునకు పూర్వరూపము.

## క్షుద్రశ్వాసలక్షణము.

తత్రాయాసాతిభోజనైః,
ప్రేరితః ప్రేరయేత్ క్షుద్రం స్వయం సంశమనం మరుత్. ౫

శరీరమున కలతబుట్టించు పనులజేసినను, మిక్కుటముగ భుజించినను, వాతము ప్రకోపమునొంది శ్వాసమును కలిగించును. ఇయ్యది చికిత్సలేకయే తనంత శమించును. ఈశ్వాసము మిగుల సూక్ష్మంబును చికిత్స నపేక్షింపక తనంతనే శమించునదియు నగుటంజేసి క్షుద్రశ్వాస మనబడును.

## తమకశ్వాసలక్షణము.

ప్రతిలోమం సిరా గచ్ఛన్ ఉదీర్య పవనః కఫమ్,
పరిగృహ్య శిరోగ్రీవం ఉరః పార్శ్వే చ పీడయన్. ౭
కాసం ఘుర్ఘురకం మోహం అరుచిం పీనసం తృషమ్,
కరోతి తీవ్రవేగం చ శ్వాసం ప్రాణోపతాపినమ్. ౮
ప్రతామ్యేత్తస్య వేగేన నిష్ఠ్యూతాన్తేక్షణం సుఖీ,
కృచ్ఛ్రాచ్ఛయానశ్శ్వసితి నిషణ్ణస్స్వాస్థ్యమృచ్ఛతి. ౯
ఉచ్ఛ్రితాక్షో లలాటేన స్విద్యతాభృశమర్తిమాన్,
విశుష్కాస్యో ముహుశ్శ్వాసీ కాంక్షత్యుష్ణం సవేపథుః. ౯
మేఘామ్బుశీతప్రాగ్వాతైః శ్లేష్మలైశ్చ వివర్ధతే,
స యాప్యస్తమకస్సాధ్యో నవో వా బలినో భవేత్. ౧౦

వాతము స్వకారణములచే ప్రకోపమునొంది కఫమును పైకి నెగురగొట్టి వాతవాహిసిరలమార్గమును కఫ మడ్డగించి యుండుటంజేసి యామార్గములయందు ప్రతిలోమముగ సంచరించుచు శిరస్సును కంఠమును బిగియబట్టి, రొమ్మును ఇరుప్రక్కలను పైకిలాగువిధముగ బాధగలిగించుచు దగ్గును, గుఱ్ఱుగుఱ్ఱు మనుశబ్దమును మూర్ఛను అరోచకమును పడిసెమును దప్పిని గలిగించుచు తీవ్రమైన వేగముతో శ్వాసమును కలిగించును.ఆట్టి శ్వాసము ప్రాణముల మిక్కిలి(ఊపిరి నిటునటు సంచరింపనీయక)బాధించు స్వభావము కలిగియుండును. అట్టిశ్వాసముయొక్క వేగముచే మిక్కిలి బాధ కలుగును. ప్రాణవాతసంచారమార్గము నడ్డగించినకఫము నుమిసినప్పుడు క్షణకాలము సుఖముగ నుండును. ఆరోగి పరుండియున్నపుడు మిక్కిలి కష్టముచే నూపిరాడక శ్వాసమును విడచును. కూర్చొనియున్నపుడు కొంచెము సుఖముగ నుండును. ఈవ్యాధియందు కన్నులు పైకినిక్క బొడిచియుండును. ముఖముపై చెమటబట్టి మిక్కిలి బాధకలుగును. పలుమారు శ్వాసమునువిడచి దానంజేసి నోరెండి వడవడ వణకుచు మిక్కిలి వేడిని కోరును. మబ్బు ఆవరించియుండునప్పుడును, వర్షము కురియునపుడును, మంచుకాలమైన హేమంతశిశిరఋతువులయందును, చలువనుకలిగించు ఔషధ-అన్న-విహారముల చేతను, తూర్పుగాలి వీచునపుడును, కఫమును వృద్ధినొందించు బెల్లము మున్నగుపదార్థముల సేవించినపుడును ఈశ్వాసము మిక్కిలి వృద్ధినొందును. ఇదియే తమకశ్వాసము. ఇయ్యది యాప్యము. బలవంతుడగువానికి క్రొత్తగ నీవ్యాధి సంభవించినతోడనే చికిత్స జేసినచో సాధ్యమగును.

### ప్రతమకశ్వాసము.

జ్వరమూర్ఛాయుతశ్శీతైః శామ్యేత్ప్రతమకస్తు సః,

పైజెప్పిన తమకశ్వాసముననే జ్వరము మూర్ఛయుంకలిగి శీతములైన ఔషధాన్నములచే శమించిన నయ్యది ప్రతమకశ్వాస మనబడును. ఇయ్యది తమకశ్వాసమున నంతర్భూతము కావున 'పంచశ్వాసాః' అనుపరిగణనమునకు విరోధము లేదనియెఱుంగునది.

### ఛిన్నశ్వాసలక్షణము.

ఛిన్నాచ్ఛ్వసితివిచ్ఛిన్నం మర్మచ్ఛేదరుజార్దితః ౧౧
సస్వేదమూర్ఛస్సానాహః వస్తిదాహనిరోధవాన్,
అధోదృష్టిర్విప్లుతాక్షశ్చ ముహ్యన్ రక్తైకలోచనః. ౧౨
శుష్కాస్యః ప్రలపన్ దీనః నష్టచ్ఛాయో విచేతనః,

ఛిన్నశ్వాసమున రోగి అప్పుడప్పుడు నిలిచినిలిచి శ్వాసమును విడచును. మర్మస్థానముల ఛేదించినవిధముగ బాధకలుగును. ఒడలిపై చెమటబట్టి మూర్ఛనొందును. కడుపుబ్బరించును. వస్తియందు మంటయు నొప్పియుం కలుగును, అడచిన ట్లుండును. ఆరోగి క్రిందజూచుచు చంచలమైనదృష్టి కలిగియుండును. ఒకకన్నుమాత్రము ఎఱ్ఱనై యుండును. నోట ద్రవములేక యెండును. దీనుడై యసంబద్ధముగ మాటలాడును. శరీరము కాంతిచెడును ఒడలెఱుంగక పడియుండును. ఈలక్షణములు కలిగినది ఛిన్నశ్వాసమని యెఱుంగునది.

### మహాశ్వాసలక్షణము.

మహతా మహతా దీనో నాదేన శ్వసితి క్రథన్. ౧౩
ఉద్ధూయమానస్సంరబ్ధః మత్తర్షభ ఇవాఽనిశమ్,
ప్రణష్టజ్ఞానవిజ్ఞానః విభ్రాన్తనయనాననః. ౧౪
వక్షస్సమాక్షిపన్ బద్ధమూత్రవర్చా విశీర్ణవాక్,
శుష్కకణ్ఠో ముహుర్ముహ్యన్ కర్ణశఙ్ఖశిరోఽతిరుక్. ౧౫

మహాశ్వాసమునందు రోగి దీనుడై కుత్తుకలో ధ్వనించుచు అతిదీర్ఘముగ శ్వాసముల విడచును. శరీరమునెల్ల పైకి కదలించుచు, మిక్కిలి యలతజెంది మదించిన యాబోతెద్దు బుసకొట్టునట్లు తీవ్రముగ శ్వాసమును విడచును. ఆరోగికి శాస్త్రసంబంధమైన జ్ఞానంబును, ఆయాపనులను సంబంధించినజ్ఞానంబును బొత్తుగలేక కన్నులును ముఖంబును తిరుగుచుండును. శ్వాసము వెడలునప్పుడు రొమ్ము పలుమారు పైకి నుబుకుచుండును. మలమూత్రములు వెడలక బద్ధగించియుండును. మాటలు స్ఫుటముగ దెలియవు.

గొంతెండి మాటిమాటికి మూర్ఛనొందును. కణతలయందును శిరస్సునందును తీవ్రమైన నొప్పి కలుగును.

### ఊర్ధ్వశ్వాసలక్షణము.

దీర్ఘమూర్ధ్వం శ్వసిత్యూర్ధ్వాన్న చ ప్రత్యాహరత్యధః,
శ్లేష్మావృతముఖస్రోతాః క్రుద్ధగన్ధవహార్దితః ౧౮
ఊర్ధ్వదృగ్వీక్షతే భ్రాన్తమక్షిణీ పరితః క్షిపన్,
మర్మసు చ్ఛిద్యమానేషు పరిదేవీ నిరుద్ధవాక్. ౧౯

మిక్కిలి దీర్ఘముగ నిట్టూర్పు పైకివిడచి మరల నాశ్వాసమును క్రిందికి మరలింపజాలకుండును. ముక్కులు చెవులు మున్నగువానిరంధ్రములు కఫముచే నడ్డగింపబడి యుండును. మిక్కిలి ప్రకోపమునొందినవాతముచే పీడింపబడి నిలువుగ్రుడ్డుపడి చంచలములైన కన్నులను నలుప్రక్కల ద్రిప్పుచు పైచూపు చూచును. మర్మములన్నియు ఛేదింపబడినవిధముగ బాధకలిగియుండ మిక్కిలి దుఃఖించుచు నోట మాటవెడలకుండును. ఇది యూర్ధ్వశ్వాసము.

పైజెప్పిన తక్కినశ్వాసములయందెల్ల పైకి వెడలినశ్వాసమును మరలించి మరల శ్వాసకోశమున జేర్చుచుండును. ఈశ్వాసమునం దటుగాక పైకి దీర్ఘముగ వెడలిన శ్వాసము మరలి క్రిందికి దిగక పైకివెడలుచునే యుండునుగాన నిది యూర్ధ్వశ్వాసమని చెప్పబడును.

### శ్వాససాధ్యాఽసాధ్యవివరణము.

ఏతే సిధ్యేయురవ్యక్తా వ్యక్తాః ప్రాణహరా ధ్రువమ్,

ఈశ్వాసరోగములలో ఛిన్నశ్వాసము, మహాశ్వాసము, ఊర్ధ్వశ్వాసము అను నీమూడును వానికి జెప్పినలక్షణములు స్ఫుటముగ గానరాకుండునపుడు చికిత్స జేసినచో సాధింపదగియుండును. అటుగాక వానిలక్షణములన్నియు స్ఫుటముగ గానవచ్చినచో తప్పక ప్రాణముల హరించును.

శ్వాససాధ్యాసాధ్యలక్షణములు తంత్రాంతరమున నిట్లు చెప్పబడియె:—"క్షుద్రస్సాధ్యో మతస్తేషాం తమకః కృచ్ఛ్ర ఉచ్యతే, త్రయశ్శ్వాసా న సిధ్యన్తి తమకో దుర్బలస్య చ" (ఐదువిధములగుశ్వాసములలో క్షుద్రశ్వాసము సాధింపదగియుండును. తమకశ్వాసము కృచ్ఛ్రసాధ్యము. ఛిన్నఊర్ధ్వమహాశ్వాసములు మూడు అసాధ్యములు. బలమునశించినవానికి కలిగిన తమకశ్వాసంబును అసాధ్యమగును.)

### హిక్కాస్వరూపము.

శ్వాసైకహేతుప్రాగ్రూపసంఖ్యాప్రకృతిసంశ్రయాః. ౧౭
హిక్కాభక్తోద్భవా క్షుద్రా యమలా మహతీతి చ,
గమ్భీరా చ

హిక్క-హిధ్మ యన వెక్కిళ్లు. దానికి హేతువులును, ప్రాగ్రూపంబును, సంఖ్యయు, సన్నిపాతకారణంబును, ఆశ్రయంబును శ్వాసమునకు సమానములై యుండును. అట్టిహిక్క అన్నజ(రూక్షాది ఆహారములచే గలిగినది) మరియు, క్షుద్రము, యమలము, మహతి, గంభీరయునని యైదు పేర్లు కలిగియుండును.

ఇచ్చట నీవివరము తెలియంగునది:—శ్వాసమునకు "కాసవృద్ధ్యాభవేచ్ఛ్వాసః" అని యుపక్రమించి చెప్పబడిన కారణములును, "హృత్పార్శ్వశూలం" అని ప్రారంభించిచెప్పిన పూర్వరూపంబును, "పంచ శ్వాసాః" అని చెప్పబడిన పంచసంఖ్యయు, సన్నిహితకారణంబైనవాతంబును, "ఆమాశయసముద్భవం" అని శ్వాసమునకు జెప్పిన యుత్పత్తిస్థానమైన ఆమాశయంబును, ఇవియే హిక్కావ్యాధికిని సమానములుగ నుండునుకావున హిక్కావ్యాధికి వేరుగ హేత్వాదుల జెప్ప నవసరములేదని భావము.

### అన్నజహిక్కాలక్షణము.

మరుత్తత్ర త్వరయాఽయుక్తైసేవితైః. ౧౯
రూక్షతీక్ష్ణఖరాసాత్మ్యైః అన్నపానైః ప్రపీడితః,
కరోతి హిక్కామరుజాం మన్దశబ్దాం క్షవానుగామ్ ౨౦
శమం సాత్మ్యాన్నపానేన యా ప్రయాతి చ సాన్నజా,

జిడ్డులేక రూక్షములైనపదార్థములనైనను, తీక్ష్ణములగు మిరియాలు ఆవాలు మున్నగుపదార్థములనైనను, కఠినపదార్థములనైనను, తనకు అలవాటున లేనిపదార్థములనైనను అన్నపానాదులుగ జేసివానిని భుజించవలసినపద్ధతి ననుసరింపక అతిశీఘ్రముగ భుజించుటచే వాతము మిక్కిలి ప్రకోపమునొంది వెక్కిళ్ల బుట్టించును. ఇది యన్నపానాదివైపరీత్యమున బుట్టినదికావున అన్నజహిక్క యనబడును. ఈహిక్కయందు నొప్పియుం తీవ్రమైనశబ్దంబును కలుగదు. ఈహిక్క తుమ్ములతోగూడి వెడలును. తనకు సాత్మ్యములగు నన్నపానములచేత శాంతినొందును.

ఇచ్చట పైజెప్పబడిన అన్నపానాదులు హిక్కారోగమునకు హేతువులు. "కరోతి హిక్కామరుజాం" అనిచెప్పినది స్వరూపలక్షణములు. "శమం సాత్మ్యాన్నపానేన" అని చెప్పినది ఉపశయమునని యెరుంగునది.

### క్షుద్రహిక్కాలక్షణము.

ఆయాసాత్పవనః క్షుద్రః క్షుద్రాం హిక్కాం ప్రవర్తయేత్. ౨౧
జత్రుమూలప్రతిసృతా మల్పవేగాం మృదుం చ సా,
వృద్ధిమాయాస్యతో యాతి భుక్తమాత్రే చ మార్దవమ్. ౨౨

శరీరమున కాయాసమును గలిగించుపనుల జేయుంటచే వాతము స్వల్పముగ ప్రకోపమునొంది క్షుద్రహిక్కను కలిగించును. ఇయ్యది కంఠమూలమున (కుత్తుకలో) బుట్టి కొంచెముగ బాధగలిగించుచు మిక్కిలి తీవ్రముగాక స్వల్పవేగము గలిగియుండును. (కావుననే యిది క్షుద్రహిక్క యనబడును) అందుపై శరీరమున కాయాసమును గలిగించుపనుల జేసినచో వృద్ధినొందును. భుజించినతోడనే కొంచెము శమించును.

### యమలహిక్కాలక్షణము.

చిరేణ యమలైర్వేగై రాహారే యా ప్రవర్తతే,
పరిణామోన్ముఖే వృద్ధిం పరిణామే చ గచ్ఛతి. ౨౩
కమ్పయన్తీ శిరోగ్రీవాం ఆధ్మాతస్యాతితృష్యతః,
ప్రలాపచ్ఛర్ద్యతీసారనేత్రవిప్లుతజృమ్భిణః. ౨౪
యమలా వేగినీ హిక్కా పరిణామవతీ చ సా,

రెండేసి జంటజంటగ తీవ్రమైనవేగముతో వెక్కిళ్లువెడలి చిరకాలమువరకు వేగముజూపునది యమళహిక్క యనబడును. ఇయ్యది భుజింపబడినయాహారము జీర్ణమగుట కున్ముఖమైనపుడు ప్రారంభమై పూర్తిగ జీర్ణమగుసరికి అప్పటప్పటికిని వృద్ధి నొందును. అది వెడలునప్పుడు శిరస్సును కంఠమును కుదిలించునట్లు కదలించును. కడుపుబ్బరించును. మిక్కిలి దప్పికలుగును. ప్రలాపము, ఛర్ది, అతిసారమును కలుగును. కన్నులు పలుదెరంగుల కదలించి వికృతముగజూచును. ఆవలింతలువిశేషముగ వెడలును. ఈహిక్కావ్యాధి రెండేసిజంటగ వెడలుటం జేసి యమలహిక్కయనియు, తీవ్రమైన వేగము కల్గియుండుటంబట్టి వేగినియనియు భుజించిన యాహారము జీర్ణమగునప్పుడు కలుగునదిగాన పరిణామవతి యనియు నామములచే నన్వర్థముగ జెప్పబడును.

### మహాహిక్కాలక్షణము.

స్తబ్ధభ్రూశఙ్ఖయుగ్మస్య సాస్రవిప్లుతచక్షుషః ౨౫
స్తమ్భయన్తీ తనుం వాచం స్మృతిం సంజ్ఞాం చ ముష్ణతీ,
రున్ధతీ మార్గమన్నస్య కుర్వతీ మర్మఘట్టనమ్. ౨౬
పృష్ఠతో నమనం శోషం మహాహిక్కా ప్రవర్తతే,

మహామూలా మహాశబ్దా మహావేగా మహాబలా. ౨౮

కనుబొమలరెంటిని కణతలను కదలనీయక స్తంభింపజేసి మహాహిక్క కలుగును. మరియు నిది కలుగునపుడు రోగి కన్నుల నీరు వెడలును. చంచలములై యుండును. శరీరమును కదలనీయక స్తంభింపజేయును. నోట మాటవెడలనీయక మూగివానినిగ జేయును. జ్ఞాపకశక్తిని జ్ఞానమును బొత్తుగ నశింపజేయును. ఆహారము లోనికిం జను మార్గమును అడ్డగించును. హృదయాదిమర్మముల నన్నింటిని అతలకుతలముగ చలింప జేయును. వీపు వంగును. శరీరమెల్ల శోషించును. ఇయ్యది మిక్కిలి ప్రబలమైనమూలము కలిగి సాధింప నలవికాదు. మిక్కిలి తీవ్రమైన గొప్పధ్వనికలిగినది. మిక్కిలి తీవ్రమైన గొప్పవేగముకలది. మిక్కిలి బలిష్ఠమైనది. ఈ కారణములచే నిది మహాహిక్క యని మునివరులచే జెప్పఁబడియె.

## గంభీరహిక్కాలక్షణము.

పక్వాశయాద్వా నాభేర్వా పూర్వవద్యా ప్రవర్తతే,
తద్రూపా సా ముహుః కుర్యాత్ జృమ్భామఙ్గప్రసారణమ్.
గమ్భీరేణానునాదేన గమ్భీరా

మహాహిక్కకు పైజెప్పినలక్షణములన్నియు కలిగి నాభికి దిగువనుండుపక్వాశయమునుండియైనను, నాభిస్థానమున నుండియైనను వెడలునది గంభీరహిక్క యనబడును. ఇయ్యది మహాహిక్కకు చెప్పినరూపములన్నియు గలిగియుండును. అవిగాక దీనియందు ఆవలింతలు ఒడలివిరుపులును విశేషముగ పలుమారు కలుగును. అవయవముల లాగినట్లుండును. మిక్కిలి గంభీరమైన ధ్వనితోఁగూడి బైలువెడలును. కావున నేయిది గంభీరహిక్క యనబడును.

## సాధ్యాఽసాధ్యహిక్కాలక్షణము.

తాసుసాధయేత్,
ఆద్యే ద్వే; వర్జయేదన్త్యే సర్వలిఙ్గాం చ వేగినీమ్. ౨౯
సర్వాశ్చ సఞ్చితామస్య స్థవిరస్య వ్యవాయినః,
వ్యాధిభిః క్షీణదేహస్య భక్తచ్ఛేదక్షతస్య వా. ౩౦

పైజెప్పబడిన హిక్కావ్యాధు లైదిటిలో తొల్లింటి రెండు(క్షుద్ర అన్నజ) హిక్కలు రెండును సాధ్యావస్థ నుండునవి కావున వానికి చికిత్స జేయునది. కడపట నుండు గంభీరమహాహిక్కలు రెండును అసాధ్యములు కావున చికిత్స జేయదగదు. యమళహిక్క సంపూర్ణలక్షణములు కలిగియున్నచో నదియు నసాధ్యము. మరియు

చిరకాలమునుండి సంచితమైన ఆమముకల్గియున్నవానికిని ముసలివానికి స్త్రీసంగమముచే కృశించినవానికిని, పలుతెరంగులైన రోగములచే క్షీణించిన శరీరముకలవానికిని, ఆహారమును విడచియుండుటచే శరీరము కృశించినవానికిని పైజెప్పిన ఐదుహిక్కలలో నేదికలిగినను అసాధ్యమగును.

హిక్కాశ్వాసముల శీఘ్రకారిత్వము.

సర్వేఽపి రోగా నాశాయ నత్వేవం శీఘ్రకారిణః,
హిధ్మాశ్వాసౌ యథా; తౌహి మృత్యుకాలే కృతాలయౌ. 3౧

పలుతెరంగులైన రోగములన్నియుం మిక్కిలి యుత్కటములైనవాడు మనుజుల నవశ్యముగ జంపును. కాని హిక్కాశ్వాసములవలె నతిశీఘ్రముగ జంపనోపవు. ఈ రెండురోగములు మనుజులకు మరణకాల మాసన్నమైనపుడురోగివద్దనింటంబోలె కాపురము జేయుచుండును. ఈరెండును అతిశీఘ్రముగ తనపని నెరవేర్చుస్వభావము కలిగియుండును. కావున నివి పొడచూపిన వెంటనే వైద్యుడు మిక్కిలి మెలకువతో చికిత్స జేయ సిద్ధముగ నుండవలెను.

వెక్కిళ్లకు హిక్క, హిధ్మ యని రెండుపేర్లు కలవు. అందు హిక్క యన నది "హిక్ ఇతి కాయతే (శబ్దాయతే) ఇతి హిక్కా" అను వ్యుత్పత్తిచేత హిక్. అను శబ్దమువలె ధ్వనిచేయుచు సంభవించురోగమని తెలిసెడి. హిధ్మ యనుశబ్దము "హి ఇతి ధ్మాయతే (శబ్దాయతే) ఇతి హిధ్మా" యనువ్యుత్పత్తిచేత సిద్ధమైనది. దీనికి మును పటివలెనే యర్థము నెరుంగునది. ఈరెండుపదములచేత వ్యాధిస్వరూపము స్ఫుటముగ నేర్పడును. అందు మాధవనిదానము, చరకము,సుశ్రుతము మున్నగుగ్రంథములయందు హిక్కాశబ్దమును ప్రయోగించిరి. వాగ్భటాచార్యులు హిధ్మ యని చెప్పిరి.

ఇతి అష్టాఙ్గహృదయనిదానే చతుర్థోఽధ్యాయః.

# పఞ్చమాధ్యాయము.

అవ: "కాసాచ్ఛ్వాసక్షయచ్ఛర్ది" అని యుపక్రమించి తృతీయాధ్యాయము చివరజెప్పినప్రకారము కాసము నుపేక్షించుటచే శ్వాసము క్షయము వాంతి మున్నగు రోగములు సంభవించునని తెలియుచున్నది; కావున కాసమునకు పిదప శ్వాసనిదానమును జెప్పి పిమ్మట శ్వాసమునకు సమానధర్మమగు హిక్కానిదానమును వివరించి పిదప రాజయక్ష్మనిదానము వివరింపబడును.

సూ. అథాతో రాజయక్ష్మాదినిదానం వ్యాఖ్యాస్యామః.

శ్వాసహిక్కానిదానమును జెప్పినపిదప రాజయక్ష్మము మున్నగువ్యాధులనిదానమును వివరించెదనని యర్థము.

## రాజయక్ష్మ పర్యాయనామములు.

అనేకరోగానుగతో బహురోగపురోగమః,
రాజయక్ష్మా క్షయశ్శోషః రోగరాడితి చ స్మృతః. ౧

ఈరోగము కలిగినప్పుడు జ్వరము అతిసారము మున్నగు తక్కినరోగములన్నియు (రాజు వెడలినప్పుడు రాజువెంట తక్కినపరివారము వెంబడించిపోవుభంగి) నీరోగము వెంటనే సంభవించును. అట్టిరోగముల వెంటబెట్టుకొని (రాజు పరివారమును వెంటబెట్టుకొని ముందునడచుభంగి) యీరోగము ప్రధానముగ ముందు నిలచి బాధింపందొడంగును. కావున రాజయక్ష్మ మనబడును. ఇయ్యది రాజయక్ష్మము, క్షయము, శోషము, రోగరాజము నని పర్యాయనామములచే జెప్పబడును.

## పర్యాయనామముల కన్వర్థత.

నక్షత్రాణాం ద్విజానాం చ రాజ్ఞోఽభూద్యదయం పురా,
యచ్చ రాజా చ యక్ష్మా చ రాజయక్ష్మా తతో మతః. ౨
దేహౌషధక్షయకృతేః క్షయస్తత్సంభవాచ్చ సః,
రసాదిశోషణాచ్ఛోషః రోగరాట్ తేషు రాజనాత్. ౩

ఆకసమున నుండునక్షత్రములకును బ్రాహ్మణులకును రాజుచంద్రుడు, యక్ష్మమన రోగము. అట్టిరాజైనచంద్రునకు ఈరోగము తొలుత సంభవించినది. కావున రాజయక్ష్మ మనబడును. మరియు రోగములలో రాజువలె ప్రధానమైనది కావున రాజ

యక్ష్మమనియుం జెప్పనగును. మనుజులశరీరము నీరోగము క్షీణింపజేయును. దీని కుపయోగింపబడు నౌషధములశక్తిని బొత్తుగ (పనిచేయనీయక) క్షీణింపచేయును. ఈ రెండుకారణములచే నియ్యాది క్షయమనియుం జెప్పబడును. మరియు శరీరము క్షీణించుటంజేసియుం నిది యొకసమయమున సంభవించును కావున క్షయ మనదగును. రసాది ధాతువులను శోషింపజేయుటంజేసి శోషమనియుం జెప్పనగును. ఇది రోగములలో ప్రధానమై రాజువలె ప్రకాశించునది కావున రోగరాట్టనియుం జెప్పనగును.

ఈరోగము తొలుత చంద్రునకు సంభవించెననుట కీయితిహాసచరిత్రమునుబట్టి తెలిసెడి:—అశ్విన్యాదినక్షత్రములకు నాయకుడు చంద్రుడు. ఆతారలలో రోహిణి యందు పూర్ణమైనయభిమానము. తక్కిననక్షత్రములకన్న నెక్కువగ ప్రీతిగల్గియుండెను. పిదప నశ్విన్యాదితారలు తమకు జనకుండగు దక్షప్రజాపతితో చంద్రుని దుర్నయమును జెప్ప పట్టగరానికినుకచే నాపితామహుండు శపింప నయ్యాది సాకారమై చంద్రునిరస రక్తాదిధాతువుల నానాట శోషింపందొడంగె. దానంజేసి చంద్రుండు నానాట శరీరము కృశించి పాటవము చెడుచుండ జగజ్జనకునిశరణంబు వేడ కరుణార్ద్రహృదయుండై యశ్వినీదేవల జికిత్సజేయ నానతిచ్చెను. వారును రసాయనాదిప్రయోగములంజేసి చంద్రునివ్యాధి నిముక్తునిజేసిరి. చంద్రుడు నీరోగశరీరుడై అశ్విన్యాదితారల కన్నిటికిని సముడైయుండె. అంతనివ్యాధిని వేగరోధము, సాహసము, క్షయము, విషమాశనము నను నాల్గుకారణముల నాధారముగ జేసికొని లోకమునంగల ప్రజలబాధింపుడని యానతీయ నాటంగోలె పైజెప్పిన నాల్గుకారణములు కల్గినపుడు ఈక్రూరవ్యాధి జనులబాధింపం దొడంగె. ఈరాజయక్ష్మమునకు దక్షశాపము (జ్వరమునకు రుద్రకోపముబోలె)విప్రకృష్ట కారణమని యెరుంగునది. ఈచరిత్రాంశము చరకమున "దివౌకసాం కథయతామ్" అని మొదలిడి "యస్మాత్సరాజ్ఞః ప్రాగాసీత్ రాజయక్ష్మా తతోమతః. సయక్ష్మాహుంకృతోఽశ్విభ్యాం మానుషం లోకమాగతః, లబ్ధ్వా చతుర్విధం హేతుం సమావిశతి మానవాన్" అనువాక్యములచే స్ఫుటముగ జెప్పిరి.

### రాజయక్ష్మమునకు నాల్గుకారణములు.

సాహసం వేగసంరోధః శుక్రౌజః స్నేహసంక్షయః,
అన్నపానవిధిత్యాగః చత్వారస్తస్య హేతవః. ౪

తనశరీరముయొక్కయుం వాక్కుయొక్కయుం బలమునకు మిక్కుటముగ శరీరముచేనైనను వాక్కుచేనైనను మితిమీరి పనిజేయుట సాహసము. అయ్యాది ఏనుగు మొదలగువానితో పోరుట మున్నగునవి. మలము మూత్రము అపానవాతము మున్నగు

నవి వెడలనున్నపుడు సిగ్గు మొదలగు కారణములచే వానివెడలనీయక యడ్డగించుట వేగరోధము. శుక్రము, ఓజస్సు శరీరమునందలి స్వభావసిద్ధముగ నుండుస్నేహము జిడ్డు ఇవి క్షీణించుట—క్షయము, అన్నపానాదులను శాస్త్రమున జెప్పినపద్ధతి నతిక్రమించి వ్యత్యస్తముగ సేవించుట విషమాశనము ఈనాల్గును రాజయక్ష్మవ్యాధికి కారణములగును.

ఇచ్చట స్నేహశబ్దముచేత శరీరస్నేహమనియర్థము. "దేహస్నేహపరిక్షయాత్" అనువాక్యముచే నీవిషయమును చరకాచార్యులు నుడివిరి.

## రాజయక్ష్మసంప్రాప్తి.

తైరుదీర్ణోఽనిలః పిత్తం కఫం చోదీర్య సర్వశః,
శరీరసన్ధీనావిశ్య తాన్ సిరాశ్చ ప్రపీడయన్. ౫
ముఖాని స్రోతసాం రుద్ధ్వా తథైవాతివివృత్య చ,
సర్పన్నూర్ధ్వమధస్తిర్యక్ యథాస్వం జనయేద్గదాన్. ౬

పైజెప్పిన నాల్గుకారణములచే పిత్తము మిక్కిలి ప్రకోపమునొంది పిత్తకఫముల రెంటిని స్వస్థానములనుండి చలింపజేసి కఫమును నలుగెడల శరీరమున వ్యాపింపజేసి శరీరమునంగల రెండువందలపదిసంధుల (కీళ్ల)ను లోపల ప్రవేశించి, అట్టిసంధులను శరీరమునందలి సిరల (సన్ననినరముల) ను మథించినవిధముగ బాధించి, తక్కిన స్రోతోరంధ్రముల నన్నిటినిఅడ్డగించి ఒకసమయమున నాస్రోతోరంధ్రములదెరచుచు శరీరమున నూర్ధ్వముగను క్రిందను అడ్డముగను పలువిధములుగ వ్యాపించుచు ఆయారోగముల గల్గించును. (ఇదియె రాజయక్ష్మసంప్రాప్తిక్రమము.)

ఇచ్చట నీసంప్రాప్తియందు వాతము పైజెప్పినరీతిగ వృద్ధిపొంది శరీరమునం దూర్ధ్వముఖముగ వ్యాపించుతరి పీనస మున్నగువ్యాధులను, క్రిందిభాగమున వ్యాపించు నప్పుడు మలబంధము మున్నగువ్యాధులును అడ్డముగ వ్యాపించుచెడ పార్శ్వశూలము మున్నగువ్యాధులును యథాసంభవముగ కల్గునని యెరుంగునది. ఈయభిప్రాయమునే "యథాస్వం జనయేద్గదాన్" అనువాక్యమున మూలకారుడు సూచించెను.

## రాజయక్ష్మపూర్వరూపము.

రూపం భవిష్యతస్తస్య ప్రతిశ్యాయో భృశం క్షవః,
ప్రసేకో ముఖమాధుర్యం సదనం వహ్నిదేహయోః. ౭
స్థాల్యమత్రాన్నపానాదౌ శుచావప్యశుచీక్షణమ్,
మక్షికాతృణకేశాదిపాతః ప్రాయోఽన్నపానయోః. ౮
హృల్లాసశ్ఛర్దిరరుచిః అశ్నతోఽపి బలక్షయః,

పాణ్యోరవేక్షా పాదాస్యశోఫోఽక్ష్ణోరతిశుక్లతా. ౯
బాహ్వోః ప్రమాణజిజ్ఞాసా కాయే బైభత్స్యదర్శనమ్,
స్త్రీమద్యమాంసప్రియతా ఘృణిత్వం మూర్ధగుణ్ఠనమ్. ౧౦
నఖకేశాదివృద్ధిశ్చ స్వప్నే చాభిభవో భవేత్,
పతఙ్గకృకలాసాహికపిశ్వాపదపక్షిభిః. ౧౧
కేశాస్థితుషభస్మాదిరాశౌ సమధిరోహణమ్,
శూన్యానాం గ్రామదేశానాం దర్శనం శుష్యతోఽమ్భసః. ౧౨
జ్యోతిర్గిరీణాం పతతాం జ్వలతాం చ మహీరుహామ్,

రాజయక్ష్మముకల్గుటకుమున్న ఈక్రిందజెప్పబడులక్షణములు కల్గును:—లోలుత పీనస (పడిసెము) బట్టును. తుమ్ము లధికముగ వెడలును. నోట జొల్లువెడలును. నోరు తీపిగనుండును. జఠరాగ్ని పచనశక్తితగ్గి నశించును. శరీరబలము హీనమగును. అన్నపానాదిపదార్థములు పరిశుద్ధములుగనున్నను అపరిశుద్ధములుగనున్నట్లు మనసుకు దోచును. అన్నపానాదులయందు ఈగలును తృణంబులును వెండ్రుకలును మున్నగాగల యపరిశుద్ధపదార్థములు పడియుండునట్లు తోచును. ఓకరింతలు వెడలును. వాంతియగును. అరోచకము కల్గును. తృప్తిగ భుజించుచున్నను బలము నానాట నశించును. తనచేతులను మాటిమాటికి జూచుకొనును. పాదములును ముఖంబును నానాట చిక్కుచుండును. కన్నులు మిక్కిలి తెల్లవడును. తనబాహువు లెంతపొడవుండునని పరిమితిని తెలిసికొన నభిలాషకల్గును. తనశరీరమునం దవయవములన్నియుం చాలశుభ్రములుగనున్నను మనసు కింపుగాకుండును. స్త్రీసంభోగమునందును మద్యమాంసముల సేవించుటకును ఇష్టము కల్గును. మిక్కిలి కరుణకల్గియుండును. తలపైని గుడ్డ మొదలగువానిచే గ్రప్పికొనుచుండును. గోళ్లును వెండ్రుకలును మిక్కిలి వృద్ధినొందును. మిడుతలు, ఊసరవల్లి, పాములు, కోతులు, తోడేళ్లు, పక్షులు మున్నగువానిచే పరిభవమునొందినట్లు స్వప్నము గాంచును. వెండ్రుకలు ఎముకలు పొట్టు బూడిదె మున్నగువాని ప్రోవులపై నెక్కినట్లు స్వప్నముగాంచును. జనములేనిగ్రామములను దేశములను కలలో గాంచును. నీళ్లు ఎండినజలాశయములను పడుచున్ననక్షత్రములను పర్వతములను నిప్పున కాలుచున్నవృక్షములను స్వప్నమున జూచును.

ఇవియన్నియుం రాజయక్ష్మమునకుముందు జనించుపూర్వరూపములు. ఈలక్షణములు కల్గినప్పుడు రాజయక్ష్మము రానున్నదని యూహింపవలెను.

### రాజయక్ష్మమున నేకాదశరూపములు.

పీనసశ్వాసకాసాంసమూర్ధస్వరరుజోఽరుచిః. ౧౩
ఊర్ధ్వం, విడ్భ్రంశసంశోషా వధశ్ఛర్దిశ్చ కోష్ఠగే,
తిర్యక్స్థే పార్శ్వరుగ్దోషే సన్ధిగే భవతి జ్వరః. ౧౪
రూపాణ్యేకాదశైతాని జాయన్తే రాజయక్ష్మిణః,

పీనసము, శ్వాసము, దగ్గు, మూపులయందును శిరస్సునందును నొప్పి, స్వరహీనము, అరుచి, ఇవి రాజయక్ష్మమున వాతము ఊర్ధ్వభాగమున వ్యాపించినపుడు కల్గును. అధోభాగమున వ్యాపించినపుడు ఒకప్పుడు మలము అధికముగ వెడలును, ఒకసమయమున మలము శుష్కించును. కోష్ఠమున దోషము వ్యాపించినపుడు వాంతియగును. అడ్డముగ వ్యాపించినపుడు ఇరుప్రక్కల నొప్పి కల్గును. దోషము సంధిస్థలముల జేరినపుడు జ్వరము కలుగును. ఇత్తెరంగున పీనసము, శ్వాసము, దగ్గు, అంసములయందునొప్పి, తలనొప్పి, స్వరహీనము, అరుచి, మలబంధము, (లేక మలప్రవృత్తి) వాంతి, ఇరుప్రక్కలనొప్పి, జ్వరము, అనుసీపదునొకండును రాజయక్ష్మమున గల్గురూపములు.

ఇచ్చట మలప్రవృత్తి యధికముగనైననగును. ఒకవేళ మలబంధమైన గల్గును. ఇవిరెండును పరస్పరవిరుద్ధములగు కృత్యములు కావున రెంటిలో నొకటి కల్గును. కావున పదునొకండనుసంఖ్యకు విరోధములేదని యెరుంగునది.

### రాజయక్ష్మోపద్రవములు

తేషాముపద్రవాన్ విద్యాత్ కణ్ఠోద్ధ్వంసమురోరుజమ్,
జృమ్భాఙ్గమర్దనిష్ఠీవవహ్నిసాదాస్యపూతితాః ౧౫

పైజెప్పబడిన పదునొకండు రూపములు కల్గినపిదప వానికుపద్రవములుగ నీక్రిందజెప్పబడినవి యేడును కల్గును:—కంఠనుచెడుట, రొమ్మునొప్పి, ఆవలింతలు, ఒడలినొప్పులు, నోట కఫము నుమియుట, జఠరాగ్నినాశము, నోటికంపు.

పైజెప్పినయేడును ఈవ్యాధి సంభవించినపిదప గల్గును. కావున నుపద్రవములు వ్యాధిజనించినపిమ్మటకల్గువ్యాధు లుపద్రవములనాబడును. ఉపద్రవలక్షణముతంత్రాన్తరమున నిట్లు చెప్పబడియె:—"వ్యాధేరుపరి యో వ్యాధిర్భవత్యుత్తరకాలజః, ఉపక్రమవిఘాతీచ స ఉపద్రవ ఉచ్యతే".

### రాజయక్ష్మమున వాతాదులచేగల్గు విశేషలక్షణములు.

తత్ర వాతాచ్ఛిరఃపార్శ్వశూల మంసాఙ్గమర్దనమ్. ౧౬

కణ్ఠోద్ధ్వంసస్స్వరభ్రంశః పిత్తాత్పాదాంసపాణిషు,
దాహోఽతిసారోఽసృక్ఛర్ధిః ముఖగన్ధో జ్వరో మదః. ౧౭
కఫాదరోచకశ్ఛర్ది కాసో మూర్ధాఙ్గగౌరవమ్,
ప్రసేకః పీనసశ్శ్వాసః స్వరసాదోఽల్పవహ్నితా. ౧౮

రాజయక్ష్మము త్రిదోషములును ఏకకాలమున ప్రకోపించుటచే గల్గునని పైని చెప్పబడినది. అందు మూడుదోషములలో వాతము అధికముగ నున్నపుడు శిరస్సునందును పార్శ్వములయందును శూలముచె గ్రుమ్మినట్లు పోటు పుట్టును. భుజశిరంబులయందును తక్కిన అవయవములయందును నలియగ్రుమ్మినట్లు నొప్పిపుట్టును. కంఠము ధ్వంసమగును. కంఠస్వరము మారును. (ఇవియన్నియు వాతాధికమున గల్గును.)

పిత్తం బధికముగనుండునెడ అరకాలులయందును అరచేతులయందును అంసములయందును మంటబుట్టును. అతిసారము కల్గును. రక్తము వాంతియగును. నోట దుర్గంధము కల్గును. జ్వరము వ్యాపించును. తిక్కయె త్తినట్లుండును. (ఇవి పిత్తాధికమున గల్గును)

కఫం బధికముగనుండుతరి అరోచకంబును, వాంతియు, కాసంబును కల్గును. తలయు ఒడలును బరువుగ నుండును. నోట నీళ్లూరును. పడిసెముపట్టును. శ్వాస మధికమగును. కంఠస్వరము నశించును. జఠరాగ్ని మందగించును (ఇవి కఫాధికమున గల్గులక్షణములు)

ఆహారరసముచే ధాతువులు పుష్టినొందని కారణము.

దోషైర్మన్దానలత్వేన సోపలేపైః కఫోల్బణైః,
స్రోతోముఖేషు రుద్ధేషు ధాతూష్మస్వల్పకేషు చ. ౧౯
విదహ్యమానస్స్వస్థానే రసస్తాంస్తానుపద్రవాన్,
కుర్యాదగచ్ఛన్మాంసాదీన్ అసృక్ఛర్ద్యం ప్రధావతి. ౨౦
పచ్యతే కోష్ఠ ఏవాన్నం అన్నపక్త్రైవ చాస్య యత్,
ప్రాయోఽస్మాన్మలతాం యాతం నైవాలం ధాతుపుష్టయే. ౨౧

క్షయవ్యాధియందు ముఖ్యముగ కాయాగ్ని మందగించును. వాతాదిదోషములు కఫము మిక్కిలి యుక్కటముగ నుండును. కావున కఫముయొక్క లేపములతో దోషములు కలిసియుండును. దానంజేసి అట్టి కఫలేపములతో గూడినదోషములచేత స్రోతోరంధ్రములు అడ్డగింపబడియుండును. జాఠరానలము మందముగ నుండుటంజేసి రసాదిధాతువులకును ఊష్మము మిక్కిలి తక్కువగ నుండును. స్రోతోద్వారము లడ్డగింప

బడుటంజేసి శరీరమున ధారాళముగ వ్యాపింప వలనుపడక రసధాతువు స్వస్థానముననే నిలిచి మందాగ్నిచే స్వల్పమైనయూష్మముచే (పాచకపిత్తముచే) స్వల్పముగ పాకము నొందియుండి అరుచ్యాద్యుపద్రవములమాత్రము గల్గించునుగాని శరీరమున వ్యాపించి మాంసము మేదస్సు మున్నగు తక్కిన ధాతువుల పోషింప సమర్థము కాకుండును. స్వస్థానముననే మధ్యమపాకము నొందినరసము స్వల్పముగ రక్తమై అదియు నూర్ధ్వముగ వెడలి కఫముతో నేకీభవించి నోటినుండి వెడలును. ఇత్తెరంగున శరీరమున ప్రధానమైన రసధాతువు పైజెప్పినకారణములచే చక్కగ పాకమునొందక మాంసాది ధాతువులం జేరి పోషింపనేరక బలహీనమై కొంచెముగ రక్తమైనను అయ్యదియు ధాతువుల పోషింపక యూర్ధ్వమార్గమున వెడలుటంజేసి మనుజునకు మాంసాదులు పుష్టినొందక నానాట క్షీణములగును

మరియు భుజింపబడినయాహారము కోష్ఠమునందే (ఆమాశయపక్వాశయముల యందే) నిలచి స్వల్పమైనకాయాగ్నిచేతనే కొంచెముగ పక్వమగునుగాని తక్కినధాతువులతో సంబంధించి దానికి పోషించుసామర్థ్యము లేకుండును. అట్లుండి కోష్ఠమునందే మలరూపముగ పరిణమించును. పైజెప్పినహేతువులచే శరీరమున నాహారరసము వ్యాపింపక కోష్ఠముననే మూత్రపురీషరూపముగ పరిణమించును. ఈకారణముచేతను శరరీమున ధాతువులు పుష్టిలేక నానాట క్షీణించును.

ఇచ్చట నీవిషయమును గమనించునది:—భుజింపబడినయాహారరసము ధాతువులయగ్నిచే పక్వమై శరీరమున రక్తాదిధాతువుల వరుసగ వ్యాపించి పుష్టిని కల్గింపవలెను. ప్రకృతమున కాయాగ్నియు ధాత్వగ్నులును హీనబలములై స్రోతోరంధ్రములు కఫయుక్తదోషములచే నడ్డగింపబడుటంజేసి ధాతువులు వ్యాపింప దెరువుగానక కోష్ఠమునందె యణగి మూత్రపురీషరూపముగుటంజేసి ధాతువులకు పుష్టి కలుగబోదు. అయినను క్రొత్తకుండలో నీరునించినయెడ అతిసూక్ష్మముగ చెమర్చుభంగి యాహారరసము ధాతువుల వ్యాపింపపోషింప కున్నను సూక్ష్మముగనైన ధాతువుల నాప్యాయత నొందించును. అటుగానిచో నొక్కపెట్ట ధాతువులన్నియు నిశ్శేషముగ నశించి మనుజుడొక్కనిముసమైన జీవింపనోపడు. ఈక్షయమున నానాట రక్తాదిధాతువులు క్షీణించుచు చాలకాలమువరకు యాప్యావస్థనొందియుండుటంజేసి రోగి చాలకాలము జీవమును ధరింపనోపును.

రసోఽప్యస్య న రక్తాయ మాంసాయ కుత ఏవ తు,

ధాతురూపమైనరసంబైనను అన్నరసంబైనను పైజెప్పినకారణములచే తనకు

చేరువనుండురక్తమునుగూడ పోషింపనేరదు. ఇక వ్యవహితమైనమాంసాదుల నెట్లు పోషింప సమర్థమగును? ఒకప్పుడును ఇది సంభవింపదు.

ఉపస్తబ్ధస్స శకృతా కేవలం వర్తతే క్షయీ. ౨౨

పైజెప్పినరితిగ రక్తాదిధాతువులు పుష్టినొందకయున్నను, కేవలము పురీష మాత్రమును ఆధారముగజేసికొని క్షయరోగము కలమనుజుడు జీవించి శరీరమును కష్టముచే ధరించియుండనోపును.

ఇచ్చట నీవిషయము నెఱుంగునది:—"అసృక్కోర్ధ్వం ప్రధావతి" అని పైజెప్పిన వాక్యముచే రక్తముపైమార్గమునుండి వెడలునని చెప్పబడియె. ఇంకొకవాక్యమున "రసోఽప్యస్యనరక్తాయ" అని చెప్పుటచేత క్షయరోగికి రక్తములేదని స్ఫుటమగుచున్నది. రక్తమే లేనినాడు అది యూర్ధ్వముగ బోవుటెట్లు? అని యాశంకకల్గును. గాని అది సమంజసము కానోపదు:—పైమార్గమున వెడలునది ధాతురూపమైన రక్తముకాదు. రసము వెడలు తెరువులేక స్వస్థానముననే స్వల్పమైన ధాత్వగ్నిచే పాకమునొంది యచ్చటనే రక్తముబోలె నున్నరసము పైమార్గమున వెడలునని భావము. కావున పైవాక్యములకు పరస్పరవిరోధములేదని యెరుంగనది.

### క్షయసాధ్యాఽసాధ్యనిర్ణయము.

లిఙ్గేష్వల్పేష్వపి క్షీణం వ్యాధ్యౌషధబలాక్షమమ్,
వర్జయేత్ సాధయేదేవ సర్వేష్వపి తతోఽన్యథా. ౨౩

క్షయవ్యాధిపీడితుడు క్షయమునకు జెప్పినలక్షణములన్నియులేక వానితో (పీనసాదులతో) కొన్నిమాత్రమే కల్గియున్నను ఆవ్యాధిబలమునకును ఔషధముల బలమునకు తాళజాలక రోగికష్టపడుచు నానాట క్షీణించుచున్నచో నారోగికి చికిత్స జేయజనదు. అటుగాక యీవ్యాధికి జెప్పిన పీనసాదులన్నియు కల్గియున్నను బల మాంసములు నశింపకుండి రోగి వ్యాధిబలమును ఔషధములబలమును ఓరువగల్గియున్నచో నారోగికి చికిత్సజేయునది.

### స్వరభేదనిదానము; దానిసంఖ్య.

దోషైర్వ్యస్తైస్సమస్తైశ్చ క్షయాత్ షష్ఠశ్చ మేదసా,
స్వరభేదో భవేత్

వాతపిత్తకఫములచే వేరువేరుగను, అన్నిటిసన్నిపాతముచేతను ధాతుక్షయము చేతను మేదస్సు వృద్ధియగుటచేతను జనించుటంజేసి స్వరభేదము ఆరువిధములగును.

## వాతికస్వరభేదము.

తత్ర క్షామో రూక్షశ్చలస్స్వరః. ౨౪
శూకపూర్ణాభకణ్ఠత్వం స్నిగ్ధోష్ణోపశయోఽనిలాత్,

వాతప్రకోపమునఁగల్గిన స్వరభేదమునందు కంఠస్వరము క్షీణమై రూక్షముగ(దారుణముగ) నుండును. కుత్తుకలో ముండ్లు నిండియున్నట్లుండును. కంఠస్వరము వణకుతో వెడలును. స్నిగ్ధంబులు ఉష్ణంబులునగు ఔషధాదులచేత శమించును.

ఇచ్చట స్నిగ్ధాద్యుపచారములు వాతికస్వరభేదమున కుపశయమని యెరుంగునది.

## పైత్తికస్వరభేదలక్షణము.

పిత్తాత్తాలుగలే దాహః శోష ఉక్తావసూయనం. ౨౫

పిత్తముచే గల్గినస్వరభేదమునందు తాలువులయందును కుత్తుకయందు ద్రవము లేక యెండి మంటపుట్టును. మాటలాడ శక్తిలేక నిర్బంధముగ మాటలాడవలసినప్పుడు అసూయ కల్గును.

## శ్లైష్మికాదిస్వరభేదలక్షణములు.

లిమ్పన్నివ కఫాత్కణ్ఠం మన్దం ఖురఖురాయతే,
స్వరో విబద్ధః సర్వైస్తు సర్వలిఙ్గః క్షయాత్కషేత్. ౨౬
ధూమాయతీవ చాత్యర్థం మేదసా శ్లేష్మలక్షణః,
కృచ్ఛ్రిలక్ష్యాక్షరశ్చాత్ర సర్వైరన్త్యం చ వర్జయేత్. ౨౭

కఫముచే గల్గినస్వరభేదమున కుత్తుకలో కఫము చిక్కియుండుటవలన పూయబడినట్లుండును. దానంజేసి గొంతులో కరకరలాడుచు అప్పుడప్పుడు నిలిచినిలిచి మాటలాడును.

మూఁడుదోషముల సన్నిపాతమునఁగల్గిన స్వరభేదమునందు మూఁడుదోషములకును వేరువేరుగ జెప్పినలక్షణములన్నియు కల్గి మిక్కిలి కష్టముతో మాటలాడును.

ధాతుక్షయముచే గల్గినస్వరభేదమునందు కంఠస్వరము కంఠమర్మమును ఘట్టనచేయుచు వెడలును. కావున కంఠమున నొరియుచు మాటవెడలును. నాసాదిరంధ్రముల నుండి పొగవెడలునట్లుండును.

మేదోవృద్ధిచే గల్గినస్వరభేదమున కఫజస్వరభేదమునకు జెప్పినలక్షణములుఁ కల్గి మాటలాడునప్పుడు అక్షరములు ఇయ్యవి యని గమనింప సాధ్యముగాక అవ్యక్తములుగ నుండును.

పైజెప్పబడిన స్వరభేదము లారిటిలో సన్నిపాతమునగల్గిన స్వరభేదంబును, మేదస్సుచేగల్గిన స్వరభేదంబును అసాధ్యములు. తక్కినస్వరభేదములు (వాత-పిత్త-కఫ-క్షయజములు) నాల్గును సాధింపదగియుండును.

### ఆరోచకనిదానము, దానిభేదములు.

అరోచకో భవేద్దోషైః జిహ్వాహృదయసంశ్రయైః,
సన్నిపాతేన మనసః సంతాపేన చ పఞ్చమః ౨౮

వాతపిత్తకఫములు స్వకారణములచే ప్రకోపమునొంది హృదయమునందును నాలుకయందును జేరి అరోచకమును గల్గించును. ఇయ్యది వాత-పిత్త-కఫములచే వేరు వేరుగను అన్నింటి సన్నిపాతముచేతను, భయశోకాదులచే మనస్సునకు కల్గినసంతాపము చేతను కల్గును. కావున నైదువిధముల నుండును.

ఇచ్చట శోకాదికారణములచే గల్గినమనస్సంతాపమున జనించినది యాగంతుకము. అయ్యది క్రోధము శోకము మున్నగు ననేకకారణములచే గల్గినను ఆగంతుకమను భేద మొక్కటియే యగును. కావున నరోచకములు పంచవిధములే యగునని నియమ మును దెల్పుటకై "పంచమః" అని ప్రత్యేకముగ జెప్పబడినది. ఈయాగంతుకమున గూడ వాతాదిదోషములు హృదయమునందును కంఠమునందును జేరి యరోచకమును గల్గించునని యెఱుంగునది.

### వాతాద్యరోచకముల ప్రత్యేకలక్షణములు.

కషాయతిక్తమధురం వాతాదిషు ముఖం క్రమాత్,
సర్వోత్థే విరసం శోకక్రోధాదిషు యథామలమ్ ౨౯

పైజెప్పినయరోచకములయందు వాతమున బుట్టినయరోచకమునందు నోరు కషాయరసము (వగరు) కల్గియుండును. పిత్తారోచకమున నోరు తిక్త (చేదు) రసము కల్గియుండును. వాతారోచకమున మధుర (తీపి) రసము కల్గియుండును. సన్నిపాత మునగల్గిన ఆరోచకమున పైజెప్పినమూడురసములును సంకరముగ నుండుటంజేసి ఇయ్యది యని యేర్పడక రసహీనమై యుండును. శోకము, క్రోధము మున్నగు నాగంతుకారణములచే గల్గినయరోచకమున వాతాదులుకూడ సంక్రమించియుండును కావున ఆయాదోషములకు జెప్పినరసములు కల్గియుండును.

శోకము, భయము, కామము, ఈర్ష్య, అను కారణములచే మనస్సునకు సంతాపముకల్గినప్పుడు వాతము ప్రకోపించి యరోచకమును బుట్టించును కావున నీయరోచకమున నోరు కషాయరసము కల్గియుండును. క్రోధముచే మనస్సునకు సంతాపముకల్గుటచే గల్గిన యరోచకమున పిత్తము ప్రకోపించియుండును కావున చేదుకల్గియుండును.

గ్రహములు మున్నగువానిసంబంధముచే గల్గినయరోచకమున దోషములు మూడును ప్రకోపించును. కావున నీయరోచకమున నోరు విరసముగ నుండును. ఈయభిప్రాయమునే "యథామలమ్" అని చెప్పబడెను.

## ఛర్దినిదానము, వానిభేదములు.

ఛర్దిర్దోషైః పృథక్సర్వైః ద్విష్టైరర్థైశ్చ పఞ్చమీ,
ఉదానో వికృతో దోషాన్ సర్వాసప్యూర్ధ్వముస్యతి. 30
తాసూత్క్లేశాస్యలావణ్యప్రసేకారుచయోఽగ్రగాః,

ఛర్ది యనగా వాంతి. ఇయ్యది వాతపిత్తకఫములచే వేరువేరుగను అన్నిటిసన్నిపాతమునను మనకు ఇంపుగాని శబ్దస్పర్శరూపరసగంధములసంబంధముచేతను కల్గుటంజేసి యైదువిధములుగ నుండును. పైజెప్పినఛర్దులైదిటియందును ఉదానవాతము దుష్టమై తక్కినదోషములను పైకి ప్రేరేపించును. ఈవ్యాధియందు ఉత్క్లేశము (ఆశయమున నుండుదోషము వమనమున కభిముఖముగుట). నోరు ఉప్పగనుండుట, నోట నీరు వెడలుట, అరోచకము అనునివి వాంతియగుటకు మున్ను సంభవించు పూర్వరూపములు.

## వాతికచ్ఛర్దిసంప్రాప్తి, లక్షణము.

నాభిపృష్ఠం రుజన్ వాయుః పార్శ్వే చాహారముత్క్షిపేత్. 31
తతో విచ్ఛిన్నమల్పాల్పం కషాయం ఫేనిలం వమేత్,
శబ్దోద్గారయుతం కృష్ణమచ్ఛం కృచ్ఛ్రేణ వేగవత్. 32
కాసాస్యశోషహృన్మూర్ధస్వరపీడాక్లమాన్వితః,

వాతము ప్రకోపించి నాభిస్థానమునను వీపునను ప్రక్కలను నొప్పికల్గించుచు ముందు భుజింపబడిన యాహారపదార్థములను పైకి వెడలించును. పిదప కషాయరసముకల్గి నురుగుతోఁగూడి శబ్దముతోడను త్రేపులతోడనుగూడి నల్లనిరంగుకల్గి స్వచ్ఛమైన ద్రవముతోఁగూడిన యాహారపదార్థము వాంతిజేయును. అయ్యది అప్పుడప్పుడును నిలచి కొంచెముకొంచెముగ మిక్కిలివేగముతోఁగూడి కష్టముతో వెడలును. దానంజేసి దగ్గుకల్గును. నోరెండును, హృదయమునందును శిరస్సునను నొప్పికల్గును. కంఠస్వరముచే బాధకల్గును. బడలిక పుట్టును.

## పైత్తికచ్ఛర్దిలక్షణము.

పిత్తాత్ క్షారోదకనిభం ధూమ్రం హరితపీతకమ్. 33
సాసృగల్పం కటూష్ణం చ తృణ్మూర్ఛాతాపదాహవత్,

పిత్తప్రకోపమున గలిగినఛర్దియందు క్షారోదకమునకు సమానమై ధూమ్రవర్ణం బును పచ్చనిరంగైనను పసుపురంగైనను కలిగినపసరు వాంతియగును. అయ్యది రక్తము తోఁగూడి మిక్కిలి స్వల్పంబును కటురసంబును ఉష్ణంబునై వెడలును. ఈవమనముచేత దప్పి యధికమగును. మూర్ఛ గ్రమ్మును. తాపము బుట్టును. మంట కల్గును. ఇయ్యది పైత్తికచ్ఛర్ది.

## కఫజచ్ఛర్దిలక్షణము.

కఫాత్ స్నిగ్ధం ఘనం శీతం శ్లేష్మతంతుగవాక్షితమ్. 38
మధురం లవణం భూరి ప్రసక్తం లోమహర్షణమ్,
ముఖశ్వయథుమాధుర్యతన్ద్రాహృల్లాసకాసవత్. 39

కఫముచే గలిగినచ్ఛర్దియందు స్నిగ్ధంబును ఘనీభవించినదియుం జల్లనైనదియు కఫముయొక్క తీగెలతో నిండినదియునగు రసము వాంతియగును.మరియు నది తీపియు ఉప్పనయుం గల్గి మిక్కిలి యధికముగ నక్కడక్కడ నిలిచి వెడలును. అప్పుడు రోమాంచము కల్గును. దానివలన గొంతులో వాపుకల్గి తీపిగనుండును. కునికిపాటు కల్గును. రొమ్మున పెకలించిన ట్లుండును. దగ్గువచ్చును.

## సాన్నిపాతికచ్ఛర్దిలక్షణము.

సర్వలింగా మలైస్సర్వైః రిష్టోక్తా యా చ తాం త్యజేత్,

సన్నిపాతమున గలిగినఛర్ది వాతాదులకు వేరువేర జెప్పబడిన లక్షణములన్నియుం గల్గియుండును. మరియు వికృతివిజ్ఞానీయాధ్యాయమున "ఛర్దిర్వేగవతీ-శ్యమషంగిణీ" అని నిర్దేశింపబడినఛర్దియు సన్నిపాతమునఁగల్గినది. ఈసన్నిపాతమున గల్గినది యసాధ్యము కావున చికిత్స జేయుంజనదు.

వికృతివిజ్ఞానీయాధ్యాయమున మిక్కిలి వేగముతోఁగూడి మూత్రపురీషములవంటి దుర్గంధముకల్గియుం, తైలబిందువులను నీళ్లలో నుంచునప్పుడుకల్గు తళతళవంటి తళుక్కు కల్గియు, రక్తము మలము చీము వీనితోఁగూడియుం, నొప్పి కాసము శ్వాసము అను నుపద్రవములు కల్గియుం వెడలి చిరకాలమువరకును వ్యాపించియుండుఛర్ది యరిష్టలక్షణ ములు కల్గినదని చెప్పబడినది. అదియు సన్నిపాతమునగల్గినది, కావున నదియు ఇచ్చట చెప్పబడినసన్నిపాతచ్ఛర్దియుం నసాధ్యమని భావము.

## ఆగంతుకచ్ఛర్దిలక్షణము.

పూత్యమేధ్యాశుచిద్విష్టదర్శనశ్రవణాదిభిః. 36
తప్తే చిత్తే హృది క్లిష్టే ఛర్దిర్ద్విష్టార్థయోగజా.

దుర్గంధముగల పదార్థములనైనను, మనసుకు ఇంపుగాని పదార్థములనైనను, అపరిశుద్ధములగు పదార్థములనైనను, తనమనస్సుకు ద్వేషముగలపదార్థములనైన చూచినను, దానిగుణాదుల విన్నను, శరీరావయవములతో తాకినను, దానిగంధాదుల మూర్కొనినను మనస్సున వికృతిజెంది హృదయము క్లిష్టమైన దానగల్గువాంతి ద్విష్టార్థయోగజము. ఇదియే ఆగంతుకచ్ఛర్ది.

క్రిమిజాదిచ్ఛర్దివిశేషములు.

వాతాదీనేవ విమృశేత్ కృమితృష్ణామదౌహృదే. 38
శూలవేపథుహృల్లాసైః విశేషాత్ కృమిజాం వదేత్,
కృమిహృద్రోగలిఙ్గైశ్చ

క్రిములచేతను, దప్పిచేతను, అజీర్ణముచేతను, దౌహృదము (గర్భవతిగనున్న పుడు స్త్రీలకు గల్గువేవిళ్లు) చేతను ఛర్దిరోగము సంభవించును. ఈచ్ఛర్దులయందును వాతాదిప్రకోపము నొందును కావున ఆట్టిచ్ఛర్దులయందు వాతాదిలక్షణములచే నిర్ణయించునది. మరియు కృమిజవమనమునందు శూలము, వణకు, హృల్లాసము (ఓకరింతలు) విశేషముగ నుండును. మరియు కృమిరోగమున జెప్పినలక్షణంబులును, హృద్రోగమున జెప్పినలక్షణంబులును కల్గియుండును.

హృద్రోగనిదానము.

స్మృతాః పఞ్చ తు హృద్గదాః. 39
తేషాం గుల్మనిదానోక్తైః సముత్థానైశ్చ సంభవః,

హృద్రోగము వాతపిత్తకఫములచే వెరువేరుగను సన్నిపాతముచేతను క్రిముల చేతను గల్గుటంజేసి యైదువిధములు. అయ్యది గుల్మనిదానమున జెప్పబడినకారణములచే సంభవించును. (కావున గుల్మనిదానమున జూచునది)

వాతికహృద్రోగలక్షణము.

వాతేన శూల్యతేఽత్యర్థం తుద్యతే స్ఫుటతీవ చ 39
భిద్యతే శుష్యతి స్తబ్ధం హృదయం శూన్యతా ద్రవః,
అకస్మాద్దీనతా శోకో భయం శబ్దాసహిష్ణుతా. 40
వేపథు ర్వేష్టనం మోహః శ్వాసరోధోఽల్పనిద్రతా,

హృద్రోగము సామాన్యముగ హృదయమున శూలమున గ్రుమ్మినట్లునొప్పిపుట్టును; వాతమున బుట్టినహృద్రోగమునం దట్టిశూలనొప్పి మిక్కిలి అధికముగ నుండును. దబ్బన ములఁ గ్రుచ్చినట్లు ఉండియుండి పోటుకల్గును. పగులునట్లు నొప్పికల్గును, బద్దలుగ చీలు

నట్లు నొప్పిపుట్టును. హృదయము శోషించి స్తంభించియుండును. ఏమియు నెరుగజాలక శూన్యముగ నుండును. ద్రవము కల్గియుండును. కారణములేకయే దీనముగ నుండును. వాపుకల్గును. భయము విశేషముగ నుండును. శబ్దము వినుటకు సహింపకుండును. వణకు పుట్టును. కొంకరలుపోవును. మూర్ఛగ్రమ్మును. శ్వాసము ఇటునటు వెడలక హృదయమున స్తంభించును, నిదుర పూర్తిగ బట్టదు. ఈలక్షణములన్నియు వాతజహృద్రోగమున గల్గును.

## పైత్తికహృద్రోగలక్షణము.

పిత్తాత్తృష్ణా భ్రమో మూర్ఛా దాహస్స్వేదోఽమ్లకః క్లమః. ౪౧
ఛర్దనం చామ్లపిత్తస్య ధూమకః పీతతా జ్వరః,

పిత్తమునగల్గిన హృద్రోగమున దప్పి భ్రమము మూర్ఛ తాపము చెమట ఇవి కల్గును. పులితేన్పులు వెడలును. బడలిక కల్గును. పులిసినపిత్తపసరు వాంతి యగును. నాసాదిరంధ్రములనుండి పొగ వెడలునట్లుండును. ఒడలు పచ్చనగును. జ్వరముపచ్చును.

## శ్లైష్మికసాన్నిపాతికహృద్రోగలక్షణములు.

శ్లేష్మణా హృదయం స్తబ్ధం భారికం సాశ్మగర్భవత్. ౪౨
కాసాగ్నిసాదనిష్ఠీవనిద్రాలస్యారుచిజ్వరాః.
సర్వలిఙ్గస్త్రిభిర్దోషైః

కఫప్రకోపమున గల్గినహృద్రోగమున హృదయము స్తంభించియుండును. లోపల రాయిబెట్టినవిధముగ మిక్కిలి బరువై యుండును. ఈరోగమున దగ్గుకల్గును. జఠరాగ్ని మందగించును. నోట నీటి నుమియుచుండును. నిదురవిశేషముగబట్టును. పనులజేయుటయం దుత్సాహము తగ్గును. అరోచకంబును జ్వరంబును సంభవించును. మఱియు పైని వాతపిత్తకఫములకు ప్రత్యేకముగ జెప్పబడినలక్షణములన్నియు కల్గినచో సన్నిపాతమున గల్గినహృద్రోగమని యెరుంగునది.

## కృమిజహృద్రోగలక్షణములు.

కృమిభిశ్శ్యావనేత్రతా. ౪౩
తమఃప్రవేశో హృల్లాసః శోషః కణ్డూః కఫస్రుతిః,
హృదయం ప్రతతం చాత్ర క్రకచేనేవ దార్యతే. ౪౪
చికిత్సేదామయం ఘోరం తం శీఘ్రం శీఘ్రకారిణమ్,

క్రిములచే గల్గినహృద్రోగమున కన్నులు శ్యామవర్ణములుగ నుండును. చీకటిలో నున్నట్లు ఏమియు నెరుంగనేరకుండును. ఓకిరింతలు వెడలును. శోషించి హృదయమున

జిలపుట్టును. కఫము నోట స్రవించును. హృదయము రంపముచే కోసినట్లు ఎల్లపుడును బాధకల్గును. ఈవ్యాధియందు క్రిములు వృద్ధినొంది ప్రాణాధారమైనహృదయచర్మమును తినును. కావున నివ్యాధి మిక్కిలి క్రూరమై శీఘ్రముగ ప్రాణముల హరింపఁజూచును కావున క్రూరమైన యీవ్యాధికి శీఘ్రముగ తగినచికిత్సజేయవలెను.

తృష్ణారోగము - దాని భేదములు.

వాతాత్పిత్తాత్కఫాత్ తృష్ణాసన్నిపాతాద్రసక్షయాత్. ౪౫
షష్ఠీ స్యాదుపసర్గాచ్చ వాతపిత్తేతు కారణమ్,
సర్వాసు తత్ప్రకోపోవా సౌమ్యధాతుప్రశోషణాత్. ౪౬
సర్వదేహభ్రమోత్కమ్పతాపతృట్ దాహమోహకృత్,

తృష్ణ యనగ దప్పి, అయ్యది వాతపిత్తకఫముల మూడిటిచే వేరువేరుగను, అన్నిటిసన్నిపాతముచేతను రసధాతుక్షయముచేతను ఇతరరోగమున కనుబంధముగను కల్గును. కావున ఆరువిధంగు లగును. పైజెప్పినయారిటిలోను వాతపిత్తములు రెండును ప్రధానకారణములుగ నుండును.

ఏలయన: తృష్ణాసామాన్యమున శరీరమునందలి రసము మున్నగుసౌమ్యధాతువులు శోషించి నీరసములై దప్పికల్గును. దానివలన నోడలెల్ల దిరుగునట్లుండి వడకును, తాపము దప్పిదాహము (మంట) మూర్ఛయును కల్గును. ఇట్లుండ శరీరమునందలి సౌమధాతులు వాతపిత్తప్రకోపమునగాని శోషింపవు. కావున తృష్ణారోగసామాన్యమున వాతపిత్తములు రెండును ప్రధానములుగ ప్రకోపించియే యుండును. ఈవిషయము తంత్రాంతరమున తృష్ణాసంప్రాప్తియం దిట్లు చెప్పిరి:—

"పిత్తం సవాతం కుపితం నరాణాం తాలుప్రపన్నం జనయేత్పిపాసామ్,
స్రోతస్స్వపాంవాహిషు దూషితేషు దోషైశ్చ తృట్సమ్భవతీ హ జన్తోః."

తృష్ణాసంప్రాప్తిసామాన్యలక్షణము.

జిహ్వామూలగలక్లోమతాలుతోయవహాస్సిరాః. ౪౭
సంశోష్య తృష్ణా జాయన్తే; తాసాం సామాన్యలక్షణమ్,
ముఖశోషో జలాతృప్తిః అన్నద్వేషః స్వరక్షయః. ౪౮
కణ్ఠౌష్ఠజిహ్వాకార్కశ్యం జిహ్వానిష్క్రమణం క్లమః,
ప్రలాపశ్చిత్తవిభ్రంశః తృడ్గ్రహోక్తాః తథామయాః. ౪౯

జిహ్వామూలమునందును కంఠమునందును క్లోమమునందును తాలువులయందును వ్యాపించియుండు జలవహంబులగునాడులను శోషింపజేసి (ద్రవములేక యెండించుచు)

దప్పికల్గును. అయ్యది తృష్ణారోగమని చెప్పబడును. ఈతృష్ణారోగమున సామాన్యముగ నీక్రిందజెప్పబడు లక్షణములు కల్గును:—నోరు ద్రవములేక యెండును. మాటిమాటికిని నీళ్లుత్రాగుచున్నను తృప్తికలుగదు. అన్నముపై ద్వేషముపుట్టును. కంఠస్వరము నశించును. కంఠమునందును పెదవులయందును నాలుకయందును కఱకు పుట్టును. నాలుక బైటరాక లోనికి లాగికొని పోవును. బడలికపుట్టును. అసంబద్ధముగ మాటలాడును. చిత్తభ్రమము కల్గును. ఇదికాక తృష్ణానిరోధమున గల్గువ్యాధులును కల్గును. (శోషము, అంగసాదము, బధిరత్వము మున్నగురోగములు తృష్ణానిరోధముచే గల్గునని రోగానుత్పాదనీయాధ్యాయమున జెప్పబడినవి. అవికూడ నీతృష్ణారోగమున సంభవించునని భావము).

### వాతజతృష్ణాలక్షణము.

మారుతాత్ క్షామతా దైన్యం శంఖతోదశ్శిరోభ్రమః,
గన్ధాఽజ్ఞానాస్యవైరస్యశ్రుతినిద్రాబలక్షయాః. ౫౦
శీతామ్బుపానాద్వృద్ధిశ్చ

వాతము కల్గిన తృష్ణావ్యాధియందు శరీరము కృశించును, మిక్కిలి దీనత్వము కల్గును, కణతలయందు పోటుపుట్టును, తలతిరుగుచుండును. వివిధమైనవాసనయు ఘ్రాణేన్ద్రియమునకు తెలియదు. నోరు రసహీనమగును. చెవులు వినబడవు. నిద్రయు శరీరబలంబును నశించును. చల్లనినీళ్లను త్రాగినచో దప్పి మిక్కిలి వృద్ధినొందును.

### పిత్తజతృష్ణాలక్షణము.

పిత్తాన్మూర్ఛాస్యతిక్తతా,
రక్తేక్షణత్వం ప్రతతం శోషో దాహోఽతిధూమకః. ౫౧

పిత్తమునకల్గిన తృష్ణారోగమున మూర్ఛగ్రమ్మును. నోరు చేదుగనుండును. కన్నులెఱ్ఱనగును. శరీరము మిక్కిలి శుష్కించును (నోరెండును) శరీరముపై మంటపుట్టును. నాసాదిరంధ్రములనుండి పొగ వెడలునట్లుండును.

### కఫజతృష్ణాలక్షణము.

కఫో రుణద్ధి కుపితః తోయవాహిషు మారుతమ్,
స్రోతస్సు సకఫస్తేన పఙ్కవచ్ఛోష్యతే తతః ౫౨
శూకైరివాచితః కంఠః నిద్రామధురవక్త్రతా,
ఆధ్మానం శిరసో జాడ్యం స్తైమిత్యచ్ఛర్ద్యరోచకాః. ౫౩
ఆలస్యమవిపాకశ్చ సర్వైస్స్యాత్సర్వలక్షణా,

కఫము స్వకారణములచే ప్రకోపమునొంది శరీరమునందలి జలమును వహించు నాడులలోఁజేరి వాతమును అడ్డగించును. ఆకఫము వాతముచే (గాలితగులుటచేత ఖరుద యెండువిధముగ) నానాట నొందును. దానంజేసి యాశుష్కించినకఫము కంఠమున జేరియుండుటంజేసి గొంతున ముండ్లుగ్రుచ్చినవిధముగ నుండును. అంత దప్పికల్గి నిదుర విశేషముగ బట్టును. నోరు తీపికల్గియుండును. కడు పుబ్బరించును. తల బరువుగనుండును. ఒడలెల్ల జడముగనుండును. వాంతియగును. అరోచకము కల్గును. పనులయం దుత్సాహముచెడును. జీర్ణము కానోపదు. ఈలక్షణములన్నియు కఫమునఁగల్గిన తృష్ణారోగమున సంభవించును.

సన్నిపాతమునఁగల్గిన తృష్ణారోగమున వాతాదులచే వేరువేర పైఁజెప్పఁబడిన లక్షణములన్నియు సంభవించును.

### ఆమజతృష్ణాలక్షణము.

ఆమోద్భవా చ భక్తస్య సంరోధాద్వాతపిత్తజా. ౫౪

అజీర్ణమునసంభవించినదప్పి జీర్ణముకానియన్నము జలవహములగునాడుల నడ్డగించుటచే గల్గును. ఇదియును వాతపిత్తములచే గల్గును.

### శీతోపచారమునఁగల్గుపైత్తికతృష్ణ.

ఉష్ణక్లాన్తస్య సహసా శీతామ్భో భజత స్తృషమ్,
ఊష్మారుద్ధో గతఃకోష్ఠం యాం కుర్యాత్పిత్తజైవసా. ౫౫
యా చ పానాతిపానోత్థా తీక్ష్ణాగ్నే స్స్నేహజా చ సా,

ఉష్ణముచే మిక్కిలి బడలికజెందినమనుజుడు శీఘ్రముగ చల్లనినీళ్లను సేవించినచో (స్నానపానాదులరూపముగ నుపయోగించినచో) శరీరముపై యూష్మము అడ్డగింపబడి కోష్ఠమునఁజేరి దప్పిని కల్గించును. ఇయ్యదియు పిత్తమున జనించినతృష్ణయగును. మరియు మద్యము నధికముగ పానముజేసినను దప్పికల్గును. మిక్కిలి తీక్ష్ణమైనయగ్నికలమనుజునకు శరీరమునందలి స్నేహాధిక్యమున తృష్ణకల్గును. ఈరెండును పిత్తప్రకోపముననే కల్గును.

### ఆహారభేదమునఁ గల్గుతృష్ణాలక్షణము.

స్నిగ్ధగుర్వమ్లలవణభోజనేన కఫోద్భవా. ౫౬

స్నిగ్ధంబును, అజీర్ణకంబును, అమ్లరసంబును, లవణరసంబును నగుపదార్థముల భుజించుటచే గల్గినదప్పి కఫప్రకోపమునఁగల్గునని యెఱుంగునది.

### క్షయజతృష్ణాలక్షణము.

**తృష్ణారసక్షయోక్తేనలక్షణేనక్షయాత్మికా,**

రసధాతువు శోషించుటచే దప్పికల్గును. ఇయ్యది క్షయమునగల్గినతృష్ణ. ఈతృష్ణ యందు రసక్షయమున జెప్పినరౌక్ష్యము భ్రమము మున్నగులక్షణములు కల్గియుండును.

### ఉపసర్గజతృష్ణాలక్షణము.

**శోషమోహజ్వరాద్యన్యదీర్ఘరోగోపసర్గతః,**
**యా తృష్ణా జాయతే తీవ్రా సోపసర్గాత్మికా స్మృతా.** ౫౭

శోషమోహము జ్వరము మున్నగురోగములతో నేదైన నొకరోగములు దీర్ఘకాలము వ్యాపించియున్నపుడు ఆట్టిరోగములకు అనుబంధముగ తీవ్రముగ గల్గినదప్పి ఉపసర్గజతృష్ణ యనబడును. (ఇది యుంపద్రవరూపము).

ఇతి అష్టాఙ్గహృదయనిదానే
పంచమోఽధ్యాయః.

---

# షష్ఠాధ్యాయము.

అవ. పైయధ్యాయమున రాజయక్ష్మము దాని కుపద్రవములగు స్వరభేదము అరోచకము మున్నగువానినిదానముల నిరూపించి రాజయక్ష్మముబోలె త్రిదోషసన్నిపాతమునగల్గు మదాత్యయనిదానము ఈయధ్యాయమున జెప్పబడును. "సర్వేఽపిసర్వైర్జాయన్తే వ్యపదేశస్తు భూయసా" అనువాక్యముచే మదాత్యయము సన్నిపాతమున జనించునని తెలిసేది.

**సూ. అథాతోమదాత్యయనిదానంవ్యాఖ్యాస్యామః**

రాజయక్ష్మనిదానమును జెప్పినపిదప సన్నిపాతజన్యమగుటంజేసి రాజయక్ష్మముకు సమానధర్మమైన మదాత్యయనిదానమును వివరించెదనని యర్థము.

మద్యగుణములు

తీక్ష్ణోష్ణరూక్షసూక్ష్మామ్లం వ్యవాయ్యాశుకరం లఘు,
వికాసివిశదం మద్యం ఓజసోఽస్మాద్విపర్యయః. ౧

తీక్ష్ణము, ఉష్ణము, రూక్షము, సూక్ష్మము, అమ్లము, వ్యవాయి, ఆశుకరము, లఘువు, వికాసి, విశదము అను నీపదిగుణములును మద్యమున నియతముగ నుండును. శరీరమున కాధారమైనయోజస్సున పైజెప్పినగుణములకన్న విరుద్ధములగు మంద, శీత, స్నిగ్ధ, సాంద్ర, మధుర, స్థిర, చిరకారి, గురు, శ్లక్ష్ణ, పిచ్ఛిలత్వము లనుపదిగుణములును కల్గియుండును.

పైజెప్పబడిన తీక్ష్ణాదిగుణముల పదింటికిని మందత్వాదిగుణములు పదియు యథాక్రమముగ విరుద్ధములై యుండును. మద్యమునకల్గిన పదిగుణములకును విరుద్ధములైన గుణములు కల్గియుండుటంజేసి మద్యమునకు విరుద్ధధర్మమైనది ఓజస్సు. "వృద్ధిస్సమానైస్సర్వేషాం విపరీతైర్విపర్యయః" అను ప్రమాణప్రకారము ఓజస్సుకు విరుద్ధగుణములు కలమద్యమును సేవించినయెడ నోజస్సు బొత్తుగ క్షీణించుననిభావము. పైజెప్పిన గుణములవివరణము సూత్రస్థానమున జూచునది

విషమద్యములకు భేదము.

తీక్ష్ణాదయో విషేప్యుక్తాః చిత్తోపప్లావినోగుణాః,
జీవితాన్తాయజాయన్తే విషేతూత్కర్షవృత్తితః. ౨

మద్యమునకు జెప్పినతీక్ష్ణాదిగుణములు పదియును విషమునగూడ నియతముగ నుండును. తీక్ష్ణాదిగుణములు చిత్తభ్రమమును కలుగజేయుం స్వభావముకల్గినవి. ఈగుణముచే విషమున మిక్కుటముగ నుండుటంజేసి ప్రాణములహింసించి మరణము నొందించును. మద్యమున విషముకన్న తక్కువగనుండును కావున అయ్యది చిత్తమున కాధారమైన యోజస్సును చెరిచి చిత్తభ్రమమును మాత్రము కల్గించును. విషమద్యములకు గుణముల బలాబలమునుబట్టి వానికృత్యములు భేదించును.

మద్యముచే చిత్తవికారము కల్గువిధము.

తీక్ష్ణాదిభిర్గుణైర్మద్యం మన్దాదీనోజసోగుణాన్,
దశభిర్దశసంక్షోభ్య చేతోనయతి విక్రియామ్. 3
ఆద్యేమదే

ఓజస్సు స్థానము హృదయము. మద్యమును త్రాగినప్పు డయ్యది తనప్రభావము చేత నోజస్సుకు స్థానమైనహృదయమున జేరి తనయందలి తీక్ష్ణత్వాదిగుణముల పదింటిచేత నోజస్సుననుండు మందత్వాదిగుణములపదింటిని పూర్తిగజెరిచి వికారము నొందించును. ఇట్టి చిత్తవికారము మద్యపానమున తొలుత సంభవించుమదమున కల్గును.

ఇచ్చట మద్యము తనయందలి పదిగుణములచేతను ఓజస్సుననుండు గుణముల పదింటిని ఒక్కసమయముననే చెరచును గాని కొన్నిగుణములచేత కొన్నిటిమాత్రము చెరిచి చిత్తవికారమును కల్గింపనోపదు. ఈనియమమును దెలుపుటకే "దశభిర్దశ సంక్షోభ్య" అని సంఖ్యచెప్పబడినది. మద్యమును పానముజేసినపుడు పైజెప్పినరీతిగ చిత్తవికారముకల్గినను మరల ప్రబోధము తనంతనే కల్గునట్టి స్థితినుండునది ప్రథమ మదము. అట్టిప్రథమమదమున పైజెప్పినచిత్తభ్రమము కల్గునని భావము. ఈమదమునందు మద్యపానమున తనకుసుఖముగనున్నదని తెలివియుండును.

ద్వితీయమదము.

ద్వితీయే సప్రమాదాయతనే స్థితః,
దుర్వికల్పహతోమూఢః సుఖమిత్యధిముచ్యతే. ४

ద్వితీయమదము ప్రమాదములకల్గించు (ఇహలోకమునకును పరలోకమునకు విరుద్ధములగు) సాహసకృత్యములకు ముఖ్యస్థానముగ నుండును. ఈమదము పొందిన మనుజుడు పురుషార్థములకు (ధర్మార్థకామమోక్షములకు) విరుద్ధములగువికల్పము (మనోవృత్తు) లచే హతుడై వివేకశూన్యుడై కార్యాకార్యముల గొంచెమైన నెరుంగజాలక ప్రథమమదమున గల్గినసుఖమునుగూడ నెరుంగజాలకుండును. (తాత్కాలిక సుఖమునుగూడ నెరుంగజాలక మూఢచిత్తుడగునని భావము) ఇది మధ్యమమదము.

### ద్వితీయ తృతీయ మదసంధి.

మధ్యమోత్తమయోస్సన్ధిం ప్రాప్య రాజసతామసః,
నిరఙ్కుశ ఇవ వ్యాళః న కిఞ్చిన్నాచరేజ్జడః. ౫

పైఁజెప్పినమధ్యమమదమునకును క్రిందఁజెప్పఁబడుచున్నూఁడవ మదమునకును నడుమ నుండు అవస్థావిశేషమును బొందినపుడు మనుజుఁడు రజస్తమోగుణముల నొందియుండును. దానంజేసి అంకుశములేనిమదపుటేనుఁగువలె నెట్టిదుష్టకృత్యములనైనఁ జేయుటకు సిద్ధముగనుండును. కొంచెమైన సత్కృత్యముల జంకక తనకిచ్చవచ్చినట్లెల్ల జడుఁడై చేయుచుండును.

సాత్త్వికాదిమదములయందు కల్గులక్షణములు తంత్రాంతరమున నిట్లు చెప్పఁబడియె:—

"సాత్త్వికే శౌచ దాక్షిణ్యహర్షమండనలాలసః,
గీతాధ్యయనసౌభాగ్య సురతోత్సాహకృన్మదః.
రాజసే దుఃఖశీలత్వం ఆత్మత్యాగం స సాహసమ్,
కలహం సానుబన్ధం చ కరోతి పురుషో మదః.
అశౌచనిద్రామాత్సర్యాగమ్యాగమనలోలతాః,
అసత్యభాషణం చాపి కుర్యాద్వై తామసే మదే."

సాత్త్వికస్వభావముకలమనుజునకు మద్యపానమున మదము (చిత్తభ్రమము) కల్గినప్పుడు పరిశుద్ధముగ నుండును. పనులఁజేయసామర్థ్యము గల్గియుండును. సంతోషము కల్గియుండును. భూషణాదులయందు ఆసక్తి గల్గియుండును. సంగీతముపాడును. చదువును. సౌందర్యమునందును రతిక్రీడలయందు ఆసక్తికల్గియుండును. ఇది ప్రథమ మదము. రాజసగుణముకలవారికి మధ్యమమదము కల్గును. ఈమదమున మనుజుఁడు ఏడ్చును. మిక్కిలి సాహసమునకుఁగడంగి తుదకు ఆత్మహత్య జేసుకొన నుపక్రమించును. అనర్థకరములగు కలహములఁజేయును. తామసగుణప్రధానులకు మూఁడవమదము కల్గును. ఇది యధమము. ఈమదమున మనుజుఁడు పరిశుద్ధతలేక నిద్రయందాసక్తికల్గి ఇతరులయందు ద్వేషబుద్ధికల్గియుండును. బొందఁగరానిగురుభార్య మున్నగువారినిబొంద నుద్యమించును. మనస్సొకచోటనైన నిలుకడలేక పరిపరివిధముల చంచలమై పోవుచుండును. అసత్యపుమాటల బల్కును.

### పైఁజెప్పినమదావస్థప్రభావము.

ఇయం భూరిరవద్యానాం దౌశ్శీల్యస్యేదమాస్పదమ్,
ఏకోఽయం బహుమార్గాయాః దుర్గతేర్దేశికః పరమ్. ౬

పైజెప్పినమదావస్థ నింద్యములైనపనులకెల్ల ప్రధానమైనస్థానము. వివేకములేని పనులజేయుటకిది స్థానము. ఈయవస్థ యొక్కటైనను అనేకమార్గములు కలదుర్గతికి ప్రధానమైనగురువులై యుండును.

## తృతీయమదము.

నిశ్చేష్టశ్శవవచ్ఛేతే తృతీయే తు మదే స్థితః,
మరణాదపి పాపాత్మా గతః పాపతరాం దశామ్ ౭

తృతీయమదమును నొందినమనుజుడు శరీరాదులకు సంబంధించిన చేష్టలనెల్ల దక్కి చచ్చినవానివలె పడియుండును ఇట్టిదశ మరణమునకన్న మిక్కిలి పాపజనకమైనది. ఈమదదశను పొందినమనుజుడు మిక్కిలి పాపాత్ముడగును.

## మద్యపాననింద.

ధర్మాధర్మం సుఖం దుఃఖం అర్థానర్థం హితాఽహితమ్,
యదాసక్తో న జానాతి కథం తచ్ఛీలయేద్బుధః. ౮

మద్యమునందాసక్తికలమనుజుడు ధర్మాధర్మములను, సుఖదుఃఖములను, అర్థానర్థములను హితాహితములను కొంచెమైన తెలిసికొనజాలడు. అట్టిమద్యమును బుద్ధిమంతుడగుమనుజు డెవ్వడు అలవాటున నుంచుకొని విడువక సేవించును? (ఒకప్పుడును సేవింపదగదనుట)

## మద్యమునందలిదోషములు.

మద్యే మోహో భయం శోకః క్రోధో మృత్యుశ్చ సంశ్రితాః,
సోన్మాదమదమూర్ఛాయాః సాపస్మారాపతానకాః. ౯
యత్రైకః స్మృతివిభ్రంశః తత్ర సర్వమసాధు యత్,

మద్యము అధికముగ త్రాగినయెడల మోహము (చిత్తభ్రమము)కల్గును, కారణములేకయే భయంబును దుఃఖంబును కోపంబును కల్గును ఒకసమయమున మృత్యువు కూడ సంభవించును. మరియు ఉన్మాదము, మదము (నిశ్చ), మూర్ఛ, అపస్మారము, అపతానకము, అను నీరోగములును సంభవించును. మరియు నేమద్యమును సేవించినచో చిత్తనాశముకలుగునో అట్టిమద్యపానమున నన్నియుం జెడ్డవిగనే యుండునుగాని ఒకవిషయమైన మంచిదిగనుండబోదు. (కావున అట్టిచిత్తభ్రంశమును కలిగించునట్టి మద్యమును త్రాగదగదనిభావము).

మద్యపానమునగలుగు ప్రథమమధ్యమోత్తమమదముల చరకాచార్యు లిట్లు చెప్పిరి:—"ఓజస్యవిహతే పూర్వః హృది చ ప్రతిబోధితే, మధ్యమోవిహతేఽల్పేతు

విహా తే తూత్తమో మదః" మద్యపానమువలన ఓజస్సు చెడక మనస్సు ప్రతిబోధితమై యుండునది ప్రథమమదము. ఓజస్సు కొంచెము చెడియుండుకెడ మధ్యమమదము. ఓజస్సు పూర్తిగ చెడినచో నయ్యది ఉత్తమ(తృతీయ)మదము. తృతీయమదమున బొత్తుగ నోజస్సుచెడినప్పుడు మనుజుడు చచ్చినవానివలె నేమియు నెరుంగజాలక చేష్టల దక్కియుండును. రెండుమూడుమదములకు మధ్యమావస్థ మిశ్రముగ నుండును కావున అయ్యది సంధి. ఈయవస్థయందు మనుజుడు అడ్డములేక తనకిచ్చవచ్చినట్లెల్ల వివిధ చేష్టలజేయును. ఈమదము రజస్తమోగుణములు మిశ్రములుగనున్నవారికి సంభవించును.

### మద్యసేవనమున గలుగుగుణదోషములు.

అయుక్తియుక్తమన్నం హి వ్యాధయే మరణాయ వా. ౧౦
మద్యం త్రివర్గధీధైర్యలజ్జాదేరపి నాశనమ్,

అన్నము శరీరమునకు మిక్కిలి పుష్టిని ప్రధానముగ గలిగించును అయ్యది ప్రమాణము సాత్మ్యము మున్నగువిషయముల గమనింపక వ్యత్యస్తముగ నుపయోగించిన యెడ వ్యాధులగలిగించును. ఒకసమయమున మరణమునుగూడ గలిగించును. అరీతిగనే మద్యమును దేశకాలసాత్మ్యాదుల ననుసరించి యుక్తియుక్తముగాక విరుద్ధముగ సేవించినయెడ ధర్మార్థకామరూపములైన త్రివర్గములకును బుద్ధికిని ధైర్యమునకు లజ్జకును హానికరముగ నుండును. తుదకు మనుజులకు అనేకములైనకష్టముల గలిగింప సిద్ధముగ నుండును. అయ్యది యుక్తియుక్తము దేశకాలసాత్మ్యాద్యనుసారముగ సేవించినవాడు త్రివర్గాదులకు సాధముగనుండును.

### మద్యపానమున కర్హులు.

నాతిమాద్యన్తి బలినః కృతాహారా మహాశనాః. ౧౧
స్నిగ్ధాస్సత్త్వవయోయుక్తాః మద్యనిత్యాస్తదన్వయాః,
మేదఃకఫాధికా మన్దవాతపిత్తా దృఢాగ్నయః. ౧౨

మిక్కిలి బలముకలిగినవారును, ఆహారముజేసినవారును, మిక్కిలి అధికముగ భుజించువారును, స్నిగ్ధమైన శరీరముకలవారును, సత్త్వగుణముకలవారును, యుక్తమైన (బాల్యము వృద్ధత్వముగాక యౌవనము) వయస్సుకలవారును, మద్యమును నిరంతరము నుపయోగించువారును మద్యము నుపయోగించుకులమునబుట్టినవారును, మేదస్సు అధికముగ వృద్ధినొంది(బలిసి)నవారును, కఫ మధికముగ నున్నవారును, మందములైన వాతపిత్తముకలవారును, బలిష్ఠమైనజాఠరాగ్నికలవారును నగుమనుజులు మద్యమును పానము

జేసినచో నధికముగ మదమును బొందరు. కావున పైజెప్పినవారిచే యుక్తియుక్తముగ దగినప్రమాణము ననుసరించి మద్యము పానముజేయదగునని భావము.

## పానానర్హులు.

విపర్యయేఽతిమాద్యన్తి విస్రబ్ధాః కుపితాశ్చ యే,
మద్యేన చామ్లరూక్షేణ సాజీర్ణే బహునాతి చ. ౧౩

పైజెప్పినవానికి విరుద్ధములగుధర్మముకలవారు మద్యమును ద్రాగినచో మితిమీరి మదించెదరు. మరియు మద్యమునందు మిక్కిలి మక్కువగలిగి యిచ్చవచ్చినట్లు పానము జేయువారును, మిక్కిలి కోపముకలిగినవారును అధికముగ మదించెదరు. కావున పైజెప్పినవారు మద్యపానమున కర్హులుకారు. మరియు మిక్కిలి పులుపుకలిగినమద్యంబును, స్నిగ్ధగుణము ఇంచుకేనియు లేక మిక్కిలి రూక్షమైనమద్యంబును, అధికముగ మదమునిచ్చును. మరియు మద్యమును పానముజేసి అది జీర్ణముగాకమునుపు మరల పానముజేసినను, పరిమాణమున కధికముగ ద్రావినను మద మధికమగును.

విపర్యయే అనుచోట విరుద్ధధర్మముల నిట్లూహించునది:—బలహీనులు ఆహారము జేయక పరగడుపున నుండువారు, మిక్కిలి స్వల్పముగ భుజించువారు, రూక్షశరీరము కలవారు, సత్వగుణములేనివారు, యుక్తవయస్సు (యౌవనము) గాక బాల్యవృద్ధత్వమున నుండువారు, మద్యపానము అలవాటునలేనివారు పానముజేయుటలవాటులేనివంశమున బుట్టినవారు, మేదస్సు కఫము కృశించినవారును, వాతపిత్తములు ప్రబలముగ నుండువారు, జఠరాగ్ని మందగించినవారు వీరందరును మద్యపానమున కర్హులు కారని భావము.

## మదాత్యయము దానిభేదములు.

వాతాత్పిత్తాత్కఫాత్సర్వైశ్చత్వారస్స్యుర్మదాత్యయాః,
సర్వేఽపి సర్వైర్జాయన్తే వ్యపదేశస్తు భూయసా. ౧౪

మదాత్యయమున మద్యమును పానముచేయుటవలన మదముకల్గునని మున్ను జెప్పబడెనుకదా; అట్టి మదవిశేషముగ గల్గునుపద్రవములు మదాత్యయశబ్దముచే చెప్పబడును. అట్టిమదాత్యయము వాత-పిత్త-కఫములచే వేరువేరుగను, మూడిటిచేతను కల్గుటంజేసి నాల్గువిధములగును. ఈమదాత్యయములన్నియుం త్రిదోషములచే గల్గును. అయినను వాత్రిదోషములలో నేది ప్రబలముగ నుండునో అట్టిదోషమునుబట్టి వాతికాదిభేదములచే వ్యవహరింపబడును.

## మదాత్యయసామాన్యలక్షణములు.

సామాన్యం లక్షణం తేషాం ప్రమోహో హృదయవ్యథా,
విడ్భేదః ప్రతతం తృష్ణా సౌమ్యాగ్నేయో జ్వరోఽరుచిః. ౧౫

శిరఃపార్శ్వాస్థిహృత్కమ్పః మర్మభేదస్త్రికగ్రహః,
ఉరోవిబన్ధస్తిమిరం కాసః శ్వాసః ప్రజాగరః, ౧౬
స్వేదోఽతిమాత్రం విష్టమ్భః శ్వయథుశ్చిత్తవిభ్రమః,
ప్రలాపశ్ఛర్దిరుత్క్లేశో భ్రమో దుస్స్వప్నదర్శనమ్. ౧౭

మదాత్యయసామాన్యముగ నీక్రిందచెప్పబడినలక్షణములు కలుగును:—అధికమైనమోహము, రొమ్మునొప్పి, మలము ఉండలుగ వెడలుట, తీవ్రమైనదప్పి, సౌమ్యంబును ఆగ్నేయంబును నగుజ్వరము, అరోచకము, శిరస్సునందును పార్శ్వములయందును అస్థులయందును హృదయమునందును కంపము, మర్మస్థలములనొప్పి, నడుముపట్టినట్లునొప్పి, రొమ్ముపట్టినట్లుబాధ, చీకటినున్నట్లుమైకముగ్రమ్ముట, శ్వాసకాసములు, నిదురబట్టకుండుట అధికముగ చెమటబట్టుట, మలబద్ధము, వాపు, చిత్తభ్రమము, అసంబద్ధముగమాటలాడుట, వాంతి యధికముగనగుట, ఓకరింతలు, చక్రము పైనున్నవానివలెనొడలుతిరుగుట, దుష్టములగు కలలుకలుగుట ఇవియన్నియు మదాత్యయమున సామాన్యముగ కలుగులక్షణములు.

## వాతికమదాత్యయలక్షణములు.

విశేషాజ్జాగరశ్వాసకమ్పమూర్ధరుజోఽనిలాత్,
స్వప్నే భ్రమత్యుత్పతతి ప్రేతైశ్చ సహ భాషతే ౧౮

వాతమున జనించినమదాత్యయమున నిదుర పొత్తుగబట్టదు. శ్వాస మధికమగును. శరీరము వడకును. తలనొప్పి పుట్టును. స్వప్నమున భ్రాంతినొందును. పైకెగురును ప్రేతములగని మాటలాడును. ఈలక్షణములు మదాత్యయమున వాతాధిక్యమున గలుగును.

## పైత్తికమదాత్యయలక్షణము.

పిత్తాద్దాహజ్వరస్వేదమోహాతీసారతృడ్భ్రమాః,
దేహో హరితహారిద్రః రక్తనేత్రకపోలతా. ౧౯

మదాత్యయమున పిత్తంబధికమైనచో మంటబుట్టును. జ్వరము వ్యాపించును. చెమట యధికమగును. మూర్ఛ గ్రమ్మును. అతిసారవిరేచనములు గలుగును. దప్పి యధికమగును. ఒడలు విశేషముగ దిరుగును. దేహము ఆకుపచ్చనిరంగైనను పసుపురంగైనను కలిగియుండును. కన్నులును గండభాగంబులును ఎఱ్ఱనగును.

## కఫజమదాత్యయలక్షణము.

శ్లేష్మణశ్ఛర్దిహృల్లాసనిద్రోదర్దాఙ్గగౌరవమ్,
సర్వజే సర్వలిఙ్గత్వం

మదాత్యయమున కఫ మధికముగ నున్నపుడు వాంతి యధికముగ నగును. ఓక

రింతలు కలుగును. నిద్ర యధికముగవచ్చును. ఉదర్దమనువ్యాధివిశేషము గలుగును. ఒడలు బరువుగనుండును. వాతాదులు మూడును సమానములుగ నుండునపుడు వాతాదులకు పైని ప్రత్యేకముగ జెప్పినలక్షణములన్నియు సంభవించును.

### అయుక్తమద్యసేవచే గలుగురోగములు.

ముక్త్వా మద్యం పిబేత్తు యః. ౨౦
సహసానుచితం వాన్యత్తస్య ధ్వంసకవిక్షయౌ,
భవేతాం మారుతాత్కృష్టౌ దుర్బలస్య విశేషతః ౨౧

మనుజుడు తా నలవాటుగ సేవించుచున్న యుక్తమైనమద్యమును చాలా కాలము వరకును విడచియుండి మరల నామద్యమునే మితిమీరి సేవించినను, లేక తనకలవాటు లేని అనుచితమైన మద్యమును క్రొత్తగ మితిమీరి తటాలున సేవించినను వానికి వాతప్రకోపమువలన ధ్వంసకము, విక్షయము నను రెండురోగములు కలుగును. ఈరెండును కృచ్ఛ్రసాధ్యములు కావున మిక్కిలి కష్టమును గలిగించును

### ధ్వంసక-విక్షయలక్షణములు.

ధ్వంసకే శ్లేష్మనిష్ఠీవః కణ్ఠశోషోఽతినిద్రతా,
శబ్దాఽసహత్వం తన్ద్రా చ విక్షయేఽఙ్గశిరోఽతిరుక్. ౨౨
హృత్కణ్ఠరోగః సమ్మోహః కాసస్తృష్ణా వమిర్జ్వరః,

పైజెప్పినధ్వంసమను వ్యాధియందు కఫమును నోట నుమియుటయు గొంతెండును నిద్ర అధికముగవచ్చును ఏవిధమైనశబ్దమును వినుట కిచ్ఛయుండదు కునికిపాటుకల్గును.

విక్షయమనువ్యాధియందు శరీరమునందలి అవయవంబులును తలయు నధికముగ నొప్పిచే బాధకల్గును. హృదయమునకు కంఠమునకును సంబంధించినరోగములు కల్గును. మూర్ఛ గ్రమ్మును కాసను వచ్చును. దప్పి యధికమగును వాంతియగును. తీవ్రముగ జ్వరము వ్యాపించును.

### మద్యపాననివృత్తిచే గల్గునారోగ్యము.

నివృత్తో యస్తు మద్యేభ్యో జితాత్మా బుద్ధిపూర్వకమ్. ౨౩
వికారైస్స్పృశ్యతే జాతు న స శారీరమానసైః,

మద్యమువలన శారీరమానసవ్యాధులు కల్గునని యెఱింగి విరక్తకల్గి యింద్రియముల జయించి బుద్ధిపూర్వకముగ మద్యమును త్రాగక విరమించినవాడు శరీరమునకు సంబంధించినరోగములచేతను, మనస్సుకు సంబంధించిన చిత్తభ్రమము మున్నగునాడుల చేతను ఒకప్పుడు బాధింపబడడు.

(మద్యపానమునగల్గు దోషముల నన్నిటిని తాను స్పష్టముగదెలిసి మద్యమన్న తాక విష్ఠవలె హేయముగజూచి చక్షురాదీన్ద్రియముల నావంకబోనీయక చిత్తమును తనవశమున నుంచుకొనినవాడు శారీరమానసవ్యాధులచే నొకప్పుడును స్పృశింపబడడు. అటుగాక యింద్రియముల జయింపక మనసునం దభిలాషపూర్తిగ నుడుగక తటాలున నిర్బంధముగ విడిచినచో సహసాత్యాగరూపమున నొకసమయమున రోగములు సంభవింప వచ్చును.)

### మద-మూర్ఛా-సన్న్యాసనిదానము.

రజోమోహాహితాహారపరస్య స్యుస్త్రయో గదాః। ౨౪
రసాసృక్చేతనావాహిస్రోతోరోధసముద్భవాః,
మదమూర్ఛాయసన్న్యాసాః యథోత్తరబలోత్తరాః ౨౫

రజోగుణము ప్రధానముగగల్గినమనుజునకు అపథ్యాహారవిహారాములచే వాతాది దోషములు ప్రకోపమునొంది రసధాతువును వహించుస్రోతోమార్గము నడ్డగించినమదమును (తిక్కను) కల్గించును. మోహము ప్రధానముగ గలమనుజునకు వాతాదిప్రకోపమున రక్తమును వహించుస్రోతస్సుల నడ్డగించి మూర్ఛను కల్గించును. ఎల్లప్పుడును అపథ్యములగు నాహారవిహారముల జేయుమనుజునకు జ్ఞానవహములగు నాడుల నడ్డగించి సన్న్యాసమును గల్గించును. ఈ మూడు వ్యాధులును ఒకటికన్న నొకటి మిక్కిలి బలిష్ఠములై యుండును. (మదమునకన్న మూర్ఛయును, దానికన్న సన్న్యాసంబును అధికబలముగ నుండునని భావము)

### మదభేదములు.

మదోఽత్ర దోషైస్సర్వైశ్చ రక్తమద్యవిషైరపి,

పైజెప్పినమూడురోగములలో మదము వాతపిత్తకఫములచే వేరువేరుగను, అన్నింటిసన్నిపాతము చేతను, రక్తము చేతను, మద్యము చేతను, విషము చేతను, గల్గును; కావున నేడువిధములగును.

### వాతజమదలక్షణము.

సక్తానల్పద్రుతాభాషః చలః స్ఖలితచేష్టితః। ౨౬
రూక్షశ్యావారుణతనుః మదే వాతోద్భవే భవేత్,

వాతమునకల్గినమదమున మనుజుడు నత్తితోగూడి అతిశీఘ్రోచ్చారణముతో మితిలేక మాటలాడును. చంచలముగనుండును. ఏపనులు చేయవలెనన్నను చేష్టలన్నియు తప్పిపోవును. శరీరము స్నిగ్ధముగాక రూక్షమై అరుణవర్ణము కల్గియుండును.

పిత్త-కఫజమదలక్షణములు.

పిత్తేన క్రోధనో రక్తపీతాభః కలహప్రియః. ౨౭
స్వల్పాఽసంబద్ధవాక్పాణ్డుః కఫాద్ధ్యానపరోఽలసః,

పిత్తమున గల్గినమదమున మిక్కిలి కోపోద్రిక్తుడై రక్తవర్ణంబును పీతవర్ణంబునైన దేహము కల్గియుండును కలహమాడుటకు చాల ప్రీతిగల్గియుండును. కఫజమదమున సంబంధములేనిమాటల స్వల్పముగ మాటలాడును. పాండువర్ణము కల్గియుండును. మిక్కిలి చింతతో దేనినో యోచించుచున్నట్లుండును పనులయందు మందుడై యుండును.

సన్నిపాత-రక్త-మద్యజమదలక్షణములు.

సర్వాత్మా సన్నిపాతేన రక్తాత్ స్తబ్ధాఙ్గదృష్టితా. ౨౮
పిత్తలిఙ్గం చ మద్యేన వికృతేహాస్వరాఙ్గతా,

సన్నిపాతమున గల్గినమదమున వాతాదులకు ప్రత్యేకముగ జెప్పినలక్షణములన్నియుం గల్గియుండును. రక్తమున గల్గినమదమున అవయవములన్నియుం దృష్టియు శిథిలములుగ నుండును. ఇదిగాక పిత్తలక్షణములు క్రోధాదులును కల్గును. మద్యమునగల్గిన మదమున చేష్టలును కంఠస్వరంబును అవయవములును వికృతములుగ నుండును.

విషజమదలక్షణము.

విషే కమ్పోఽతినిద్రా చ సర్వేభ్యోఽభ్యధికస్తు సః. ౨౯
లక్షయేల్లక్షణోత్కర్షాత్ వాతాదీన్ శోణితాదిషు,

విషమువలన (విషవస్తువుల సేవించుటవలన) గల్గినమదమున కంపమధికముగ కల్గును. నిద్ర మిక్కుటముగ పట్టును. మఱియును రక్తవిషజమదములయందు వాతపిత్తకఫలక్షణములుపట్టి ఆయాదోషసంబంధము నెఱుంగవలె (ఏదోషలక్షణము లధికముగ నుండునో ఆదోషసంబంధము గ్రహింపవలెనని భావము).

వాతజమూర్ఛాలక్షణము.

అరుణం కృష్ణనీలం వా ఖం పశ్యన్ప్రవిశేత్తమః ౩౦
శీఘ్రం చ ప్రతిబుధ్యేత హృత్పీడా వేపథుర్భ్రమః,
కార్శ్యం శ్యావారుణా ఛాయా మూర్ఛాయే మారుతాత్మకే.

వాతప్రకోపమున గల్గినమూర్ఛయందు మనుజుడు ఆకసమును అరుణవర్ణమునైనను, నల్లనైనను, నీలవర్ణముగనైనను జూచుచు చీకటిలోనున్నట్లు ఏమియుం నెఱుంగక స్మృతిదప్పును. అట్టిమూర్ఛనుండి మరల శీఘ్రముగనే తెలివినొందును. ఈమూర్ఛయందు రొమ్మునొప్పి, వణకు, భ్రమమును కల్గును. శరీరము కృశించును. శరీరకాంతి శ్యామవర్ణంబును అరుణవర్ణంబునై యుండును.

## పిత్తజమూర్ఛాలక్షణము.

పిత్తేన రక్తం పీతం వా నభః పశ్యన్ విశేత్తమః,
విబుధ్యతే చ సస్వేదః దాహతృట్ తాపపీడితః. 3౨
భిన్నవిణ్మూత్రపీతాభః రక్తపీతాకులేక్షణః,

పిత్తమున గల్గినమూర్ఛయందు ఆకసమును రక్తవర్ణముగనైనను పీతవర్ణముగనైనను చూచుచు స్మృతితప్పును. మరల మూర్ఛదేరునపుడు చెమట విశేషముగబట్టును. శరీరము మంటఁబుట్టును. డప్పి యధికమగును. తాపము కల్గును. మలమూత్రములు వెడలును. శరీరము పచ్చనై యుండును. రక్తవర్ణంబును పీతవర్ణంబునై కన్నులు కలకబారి యుండును.

## కఫజమూర్ఛాలక్షణము.

కఫేన మేఘసంకాశం పశ్యన్నాకాశమావిశేత్. 33
తమశ్చిరాచ్చ బుధ్యేత సహృల్లాసః ప్రసేకవాన్,
గురుభిస్తిమితైరఙ్గైః ఆర్ద్రచర్మావనద్ధవత్. 3౪

కఫమునగల్గినమూర్ఛయందు ఆకాశమును మేఘములచే నావరింపబడినవిధముగ జూచుచు మూర్ఛనొందును. చిరకాలమునకు మరల తెలివినొందును. ఓకరింతలతో నోట జొల్లుకార్చుచు మూర్ఛనొందును. ఒడలిపై తడిసిన చర్మముచే గప్పబడినవిధముగ నిశ్చలములై బరువైనయంగములతో గూడియుండును.

## సాన్నిపాతికమూర్ఛాలక్షణము.

సర్వాకృతిస్త్రిభిర్దోషైః అపస్మార ఇవాపరః,
పాతయత్యాశు నిశ్చేష్టం వినాబీభత్సచేష్టితైః 3౫

మూడుదోషములును ప్రకోపించి యామూడిటిలక్షణములును కల్గి సంభవించు మూర్ఛ సన్నిపాతమున గల్గినది. నింద్యములగు చేష్టలుమాత్రము లేక అపస్మారమునకు జెప్పిన తక్కినలక్షణములన్నియుఁకల్గి అతిశీఘ్రముగ స్మృతితప్పించి క్రిందపడద్రోయునది సాన్నిపాతిక మని యెఱుంగనది.

## మూర్ఛాదులకును సన్న్యాసమునకును గల్గుభేదము.

దోషేషు మదమూర్ఛాద్యాః కృతవేగేషు దేహినామ్,
స్వయమేవోపశామ్యన్తి సన్న్యాసో నౌషధైర్వినా. 3౬

పైజెప్పినమదములును మూర్ఛలును ప్రకోపించిన దోషములు వానివేగములను పూర్తిగజూపి శాంతినొందినప్పుడు తమంతటనే వ్యాధులును (చికిత్సలేకున్నను) శమించును. సన్న్యాసమనువ్యాధిమాత్రము ఔషధములచే దగినచికిత్సజేయక శమించుటలేదు.

### సన్న్యాసలక్షణము.

వాగ్దేహమనసాం చేష్టా మాక్షిప్యాతిబలామలాః,
సన్న్యసం సన్నిపతితాః ప్రాణాయతనసంశ్రయాః ౩౭
కుర్వన్తి తేన పురుషః కాష్ఠభూతో మృతోపమః,
మ్రియేత శీఘ్రం శీఘ్రం చేత్ చికిత్సా న ప్రయుజ్యతే. ౩౮

వాతపిత్తకఫములు మూడును ప్రకుపితములై మిక్కిలి బలమునొంది ఒక్కపని యందు పూనికతో పరస్పరసహకారులై కూడి వాక్కును దేహమునకును మనస్సునకును సంబంధించినచేష్టల (సంభాషణము మున్నగుపనుల) నన్నిటిని పూర్తిగ నుడిగించి ప్రాణములకు ముఖ్యస్థానమైన హృదయమునజేరి సన్న్యాసమను మానసికరోగమును కల్గించును. మిక్కిలి క్రూరమగు నీవ్యాధిచే మానవుడు కొయ్యవలె స్తంభించి చచ్చినవాని వలె క్రిందపడియుండును. ఈవ్యాధియందు అతిశీఘ్రముగ తగినచికిత్స చేయనిచో మనుజుడు అతిశీఘ్రముగ మృతినొందును. (కావున తోడనే తగినచికిత్సను తప్పక చేయవలెననుట).

### సన్న్యాసమున శీఘ్రచికిత్సావశ్యకత.

అగాధే గ్రాహబహులే సలిలౌఘ ఇవాతతే,
సన్న్యాసే వినిమజ్జన్తం నరమాశు నివర్తయేత్. ౩౯

మిక్కిలి లోతుకలిగి ప్రాణహరములగు మొసలి మున్నగుదుష్టజంతువులంగూడి గట్టులేనంతజలాధారమున పడుమనుజుని చేయూతనిచ్చి వెలికితీయకున్నచో నతిశీఘ్రముగ చచ్చును. అరీతిగనే సన్న్యాసమను మహాంధకూపమునబడి తెరవుగానకుండు రోగికి తక్షణ తగినచికిత్సజేయక కొంతసేపైన నుపేక్షించినచో నీటమునిగినవాని వలె శీఘ్రముగ సంయమనీనగరమార్గమును వెదకికొనును; కావున త్వరగా చికిత్సజేయ నగును.

### అయుక్తముగ మద్యముసేవించిన గల్గుదోషము.

మదమానరోషదోషప్రభృతిభిరరిభిర్నిగూఢైః పరివృక్తః,
యుక్తాయుక్తం చ సమం యుక్తివియుక్తేన మద్యేన. ౪౦

మద్యపానమునకు జెప్పననియమము నుల్లంఘించి యుక్తదూరముగ మద్యసేవ జేసినచో నిహలోకమునను పరలోకమునకు సుఖమును విఘ్నముజేయు నైసర్గికశత్రువులగుమదము, అభిమానము, కారణములేనిక్రోధము మున్నగుశత్రువులు తన్నాక్రమించి యుక్తమును అయుక్తమును వివేచింప శక్తిలేక రెంటిని సమముగ జూచుచు మనుజుడు బొత్తుగచెడును. కావున యుక్తియుక్తముగాక మద్యమును సేవింపందగదు.

## యుక్తియుక్తమద్యసేవగుణము.

బలకాలదేశసాత్మ్యప్రకృతిసహాయామయవయాంసి,
ప్రవిభజ్య తదనురూపం యది పిబతి తతః పిబత్యమృతమ్. ౪౧

మధ్యమోత్తమాదిబలభేదమును శీతోష్ణాదికాలభేదమును, జాంగలానూపదేశభేదమును, సాత్మ్యమును, వాతాదిప్రకృతిభేదమును, సహాయసంపత్తిని, రోగస్వభావమును, బాల్యాదివయోభేదమును, వీనినన్నిటిని జక్కఁగ పరిశీలించి వానికనుగుణముగ మద్యము ను త్రాగినచో నమృతమును ద్రాగినవిధముగ నానన్దము నొందును. (కావున పైజెప్పిన వాని నన్నిటిని జక్కఁగబరిశీలించి తత్తదనుగుణముగ మద్యమును సేవించునది.)

ఇత్యష్టాంగహృదయనిదానే షష్ఠోఽధ్యాయః.

# సప్తమాధ్యాయము.

అవ: పైజెప్పబడిన మదాత్యయనిదానాంతమున "అరిభిర్నిజైః పరిష్వక్తః" అని మదమానాములు శత్రువులబోలినవి యని చెప్పబడెను. అర్శోరోగంబును శత్రువునుబోలె ప్రాణముల హింసించునదియని "అరివత్ ప్రాణినో......తస్మాదుచ్యన్తే" అనువాక్యము చే క్రింద జెప్పబడుచున్నది. అట్టిసామ్యమునుబట్టి మదాత్యయనిదానానంతరము అర్శో నిదానమును జెప్పుట యుక్తము.

సూ. అథాఽర్శసాం నిదానం వ్యాఖ్యాస్యామః.

మదాత్యయనిదానమును జెప్పినపిదప నర్శోరోగనిదానమును వివరించెదనని భావము.

అర్శోరోగసంప్రాప్తి-అన్వర్థత.

అరివత్ప్రాణినో మాంసకీలకాః విశసన్తి యత్,
అర్శాంసి తస్మాదుచ్యన్తే గుదమార్గనిరోధతః. ౧.
దోషాస్త్వఙ్మాంసమేదాంసి సన్దూష్య వివిధాకృతీన్,
మాంసాఙ్కురానపానాదౌ కుర్వన్త్యర్శాంసి తాన్ జగుః ౨

వాతాదిదోషములు ప్రకోపమునొంది త్వక్కును మాంసమును మేదస్సును దుష్టములుగజేసి పలువిధంబులైనయాకారములు కలమాంసపుమొలకలను గుదము మేఢ్రము నాసారంధ్రములు మున్నగుస్థలములయందు గల్గించును. అయ్యవి మాంసపుకీలలై గుద స్థానమునజేరి యడగించి శత్రువులంబోలె ప్రాణుల హింసింపజూచును. కావున నయ్యవి అర్శస్సులని అన్వర్థముగ జెప్పబడును.

"అరిరివ, ప్రాణాన్, శృణాతి, ఇతి అర్శః" అనువ్యుత్పత్తిచేత శత్రువులబోలె ప్రాణముల హింసించునది యర్శోరోగము. 'శౄ హింసాయాం' అనుధాతువుచే నీరూప మగును.

అర్శోరోగద్వైవిధ్యము.

సహజన్మోత్తరోత్థానభేదాద్ద్వేధాసమాసతః,
శుష్కస్రావివిభేదాచ్చ

పైఁజెప్పినమాంసాంకురము మనుజులకు కొందరికి పుట్టువుతోఁగూడనే సంభవించును. కొందరకు పుట్టినవెనుక అపథ్యాహారాదులచే మధ్యకాలమున కల్గును. ఈభేదముచే సంగ్రహాముగ నీవ్యాధి రెండువిధముల నుండును. మరియు కొన్ని ద్రవము లేక యెండిచీలలవలె నుండును. మరికొన్ని రక్తాదుల స్రవించుచుండును. ఈభేదము చేతను రెండువిధముల నుండును.

### గుదము, వళులు, వానిపరిమాణము.

గుదస్స్థూలాన్త్రసంశ్రయః. ౩
అర్ధపఞ్చాఙ్గుళ స్తస్మిం స్తిస్రోఽధ్యర్ధాఙ్గులాఃస్థితాః,
వల్ల్యః ప్రవాహిణీ తాసాం అన్తర్మధ్యే విసర్జనీ.
బాహ్యా సంవరణీ తస్యాః గుదోష్ఠో బహిరఙ్గులే,
యవాధ్యర్ధప్రమాణేన రోమాణ్యత్ర తతః పరమ్. ౪

మూలాధారమునుండి యూర్ధ్వముగ వ్యాపించియుండుస్థూలాన్త్రము (పెద్దప్రేగు) నాశ్రయించి నాల్గున్నరయంగుళములపరిమితిగల్గిగుదము మనుజసామాన్యముగ నుండును. అట్టిగుదమున మూడువళులు (మడుపులు) ఉండును. అయ్యవి యొక్కటియు ఒకటిన్నరయంగుళప్రమాణము కల్గియుండును. అందు లోపలనుండువళి మలమును వెడలింప నుద్యమించునది కావున ప్రవాహిణి యనబడును. మధ్యనుండు ఇంకొక్కవళి మలమును వెలికింద్రోయుశక్తి కల్గినదికావున విసర్జని యనబడును. మలము బైటవెడలినపిదప గుదమును మూయుటంజేసి మూడవవళి సంవరణి యనబడును. అట్టిసంవరణి యనుబాహ్యవళికి వెలిప్రక్క నొకయంగుళముపరిమితిగలప్రదేశమున గుదోష్ఠము (గుదమున కంచు) ఉండును. అయ్యది ఒకటిన్నరయవప్రమాణము కల్గియుండును. దానికి వెలిప్రక్క రోమము లుండును.

### సహజార్శోరోగకారణము.

తత్ర హేతుస్సహోత్థానాం వలీబీజోపతప్తతా,
అర్శసాం బీజతప్తిస్తు మాతాపిత్రపచారతః. ౬
దైవాచ్చ తాభ్యాం కోపో హి సన్నిపాతస్య తాన్యతః,
అసాధ్యాన్యేవమాఖ్యాతాః సర్వే రోగాః కులోద్భవాః. ౭

పైజెప్పబడినసహజము ఉత్తరకాలజము ననురెండువిధములైన యర్శస్సులలో సహజములగు నర్శోరోగములకు వళులకుత్పత్తికారణమైన శుక్రార్తవరూపమగుబీజమునకు సంబంధించినదోషము, అట్టియర్శోరోగమును కల్గించువాతపిత్తకఫములు దుష్టములగుటకు తల్లిదండ్రులయపచారము కారణమగును. అట్టిబీజదోషమువలనను, పూర్వజన్మమున జేసిన

కర్మపరిపాకవశమునను సహజార్శస్సులు కలుగును. పైజెప్పిన కారణములరెండును సన్నిపాతప్రకోపమునకు కారణములగును. కావున అట్టిసన్నిపాతమునసే సహజార్శస్సులు పుట్టును. కావున నయ్యది యసాధ్యము. మరియు సహజములగు నితరవ్యాధు లెవ్వియైనను అవియన్నియు నసాధ్యములే యగును.

ఇచ్చట నీవివరణము నెరుఁగునది:—

అంగప్రత్యంగాదివిభాగములతోఁ గూడినశరీరము పుట్టుటకు తలిదండ్రులయొక్క శుక్లార్తవములు ముఖ్యకారణము. తలిదండ్రులపథ్యాహారవిహారముల జేసినచో వాతపిత్తకఫములు మూడును ప్రకోపమునొంది యర్శోరోగమును గల్గింప సమర్థములై యుండును. అట్టిత్రిదోషసంబంధమునంజేసి వారిశుక్లశోణితములు చెడును. అట్టిశుక్లశోణితములచే గల్గినశరీరమునందలి వళిత్రయములందు నర్శోరోగబీజము సంక్రమించియుండుటంజేసి పుట్టుకతోఁగూడనె యర్శోరోగము సంభవించును. ఇదియె సహజార్శోరోగము. ఇవి వంశపరంపరగ వచ్చుటవలన మిక్కిలి రూఢమూలములై యుండును కావున నసాధ్యములు. ఏరోగములైనను కులక్రమముగ జనించునవియెల్ల నసాధ్యములగును.

### సహజార్శోలక్షణములు.

సహజాని విశేషేణ రూక్షదుర్దర్శనాని చ,
అన్తర్ముఖాని పాండూని దారుణోపద్రవాణి చ. ౭

పైజెప్పినసహజార్శస్సు విశేషముగ రూక్షంబులును, లోనికి ప్రవేశించిన ముఖములుగల్గినవియై చూడ శక్యములుకాక పాండువర్ణంబులై యుండును. మిక్కిలి క్రూరములైన యుపద్రవములు కల్గియుండును.

ఇచ్చట 'విశేషేణ' అని చెప్పుటచేత పైజెప్పినరూక్షాదిలక్షణములు సహజములయందు విశేషముగ నుండుననియు, ఉత్తరకాలమున బుట్టినయర్శస్సులయందు సామాన్యముగ నుండుననియు తెలిసెడి.

### మధ్యకాలమునబుట్టిన యర్శస్సుభేదము.

షోఢాఽన్యాని పృథగ్దోష సంసర్గనిచయాస్రతః,

మధ్యకాలమున జనించునర్శస్సులు వాతపిత్తకఫములచే మూడువిధములును, సంసర్గభేదముచే నొకవిధంబును, సన్నిపాతమున నొకవిధంబును, రక్తముచే నొకవిధంబునై జనించును.

ఇచ్చట సంసర్గమున జనించునవి దోషసంసర్గమున ననేకవిధములుగనున్న, అట్టి దోషములకు రెండింటికి జెప్పినలక్షణములే కలిసియుండునుగాని ప్రత్యేకలక్షణములు

విశేషముగలేదు కావున సంసర్గభేదముల నన్నిటి నొకటిగ పరిగణనము చేసి, వాతికము, పైత్తికము, కఫజము, సంసర్గజము, సాన్నిపాతికము, రక్తజము నని యారువిధములుగ పరిగణనము చేయబడినది.

### శుష్కార్ద్రముల రెండిటివిభాగము.

శుష్కాణి వాతశ్లేష్మభ్యాం ఆర్ద్రాణి త్వస్రపిత్తతః ౯

వాతము చేనైనను కఫము చేనైనను, వాతకఫములసంసర్గము చేనైననుకలిగినయర్శస్సు ద్రవములేక యెండియుండును. రక్తము చేనైనను, పిత్తము చేనైనను ఈరెంటిసంసర్గము చేనైనను కలిగినయర్శస్సులు ఆర్ద్రములై యుండును.

### అర్శోనిదానము-సంప్రాప్తి.

దోషప్రకోపహేతుస్తు ప్రాగుక్తస్తేన సాదితే,
అగ్నౌ మలేఽతినిచితే పునశ్చాతివ్యవాయతః. ౧౦
యానసంక్షోభవిషమకఠినోత్కటకాసనాత్,
వస్తినేత్రాశ్మలోష్టోర్వీతలచేలాదిఘట్టనాత్. ౧౧
భృశం శీతాంబుసంస్పర్శాత్ ప్రతతాఽతిప్రవాహణాత్,
వాతమూత్రశకృద్వేగధారణాత్తదుదీరణాత్. ౧౨
జ్వరగుల్మాతిసారామగ్రహణీశోఫపాండుభిః,
కర్శనాద్విషమాభ్యశ్చ చేష్టాభ్యో యోషితాం పునః. ౧౩
ఆమగర్భప్రపతనాత్ గర్భవృద్ధిప్రపీడనాత్,
ఈదృశైశ్చాపరైర్వాయుః అపానః కుపితో మలమ్. ౧౪
పాయోర్వలీషు సన్ధత్తే తాస్వభిష్యణ్ణ(ణ్ణ)మూర్తిషు,
జాయన్తేఽర్శాంసి

సర్వరోగనిదానాధ్యాయమున వాతాదిదోషప్రకోపకారణములు చెప్పబడినవి. అట్టికారణముల చేతను వాతాదిదోషములు ప్రకోపమునొందినప్పుడు జఠరాగ్ని మందగించును. దానంజేసి భుజింపబడినయాహారము చక్కగ జీర్ణము కాదు. అందువలన మలము మిక్కుటముగ వృద్ధినందును. అట్టియెడ సర్వనిదానోక్త కారణముల చేతను, ఈక్రింద జెప్పబడు అతివ్యవాయాది కారణముల చేతను మాంసాంకురముల బుట్టించుటకు యోగ్యమైన అపానవాతము ప్రకోపమునొంది పైజెప్పినరీతిగ వృద్ధినొందినమలమును గుదస్థానమునందలి మూడువళులయందును జేర్చును. అట్టిమలసంబంధ మధికముగ నిలచియుండుటంజేసి వళులు తడియుచుండును. దానంజేసి మాంసాంకురములు నానాట వృద్ధిబొందును. ఇవియే అర్శస్సు లనబడును. ఇది యర్శోరోగసంప్రాప్తి.

అపానవాతప్రకోపకారణము లెవ్వియన:—అధికముగ స్త్రీసంభోగముజేయుట, గుఱ్ఱములు మున్నగువాహనములపై నెక్కి సవారిచేయుట, సంక్షోభము, విషమంబును కఠినంబును మిక్కిలియున్నకంబు నగుపీట మున్నగునాసనములపై గూర్చుండుట, వస్తియంత్రముయొక్క గొట్టము, రాళ్లు, మట్టిపెళ్లలు, భూమి బట్టలు మున్నగువానిచే గుదస్థానమునయొరుబిడికల్గుట, మిక్కిలి చల్లనైననీళ్ల స్పర్శము గుదస్థానమున విశేషముగ గలుగుట, అధికముగముక్కుట, వాయు మూత్రము పురీషము ఇవి వెడలుచున్నపుడు వానిని వెడలనీయక నిరోధించుట, అట్టి అపానవాత మలమూత్రములు వెడలకయున్నపుడు వానిని బలాత్కారముగ వెడలింప ప్రయత్నపడుట, జ్వరము గుల్మము అతిసారము అజీర్ణము గ్రహణి శోఫ పాండురోగము అనువ్యాధులచే బాధపడి శరీరము కృశించియుండుట, సాహసమున్నగు కృత్యములయందు అవయవములు విషమము లగునట్లు చేష్టలజేయుట, ఇవియన్నియు అపానవాతప్రకోపకారణములు, మరియు స్త్రీలకు గర్భము పూర్తిగాకమునుపె గర్భపాతము కలిగినను, గర్భమువృద్ధి నొందునపుడు బాధకలిగినను, అపానవాతము ప్రకోపించును.

(ఈ కారణములచేతను సర్వరోగనిదానమున జెప్పిన కారణములచేతను మాంసపు మొలకలబుట్టించు సమర్థమైనయపానవాతము ప్రకోపించి పైజెప్పినరీతిగ నర్శోరోగము కలిగించునని ముందు వాక్యములో నన్వయించునది.)

## అర్శస్సులపూర్వరూపము.

తత్పూర్వ లక్షణం మన్దవహ్నితా. ౧౫
విష్టమ్భస్సక్థిసదనం పిండికోద్వేష్టనం భ్రమః,
సాదోఽఙ్గే నేత్రయోశ్శోథః శకృద్భేదోఽథవా గ్రహః. ౧౬
మారుతః ప్రచురో మూఢః ప్రాయో నాభేరధశ్చరన్,
సరుక్ సపరికర్తశ్చ కృచ్ఛ్రాన్నిర్గచ్ఛతి స్వనన్. ౧౭
ఆన్త్రకూజనమాటోపః క్షామతోద్గారభూరితా,
ప్రభూతం మూత్రమల్పావిట్ శ్రద్ధావై ధూమకోఽమ్లకః. ౧౮
శిరఃపృష్ఠోరసాం శూలం ఆలస్యం భిన్నవర్ణతా,
తన్ద్రేన్ద్రియాణాం దౌర్బల్యం క్రోధో దుఃఖోపచారతా. ౧౯
ఆశంకా గ్రహణీదోషపాణ్డుగుల్మోదరేషు చ,

అర్శస్సులుకల్గుటకుముందు జఠరాగ్ని మందగించును. మలము బంధించును. తొడలయందును పిక్కలయందును మెలిబెట్టినట్లు నొప్పికల్గును. ఒడలు తిరుగును. శరీరము నొచ్చును. కనురెప్పలు వాచును. మలము ఉండలై వెడలును, లేక బద్ధగించును.

అపానవాతము మిక్కిలి వృద్ధినొంది తనకృత్యమును (మలప్రవృత్తిని) జేయజాలక తరుచుగ బొడ్డుక్రింద (పొత్తికడుపున) సంచరించుచు నొప్పిని కల్గించుచు గుదమును కత్తిరించువిధముగ బాధగల్గించుచు శబ్దముతోగూడి మిక్కిలి కష్టముగ బైటవెడలును. త్రేపులు కూయును. కడపులో గడబిడగ కలియబెట్టినట్లుండును. శరీరము కృశించును. త్రేనుపులు అధికముగ వెడలును. మూత్ర మధికమును మలము స్వల్పముగ అగును. నోట పొగ వెడలునట్లుండును. పులిత్రేనుపులు వచ్చును. తలయందును వీపునందును రొమ్మునందును శూలమునబొడిచినట్లు పోటుపుట్టును. పనులయం దుత్సాహము లేకుండును. శరీరవర్ణము మారును. చక్షురాదీన్ద్రియములు దానిదానికృత్యములయందు పాటవములేకుండును. క్రోధము కారణములేకయేకల్గును. ఉపచారములజేసికొనుటకు కష్టముగ నుండును. గ్రహణీరోగము పాండురోగము గుల్మము ఉదరరోగమును కల్గినట్లు సందేహింప వానిలక్షణము సూక్ష్మముగ గానబడును. పైజెప్పినవియన్నియుం నర్శస్సులు కల్గుటకు మున్ను కలుగుపూర్వరూపములు.

ఏతాన్యేవ వివర్ధంతే జాతేషు హతనామసు. ౨౦

అర్శస్సులు పూర్తిగ జనించినపిదప పైజెప్పినగ్రహణీరోగము మున్నగువ్యాధులు మూడును అర్శస్సులకంటె నధికములై మిక్కిలి వృద్ధిపొందును.

### అర్శోరోగసామాన్యలక్షణములు.

నివర్తమానో౽పానోహి తైరధోమార్గరోధతః,
క్షోభయన్ననిలానన్యాన్ సర్వేన్ద్రియశరీరగాన్. ౨౧
తథా మూత్రశకృత్పిత్తకఫాన్ ధాతూంశ్చ సాశయాన్,
మృద్నాత్యగ్నిం తతస్సర్వో భవతి ప్రాయశో౽ర్శసః ౨౨
కృశో భృశం హతోత్సాహః దీనః క్షామో౽తినిష్ప్రభః,
అసారో విగతచ్ఛాయః జన్తుజుష్ట ఇవ ద్రుమః. ౨౩
కృత్స్నైరుపద్రవైర్గ్రస్తో యథోక్తై ర్మర్మపీడనైః,
తథా కాసపిపాసాస్యవైరస్యశ్వాసపీనసైః. ౨౪
క్లమాఙ్గభఙ్గవమథుక్షవథుశ్వయథుజ్వరైః,
క్లైబ్యబాధిర్యతైమిర్యశర్కరాశ్మరిపీడితః. ౨౫
క్షామభిన్నస్వరో ధ్యాయన్ ముహుష్ఠీవన్నరోచకీ,
సర్వపర్వాస్థిహృన్నాభిపాయువఙ్క్షణశూలవాన్. ౨౬
గుదేన స్రవతా పిచ్ఛాం పులాకోదకసన్నిభామ్,

విబద్ధముక్తం శుష్కార్ద్రం పక్వామం చాన్తరాన్తరా. ౨౭
పాణ్డుపీతం హరిద్రక్తం పిచ్ఛిలం చోపవేశ్యతే,

పైజెప్పినరీతిగ బుట్టినయర్శస్సులు గుదద్వారము నడ్డగించుటంజేసి యపాన వాతము వెడల తెరువుగానక వెనుకకు మరలి చక్షురాదిసకలేన్ద్రియములయందును శరీరమునందును వ్యాపించియుండు తక్కినప్రాణ, వ్యాన, ఉదాన సమానవాతములను, మలమూత్రపిత్తకఫములను, రసరక్తాదిధాతువులను, ఆమపక్వాద్యాశయములను, వీని నన్నింటిని అల్లకల్లోలముగ కలతనొందించి జఠరాగ్నిని బొత్తుగ మందగింపజేయును. దానంజేసి యాయర్శోరోగపీడితుడు మిక్కిలి కృశతనొందును. ఉత్సాహము కొంచెమైన లేకుండును. దీనుడై నానాట క్షీణించి పురుగులచే నాక్రమింపబడిన గొప్ప వృక్షము సారముచెడి యాధారహితమగుభంగి శరీరమున కొంచెమైన సత్తువలేక కాంతిహీనుడై పైజెప్పబడినగ్రహణీరోగముమున్నగుమర్మభేదకములగు నాయాయుపద్రవముల చేత నాక్రమింపబడును. మరియుం గాసము, దప్పి, నోటిలో నరోచకము, శ్వాసము, పడిసెము, బడలిక, అంగభంగము, వాంతి, తుమ్ములు, వాపు, జ్వరము, నపుంసకత్వము, చెవుడు, తిమిరమగునేత్రరోగము, శర్కరాశ్మరి ఇవిమున్నగు అనేకోపద్రములచేగూడ మిక్కిలి బాధనొంది శుష్కించి భిన్నమైన కంఠస్వరముకలవాడై మిక్కుటమైన చింతచే మనసు నిల్కడలేక అరోచకమునంజేసి మాటిమాటికి నుమియుచు, అన్నికీళ్లయందును ఆస్థులయందును నాభిస్థానమునను గుదస్థానమునను గెజ్జలయందును ఓరువరానిశూల నొప్పిచే బాధింపబడును. గుదమార్గమునుండి పిచ్ఛిలమై అన్నమునుండి వార్చినగంజినీళ్ల వంటి ద్రవము వెడలి స్రవించును. ఒకప్పుడు శుష్కంబును, ఒకప్పుడు ఆర్ద్రంబును, ఒకప్పుడు పక్వంబును, ఒకప్పుడు ఆమంబును పాండుపీతహారితరక్తవర్ణములలో నొకరంగు కల్గినదియు పిచ్ఛిలంబు నైనమలమును ఒకప్పుడు నిబద్ధముగను, ఒకప్పుడు సరళముగను వెడలించును.

## వాతికార్శోలక్షణము.

గుదాఙ్కురా బహ్వనిలాశ్శుష్కాశ్చిమిచిమాన్వితాః. ౨౮
మ్లానాశ్శ్యావారుణాస్స్తబ్ధాః విషమాః పరుషాఃఖరాః,
మిథో విసదృశా వక్రాః తీక్ష్ణా విస్ఫుటితాననాః. ౨౯
బిమ్బీకర్కన్ధుఖర్జూర కార్పాసీఫలసన్నిభాః,
కేచిత్కదమ్బపుష్పాభాః కేచిత్సిద్ధార్థకోపమాః 3౦
శిరఃపార్శ్వాంసకట్యూరువంక్షణాభ్యధికవ్యథాః,
క్షవథూద్గారవిష్టమ్భహృద్గ్రహారోచకప్రదాః. 3౧

కాసశ్వాసాగ్నివైషమ్యకర్ణనాదభ్రమావహాః,
తైరార్తో గ్రథితం స్తోకం సశబ్దం సప్రవాహికమ్. ౩౨
రుక్ఫేనపిచ్ఛానుగతం విబద్ధముపవేశ్యతే,
కృష్ణత్వఙ్నఖవిణ్మూత్రనేత్రవక్త్రశ్చ జాయతే. ౩౩
గుల్మప్లీహోదరాఽష్ఠీలా సంభవస్తత ఏవ చ,

వాతమున గలిగినయర్శోరోగమున గుదాంకురములు ద్రవములేక యెండి చిమచిమయను దురదకలిగి వాడి శ్యామవర్ణంబైనను అరుణవర్ణంబైనను కలిగియుండును. మరియు నవి యొండొంటగలియక స్తంభించి ఒకవిధములేక అడ్డముగ గొన్నియు నిడుపగొన్నియునై పలువిధములుగ వ్యాపించి టేకాకువలె కరకరమనుచు కఠినములై యొకటివలె నింకొకటి యుండక భిన్నరూపములై ధనుస్సువలె వక్రములై దర్భవలె కొసలు వాడి కలిగి చిట్లియుండును. అందు కొన్ని దొండపండువంటి యాకృతి కలిగియుండును. మరికొన్ని రేగుపండ్లవలె గుండ్రములుగనుండును. కొన్ని ఖర్జూరపుపండ్లవలె నిడుపుగనుండును. కొన్ని ప్రత్తికాయలబోలియుండును. కొన్ని కడపపువ్వులవలె నెఱ్ఱనిరంగుకలిగియు, కొన్ని యూవాలవలె సన్ననియాకారము కలిగియుండును, అట్టియర్శస్సులచేత తలయందును ఇరుప్రక్కలయందును, మూపులయందును, నడుమునందును, తొడలయందును, గజ్జలయందును, తక్కినయవయవములయందును, మిక్కిలి తీవ్రమైన బాధ కలిగియుండును. తుమ్ములును త్రేపులును అధికతీవ్రముగ వెడలును. మలము బద్ధగించును. రొమ్మునపట్టినట్లు నొప్పికలుగును. మరియు అరోచకము, కాసశ్వాసములు, కలుగును. జఠరాగ్ని యొకప్పుడు తీవ్రంబును ఒకప్పుడు మందంబునై విషమస్థితి నుండును. కర్ణములయందు నాదము పుట్టును. ఒడలు తిరుగునట్లుండును. అట్టిబాధలచే బీడితుడగు రోగికి గుడగుడయను శబ్దముతోగూడి కఠినంబై బంకతోగూడినమలము మిక్కిలి బాధతో కొంచెముకొంచెముగ వెడలును. అయ్యది మిక్కిలి బలాత్కారముగ ముక్కినపుడు నురుగుతోగూడి వెడలును. మరియు నారోగికి చర్మంబును గోళ్లును మలంబును మూత్రంబును కన్నులును ముఖంబును నల్లగనుండును. ఈ క్రూరవ్యాధిచేత గుల్మంబును, ప్లీహవృద్ధియు, ఉదరంబును, అష్ఠీలయనువాతరోగంబును సంభవించును.

### పైత్తికార్శోలక్షణము.

పిత్తోత్తరా నీలముఖాః రక్తపీతాఽసితప్రభాః. ౩౪
తన్వస్రస్రావిణో విస్రాః తనవో మృదవశ్శ్లథాః,
శుకజిహ్వాయకృత్ఖండజలౌకావక్త్రసన్నిభాః ౩౫
దాహపాకజ్వరస్వేదతృణ్మూర్ఛాఽరుచిమోహదాః,

సోష్మాణో ద్రవనీలోష్ణపీతరక్తామవర్చసః. ౩౬
యవమధ్యాహరిత్పీతహారిద్రత్వఙ్నఖాదయః,

పిత్త మధికముగనుండి కలిగినయర్శస్సులు నల్లనియగ్రములుకలిగి రక్తవర్ణంబులును, పీతవర్ణంబులును నల్లనికాంతియు గలిగియుండును. వానినుండి కొంచెముకొంచెముగ రక్తము స్రవించును. దుర్గంధముకలిగి మిక్కిలి సన్ననివియై మెత్తనై సడలియుండును. ఆయ్యవి చిలుకనాలుకను యకృత్తును జలగనోటిని బోలినయాకారము కలిగియుండును. అట్టి గుదాంకురములు తీవ్రమైనమంటతోఁగూడి పుండగును. ఈవ్యాధియందు జ్వరమువచ్చును. చెమట విశేషముగ బట్టును. దప్పి యధికమగును. మూర్ఛ కలుగును. అరోచకంబును మతిభ్రమంబును కలుగును. వేడికలిగి ద్రవంబునునీలవర్ణంబును ఉష్ణంబును పీతరక్తవర్ణంబును నైన యామములను వెడలును. అట్టి గుదాంకురములు యవలబోలిన మధ్యభాగము కలిగియుండును. చర్మంబును గోళ్లును మున్నగునవి పసుపురంగైనను ఆకుపచ్చనిరంగైనను కలిగియుండును.

కఫజార్శోలక్షణము.

శ్లేష్మోల్బణా మహామూలా ఘనా మన్దరుజస్సితాః. ౩౭
ఉచ్ఛూనోపచితాస్స్నిగ్ధాః స్తబ్ధవృత్తగురుస్థిరాః,
పిచ్ఛిలాస్స్తిమితాశ్శ్లక్ష్ణాః కణ్డ్వాఢ్యాః స్పర్శనప్రియాః. ౩౮
కరీరపనసాస్థ్యాభాః తథా గోస్తనసన్నిభాః,
వంక్షణానాహినః పాయువస్తినాభివికర్తినః. ౩౯
సకాసశ్వాసహృల్లాసప్రసేకారుచిపీనసాః,
మేహకృచ్ఛ్రశిరోజాడ్యశిశిరజ్వరకారిణః. ౪౦
క్లైబ్యాగ్నిమార్దవచ్ఛర్దిరామప్రాయవికారదాః,
వసాభాః సకఫప్రాజ్యపురీషాః సప్రవాహికాః. ౪౧
న స్రవన్తి న భిద్యన్తే పాణ్డుస్నిగ్ధత్వగాదయః,

కఫ మధికముగ ప్రకోపించుటచే గల్గినయర్శస్సులయందు గుదాంకురములు మిక్కిలి లోతున నాటిన వ్రేళ్లుకల్గి దట్టమై స్వల్పమైనబాధతో గూడి తెల్లనైయుండును. మిక్కిలి నిడుదలై స్థూలములై స్నిగ్ధంబులును వట్రువలును చీలలవలె స్తంభించియుండును. మరియు జిగటకల్గి నిశ్చలములై మణులవలె నిగనిగలాడుచు ప్రబలమైన జిలకల్గి చేత స్పృశించినప్పుడు కొంచెము సుఖముగనుండును. అందు కొన్ని వెదురు మోపులబోలె కోమలంబులును, పనసవిత్తులబోలె నునుపుగల్గియుం,గొన్ని ద్రాక్షపండ్లబోలె గుండ్రంబులు నైయుండును, ఈవ్యాధియందు గజ్జలలో నుబ్బియుండును. గుదస్థాన

మునను పొత్తికడుపునను బొడ్డుదగ్గిరను కత్తెరచే కత్తిరించువిధముగ బాధకల్గును. శ్వాసకాసంబులును, ఓకరింతలును, నోటజొల్లుకార్చును. ఆరోచకంబును పీనసయు, ప్రమేహంబును, మూత్రకృచ్ఛ్రంబును, తలబరువును, చలిజ్వరంబును ఇవియన్నియు నుపద్రవరూపమై జనించును. మరియు పురుషత్వము చెడును. జఠరాగ్ని మందగించును. వాంతియగును. ఆమము బహుళముగాగల వ్యాధులుకల్గును. కఫముతోఁగూడి మాంస రసముబోలె మలము విశేషముగ వృద్ధినొందును. అట్టిమలము వెడలునప్పుడు విశేష ముగ ముక్కును. అట్టి గుదాంకురములు పగులవు. అందుండి రక్తము స్రవింపదు. త్వక్కు నేత్రములు నఖములు మూత్రపురీషములును పాండువర్ణములై స్నిగ్ధములుగ నుండును.

## సంసర్గజసన్నిపాతజార్శోలక్షణములు.

సంసృష్టలిఙ్గాస్సంసర్గాత్, నిచయాత్సర్వలక్షణాః ౪౨

వాతపిత్తకఫములలో రెండేసిదోషము లధికముగ ప్రకోపించుటచే గల్గిన (వాత పిత్త, వాతకఫ, పిత్తకఫ) యర్శలయందు ఆయారెండేసి దోషములకు వేరువేరుగ జెప్పినలక్షణములు కలిసియుండును. మూడుదోషములును సమానములుగ ప్రకోపించిన యర్శోరోగము సాన్నిపాతకము. దీనియందు మూడుదోషములకు జెప్పిన లక్షణము లన్నియు సంకరముగ జేరియుండును.

ఇచ్చట నీవిషయము నెఱుంగునది:—అర్శోవ్యాధి సామాన్యముగ త్రిదోష ప్రకోపముననే గల్గును. అందు వాతపిత్తకఫములలో నొక్కటిమాత్ర మధికము ప్రకోపించినచో నేకదోషజమనియు, రెండేసిదోషములధికముగ ప్రకోపించినది ద్విదో షములనియు దోషప్రాబల్యమునుబట్టి నిర్ణయింపబడినది. అన్నియును సమములుగ ప్రకోపించిననాడు సాన్నిపాతికమని చెప్పనగును. ఈవిషయమును వాగ్భటాచార్యులు "బహ్వనిలాః, పిత్తోల్బణాః, శ్లేష్మోల్బణాః" అను అధికవాచకశబ్దములచె సూచించెను.

మరియు నీవ్యాధియందు వాత, పిత్త, కఫములవలెనే రక్తంబును వ్యాధిజనకమై యుండును. త్రిదోషములతో సమానముగ రక్తంబును కారణమనిచెప్పి సుశ్రుతాచా ర్యులు సంసర్గభేదముల నారువిధములుగ పరిగణనము నిట్లుజేసియున్నారు. "అర్శస్సు దృశ్యతే రూపం యదావై దోషయోర్ద్వయోః. సంసర్గం తం విజానీయాత్ సంసర్గష డ్విధస్స్మృతః" వీరిమతమున వాతపిత్తములు, వాతకఫములు, వాతరక్తములు, పిత్త కఫములు, పిత్తరక్తములు, కఫరక్తములు, నని సంసర్గము రెండేసిదోషములలో రక్త మునుగూడ జేర్చి చెప్పడిడినది. ఈ విషయమును గూడ వాగ్భటాచార్యులు "రక్తో ల్బణాః" అను క్రిందివాక్యముచేత సూచించెను.

## రక్తజార్శోలక్షణము.

రక్తోల్బణా గుదే కీలాః పిత్తాకృతిసమన్వితాః,

వటప్రరోహసదృశాః గుఞ్జావిద్రుమసన్నిభాః. ౪౩
తేఽత్యర్థం దుష్టముష్ణం చ గాఢవిట్ప్రతిపీడితాః,
స్రవన్తి సహసా రక్తం తస్య చాతిప్రవృత్తితః. ౪౪
భేకాభః పీడ్యతే దుఃఖైః శోణితక్షయసంభవైః,
హీనవర్ణబలోత్సాహః హతౌజాః కలుషేన్ద్రియః. ౪౫

రక్తమధికముగ ప్రకోపించుటచే గల్గిన యర్శోరోగమున గుదస్థానమున మాంస కీలములు పిత్తమునకు జెప్పిన యాకారముగల్గి వానిలక్షణములు గల్గును మరియు నాగుదాంకురములు కొన్ని వట్టివిగుళ్లిబోలియు కొన్ని పగడములను గురిగింజను బోలినవర్ణంబును ఆకారంబును కల్గియుండును. అట్టి గుదాంకురము మిక్కిలి కఠినంబును ఉష్ణంబును నగు మలము వెడలుటంజేసి దాని యొరుబిడిచేత మిక్కిలి యుష్ణంబును దుష్టంబును నగురక్తము స్రవించును. అట్టి రక్తమధికముగ వెడలుటవలన శరీరమునందలి రక్తమెల్ల నశించి శరీరమంతయు కృశించి రక్తక్షయమునగల్గు నానావిధవ్యాధులచే బాధింపబడి శరీరవర్ణంబును బలంబును ఉత్సాహంబును చెడి ప్రాణములకు ముఖ్యాధారమైన యోజస్సు నశించి యింద్రియము లెల్ల పటుత్వంబుడిగి వ్యాకులములై వర్షాకాలమునందలి కప్పవలె కృశించినశరీరములో పచ్చనైనకాంతికల్గి బాధపడును.

### ఉదావర్తనిదానము, లక్షణములు.

ముద్గకోద్రవజూర్ణాహ్వకరీరచణకాదిభిః,
రూక్షైస్సంగ్రాహిభిర్వాయుః స్వస్థానే కుపితో బలీ. ౪౬
అధోవహాని స్రోతాంసి సంరుధ్యాధః ప్రశోషయః,
పురీషం వాతవిణ్మూత్రసఙ్గం కుర్వీత దారుణమ్. ౪౭
తేన తీవ్రా రుజా కోష్ఠపృష్ఠహృత్పార్శ్వగా భవేత్,
ఆధ్మానముదరావేష్టో హృల్లాసః పరికర్తనమ్ ౪౮
వస్తౌ చ సుతరాం శూలం గణ్డశ్వయథుసంభవః,
పవనస్యోర్ధ్వగామిత్వం తతశ్ఛర్ద్యరుచిజ్వరాః. ౪౯
హృద్రోగగ్రహణీదోషమూత్రసఙ్గప్రవాహికాః,
బాధిర్యతిమిరశ్వాసశిరోరుక్కాసపీనసాః ౫౦
మనోవికారస్తృష్ణాస్రపిత్తగుల్మోదరాదయః,
తేతేచ వాతజా రోగా జాయన్తే భృశదారుణాః. ౫౧
దుర్నామ్నామిత్యుదావర్తః పరమోఽయముపద్రవః,
వాతాభిభూతకోష్ఠానాం తైర్వినాపి సజాయతే. ౫౨

పెసలు, ఆరుకలు, జొన్నలు, వెదురుమొవులు, సెనగలు, ఇవి మున్నగు రూక్షంబులును గ్రాహులునగు పదార్థముల సేవించుటచేత నపానవాతము స్వస్థానమున కుపితమై మిక్కిలి బలమునొంది క్రిందికివ్యాపించు స్రోతోమార్గముల నడ్డగించి క్రిందిభాగముననున్న పురీషము ద్రవము లేక యెండించుచు వాతమూత్ర పురీషముల వెడలనీయక బద్ధగించును. అట్లులు మలాదులు బద్ధగింపబడుటచేత కోష్ఠమునందును వీపునందును హృదయమునందును ఇరుప్రక్కల మిక్కిలి తీవ్రమైన నొప్పికల్గును. కడుపులో నొడవేసినట్టులు బాధకల్గి కడుపుబ్బును. ఓకరింతలు వెడలును. హృదయమున కత్తెరచే కత్తిరించువిధముగ బాధకలుగును. వస్తియందు మిక్కిలిశూలనొప్పి (పోటు) పుట్టును. గండస్థలములయందు, వాపుకల్గును. అపానవాతము పైకి సంచరించును, దానంజేసి వాంతి, అరోచకము, జ్వరము, హృద్రోగము, గ్రహణీదోషము, మూత్రము బద్ధగించుట, ముక్కుట, చెవుడు, కన్నులుగానరాకుండుట, శ్వాసము, తలనొప్పి, కాసము, పడిసెము, మనోవికారము, దప్పి, రక్తపిత్తము, గుల్మము, ఉదరము, ఇవి మున్నగు నాయూవాతరోగములు మిక్కిలిదారుణములైన వ్యాధులు దుర్నామమను ప్రేవులయందు గల్గును. ఇది యుదావర్తమను మిక్కిలి క్రూరమైన యుపద్రవము. పైజెప్పిన యర్శోరోగమున నిది ప్రధానమైన యుపద్రవము, వాతముచే దుష్టమైనకోష్ఠము కలమనుజులకిది పైజెప్పిన యర్శస్సులు లేకున్నను స్వతంత్రముగను సంభవించును.

## అసాధ్యాఽర్శోలక్షణము.

సహజాని త్రిదోషాణి యాని చాభ్యంతరే వలౌ,
స్థితాని తాన్యసాధ్యాని యాప్యన్తేఽగ్నిబలాదిభిః. ౫౩

పైజెప్పిన యర్శోరోగములలో సహజార్శస్సులును, త్రిదోషసన్నిపాతమున గల్గిన యర్శస్సులును, మూడువళులలో లోపలనుండువళియందుకల్గినయర్శస్సులును అసాధ్యములు. జఠరాగ్నిబలము శరీరబలమున్నగునవి చక్కగనుండినచో నాయుశ్శేషముండునంతకాలము పైజెప్పిన యసాధ్యార్శస్సులును యాప్యములగును.

ద్వన్ద్వజాని ద్వితీయాయాం వలౌ యాన్యాశ్రితాని చ,
కృచ్ఛ్రసాధ్యాని తాన్యాహుః పరిసంవత్సరాణి చ. ౫౪

దోషద్వయ సంసర్గముచేబుట్టిన యర్శస్సులును. రెండవవళిలోబుట్టిన యర్శస్సులును, ఒకసంవత్సరమువరకు అనుసరించి బాధించుచుండు అర్శస్సులును మిక్కిలి కష్టముచేసాధింపందగియుండును. (కృచ్ఛ్రసాధ్యములనియర్థము).

బాహ్యాయాం తు వలౌ జాతా న్యేకదోషోల్బణాని చ,
అర్శాంసి సుఖసాధ్యాని నచిరోత్పతితాని చ. ౫౫

బైటనుండు మూడవవళియందుపుట్టిన యర్శస్సులును, ఒకదోషముమాత్ర మధికమైపుట్టిన యర్శస్సులును, ఒక సంవత్సరకాలములోపల పుట్టిన యర్శస్సులును సుఖసాధ్యములు.

## మేఢ్రాదిస్థానముల యర్శోవివరణము.

మేఢ్రాదిష్వపి వక్ష్యన్తే యథాస్వం నాభిజానితు,
గణ్డూపదాస్యరూపాణి పిచ్ఛిలాని మృదూని చ. ౫౮

పైజెప్పినయర్శస్సులు మేఢ్రము, నాసారంధ్రములు, చెవులు మున్నగు స్థలముల యందును కల్గును. వానిస్వరూపలక్షణాదులు ఆయాప్రకరణముల (గుహ్యరోగ నాసారోగ కర్ణరోగాది ప్రకరణముల) యందు వివరింపబడును.

మరియు నాభిస్థానమునబుట్టునవి ఎఱ్ఱలమూతులవంటి యాకారముకల్గి పిచ్ఛిలంబులును మృదువులునై యుండును.

## చర్మకీలములలక్షణము.

వ్యానో గృహీత్వా శ్లేష్మాణం కరోత్యర్శ స్త్వచో బహిః,
కీలోపమం స్థిరఖరం చర్మకీలం తు తం విదుః. ౫౯

సర్వశరీరమున వ్యాపించునట్టి వ్యానవాతము ప్రకోపించి శ్లేష్మమును జేర్చుకొని చర్మమున వెలిప్రక్క నర్శస్సును కల్గించును. అయ్యది యినుపచీలవలె కఠినంబును కఱకుకల్గినదియు నగును. ఇయ్యది చర్మముపైని చీలవలెనుండుటంజేసి చర్మకీలమని చెప్పబడును. ఇది కఫమువలనబుట్టిన అంకురమువలె నుండును.

## వాతాదిచర్మకీలముల లక్షణము.

వాతేన తోదః పారుష్యం పిత్తాదసితరక్తతా,
శ్లేష్మణా స్నిగ్ధతా తస్య గ్రథితత్వం సువర్ణతా. ౬౦

పైజెప్పిన చర్మకీలములు వాతమధికమగుటచే గల్గినచో నవి పగులును. పరుషములగును. పిత్తాధికముగ గల్గినయెడ నల్లనిరంగైనను రక్తవర్ణంబైనను కల్గియుండును. కఫమధికమైనపుడు స్నిగ్ధంబులై శరీరమునకు సమానవర్ణము కల్గి గ్రంథిరూపముగ నుండును.

## అర్శోవ్యాధిక శీఘ్రచికిత్సావశ్యకత.

అర్శసాం ప్రశమే యత్నం ఆశు కుర్వీత బుద్ధిమాన్,
తాన్యాశు హి గుదం బద్ధ్వా కుర్యుర్బద్ధగుదోదరమ్. ౬౧

అర్శస్సులు శీఘ్రముగ చికిత్సజేయక యుపేక్షించినయెడ అవి గుదద్వారము బంధించి బద్ధగుదోదరమను క్రూరవ్యాధిని కల్గించును. కావున నర్శోరోగము కల్గిన వెంటనే బుద్ధిమంతుడగు వైద్యుడు అతిశీఘ్రముగ చికిత్సజేయవలెను.

ఇతి అష్టాఙ్గహృదయనిదానే
సప్తమోఽధ్యాయః.

# అష్టమాధ్యాయము.

అవః: "అర్శోఽతిసారగ్రహణీవికారాః ప్రాయేణ చాన్యోన్యనిదానభూతాః" అను ప్రమాణమునుబట్టి అర్శస్సు, అతిసారము, గ్రహణి అను రోగములు మూడును ఒకటి కొకటి కారణములై యుండును; కావున అర్శోనిదానమును జెప్పినపిదప అతిసారగ్రహణులనిదానము లీయధ్యాయమున జెప్పబడును:—

సూ. అథాతోఽతీసారగ్రహణీరోగయోర్నిదానం వ్యాఖ్యాస్యామః.

అర్శోరోగనిదానమును జెప్పిన పిదప ప్రాయికముగ నతిసారము గ్రహణియు నర్శస్సులచేగూడ కల్గును. కావున అతిసారగ్రహణులనిదానమును జెప్పెదననిభావము.

## అతిసారభేదములు.

దోషైర్వ్యస్తైస్సమస్తైశ్చ భయాచ్ఛోకాచ్చ షడ్విధః,
అతీసారః

వాత-పిత్త-కఫములచే వేరువేరుగను, అన్నింటి సన్నిపాతముచేతను, భయముచేతను, శోకముచేతను జనించుటం జేసి యతిసారము ఆరువిధములగును.

## అతిసారసంప్రాప్తి

స సుతరాం జాయతేఽత్యమ్బుపానతః. ౧
కృశశుష్కామిషాసాత్మ్యతిలపిష్టవిరూఢకైః,
మద్యరూక్షాతిమాత్రాన్నైః అర్శోభిస్స్నేహవిభ్రమాత్, ౨
కృమిభ్యో వేగరోధాచ్చ తద్విధైః కుపితోఽనిలః,
విస్రంసయత్యధోఽబ్ధాతుం హత్వా తేనైవ చానలమ్. 3
వ్యాపద్యానుశకృత్కోష్ఠం పురీషం ద్రవతాం నయన్,
ప్రకల్పతేఽతిసారాయ

అతిసారము ప్రాయికముగ నధికముగ నీళ్లుద్రావుటచేగల్గును. మరియు వ్యాధ్యాదులచే కృశించిన జంతువుల మాంసమునైనను ఎండినమాంసమునైనను భుజించుట, అసాత్మ్యములగు(తన కలవాటునలేని)పదార్థములనైనను, తిలపిష్ట(నువ్వుల తెలికపిండి)మునైనను మొలకలెత్తిన పెసలు మున్నగువానినైనను భుజించుట, మద్యమును ద్రాగుట, జిడ్డులేని యన్నాదుల భుజించుట, మిక్కుటముగ భుజించుట, అర్శస్సులు, ఆముదము

మున్నగు స్నేహద్రవ్యముల వ్యత్యస్తముగ నుపయోగము చేయుట, కృములు, మలమూత్ర వాతముల వేగమును నిరోధించుట, ఈ కారణముల చేతను, ఇవికాక యితరములగు వాత ప్రకోప కారణముల చేతను వాతము ప్రకోపమునొంది శరీరమునందలి యద్ధాతువు చెరచి క్రిందికి వ్యాపింపజేయును. దానివలన జాఠరానలమును చెరిచి కోష్ఠమునందలి పురీషస్థానమునకు సమీపమున పురీషమును ద్రవముగజేసి అతిసారమును గల్గింప సమర్థమగును.

అతిసారపూర్వరూపము.

లక్షణం తస్య భావినః. ౪

తోదో హృద్గుదకోష్ఠేషు గాత్రసాదో మలగ్రహః,
ఆధ్మానమవిపాకశ్చ

అతిసారరోగము కల్గుటకు పూర్వము హృదయమునందును గుదస్థానమునందును కోష్ఠమునందును సూదులబొడిచినవిధముగ పోటుపుట్టును. శరీరముకృశించును. మలము బద్ధగించును. ఆహారము చక్కగ జీర్ణముగాక కడుపుబ్బి గుడగుడయనుచు కడుపుబ్బును. ఇవి యన్నియు నతిసారరోగమునకు పూర్వరూపములు.

వాతికాతిసారలక్షణము.

తత్ర వాతేన విడ్జలమ్. ౫

అల్పాల్పం శబ్దశూలాఢ్యం విబద్ధముపవేశ్యతే,
రూక్షం సఫేనమచ్ఛం చ గ్రథితం వా ముహుర్ముహుః. ౬
తథా దగ్ధగుడాభాసం సపిచ్ఛాపరికర్తికమ్,
శుష్కాస్యో భ్రష్టపాయుశ్చ హృష్టరోమా వినిష్టనన్. ౭

పైజెప్పిన యతిసారభేదము లారిటిలో వాతాఽతిసారమున మలము బద్ధగించి శబ్దముతోగూడి కొంచెముగొంచెముగ నీళ్లవలె వెడలును. లేక రూక్షమై యుండలవలె వేరువేర భిన్నమై నురుగుతోగూడి స్వచ్ఛముగ వెడలును. మరియు నాపలము మాడినబెల్లమువంటి బంకతోగూడి గుదరంధ్రమును కత్తిరించుచు వెడలును. ఈరోగమునందు రోగినోరెండి గుదస్థానము భ్రష్టమై రోమాంచముగల్గి వికారముగ దీనస్వరముతో కూయుచు బాధపడును.

పిత్తాతిసారలక్షణము.

పిత్తేన పీతమసితం హారిద్రం శాద్వలప్రభమ్,
సరక్తమతిదుర్గన్ధం తృణ్మూర్ఛాస్వేదదాహవాన్. ౮
సశూలపాయుసన్తాపం పాకవాన్

పిత్తమునగల్గిన యతిసారమున మలము పీతవర్ణంబైనను నీలవర్ణంబైనను లేక పసుపురంగైన, లేక ఆకుపచ్చనిరంగైనను కల్గి, రక్తముతోఁగూడి మిక్కిలి దుర్గంధమై వెడలును. ఈరోగమునందు దప్పి యధికమగును. మూర్ఛ గ్రమ్మును. చెమటబట్టును. కడుపులోఁ శూలమున బొడిచినట్లు పోటుకల్గును. గుదద్వారమున మంటకల్గి పుండగును.

## కఫజసన్నిపాతజాతిసారలక్షణములు

శ్లేష్మణా ఘనమ్,
పిచ్ఛిలం తన్తుమచ్ఛ్వేతం స్నిగ్ధమామం కఫాన్వితమ్ ౯
అభీక్ష్ణం గురు దుర్గన్ధం విబద్ధమనుబద్ధరుక్,
నిద్రాలురలసోఽన్నద్విట్ అల్పాల్పం సప్రవాహికం ౧౦
సరోమహర్షస్సోత్క్లేశః గురువస్తిగుదోదరః,
కృతేఽప్యకృతసంజ్ఞశ్చ సర్వాత్మా సర్వలక్షణః. ౧౧

కఫజాతిసారమున ఘనమై పిచ్ఛిలంబును శ్వేతవర్ణంబును స్నిగ్ధంబును అపక్వంబునై కఫముతోఁగూడి తీగెవలె నుండునదియు భారముకల్గినదియు దుర్గంధయుక్తంబును నగు మలము మిక్కిలి బాధతోఁగూడి బద్ధగించినట్లు మలము విశేషముగ మాటిమాటికి వెడలును. ఈవ్యాధియందు మనుజుడు మిక్కిలి నిద్రకల్గియుండును. పనులయందలసుడగును. అన్నమునందు ద్వేషముకల్గును. మలము ముక్కినపుడు బలాత్కారముగ కొంచెముకొంచెముగ వెడలును. రోమాంచముకల్గును. ఓకరింతలు వెడలును. పొత్తికడుపు గుదంబును ఉదరంబును మిక్కిలి బరువుగనుండును. మలము వెడలినను వెడలనివానివలె సందేహముకల్గి బాధపడుచుండును.

మరియు సన్నిపాతమునగల్గిన యతిసారమున వాతాదులకు వేరువేరుగ జెప్పిన లక్షణములు కల్గియుండును.

## భయశోకాతిసారలక్షణములు.

భయేన క్షోభితే చిత్తే సపిత్తే ద్రావయేచ్ఛకృత్,
వాయుస్తతోఽతిసార్యేత క్షిప్రముష్ణం ద్రవం ప్లవమ్. ౧౨
వాతపిత్తసమం లిఙ్గైః ఆహుస్తద్వచ్చ శోకజః,

కొన్నికారణములచే మనస్సున మితిలేనిభయముకల్గి దానివలన వాతపిత్తములు ప్రకోపించి మలమును ద్రవముగ జేయును. అట్టి ద్రవరూపమైనమలమును వాతము అతిశీఘ్రముగ వెడలించును. ఆమలము ఉష్ణంబును ద్రవంబును బుడగలతోఁగూడి వెడలును. వాతపిత్తములకు జెప్పిన లక్షణములు మిశ్రముగనుండును. శోకమునగల్గిన యతిసారంబును ఇట్టి లక్షణములు కల్గియుండును.

### ఆతిసారద్వైవిధ్యము.

అతీసారస్సమాసేన ద్విధా సామో నిరామకః. ౧౩
సాసృఙ్నిరస్రః తత్రాద్యే గౌరవాదప్సు మజ్జతి,
శకృద్దుర్గన్ధమాటోపవిష్టమ్భార్తిప్రసేకినః. ౧౪
విపరీతో నిరామస్తు కఫాత్పక్వోఽపి మజ్జతి,

పైజెప్పబడిన ఆరువిధములైన యతిసారంబులును ఆమనిరామంబులు, సాసృక్ నిరస్రములునని రెండువిధములుగ సంగ్రహముగ జెప్పబడును. (ఆమము అపక్వము, నిరామము పక్వమైనది, రక్తముతోగూడినది సాసృక్కు, రక్తములేనిది నిరస్రము). అందు ఆమమైన(పక్వము కాని)మలము భారముచే నీటమునుగును. ఆట్టిదిమిక్కిలిదుర్గంధముతోగూడియుండును. కడుపులో గడగడమనుశబ్దముతో గూడి యుబ్బును. మిక్కిలి బాధకలిగి స్రవించును. నిరామము (పక్వమైన) మలము పైజెప్పిన లక్షణములకు విరుద్ధముగనుండును కఫమునగలుగు నతిసారమున మలముపక్వమైయున్నను నీటమునుగును.

### గ్రహణీరోగలక్షణము.

అతీసారేషు యో నాతియత్నవాన్ గ్రహణీగదః. ౧౫
తస్య స్యాదగ్నివిధ్వంసకరైరన్యస్య సేవితైః,

పైజెప్పినరీతిగ నతిసారరోగము సంభవించినపుడును, అతిసారము నివృత్తించితోడనే మిక్కిలి శ్రద్ధతో పథ్యముగనుండక యపథ్యములగు నాహారవిహారాదులజేసినచో గ్రహణీరోగము సంభవించును. అతిసారరోగము లేక స్వస్థతనున్నప్పుడును జఠరాగ్నిని ధ్వంసముచేయు నజీర్ణకరాదిపదార్థముల సేవించినచో నప్పుడును గ్రహణీరోగము సంభవించును.

### అతిసారమున కన్వర్థత.

సామం శకృన్నిరామం వా జీర్ణే యేనాతిసార్యతే. ౧౬
సోఽతిసారోఽతిసరణాత్ ఆశుకారీ స్వభావతః,

భుజింపబడినయాహారము జీర్ణమైనపిదప మలము ఆమముతోగూడియైనను ఆమరహితముగనైనను ఏవ్యాధిచే నధికముగ బైటవెడలింపబడునో అయ్యది అతిసారము. ఇయ్యది అధికముగ మలమును వెడలింపజేయునది కావున అతిసారమని యన్వర్థముగ జెప్పబడినది. ఈవ్యాధి స్వభావము చేతనే మిక్కిలి శీఘ్రముగ పనిచేయుస్వభావము కలిగియుండును (శీఘ్రముగ జంపుననుట).

### గ్రహణీరోగస్వరూపము.

సామం సాన్నమజీర్ణేఽన్నే జీర్ణే పక్వం తు నైవ వా. ౧౭

అకస్మాద్వా ముహుర్బద్ధం అకస్మాచ్ఛిథిలం ముహుః,
చిరకృద్గ్రహణీదోషః సంచయాచ్చోపవేశయేత్. ౧౮

గ్రహణీరోగమున అన్నము జీర్ణముకాకుండుతరి ఆమరసముతోఁగూడియైనను పక్వముగాని యన్నముతోఁగూడియైనను మాటిమాటికి విరేచనములు ఆకస్మికముగ (కారణము లేకయే) అగును. ఆహారము జీర్ణమైనసమయమున పక్వమైనయన్నముతోఁ గూడియైనను, లేక దానిసంబంధము లేకయైనను పలుమారు విరేచనములగును. మరియుం కారణములేకయే మాటిమాటికి బద్ధగించి పలుమారు విరేచనములగును. లేక కారణము నపేక్షింపకయె శిథిలమై పలుమారు మలము వెడలు. ఈగ్రహణీదోషము చిరకాలము వరకు బాధించును. చిరకాలమునుండి మలము చేరియుండుటచే నీవ్యాధి సంభవించు.

### గ్రహణీరోగభేదములు.

స చతుర్ధా పృథగ్దోషైస్సన్నిపాతాచ్చ జాయతే,

అట్టిగ్రహణీరోగము వాతపిత్తకఫములచే వేరువేరుగను, అన్నింటిసన్నిపాతము చేతను పుట్టును, కావున నాల్గుతెరంగుల నుండును.

### గ్రహణీరోగపూర్వరూపములు.

ప్రాగ్రూపం తస్య సదనం చిరాత్పచనమల్పకః. ౧౯
ప్రసేకో వక్త్రవైరస్యం అరుచిస్తృట్ క్లమో భ్రమః,
ఆనద్ధోదరతా చ్ఛర్దిః కర్ణక్ష్వేడో ఽన్త్రకూజనమ్. ౨౦

గ్రహణీరోగముకల్గుటకు మునుపు జఠరాగ్ని మందగించును. దానివలన చిరకాలమునకు ఆహారముజీర్ణమగును. నోటకొంచెముగ నీరు వెడలును. నోటికిమధురాదిరసములు తెలియవు. అరోచకముకల్గును. దప్పియధికమగును. బడలికకల్గును. చక్రముపై నున్న వానివలె భ్రమముకల్గును. కడుపుబ్బరించును. వాంతియగును. చెవులయందు ధ్వనికల్గును. ప్రేవులు కూయును. ఇవియన్నియుం గ్రహణీరోగమునకు పూర్వరూపములు.

### గ్రహణీరోగసామాన్య లక్షణములు.

సామాన్యం లక్షణం కార్శ్యం ధూమకస్తమకోఽజ్వరః,
మూర్ఛా శిరోరుక్ విష్టమ్భః శ్వయథుః కరపాదయోః. ౨౧

గ్రహణీరోగమున సామాన్యముగ శరీరము కృశించును. నోట పొగవెడలునట్లుండును. మెకము గ్రమ్మును. జ్వరము వచ్చును. మూర్ఛవచ్చును. తలవిశేషముగనొప్పి, మలము బద్ధకముగ వెడలును. మీకాళ్లయందును మీజేతులయందును వాపు కల్గును. ఇవియన్నియుం గ్రహణీరోగసామాన్యముగ సంభవించుసామాన్యలక్షణములు.

### వాతజగ్రహణీరోగలక్షణము.

తత్రానిలాత్తాలుశోషః తిమిరం కర్ణయోస్స్వనః,
పార్శ్వోరువంక్షణగ్రీవారుజాభీక్ష్ణం విషూచికా. ౨౨
రసేషు గృద్ధిః సర్వేషు క్షుత్తృష్ణా పరికర్తికా,
జీర్ణే జీర్యతి చాధ్మానం భుక్తే స్వాస్థ్యం సమశ్నుతే. ౨౩
వాతహృద్రోగగుల్మార్శః ప్లీహపాండుత్వశంకితః,
చిరాద్దుఃఖం ద్రవం శుష్కం తన్వామం శబ్దఫేనవత్. ౨౪
పునఃపునస్సృజేద్వర్చః పాయురుక్ శ్వాసకాసవాన్,

వాతప్రకోపమునఁగల్గిన గ్రహణీరోగమున తాలువులు ఎండును. కన్నులు చీకటి గ్రమ్మినట్లుండును. చెవులయందుధ్వనిపుట్టును. ఇరుప్రక్కలయందును తొడలయందును గజ్జలయందును మెడయందును అధికమునొప్పికల్గును సూదులచేబొడిచినవిధముగ బాధ కల్గి విరేచకము లధికమగును. మధురాది షడ్రసములయందును ఆశపుట్టును, ఆకలియుం దప్పియు నధికమగును. రంపముతోకోసినవిధముగ బాధకల్గును. భుజింపబడినయాహారము జీర్ణమైనపుడు జీర్ణము అగుచుండుసమయమునను కడుపుబ్బును. భుజించినతోడనే కొంచెము సుస్థముగనుండును. వాతవ్యాధియుం, రొమ్మునొప్పియు, గుల్మంబును అర్శో రోగంబును ప్లీహవృద్ధియు పాండురోగంబును కల్గునట్లు సందేహము కల్గును. మరియుం నీవ్యాధియందు ద్రవంబును లేక శుష్కంబును అపక్వంబును నురుగుతోఁగూడినదియునగు మలమును శబ్దముతోఁగూడి మిక్కిలి కష్టముచే చిరకాలమునకు కొంచెముగ వెడలించును. అట్టిమలమును చిరకాలమునకు మాటిమాటికి వెడలించును. గుదస్థానమున అధికమైనబాధ కలుగును శ్వాసకాసములు కల్గును.

### పైత్తికగ్రహణీరోగలక్షణము.

పిత్తేన నీలం పీతాభం పీతాభః సృజతి ద్రవమ్. ౨౫
పూత్యమ్లోద్గారహృత్కణ్ఠదాహారుచితృడర్దితః,

పిత్తజగ్రహణీరోగమునందు నీలవర్ణంబైనను పీతవర్ణంబైనను కల్గి ద్రవముగ మలము వెడలును. శరీరము పచ్చగనుండును. దుర్గంధముతోఁగూడి పుల్లనిత్రేనుపులు వెడలును. హృదయమునందును కంఠమునందును మంటపుట్టును. అరోచకంబును దప్పియు కల్గును.

### కఫజ-సన్నిపాతజగ్రహణీరోగలక్షణములు.

శ్లేష్మణా పచ్యతే దుఃఖమన్నం ఛర్దిరరోచకః. ౨౬
ఆస్యోపదేహనిష్ఠీవకాసహృల్లాసపీనసాః,

హృదయం మన్యతే స్త్యానం ఉదరం స్తిమితం గురు. ౨౭
ఉద్గారో దుష్టమధురః సదనం స్త్రీష్వహర్షణమ్,
భిన్నామశ్లేష్మసంసృష్టగురువర్చః ప్రవర్తనమ్. ౨౮
అకృశస్యాపి దౌర్బల్యం సర్వజే సర్వసంకరః,

కఫమునగల్గిన గ్రహణిరోగమున భుజింపబడినయన్నము మిక్కిలి కష్టముగ జీర్ణమగును. మరియు వాంతియు, అరోచకంబును, కల్గును. కంఠమున కఫము నిలచియుండును. నోటనుమియుండు. కాసంబును ఓకరింతలును కల్గును. పడిసెముపట్టును. రొమ్మున మెలిబెట్టినట్లు బాధకల్గును. కడుపనిశ్చలమై బరువుగనుండును. త్రేనుపులు దుష్టముగను తీపికల్గి వెడలును. శరీరము కృశించును. స్త్రీలవిషయమై యుత్సాహము లేకుండును. మలము ఉండలుగ భిన్నమై కఫముతోగూడక భారముకల్గి వెడలును. శరీరము కృశించకున్నను బలముహీనమగును.

సన్నిపాతమున బుట్టిన గ్రహణీరోగమున పై జెప్పబడిన వాతాదిలక్షణములన్నియు సంకరముగ నుండును.

### అగ్నిభేదముచే గ్రహణీదోషములు.

విభాగేఽజ్ఞస్య యే చోక్తాః విషమాద్యాస్త్రయోఽగ్నయః. ౨౯
తేఽపి స్యుర్గ్రహణీదోషాః సమస్తు స్వాస్థ్యకారణమ్,

సూత్రస్థానమున వాతపిత్తకఫముల యాధిక్యముచే జాఠరాగ్ని విషమ, తీక్ష్ణ, మందభేదములు కల్గియుండుననియు, అట్టి దోషములు సమములైయున్నపుడు సమాగ్ని యనియు అగ్నిభేదములు చెప్పబడినవి. అట్టియగ్నిభేదంబును గ్రహణీదోషంబులనియే యెరుంగునది. మరియు సమాగ్నిస్వస్థతను కారణమగును.

ఇచ్చట నగ్నిభేదములు గ్రహణీరోగములవలె నుండును కాని సంప్రాప్త్యాదులు వీనికి ప్రత్యేకముగ లేవు. కావున నీగ్రహణీరోగములతో నీభేదములను పరిగణనము జేయబడలేదని యెరుంగునది.

### మహారోగములు.

వాతవ్యాధ్యశ్మరీకుష్ఠమేహోదరభగన్దరాః,
అర్శాంసి గ్రహణీత్యష్టౌ మహారోగాస్సుదుస్తరాః. 30

వాతవ్యాధి, అశ్మరి, కుష్ఠము, ప్రమేహము, భగందరము, అర్శోరోగము, గ్రహణి, ఉదరము, ఈయెనిమిదియును మహారోగములు, ఇవి మిక్కిలి దుస్సాధ్యములైయుండును.

ఇత్యష్టాఙ్గహృదయనిదానే అష్టమోఽధ్యాయః.

# నవమాధ్యాయము.

అవ: వస్తిమేఢ్రము గుదము ఇవి మొదలగు నవయవములు గుదస్థానమునందలి యస్థియొక్కరంధ్రము నాశ్రయించియుండును. కావున అతిసారగ్రహణులకును, మూత్రాఘాతమునకును ఆశ్రయములు ఒండొంట సంబాధముకల్గియుండును కావున, అతిసారగ్రహణుల జెప్పినపిదప మూత్రాఘాతనిదానము చెప్పబడును.

**సూ. అథాతో మూత్రాఘాతనిదానం వ్యాఖ్యాస్యామః.**

అతిసారగ్రహణుల జెప్పినపిదప మూత్రాఘాతనిదానము వివరించెదనని యర్థము.

### వస్త్యాదుల కేకసంబంధిత్వము.

వస్తి-వస్తిశిరో-మేఢ్ర కటీ-వృషణ-పాయవః,
ఏకసంబంధనాః ప్రోక్తాః గుదాస్థివివరాశ్రయాః ౧

వస్తి (మూత్రపుతిత్తి,) వస్తిశిరస్సు, మేఢ్రము, కటి (నడుము,) వృషణములు గుదము, ఇవియన్నియు గుదస్థానమునుండి పైకివ్యాపించిన యెముకయందు రంధ్రముల నాశ్రయించియుండును; కావున నివియన్నియు ఒక్క అవయవమును ఆశ్రయించి ఒకదానియందు సంబంధించినవి.

### మూత్రాఘాతసంప్రాప్తి.

అధోముఖోఽపి వస్తిర్హి మూత్రవాహిసిరాముఖైః,
పార్శ్వేభ్యః పూర్యతే సూక్ష్మైః స్యన్దమానైరనారతమ్. ౨
యైస్తైరేవ ప్రవిశ్యైవం దోషాః కుర్వన్తి వింశతిం,
మూత్రాఘాతాన్ ప్రమేహాంశ్చ కృచ్ఛ్రాన్మర్మసమాశ్రయాన్.

వస్తి (మూత్రపుతిత్తి) అధోముఖముగనుండును. అయినను దాని చుట్టు ప్రక్కలను మూత్రమును వహించు సన్నని నరము లుండును. అట్టి సిరలయందలి సూక్ష్మములగు రంధ్రములనుండి యెడలేక మూత్రపుబిందువులు స్రవించుచుండును. జలమధ్యమున నధోముఖముగనుండు క్రొత్తమట్టికుండ నీళ్లచే నిండువిధముగ చుట్టును వ్యాపించి మూత్రమును సూక్ష్మముగ స్రవించుచున్న సిరలనుండి వెడలు మూత్రముచేత ఆసిరలనడుమనుండు మూత్రపుతిత్తినిండును. అందుండి మూత్రము బైటవెడలును. ఇట్లుండ సూక్ష్మరంధ్రములనుండి మూత్రవస్తిలో మూత్రము చేరునపుడు దుష్టములగుదోషములును ఆరంధ్రములనుండియే వస్తియందు ప్రవేశించి యిరువదిమూత్రాఘాతములను, ఇరువది

ప్రమేహములను కల్గించును. ఈవ్యాధులు వస్తిరూపమైన మర్మమున జనించునవి. కావున మిక్కిలి కష్టసాధ్యములగును.

### వాతాదిమూత్రాఘాతలక్షణములు.

వస్తివంక్షణమేఢ్రార్తియుక్తోఽల్పాల్పం ముహుర్ముహుః,
మూత్రయేద్వాతజే కృచ్ఛ్రీ; పైత్తే పీతం సదాహకమ్. ౪
రక్తం వా; కఫజే వస్తిమేఢ్రగౌరవశోఫవాన్,
సపిచ్ఛం సవిబన్ధం చ సర్వైస్సర్వాత్మకం మలైః. ౫

వాత-పిత్త-కఫసన్నిపాతభేదములచే మూత్రాఘాతము నాల్గువిధములు. అందు వాతజమూత్రాఘాతమునందు వస్తియందును గజ్జలయందును మేఢ్రమునందును మిక్కిలి తీవ్రమైనబాధతోఁగూడి కొంచెము కొంచెముగ మాటిమాటికి మూత్రము వెడలును. పిత్తమునకల్గిన మూత్రాఘాతమున పచ్చనై మంటతోఁగూడి మూత్రమును మాటిమాటికి వెడలించును. లేక రక్తమైనను వెడలును. కఫజమూత్రాఘాతమున వస్తియు మేఢ్రంబును భారముకల్గియుండును. వస్తిమేఢ్రములువాచును. మూత్రముపిచ్ఛిలమైబద్ధగించి వెడలును. సన్నిపాతమునగల్గిన మూత్రాఘాతమున పైజెప్పిన లక్షణములన్నియుం కల్గియుండును.

### అశ్మరీసంప్రాప్తి, దానిభేదములు.

యదా వాయుర్ముఖం వస్తేరావృత్య పరిశోషయేత్,
మూత్రం సపిత్తం సకఫం సశుక్రం వా తదా క్రమాత్. ౬
సంజాయతేఽశ్మరీ ఘోరా, పిత్తాద్గోరివ రోచనా,
శ్లేష్మాశ్రయా చ సర్వా స్యాత్

స్వకారణములచేత వాతము ప్రకోపించి వస్తి (మూత్రపుతిత్తి)ద్వారమును అడ్డగించి నపుడు పిత్తముతోనైనను కఫముతోనైనను శుక్రముతోనైనను కూడిన మూత్రమును శుష్కింపజేయును. అట్టియెడ ఆవునకు గోరోచనము కల్గినవిధమున అశ్మరికల్గును. పైజెప్పినరీతిగ వాత-పిత్త-కఫ-శుక్రభేదములచే నీయశ్మరి నాల్గువిధములగును. ఈనాల్గిటిలో వాతాశ్మరిక్రూరమైనది. దానికన్న పిత్తాశ్మరియు, దానికన్న కఫాశ్మరియు, దానికన్న శుక్రాశ్మరియు వరుసగ క్రూరములు. ఈనాల్గిటియందును కఫము అధికమై ప్రధానముగ నుండును.

### అశ్మరీపూర్వరూపము.

అథాస్యాః పూర్వలక్షణమ్. ౭
వస్త్యాధ్మానం తదాసన్నదేశేషు పరితోఽతిరుక్,
మూత్రే చ బస్తగన్ధత్వం మూత్రకృచ్ఛ్రం జ్వరోఽరుచిః. ౮

అట్టి యశ్మరీరోగము కల్గుటకు ముందు మూత్రపుతిత్తి (వస్తి) యుబ్బును. వస్తికి సమీపించినస్థలములయందు మిక్కుటముగ నొప్పిపుట్టును. మూత్రము మేకల మూత్రమువలె వాసనకలిగియుండును. మూత్రము మిక్కిలి కష్టముతో వెడలును. జ్వరము వచ్చును. అరోచకము పుట్టును. ఇవియన్నియును నశ్మరీరోగమునకుముందు కలుగు పూర్వరూపములు.

## అశ్మరీసామాన్యలక్షణములు.

సామాన్యలిఙ్గం రుజ్నాభిసేవనీవస్తిమూర్ధసు,
విశీర్ణధారం మూత్రం స్యాత్ తథా మార్గనిరోధనే. ౯
తద్వ్యపాయాత్సుఖం మేహేత్ అచ్ఛం గోమేదకోపమమ్,
తత్సంక్షోభాత్ క్షతే సాస్రమాయాసాత్ చాతిరుగ్భవేత్. ౧౦

అశ్మరీరోగసామాన్యముగ నీక్రిందచెప్పబడు లక్షణములు కలుగును:—నాభియందును, గుహ్యమునకును నడుమ నుండు సేవనియనునరమునందును వస్తియొక్క ముఖమునందును తీవ్రమైననొప్పి కలుగును. అట్టి యశ్మరిచేత మూత్రమార్గము అడ్డగింపబడినప్పుడు మూత్రము రెండుచీలికలై రెండుధారలుగ వెడలును. అట్టియశ్మరి మూత్రమార్గము నుండి బైటవెడలినప్పుడు మూత్రము సుఖముగ వెడలును. అప్పుడు వెడలు మూత్రము స్వచ్ఛమై గోమేదకపుమణివంటిరంగు కలిగియుండును. అశ్మరియొక్క సంఘర్షణమునం జేసి మూత్రనాళమున పుండైనయెడ మూత్రము రక్తముతోగూడి వెడలును. అట్టి ప్రయాసమువలన మిక్కిలి నొప్పికలుగును. ఇవియన్నియును నశ్మరీరోగమున సామాన్యముగ గలుగు లక్షణములు.

## వాతికాశ్మరీలక్షణము.

తత్ర వాతాద్భృశార్త్యార్తో దన్తాన్ ఖాదతి వేపతే,
మృద్నాతి మేహనం నాభిం పీడయత్యనిశం క్వణన్. ౧౧
సానిలం ముఞ్చతి శకృత్ ముహుర్మేహతి బిన్దుశః,
శ్యావా రూక్షాఽశ్మరీ చాస్య స్యాచ్చితా కణ్టకైరివ. ౧౨

పైజెప్పిన అశ్మరులలో వాతమువలన జనించిన అశ్మరియందు మిక్కిలి తీవ్రమైన నొప్పిచే పీడింపబడి పండ్లు పటపటకొరుకును. బాధకోరువజాలక వణకును. మేఢ్రము చేత మర్దించును. బొడ్డును చేతులతో నొడబెట్టి పిసుకును. అట్టిబాధల కోరువజాలక పలువిధంగుల కూకలిడును. మలమును వాతముతోడి కొంచెముగవిడచును. మాటిమాటికిని మూత్రమును బొట్టుబొట్టుగ వెడలించును. వానికి కలిగిన యశ్మరి శ్యామవర్ణంబును రూక్షంబును నై ముండ్లచే వ్యాప్తమైనట్లు కరకుబారియుండును,

### పైత్తికాశ్మరీలక్షణము.

పిత్తేన దహ్యతే వస్తిః పచ్యమాన ఇవోష్మవాన్,
భల్లాతకాస్థిసంస్థానా రక్తపీతాఽసితాశ్మరీ. ౧౩

పిత్తమునకలిగిన యశ్మరియందు వస్తితో మిక్కుటముగ నోరువ శక్యముగాని మంటపుట్టును. దహింపబడునట్లు వేడి యధికముగనుండును. జీడిగింజవంటి యాకారంబును రక్తపీతవర్ణములైనను నల్లనిరంగైనను కలిగిన యశ్మరి(మూత్రపుకల్లు)పుట్టును.

### కఫజాఽశ్మరీలక్షణము.

వస్తిర్నిస్తుద్యత ఇవ శ్లేష్మణా శీతలో గురుః,
అశ్మరీ మహతీ శ్లక్ష్ణా మధువర్ణాఽథవా సితా. ౧౪

కఫమునగలిగిన యశ్మరీరోగమున వస్తియందు సూదులబొడిచిన విధముగ పోటు పుట్టును. మూత్రమునందలి కల్లు మిక్కిలి చల్లనై వాతపిత్తములకు జెప్పినదానికన్న పెద్దదియై నునుపుకలిగి తేనెవంటిరంగైనను తెల్లనిరంగైనను కలిగియుండును.

### వాతాద్యశ్మరులు బాలురకు సంభవించుననుట.

ఏతా భవన్తి బాలానాం తేషామేవ చ భూయసా,
ఆశ్రయోపచయాల్పత్వాత్ గ్రహణాహరణే సుఖాః. ౧౫

పైజెప్పబడిన వాతికాద్యశ్మరులు మూడును, బాలురకే సంభవించును. ఇయ్యవి బాలురకు జనించుటవలన బాలురకు అశ్మరులకాశ్రయమైన అవయవము మిక్కిలి చిన్నదిగ నుండును. కావున నచ్చటబుట్టు నశ్మరి వృద్ధినొంద నవకాశము లేక చిన్నదిగ నుండును. కావున బాలురకు సంభవించిన యశ్మరి బడిశాది యంత్రసాధనములచే పట్టుకొనుటకును ఆకర్షించి వెలికిదీయుటకును మిక్కిలి సులభముగనుండును.

మరియు నీయశ్మరులు బాలురకు జనించుకారణములు తంత్రాంతరమున నిట్లు చెప్పబడినది:—"తిస్రోఽశ్మర్యో దివాస్వప్నశీలనాఽధ్యశనశీతస్నిగ్ధమధురాహారప్రియత్వాద్బాలానామేవ భవన్తి" (ఈమూడు అశ్మరులును బాలురు సాధారణముగ పగలునిదురించుటచేతను అధ్యశనముచేతను, శీతంబులును స్నిగ్ధంబులును మధురంబులునగు నాహారములయందు మిక్కిలి ప్రీతికలిగియుండుటవలనను బాలురకే ప్రాయికముగ సంభవించును).

### శుక్రాశ్మరీసంప్రాప్తిలక్షణము

శుక్రాశ్మరీ తు మహతాం జాయతే శుక్రధారణాత్,
స్థానాచ్చ్యుతమముక్తం హి ముష్కయోరన్తరేఽనిలః. ౧౬

శోషయత్యుపసంగృహ్య శుక్రం తచ్ఛుక్రమశ్మరీ,
వస్తిరుక్కృచ్ఛ్రమూత్రత్వముష్కశ్వయథుకారిణీ. ౧౭
తస్యాముత్పన్నమాత్రాయాం శుక్రమేతి విలీయతే,
పీడితే త్వవకాశేఽస్మిన్

శుక్రాశ్మరి గొప్పవార్లకు (యౌవనవయసుకలవారికి) సంభవించును. బాలురకు శుక్రము అభివ్యక్తముగా నుండును కావున బాలురకు సంభవించదు. ఇది శుక్రమును బైటవెడలనీయక నిరోధించుటచేగలుగును. హర్షాతిశయముచేత స్వస్థానముండి చలించిన శుక్రమును బైటవెడలనీయక నడుమనే యడ్డగించినయెడల నయ్యది వృషణములనడుమ జేరియుండును. వాతము అచ్చోటనే దానిని శోషింపజేయును. పిమ్మట నాశుక్రము ఘనీభవించి కఠినమై మూత్రనాళమున కడ్డుపడియుండును. అదియే శుక్రాశ్మరి యనబడును. ఈవ్యాధియందువస్తిలో తీవ్రమైననొప్పి పుట్టును. మూత్రము మిక్కిలి కష్టముచే వెడలును. వృషణములయందు వాపుకలుగును. మరియు శుక్రాశ్మరి పుట్టినమాత్రముననే శుక్రాశ్మరిస్థానమున నేమాత్రమభిఘాతము కలిగినను శుక్రమచ్చటికివచ్చి యచ్చటనే లీనమగును.

## శర్కరాలక్షణము.

అశ్మర్యేవ చ శర్కరా. ౧౮
అణుశో వాయునా భిన్నా సా త్వస్మిన్ననులోమగే,
నిరేతి సహ మూత్రేణ ప్రతిలోమే విబధ్యతే. ౧౯

పైజెప్పబడిన యశ్మరియే వాతముచేత నణుమాత్రముగ భేదింపబడిన నయ్యది శర్కర యనబడును. అట్టి శర్కర వాతము అనులోమముగ సంచరించునపుడు మూత్రముతోగూడి బైటవెడలును. వాతము ప్రతిలోమముగ నున్నపుడు బంధింపబడి బైట వెడలకుండును. వాత మనులోమముగ నున్నపుడు శర్కర మూత్రముతోగూడి బైట వెడలును. అశ్మరి వాతము అనులోమముగనున్నను ప్రతిలోమముగనున్నను బైటవెడలదు. ఇదియే అశ్మరికిని శర్కరకును పరస్పరభేదము.

## వాతవస్తిసంప్రాప్తి, లక్షణము.

మూత్రసంధారిణః కుర్యాత్ రుద్ధ్వా వస్తేర్ముఖం మరుత్,
మూత్రసంగం రుజం కణ్డూం కదాచిచ్చ స్వధామతః. ౨౦
ప్రచ్యావ్య వస్తిముద్వృత్తం గర్భాభం స్థూలవిప్లుతమ్,
కరోతి తత్ర రుగ్దాహస్పన్దనోద్వేష్టనాని చ. ౨౧

బిన్దుశశ్చ ప్రవర్తేత మూత్రం వస్తౌ తుపీడితే,
ధారయా ద్వివిధోఽప్యేషః వాతవస్తిరితి స్మృతః. ౨౨
దుస్తరో దుస్తరతరో ద్వితీయః ప్రబలానిలః,

మూత్రము వెడలనున్నపుడు దానివేగమును నిరోధించినచో వాతము ప్రకుపితమై వస్తియొక్క ముఖమును అడ్డగించి మూత్రము వెడలనీయక నిరోధించి తీవ్రమైనబాధను దురదను కల్గించును. ఇయ్యది వాతవస్తియను మూత్రాఘాతము. మరియు పైజెప్పిన మూత్రనిరోధమునంజేసి మిక్కిలి ప్రకోపమునొందిన వాతము వస్తిని స్వస్థానమునుండి తొలగించి యూర్ధ్వముఖముగ జేయును. ఆవస్తియు గర్భాశయమువలె మిక్కిలి స్థూలంబును చంచలంబునైయుండును. వస్తియందు తీవ్రమైన నొప్పియు మంటయు కల్గును. వస్తి యదరును. మెలిపెట్టినవిధముగ బాధకల్గును. ఆవస్తి నుండి మూత్రము బొట్టుబొట్టుగ స్రవించును. వస్తిని చేత పిసికినయెడ మూత్రము అడ్డు లేక ధారాళముగ ధారగ వెడలును. ఇదియు వాతవస్తియను మూత్రాఘాతము. ఈరెంటిలో మొదటజెప్పినది కష్టసాధ్యము. రెండవది యంతకన్న మిక్కిలి కష్టసాధ్యము. రెండవదానియందు వాతము మిక్కిలి ప్రబలముగనుండును. కావున రెండవది కష్టతరమని యెరుంగునది.

## వాతాష్ఠీలా లక్షణము.

శకృన్మార్గస్య వస్తేశ్చ వాయురన్తరమాశ్రితః. ౨౩
అష్ఠీలాభం ఘనం గ్రన్థిం కరోత్యచలమున్నతమ్,
వాతాష్ఠీలేతి సాఽఽధ్మానవిణ్మూత్రానిలసఙ్గకృత్. ౨౪

గుదద్వారమునకును వస్తికినినడుమ వాతము ప్రకుపితమై చేరి ఇనుపడాకలివలె కఠినంబును స్థూలంబునైనగ్రంథిని పైజెప్పినస్థలమున గలిగించును. అయ్యది చంచలముగాక స్థిరమై యున్నతముగ నుండును. అయ్యది వాతాష్ఠీలయని చెప్పనగును. కడుపుబ్బరమును కలిగించు మలము మూత్రవాతముల నడ్డగించును.

## వాతకుండలికా లక్షణము.

విగుణః కుణ్డలీభూతో వస్తౌ తీవ్రవ్యథోఽనిలః,
ఆవిశ్య మూత్రం భ్రమతి సస్తమ్భోద్వేష్టగౌరవః. ౨౫
మూత్రమల్పాల్పమథవా విముఞ్చతి శకృత్సరుజమ్,
వాతకుణ్డలికేత్యేషా

వాతము ప్రకోపమునొంది కుండలాకారముగ సంచరించుచు మిక్కిలి తీవ్రమైన బాధను గలిగించు వస్తియందు జేరి మూత్రమును కలత నొందించును. అట్టి వాతము

స్తంభించి యూర్ధ్వముగ సంచరించుచు మిక్కిలి భారముకలిగియుండును. ఆవాతము పురీషమును వెడలించుచు మూత్రము కొంచెముకొంచెముగ విసర్జించును. ఇయ్యది వాతకుండలికయను మూత్రాఘాతము.

## మూత్రాతీతలక్షణము.

మూత్రం తు విధృతం చిరమ్. ౨౬

న నిరేతి విబద్ధం వా మూత్రాతీతం తదల్పరుక్,

మూత్రమును చిరకాలము నిరోధించినయెడ వాతముచే నడ్డగింపబడి బైటవెడల కుండును. అట్టివాతముచే నొకవేళ వెడలినను బద్ధగించి కొంచెము బాధతోఁగూడి వెడలును. ఇయ్యది మూత్రాతీతమని చెప్పబడును.

## మూత్రజఠరలక్షణము.

విధారణాత్ప్రతిహతం వాతోదావర్తితం యదా. ౨౭

నాభేరధస్తాదుదరం మూత్రమాపూరయేత్తదా,

కుర్యాత్తీవ్రరుజాధ్మాన మపక్తిమలసంగ్రహమ్. ౨౮

తన్మూత్రజఠరం

మూత్రవేగమును నిరోధించుటచేత ప్రకోపమునొందిన వాతము మూత్రము ప్రతిహతమై యూర్ధ్వముగ మలరింపబడి నాభికి క్రిందిభాగమును (పొత్తికడుపును) నిండించును. దానివలన తీవ్రమైన నొప్పికలిగి కడుపుబ్బరించును. ఆహారము జీర్ణము కానోపదు. మలమును వెడలనీయక నిరోధించును. ఇయ్యది మూత్రజఠరమను మూత్రాఘాతము.

## మూత్రోత్సంగలక్షణము.

ఛిద్రవైగుణ్యేనాఽనిలేన వా,

ఆక్షిప్తమల్పం మూత్రం తు వస్తౌ నాలేఽథవా మణౌ. ౨౯

స్థిత్వా స్రవేచ్ఛనైః పశ్చాత్ సరుజం వాఽథవాఽరుజమ్,

మూత్రోత్సఙ్గస్స విచ్ఛిన్నతచ్ఛేషగురుశేఫసః. ౩౦

మూత్రమును విసర్జించునపుడు మూత్రము వెడలు ద్వారముయొక్క దోషముచేనైనను, లేక వాతముయొక్క వైగుణ్యముచేనైనను స్రవించుమూత్రములో కొంచెము అడ్డగింపబడి, వస్తియందైనను, మూత్రము వెడలు నాళమునందైనను, మణియందైనను కొంతసేపు నిలచియుండును, స్రవించుమూత్రములో కొంచెము మూత్రము నిరోధింపబడి నిలచియుండుటంజేసి మేఢ్రము స్థూలమైయుండును. ఇట్లు

కొంతకాలమునిలిచి యామూత్రము నొప్పికలిగియైనను నొప్పిలేకయైనను మరల వెడలును. ఇయ్యది మూత్రోత్సంగమను మూత్రాఘాతము.

## మూత్రగ్రస్థి లక్షణము.

అన్తర్వస్తిముఖే వృత్తః స్థిరోఽల్పస్సహసా భవేత్,
అశ్మరీతుల్యరుక్ గ్రన్థిః మూత్రగ్రన్థిస్స ఉచ్యతే. ३०

వస్తిద్వారముయొక్క లోపక్క వర్తులంబును, కఠినంబును స్వల్పమైనబాధ కలిగినదియునగు గ్రంథికలుగును ఇయ్యది అతిశీఘ్రముగ కలుగును. ఇయ్యదిఅశ్మరివలె చాలబాధల గలిగించును. దీనిని మూత్రగ్రంథియని చెప్పెదరు.

## మూత్రశుక్రలక్షణము.

మూత్రితస్య స్త్రియం యాతో వాయునా శుక్రముద్ధతమ్,
స్థానాచ్చ్యుతం మూత్రయతః ప్రాక్ పశ్చాద్వా ప్రవర్తతే. ३२
భస్మోదకప్రతీకాశం మూత్రశుక్రం తదుచ్యతే,

మూత్రవిసర్జనముచేయ నవసరమైయుండ దానినడ్డుచేసి స్త్రీతో సంభోగించిన మనుజుడు మరల మూత్రమును విడుచునప్పుడు ప్రకోపించిన వాతమునంజేసి స్వస్థానము నుండి చలనమునొందిన శుక్రము మూత్రమునకు ముందైనను వెనుకనైనను బూదికలిసిననీళ్లవలె వెడలును. ఇయ్యది మూత్రశుక్రమని చెప్పబడును.

## విడ్విఘాతలక్షణము.

రూక్షదుర్బలయోర్వాతాత్ ఉదావృత్తం శకృద్యదా. ३३
మూత్రస్రోతోఽనుపర్యేతి సంసృష్టం శకృతా తదా,
మూత్రం విట్తుల్యగంధం స్యాత్ విడ్విఘాతం తదాదిశేత్. ३४

మిక్కిలి రూక్షమైనశరీరము కలవానికిని, బలహీనునకు వాతము ప్రకోపము నొంది పురీషము ఊర్ధ్వముగమరలింపబడి మూత్రద్వారమునజేరును. మూత్రము అట్టి మలసంసర్గమునంజేసి మలమునకు సమానమైన దుర్గంధముతోగూడి వెడలును. ఇదివిడ్విఘాతమను మూత్రాఘాతము.

## ఉష్ణవాతలక్షణము.

పిత్తం వ్యాయామతీక్ష్ణోష్ణభోజనాఽధ్వాతపాదిభిః,
ప్రవృద్ధం వాయునా క్షిప్తం వస్త్యుపస్థార్తిదాహవత్. ३५
మూత్రం ప్రవర్తయేత్పీతం సరక్తం రక్తమేవ వా,
ఉష్ణం పునఃపునః కృచ్ఛ్రాత్ ఉష్ణవాతం వదన్తి తమ్. ३६

వ్యాయామము చేయుట, తీక్ష్ణంబులును ఉష్ణగుణంబులునునగు ద్రవ్యములజేర్చి భుజించుట త్రోవనడచుట, ఎండలోనుండుట, ఇవి మున్నగుకారణములచేత పిత్తము

మిక్కిలి వృద్ధిఁబొంది ప్రకుపితమై వాతముచే నడ్డగింపబడి వస్తియందును మేఢ్రమునందును నొప్పిని మంటను కల్గించి, ఉష్ణంబును పీతవర్ణంబునురక్తముతోఁగూడినదియునగు మూత్రమును మిక్కిలి కష్టముతో మాటిమాటికి వెడలించును. లేక పైజెప్పినబాధల గలిగించి, కేవలమః రక్తమునైన మూత్రస్థానమునుండిమిక్కిలి కష్టముతో వెడలించును. ఇది ఉష్ణవాతమను మూత్రాఘాతము.

### మూత్రక్షయలక్షణము.

రూక్షస్య క్లాన్తదేహస్య వస్తిస్థౌ పిత్తమారుతౌ,
మూత్రక్షయం సరుగ్దాహం జనయేతాం తదాహ్వయమ్. ౩౭

మిక్కిలి రూక్షమైనశరీరముకలవానికిని, మిక్కిలి బడలికఁజెందినవానికిని పిత్తవాతములురెండును వస్తింజేరి నొప్పిని మంటను కలిగించి మూత్రమును అచ్చోటనే క్షీణింపజేయును. ఇయ్యది మూత్రక్షయమనువ్యాధి.

### మూత్రసాదలక్షణము.

పిత్తం కఫో ద్వావపి వా సంహన్యేతేఽనిలేన చేత్,
కృచ్ఛ్రాన్మూత్రం తదా పీతం రక్తం శ్వేతం ఘనం సృజేత్. ౩౮
సదాహం రోచనాశంఖచూర్ణవర్ణం భవేచ్చ తత్,
శుష్కం సమస్తవర్ణం వా మూత్రసాదం వదన్తి తమ్ ౩౯

పిత్తమైనను కఫమైనను రెండుకలిసియైనను ప్రకోపించి వాతముచే నాక్రమింపబడినచో మూత్రము పీతరక్తశ్వేతవర్ణములతో నేదైననొకవర్ణముకలిగిఘనమై మిక్కిలి కష్టముచే వెడలును. వెడలునప్పుడు మిక్కిలిమంటపుట్టించును. మూత్రనాళమున నిలిచిన మూత్రము కాలాన్తరమునఁ బెండి గోరోచనచూర్ణమునుబోలె పచ్చనైనను, శంఖచూర్ణమునుబోలె తెల్లనైనను ఉండును. లేక పైజెప్పిన పీతాదివర్ణములన్నియుం కలిసియుండును. ఇయ్యది మూత్రసాదమని చెప్పబడును.

ఇతి విస్తరశః ప్రోక్తాః రోగాః మూత్రాఽప్రవృత్తిజాః,
నిదానలక్షణైః ఊర్ధ్వం వక్ష్యన్తేఽతిప్రవృత్తిజాః. ౪౦

ఇత్తెరంగున మూత్రము వెడలకయడ్డపడుటచే గల్గు (మూత్రఘాతరూపములగు) రోగములు వానినిదానలక్షణములతో విపులముగ వివరింపబడియె. ఇంక క్రిందియధ్యాయమున మూత్రమధికముగ వెడలు స్వభావముకల ప్రమేహరోగములు (ఇరువదియుం) నిదానలక్షణాదులతో వివరింపబడును.

ఇతి నవమోఽధ్యాయః.

# దశమాధ్యాయము.

అవ: పైజెప్పినరీతిగ సమానస్థానమున పుట్టుటంజేసి యశ్మరీనిదానమును జెప్పిన పిదప ప్రమేహనిదానము చెప్పబడును.

సూ. అథాఽతః ప్రమేహనిదానం వ్యాఖ్యాస్యామః.

అశ్మరీనిదానమును జెప్పినపిదప ప్రమేహనిదానము వివరింపబడును.

## ప్రమేహములవివరణము.

ప్రమేహాః వింశతి స్తత్ర శ్లేష్మతో దశ పిత్తతః,
షట్ చత్వారోఽనిలాత్

ప్రమేహములు ఇరువది; అందు కఫప్రకోపమున బుట్టునవి పది, పిత్తప్రకోపమున గల్గునవి యారు. వాతమున సంభవించునవి నాల్గు.

## ప్రమేహకారణములు.

తేషాం మేదోమూత్రకఫావహమ్. ౧
అన్నపానక్రియాజాతం యత్ప్రాయ స్తత్ప్రవర్తకమ్,
స్వాద్వమ్లలవణస్నిగ్ధగురుపిచ్ఛిలశీతలమ్. ౨
నవధాన్యసురానూపమాంసేక్షుగుడగోరసమ్,
ఏకస్థానాసనరతిః శయనం విధివర్జితమ్. 3

శరీరమునందలి మేదస్సును, మూత్రమును, కఫమును వృద్ధినొందించు నన్నపానంబును పనులును ఏవికలవో అవియన్నియు ప్రాయికముగ మూత్రమును అధికముగ వృద్ధిచేయును. మరియు మధురపదార్థములనైనను పులుపుగల పదార్థములనైనను ఉప్పుకలపదార్థములనైనను స్నిగ్ధ (మిక్కిలిజిడ్డుకల) పదార్థములనైనను పిచ్ఛిలంబులగు పదార్థములనైనను గుణవీర్యస్పర్శములచే శీతలంబులగు పదార్థములనైనను గురుపదార్థములనైనను విశేషముగ సేవించినను; నూతనధాన్యములు మద్యము అనూపదేశమునందలి జంతువులమాంసము చెఱకురసము బెల్లము ఆవుపాలు అనుసీపదార్థముల విశేషముగ నుపయోగించినను, ఒకస్థానముననే కూర్చునియుండుటకు ప్రీతిగల్గియున్నను, శాస్త్రమున జెప్పిన పద్ధతికి విరుద్ధముగ పరుండి యకాలనిద్రానుల సేవించినను పైజెప్పిన ప్రమేహములు సంభవించును.

### కఫప్రమేహసంప్రాప్తి.

వస్తిమాశ్రిత్య కురుతే ప్రమేహాన్ దూషితః కఫః,
దూషయిత్వా వపుఃక్లేదస్వేదమేదోరసామిషమ్. ౪

పైజెప్పబడిన ప్రమేహకారణములచే కఫము దుష్టమై శరీరమును శరీరమునందలి ద్రవమును చెమటను మేదస్సును రసమును మాంసమును వరుసగ చెడగొట్టి వస్తియందు జేరి ప్రమేహమును కల్గించును.

### పిత్తవాతప్రమేహసంప్రాప్తులు.

పిత్తం రక్తమపి క్షీణే కఫాదౌ మూత్రసంశ్రయమ్,
ధాతూన్వస్తిముపానీయ తత్క్షయేఽపి చ మారుతః. ౫

పిత్తము ప్రకుపితమై కఫము మున్నగుసౌమ్యధాతువులు క్షీణించియుండ మూత్రము నాశ్రయించినరక్తమును పైజెప్పిన శరీరక్లేదాదులనుకూడ బొత్తుగ చెరిచి మూత్రమునజేరి ప్రమేహముల గల్గించును.

వాతము ప్రకోపమునొంది ప్రమేహమును గల్గించు ధాతువులను వస్తిసమీపమున జేర్చి ప్రమేహముల గల్గించును. అట్టిధాతువులు క్షీణించినను ప్రమేహముల గల్గించును.

### సాధ్యాఽసాధ్యప్రమేహవివరణము.

సాధ్యయాప్యపరిత్యాజ్యాః మేహాస్తేనైవ తద్భవాః,
సమాఽసమక్రియతయా మహాత్యయతయాపి చ. ౬

పైజెప్పినరీతిగ కఫ-పిత్త-వాతములచే సంభవించిన ప్రమేహములు దాని దానికి జెప్పిన సంప్రాప్తిభేదములచేతనే వరుసగ సాధ్యములును యాప్యములును అసాధ్యములు నైయుండును. (కఫజములు సాధ్యములనియు,పిత్తములు యాప్యములనియు, వాతజములు అసాధ్యములనియు, భావము). ఏలనన:—కఫమునకును దూష్యములగు శరీరక్లేదాదులకును అపతర్పణరూపమైన చికిత్స దోషదూష్యముల రెంటికి సమానముగ నుండును. కావున కఫజప్రమేహములు సాధ్యములైయుండును. పిత్తమునకును దూష్యములైన రసరక్తాదులకు ధర్మము విరుద్ధముగనుండును. కావున నీరెండిటికిని సమానమైన యేకరూపముగనుండు చికిత్స జేయవలనుపడదు. కావున పిత్తమునజనించిన ప్రమేహములు యాప్యములు. వాతమునకు రూక్షతీక్ష్ణాది గుణయుక్తమగు నపతర్పణరూపమైన చికిత్స విరుద్ధము. అయ్యది దూష్యములగు ధాతువులకు హితమగును. కావున నీరెండిటికిని సమానరూపమైన చికిత్స పొసగదు. మరియు ధాతువులనన్నిటి నాశ్రయించి వాతప్రమేహము కల్గును. ఈరెండు కారణములచే వాతప్రమేహములు మిక్కిలి అసాధ్యములు కావున చికిత్స జేయక విడువవలెను.

ఇచ్చట నీవిమర్శనము నెరుంగునది:— "జ్వరే తుల్యర్తుదోషత్వం ప్రమేహే తుల్యదూష్యతా, రక్తగుల్మే పురాణత్వం సుఖసాధ్యస్య లక్షణమ్" అను తంత్రాంతర ప్రమాణముచేత ప్రమేహమున దోషదూష్యములు సమానగుణములై యున్నపుడు సుఖసాధ్యమగును. అవి స్ఫుటమగుచున్నది. ఇట్లుండ కఫజ ప్రమేహములయందు దోషము కఫము. ఇది ప్రకుపితమై మేదస్సును మాంసమును రసధాతువును చెరిచి ప్రమేహముల గల్గించును. ఇచ్చట కఫమునకును దూష్యములగు మేదోమాంసరసములకును గుణములు సమానములై యుండును. కావున కటుతిక్తాది పదార్థముల సేవించుటయను అపతర్పణరూపచికిత్సయు దోషదూష్యముల రెంటికిని అనుకూలములై ఏకరూపచికిత్స జేయవలనుపడును. కావున కఫప్రమేహములు పదియు సుఖసాధ్యములు.

పిత్తప్రమేహములయందు పిత్తము, మేదోమాంసక్లేదరక్తంబులు నాల్గును దూష్యములు. ఇచ్చట మేదోహరములగు కటుకాదిరసములు కల ఔషధాదులు పిత్తమును వృద్ధినొందించును. పిత్తమును శమింపజేయుమధురాదిరసములుగల ఔషధాదులు మేదస్సును వృద్ధినొందించును. కావున దోషదూష్యములు పరస్పరవిరుద్ధగుణములు, ఈరెంటికిని సమానముగ ప్రత్యనీకచికిత్స యెప్పుడును సంభవింపదు కావున పిత్తజ ప్రమేహములాఱును యాప్యములు.

వాతజ ప్రమేహములయందు వాతము దోషము, రసాదిధాతువులు దూష్యములు. వాతమునకు సంతర్పణరూపచికిత్స కామకము. ధాతువులకు అపతర్పణము హితకరము. కావున దోషమున కనుకూలముగ చికిత్సజేయునెడ దూష్యమునకు విరోధమగును. దూష్యముల కనుకూలముగ నపతర్పణము జేయునెడ వాతముత్కటమగును. కావున నీరెండిటికిని సమానముగ చికిత్స యుండబోదు. కావున వాతప్రమేహములు నాల్గును అసాధ్యములు. మరియు నీ ప్రమేహము మహాక్రూరమై యంతకరమగు స్వభావము కల్గియుండును కావున వాతప్రమేహములు మిక్కిలి యసాధ్యములు.

పైజెప్పిన విషయమును తన్త్రాన్తరమున నిట్లుచెప్పిరి:— "సాధ్యాః కఫోత్థా దశ, పిత్తజాష్షడ్యాప్యాః, నసాధ్యః పవనాచ్చతుష్కాః, సమక్రియత్వాద్విషయత్వా న్మహాత్యయత్వాచ్చ యథాక్రమం తే"

### ప్రమేహసామాన్యలక్షణము.

సామాన్యం లక్షణం తేషాం ప్రభూతావిలమూత్రతా,
దోషదూష్యాఽవిశేషేఽపి తత్సంయోగవిశేషతః. ౭
మూత్రవర్ణాదిభేదేన భేదో మేహేషు కల్ప్యతే,

ప్రమేహములయందన్నిటియందును మూత్రము అధికముగ వెడలుటయు, అట్టి మూత్రము కలకబారియుండుటయు సామాన్యముగ వ్యాపించియుండు లక్షణములు. సకలమేహములయందును వాతదిదోషంబులును రసరక్తాదిదూష్యంబులును సమానములుగనె యుండును. అయినను అట్టి దోషదూష్యముల సంయోగభేదమునుబట్టియు, మూత్రముయొక్క వర్ణాదిభేదములబట్టియు, అనేకవిధములుగ భేదములు కల్పింపబడును. (ఈ క్రింద జెప్పబడు ఇక్షుమేహాదులు పదియు కఫముచేత మేదోమాంసాది దూష్యముల నాశ్రయించి జనించును. కావున దోషదూష్యములు సమానములు అయినను అట్టి దోషదూష్యముల సంబంధభేదముచేతను మూత్రవర్ణభేదముచేతను భేదములుకల్గియుండును. పిత్తవాతములకును ఇట్టిభేదముల నెరుంగునది)

### కఫజమేహములు పది; అందుదకమేహము.

అచ్ఛం బహుసితం శీతం నిర్గన్ధముదకోపమమ్. ౭
మేహత్యుదకమేహేన కించిచ్చావిలపిచ్ఛిలమ్,

ఉదకమేహమున మూత్రము మలినములేక స్వచ్ఛమై మిక్కిలి తెల్లనై చల్లనై నీళ్లవలె నెట్టిపరిమళమును లేక వెడలును. ఒకవేళ కొంచెము కలకబారి పిచ్ఛిలముగ గూడ వెడలును.

### ఇక్షుమేహసాంద్రమేహములు.

ఇక్షో రసమివాత్యర్థం మధురం చేక్షుమేహతః. ౮
సాన్ద్రీభవేత్పర్యుషితం సాన్ద్రమేహీ ప్రమేహతః,

ఇక్షుమేహమునందు చెఱకురసమువలె మిక్కిలి మధురమై చెఱకురసమువంటి రంగుకల్గి మూత్రము వెడలును. మూత్రమును ఒకపాత్రమునబట్టి ఒకరాత్రి యంతయును నిలిచినచో మరునాడు చిక్కనైయుండిన నయ్యది సాంద్రమేహము.

### సురామేహపిష్టమేహములు.

సురామేహీ సురాతుల్యం ఉపర్యచ్ఛమధో ఘనమ్. ౧౦
సంహృష్టరోమా పిష్టేన పిష్టవద్బహులం సితమ్,

సుర(మద్యమున)కు సమానమై మూత్రము వెడలిన నది సురామేహము. ఈమూత్రమును రాత్రిపట్టి యునిచినయెడ పైని తేటనై యడుగ మొద్దుగనుండును. ఇది సురామేహమనబడును. పిండివలె తెల్లనై చిక్కగ మూత్రము వెడలిన నయ్యది పిష్టమేహము. ఈమేహమునందు మూత్రము విడచునపుడు రోమాంచము కల్గును.

### శుక్రమేహసికతామేహములు.

శుక్రాభం శుక్రమిశ్రం వా శుక్రమేహీ ప్రమేహతి. ౧౧

**మూత్రేణార్త్ సికతామేహీ సికతారూపిణో మలాన్,**

శుక్రమువలె తెల్లనై చిక్కనైన మూత్రము వెడలినను, లేక శుక్రమే వెడలినను శుక్రమేహ మనబడును. మూత్రము విడచునప్పుడు మూత్రముతోఁగూడ ఇసుకవలె సన్ననికఫములోని యణువులు కలిసి వెడలిన నయ్యది సికతామేహ మనబడును.

### శీతమేహ-శనైర్మేహ-లాలామేహములు.

శీతమేహీ సుబహుశో మధురం భృశశీతలమ్. ౧౨
శనైశ్శనైశ్శనైర్మేహీ మందం మందం ప్రమేహతి,
లాలాతన్తుయుతం మూత్రం లాలామేహేన పిచ్ఛిలమ్. ౧౩

మిక్కిలి తీపికల్గి చల్లనైనమూత్రమును వెడలించిన నయ్యది శీతమేహము. నిలిపినిలిపి మెల్లమెల్లగ మాటిమాటికి మూత్రము వెడలిన నయ్యది శనైర్మేహమన బడును. నోటవెడలు జొల్లువలె తీఁగెలు సాగుచు పిచ్ఛిలమైన మూత్రము మాటిమాటికి వెడలిన నయ్యది లాలామేహమనబడును

### పిత్తజమేహములు ఆరు, అందు క్షార-నీల-కాలమేహములు

గన్ధవర్ణరసస్పర్శైః క్షారేణ క్షారతోయవత్,
నీలమేహేన నీలాభం; కాలమేహీ మషీనిభమ్. ౧౪

గంధముచేతను వర్ణముచేతను రుచిచేతను స్పర్శముచేతను క్షారోదకమునకు సమానమై క్షారోదకమువలె మూత్రము వెడలిన నయ్యది క్షారమేహమనదగును, మూత్రము నీలవర్ణమై వెడలిన నది నీలమేహ మనబడును. మసివలె నల్లనైన మూత్రము వెడలిన కాలమేహ మనబడును.

### హారిద్ర-మాంజిష్ఠ-రక్తమేహములు.

హారిద్రమేహీ కటుకం హరిద్రాసన్నిభం దహత్,
స్నిగ్ధం మాంజిష్ఠమేహేన మంజిష్ఠాసలిలోపమమ్. ౧౫
విస్రముష్ణం సలవణం రక్తాభం రక్తమేహతః,

కారముకల్గి పసుపువలె పచ్చనిరంగుకల్గి నిప్పునకాల్చినవిధముగ బగబగ మండుచు మూత్రము వెడలిన నయ్యది హారిద్రమేహము.

మంజిష్ఠకషాయమువంటి రంగుకల్గి దుర్గంధముతోఁగూడి మూత్రము వెడలిననది మాంజిష్ఠమేహము.

ఉప్పనై రక్తవర్ణముకల్గి దుర్గంధముతోఁగూడి వేడిగ మూత్రము వెడలిన నది రక్తమేహమనబడును. పై జెప్పబడినవి యారును పిత్తమునజనించు మేహములు.

వాతజనితమేహములునాల్గు, అందు వసామేహమజ్జమేహము.

వసామేహీ వసామిశ్రం వసాం వా మూత్రయేన్ముహుః. ౧౬
మజ్జానం మజ్జమిశ్రం వా మజ్జమేహీ ముహుర్ముహుః,

వసయనఁ మాంససారము; అట్టి వసతోఁగూడినమూత్రమునైనను కేవలము వస నైనను మాటిమాటికి విసర్జించిన నయ్యది వసామేహము. మజ్జయన క్రొవ్వు; అట్టి క్రొవ్వు తోఁగూడిన మూత్రమునైనను క్రొవ్వనైనను పలుమరు వెడలించినయెడ మజ్జమేహ మనఁబడును.

హస్తిమేహము.

హస్తీ మత్త ఇవాజస్రం మూత్రం వేగవివర్జితమ్. ౧౭
సలసీకం విబద్ధం చ హస్తిమేహీ ప్రమేహతి,

హస్తిమేహముకలమనుజుఁడు వేగము లేక లసీక (త్వక్కునాశ్రయించిననీరు) తోఁగూడిన మూత్రమును మదించినయేనుఁగువలె నెడలేక బద్ధగించినట్లు విసర్జించును.

మధుమేహము, దానిద్వైవిధ్యము.

మధుమేహీ మధుసమం జాయతే స కిల ద్విధా. ౧౮
క్రుద్ధే ధాతుక్షయాద్వాయౌ దోషావృతపథేఽథవా,

మధుమేహముకలమనుజుఁడు తేనెవలె తీఁకలమూత్రమును వెడలించును. అట్టి మేహము రెండువిధములు; అందు శరీరమునందలి రసరక్తాదిధాతువులు కొన్ని కారణము లచే క్షీణించినదానివలన వాతము ప్రకోపించినపుడుకల్గినది యొకటి, వాతము సంచ రించుమార్గమును దోషము లడ్డగించినపుడు వాతము ప్రకోపమునొంది కల్గించునది రెండవది.

“వాయోర్ధాతుక్షయాత్కోపో మార్గస్యావరణేన చ” అని తంత్రాంతరమున జెప్పబడినప్రకారము రసాదిధాతుక్షయముచేతను, వాతము సంచరించుమార్గమును ఇతరదోషములు అడ్డగించుటచేతను ఈరెండువిధములైన కారణముచే వాతము ప్రకోప మొందును. వాతప్రకోపమునకు కారణము రెండువిధములగుటచే నట్టికారణభేదముచే మధుమేహము రెండువిధములు. ఈవిషయమే పైజెప్పబడినది. కొందరాచార్యులు అట్టి భేదము నంగీకరింపక క్షయజవాతప్రకోపమాత్రమున జనించుటంజేసి మధుమేహ మొక్కవిధమనియె కొందరిమతము. ఈవిషయమును వాగ్భటాచార్యులు “స కిల ద్విధా” అనుచోట “కిల” అను పదముచే సూచించెను.

ఆవృతవాతజమధుమేహలక్షణము.

ఆవృతో దోషలిఙ్గాని సోఽనిమిత్తం ప్రదర్శయేత్. ౧౯
క్షీణః క్షణాత్ క్షణాత్పూర్ణః భజతే కృచ్ఛ్రసాధ్యతామ్,

పైజెప్పిన రెండువిధములైన మధుమేహములలో దోషములు మార్గమునడ్డగించుటచే కుపితమైన వాతమునగల్గిన మధుమేహమునందు వాతము తనమార్గము నడ్డగించిన దోషముయొక్క లక్షణములను కారణములేకయే కనుపరచును. మరియు వాతము చలనస్వభావముకలిగినది కావున క్షణకాలము వస్తిని పూరించక క్షీణించియుండును. క్షణకాలమున వస్తినిండుకు పూరించియుండును. ఇయ్యది కృచ్ఛ్రసాధ్యము. ధాతుక్షయము చేగలిగిన మధుమేహము కేవలము అసాధ్యము.

### ప్రమేహోపేక్షచే గల్గుమధుమేహత్వము.

కాలేనోపేక్షితాస్సర్వే యద్యాన్తి మధుమేహతామ్ ౨౦
మధురం యచ్చ సర్వేషు ప్రాయో మధ్వివ మేహతి,
సర్వేఽపి మధుమేహాఖ్యాః మాధుర్యాచ్చ తనోరతః ౨౧

పైజెప్పబడిన వింశతిమేహములను తగినకాలమున యుక్తమైనచికిత్స జేయక యుపేక్షించినచో నవియన్నియు మధుమేహములుగనే పరిణమించును. ఎలయన:—ప్రమేహము లన్నిటియందును మూత్రమున ప్రాయికముగ తేనెయందువలె తీపికలిగియే యుండును. మరియు శరీరమున స్వభావముగనె తీపి కలిగియుండును. శరీరమునందలి తీపికూడ మూత్రమున సంక్రమించినప్పుడు ప్రమేహములన్నియు మధుమేహములుగ పరిణమించును. (పై జెప్పినవి నాలుగును వాతజప్రమేహములు)

### కఫజప్రమేహోపద్రవములు.

అవిపాకోఽరుచిశ్ఛర్దిః నిద్రా కాసః సపీనసః,
ఉపద్రవాః ప్రజాయన్తే మేహానాం కఫజన్మనామ్. ౨౨

అజీర్ణము, అరోచకము, వాంతి, అతినిద్ర, కాసము, పీనసము, ఇవియన్నియు కఫమునగలిగిన ప్రమేహములయందు కలుగునుపద్రవములు.

### పైత్తికప్రమేహోపద్రవములు.

వస్తిమేహనయోస్తోదః ముష్కావదరణం జ్వరః,
దాహస్తృష్ణాఽమ్లకోమూర్ఛా విడ్భేదః పిత్తజన్మనామ్. ౨౩

వస్తియందును మేఢ్రమునందును సూదులగ్రుచ్చినవిధముగపోటు, వృషణములపై చర్మముపగులుట, జ్వరము, మంట, దప్పి, పులిత్రేనుపులు వెడలుట, మూర్ఛ, మలము ఉండలై వెడలుట, ఇవియన్నియు పిత్తమునజనించిన ప్రమేహములయందు కలుగునుపద్రవములు.

## వాతికప్రమేహములయందు కలుగునుపద్రవములు.

వాతికానాముదావర్తకమ్పహృద్గ్రహలోలతాః,
శూలమున్నిద్రతా శోషః కాసశ్శ్వాసశ్చ జాయతే. ౨౪

ఉదావర్తము, కంపము, హృదయము పట్టినట్లు బాధ, మధురాదిరసములయందు ఆసక్తి, శూలము, నిద్రపట్టకుండుట, శోషము, శ్వాసకాసములు, ఇవియన్నియు వాతమున జనించు ప్రమేహములయందు కలుగు నుపద్రవములు.

## ప్రమేహపిటికలు.

శరావికా కచ్ఛపికా జాలినీ వినతాఽలజీ,
మసూరికా సర్షపికా పుత్రిణీ సవిదారికా. ౨౫
విద్రధిశ్చేతి పిటికాః ప్రమేహోపేక్షయా దశ,
సన్ధిమర్మసు జాయన్తే మాంసలేషు చ ధామసు. ౨౬

శరావిక, కచ్ఛపిక, జాలిని, వినత, అలజి, మసూరిక, సర్షపిక, పుత్రిణి, విదారిక, విద్రధి, అను పదివిధములు ప్రమేహపిటికలు వ్రణవిశేషములు ఇవియన్నియు ప్రమేహములకు సకాలమున చికిత్సజేయక ఉపేక్షించినచో సంధిమర్మములయందును, మిక్కిలి మాంసము బలిసియుండుస్థలములయందును జనించును.

## శరావికాలక్షణము.

అన్తోన్నతా మధ్యనిమ్నా శ్యావా క్లేదరుజాన్వితా,
శరావమానసంస్థానా పిటికా స్యాచ్ఛరావికా. ౨౭

చుట్టు అంచుపొడవుకలిగి యున్నతమైనదుమ నల్లనై శ్యామవర్ణముకలిగి ద్రవంబును నొప్పియుంకలిగి మూకుడువంటి యాకారంబును అంతటియ పరిమాణంబును కలిగినది శరావిక యను ప్రమేహపిటిక.

## కచ్ఛపికాలక్షణము.

అవగాఢార్తినిస్తోదా మహావస్తుపరిగ్రహా,
శ్లక్ష్ణా కచ్ఛపపృష్ఠాభా పిటికా కచ్ఛపీ మతా. ౨౮

మిక్కిలి లోతున నొప్పియు చురుకుచురుక్కునుపోటును కలిగి గొప్పవిశాలమైన స్థలమును ఆధారముగజేసి నునుపుకలిగి తాబేటివీపువలె నడుమ నున్నతమై జనించినది కచ్ఛపిక, తాబేటివలె నుండుటచే నిది కచ్ఛపిక యని చెప్పబడును.

### జాలినీలక్షణము.

స్తబ్ధా సిరాజాలవతీ స్నిగ్ధస్రావా మహాశయా,
రుజానిస్తోదబహులా సూక్ష్మచ్ఛిద్రా చ జాలినీ. ౨౯

స్తంభించి అనేకములగు సిరలచే నావరింపబడి మిక్కిలి స్నిగ్ధమైన పూయాదుల స్రవించుచు గొప్పవిశాలమైనవీపు మున్నగు స్థలములయందు పుట్టి తీవ్రమైననొప్పియు పోటునుకలిగి జల్లెడకంతలవలె ననేకములైన చిన్నరంధ్రములచే వ్యాప్తమైనది జాలిని యనబడును. జాలిని యనజల్లెడ, దానింబోలె గుండ్రనైరంధ్రములుకల్గియుండుటంజేసి యిది జాలిని యనబడును.

### వినతాలక్షణము.

అవగాఢరుజాక్లేదా పృష్ఠే వా జఠరేఽపి వా,
మహతీ పిటికా నీలా వినతా వినతా స్మృతా. ౩౦

నీలవర్ణంబును గొప్పదియునై నడుమచరముగ వంగిన వ్రణము వీపునందైనను కడుపుపైనైనను జనించి మిక్కిలి లోతులో నొప్పియుం జీము మొదలగు ద్రవంబును కలిగినది వినత యనబడును.

### అలజీలక్షణము.

దహతి త్వచముత్థానే భృశం కష్టా విసర్పిణీ,
రక్తకృష్ణాఽతితృట్స్ఫోటదాహమోహజ్వరాఽలజీ. ౩౧

అలజి యనుపిటిక పుట్టుసమయమునందే చర్మమును నిప్పున కాల్చిన విధముగ మంటబుట్టించును.మిక్కిలి కష్టమైనబాధలగలిగించును. ఒకచోటబుట్టి వేరొండుస్థలమున వ్యాపించు స్వభావము కలిగియుండును. రక్తవర్ణంబును కృష్ణవర్ణంబును కలిగియుండును. ఆవ్రణముపై బొబ్బలువ్యాపించియుండును. మిక్కిలి దప్పిని పుట్టించును. అధికమైన తాపంబును మూర్ఛయుం జ్వరంబును కలిగియుండును.

### మసూరికాలక్షణము.

మానసంస్థానయోస్తుల్యా మసూరేణ మసూరికా,

పరిమాణమునందును ఆకారమునందును చిరుసెనగల బోలినది మసూరిక యని చెప్పనగును.

### సర్షపికాలక్షణము.

సర్షపామానసంస్థానా క్షిప్రపాకా మహారుజా. ౩౨
సర్షపా సర్షపాతుల్య పిటికాపరివారితా,

ఆవాలవంటి యాకారంబును పరిమాణంబును కలిగినది సర్షప. ఇయ్యది ఆవాల బోలినబొబ్బలచే వ్యాపింపబడి యతిశీఘ్రముగ పక్వమై మిక్కిలి తీవ్రమైన బాధ కలిగి యుండును.

పుత్రిణీవిదారీలక్షణములు.

పుత్రిణీ మహతీ భూరి సుసూక్ష్మపిటికావృతా. 33
విదారీకందవద్వృత్తా కఠినా చ విదారికా,

పుత్రిణియనునది తక్కిన పిటికలకన్న మిక్కిలిగొప్పది. సూక్ష్మములైన బొబ్బలనేకములచే నావరింపబడియుండును. విదారియనునది నేలగుమ్ముడుగెడ్డవలె గుండ్రనై మిక్కిలి కఠినముగ నుండును.

విద్రధిర్వక్ష్యతేఽన్యత్ర

విద్రధిలక్షణము విపులముగ నీక్రిందియధ్యాయమున ప్రత్యేకముగజెప్పబడును.

కృచ్ఛ్రసాధ్యప్రమేహపిటికలు.

తత్రాద్యం పిటికాత్రయమ్. 34
పుత్రిణీ చ విదారీ చ దుస్సహా బహుమేదసః,

పైజెప్పబడిన పదివిధములైన ప్రమేహపిటికలలో తొలుత జెప్పబడిన శరావిక, కచ్ఛపిక, జాలినియను మూడుపిటికలును, పుత్రిణివిదారియనునవియు, ఈయైదు పిటికలును మేదస్సధికముగ గలవారికి పుట్టును; కావున నివి మిక్కిలి యోరువశక్యములుగాక కృచ్ఛ్రసాధ్యములు.

సాధ్యపిటికలు.

సహ్యాః పిత్తోల్బణాస్త్వన్యాః సమ్భవన్త్యల్పమేదసః 35

తక్కిన వినత, అలజీ, మసూరిక, సర్షపికయను నాలుగుపిటికలును పిత్తంబధికమగుటచేత స్వల్పమైన మేదస్సుకలవారికి జనించును. కావున నీనాల్గును ఓరువదగి సుఖసాధ్యములై యుండును. (విద్రధిలక్షణంబులును సాధ్యాదినిర్ణయంబును క్రింది యధ్యాయమున వివరింపబడును).

పిటికలయందు దోషాధిక్యము.

తాసు మేహవశాచ్చ స్యాత్ దోషోద్రేకో యథాయథమ్,

పైజెప్పబడిన పిటికలయందు ఆయాప్రమేహభేదములబట్టి తదనుసారముగ నాయాదోషము అధికముగనుండును.

(పైజెప్పిన పిటికలకన్నియు త్రిదోషసన్నిపాతముచే గలుగును. అందు వాతప్రమేహములచే గల్గినపిటికలయందు వాతంబును, పిత్తజప్రమేహములచేగలిగిన పిటికల

యందు పిత్తంబును, కఫజప్రమేహములచే గలిగిన పిటికలయందు కఫంబును అధికముగ నుండుననిభావము).

## ప్రమేహసంబంధము లేక పిటికలు జనించు క్రమము.

ప్రమేహేణ వినాప్యేతాః జాయన్తే దుష్టమేదసః 3౬
తావచ్చ నోపలక్ష్యన్తే యావద్వస్తు పరిగ్రహాః,

పైజెప్పిన పిటికలన్నియు ప్రమేహములేకున్నను మేదస్సు దుష్టమైచెడినవారికిని సంభవించును. అట్టి పిటికలు జనించినను ఆయాపిటికలకుజెప్పిన వీపుఉదరము మున్నగు సాధారస్థలముల పూర్తిగ నాక్రమించి వ్యాపించునందాక వానిలక్షణములతో స్ఫుటముగ గానరావు.

## (మూత్రసంబంధమైన) రక్తపిత్తము.

హారిద్రవర్ణం రక్తం వా మేహప్రాగ్రూపవర్జితమ్ 3౭
యో మూత్రయేన్న తం మేహం రక్తపిత్తం తు తద్విదుః,

ప్రమేహములకు జెప్పిన పూర్వరూపములు లేక మూత్రము పసుపురంగైనను ఎరుపురంగైననుకలిగి వెడలినచో నయ్యది ప్రమేహముకాదు. దానిని రక్తపిత్తమని మాత్రము చెప్పనగును.

## ప్రమేహపూర్వరూపములు.

స్వేదోఽఙ్గగన్ధశ్శిథిలత్వమఙ్గే శయ్యాసనస్వప్నసుఖాభిషఙ్గః,
హృన్నేత్రజిహ్వాశ్రవణోపదేహో ఘనాఙ్గతా కేశనఖాఽతివృద్ధిః.
శీతప్రియత్వం గలతాలుశోషః మాధుర్యమాస్యే కరపాదదాహః,
భవిష్యతో మేహగణస్య రూపంమూత్రేఽభిధావన్తి పిపీలికాశ్చ.

పైజెప్పిన యిరువదిప్రమేహములును జనించుటకు మున్ను ఈక్రిందజెప్పబడు పూర్వరూపములు కలుగు:—చెమట విశేషముగబట్టును. (అవయవములన్నియు దుర్గంధముకల్గియుండు సంధిబంధములు శిథిలములగును. పరుండుటకునుకూర్చొనియుండుటకు సుఖముగ నిదురించుటకును మిక్కిలి యభిలాషకలుగును. హృదయమునందును కన్నులయందును నాలుకయందును చెవులయందును మురికి విశేషముగజేరును. అవయవములు మిక్కిలి స్థూలములగును. వెండ్రుకలును గోళ్లును మిక్కిల వృద్ధినొందును. చల్లనియుపచారాదులయందు మిక్కిలి ప్రీతికలుగును. కంఠంబును తాలువులును చిక్కును. నోరు తీపిగనుండును. అరచేతులయందును అరకాళులయందును తీవ్రమైనమంట పుట్టును. మూత్రమును విడచినచోట చీమలు గుంపులుగజేరును. ఇవియన్నియు ప్రమేహములకు పూర్వరూపములు.

ప్రమేహములయందుదోషసంబంధనియమక్రమము.

దృష్ట్వా ప్రమేహం మధురం సపిచ్ఛం
మధూపమం స్యాద్ద్వివిధో విచారః,
సంతర్పణాద్వా కఫసంభవస్స్యాత్
క్షీణేషు దోషేష్వనిలాత్మకో వా. ౪౦

ప్రమేహములయందు మూత్రము తేనెవలె మధురమై బూరుగబంకవలె జిగురు కలిగి వెడలినప్పుడు మందమతియగు వైద్యుడు ఇయ్యది కఫముచేకలిగినదియా? లేక వాతమునకలిగెనా? యని సందేహించి అయ్యది యమితాహారముచేగలిగిన యెడ నప తర్పణ (ఉపవాస)సాధ్యమైన కఫప్రమేహమనియు, కఫాదిదోషములు క్షీణించినపుడు సంతర్పణ సాధ్యమైన వాతప్రమేహములనియు సామాన్యముగ నిర్ణయించును. (గాని యియ్యది విచారదూరము. బుద్ధిమంతులగు వైద్యులు వాతాదులకు జెప్పిన లక్షణముల నన్నిటిని గమనించి యుక్తియుక్తముగ నిర్ణయించవలెగాని, పైజెప్పినవిధముగ సంతర్ప ణాపతర్పణముల మాత్రము గమనించి దోషనిర్ణయము జేయరనుట.)

సాధ్యాసాధ్యవిశేషనిర్ణయము.

సపూర్వరూపాః కఫపిత్తమేహాః
క్రమేణ యే వాతకృతాశ్చ మేహాః,
సాధ్యాః న తే; పిత్తకృతాస్తు యాప్యాః
సాధ్యాస్తు మేదో యది నాతిదుష్టమ్. ౪౧

కఫప్రమేహములును పిత్తప్రమేహములును పైజెప్పిన స్వేదాదిపూర్వరూపము లన్నియు కలిగి జనించి పిమ్మటకూడనవియన్నియు ననువర్తించియున్నచో నసాధ్యము లగును. వాతప్రమేహములు తొలుత కఫప్రమేహములుగను పిమ్మట పిత్తప్రమేహములు గను ఉండి పిమ్మట కొంతకాలమునకు వాతప్రమేహములుగ మారినయెడ నవియు నసా ధ్యములు. అరీతిగనే తొలుత కఫమేహములుగనుండి పిత్తమేహముగ కాలాంతరమున మారిననవియు యాప్యములు, పిత్తప్రమేహములయందు మేదస్సు పూర్తిగ చెడక యున్నచో నవియు సాధ్యములు.

ఇచ్చట నీనిర్ణయము నెరుంగునది:—కఫప్రమేహములు సాధ్యములనియు, పిత్తమేహములు యాప్యములనియు, వాతజములు అసాధ్యములనియు మున్ను సామా న్యముగ జెప్పబడెను. అరీతిగ సాధ్యములగు కఫప్రమేహములును పూర్వరూపము లన్నింటిచే గల్గినప్పుడు అసాధ్యములగును. ఆవిధముగనే యాప్యావస్థనుండు పిత

మేహములు పూర్వరూపములన్నిటిచే గల్గినవి యనసాధ్యములగును. మరియుఁ బ్రమేహములు వాతపిత్తకఫసంబంధములచే వేరువేరుగ స్వతంత్రముగసంభవించును. అటుగాక కఫజము పైత్తికముగను, పిదప వాతికముగను మారుటయుఁ గలదు. ఈవిధముగ దోషక్రమము ననుసరించి జనించిన వాతప్రమేహము తొలుత కఫజనితమగుటచే సాధ్యమని సందేహించెదరేమో యని అట్టి వాతికమయిన ప్రమేహంబును అసాధ్యమని యీ వాక్యముచే నియమింపబడెను. అలాగుననె కఫజము పిత్తప్రమేహముగ మారినను అయ్యదియుఁ యాప్యమగునె కాని కఫసంబంధమునంజేసి సాధ్యము గానోపదు. పైత్తికము సామాన్యముగ యాప్యమైనను మేదస్సు మిక్కిలి చెడకయున్నచో నయ్యది సాధ్యమగును.

(ఏరోగమునందైనను దానికి జెప్పిన పూర్వరూపములన్నియుఁ సంబంధించియున్నచో నవియన్నియుఁ నసాధ్యములని సామాన్యముగ నెరుంగునది.)

ఇతి దశమోఽధ్యాయః.

---

# ఏకాదశాధ్యాయము.

అవతారిక:—పైయధ్యాయమున ప్రమేహపిటికలజెప్పునపుడు వానితోజేరిన విద్రధిలక్షణముల జెప్పక "విద్రధిర్వక్ష్యతేఽన్యత్ర" అని వేరొండుస్థలమున జెప్పెదనని తెలిపెను. కావున అట్టి విద్రధినిదానాదు లీయధ్యాయమున జెప్పబడును.

**సూ. అథాఽతో విద్రధివృద్ధిగుల్మనిదానం వ్యాఖ్యాస్యామః.**

ప్రమేహనిదానానంతరము విద్రధివృద్ధిగుల్మముల నిదానమును జెప్పెదనని భావము.

## విద్రధికారణములు, సంప్రాప్తి, సంఖ్య.

భుక్తైః పర్యుషితాఽత్యుష్ణరూక్షశుష్కవిదాహిభిః,
జిహ్మాశయ్యావిచేష్టాభిస్తైస్తైశ్చాసృక్ప్రదూషణైః ౧
దుష్టత్వఙ్మాంసమేదోఽస్థిస్నావాసృక్కణ్డరాశ్రయః,
యశ్శోఫో బహిరన్తర్వా మహామూలో మహారుజః ౨
వృత్తస్స్యాదాయతో యో వా స్మృతష్షోఢా స విద్రధిః,
దోషైః పృథక్సముదితైః శోణితేన క్షతేన చ. 3

పర్యుషితము (రాత్రియందుంచబడిన యన్నము)ను భుజించినను, మిక్కిలి యుష్ణంబును రూక్షంబును ఎండినదియు, మంటబుట్టించునదియు నైనయన్నాదుల భుజించినను, నిమ్నోన్నతముగనుండు శయ్యపై బరుండినను, వికృతములైన నానావిధచేష్టల జేసినను, రక్తమును జెరచునట్టి యితరకారణముల చేతను చర్మము మాంసము మేదస్సు అస్థి నరములు రక్తము అనునవి చెడినప్పుడు వానినాధారముగ జేసికొని, శరీరమున వెలిప్రక్కనైనను, లోభాగముననైనను వాపుపుట్టును. అయ్యది మిక్కిలి లోతులో మొదలుకల్గి వృత్తముగ (గుండ్రముగ) నైనను నిడుపుగనైననుండును. మిక్కిలి తీవ్రమైన బాధగల్గించును. అయ్యది విద్రధియనబడును. ఆయ్యది వాతపిత్తకఫములచే వేరువేరుగను అన్నింటి సన్నిపాతముచేతను రక్తముచేతను క్షతముచేతను కల్గును, కావున నారువిధములు.

## బాహ్యాన్తర్విద్రధిభేదములు.

బాహ్యోఽత్ర తత్రతత్రాఙ్గే దారుణో గ్రథితోన్నతః,
ఆన్తరో దారుణతరో గమ్భీరో గుల్మవద్ఘనః. ౪
వల్మీకవత్సముచ్ఛ్రాయీ శీఘ్రఘాత్యగ్నిశస్త్రవత్,

పైజెప్పిన కారణములచే బుట్టి శోఫరూపమైనవిద్రధి బాహ్యవిద్రధి యనియు అంతర్విద్రధియనియు రెండువిధములు. అందు శరీరమున వెలిప్రక్క నాభియున్నగు నాయూమాంసలస్థలములయందు మిక్కిలి క్రూరమై గ్రంథిరూపమునొంది యున్నతమైనది బాహ్యవిద్రధి. శరీరమునందు లోభాగమున గుల్మపుగడ్డవలె పైకిగనబడక మిక్కిలి కఠినమైచెదలుపుట్టవలె కోవులుగ మిక్కిలి యున్నతమైయుండునది యంతర్విద్రధి. ఇయ్యది యగ్నిని శస్త్రమును బోలి క్రూరతరమై యతిశీఘ్రముగ బ్రాణముల హింసించి మనుజుని క్షణకాలముననే చంపును.

విద్రధిజనించు స్థానములు

నాభివస్తియకృత్ప్లీహక్లోమహృత్కుక్షివంక్షణే. ౫
స్యాద్వృక్కయోరపానే చ

పైజెప్పినవిద్రధి నాభి, వస్తి, యకృత్తు, ప్లీహము, క్లోమము, హృదయము, కుక్షి, గెజ్జలు, వృక్కములు, గుదస్థానము, అను నీస్థలములలో నెచ్చటనైనను పుట్టును.

వాతవిద్రధిలక్షణము.

వాతాత్తత్రాతితీవ్రరుక్,
శ్యావారుణశ్చిరోత్థానపాకో విషమసంస్థితిః ౬
వ్యధచ్ఛేదభ్రమానాహస్పన్దసర్పణశబ్దవాన్,

వాతప్రకోపమునకల్గిన విద్రధియందు మిక్కిలి తీవ్రమైన బాధకల్గియుండును. అయ్యది శ్యామవర్ణంబైనను అరుణవర్ణంబైనను కల్గి చాలకాలమునకు పైకి తేలును. చాల కాలమునకు పరిపక్వమగును. సమముగనుండక విషమముగనుండును. మిక్కిలి వ్యథ కల్గి ఛేదింపబడినవిధముగ బాధకల్గించును. శరీరము భ్రమగ్రమ్మును. లోపల పూయాదులు నిండియుంటుటంజేసి యుబ్బియుండును. పూయాదుల స్రవించుచు స్థలాంతరమున వ్యాపించు స్వభావము కలిగియుండును. గాలినిండియుండుటంజేసి శబ్దము కల్గియుండును.

పిత్తవిద్రధిలక్షణములు.

రక్తతామ్రాఽసితః పిత్తాత్తృణ్మోహజ్వరదాహవాన్. ౭
క్షిప్రోత్థానప్రపాకశ్చ

పిత్తవిద్రధి రక్తవర్ణంబైనను తామ్రవర్ణంబైనను నల్లనివర్ణంబైనను కలిగి అతిశీఘ్రముగ పైకిపక్వమగును. దీనియందు దప్పి యధికమగును. మూర్ఛగ్రమ్మును. జ్వరము కలుగును. మంట విశేషముగ బుట్టును.

### కఫజవిద్రధిసన్నిపాతవిద్రధిలక్షణములు.

పాణ్డుః కణ్డూయుతః కఫాత్,
సోత్క్లేశశీతకస్తమ్భజృమ్భారోచకగౌరవః. ౮
చిరోత్థానవిదాహశ్చ; సంకీర్ణస్సన్నిపాతతః,

కఫమున జనించు విద్రధి పాండువర్ణమై మిక్కిలి జిలకలిగి చిరకాలమునకు పైకితేలి చిరకాలమునకు పరిపక్వమగును. ఈవ్యాధియందు ఓకరింతలు విశేషముగ వెడలును. ఒడలెల్ల చల్లగనుండును. శరీరము స్తంభించును. ఆవలింతలు విశేషముగ వెడలును. అరోచకముకలుగును. శరీరము బరువుకలిగి యుండును. మరియు సన్నిదోషముల సన్నిపాతమునగలిగిన విద్రధియందు పైజెప్పిన త్రిదోషలక్షణము లన్నియుం కలిసి యుండును.

### వాతాదిజనితబాహ్యాభ్యంతరవిద్రధిభేదములు.

సామర్థ్యాచ్చాత్ర విభజేద్బాహ్యాభ్యన్తరలక్షణమ్. ౯

పైజెప్పబడిన వాతాదివిద్రధి లక్షణములు బాహ్యాభ్యంతరముల రెండిటికిని సమానములు. అందు దారుణదారుణతరభేదములబట్టి బాహ్యాభ్యంతరముల నిర్ణయించునది.

### రక్తజవిద్రధిలక్షణము.

కృష్ణస్ఫోటావృతశ్శ్యావః తీవ్రదాహరుజాజ్వరః,
పిత్తలిఙ్గోఽసృజా బాహ్యః స్త్రీణామేవ తథాఽన్తరః. ౧౦

రక్తవిద్రధి నల్లనిబొబ్బలతో నావరింపబడి శ్యామవర్ణంబై మిక్కిలి తీవ్రమైనమంటయును నొప్పియుం కలిగి జ్వరముతో గూడియుండును. మరియు పిత్తవిద్రధికి జెప్పిన లక్షణములన్నియుం కలిగియుండును. ఈరక్తవిద్రధి పురుషులకు బాహ్యవిద్రధిగ జనించును. రక్తముచే నంతర్విద్రధి స్త్రీలకు మాత్రము కలుగును గాని పురుషులకు ఒకప్పుడును కలుగదు.

### క్షతజవిద్రధిలక్షణము.

శస్త్రాద్యైరభిఘాతేన క్షతే వాఽపథ్యకారిణః,
క్షతోష్మా వాయువిక్షిప్తః సరక్తం పిత్తమీరయన్. ౧౧
పిత్తాసృగ్లక్షణం కుర్యాత్ విద్రధిం భూర్యుపద్రవమ్,

ఆయుధములు మట్టిపెళ్లలు మున్నగువానిచే నభిఘాతముకలిగి దానివలన గాయమైనను, లేక యేదైన నొకవ్రణముకలిగియుండెనపుడు అపథ్యములగు నాహారాదుల జేసినను అట్టిగాయమునుండి యుష్ణము వాయుచే ప్రేరితమై రక్తమును పిత్తమును

ప్రకోపింపజేయును. దానంజేసి విద్రధి కలుగును. ఈవిద్రధియందు పిత్తవిద్రధిలక్షణంబులును రక్తవిద్రధిలక్షణంబులును కలిసి యుండును. మరియు నీవిద్రధియం దుపద్రవము లనేకములు కలుగును. రక్తపిత్తవిద్రధులకంటె నీవిద్రధియం దుపద్రవము లధికముగ నుండుటయే విశేషము

### విద్రధులయందు స్థలభేదముచే గలుగు నుపద్రవములు.

తేషూపద్రవభేదశ్చ స్మృతోఽధిష్ఠానభేదతః. ౧౨
నాభ్యాం హిధ్మా భవేద్వస్తౌ మూత్రం కృచ్ఛ్రేణ పూతి చ,
శ్వాసో యకృతి రోధస్తు ప్లీహ్ని ఉచ్ఛ్వాసస్య తృట్ పునః. ౧౩
గలగ్రహశ్చ క్లోమ్ని స్యాత్ సర్వాఙ్గప్రగ్రహో హృది,
ప్రమోహః తమకః కాసః హృదయే ఘట్టనం వ్యథా. ౧౪
కుక్షిపార్శ్వాన్తరాంసార్తిః కుక్షావాటోపజన్మ చ,
సక్థ్నోర్గ్రహో వంక్షణయోః వృక్కయోః కటిపృష్ఠయోః ౧౫
పార్శ్వయోశ్చ వ్యథా పాయౌ పవనస్య నిరోధనమ్,

పైజెప్పబడిన విద్రధులయందు ఆయావిద్రధి జనించుస్థలవిశేషమును బట్టి యుపద్రవములును పలుదెరంగులై యుండును. ఎట్లనగా:—

నాభియందు కలిగిన విద్రధియందు వెక్కిళ్లు కలుగును. వస్తియందు విద్రధికలిగినపుడు మూత్రము దుర్గంధముతోగూడి మిక్కిలికష్టముచే వెడలును. యకృత్తునకలిగిన విద్రధియందు శ్వాసము తీవ్రముగవెడలును. ప్లీహమునకల్గినవిద్రధియందు శ్వాసము వెడలక ఉచ్ఛ్వాసము సరళముగ వెడలక యడ్డుపడును. క్లోమమునకలిగినవిద్రధియందు గళగ్రహమనురోగంబును దప్పియు కలుగును. హృదయమున గలిగిన విద్రధియందు సర్వావయవములయందును నొప్పియు మూర్ఛయు తమకశ్వాసంబును కాసంబును హృదయమున ఘట్టనము జేసినవిధమున వ్యథయు కల్గును. కుక్షియందువిద్రధికల్గినపుడు కుక్షికిని పార్శ్వమునకును నడుమను అంసలయందును నొప్పికలుగును. కడుపుబ్బును. గజ్జలయందు విద్రధికలిగినయెడ తొడలుపట్టినట్లుండును. వృక్కములయందు విద్రధికలిగినపుడు వీపునందును పార్శ్వములయందును బాధకలుగును. గుదస్థానమునగలిగినయెడ నపానవాతము బంధింపబడును.

### విద్రధులయామపక్వాదిలక్షణములు.

ఆమపక్వవిదగ్ధత్వం తేషాం శోఫవదాదిశేత్. ౧౬

పైజెప్పినవిద్రధులయందు ఆమ-పక్వ-విదగ్ధత్వలక్షణములను శోఫలను జెప్పిన ఆమపక్వాదిలక్షణములబట్టియే యెరుంగునది. (ఆమనున పక్వముగానిది, పక్వమైన

యవస్థను దాటి అతీతమైనది విదగ్ధము. ఈమూటికి లక్షణములను శోఫసామాన్యమునకు జెప్పిన ఆమపక్వాది లక్షణములచేత గమనించవలెనని భావము).

విద్రధులయందుస్రావక్రమము.

నాభేరూర్ధ్వం ముఖాత్పక్వాః ప్రస్రవన్త్యధరే గుదాత్,
ఉభాభ్యాం నాభిజః విద్యాద్దోషం క్లేదాచ్చ విద్రధౌ. ౧౭
యథా స్వం వ్రణవత్

నాభికి పైభాగమున (హృదయాదిస్థానములయందు) బుట్టిన విద్రధిపక్వములై పగిలినయెడ నోటినుండి పూయాదుల స్రవించును. నాభికి క్రిందిభాగమున గుదాదిస్థానములయందుజనించిన విద్రధులు పక్వములై పగిలినయెడ గుదద్వారమునుండి పూయాదులు స్రవించును. నాభిస్థానమునబుట్టిన విద్రధులు పగిలినచో నోటినుండియు గుదద్వారమునుండియు పూయాదులు వెడలును.

మరియు వ్రణరోగమున వాతాదులవలనగలుగు స్రావలక్షణములబట్టి విద్రధులయందును స్రావలక్షణములచే వాతాదిభేదమును నిర్ణయించునది.

అసాధ్యవిద్రధులు.

తత్ర వివర్జ్యః సన్నిపాతజః,
పక్వో హృన్నాభివస్తిస్థో భిన్నోఽన్తర్బహిరేవ వా ౧౮
పక్వశ్చాన్తస్స్రవేత్ వక్త్రాత్ క్షీణస్యోపద్రవాన్వితః,

పైజెప్పిన విద్రధిభేదములలో సన్నిపాతమునగలిగినది యసాధ్యముకావున చికిత్స జేయందగదు.హృదయమందును నాభియందును వస్తియందును బుట్టిన విద్రధి పగిలినచో నదియు నసాధ్యము. అంతర్విద్రధి లోపలనే పగిలినను, బహిర్విద్రధి బైటపగిలినదియు నసాధ్యము. అంతర్విద్రధిపగిలి నోటినుండి పూయాదుల స్రవించిన నసాధ్యము, ధాతువులు క్షీణించిన వానికి ఉపద్రవములతోగూడి జనించిన విద్రధియు నసాధ్యము.

స్తనవిద్రధి సంప్రాప్తిలక్షణములు.

ఏవమేవ స్తనసిరాః వివృతాః ప్రాప్య యోషితామ్. ౧౯
సూతానాంగర్భిణీనాంవా సంభవేచ్ఛ్వయథుర్ఘనః,
స్తనే సదుగ్ధేఽదుగ్ధేవా బాహ్యవిద్రధిలక్షణః. ౨౦
నాడీనాం సూక్ష్మవక్త్రత్వాత్ కన్యానాం తు న జాయతే,

విద్రధిసంప్రాప్తియందు జెప్పబడిన విధముగ పర్యుషితాది భోజనములచేతను రక్తమును జేరుచు నాయాకారణములచేతను స్త్రీలయొక్క స్తనములయందలి రంధ్రములతెరిచికొనియున్న సిరలనుజేరిచి బాహ్యవిద్రధి లక్షణములతోగూడినవాపును కలిగించును.

ఇయ్యది ప్రసవించిన స్త్రీలకైనను గర్భిణులుగనున్న స్త్రీలకైన స్తనములయందు స్తన్యమున్ననులేకున్నను వారిస్తనములయందలి సిరలు రంధ్రములు తెరచికొనియుండును కావున అట్టిస్త్రీలకే సంభవించును. కన్యకలకు స్తనములసిరలు మిక్కిలి సూక్ష్మములైయుండును. కావున కన్యకల కీవాపు కలుగదు. ఇదియే స్తనవిద్రధి యనబడును.

వృద్ధినిదానము, సంప్రాప్తి.

క్రుద్ధో రుద్ధగతి ర్వాయుః శోఫశూలకరశ్చరన్. ౨౧
ముష్కౌ వంక్షణతః ప్రాప్య ఫలకోశాఽభివాహినీః,
ప్రపీడ్య ధమనీర్వృద్ధిం కరోతి ఫలకోశయోః. ౨౨

వాతము తాను సంచరించుమార్గములు ఇతరదోషములచే నడ్డగింపబడినయెడ మిక్కిలి ప్రకోపమునొంది శోఫమును నొప్పిని పుట్టించుచు నొకచోట నిల్కడలేక చంచలస్వభావముకలిగి గెజ్జలనుండి యండకోశములజేరి అట్టి యండకోశములవహించు ధమనుల బాధించి యండములవాపు కలిగించి నానాట ముష్కముల వృద్ధినొందించును ఇయ్యది యండవృద్ధి యనబడును.

వృద్ధిరోగభేదములు.

దోషాస్ర మేదోమూత్రాన్త్రైః స వృద్ధిస్సప్తధా గదః,
మూత్రాన్త్రజావప్యనిలాత్ హేతుభేదస్తు కేవలమ్. ౨౩

వాత-పిత్త-కఫములు, రక్తము, మేదస్సు, మూత్రము, అంత్రము, అనునీయేడిటిచేత జనించుటంజేసి వృద్ధి యేడువిధములు. మూత్రమును అంత్రమును ఆశ్రయించి కల్గు వృద్ధిరోగంబును వాతముచేతనే కలుగును. మూత్రాన్త్రములు రెండును కేవలము కారణమాత్రములుగ నుండును.

ఇచ్చట నీవిషయము నెరుంగునది:—వాత పిత్త కఫములచేతను రక్తముచేతను వేరువేరుగ వృద్ధిరోగము కలుగును. మరియు రక్తమును మేదస్సును రెండును దూష్యములు.అందు రక్తము నాశ్రయించునది పిత్తముచేతను,మేదస్సు నాశ్రయించునది కఫముచేతను కలుగును, వాతము ప్రకోపించిమూత్రమును అంత్రములను జేరి కలిగించినవృద్ధిరోగము మూత్రజమనియు, అంత్రజమనియు చెప్పబడును. రక్తము మేదస్సు మూత్రము అంత్రములు అను స్థానముల నాశ్రయించి జనించుటంజేసి రక్తజము అను మొదలగు సంజ్ఞాభేదములు కలిగెనని భావము.

వాతజవృద్ధి.

వాతపూర్ణదృతిస్పర్శో రూక్షో వాతాది హేతుకమ్,

వాతమునజనించువృద్ధిరోగమున నండకోశము గాలిచేనిండిన తోలుతిత్తివలె నుబ్బి తాకినప్పుడు నునుపుకలిగియుండును. జిడ్డులేక రూక్షముగ నుండును. కారణము లేకయే నొప్పి కలిగియుండును.

## పిత్తజవృద్ధి.

పక్వోదుమ్బరసంకాశః పిత్తాద్దాహోష్మపాకవాన్. ౧౮

పండిన మేడిపండువంటిరంగును ఆకారమును గలిగి మంటయును వేడియు కలిగి పుండగునది పిత్తమునగలిగిన వృద్ధిరోగము.

## కఫజవృద్ధి.

కఫాచ్ఛీతో గురుస్స్నిగ్ధః కణ్డూమాన్ కఠినో౽ల్పరుక్,

అండకోశము చల్లనై గొప్పదియు స్నిగ్ధంబును దురదకలిగినదియు కఠినంబునై స్వల్పమైన బాధకలిగినది కఫమునగలిగిన వృద్ధిరోగమని యెఱుంగునది.

## రక్తజవృద్ధి.

కృష్ణస్ఫోటావృతః పిత్తవృద్ధిలిఙ్గశ్చ రక్తజః. ౧౯

రక్తముచేగలిగిన వృద్ధిరోగమున నండకోశము నల్లని బొబ్బలతోగూడి పిత్తవృద్ధికి జెప్పినలక్షణములతో సమానములైన లక్షణములు కలిగియుండును.

## మేదోజవృద్ధి.

కఫవన్మేదసా వృద్ధిః మృదుస్తాలఫలోపమః,

కఫవృద్ధికిజెప్పిన లక్షణములతో గూడి మెత్తనై తాటిపండువంటి గుండ్రని యాకారముకలిగినది మేదస్సునగలిగిన వృద్ధిరోగము.

## మూత్రజనిత అండవృద్ధి.

**మూత్ర**ధారణశీలస్య **మూత్ర**జః స తు గచ్ఛతః. ౨౦
అమ్భోభిః పూర్ణదృతివత్ క్షోభం యాతి సరుఙ్మృదుః,
**మూత్ర**కృచ్ఛ్రమధస్తాచ్చ వలయం ఫలకోశయోః. ౨౧

మూత్రమును విసర్జింపవలసిన సమయములయందు దానివేగమును నిరోధించి వెడలనీయక యడ్డుపరచు స్వభావముకలిగినవానికి దానివలన నండవృద్ధి కలుగును. ఈవృద్ధిరోగమునందు అండకోశము జలముచేనిండిన తోలుతిత్తివలె నడచునపుడెల్ల కదలుచుండును. నొప్పితోగూడి మెత్తగనుండును. మూత్రము మిక్కిలి కష్టముతో వెడలును. అండకోశముల క్రింద వలయమువలె గుండ్రముగనుండును. ఇది మూత్రజ వృద్ధిరోగము.

### అంత్రవృద్ధిలక్షణము.

వాతకోపిభిరాహారైః శీతతోయావగాహనైః,
ధారణేరణభారాధ్వవిషమాఙ్గప్రవర్తనైః. ౨౮
క్షోభణైః క్షుభితోఽన్యైశ్చ క్షుద్రాన్త్రావయవం యదా,
పవనో విగుణీకృత్య స్వనివేశాదధో నయేత్,
కుర్యాద్వంక్షణసన్ధిస్థో గ్రన్థ్యాభం శ్వయథుం తదా. ౨౯
ఉపేక్ష్యమాణస్య చ ముష్కవృద్ధిం
ఆధ్మానరుక్ స్తమ్భవతీం స వాయుః,
ప్రపీడితోఽన్తస్స్వనవాన్ ప్రయాతి
ప్రధ్మాపయన్నేతి పునశ్చ ముక్తః. ౩౦
అన్త్రవృద్ధిరసాధ్యోఽయం వాతవృద్ధిసమాకృతిః,

వాతమును ప్రకోపింపజేయు నాహారపదార్థముల సేవించుటచేతను, చల్లనినీళ్ల యందు మునుగుటచేతను, వాతమూత్రపురీషముల వేగమును నిరోధించుటచేతను, అయ్యవి వెడలకున్నపుడు వానిని బలాత్కారముగ వెడలించుటచేతను, భారమును అధికముగ మోచుటచేతను, అధికముగ త్రోవనడచుటచేతను, శరీరావయవముల విషమములుగ బ్రవర్తింపజేయుటచేతను, ఈకారణసముదాయముచే వాతము మిక్కిలి ప్రకోపమునొంది వాతము చలింపజేయు కృత్యములచే సంక్షోభమునొంది శరీరమునం దలి చిన్నఅంత్రము (ప్రేగు) లో నొకభాగమును చెడగొట్టి అదియుండుస్థలమునుండి క్రిందికి వెడలించును. అయ్యది వాతప్రేరితమై గెజ్జలసంధియందు జేరి గ్రంథిరూపము నొంది వాపును గల్గించును. అట్టి యవస్థయందు దానికి దగిన చికిత్స జేయక యుపేక్షించినచో వృషణములజేరి వృద్ధినొందించును. మిక్కిలి బాధతోగూడి స్తంభించి యుబ్బియుండును. అండములజేరిన వాతము చేతితో పిసికినప్పుడు గఱ్ఱుమను శబ్దముతో గూడి లోనికింజనును. విడిచినపుడు వృషణకోశము నుబ్బించుచు మరల వృషణకోశము ననే చేరును. ఇదియే అంత్రవృద్ధియని చెప్పబడును. వాతవృద్ధికి జెప్పినలక్షణము లన్నియు నీయంత్రవృద్ధియందును కల్గును. ఇది మిక్కిలి యసాధ్యము (వృద్ధిసామాన్యముగ నసాధ్యములు. ఇయ్యది మిక్కిలి యసాధ్యమనిభావము.)

### గుల్మసామాన్యలక్షణసంప్రాప్తులు.

రూక్షకృష్ణారుణసిరాతంతుజాలగవాక్షితః. ౩౧
గుల్మోఽష్టధా పృథగ్దోషైః సంసృష్టైర్నిచయం గతైః,
ఆర్తవస్య చ దోషేణ నారీణాం జాయతేఽష్టమః. ౩౨

రూక్షంబును, నల్లనిరంగుకలిగినదియుం, అరుణవర్ణంబునునగు సిరాసమూహములో సన్ననిదారములచే జుట్టబడిన విధముగ పిండాకారమైన గ్రంథివిశేషము గుల్మ మన బడును. అయ్యది వాతపిత్తకఫములచే వేరువేరుగ జనించునవి మూడును, వాతపిత్త-వాతకఫ-పిత్తకఫ సంసర్గముచే గల్గినవి మూడును, సన్నిపాతమునకల్గినది యొకటియు, బుతురక్తముచే గల్గినది యొకటియు కలిసి యెనిమిదివిధములగును. వానిలో రక్తమున గలుగుగుల్మము స్త్రీలకే కలుగును గాని పురుషుల కెప్పుడును కలుగ వలనుపడదు. (ఆర్తవరక్తముచే గలుగునవి రక్తగుల్మము అయ్యది పురుషులకు సంభవింపదు కావున రక్తగుల్మము పురుషులకు రాదనుట.)

## గుల్మసామాన్యనిదానాదులు.

జ్వరచ్ఛర్ద్యతిసారాద్యైః వమనాద్యైశ్చ కర్మభిః,
కర్శితో వాతలాన్యత్తి; శీతం వాంబు బుభుక్షితః. 33
యః పిబత్యను చాన్నాని లంఘనం ప్లవనాధికమ్,
సేవతే దేహసంక్షోభిచ్ఛర్దిం వా సముదీరయేత్. 34
అనుదీర్ణ ముదీర్ణాన్వా వాతాదీన్న విముఞ్చతి,
స్నేహస్వేదావనభ్యస్య శోధనం వా నిషేవతే. 35
శుద్ధో వాశు విదాహీని భజతే స్యన్దనాని వా,
వాతోల్బణాస్తస్య మలాః పృథక్క్రుద్ధాః ద్విశోఽథవా. 36
సర్వే వా రక్తయుక్తా వా మహాస్రోతోఽనుశాయినః,
ఊర్ధ్వాధోమార్గమావృత్య కుర్వతే శూలపూర్వకమ్. 37
స్పర్శోపలభ్యం గుల్మాఖ్యం ఉత్ప్లుతం గ్రన్థిరూపిణమ్,

జ్వరము, ఛర్ది, అతిసారము మున్నగు వ్యాధులచేనైనను, వమనము విరేచనము మున్నగు పంచకర్మములచేనైనను, శరీరము కృశించినమనుజుడు వాతమును వృద్ధినొందించు పదార్థములజేర్చి భుజించుట, మిక్కిలి యాకలిగొనియున్నపుడు చల్లనినీళ్లను త్రాగుట, భుజించినతోడనే నీళ్లయం దీతగొట్టుట దుముకుట మున్నగు శరీరమునకు క్షోభమును గల్గించు పనులజేయుట, వాంతివెడల నుద్యమించకున్నపుడు బలాత్కారముగ వాంతిని వెళ్లగించుట, వాత-మూత్ర-పురీషాదులు వెడల నభిముఖములయిన సమయమున వాని వెడలింపక నిరోధించుట, స్నేహస్వేదకృత్యముల జేసికొనక వమన విరేచనాది శోధనముల జేసికొనుట, అట్టి వమనవిరేచనాదిశోధనకర్మల జేసికొని విదాహకరము (భుజించిన పిదప చాలాకాలమువరకును పచనమునొందుచు నామాశయము ననే చిరకాలముండుపదార్థము) లను అతిశీఘ్రముగ భుజించుట, లేక ద్రవరూపమైన

కఫమును కలిగించు పదార్థములభుజించుట, ఇట్టి కారణములచే వాతమున్నగు (వాతపిత్తకఫములు) ప్రకోపము నొంది ఒక్కటియైనను, రెండేసిదోషములైనను, అన్నియుం కలిసి యైనను, రక్తముతోగూడియైనను గుల్మమును కలిగించును పైజెప్పినరీతిగ పైకారణములచే వాతాదిదోషములొక్కొక్కటియైనను రెండేసికలిసియైనను అన్నియుం కలిసియైనను రక్తముతోగూడియైనను ప్రకోపమునొంది ఆమపక్వాశయములజేరి యూర్ధ్వాధోమార్గముల రెండిటినిఆవరించి తోలుత శూలనొప్పిని కలిగించి గ్రంథిరూపమైనగుల్మమును గలిగించును. అట్టి గ్రంథి చేత తడవినచో నుండవలె కనబడును, పైకిసంచరించు స్వభావము కలిగియుండును.

పైజెప్పిన వాత, పిత్త, కఫ, సన్నిపాత, వాతపిత్త, వాతకఫ, పిత్తకఫ, రక్తభేదములచే గుల్మము రెనిమిదివిధములగునని యెరుంగునది. అందు రక్తగుల్మము స్త్రీలకు మాత్రము సంభవించును. తక్కినవి యేడును స్త్రీపురుషసామాన్యముగ కల్గును. పైజెప్పిన గుల్మముల కన్నిటికిని "జ్వరచ్ఛర్ది ..స్యందనానివా" అను వాక్యముచే జెప్పబడినది నిదానము. "వాతోల్బణాః...కుర్వతే" అని చెప్పినది సంప్రాప్తి, "శూలపూర్వకం" అని చెప్పినది రూపము. "స్పర్శోపల .....గ్రన్థిరూపిణం" అని చెప్పినది స్వరూపము. ఇత్తెరంగున పైవాక్యములచేత నిదానపూర్వరూప సంప్రాప్తిరూపములు చెప్పబడినవని యెరుంగునది.

## వాతగుల్మనిదానము, సంప్రాప్తి.

కర్శనాత్కఫవిట్ పిత్తైః మార్గస్యావరణేన వా. ౩౮
వాయుః కృతాశయః కోష్ఠే రౌక్ష్యాత్ కాఠిన్యమాగతః,
స్వతన్త్రస్స్వాశ్రయే దుష్టః పరతన్త్రః పరాశ్రయే. ౩౯
పిణ్డితత్వాదమూర్తోఽపి మూర్తత్వమివ సంశ్రితః,
గుల్మ ఇత్యుచ్యతే వస్తి నాభిహృత్పార్శ్వసంశ్రయః ౪౦

రసాదిధాతువులు క్షీణించుటచేనైనను కఫము పురీషము పిత్తము ఈమూడిచే మార్గమడ్డగింపబడుటచేనైనను ఆమపక్వాశయరూపమైన కోష్ఠమునందు నిల్కడగ నిలచి ప్రకోపమునొంది వాతము స్వయముగ కఠినముగాకున్నను తనయందలి రూక్షగుణముచే కాఠిన్యమునొంది తనకు ఆకారకములేకున్నను ఉండవలె నాకారము నొందినట్లుండును. ఇది వాతజగుల్మమని చెప్పబడును. అట్టి వాతము స్వస్థానమైన పక్వాశయమున దుష్టమైనపుడు స్వతంత్రముగ నుండును. ఇతర స్థానమైన యామాశయమున దుష్టమైన యపుడు పరతంత్రమై (కఫపిత్తముల కధీనతమై) యుండును. ఈ వాతగుల్మము వస్తి నాభి హృదయము పార్శ్వములు అనుస్థలముల నాశ్రయించి సంభవించును.

## వాతగుల్మలక్షణములు.

వాతాన్మన్యాశిరశ్శూలం జ్వరప్లీహాన్త్రకూజనమ్,
వ్యథస్సూచ్యేవ విట్సంగః కృచ్ఛ్రాదుచ్ఛ్వసనం ముహుః ౪౧
స్తమ్భో గాత్రే ముఖే శోషః కార్శ్యం విషమవహ్నితా,
రూక్షకృష్ణత్వగాదిత్వం చలత్వాదనిలస్య చ ౪౨
అనిరూపితసంస్థానస్థానవృద్ధిక్షయవ్యథః,
పిపీలికావ్యాప్త ఇవ గుల్మస్స్ఫురతి తుద్యతే. ౪౩

వాతప్రకోపమునఁగల్గిన గుల్మమునందు తలనొప్పియుం ప్లీహావృద్ధియుం గల్గును. ప్రేవులరచును. సూదులగ్రుచ్చినవిధముగ పోటుపుట్టును. మలము బంధించును. శ్వాసము వెడలుటకు మిక్కిలి కష్టముగనుండును. కష్టముచే మాటిమాటికి శ్వాసము వెడలును. శరీరము స్తంభించును. ముఖము శోషించును. శరీరము కృశించును. జఠరాగ్ని విషమముగ నుండును. త్వక్ నేత్రములమూత్రాదులు మిక్కిలి రూక్షంబులై నల్లగనుండును. వాతము చంచలస్వభావముగలంజేసి ఆకృతియు గుల్మముకలుగుస్థానంబును వృద్ధిక్షయంబులును ఒకవిధముగ నియమములేక యుండును. (ఆకారము ఒకప్పుడు చిన్నదియుం ఒకప్పుడు పెద్దదియునై హృదయనాభిస్థానములయం దొక్కచోటనైన నిల్కడలేక చలించుచుండును) చీమలు వ్యాపించియున్నట్లు గుల్మము బాధకల్గియుండును. అదరును. సూదుల బొడిచినవిధముగ పోటుపుట్టును.

## పిత్తగుల్మలక్షణము.

పిత్తాద్దాహోఽల్పకో మూర్ఛా విడ్భేదస్వేదతృడ్జ్వరాః,
హారిద్రత్వం త్వగాద్యేషు గుల్మశ్చ స్పర్శనాసహః. ౪౪
దూయతే దీప్యతే సోష్మా స్వస్థానం వహతీవ చ,

పిత్తప్రకోపమునఁగల్గిన గుల్మము మిక్కిలి స్వల్పమై తీవ్రమైన మంట కల్గియుండును. మూర్ఛగ్రమ్మును. మలము ఉండలుగ వెడలును. చెమటబట్టును. జ్వరమువచ్చును. త్వక్-నేత్ర-ముల మూత్రాదులు పసుపురంగుగల్గియుండును. గుల్మపుగ్రంథిని చేత పడ వినవోరువరాని బాధకల్గును.

## కఫజగుల్మలక్షణము.

కఫాత్ స్తైమిత్యమరుచిః సదనం శిశిరజ్వరః. ౪౫
పీనసాలస్యహృల్లాసకాసశుక్లత్వగాదితాః,
గుల్మోఽవగాఢః కఠినః గురుస్సుప్తస్థిరోఽల్పరుక్. ౪౬

కఫముచే గుల్మమున శరీరము తడిబట్టగప్పిన విధముగ జడముగనుండును. అరోచకముకలుగును. ఒడలునొచ్చును. చలితోగూడి జ్వరమువచ్చును. పడిసెముపట్టును. ఓకరింతలువెడలును. దగ్గుకలుగును. త్వక్-నేత్ర-మలమూత్రాదులు తెల్లనై యుండును. గుల్మగ్రంథి మిక్కిలి లోభాగమున జనించి రాయివలె కఠినమై గొప్పదియై కదలక స్థిరముగ నొకచోటనే యుండి స్వల్పమైననొప్పి కల్గియుండును.

## వాతాదిగుల్మములకు స్థానాదినిర్ణయము.

స్వదోషస్థానధామానః స్వే స్వే కాలే చ రుక్కరాః,
ప్రాయః

వాతాదులచేగలిగిన గుల్మములు మూడును ఆయాదోషమునకు జెప్పిన స్థానము నాశ్రయించి జనించును. వాత పిత్త కఫములకు వేరువేరుగ జెప్పిన ప్రాతఃకాలము మధ్యాహ్నకాలము సాయంకాలము మున్నగు నాయాకాలములయందు బాధగలిగించును. (తక్కిన కాలములయందు బాధ సామాన్యముగ నున్నను ఆయాదోషములకు జెప్పిన కాలములయందు ఆయాదోషమున గలిగిన గుల్మములు నొప్పి మున్నగుబాధలను అధికముగ గలిగించునని భావము.)

## ద్వంద్వజగుల్మలక్షణములు.

త్రయస్తు ద్వన్ద్వజాః గుల్మాస్సంసృష్టలక్షణాః. ౪౭

దోషద్వయసంసర్గముచే గలిగిన వాతపిత్త-వాతకఫ-పిత్తకఫ గుల్మములుమూడును ఆయాదోషమునకు ప్రత్యేకముగ జెప్పినలక్షణము రెండేసి మిశ్రములుగ నుండును.

## సాన్నిపాతికగుల్మలక్షణము.

సర్వజస్తీవ్రరుగ్దాహః శీఘ్రపాకీ ఘనోన్నతః,
సోఽసాధ్యః

సన్నిపాతమున జనించిన గుల్మము మిక్కిలి తీవ్రమైన నొప్పియు మంటయు కలిగి అతిశీఘ్రముగ పగులును. మిక్కిలి స్థూలంబును ఉన్నతంబునై యుండును. ఇయ్యది యసాధ్యము.

## రక్తగుల్మసంప్రాప్తి సామాన్యలక్షణము.

రక్తగుల్మస్తు స్త్రియా ఏవ ప్రజాయతే. ౪౮
ఋతౌ వా నవసూతా వా యది వా యోనిరోగిణీ,
సేవతే వాతలాని స్త్రీ క్రుద్ధస్తస్యాస్సమీరణః. ౪౯
నిరుణద్ధ్యార్తవం యోన్యాం ప్రతిమాసమవస్థితమ్,
కుక్షిం కరోతి తద్గర్భలిఙ్గమావిష్కరోతి చ. ౫౦
హృల్లాసదౌహృదస్తన్యదర్శనం క్షామతాదికమ్,

రక్తగుల్మము స్త్రీలకు మాత్రమే కల్గును. ఏలయన:—ఋతుమతిగనున్న సమయమునయైనను, ప్రసవించిన వెంటనైనను. యోనిరోగములుగల్గినపుడును స్త్రీలు మిక్కిలి వాతమును వృద్ధినొందించు నాహారాదిపదార్థముల సేవించినచో వాతము ప్రకోపమునొంది ప్రతిమాసమునందును బైటవెడలవలసిన ఋతురక్తమును వెడలనీయక యోనియందే యడ్డగించును. అట్టియార్తవరక్తము యోనియందే నిలచి కుక్షిని వృద్ధినొందించును. అయ్యది గర్భమునుబోలె నానాట కుక్షిని వృద్ధినొందించుచు గర్భమునగల్గు ఓకరింతలు (దౌహృదము) భోజ్యవస్తువులు మున్నగువానియం దభిలాష) స్తన్యము జనించుట శరీరము కృశించుట మున్నగుగర్భచిహ్నములుకల్గును (ఇదియె రక్తగుల్మము. ఇది ఋతురక్తమువలన ముఖ్యముగ సంభవించునది గావున స్త్రీలకు గల్గదు),

### రక్తగుల్మవిశేషలక్షణములు.

క్రమేణ వాయుసంసర్గాత్ పిత్తయోనితయా చ తత్. ౫౧
శోణితం కురుతే తస్యాః వాతపిత్తోత్థగుల్మజాన్,
రుక్ స్తమ్భదాహాతీసారతృట్ జ్వరాదీనుపద్రవాన్. ౫౨
గర్భాశయే చ సుతరాం శూలం దుష్టాసృగాశ్రయే,
యోన్యాశ్చ స్రావదౌర్గన్ధ్యతోదస్పన్దనవేదనాః. ౫౩

పైజెప్పినరక్తగుల్మమున నానాట వాతసంబంధముచేతను పిత్తము ప్రధానముగ కారణమగుటంజేసియు పైజెప్పినరక్తగుల్మము వాతగుల్మములకు పైజెప్పిననొప్పి, స్తంభము, మంట, అతిసారము, దప్పి, జ్వరము మున్నగునుపద్రవముల గల్గించును. గర్భాశయమునందు మిక్కిలి శూలమును కల్గించును. అట్టిగర్భాశయము చెడురక్తమునకు ఆశ్రయముగ నుండును, కావున యోనినుండి దుర్గంధయుక్తముగ స్రావము కల్గును. పోటుపుట్టును. ద్రవము కల్గియుండును.

### గర్భమునకును గుల్మమునకును పరస్పరభేదము.

న చాఙ్గైర్గర్భవద్గుల్మః స్ఫురత్యపి తు శూలవాన్,
పిణ్డీభూతస్స ఏవాస్యాః కదాచిత్ స్పన్దతే చిరాత్. ౫౪
న చాస్యాః వర్ధతే కుక్షిః గుల్మ ఏవ తు వర్ధతే,

గర్భము చేతులు కాళ్లు మున్నగునవయవముల గదలించుచు కదలును. గుల్మము అటుగాక యుండవలెనుండి నొప్పితోగుండి కదలును. గర్భము తటాలున శీఘ్రముగ కదలును. గుల్మము చిరకాలమునకు ఒకానొకప్పుడుమాత్రము కదలును. గర్భము వృద్ధియగునప్పుడు కుక్షికూడ వృద్ధినొందును. గుల్మము అటుగాక గ్రంథిమాత్రము వృద్ధినొందునుగాని కుక్షి వృద్ధినొందదు. గర్భమునకును గుల్మమునకును పైజెప్పినవిధముగ పరస్పరభేదము తెలియగునది.

### గుల్మవిద్రధులకు పరస్పరభేదము.

స్వదోషసంశ్రయో గుల్మః సర్వో భవతి తేన సః. ౫౫
పాకం చిరేణ భజతే నైవ వా విద్రధిః పునః,
పచ్యతే శీఘ్రమత్యర్థం దుష్టరక్తాశ్రయత్వతః. ౫౬
అతశ్శీఘ్రవిదాహిత్వాద్విద్రధిస్సోఽభిధీయతే,
గుల్మేఽన్తరాశ్రయే వస్తికుక్షిహృత్ప్లీహవేదనాః. ౫౭
అగ్నివర్ణబలభ్రంశః వేగానాం చాప్రవర్తనమ్,
అతో విపర్యయో బాహ్యే కోష్ఠాఙ్గేషు తు నాతిరుక్. ౫౮
వైవర్ణ్యమవకాశస్య బహిరున్నతతాఽధికమ్,

పైజెప్పబడిన వాతాదిభేదములచే నెనిమిదివిధములైన గుల్మములును ఆయా గుల్మములకు ఉత్పత్తికారణమైన ఆయాదోషమునుమాత్రమే ఆశ్రయించియుండును గాని ఇతరదోషముల నాశ్రయించుటలేదు. కావున గుల్మము చిరకాలమునకు వృద్ధి నొంది పగులును. లేక పాకమునొందకయే యుండును. విద్రధి మిక్కిలి దుష్టమైన రక్తము నాశ్రయించియుండును కావున నతిశీఘ్రముగ పక్వమగును. ఆరీతిగ శీఘ్రముగ పక్వమగునది కావుననే విద్రధి యని చెప్పబడును. ఇదియె గుల్మమునకును అంతర్విద్రధికిని భేదము.

మరియు గుల్మము అంతరాశ్రయమనియు, బహిరాశ్రయమనియు రెండువిధములు. అందు అంతరాశ్రయగుల్మమునందు వస్తియందును కుక్షియందును హృదయమునందును ప్లీహమునందును మిక్కిలి తీవ్రమైనవేదనలు కల్గును. జాఠరానలబలంబును శరీరవర్ణంబును బలంబును చెడును. మలమూత్రాదివేగములు యథావిధిగ వెడలక బద్ధగించియుండును. బాహ్యగుల్మమునందు పైజెప్పినలక్షణములకన్న విరుద్ధములగు లక్షణములు కల్గియుండును.

మరియు గుల్మము పాకమునొందకుండుటకు కారణమును గ్రంథాంతరమున నిట్లుచూపిరి:— "మాంసశోణితభూయస్త్వాత్ పాకం గచ్ఛతి విద్రధిః, మాంసశోణితహీనత్వాత్ గుల్మః పాకం న గచ్ఛతి" విద్రధి మాంసరక్తముల విశేషముగ నాశ్రయించి జనించునుగాన శీఘ్రముగ పాకమునొందును. గుల్మము అటుగాక మాంసరక్తసంబంధము లేక కేవలము వాతాదిదోషములమాత్రమే ఆశ్రయించియుండును కావున పక్వము కానోపదనిభావము.

### ఆనాహలక్షణము.

సాటోపమత్యుగ్రరుజం ఆధ్మానముదరే భృశమ్. ౫౯
ఊర్ధ్వాధోవాతరోధేన తమానాహం ప్రచక్షతే,

వాతము ప్రకోపమునొంది యూర్ధ్వమార్గమును అధోమార్గమును బంధించి నపుడు కడుపులో మిక్కిలి శబ్దంబును నొప్పియుం కలిగి కడుపుబ్బరించినయెడ నయ్యది యానాహమని చెప్పనగును.

సుశ్రుతమున ప్రత్యాధ్మానలక్షణ మిట్లు చెప్పబడియె.

"విముక్తపార్శ్వహృదయం తదేవామాశయోత్థితమ్, ప్రత్యాధ్మానం విజానీయాత్ కఫవ్యాకులితానిలమ్" పైజెప్పినయాధ్మానమే పార్శ్వములను హృదయమును విడచి యామాశయమునబుట్టి కఫముచే వాతము వ్యాకులమైయున్నయెడ ప్రత్యాధ్మానమని చెప్పబడును.

అష్ఠీలా ప్రత్యష్ఠీలాలక్షణములు.

ఘనోఽష్ఠీలోపమో గ్రన్థిః అష్ఠీలోర్ధ్వసమున్నతః ౬౦
ఆనాహలిఙ్గస్తిర్యక్తు ప్రత్యష్ఠీలా తదాకృతిః,

కమసాలవాని యినుపడాకలింబోలె స్థూలంబును కఠినంబును ఉన్నతంబునైన గ్రంథి కుక్షితో కలిగి యానాహలక్షణములతో గూడియున్న నది యష్ఠీల యనిచెప్పబడును. అదియె పైకి నున్నతముగాక యడ్డముగ నుండునేని ప్రత్యష్ఠీల యనబడును.

తూనీప్రతూనీలక్షణములు.

పక్వాశయాద్గుదోపస్థం వాయుస్తీవ్రరుజః ప్రయాన్,
తూనీ ప్రతూనీ తు భవేత్ సఏవాతో విపర్యయే. ౬౧

వాతము ప్రకుపితమై పక్వాశయమునుండి గుదస్థానకును గుహ్యమునకును బోవుచు మిక్కిలి తీవ్రమైననొప్పిని కలిగించినయెడ తూనీవాత మనబడును. పైజెప్పిన లక్షణమునకు విరుద్ధముగ వాతము ప్రకుపితమై గుదగుహ్యస్థానములనుండి యామాశయమునకు తీవ్రమైననొప్పిని కలిగించుచు పోయిన నయ్యది ప్రతూనియని చెప్పనగును.

గుల్మపూర్వరూపములు.

ఉద్గారబాహుల్యపురీషబన్ధతృప్త్యక్షమత్వాన్త్రవికూజనాని,
ఆటోపమాధ్మానమపక్తిశక్తిమాసన్నగుల్మస్య వదన్తి చిహ్నమ్.

త్రేనుపులు అధికముగ వెడలుట, మలము బంధించుట, తృప్తిగ భుజించిన యోరుపవాలకుండుట, ప్రేవు లరచుచుండుట, కడుపుబ్బరించుట, కడుపులో శబ్దముపుట్టుట, జీర్ణశక్తితగ్గుట, ఇవియన్నియుం గుల్మము సన్నిహితమై రానున్నపుడు సంభవించు చిహ్నములు, (ఇవి పూర్వరూపములనుట).

ఇతి ఏకాదశోఽధ్యాయః.

# ద్వాదశాధ్యాయము

అవ: గడచినయధ్యాయాంతమున ఆనాహము చెప్పబడినది. ఉదరమునందును ఆనాహాధ్మానములు ప్రధానములుగ నుండును కావున నానాహమును జెప్పినపిదప నుదర నిదానము సవిశేషముగ జెప్పబడును:—

సూ. అథాత ఉదరనిదానం వ్యాఖ్యాస్యామః.

గుల్మాదినిదానమును జెప్పినపిదప నుదరనిదానమును వివరించెదనని యర్థము.

### ఉదరనిదానము.

రోగాస్సర్వేఽపి మన్దేఽగ్నౌ సుతరాముదరాణి తు,
అజీర్ణాన్మలినైశ్చాన్నైః జాయన్తే మలసంచయాత్. ౧

జ్వరము అతిసారము మున్నగు రోగములన్నియు జఠరాగ్ని మందగించుటవలన కలుగును. అందును ఉదరములు ప్రధానముగ మందాగ్నివలన గలుగును. మరియు అజీర్ణమువలనను దుర్గంధాదులచే మలినములగునన్నాదులచేతను మలము చిరకాలమునుండి సంచితముగ నిలచియుండుటచేతను ఉదరములు కలుగును. అజీర్ణాదికారణములును ఉదరములకు హేతువులైనను మందాగ్ని ప్రధానకారణమని తెలుపుటకై "సుతరాముదణితు" అని చెప్పబడినది.

### ఉదరసంప్రాప్తి, సంఖ్యాభేదనులు.

ఊర్ధ్వాధోధాతవో రుద్ధ్వా వాహినీరమ్బువాహినీః,
ప్రాణాగ్న్యపానాన్ సన్దూష్య కుర్యుస్త్వఙ్మాంససన్ధిగాః. ౨
ఆధ్మాప్య కుక్షిముదరం అష్టధా తచ్చ భిద్యతే,
పృథగ్దోషైస్సమస్తైశ్చ ప్లీహబద్ధక్షతోదకైః. 3

వాతాదిదోషములు స్వకారణములచే ప్రకోపమునొంది శరీరమునందలిజలమును వహించి ప్రవహింపజేయుస్రోతస్సులను క్రిందిభాగమును పైభాగమునుకూడ నడ్డగించి ప్రాణవాయువును స్వయముగ మందగించియుండుజఠరాగ్నిని అపానవాతమును పూర్తిగ జెరిచి చర్మమునకును మాంసమునకును సంధిస్థలమున జేరి కుక్షిని యుబికించి యుదరరోగమును గలిగించును. అయ్యాది వాతపిత్తకఫములచే వేరువేరుగను అన్నిటి సన్నిపాతముచేతను ప్లీహావృద్ధిచేతను బద్ధగుదముచేతను క్షతముచేతను ఉదకముచేతను జనించుటంజేసి యెనిమిదివిధములగును.

ఇచ్చట ప్లీహ-బద్ధ-క్షత-ఉదకోదరములునాలుగునుకూడ వాతాదిసంబంధము చేతనే కలుగును. అయినను పైజెప్పినప్లీహవృద్ధి మున్నగునవి ఆయుదరములకు ప్రధాన కారణములగుటంజేసి ప్లీహోదరము, బద్ధగుదోదరము,క్షతోదరము, ఉదకోదరము నని నాలుగుసంజ్ఞాభేదములచే జెప్పబడును. ప్లీహవృద్ధ్యాదికారణములబట్టి వానికి చికిత్సలు కూడ భిన్నములుగ నుండును.

## ఉదరరోగపీడితులస్వరూపము.

తేనార్తాశ్శుష్కతాల్వోష్ఠాః శూనపాదకరోదరాః,
నష్టచేష్టాబలాహారాః కృశాః ప్రాధ్మాతకుక్షయః. ౪
స్యుః ప్రేతరూపాః పురుషాః

అట్టి యుదరవ్యాధిచే పీడింపబడినవారు తాలువులును పెదవులును శుష్కించి, పాదములయందును చేతులయందును ఉదరమునందును వాపుకలిగి, శరీరమునకును వాక్కునకును సంబంధించిన చేష్టలును శరీరబలంబును ఆహారంబునునుడిగి, ఒడలుకృశించి, ఉబ్బిన కుక్షికలవారై ప్రేతములను పిశాచములబోలె వికారస్వరూపము కలిగియుందురు.

## ఉదరపూర్వరూపము.

భావిన స్తస్య లక్షణమ్,
క్షున్నాశోఽన్నం చిరాత్సర్వం సవిదాహం చ పచ్యతే. ౫
జీర్ణాజీర్ణం న జానాతి సౌహిత్యం సహతే న చ,
క్షీయంతే బలతశ్శశ్వత్ శ్వసిత్యల్పేఽపి చేష్టితే, ౬
వృద్ధిర్విశోఽప్రవృత్తిశ్చ కశ్చిచ్ఛోఫశ్చ పాదయోః,
రుగ్వస్తిసన్ధౌ తతతా లఘ్వల్పాభోజనైరపి. ౭
రాజీజన్మ వళీనాశః జఠరే

ఉదరరోగముకలుగుటకు ముందు అగ్ని మందగించియుండుటచే నాకలి నశించును. భుజింపబడిన యాహారపదార్థమంతయు విదాహముతోగూడి చిరకాలమునకు జీర్ణమగును. జీర్ణమైనదియు లేనిదియు తెలియకుండును, తాను మామూలుగ భుజించునంతపరిమాణముగ భుజించిన నోరువజాలకుండును. శరీరబలమునానాట క్షీణించును. స్వల్పమైనపని జేసినను మాటిమాటికిని శ్వాసమును తీవ్రముగవిడచును. మలము నానాట వృద్ధినొంది బైటవెడలక బద్ధగించును. మీగాళ్లమీద కొంచెముగ శోఫకలుగును. వస్తిసంధియందు నొప్పికలుగును. మిక్కిలికొంచెముగ భోజనముచేసినను బొత్తుగ భుజించకున్నను వస్తియందు విశాలమై యుబికియుండును. కడుపుపైనుండు వళులు (ముడతలు) నానాట నశించి రేఖలేర్పడును. (ఇవియన్నియు నుదరరోగము కలుగుటకు మునుమున్ను సంభవించుపూర్వలక్షణములు.)

### ఉదరసామాన్యలక్షణములు.

జఠరేషు తు,

సర్వేషు తన్ద్రాసదనం మలసఙ్గోఽల్పవహ్నితా. ౮
దాహశ్శ్వయథురాధ్మానం అన్తే సలిలసమ్భవః,

పైజెప్పిన యెనిమిదివిధములైన యుదరములయందురుకునికి పాటుకలుగును. శరీరము కృశించును. మలము బద్ధగించును. జఠరాగ్ని మందగించును. శరీరమున మంటపుట్టును. వాపుకలుగును. కడుపుబ్బరించును. వ్యాధి పూర్తియైనపిదప (కడపట) జఠరమున నీళ్లు పుట్టును (ఇవియన్నియు నుదరరోగము లన్నిటియందును కలుగుసామాన్యలక్షణములు.)

### జలములేనియుదరముల సామాన్యలక్షణము.

సర్వం త్వతోయమరుణమశోఫం నాతిభారికమ్. ౯
గవాక్షితం సిరాజాలైః సదా గుడగుడాయతే,
నాభిమన్త్రం చ విష్టభ్య వేగం కృత్వా ప్రణశ్యతి. ౧౦
మారుతో హృత్కటీనాభిపాయువఙ్క్షణవేదనః,
సశబ్దో నిశ్చరేద్వాయుః విడ్బద్ధో మూత్రమల్పకమ్. ౧౧
నాఽతిమన్దోఽనలో లౌల్యం న చ స్యాద్విరసం ముఖమ్,

(ఉదరములన్నియు నుపేక్షించి చికిత్సజేయకుండునెడ కొంతకాలమునకు ఉదకముపుట్టి జలోదరముగ పరిణమించును). జలము కలుగకమునుపు ఉదరములన్నియు నీక్రిందజెప్పబడులక్షణములు కలిగియుండును.—జఠరము అరుణవర్ణముగనుండును. శరీరముపై వాపులేక కడుకొంచెముగ భారముకలిగియుండును. నరములు పొట్టపై గవాక్షరంధ్రములబోలె దట్టముగ నావరించియుండును. కడుపులో నెల్లప్పుడును గుడగుడయను శబ్దము కలిగియుండును. వాతము నాభిని ప్రేవులను స్తంభింపజేసి హృదయమునందును నడుమునందును నాభియందును గుదస్థానమునను గెజ్జలయందును వేదనగలిగించి తనవేగమును పూర్తిగజూపి తనంతనే శమించును. అపానవాతము శబ్దముతోగూడి బైటవెడలును. మలము బద్ధగించును. మూత్రము స్వల్పముగ వెడలును. జఠరాగ్ని కొంచెముగ మందగించును. విషయాదులయందు చాపల్యములేకుండును. నోరు విరసముగనుండును. (ఈలక్షణములబట్టి జలములేనియుదరమని యెరుంగునది. పైజెప్పినలక్షణములకన్న విరుద్ధములగులక్షణములుకలిగినది జలోదరము.)

### వాతోదరలక్షణము.

తత్ర వాతోదరే శోఫః పాణిపాన్ముష్కకుక్షిషు. ౧౨
కుక్షిపార్శ్వోదరకటీపృష్ఠరుక్ పర్వభేదనమ్,

శుష్కకాసోఽఙ్గమర్దోఽధో గురుతా మలసఙ్గ్రహః ౧౩
శ్యావారుణత్వగాదిత్వం అకస్మాద్వృద్ధిహ్రాసవత్,
సతోదభేదముదరం తనుకృష్ణసిరాతతమ్ ౧౪
ఆధ్మాతదృతివచ్ఛబ్దం ఆహతం ప్రకరోతి చ,
వాయుశ్చాత్ర సరుక్శబ్దో విచరేత్సర్వతోగతిః ౧౫

వాతమున జనించినయుదరమునందు కాళ్లు చేతులు ముఖము కుక్షి మున్నగునవయవములయందు వాపుకలుగును. కుక్షియందును పార్శ్వములయందును ఉదరమునందును నడుమునందును వీపునందును నొప్పికలుగును. కీళ్లు పగులదీయునట్లు నొప్పికలుగును. ద్రవములేని పొడిదగ్గుకలుగును. అవయవములన్నిటియందును నొప్పికలుగును. శరీరమునందధోభాగమున బరువై యుండును, మలము వెడలక బద్ధగించును. త్వక్కు మూత్రము నేత్రములుమలము మున్నగునవి శ్యామవర్ణంబైనను అరుణవర్ణంబైనను కలిగియుండును. ఉదరము కారణములేకయే యొకప్పుడు తనంత వృద్ధినొందితనంతనే తగ్గుచుండును. సూదుల గ్రుచ్చినవిధముగను ఆయుధమును చేబీల్చినవిధముగను పోటునొప్పియు కలుగును. మిగుల సూక్ష్మములై నల్లనైననరములచే వ్యాప్తమై యుండును. ఉదరముపై వ్రేలితో తట్టినయెడ గాలితో నిండియుబిగియున్నతోలుతిత్తివలె శబ్దముకల్గును. మరియు వాతోదరమునందు వాయువు శబ్దముతోడను నొప్పితోడను కూడి కుక్షియందంతట సంచరించును.

### పిత్తోదరలక్షణము.

పిత్తోదరే జ్వరో మూర్చ్ఛా దాహస్తృట్ కటుకాస్యతా,
భ్రమోఽతిసారః పీతత్వం త్వగాదావుదరం హరిత్. ౧౬
పీతతామ్రసిరానద్ధం సస్వేదం సోష్మ దహ్యతే,
ధూమాయతి మృదుస్పర్శం క్షిప్రపాకం ప్రదూయతే. ౧౭

పిత్తోదరమునందు జ్వరంబును మూర్ఛయు మంటయు దప్పియు కలుగును. నోరు చేదుగనుండును. భ్రమంబును అతిసారంబును కలుగును. చర్మమలమూత్రాదులు పచ్చగ (పసుపురంగుకలిగి) యుండును. ఉదరముమాత్రము పచ్చనిరంగుకలిగి పీతవర్ణంబులును తామ్రవర్ణంబులును నగుసిరలచే వ్యాప్తమై చెమటబట్టియుండును. మిక్కిలి వేడికలిగి మండుచుండును. పొగవెడలునట్లుండును. తాకినప్పుడు మెత్తగనుండును. శీఘ్రముగ పాకమునొందును. సంతాపము కలిగియుండును.

### కఫోదరలక్షణము.

శ్లేష్మోదరేఽఙ్గసదనం స్వాపశ్వయథుగౌరవమ్,
నిద్రోత్క్లేశోఽరుచిశ్శ్వాసః కాసశ్శుక్లత్వగాదితా. ౧౮

ఉదరం స్తిమితం శ్లక్ష్ణం శుక్లరాజీతతం మహత్,
చిరాభివృద్ధి కఠినం శీతస్పర్శం గురు స్థిరమ్. ౧౯

కఫముచే జనించినయుదరమునందు శరీరము కృశించును. స్పర్శము నెరుంగజాల కుండును. హస్తపాదాదులయందు వాపు కలుగును. శరీరము బరువుగనుండును. నిదుర యధికమగును. శరీరము శ్రమజెందియుండును. అరుచి కల్గును. శ్వాస మధికమగును. దగ్గువచ్చును. చర్మనఖమూత్రాదులును తెల్లగనుండును. ఉదరము నిశ్చలమై నును పుకలిగి తెల్లనిరేఖలచే నావరింపబడి మిక్కిలి గొప్పదిగనుండును. అయ్యది చిరకాలము నకు నానాట వృద్ధినొంది కఠినమై తాకినచో చల్లనై, గొప్పదియైయొకదలకుండును.

### సన్నిపాతోదరలక్షణము.

త్రిదోషకోపనైస్తైస్తైః స్త్రీదత్తైశ్చ రజోమలైః,
గరదూషీవిషాద్యైశ్చ సరక్తాస్సంచితా మలాః. ౨౦
కోష్ఠం ప్రాప్య వికుర్వాణాః శోషమూర్ఛాభ్రమాన్వితమ్,
కుర్యుస్త్రిలిఙ్గముదరం శీఘ్రపాకం సుదారుణమ్. ౨౧
బాధతే తచ్చ సుతరాం శీతవాతాభ్రదర్శనే,

త్రిదోషములను ప్రకోపింపజేయు కారణములు సర్వరోగనిదానాధ్యాయము చివరన "మిథ్యాభావాత్సమస్తానాం సన్నిపాతస్తథా పునః" అని యుపక్రమించి చెప్ప బడినవి; అట్టికారణసముదాయముచేనైనను, పురుషులను వశపరచుకొనుటకై రజస్సం బంధమైనమలమును జేర్చి స్త్రీలు పురుషులకు బెట్టుదురు. అట్టి రజోమలములచేనైనను, సర్పాదివిషముచేనైనను, శరీరమునందే మందవేగమై యిమిడియుండు ఎలుకలు మున్నగు వానివిషము దూషీవిషము. ఇవి మున్నగుకారణములచే వాతపిత్తకఫరక్తములు మిక్కిలి వృద్ధినొంది ప్రకుపితములై కోష్ఠమునజేరి ఆయావికారములగల్గించి యుదరమును గల్గిం చును. ఇయ్యది త్రిదోషములను జెప్పినలక్షణములతో గూడియుండును. ఈయుదరమున శరీరము శుష్కించును. మూర్ఛగ్రమ్మును. చక్రముపైనున్నవానివలె నొడలుతిరుగును. శీఘ్రముగ పరిపక్వమగును. ఇది సన్నిపాతజనితమగుటంజేసి మిక్కిలి తీవ్రమైనబాధ గల్గించును. ఈయుదరము శీత (మంచు) కాలమునందును గాలి విశేషముగ వీచుసమయ మునను, మబ్బుగ్రమ్మియుండు వర్షాకాలమునందును మిక్కిలి తీవ్రముగ బాధింప సాగును.

### ప్లీహోదరనిదాన-సంప్రాప్తి-సామాన్యలక్షణములు.

అత్యాశితస్య సంక్షోభాత్ యానయానాదిచేష్టితైః. ౨౨
అతివ్యవాయకర్మాధ్వవమనవ్యాధికర్శనైః,

వామపార్శ్వాశ్రితః ప్లీహా చ్యుతస్థానాద్వివర్ధతే. ౨౩
శోణితం వా రసాదిభ్యో వివృద్ధం తం వివర్ధయేత్,
సోఽష్ఠీలేవాతికఠినః ప్రాక్ తతః కూర్మపృష్ఠవత్. ౨౪
క్రమేణ వర్ధమానశ్చ కుక్షావుదరమావహేత్,
శ్వాసకాసపిపాసాస్యవైరస్యాధ్మానరుగ్జ్వరైః. ౨౫
పాణ్డుత్వచ్ఛర్దిమూర్ఛార్తిదాహమోహైశ్చ సంయుతమ్,
అరుణాభం వివర్ణం వా నీలహారిద్రరాజిమత్. ౨౬

("గర్భశయ్యయకృత్ప్లీహానౌ శోణితజౌ") అనుసుశ్రుతప్రమాణమునుబట్టి సకల ప్రాణులకు యకృత్తును ప్లీహంబును శరీరమునందలి రక్తధాతువువలన పుట్టునని తెలిసెడి. అందు ప్లీహము ఎడమప్రక్కనుండు అస్థులలో నెనిమిదివరకునుండి ఆయామనుజుని యంగుళప్రమాణముతో నరంగుళములనిడుపును నాలుగంగుళముల వెడలుపును ఒకటిన్నర యంగుళము ఎత్తును కల్గియుండును. యకృత్తు దక్షిణభాగమున (కుడిప్రక్కన) తొమ్మిదవయస్థివరకు వ్యాపించి వానివానియంగుళముతో పదునారంగుళములనిడుపును ఎనిమిదియంగుళములయెత్తును కలిగియుండును.)

మిక్కుటముగ భుజించి గుఱ్ఱము మున్నగువానిపై నెక్కి సవారిచేయుట మున్నగు నాంగిక చేష్టలచే సంక్షోభమునొందినను, అధికముగ స్త్రీసంభోగము చేయుట, త్రోవనడచుట, వమనము నధికముగ జేసికొనుట, జ్వరాది వ్యాధులు ఇవి మున్నగుకారణములచేనైనను పైవివరింపబడినప్లీహము స్వస్థానమునుండి జారి స్వప్రమాణమునకన్న నధికముగ వృద్ధినొందును. లేక రక్తము స్వవర్ధకములైన కారణములచేత రసాదిధాతువులకన్న నధికముగవృద్ధినొంది ప్లీహము స్వస్థానముండి జారినను జారకున్నను పరిమాణమునకన్న నధికముగ వృద్ధినొందించును. పైజెప్పినవిధముగ వృద్ధినొందినప్లీహము ఇనుపడాకలివలె మిక్కిలి కఠినమైకొంతకాలమునకు తాబేటివీపువలె నాకారముకల్గి నానాటవృద్ధినొందుచు కుక్షియందు నుదరరోగమునుకల్గించును. అట్టియుదరమునందు శ్వాసకాసంబులును డప్పియు కల్గును, నోరు రసములు నెరుంగజాలకుండును. కడుపుబ్బును. నొప్పిపుట్టును. జ్వరము వచ్చును. శరీరము తెల్లపడును. వాంతియగును. మూర్ఛగ్రమ్మును. కడుపులోవికారముగ నుండును. తాపము కలుగును. చిత్తభ్రమము కలుగును. అట్టియుదరము అరుణవర్ణముగ నుండును. లేకయేవర్ణము తెలియక వివర్ణముగ నుండును. నీలవర్ణంబులును లేకపసుపు రంగుకలిగినదియునగు సన్నరేఖలు పొట్టపై వ్యాపించును. ఇయ్యది ప్లీహావృద్ధిచే కలుగునవి కావున ప్లీహోదరమని చెప్పబడును.

### ప్లీహోదరమున వాత-పిత్త-కఫ-లక్షణములు.

ఉదావర్తరుగానాహైః మోహతృట్ దహనజ్వరైః,
గౌరవాఽరుచికాఠిన్యైః విద్యాత్తత్ర మలాన్ క్రమాత్. ౨౬

ఉదావర్తంబును నొప్పియుం కడుపుబ్బరంబును కల్గినయెడ వాతజమనియుం, మూర్ఛయుం దప్పియుం మంటయుం జ్వరంబును నధికముగ నున్నయెడ పిత్తజమనియుం, మిక్కిలి భారంబును అరోచకంబును కాఠిన్యంబును కల్గినది కఫజమనియు ప్లీహోదరమున వాతికాదిలక్షణముల నెరుంగునది.

### యకృదుదరలక్షణము.

ప్లీహవద్దక్షిణాత్పార్శ్వాత్కుర్యాద్యకృదపి చ్యుతమ్,

దక్షిణపార్శ్వమున (కుడిప్రక్క) నుండు యకృత్తు ప్లీహమువలెనే పైజెప్పిన కారణములచే వృద్ధినొంది స్వస్థానమునుండి జారి యుదరమును కల్గించును. (ఈయుదరమునను ప్లీహోదరమునకు జెప్పినలక్షణములు కలుగును. ఇది యకృత్తు వృద్ధినొందుటచే గలిగినది కావున యకృదుదరము. ఇయ్యది ప్లీహోదరమునకు సమానమైన నిదాన సంప్రాప్తిలక్షణములుకలిగి సమానప్రత్యనీకమై యుండును కావున వేరుగ పరిగణనము జేయబడదయ్యె.)

ఈయుదరమునే తంత్రాంతరమున "సవ్యాన్యపార్శ్వే యకృతి ప్రవృద్ధే జ్ఞేయం యకృద్దాల్యుదరం తదేవ" అనువాక్యముచేత యకృద్దాల్యుదరమనియు, ప్లీహోదరమునకు సమానలక్షణమనియు జెప్పిరి.

### బద్ధోదరసంప్రాప్తిలక్షణము.

పక్ష్మవాలైస్సహాన్నేన భుక్తైర్బద్ధాయనే గుదే. ౨౮
దుర్నామభిరుదావర్తైః అన్యైర్వాఽన్త్రోపలేపిభిః,
వర్చః పిత్తకఫాన్ రుద్ధ్వా కరోతి కుపితోఽనిలః. ౨౯
అపానో జఠరం తేన స్యుర్దాహజ్వరతృట్‌క్షవాః,
కాసశ్వాసోరుసదనం శిరోహృన్నాభిపాయురుక్. 30
మలసఙ్గోఽరుచిశ్ఛర్దిః ఉదరం మూఢమారుతమ్,
స్థిరం నీలారుణసిరారాజినద్ధమరాజి వా. 3౧
నాభేరుపరి చ ప్రాయః గోపుచ్ఛాకృతి జాయతే,

రెప్పవెండ్రుకలైనను వెండ్రుకలైనను అన్నముతో గలిసి కుక్షిలో జేరినను దధ్యోదనము మున్నగుభోజనములచేనైనను మలమును ధరించునాడిలో నానాట కొంచెముకొంచెముగ నిలచి దానియందు వాతము ఊర్ధ్వముగ సంచరించును. దానంజేసి

గుదద్వారము అడ్డగింపబడును. ఆ కారణముచే నపానవాతము ప్రకోపమునొంది మలమును పిత్తకఫములను అడ్డగించి యుదరమును కల్గించును, అట్టియుదరముచేత మంటపుట్టును. జ్వరంబును దప్పియు తుమ్ములును కల్గును. కాసశ్వాసములును కల్గును. తొడలు కృశించును. శిరస్సునందును హృదయమునందును నాభియందును గుదస్థానమునను నొప్పిపుట్టును. మలము బైటవెడలక బద్ధగించును. అరోచకంబును వాంతియు కల్గును. అపానవాతము బైట బొత్తుగ వెడలక కుక్షియందే యణగియుండును. ఉదరము చలించకుండును. నీలవర్ణంబులును అరుణవర్ణంబునగు సిరలచేత నావరింపబడి రేఖలుకల్గియుండును. ఒకసమయమున రేఖలులేక సిరచే నావృతమై యుండును. నాభికి పైభాగము ప్రాయికముగ ఆవుతోకనంటి యాకారము కల్గియుండును. ఇయ్యది గుదద్వారము అడ్డగింపబడుటచే గలిగినదికావున బద్ధోదరమని చెప్పబడును. తంత్రాంతరమున బద్ధగుదోదరమని దీనిని చెప్పిరి.

## ఛిద్రోదరనిదాన-సంప్రాప్తి-లక్షణములు.

అస్థ్యాదిశల్యైస్సాన్నైశ్చేత్ భుక్తైరత్యశనేన వా. 32
భిద్యతే పచ్యతే వాన్త్రం తచ్ఛిద్రైశ్చ స్రవన్ బహిః,
ఆమ ఏవ గుదాదేతి తతోఽల్పాల్పం స విస్రసః. 33
తుల్యః కుణపగన్ధేన పిచ్ఛిలః పీతలోహితః,
శేషశ్చాపూర్య జఠరం జఠరం ఘోరమావహేత్. 34
వర్ధయేత్తదధో నాభేః ఆశు చైతి జలాత్మతామ్,
ఉద్రిక్తదోషరూపం చ వ్యాప్తం చ శ్వాసతృడ్భ్రమైః. 35
ఛిద్రోదరమిదం ప్రాహుః పరిస్రావీతి చాపరే,

ఎముకముక్కలు గడ్డిపోగులు ముండ్లు రాళ్లు కొయ్యముక్కలు మున్నగుశల్యములు అన్నముతోఁగూడియున్న అట్టియన్నమును అజ్ఞానముచే భుజించినను పొట్టకు మిక్కుటముగ భుజించినను ఆహారపదార్థములకు మార్గమైన పెద్దప్రేగుపగులును. లేక పుండై రంధ్రములుపడును. ఆయాహారములోనుండి మలసంబంధమైనరసము పక్వముగాకయే పైజెప్పినరంధ్రములనుండి బైట స్రవించి గుదద్వారమునుండి బైట కొంచెము కొంచెముగ వెడలును. అట్టియామరసము పీనుగకంపుకలిగి బంధనకలిగి పచ్చగనైనను ఎఱ్ఱగనైన నుండును. గుదమునుండి వెడలినదికాక తక్కిన ద్రవము కుక్షిని నిండించి మిక్కిలి క్రూరమైనయుదరరోగమును గలిగించును. బొడ్డుకు క్రిందిభాగమున పొత్తికడుపు) వృద్ధినొందించును. ఈయుదరము జనించినతోడనే జలోదరముగ పరిణమించును. ఈయుదరమునందును వాతాదిదోషలక్షణములు మిక్కిలి యధికములుగ నుండును. శ్వాసము దప్పి భ్రమంబును వ్యాపించియుండును. ఇయ్యది రంధ్రముల

నుండి నీరు స్రవించుటచే గలిగినది కావున ఛిద్రోదరంబనియు, స్రవించుటచే గలుగుటం జేసి పరిస్రావ్యుదర మనియు జెప్పందగును. ఇది శల్యములచేనైన గాయమువలనగలిగినది కావున క్షతోదరము.

జలోదరనిదానసంప్రాప్తిలక్షణములు.

ప్రవృత్తస్నేహపానాదేః సహసాఽఽమాఽమ్బుపాయినః 36
అత్యమ్బుపానాన్మన్దాగ్నేః క్షీణస్యాఽతికృశస్య వా,
రుద్ధ్వాఽమ్బుమార్గానవిలః కఫశ్చ జలమూర్ఛితః. 37
వర్ధయేతాం తదేవామ్బు తత్స్థానాదుదరాశ్రితౌ,
తతస్స్యాదుదరం తృష్ణాగుదస్రుతిరుజాఽఽయుతమ్. 38
కాసశ్వాసారుచియుతం నానావర్ణసిరాతతమ్,
తోయపూర్ణదృతిస్పర్శశబ్దప్రక్షోభవేపథు. 39
దకోదరం మహత్ స్నిగ్ధం స్థిరమావృత్తనాభి తత్,

స్నేహపానము స్వేదనము వమనవిరేచనవస్తికర్మములు అనుపంచకర్మల జేసికొను నప్పుడు సాహసముగ కాచని చల్లనీళ్లు ద్రాగినను, అగ్నిమందగించినవాడును జ్వరాది రోగములచే ధాతువులు క్షీణించినవాడును, ఉపవాసాదులచే శరీరమునందలి మేదో మాంసములు నశించి కృశించినవాడును, అధికముగ నీళ్లుద్రాగినను వాతము ప్రకోపించును. పైజెప్పినకారణములచేతనే కఫము వృద్ధినొందును. ఈరెండును శరీరమునందలిజలవహాం బులగు స్రోతస్సుల నడ్డగించి యుదరమున జేరి యట్టి యుదకము నేస్వస్థానమైనక్లోమము నుండి మిక్కిలివృద్ధినొందించును. అట్టిజలము వృద్ధియగుటచేనుదరము కలుగును. ఈయుం దరరోగమునందు దప్పి యధికమగును. గుదమునుండియు జలము స్రవించును. మిక్కిలి నొప్పికలుగును. శ్వాసకాసంబులును అరుచియు కలుగును. నానావర్ణములు కలసిరలచే నుదరము వ్యాపింపబడియుండును. ఉదరమును చేతితో స్పృశించినప్పుడునీటిచేనిండిన తోలుతిత్తిని తాకినవిధముగను వ్రేలిచే తట్టినప్పుడు అదేవిధమైన ధ్వనియు గలిగియుం డును. జలము కొంచెము తక్కువగనున్నపుడు జలము తక్కువయైన తోలుతిత్తివలె సంక్షోభముకలిగి కదలుచుండును. తక్కినయుదరములకన్న నిది మిక్కిలి గొప్పదియు స్నిగ్ధంబును నిశ్చలంబునై యుండును. బొడ్డు గుండ్రనై యుండును. ఇయ్యది జలో దరమని చెప్పబడును. (దకోదర మనుచోట నుదకశబ్దపర్యాయమైనది దకశబ్దము. "ఉదకశబ్దపర్యాయో దకశబ్దో నిపాత్యతే" అని మహాభాష్యము.)

ఉదరములు జలోదరముగ మారుక్రమము.

ఉపేక్షయా చ సర్వేషు దోషాః స్వస్థానతశ్చ్యుతాః 40

పాకాద్ద్రవాః ద్రవీకుర్యుః సన్ధిస్రోతోముఖాన్యపి,
స్వేదశ్చ బాహ్యస్రోతస్సు విహతస్తిర్యగాస్థితః. ౪౧
తదేవోదక మాధ్మాప్య పిచ్ఛాం కుర్యాత్తదా భవేత్,
గురూదరం స్థిరం వృత్తం ఆహతం చ న శబ్దవత్. ౪౨
మృదు వ్యపేతరాజీకం నాభ్యాం స్పృష్టం చ సర్పతి,
తదనూదకజన్మాస్మిన్ కుక్షివృద్ధిస్తతోఽధికమ్. ౪౩
సిరాన్తర్ధాన ముదకజఠరోక్తం చ లక్షణమ్,

పైజెప్పిన వాతాద్యుదరము లన్నిటియందును సకాలమున తగిన చికిత్స జేయక యుపేక్షించినచో వాతాదిదోషములు వానివానిస్థలమునుండి వెడలి పాకవిశేషము వలన ద్రవముకల్గి సంధులను స్రోతోముఖములను ద్రవముకలవానినిగ జేయును. శరీరముపైనున్న స్వేదరంధ్రములన్నియు మూసికొనియుండుటంజేసి చెమట మామూలుగ వెడలక యడ్డగింపబడి వెనుకకు మరలి శరీరమునం దడ్డముగ వ్యాపించి కుక్షియందు మునుపే వృద్ధినొందియున్న జలమును మరింత వృద్ధినొందించును. పిదప నాజలము పిచ్ఛిలమగును. అప్పుడు జఠరము గొప్పదియు అచంచలంబును వర్తులంబునై చేత తట్టినచో ధ్వనిజేయక మెత్తనై యుండును. జఠరముపై రేఖలులేక నాభిస్థానమున పిసికినయెడ లోపలిజల మింకొకస్థలమునకు బోవును. పిమ్మట నీయుదరమున జలము వృద్ధినొందును. ముందున్నదానికన్న కుక్షి మిక్కిలి వృద్ధినొందును. పైనికనుపడు నరములన్నియు కనుబడక మాయమగును. మరియు జలోదరమున జెప్పినలక్షణములన్నియు నీయుదరమునను కల్గును.

### కృచ్ఛ్రసాధ్య అసాధ్యోదరములు.

వాతపిత్తకఫప్లీహసన్నిపాతోదకోదరమ్. ౪౪
కృచ్ఛ్రం యథోత్తరం; పక్షాత్పరం ప్రాయోఽపరే హతః,
సర్వం చ జాతసలిలం రిష్టోక్తోపద్రవాన్వితమ్. ౪౫

వాతోదరంబును పిత్తోదరంబును కఫోదరంబును ప్లీహోదరంబును సన్నిపాతోదరంబును జలోదరంబును ఇవి యొకదానికన్న నొకటి వరుసగ కృచ్ఛ్రసాధ్యములై యుండును. (ఉదరములలో స్వభావముగను సుఖసాధ్యములు లేవు; కావున వాతాద్యుదరములు పైజెప్పినక్రమముగ నొకదానికన్న నొకటి కృచ్ఛ్రసాధ్యమని భావము.)

తక్కిన బద్ధోదరక్షతోదరములు రెండును పదునైదుదినములు గడచినపిదప రోగిని తప్పక చంపును. ఒకసమయమున యాప్యములు నగును. మరియు వాతా

ద్యుదరములలో నేదియైన పైజెప్పినరీతిగ జలోదరరూపమునొందిన నదియు రోగిని ప్రాయికముగ చంపును. ఒకవేళ యాప్యములునగును. మరియుం నికృతివిజ్ఞానీయాధ్యాయమున జెప్పినయుపద్రవరూపములగు నరిష్టలక్షణములు గానవచ్చిన నదియుం చంపును.

జన్మనైవోదరం సర్వం ప్రాయః కృచ్ఛ్రతమం మతమ్,
బలినస్తదజాతాంబు యత్నసాధ్యం నవోత్థితమ్ ౪౬

ఉదరవ్యాధులన్నియు సామాన్యముగ తరుచుగ మిక్కిలి కృచ్ఛ్రసాధ్యముగనే యుండును. అట్టియుదరములు మిక్కిలి బలశాలులకు సంభవించినను, ఉదకము పుట్టకుండు నుదరములును, క్రొత్తగ సంభవించినయుదరంబులును మిక్కిలి ప్రయత్నముచే చికిత్సజేసిన నొకవేళ సాధింపందగి యుండును.

ఇతి ద్వాదశోఽధ్యాయః.

# త్రయోదశాధ్యాయము.

అవ: ఉదరరోగములు దోషసంఘాతముచే జనించును. అట్లెరంగునసే పాండు రోగంబును దోషసంఘాతమున గల్గును కావున ఉదరమును జెప్పినపిదప పాండురోగ నిదానమును జెప్పుట:—

**సూ. అథాతః పాణ్డురోగశోఫవిసర్పనిదానం వ్యాఖ్యాస్యామః**

ఉదరనిదానమును జెప్పినపిదప పాండురోగము శోఫ విసర్పము అను నీరోగముల నిదానమును జెప్పెదనని భావము.

పాండురోగనిదానము, సంప్రాప్తి.

పిత్తప్రధానాః కుపితాః యథోక్తైః కోపనైర్మలాః,
తత్రానిలేన బలినా క్షిప్తం పిత్తం హృది స్థితమ్. ౧
ధమనీర్దశ సంప్రాప్య ప్రాప్నువత్సకలాం తనుమ్,
శ్లేష్మత్వగ్రక్తమాంసాని ప్రదూష్యాన్తరమాశ్రితమ్. ౨
త్వఙ్మాంసయోః తత్కురుతే త్వచి వర్ణాన్ పృథగ్విధాన్,
పాణ్డుహారిద్రహారితాన్, పాణ్డుత్వం తేషు చాధికమ్ 3
యతోఽతః పాణ్డురిత్యుక్తః స రోగః

వాతపిత్తకఫములు పిత్తమును ప్రధానములుగ జేసికొని సర్వరోగనిదానమున జెప్పిన నాయాకారణములచేత నాయాదోషములు ప్రకోపమునొంది పాండురోగములకు కారణములగును. (ఇది పాండురోగములకు సన్నిహితకారణము) పైజెప్పినరీతిగ ప్రకుపితములైన దోషములలో మిక్కిలి బలిష్ఠమైనవాతముచేత పిత్తము ఆకర్షింపబడి హృదయమునజేరును. పిదప హృదయమునందలి పిత్తవాహినులగుపదిధమనులజేరి సకలశరీరమును వ్యాపించి శరీరమునందలి కఫమును త్వక్కును రక్తమాంసములను చెరిచి చర్మమాంసముల మధ్యప్రదేశమునజేరి చర్మముపై వేరువేరువర్ణములగలిగించును. అయ్యవి పాండువర్ణంబును పసుపురంగును పచ్చనిరంగునునై యుండు. అట్టివర్ణములలో పాండుత్వము మిక్కుటముగ నుండును కావున పాండురోగమని చెప్పబడును. (ఇది పాండురోగసంప్రాప్తి).

ఇచ్చట నీవిమర్శనము నెరుంగునది:—త్రిదోషములును జేరి పాండురోగమును కలిగించును. అందు వాతపిత్తకఫములలో పిత్తము ముఖ్యకారణమై ప్రధానముగ పాండు రోగమును కలిగించుశక్తి కలిగియుండును. కావున నే 'పిత్తప్రధానాః' అని చెప్పబడెను.

"అనిలేన బలినా" అనుచోట అధికమైనబలము కలవాతముచేత నని యర్థము ఇచ్చట వాతమునకు బలాధిక్యము వాతకృత్యములయందుమాత్ర ముండునుగాని పాండురోగమును గలిగించువిషయమై వివక్షితముకాదు. పాండురోగమును కలిగించుశక్తి మాత్రము పిత్తమునకే యధికముగ నుండుననిభావము. కావుననే "పిత్తప్రధానాః" "తత్రానిలేనబలినా" అనువాక్యముల రెండిటికిని పరస్పరవిరోధములేక సమంజసమగును.

### పాండురోగసామాన్యలక్షణములు.

తేన గౌరవమ్,
ధాతూనాం స్యాచ్చ శైథిల్యం ఓజసశ్చ గుణక్షయః. ౪
తతోఽల్పరక్తమేదస్కః నిస్సారస్స్యాత్ శ్లథేన్ద్రియః,
మృద్యమానైరివాఙ్గైర్నా ద్రవతా హృదయేన చ. ౫
శూనాక్షికూటస్సదనః కోపనః ష్ఠీవనోఽల్పవాక్.
అన్నద్విట్ శిశిరద్వేషీ శీర్ణరోమా హతానలః. ౬
సన్నసక్థో జ్వరీ శ్వాసీ కర్ణక్ష్వేడీ భ్రమీ శ్రమీ,

పైజెప్పినరీతిని సంప్రాప్తమైన పాండురోగముచేత రసరక్తాదిధాతువు లన్నియు బరువై శిథిలములై యుండును. ఓజస్సుకు సంబంధించినమాధుర్యము శైత్యము మున్నగు గుణములు క్షీణములగును. అట్టియోజోగుణములు క్షీణించుటంజేసి శరీరమునందలిరక్తంబును మేదస్సును మిక్కిలి స్వల్పముగనుండును. దానంజేసి శరీరమునందలి సారముచెడి చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణవాక్కులను నింద్రియములు బలహీనములై పాటవముచెడి వానివానికృత్యములయందు సామర్థ్యము దక్కియుండును. అవయవములన్నియు మర్దనముజేసినవిధముగ నొప్పికలిగి నిస్సారములై యుండును. హృదయము నానాటికి కరగును. రెండునేత్రములకును సంధిస్థానమున వాపుకల్గును. శరీరమెల్ల కృశించును. కారణములేకయే కోప మధికమగును. నోట జొల్లుకారును. మాటలాడుశక్తి తగ్గును. అన్నముపై ద్వేషముపుట్టును. చల్లనివస్తువులయందును శిశిరోపచారములయందును ద్వేషము కల్గును. వెండ్రుకలూడును. జాఠరాగ్ని చల్లారును. తొడలుకృశించును. జ్వరమువచ్చును. శ్వాస మధికమగును. చెవులయందు ధ్వని కల్గును. చక్రముపై నున్నవానివలె నొడలు తిరుగును. శ్రమకల్గును.

ఇచ్చట "శ్లథేన్ద్రియః" అనుపదముచేత వాక్పాదపాణిపాదపాయూపస్థములును త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములును గ్రహింపబడును. ఈదశేంద్రియములును చెడి స్వకృత్యముల నిర్వహించుసామర్థ్యము దక్కియుండునని భావము.

## పాండురోగభేదములు.

స పఞ్చధా పృథగ్దోషైః సమస్తైః మృత్తికాదనాత్. ౭

పైచెప్పిన పాండురోగము వాతపిత్తకఫములచే వేరువేరుగను అన్నింటి సన్నిపాతముచేతను మట్టితినుటచేతను జనించుటంజేసి యైదువిధము లగును.

ఇచ్చట నీవిమర్శనము కలుగుచున్నది:—మట్టితినుటచే పాండురోగముకల్గునని చెప్పబడినది. అందు కషాయరసముకలమట్టితినుటచే వాతము ప్రకోపించి పాండురోగమును గల్గించుననియు, ఉప్పుమట్టిని తినినచో పిత్తము ప్రకోపించి పాండువును కల్గించుననియు, తీపికల్గినమట్టిని తినినయెడ కఫము ప్రకోపించి పాండువును గల్గించు ననియు క్రింద చెప్పబడును. ఈపద్ధతిప్రకారము మట్టిని తినుటవలన వాతపిత్తకఫములు ప్రకోపించి పాండురోగమును గల్గించునని స్పష్టమగుచున్నది. ఇట్లుండ వాతాదులచే జనించు పాండురోగభేదములలో నంతర్భూతమగునుగాన మృత్తికాజనిత పాండురోగమును ప్రత్యేకముగ నేలచెప్పవలెను? అనునాశంకకల్గును కాని వీనిపరస్పరభేదము నిట్లు తెలియునది:—

వాతాదిదోషములగలుగు పాండురోగములయందు ఆయాదోషము తనశక్తిచే పాండురోగములగలిగించియుంతట నివర్తించును. మృత్తికాభక్షణమున గలిగిన పాండురోగమునమాత్రము రోగము జనించినపిమ్మటకూడ ననువర్తించియుండి తీక్ష్ణములగు సంశోధనములగాని నివర్తింపదు. అట్టిచికిత్స జేయునందాక శరీరమున వ్యాపించియుండును. కావున దోషజపాండువులకంటె మృజ్జపాండువునందు చికిత్స భిన్నముగ జేయుటకై వేరుగ జెప్పబడినది. కావున దోషజభేదములకన్న మృత్తికాభక్షణ జనిత పాండురోగము భిన్నమగును.

## పాండురోగపూర్వరూపము.

ప్రాగ్రూపమస్య హృదయస్పన్దనం రూక్షతా త్వచి,
అరుచిః పీతమూత్రత్వం స్వేదాభావోఽల్పవహ్నితా. ౮
సాదశ్శ్రమః

పాండురోగము జనించుటకుముందు హృదయము అదరును. చర్మమున జిడ్డులేక రూక్షమై యుండును. నోరు అరోచకము కల్గియుండును. మూత్రము పచ్చనై యుండును. శరీరముపై చెమటబట్టదు. జఠరాగ్ని మందగించును. శరీరము కృశించును. శ్రమముకల్గును. (ఇవి పాండురోగపూర్వరూపములు).

## వాతికపాండులక్షణము.

అనిలాత్తత్ర గాత్రరుక్ తోదకమ్పనమ్,
కృష్ణరూక్షాఽరుణ సిరానఖవిణ్మూత్రనేత్రతా. ౯

శోఫానాహాస్యవైరస్య విట్ శోషాః పార్శ్వమూర్ధరుక్,

పైజెప్పిన పాండురోగములలో వాతమునజనించిన పాండువునందు శరీరమున నొప్పిపుట్టును. సూదులబొడిచినవిధముగ పోటుపుట్టును. శరీరము వడకును. శరీరము నందలి నరములును గోళ్లును మలమూత్రంబులును కన్నులును నల్లనిరంగుకల్గి రూక్షంబులై యరుణవర్ణము కల్గియుండును. వాపుకల్గును. కడుపుబ్బరించును. నోరు రుచి నెరుంగకుండును. మలము ద్రవములేక శోషించును. ఇరుప్రక్కలయందును తలయందును నొప్పిపుట్టును.

## పైత్తికపాండులక్షణము.

పిత్తాద్ధరితపీతాభసిరాదిత్వం జ్వరస్తమః. ౧౦
తృట్ స్వేదమూర్ఛాశీతేచ్ఛా దౌర్గన్ధ్యం కటువక్త్రతా,
వర్చోభేదోఽమ్లకో దాహః

పిత్తప్రకోపమున గల్గినపాండురోగమునందు నరములును గోళ్లును చర్మంబును మూత్రపురీషంబులును కన్నులును ఆకుపచ్చనిరంగైనను లేక పసుపురంగైనను కలిగియుండును. జ్వరము కలుగును. చీకటి నున్నట్లు కన్నులు బూచులు గ్రమ్మును. దప్పియధికమగును. చెమటబట్టును. మూర్ఛగ్రమ్మును. శీతోపచారాదులయం దిచ్ఛబొడమును. శరీరము దుర్గంధముగ నుండును. నోరు చేదైయుండును. మలము ఉండలుగ వెడలును. పులిత్రేనుపులు వెడలును. తాపము కలుగును.

## కఫజసన్నిపాతజపాండురోగలక్షణములు.

కఫాచ్ఛుక్లసిరాదితా. ౧౧
తన్ద్రాలవణవక్త్రత్వం రోమహర్షః స్వరక్షయః,
కాసశ్ఛర్దిశ్చ నిచయాన్మిశ్రలిఙ్గోఽతిదుస్సహః ౧౨

కఫప్రకోపమునగలిగిన పాండువునందు సిరలు చర్మము గోళ్లు మలమూత్రములు కన్నులు ఇవియన్నియు తెల్లనిరంగుకలిగియుండును. పనులయం దుత్సాహములేక కునికిపాటు కలుగును. నోరు ఉప్పగనుండును. గగురుపాటు కలుగును. కంఠస్వరము హీనమై నానాట క్షీణమగును. దగ్గువచ్చును. వాంతియగును.

మూడుదోషములు సమానములుగ ప్రకోపించుటచే గలిగిన పాండురోగమున నాయాదోషములకు వేరువేరజెప్పినలక్షణములన్నియు నొకటిగ మిశ్రములై యుండును, ఇయ్యది మిక్కిలి యోరువ శక్యముగాకుండును.

## మృజ్జపాండురోగ సంప్రాప్తిలక్షణములు.

మృత్కషాయాఽనిలం పిత్తమూషరా మధురా కఫమ్,
దూషయిత్వా రసాదీంశ్చ రౌక్ష్యాద్భుక్తం విరూక్ష్య చ. ౧౩

స్రోతాంస్యపకై ర్వాపూర్య కుర్యాద్రుద్ధ్వా చ పూర్వవత్,
పాణ్డురోగం తతశ్శూనాభిపాదస్య మేహనః. ౧౪
పురీషం కృమిమన్ముఞ్చేత్ భిన్నం సాసృక్కఫం నరః,

వగరుకలిగినమట్టిని తినినయెడ నయ్యది వాతమును ప్రకోపింపజేసి పాండురోగమును కలిగించును. చౌటిమట్టిని తినినచో పిత్తమును ప్రకోపింపజేసి పాండువును కలిగించును. తీపికలమట్టిని తినినయెడ కఫమును ప్రకోపింపజేసి పాండురోగమును కలిగించును. అదియెట్లులన:—పైజెప్పినరసములు కలమట్టిని తినినయెడ వరుసగ నాయా దోషమును ప్రకోపింపజేసి రసాదిధాతువులం జెరిచి మట్టియందలి రూక్షగుణముచేత భుజింపబడినయాహారమునుగూడ రూక్షముగ జేసి అయ్యది పాకమునొందకయే (జీర్ణము గాకయే) స్రోతోరంధ్రముల నన్నింటిని నిండించి యడ్డగించి "పిత్తప్రధానాః కుపితాః" అని పాండురోగసంప్రాప్తియందు జెప్పబడినక్రమముగ పాండురోగమును కలిగించును. ఈరోగమునందు నాభిస్థానమునను పాదములయందును ముఖమునందును గుహ్యమునందును వాపుకలుగును. మలమున పురుగులుజేరి బైటవెడలును. అట్టిమలము ఉండలై రక్తములోను కఫములోడనుగూడి వెడలును. ఇయ్యది మృత్తికాభక్షణమున గలిగినపాండురోగము.

## కామలానిదానసంప్రాప్తిలక్షణములు.

యః పాణ్డురోగీ సేవేత పిత్తలం తస్య కామలామ్. ౧౫
కోష్ఠశాఖాశ్రయాం పిత్తం దగ్ధ్వాసృఙ్మాంసమావహేత్,
హారిద్రనేత్రమూత్రత్వఙ్నఖవక్త్రశకృత్తయా, ౧౬
దాహాఽవిపాకతృష్ణావాన్ భేకాభో దుర్బలేన్ద్రియః,

పాండురోగముచేత పీడింపబడినమనుజుడు పిత్తమును వృద్ధిచేయు మిరపకాయలు మున్నగుపదార్థముల మితిమీరి యుపయోగించినయెడ పిత్తము మిక్కిలి ప్రకోపమునొంది రక్తమాంసములను శోషింపజేసి కోష్ఠమునందు కామల యనురోగమును కలిగించును. ఈరోగమున కన్నులు మూత్రము చర్మము గోళ్లు ముఖము మలము ఇవి యన్నియు పసుపువలె పచ్చనై యుండును. కోష్ఠమున మంటపుట్టును. భుజింపబడిన యాహారము జీర్ణముకాదు. దప్పి యధికమగును. శరీరము కృశించుటచేత కప్పవంటి యాకారముకలిగి వాక్పాదపాణిపాయూపస్థములు త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు ననుపదియింద్రియములును దానిదానికి సంబంధించినపనులయందు పాటవముడిగి బలహీనములై యుండును. (ఇది కుంభకామలారోగము).

ఉపక్రమమున ప్రతిజ్ఞాసూత్రమున కామలను జేర్చుకున్నను పాండురోగమున నపథ్యసేవనముచే కామలారోగము సంభవించును. కావున పాండురోగముతో జేర్చి కామలారోగనిదానాదులు చెప్పబడియెనని యెఱుంగునది.

### కుంభకామలాలక్షణము.

భవేత్పిత్తోల్బణస్యాసౌ పాణ్డురోగాదృతేఽపి చ. ౧౭
ఉపేక్షయా చ శోఫాఢ్యా సా కృచ్ఛ్రా కుమ్భకామలా,

పైజెప్పిన కామలారోగము పాండురోగము లేకున్నను పిత్తం బధికముగనుండు మనుజుడు పిత్తమును వృద్ధినొందించునాహారాదుల సేవించినయెడ పైజెప్పినప్రకారము కోష్ఠము నాశ్రయించిన కామలారోగము కల్గును.

మరియు నట్టి కామలారోగమునకు దగిన చికిత్సల జేయక యుపేక్షించినయెడ శరీరమున కలిగినవాపు మిక్కుటమై ఘనీభవించి యుండును. ఇయ్యది కుంభకామలారోగమని యెఱుంగునది. ఇయ్యది మిక్కిలి కష్టసాధ్యము.

### హలీమకలక్షణము.

హరితశ్యావపీతత్వం పాణ్డురోగే యదా భవేత్. ౧౮
వాతపిత్తాద్భ్రమస్తృష్ణా స్త్రీష్వహర్షో మృదుర్జ్వరః,
తన్ద్రా బలానలభ్రంశః లోఢరం తం హలీమకమ్. ౧౯
అలసం చేతి శంసన్తి

పాండురోగమునందు పచ్చనిరంగైనను శ్యామవర్ణంబైనను పసుపురంగైనను శరీరముపై నధికముగ కలిగి వాతపిత్తములు అధికములగుటవలన భ్రమంబును దప్పియుం స్త్రీలయందు (సంభోగమునందు) ఉత్సాహభంగంబును స్వల్పముగ జ్వరంబును కునికిపాటును కలిగి, శరీరబలంబును అగ్నిబలంబును నశించినయెడ నయ్యది హలీమకమనియు లోఢరమనియు అలసంబనియు మునులు చెప్పెదరు.

### శోఫనిదానము.

తేషాం పూర్వముపద్రవాః,
శోఫప్రధానాః కథితః స ఏవాతో నిగద్యతే. ౨౦

పైని పాండు మున్నగు రోగములలక్షణము జెప్పుతరి "శూనాక్షికూటః" "శూనపాన్నాభిమేహనః" ఇవి మున్నగువాక్యముల చేత శోఫము ప్రధానముగ జెప్పబడినది. కావున పాండువు మున్నగు పైజెప్పబడిన రోగములు శోఫ ప్రధానములు, పైజెప్పిన రీతిగ పాండురోగమునకు ప్రధానోపద్రవమైనశోఫనిదానము ఈక్రింద వివరింపబడును

### శోఫసంప్రాప్తి.

పిత్తరక్తకఫాన్వాయుః దుష్టో దుష్టాన్ బహిస్సిరాః,
నీత్వా రుద్ధగతిస్తైర్హి కుర్యాత్త్వఙ్మాంససంశ్రయమ్. 21
ఉత్సేధం సంహతం శోఫం తమమాహుర్నిచయాదతః,
సర్వం

వాతము స్వకారణములచే ప్రకోపమునంది శరీరమున దుష్టములైన పిత్తరక్తకఫములను లాగికొని శరీరమున పైభాగమునయుండు సిరలం జేర్చి ఆట్టికఫపిత్తరక్తములచే నడ్డగింపబడి త్వక్కును మాంసమును ఆశ్రయించిన శోఫమును కలిగించును. అట్టిశోఫ త్రిదోషములసన్నిపాతమున గలుగును. అయ్యది నిశ్చలమై యుండును.

### శోఫభేదములు

హేతువిశేషైస్తు రూపభేదాన్నవాత్మకమ్ 22
దోషైః పృథగ్ద్వయైస్సర్వైః అభిఘాతాద్విషాదపి,
ద్విధా వా నిజమాగన్తుం సర్వాఙ్గైకాఙ్గజం చ తమ్. 23
పృథూన్నతగ్రథితతా విశేషైశ్చ త్రిధా విదుః,

పైజెప్పినప్రకారము శోఫములన్నియు మూడుదోషముల సన్నిపాతముననే కలుగును. అయినను ఆట్టిమూడుదోషములలో నొక్కొకదోషము ప్రబలముగ నొకసమయమున ప్రకోపమునొందును. ఒకసమయమున రెండేసిదోషములు ప్రబలములుగ ప్రకోపమునొందును. ఒకసమయమున నన్నియు సమములుగ ప్రకోపమునొందును. అట్టి హేతువిశేషములచే దానిదానిలక్షణములు భిన్నభిన్నములుగ నుండును. కావున నట్టిరూపభేదములచేత శోఫము తొమ్మిదివిధములుగ నుండును. అది యెట్లనగా:—వాతపిత్తకఫములు ఒక్కొకటి ప్రకోపించి కలుగునవి వాత-పిత్త-కఫ-భేదములచే మూడు, అందు రెండేసి దోషములు ప్రకోపించుటచే గలిగినవి వాతపిత్త-వాతకఫ-పిత్తకఫభేదములచే మూడు. అన్నిదోషములును సమములుగ ప్రకోపించి కలిగినది. సాన్నిపాతికమొకటి. అభిఘాతముచే కలిగినదియొకటి. విషముచే గలిగినది యొకటి. ఇవియన్నియు కలిసి శోఫరోగము తొమ్మిదివిధము లగును.

మరియు నిజమనియు ఆగంతుజమనియు శోఫము రెండువిధములు. సర్వాంగములయందును బుట్టినది సర్వాంగజమనియు, శరీరమునందలి యొకానొకయవయవమునబుట్టినది యేకాంగజమనియు రెండువిధములు. (ఇది యాశ్రయభేదముచే గలిగిన భేదము.) పృథువు (విశాలమైనది), ఉన్నతము (ఎత్తైనది) గ్రథితము (గ్రంథివలె నుండునది) అనియు మూడువిధములగును. (ఇది యాకృతిభేదమున గలిగినభేదము.)

### శోఫజనించుటకుహేతువులు, సంప్రాప్తి.

సామాన్యహేతుశ్శోఫానాం దోషజానాం విశేషతః. ౨౪
వ్యాధికర్మోపవాసాదిక్షీణస్య భజతో ద్రుతమ్,
అతిమాత్రముథాన్యస్య గుర్వమ్లస్నిగ్ధశీతలమ్. ౨౫
లవణక్షారతీక్ష్ణోష్ణం శాకామ్బు స్వప్నజాగరమ్,
మృద్గ్రామ్యమాంసవల్లూరమజీర్ణశ్రమమైథునమ్. ౨౬
పదాతిర్మార్గగమనమ్ యానేన క్షోభిణాపి వా,
శ్వాసకాసాతిసారార్శో జఠరప్రదరజ్వరాః ౨౭
విషూచ్యలసకచ్ఛర్ది గర్భవీసర్పపాణ్డుతాః,
అన్యే చ మిథ్యోపక్రాన్తాః తైర్దోషాః వక్షసి స్థితాః, ౨౮
ఊర్ధ్వం శోఫమధో వస్తా మధ్యే కుర్వన్తి మధ్యగాః,
సర్వాఙ్గగాస్సర్వగతం ప్రత్యఙ్గేషు తదాశ్రయాః. ౨౯

ఈక్రిందజెప్పబడు గుర్వమ్లాదిసేవనము మున్నగునవి నిజాగంతుభేదముల రెండు విధములైన శోఫలకును సామాన్యకారణమగును. అందును వాతాదిదోషములచే బుట్టిన శోఫమునకు విశేషముగ హేతువులగును:—జ్వరాదిరోగములచేనైనను వమన-విరేచన-నిరూహ-అనువాసన-నస్యములను పంచకర్మల సేవించుటచేనైనను ఉపవాసముచేనైనను శరీరము క్షీణించినవాడు శీఘ్రముగ గుర్వమ్లాదిపదార్థముల సేవించినను, అటుగాక స్వస్థకుండువాడును గుర్వమ్లాదిపదార్థముల నధికముగ సేవించినను శోఫము కలుగును. అవియెట్లులన:— గురుపదార్థములను, పులుపుగలపదార్థములను, స్నిగ్ధపదార్థములను, శీతలపదార్థములను, ఉప్పును కారమును గలపదార్థములను, తీక్ష్ణంబులును ఉష్ణంబులునైన పదార్థములను, ఆకుకూరలను, నీళ్లను, పగటినిద్రను, రాత్రి నిదురమేల్కాంచుటను, మృత్తికను, గ్రామములయందు పుట్టినకోడి మున్నగుజంతువులమాంసమును, అజీర్ణపదార్థములను, శరీరశ్రమమును, స్త్రీసంభోగమును వీనిలో యథాసంభవముగ పైజెప్పినరీతిగ వ్యాధ్యాదులచే క్షీణులు శీఘ్రముగసేవించినను, తదితరులు (స్వస్థతనున్నవారు) మితిమీఱ సేవించినను దోషములు ప్రకుపితములై వక్షస్స్థలమునజేరి రొమ్మును పైభాగమును, వస్తియందు జేరినపుడు శరీరమునందధోభాగమునను, శరీరమధ్యభాగమునజేరినపుడు మధ్యశరీరమునను, సర్వాంగములజేరినపుడు సర్వశరీరమునను, ప్రత్యేకాంగములజేరినపుడు ఆయాఅవయవములయందును శోఫముకలుగును.

మరియు పాదచారముగ త్రోవనడచినను, గుఱ్ఱము మొదలగువానిపైనెక్కి శరీరముకదలునట్లు సవారిచేసినను, శ్వాసకాసములు అతిసారము, అర్శోరోగము, ఉదరము,

రక్తప్రదరము, జ్వరము, విషూచి, అలసకము, ఛర్ది, విసర్పము, పాండురోగము ఇవి మున్నగురోగములు సంభవించినపుడు ఆయావ్యాధికి ప్రతికూలముగ చికిత్స జేసినను, అట్టి వ్యాధులయందు అపథ్యములగు నాహారవిహారాదుల జేసినను పైజెప్పినరీతిగ వాతాది దోషములు ప్రకుపితములై వక్షస్థలము మున్నగు నాయాస్థానముల జేరినపుడు పైజెప్పిన క్రమముగ నాయాస్థలముల శోఫము జనించును.

### శోఫపూర్వరూపము.

తత్పూర్వరూపం దవథుః సిరాయామోఽఙ్గగౌరవమ్,

పైజెప్పినశోఫము జనించుటకుమున్ను కన్నులు మున్నగువానియందు తీవ్రమైన యావిరివెడలును, శోఫము కలుగుస్థలమున నరములు విశాలములుగ నుండును. ఆచోటనే భారము కలిగియుండును. ఇవియన్నియు శ్వయథురోగమునకు మున్నుగలుగు పూర్వరూపములు

దవథులక్షణము తంత్రాంతరమున నిట్లు చెప్పబడెను.—"దవథుశ్చక్షురాదిభ్య స్తీవ్రమూష్మప్రవర్తనమ్"

### వాతజశోఫలక్షణము.

వాతాచ్ఛోఫశ్చలో రూక్షః ఖరరోమారుణాసితః. ౩౦
సంకోచస్పన్దహర్షార్తితోదభేదప్రసుప్తిమాన్,
క్షిప్రోత్థానశమశ్శీఘ్రమున్నమేత్పీడితస్తనుః. ౩౧
స్నిగ్ధోష్ణమర్దనైశ్శామ్యేత్ రాత్రావల్పో దివా మహాన్,
త్వక్చ సర్షపలిప్తేవ తస్మింశ్చిమిచిమాయతే. ౩౨

వాతమునగల్గిన శోఫమునందు వాపు చంచలమై నిల్కడలేక రూక్షముగ నుండును. వాపుకల్గినస్థలమునందలిరోమములు కరకుకల్గియుండును. వాపు అరుణవర్ణంబైనను నల్లని రంగుకల్గియైన నుండును. ముడతలుకల్గి అదరుచు జలదరించునట్లుండి నొప్పియుం పోటుయుకల్గి పగులునట్లు బాధగల్గి స్పర్శను నెరుంగజాలకుండును. అట్టివాపు అతిశీఘ్రముగ జనించి శీఘ్రముగనే శమించును. వాపుకల్గినచోట వ్రేల నదిమినయెడ గుంటపడి మరల శీఘ్రముగ పైకి నుబుకును. అయ్యది సూక్ష్మముగనుండును. స్నిగ్ధములగు తైలాదుల బూసినను ఉష్ణోపచారముల జేసినను మర్దనము జేసినను శాంతినొందును. రాత్రిపూట స్వల్పముగనుండి పగలు గొప్పదిగ నుండును. చర్మముపై నావాలను౦రి బూసినవిధముగ చిమచిమయనుచుండును.

### పిత్తజశోఫలక్షణములు.

పీతరక్తసితాభాసః పిత్తదాతామ్రరోమకృత్,
శీఘ్రానుసారప్రశమో మధ్యే ప్రాగ్జాయతే తనుః. ౩౩
సతృట్ దాహజ్వరస్వేదదవక్లేదమదభ్రమః,
శీతాభిలాషీ విడ్భేదీ గన్ధీ స్పర్శాఽసహో మృదుః. ౩౪

పిత్తముచే గల్గినశోఫము పీతవర్ణంబైనను రక్తవర్ణంబైనను శ్వేతవర్ణంబైనను కల్గియుండును. రోగము కొంచెము తామ్రవర్ణము కలిగియుండును. శీఘ్రముగ తటాలున వ్యాపించి శీఘ్రముగనే శమించును. శరీరమునందలి మధ్యభాగమున తొలుత సూక్ష్మముగపుట్టి పిదప శరీరమునందెల్ల వ్యాపించును. ఈవాపుకలిగినపుడు దప్పి యధికమగును. మంటపుట్టును. జ్వరమువచ్చును. చెమటబట్టును. కండ్లు మున్నగువానియందు ఆవిరి యధికముగ వెడలును. వాపుకలిగినచోట చెమ్మకలిగియుండును. తిక్కయెత్తినట్లుండును. ఒడలుతిరుగును. చల్లనియుపచారాదులయం దభిలాషకలుగును. మలము ఉండలుగ వెడలును. శరీరముపై నొకవిధముగ వాసనకలిగియుండు. చేతతాకినను ఓరువజాలకుండును. మెత్తనైయుండును.

### కఫజశోఫలక్షణము.

కణ్డూమాన్ పాణ్డురోమత్వక్ కఠినశ్శీతలో గురుః,
స్నిగ్ధః శ్లక్ష్ణః స్థిరః స్త్యానః నిద్రాచ్ఛర్ద్యగ్నిసాదకృత్. ౩౫
ఆక్రాన్తో నోన్నమేత్ కృచ్ఛ్రశమజన్మా నిశాబలః,
స్రవేన్నాసృక్ చిరాత్పిచ్ఛాం కుశశస్త్రాదివిక్షతః ౩౬
స్పర్శోష్ణకాంక్షీ చ కఫాత్

కఫప్రకోపమున గలిగినశోఫ దురదతోగూడి పాండువర్ణంబైనరోమములు చర్మంబునుకలిగి మిక్కిలి కఠినమై చల్లనై గొప్పదిగ బరువైయుండును. జిడ్డుకలిగి నునుపై చంచలముగాక ఘనీభవించియుండును. నిద్ర యధికమగును. వాంతియగును. జఠరాగ్ని నశించును. అదిమినచో గుంటపడి యది మరల నున్నతముగాకయుండును. మిక్కిలి కష్టముగగలిగి కష్టముగనే శమించును. రాత్రులయం దీవాపు అధికముగ నుండును. ఉష్ణమైనస్పర్శమును గోరును.

దర్భలు శస్త్రములు మున్నగునవి గ్రుచ్చనప్పుడు రక్తము స్రవించక పిచ్ఛిలమైన నీరుకారును. అదియును చిరకాలమునకే స్రవించును.

### సంసర్గ-సన్నిపాతజశోఫలక్షణములు.

యథాస్వం ద్వన్ద్వజాస్త్రయః,
సంకరాద్ధేతులిఙ్గానాం నిచయాన్నిచయాత్మకః. ౩౭

త్రిదోషములకు జెప్పినకారణముల రెండేసికారణములు కలియుటచే గలిగి అట్టి రెండేసిదోషములలక్షణములు కలిగినది ద్వంద్వజశోఫములని యెఱుంగునది. వాతపిత్త-వాతకఫ-పిత్తకఫములచే గలిగినవి మూడును ద్వంద్వజములు.

మఱియు త్రిదోషములకు జెప్పినకారణసంకరముచేగలిగి వానికి ప్రత్యేకముగ జెప్పినలక్షణములన్నియు కలిసి యుండునది సాన్నిపాతికశోఫమని యెఱుంగునది.

## ఆగంతుశోఫలక్షణము.

అభిఘాతేన శస్త్రాదిచ్ఛేదభేదక్షతాదిభిః,
హిమానిలోదధ్యనిలైః భల్లాతకకపికచ్ఛుజైః ౩౮
రసైశ్శూకైశ్చ సంస్పర్శాత్ శ్వయథుస్స్యాద్విసర్పవాన్,
భృశోష్మా లోహితాభాసః ప్రాయశః పిత్తలక్షణః ౩౯

శస్త్రములు మున్నగునాయుధములచేత ఛేదనభేదనాక్షతాదులు సంభవించినపుడు దానగల్గిన యభిఘాతముచేతను వాపుకల్గును. మఱియు మంచుచేతను చల్లనిగాలిచేతను సముద్రముపైనుండి వీచుగాలిచేతను జీడిగింజలరసంబును దురదగొండినూగు స్పృశించుటచేతను గూడ శోఫము కలుగును. ఇయ్యది బాహ్యకారణములచే జనించు చుండెడిది యాగంతుక మనదగును. అట్టిశోఫము ఒకచోటనైన నిల్కడలేక నలుదెసల వ్యాపించుచుండును. ఆకారివచ్చువిధముగ మిక్కిలి వేడికలిగి రక్తముబోలె నెఱ్ఱవారి తరుచుగ పిత్తశోఫమునకు జెప్పినలక్షణములు కల్గియుండును.

## విషజశోఫలక్షణము.

విషజస్సవిషప్రాణి పరిసర్పణమూత్రణాత్,
దంష్ట్రాదన్తనఖాపాతాత్ అవిషప్రాణినామపి ౪౦
విణ్మూత్రశుక్రోపహతమలవద్వస్త్రసంకరాత్,
విషవృక్షానిలస్పర్శాత్ గరయోగావచూర్ణనాత్. ౪౧
మృదుశ్చలోఽవలమ్బీ చ శీఘ్రో దాహరుజాకరః,

విషముతోగూడినజంతువులు శరీరముపై పాకులాడినను, అట్టివిషజంతువుల మూత్రము శరీరముపైతగిలినను, వానికోరలును దంతములును గోళ్లును శరీరము గ్రుచ్చుకొనినను, విషములేనిజంతువుల కోరలును దంతములును నఖములును గ్రుచ్చుకొనినను, విషజంతువులమూత్రశుక్రములస్పర్శముచే దూషితమైనబట్టలు శరీరముపైతగిలినను, విషవృక్షములగాలి శరీరముపైతగిలినను, విషవస్తువులచూర్ణము శరీరముపైతగిలినను వాపుకలుగును. ఇయ్యది విషసంబంధముచే గలిగినవాపు కావున విషజమని చెప్పబడును. అట్టివాపు మెత్తనై చంచలమై వ్రేలుచుండును. ఇయ్యది శీఘ్రముగ సంభవించును. మంటయు నొప్పియు కలిగియుండును.

## సాధ్యాఽసాధ్యశోఫములు.

**నవోఽనుపద్రవశ్శోఫః సాధ్యోఽసాధ్యః పురేరితః.** ౮౨

శీఘ్రకాలమున బుట్టినశోఫయు, ఉపద్రవములులేనిశోఫయు సాధింపందగియుండును. దీనికి వ్యతిరిక్తముగ చిరకాలమునుండి వ్యాపించినదియు ఉపద్రవములు లేకుండునదియు వికృతివిజ్ఞానీయాధ్యాయమున జెప్పినయరిష్టలక్షణములు కలిగినదియు నసాధ్యము. వికృతివిజ్ఞానీయమున నిట్లు చెప్పబడినది.—

"అనేకోపద్రవయుతః పాదాభ్యాం ప్రసృతో నరమ్, నారీం శోఫో ముఖాద్హన్తి కుక్షిగుహ్యాదుభావపి" అనేకములగు నుపద్రవములతో గూడినశోఫంబును, పురుషులకు పాదములబుట్టి ముఖమునకు వ్యాపించినశోఫంబును, స్త్రీలకు ముఖమునబుట్టి పాదములకు వ్యాపించుశోఫంబును, స్త్రీలకైనను పురుషులకైనను కుక్షియందును గుహ్యమునందును పుట్టినశోఫంబును తప్పక చంపును. (అసాధ్యమనుట).

## విసర్పనిదానము.

అవ: విసర్పము శోఫమునుబోలె వాతాదిదోషములను దూష్యములను ఆశ్రయించి పుట్టును కావున శోఫనిదానమును జెప్పి విసర్పనిదానమును చెప్పుట.

## విసర్పమున దోషదూష్యవిభాగము.

**స్యాద్విసర్పోఽభిఘాతాన్తైః దోషైర్దూష్యైశ్చ శోఫవత్,**

విసర్పమనునది అభిఘాతమువరకు జెప్పినదోషముల చేతను, దూష్యములగు త్వఙ్మాంసముల నాశ్రయించి శోఫమువలెనే పుట్టును. (వాత-పిత్త-కఫ-సన్నిపాత-వాతపిత్త-వాతకఫ-పిత్తకఫ-ఆగంతుభేదములచే త్వక్కును మాంసమును ఆశ్రయించి పిత్తరక్తకఫములను బాహ్యసిరలయందు వాతముజేర్చి కఫసంప్రాప్తికి జెప్పిన క్రమముగ విసర్పమును కలిగించునని భావము.)

ఇచ్చట "పిత్తరక్తకఫాన్ వాయుః" అని యుపక్రమించి చెప్పినశోఫసంప్రాప్తి క్రమమును సమన్వయము జేసికొనునది.

## అధిష్ఠానభేదముచే విసర్పభేదములు.

**త్ర్యధిష్ఠానం చ తం ప్రాహుః బాహ్యాన్తరుభయాశ్రయాత్.**
**యథోత్తరం చ దుస్సాధ్యాః**

ఆట్టివిసర్పము బాహ్యాశ్రయమనియు, అంతరాశ్రయమనియు, ఉభయాశ్రయమనియు మూడువిధములు. ఈమూడిటిలో వరుసగ నొకటికన్న నొకటి కష్టసాధ్యములైయుండును. ఇత్తెరంగున విసర్పము మూడు అధిష్ఠానముల నాశ్రయించియుండును.

### విసర్పము వ్యాపించుక్రమము.

తత్ర దోషా యథాయథమ్,
ప్రకోపనైః ప్రకుపితాః విశేషేణ విదాహిభిః. ౪౪
దేహే శీఘ్రం విసర్పన్తి తేఽన్తరన్తస్థితాః బహిః,
బహిస్థ్సాః ద్వితయే ద్విస్థాః

అట్టివిసర్పవ్యాధియందు వాతపిత్తకఫములు సర్వరోగనిదానమునజెప్పిన తిక్తోషణ కషాయాదులలో నాయాదోషమును ప్రకోపింపజేయు కారణముచే నాయాదోషము ప్రకోపమునొందిఅందును విశేషముగ విదాహకరములచే మిక్కిలి ప్రకోపమునొంది శరీరమునం దతిశీఘ్రముగ పలువిధముల వ్యాపించును. అందును ప్రకోపించినదోషములు శరీరములలోభాగమున జేరినపుడు లోభాగముననే వ్యాపించును. ఆదోషములుశరీరమున బాహ్యస్థలమున నుండునప్పుడు బాహ్యస్థలముననే వ్యాపించును. లోపలను బైటనుకూడ దోషములున్నపుడు ఉభయస్థలములయందును జేరినపుడు అంతర్బాహ్యస్థలములరెంటి యందును వ్యాపించును. (ఈమూటిలో మొదటిది యంతర్విసర్పమనియు, రెండవది బహిర్విసర్పమనియు, మూడవది యుభయవిసర్పమనియు నెరుంగునది.)

### అన్తరాశ్రయ-బహిరాశ్రయవిసర్పలక్షణములు.

విద్యాత్తత్రాన్తరాశ్రయమ్. ౪౫
మర్మోపతాపాత్సమ్మోహాత్ అయనానాం విఘట్టనాత్,
తృష్ణాతియోగాత్ వేగానాం విషమం చ ప్రవర్తనాత్. ౪౬
ఆశు చాగ్నిబలభ్రంశాత్ అతో బాహ్యం విపర్యయాత్,

అందు అంతరాశ్రయవిసర్పమున ప్రాణముల కాధారములగు హృదయము మున్నగుమర్మస్థానములయందు మిక్కిలి కష్టమైనబాధ కలుగును. మూర్ఛ గ్రమ్మును. చెవులు ముక్కులు మున్నగుస్థానములయందు అదరును. దప్పి మితిమీరి తీవ్రముగనగును. వాతాదులవేగములు మామూలుగా వెడలక నిలిచినిలిచి విషమముగ వెడలును. జఠరాగ్ని మిక్కిలి శీఘ్రముగ నశించును. ఈలక్షణములబట్టి యంతర్విసర్పమని యెరుంగునది. పైజెప్పినలక్షణములకన్న విరుద్ధములగులక్షణములు కలిగినది బాహ్యవిసర్పము.

### వాతవిసర్పలక్షణము.

తత్ర వాతాత్పరీసర్పః వాతజ్వరసమవ్యథః. ౪౭
శోఫస్ఫురణనిస్తోదభేదాఽఽయామార్తిహర్షవాన్,

అందు వాతమునబుట్టిన విసర్పమునందు వాతజ్వరమునకు సమానములగుబాధలు కలుగును. శోఫము అదరుచుండును. సూదులబొడిచినవిధముగను గొడ్డలిచే పగులదీయు

విధముగను పోటును నొప్పియుం గలుగును. లాగిపట్టినట్లులు బాధకలిగి పులకరించునట్లుండును.

### పిత్త-కఫజవిసర్పలక్షణములు.

పిత్తాద్ద్రుతగతిః పిత్తజ్వరలిఙ్గోఽతిలోహితః. ౪౮
కఫాత్కణ్డూయుతః స్నిగ్ధః కఫజ్వరసమానరుక్,

పిత్తమునగలిగినవిసర్పము అతిశీఘ్రముగ నలుదెసల శరీరమున వ్యాపించుచుండును. పిత్తజ్వరమునకు జెప్పినలక్షణములుకలిగి మిక్కిలి యెఱ్ఱనిరంగు కలిగియుండును. కఫమున జనించినవిసర్పమున జిలయధికముగనుండును. స్నిగ్ధమై కఫజ్వరమునకు సమానములగు బాధలు కలిగియుండును.

### విసర్పమును పేక్షించుటచే గలుగువిశేషములు

స్వదోషలిఙ్గైశ్చీయన్తే సర్వే స్ఫోటైరుపేక్షితాః. ౪౯
తే పక్వభిన్నాః స్వం స్వం చ బిభ్రతి వ్రణలక్షణమ్,

పైజెప్పినవిసర్పములరూపమైనశోఫకు తగినచికిత్స జేయక యుపేక్షించినయెడ కొంతకాలమునకు ఏదోషమున విసర్పము జనించునో ఆదోషమునకు సమానలక్షణములు గల బొబ్బలచే నావరింపబడును. అట్టి స్ఫోటములు క్రమముగ పరిపక్వములై పగిలి ఆయాదోషములచే గలిగినవ్రణలక్షణములతో గూడియుండును.

(వాతమున జనించినవిసర్పము నుపేక్షించినయెడ వాతలక్షణములతో గూడిన స్ఫోటములు వ్యాపించును. అవి పక్వములై పగిలి వాతజవ్రణమునకు జెప్పినలక్షణములు కలిగియుండును. ఇత్తెరంగుననే తక్కినవాని నన్నింటి నూహించునది.)

### వాతపిత్తజవిసర్ప (అగ్నివిసర్ప)లక్షణము.

వాతపిత్తజ్జ్వరచ్ఛర్దిమూర్ఛాతీసారతృడ్భ్రమైః. ౫౦
అస్థిభేదాగ్నిసదనతమకారోచకైర్యుతః,
కరోతి సర్వమఙ్గం చ దీప్తాఙ్గారావకీర్ణవత్. ౫౧
యం యం దేశం విసర్పశ్చ విసర్పతి భవేత్స సః,
శాన్తాఙ్గారాసితో నీలః రక్తో వాశు చ నీయతే. ౫౨
అగ్నిదగ్ధ ఇవ స్ఫోటైః శీఘ్రగత్వాద్ద్రుతం చ సః,
మర్మానుసారీ వీసర్పః స్యాద్వాతోఽతిబలస్తతః. ౫3
వ్యథేతాఙ్గం హరేత్సంజ్ఞాం నిద్రాం చ శ్వాసమీరయేత్,
హిధ్మాం చ స గతోఽవస్థాం ఈదృశీం లభతేనరా. ౫౪

క్వచిచ్ఛర్ద్యాఽరతి గ్రస్తో భూమిశయ్యాసనాదిషు,
చేష్టమానస్తతః క్లిష్టో మనోదేహశ్రమోద్భవామ్. ౫౫
దుష్ప్రబోధోఽశ్నుతే నిద్రాం సోఽగ్నివీసర్ప ఉచ్యతే,

వాతపిత్తములు రెండును ప్రకోపించుటంజేసి కలిగినవిసర్పమునందు జ్వరంబును మూర్ఛయు, వాంతియు, అతిసారంబును, దప్పియు, భ్రమంబును, అస్థులలో నొప్పి గలుగును. జఠరాగ్ని బొత్తుగ చల్లారును. చీకటిగ్రమ్మినరీతిగ నేమియుం దెలియకుండును. అరోచకముకలుగును. శరీరంబంతయును మండుచుండు నిప్పుకణముల చే వ్యాపించినవిధముగ మంటపుట్టును. మరియు శరీరమునం దెచ్చటెచ్చట నావిసర్పము వ్యాపించి తిరుగుచుండునో ఆయాచోటు నిప్పుచల్లారినబొగ్గువలె నల్లబడును. లేక రక్తవర్ణముగనైనను నీలవర్ణముగనైన నుండును. నిప్పునకాలినబొబ్బలవంటిబొబ్బలచే వ్యాపించియుండును. విసర్పము మిక్కిలి శీఘ్రముగ వ్యాపించుస్వభావము కలదిగాన నతిశీఘ్రముగ హృదయాదిమర్మస్థానముల వ్యాపించును. దానివలన వాతము మిక్కిలి ప్రబలమై యవయవముల నన్నిటిని తీవ్రముగ బాధించును. ప్రజ్ఞ తప్పును. నిద్రను రానీయదు. శ్వాసమును ప్రబలముగ వెడలించును. వెక్కిళ్లు పుట్టును. ఈవిసర్పముచే బీడింపబడిన మనుజుడు పైజెప్పినరీతిగ దురవస్థనొంది భూమిపై బరుండినను కూర్చున్నను నిలబడియున్నను సుఖము లేశమాత్రమైన లేక అన్నివిషయములయందును ఆసక్తి కొంచెమైన లేక పుడమిపయింబడి పొరలాడుచు మిక్కిలి కష్టమునొందును. మనస్సుయొక్కయు శరీరముయొక్కయు శ్రమముచే గలిగిన తీవ్రమైననిద్ర బొంది బలాత్కారముగనైన మేల్కొనజాలక యొకనిముసమైన సుఖములేక చాలకష్టమునొంది తుదకు మరణరూపమైన గాఢనిద్ర బోవును. ఇయ్యది వాతపిత్తసంసర్గమునకలిగిన యగ్నివిసర్పము.

కఫవాతజ(గ్రంథి)విసర్పలక్షణము.

కఫేన రుద్ధః పవనః భిత్త్వా తం బహుధా కఫమ్. ౫౬
రక్తం వా వృద్ధరక్తస్య త్వక్సిరాస్నాయుమాంసగమ్,
దూషయిత్వా చ దీర్ఘాణువృత్తస్థూలఖరాత్మనామ్. ౫౭
గ్రన్థీనాం కురుతే మాలాం రక్తానాం తీవ్రరుగ్జ్వరామ్,
శ్వాసకాసాఽతిసారాస్యశోషహిధ్మావమిభ్రమైః. ౫౮
మోహవైవర్ణ్యమూర్ఛాఙ్గభంగాగ్నిసదనైర్యుతామ్,
ఇత్యయం గ్రన్థివీసర్పః కఫమారుతకోపజః. ౫౯

కఫస్వకారణములచే ప్రకోపమునొంది తొలుత వాయుసంచారమార్గము నడ్డగించును. దానివలన వాతము ప్రకోపమునొంది తనమార్గమున కడ్డుపడినకఫమును పలు

విధముల తునియలుగ భేదించును. పిదప తొలుతనే మిక్కిలి వృద్ధినొందినరక్తముగల మనుజునియొక్క త్వక్కును సిరలను స్నాయువులను మాంసమును ఆశ్రయించియుండు రక్తమును ఆకఫము బొత్తుగ చెరిచి, దీర్ఘంబులును సన్నవియు స్థూలంబులును వర్తులంబులు కఠినంబులును నగు గ్రంథులను మాలికవలె వరుసగనుండునట్లు కలిగించును. అట్టి గ్రంథిమాలరక్తవర్ణంబై తీవ్రమైననొప్పియు జ్వరంబును కలిగియుండును. మరియు నీవ్యాధియందు శ్వాసకాసంబులును, అతిసారంబును కల్గును. నోట ద్రవములేక యెండును. ఎక్కిళ్లు తీవ్రముగ వెడలును. వాంతియగును. ఒడలు తిరుగును. చిత్తభ్రమము గ్రమ్మును. శరీరవర్ణము మారును మూర్ఛ గ్రమ్మును. అవయవములు నొచ్చును. జఠరాగ్ని నశించును. ఇయ్యది కఫవాతసంసర్గమున గలిగిన గ్రంథివిసర్పము.

### కఫపిత్తజ(కర్దమ)విసర్పలక్షణము.

కఫపిత్తజ్వరస్స్తమ్భః నిద్రాతన్ద్రాశిరోరుజః,
అఙ్గావసాదవిక్షేపప్రలాపారోచకభ్రమాః ౬౦
మూర్ఛాఽగ్నిహానిర్భేదోఽస్థ్నాం పిపాసేన్ద్రియగౌరవమ్,
ఆమోపవేశనం లేపః స్రోతసాం స చ సర్పతి ౬౧
ప్రాయేణామాశయే గృహ్ణన్ ఏకదేశం నచాతిరుక్,
పిటకైరవకీర్ణోఽతిపీతలోహితపాణ్డురైః. ౬౨
మేచకాభోఽసితస్నిగ్ధః మలినః శోఫవాన్ గురుః,
గమ్భీరపాకః ప్రాజ్యోష్మా స్పృష్టః క్లిన్నోఽవదీర్యతే. ౬౩
పఙ్కవచ్ఛీర్ణమాంసశ్చ స్పష్టస్నాయుసిరాగణః,
శవగన్ధిశ్చ వీసర్పం కర్దమాఖ్యముశన్తి తమ్. ౬౪

కఫపిత్తములు రెండును ప్రకోపించుటచే గలిగినవిసర్పమున జ్వరము వచ్చును. శరీరము స్తంభించును. నిద్రయు మైకంబును కల్గును. తల నొచ్చును. శరీరము కృశించును. కాలుసేతుల పలుమారు విదలించును. శరీరము జిగటకలిగియుండును. అరోచకంబును భ్రమంబును మూర్ఛయు కలుగును. జఠరాగ్ని నశించును. అస్థులలో పగుల దీయునట్లు నొప్పిపుట్టును. దప్పి యధికమగును. చక్షురాదీంద్రియములు బరువుగ నుండును. భుజింపబడినయాహారము జీర్ణముగాకయే వెడలును. నాసికాదిస్రోతోరంధ్రముల జిగటకలిగియుండును. మరియు కఫపిత్తములకు ఆమాశయము స్థానము కావున నాభికిని స్తనములకును నడుమనుండు ఆమాశయమున నొకచోట నీవిసర్పము తొలుత వ్యాపించి పిమ్మట తక్కినశరీరమునందెల్ల వ్యాపించును. మిక్కిలి బాధలేక స్వల్పముగ నొప్పికలిగియుండును. మిక్కిలి పీతవర్ణంబైనను రక్తవర్ణంబైనను పాండువర్ణంబైనను కలబొబ్బలచే నావరింపబడియుండును. మరియు స్నిగ్ధంబును కృష్ణవర్ణంబును లేక నెమలిమెడవలె చిత్రవర్ణంబును మలినంబునునగు వాపుకలిగి మిక్కిలి

బరువుగనుండును. మిక్కిలి లోభాగమున పరిపక్వమై చేతతాకిన మిక్కిలి వేడిగ నుండును. మాంసము కళ్లి బురదవలెయుండి మాంసము మూడును. దానంజేసి లోపలనుండు స్నాయువులును సిరలును స్పష్టముగ గానంబడుచుండును. పీనుగవంటిదుర్గంధముకలిగి యోరుపశక్యముగానుండును. ఇయ్యది కఫపిత్తసంసర్గమున గలిగిన కర్దమమను విసర్పము.

ఈవిసర్పమున మాంసము కళ్లి సత్తలేకుండును. గాన బాధ విశేషముగ నుండదు. ఈవిషయమను "న చాతిరుక్" అనుపదమున సూచించిరి.

## సాన్నిపాతికవిసర్పలక్షణము.

సర్వజో లక్షణైస్సర్వైః సర్వధాత్వతిసర్పణః,

మూడుదోషము లొక్కుమ్మడి ప్రకోపించి కలిగినది సన్నిపాతవిసర్పము. ఈ విసర్పమునందు వాతాదివిసర్పములకు వేరువేర జెప్పినలక్షణములన్నియుం కలిగి రసాది ధాతువుల నన్నిటి నతిశయముగ వ్యాపించును.

## క్షతజవిసర్పలక్షణము.

బాహ్యహేతోః క్షతాత్క్రుద్ధః సరక్తం పిత్తమీరయన్. ౬౫
విసర్పం మారుతః కుర్యాత్ కులుత్థసదృశైశ్చితమ్,
స్ఫోటైశ్శోఫజ్వరరుజాదాహాఢ్యం శ్యావలోహితమ్. ౬౬

శస్త్రప్రహారాదిబాహ్యకారణములచే గాయముకలుగుటవలన వాతము మిక్కిలి ప్రకోపమునొంది రక్తముతో గూడినపిత్తమును ప్రేరేపించి విసర్పమును కలిగించును. అయ్యది యులవలబోలిన యాకారముకలబొబ్బలచే వ్యాపించియుండును. ఈవిసర్పమున శోఫంబును జ్వరంబును నొప్పియు మంటయు నధికముగనుండును. శ్యామవర్ణంబైనను రక్తవర్ణంబైనను కలిగియుండును.

## విసర్పసాధ్యాऽసాధ్యనిర్ణయము.

పృథగ్దోషైస్త్రయస్సాధ్యాః ద్వంద్వజాశ్చానుపద్రవాః,
అసాధ్యా క్షతసర్వోత్థా సర్వే చాక్రాన్తమర్మకాః. ౬౭
శీర్ణస్నాయుసిరామాంసాః ప్రక్లిన్నాశ్శవగన్ధయః,

వాతపిత్తకఫములు మూడిటిచే వేరువేర జనించినవిమూడును సాధ్యములు. దోషద్వయసంసర్గమున జనించినవిమూడును ఉపద్రవములు లేకుండినవియుం సాధ్యములగును. క్షతమున జనించినవిసర్పంబులును మిక్కిలి యసాధ్యములు. మరియు విసర్పములన్నియుం హృదయాదిమర్మముల వ్యాపించినవియన్నియుం నసాధ్యములగును. స్నాయువులును సిరలును మాంసంబును కళ్లిపడిపోవుచున్నయెడ నవియు నసాధ్యములు. ద్రవముకలిగి శవమునుబోలిన దుర్గంధముకలిగినవియన్నియు నసాధ్యములగును.

ఇతి త్రయోదశోऽధ్యాయః.

# చతుర్దశాధ్యాయము.

అవ: విసర్పమునకును కుష్ఠమునకును హేతువులు సమానములుగ నుండును కావున విసర్పనిదానమును చెప్పినపిదప కుష్ఠనిదానము చెప్పబడును:—

**సూ అథాతః కుష్టశ్విత్రకృమినిదానం వ్యాఖ్యాస్యామః.**

విసర్పనిదానమును జెప్పినపిదప కుష్ఠనిదానమును వివరించెదనని భావము.

### కుష్ఠనిదానము, సంప్రాప్తి.

మిథ్యాహారవిహారేణ విశేషేణ విరోధినా,
సాధునిందావధాన్యస్వహరణాద్యైశ్చ సేవితైః. ౧
పాప్మభిః కర్మభిః సద్యః ప్రాక్తనైః ప్రేరితా మలాః,
సిరాః ప్రపద్య తిర్యగ్గాః త్వగ్లసీకాసృగామిషమ్. ౨
దూషయన్తి శ్లథీకృత్య నిశ్చరన్తస్తతో బహిః,
త్వచః కుర్వన్తి వైవర్ణ్యం దుష్టాః కుష్ఠముశన్తి తత్. 3

అపథ్యములగు నాహారవిహారాదుల సేవించినను, సంసర్గముచే పరస్పరవిరుద్ధగుణములగు క్షీరమత్స్యాదులనొకటిగ కలిపి సేవించినను సాధువులనిందించినను, అట్టిసాధువులజంపినను, ఇతరులద్రవ్యమును అపహరించుట మున్నగుపనుల జేసినను, పూర్వజన్మముననైనను ఈజన్మముననైనను పాపబహుళములగుకర్మల నాచరించినను, వాతపిత్తకఫరూపములైనదోషములు ప్రకోపించి శరీరమున నడ్డముగ వ్యాపించియుండు నరములను చర్మమును త్వగ్గతమైన లసీకయను ద్రవమును రక్తమును మాంసమును వీనినన్నింటిని చెరిచి శిథిలములుగ జేసి శరీరమున పైప్రక్క వ్యాపించుచు మిక్కిలి దుష్టములై చర్మము వివర్ణముగ జేయును. అయ్యది కుష్ఠమనురోగముగ జెప్పెదరు.

### కుష్ఠశబ్దమునకన్వర్థత.

కాలేనోపేక్షితం యస్మాత్ సర్వం కుష్ణాతి తద్వపుః,
ప్రపద్య ధాతూన్ వ్యాప్యాన్తః సర్వాన్ సంక్లేద్య చావహేత్.
సస్వేదక్లేదసంకోథాన్ కృమీన్ సూక్ష్మాన్ సుదారుణాన్,
రోమత్వక్స్నాయుధమనీతరుణాస్థీని యైః క్రమాత్. ౪
భక్షయేత్ శ్విత్రమస్మాచ్చ కుష్ఠబాహ్యముదాహృతమ్,

పైజెప్పినరీతిగ సంప్రాప్తమైనకుష్ఠమును సకాలమున దగినచికిత్స జేయక యుపేక్షించినయెడ శరీరమునెల్ల వ్యాపించియుండురసాదిధాతువులన్నిటి వ్యాపించి పిదప

నాధాతువులలో ప్రక్కకూడ వ్యాపించి వానియందు సూక్ష్మాంశములనెల్ల బొత్తుగ జెరిచి చీము మున్నగుద్రవమును కలిగించి కుళ్లినట్లు మిక్కిలి సూక్ష్మములును క్రూరంబులును నగుసన్నని పురుగులను కల్గించును. అవ్యాధి శరీరమునందలిరోమములను చర్మమును స్నాయువులను ధమనులను తరుణాస్థులను క్రమముగ నానాట తినుచుండును. దానంజేసి యవియన్నియుం నూడును. కావున నీరోగము కుష్ఠమని యన్వర్థముగ జెప్పబడును. శ్విత్రమనునది శరీరముపై చర్మమునుమాత్రము ఆశ్రయించి పుట్టునుకావున కుష్ఠమున కన్న వేరుగనుండును.

('కుషనిష్కర్షే' అనుధాతువుచేత కుష్ఠశబ్దము పుట్టినది కావున శరీరమునందలి రసాదిధాతువులనన్నిటిని నానాట శిథిలములుగ జేసి కుళ్లించి యూడునట్లుచేయువ్యాధి కుష్ఠమని యర్థము. చెవులు ముక్కు కంఠము కన్నులయావరణములయందును కంఠనాడులయందును కలయస్థులు తరుణాస్థులు అని చెప్పబడును.)

## కుష్ఠభేదములు.

కుష్ఠాని సప్తధా దోషైః పృథగ్ద్వంద్వైః సమాగతైః. ౬
సర్వేష్వపి త్రిదోషేషు వ్యపదేశోఽధికత్వతః,

కుష్ఠములు వాత-పిత్త-కఫములచే వేరువేరుగను, సంసర్గవాతపిత్త-వాతకఫ పిత్తకఫములరూపముగ రెండేసిదోషముల సంసర్గముచేతను, వాతపిత్తకఫములమూడిటి సన్నిపాతముచేతను జనించుటంజేసి యేడువిధములగును. మరియుం కుష్ఠము లన్నిటియందును త్రిదోషములు ప్రకోపమునొందును. కావున సన్నిపాతభేద మొక్కటియే యగును. అయినను అట్టిదోషముల మూడిటిలో నేదోషము మిక్కుటముగ ప్రకోపించి యుండునో అట్టిదోషాధిక్యమునుబట్టి వాతకాదిభేదములు జెప్పబడినవి.

## వాతాదికుష్ఠవిభాగము, మహాకుష్ఠములు.

వాతేన కుష్ఠం కాపాలం పిత్తాదౌదుమ్బరం కఫాత్. ౭
మణ్డలాఖ్యం విచర్చీ చ ఋష్యాఖ్యం వాతపిత్తజమ్,
చర్మైకకుష్ఠం కిటిభసిధ్మాలసవిపాదికాః. ౮
వాతశ్లేష్మోద్భవాః శ్లేష్మపిత్తాద్దద్రుశతారుషీ,
పుణ్డరీకం సవిస్ఫోటం పామా చర్మదలం తథా. ౯
సర్వైస్స్యాత్కాకణం పూర్వం త్రికం దద్రుసకాకణమ్,
పుణ్డరీకర్ష్యజిహ్వే చ మహాకుష్ఠాని సప్త తు. ౧౦

మూడుదోషములలో వాతమధికమగుటచే జనించునది కపాలకుష్ఠము. పిత్త ప్రాబల్యమున నౌదుంబరకుష్ఠము జనించును. మండలకుష్ఠము విచర్చికాకుష్ఠము కఫాధిక్యమున గల్గును. ఋష్యజిహ్వాకుష్ఠము వాతపిత్తములు రెండు నధికముగ నుండుటచే గలుగును. చర్మకుష్ఠము ఏకకుష్ఠము కిటిభకుష్ఠము సిధ్మకుష్ఠము అలసకుష్ఠము విపాదికాకుష్ఠము అనునవియారును వాతకఫము లధికముగనున్నపుడు కలుగును. దద్రుకుష్ఠముశతారుకుష్ఠము పుండరీకకుష్ఠము విస్ఫోటము పామాకుష్ఠము చర్మదలకుష్ఠముఅను నీయారును కఫపిత్త మధికమగుటచే గలుగును. కాకణమనుకుష్ఠము మూడుదోషములు సమములుగ ప్రకోపించిన సన్నిపాతమున గలుగును. ఇవియన్నియుం గలిసి కుష్ఠములు పదునెనిమిది విధములు. అందు తొలుత జెప్పబడిన కపాలౌదుంబరమండలకుష్ఠములు మూడును, దద్రు-పుండరీక-కాకణ-ఋష్యజిహ్వములను నాలుగుకుష్ఠములును చేరి యేడుకుష్ఠములను మహాకుష్ఠములు. (తక్కిన పదునొకండుకుష్ఠములును క్షుద్రకుష్ఠములని భావము).

రసాదిధాతువుల నన్నిటిని శీఘ్రముగ వ్యాపించి యనేకములగు నుపద్రవముల గలిగించి చికిత్సలకుసాధ్యములు కానివి మహాకుష్ఠములు. దీనికి వ్యతిరేకముగ నుండునవి క్షుద్రకుష్ఠములు.

## కుష్ఠపూర్వరూపము.

అతిశ్లక్ష్ణఖరస్పర్శస్వేదాఽస్వేదవివర్ణతాః,
దాహః కణ్డూస్త్వచి స్వాపః తోదః కోఠోన్నతిర్భ్రమః. ౧౧
వ్రణానామధికం శూలం శీఘ్రోత్పత్తిశ్చిరస్థితిః,
రూఢానామపి రూక్షత్వం నిమిత్తేఽల్పేఽపి కోపనమ్. ౧౨
రోమహర్షోఽసృజః కార్ష్ణ్యం కుష్ఠలక్షణ మగ్రజమ్,

కుష్ఠములు కలుగుటకుమున్ను అయ్యది జనించుస్థలమున చేతతాకినయెడ మిక్కిలి నునుపుకలిగియుండును. లేక గరగరమని కఠినముగ నుండును. అచ్చోట చెమట యధికముగ బట్టును. లేక బొత్తుగ చెమట పట్టకుండును. స్వభావసిద్ధమైనవర్ణము మారియుండును. మంటయు దురదయు నధికముగ నుండును. చర్మముపై తాకినయెడ స్పర్శము తెలియకుండును. సూదులగ్రుచ్చినతీరున పోటుకలుగును. కణుదురిగెలు కుట్టిన విధముగ దద్దులు కలుగును. చిత్తభ్రమము కలుగును. వ్రణములు అతిశీఘ్రముగబుట్టి తీవ్రమైనబాధకలిగి చిరకాలమువరకును మానకయుండును. ఒకవేళ వ్రణములు మానినను మచ్చలు మిక్కిలి రూక్షములై గరగరలాడుచుండును. స్వల్పకారణములచే గూడ వ్రణములు మరల ప్రకోపించును. కుష్ఠముకలుగబోవుస్థలమున వెండ్రుకలు నిట్రబొడిచియుండును. రక్తము నల్లనైయుండును. ఇవియన్నియు కుష్ఠములు జనించుటకు మున్ను కలుగుపూర్వరూపములు.

### కపాలకుష్ఠలక్షణము.

కృష్ణారుణకపాలాభం రూక్షం సుప్తం ఖరం తను. ౧౩
విస్తృతాసమపర్యన్తం దూషితై ర్లోమభిశ్చితమ్,
తోదాఢ్యమల్పకణ్డూకం కాపాలం శీఘ్రసర్పి చ. ౧౪

నల్లనిరంగైనను అరుణవర్ణంబైనను కలిగి కుండపెంకువలె మిక్కిలి రూక్షమై స్పర్శమును బొత్తుగ దెలియక కఠినమై సూక్ష్మమునై విశాలమై విషమముగనుండు అంచుకలిగినది కపాలకుష్ఠము. ఆయ్యది దుష్టములగురోమములచే వ్యాప్తమై యుండును. అందు పోటు అధికముగ నుండును. జిల కొద్దిగ నుండును. ఇయ్యది రసాది ధాతువులయందు శీఘ్రముగ వ్యాపించును. (ఈకపాలకుష్ఠము వాతంబైనసన్నిపాతమున గలుగును).

### ఔదుంబరకుష్ఠలక్షణము.

పక్వోదుమ్బరతామ్రత్వగ్రోమగౌరసిరాచితమ్,
బహలం బహులక్లేదం రక్తం దాహరుజాధికమ్. ౧౫
ఆశూత్థానావదరణక్రిమిం విద్యాదుదుమ్బరమ్,

పండినమేడిపండువంటియాకారంబును రంగునుకలిగి చర్మంబును రోమంబును తామ్రవర్ణములై గౌరవర్ణములగుసిరలచే నావరింపబడి దట్టమై జనించునది యౌదుంబరకుష్ఠము. ఈకుష్ఠమునందు చీమును రక్తంబును మిక్కిలి మంటయు నొప్పియుకలిగి అధికముగ వెడలును. ఈకుష్ఠవ్రణములు అతిశీఘ్రముగపుట్టి శీఘ్రముగనె పగులును. అట్టివ్రణములయందు శీఘ్రముగనే కృములు పుట్టును. ఈయౌదుంబరకుష్ఠము పిత్తం బధికమైన సన్నిపాతమునగలుగును.

### మండలకుష్ఠలక్షణము.

స్థిరం స్త్యానం గురు స్నిగ్ధం శ్వేతరక్తమనాశుగమ్. ౧౬
అన్యోన్యసక్తముత్సన్నం బహుకణ్డూస్రుతిక్రిమి,
శ్లక్ష్ణపీతాభపర్యన్తం మణ్డలం పరిమణ్డలమ్. ౧౭

కఠినంబును, ఘనంబును, గొప్పదియు, స్నిగ్ధంబును, శ్వేతవర్ణంబైనను రక్తవర్ణంబైనను కలిగినదియు, శీఘ్రముగ వ్యాపించక మందముగ వ్యాపించునదియు, ఒకటితో నొకటి కలిసినదియు, ఉన్నతంబును, దురదయు క్రిములును అధికముగనుండి చీము మొదలగునవి యధికముగ స్రవించునదియు, కొసలయందు శ్లక్ష్ణమై పచ్చని రంగుకలిగినదియు, మండలాకారంబునైనది మండలకుష్ఠము. (ఇయ్యది కఫంబధికమైన సన్నిపాతమున గలుగును.)

### విచర్చికాకుష్ఠలక్షణము.

సకణ్డూపిటికా శ్యావా లసీకాఢ్యా విచర్చికా,

మిక్కిలి దురదకలిగి శ్యామలవర్ణంబై యధికముగ నీరుగారుచుండు పిటికలు కలిగినది విచర్చిక యనుకుష్ఠము. (ఇదియు కఫాధికసన్నిపాతమున గలుగును.)

### ఋక్షజిహ్వాకుష్ఠలక్షణము.

పరుషం తనురక్తాన్తం అన్తశ్శ్యావం సమున్నతమ్. ౧౮
సతోదదాహరుక్క్లేదం కర్కశైః పిటికైశ్చితమ్,
ఋక్షజిహ్వాకృతి ప్రోక్తం ఋక్షజిహ్వం బహుక్రిమి. ౧౯

పరుషంబును, స్వల్పంబును, కొనలయందు రక్తవర్ణముకలదియు, లోపల శ్యామవర్ణంబును, ఉన్నతంబును, పోటును మంటయును నొప్పియును ద్రవంబునుకలిగి మిక్కిలి కఠినములగుబొబ్బలచే వ్యాప్తమై ఎలుగుబంటినాలుకవలె కరకుకలిగి అట్టి యాకారముకలిగినది ఋక్షజిహ్వామని చెప్పబడును. ఈకుష్ఠమున క్రిములు విశేషముగ నుండును. (ఋక్షమన నెలుగుబంటి దానినాలుకబోలె నుండుటంజేసి ఋక్షజిహ్వా మనబడును). ఇయ్యది వాతపిత్తము లధికముగ నుండుసన్నిపాతమున గలిగినది).

### చర్మ-ఏక-కిటిభకుష్ఠలక్షణములు.

హస్తిచర్మ ఖరస్పర్శం చర్మ, ఏకాఖ్యం మహాశ్రయమ్,
అస్వేదం మత్స్యశకలసన్నిభం, కిటిభం పునః ౨౦
రూక్షం కిణఖరస్పర్శం కణ్డూమత్పరుషాసితమ్,

చేత తాకిన నేనుగుచర్మమునుబోలె కర్కశమై యుండునది చర్మకుష్ఠ మనబడును. మిక్కిలి విశాలమైనప్రదేశము నాశ్రయించి చెమటబట్టక మత్స్యము యొక్క అర్ధభాగము బోలియుండునది యేకకుష్ఠము. కిటిభకుష్ఠము మిక్కిలి రూక్షమై వ్రణముల మచ్చలవలె తాకినపుడు కర్కశముగనుండి అధికముగ జిలకలిగి పరుషంబును నల్లనిరంగు కలిగినదియును నగును.

ఏకకుష్ఠలక్షణమును సుశ్రుతాచార్యు డిట్లుచెప్పెను:—"కృత్స్నోదేహోయస్య రక్తోఽరుణోవా తదేకాఖ్యం కుష్ఠమాహుస్సకుష్ఠమ్" (శరీరమంతయు రక్తవర్ణంబైనను అరుణవర్ణంబైననుకలిగి వ్యాపించుకుష్ఠము ఏకకుష్ఠ మనబడును).

### సిధ్మకుష్ఠలక్షణము.

సిధ్మం రూక్షం బహిస్స్నిగ్ధం అన్తర్ఘృష్టం రజః కిరేత్. ౨౧
శ్లక్ష్ణస్పర్శం తను శ్వేతతామ్రం దౌగ్ధికపుష్పవత్,
ప్రాయేణ చోర్ధ్వకాయే స్యాత్

సిధ్మకుష్ఠము పైట రూక్షంబును లోపల స్నిగ్ధంబునై చేత రుద్దినయెడ పాముకుబుసముబోలిన ధూళివెడలును. చేత తాకిన నునుపుకలిగియుండును. స్వల్పముగనుండును. సొరపువ్వులబోలె శ్వేతతామ్రవర్ణములు కలిసియుండును. ఇది ప్రాయికముగ మనుజులకు శరీరమున నూర్ధ్వభాగమున కలుగును.

### అలస-విపాదికాకుష్ఠములలక్షణము.

గణ్డైః కణ్డూయుతైశ్చితమ్. ౨౨
రక్తైరలసకం, పాణిపాదదార్యో విపాదికాః,
తీవ్రార్త్యో మన్దకణ్డ్వశ్చ సరాగపిటికాచితాః. ౨౩

మిక్కిలి దురదకలిగి రక్తవర్ణములైనగడ్డలచే నావరింపబడినది యలసకకుష్ఠము. అరకాళ్లును అరచేతులును పగిలి మిక్కిలి నొప్పియు స్వల్పమైనదురదయు కలిగినది విపాదికాకుష్ఠము. ఈకుష్ఠమునందు ఎఱ్ఱనైనబొబ్బలచే వ్యాప్తమైయుండును. (పైజెప్పబడిన చర్మ-ఏక-కిటిభ-సిధ్మ-అలస-విపాదికాకుష్ఠము లారును వాతకఫము లధికముగ కల సన్నిపాతమున కలుగును).

### దద్రుకుష్ఠలక్షణము.

దీర్ఘప్రతానా దూర్వావత్ అతసీకుసుమచ్ఛవిః,
ఉత్సన్నమణ్డలా దద్రూః కణ్డూమత్యనుషఙ్గిణీ. ౨౪

దద్రుకుష్ఠ మనునది పచ్చికపుడమిపై నల్లువిధముగ నల్లి అగసిపువ్వులబోలిన కాంతితో శరీరమున మండలాకారముగ వ్యాపించును. అట్టిమండలము (పొడ)లు ఉన్నతములై మిక్కిలి దురదకలిగి యొకటితో నింకొకటి కలసికొనుచు శరీరముపై నల్లికొనును.

### శతారుకుష్ఠలక్షణము.

స్థూలమూలం సదాహార్తి రక్తశ్యావం బహువ్రణమ్,
శతారుః క్లేదజన్త్వాఢ్యం ప్రాయశః పర్వజన్మ చ. ౨౫

శతారుకుష్ఠము స్థూలమైన మూలముకలిగి మంటయు నొప్పియు రక్తశ్యామవర్ణంబులును అనేకవ్రణంబులును కలిగియుండును. పూయాదుల స్రవించును. అనేకములగు క్రిములు కలిగియుండును. ఇది ప్రాయికముగ కీళ్లయందు కలుగును.

### పుండరీకకుష్ఠలక్షణము.

రక్తాన్తమన్తరా పాణ్డు కణ్డూదాహరుజాన్వితమ్,
సోత్సేధమాచితం రక్తైః పద్మపత్రమివాంశుభిః. ౨౬

ఘనభూరిలసీకాసృక్ప్రాయమాశు విభేది చ,
పుణ్డరీకమ్,

పుండరీకమనుకుష్ఠము చుట్టు రక్తవర్ణంబును నడుమ పాండువర్ణంబునై దుర దయుం మంటయుం నొప్పియుం కలిగి యున్నతమై తామరాకువలె నెఱ్ఱనిచారలు కలిగి యుండును. ఇయ్యది శీఘ్రముగ పగిలి చిక్కనైనసీరును రక్తంబును అతిశయముగ స్రవించును.

## విస్ఫోటపామాకుష్ఠములలక్షణములు.

తనుత్వగ్భిశ్చితం స్ఫోటైః సితారుణైః ౨౭
విస్ఫోటం, పిటికాః పామా కణ్డూక్లేదరుజాధికాః,
సూక్ష్మాశ్శ్యావారుణా బహ్వ్యః ప్రాయః స్ఫిక్పాణికూర్పరే. ౨౮

పలుచనిచర్మముతోఁగూడి శ్వేతవర్ణంబులును అరుణవర్ణంబులునైన పొక్కులు వ్యాపించిన నయ్యది విస్ఫోటకుష్ఠము. అధికమైన దురదయుం ద్రవంబును నొప్పియు కలిగి సూక్ష్మాకారములై శ్యామవర్ణంబును అరుణవర్ణంబును కలిగిన (తీట) బొబ్బలు అనేకములు బొడమిన నయ్యది పామాకుష్ఠము. ఇది ప్రాయికముగ రొండియందును చేతులయందును మోచేతులయందును కలుగును.

## చర్మదలకుష్ఠలక్షణము.

సస్ఫోటమస్పర్శసహం కణ్డూషాతోదదాహవత్,
రక్తం దలచ్చర్మదలం

చర్మదలమనుకుష్ఠము బొబ్బలతోఁకూడి చేతతాకిన నోరువజాలక దురదయుం మంటయుం పోటును కలిగి రక్తవర్ణమైయుండును. ఈకుష్ఠమున చర్మము పగులును కావున చర్మదలకుష్ఠ మనబడును.

(ఇచ్చట ఉషా అనునది మంటలోఁ నొకవిధమైనబాధ యని యెఱుంగునది) పైజెప్పిన దద్రు-శతారు-పుండరీక-విస్ఫోట-పామా-చర్మదలకుష్ఠము లారును కఫ పిత్తము లధికముగ నుండుసన్నిపాతమున సంభవించును.

## కాకణకుష్ఠలక్షణము.

కాకణం తీవ్రదాహరుక్. ౨౯
పూర్వం రక్తం చ కృష్ణం చ కాకణన్తీఫలోపమమ్,
కుష్ఠలిఙ్గై ర్యుతం సర్వైః నైకవర్ణం తతో భవేత్. ౩౦

కాకణకుష్ఠము మిక్కిలి తీవ్రమైనమంటయుం నొప్పియుం కలిగియుండును. ఇయ్యది తొలుత గురిగింజలబోలె రక్తవర్ణంబును కొంచెము నలుపురంగును కలిగియుండు

ను. పిదప ఆయాదోషములచే గలుగుకుష్ఠములకు వేరువేర జెప్పబడినలక్షణములన్నియుం ఆనేకవర్ణంబులు సంకరముగ కలిసియుండును. ఇది త్రిదోషములును సమానముగ ప్రకోపించిన సన్నిపాతమున జనించును. కావున అన్నింటిలక్షణములు కలిగియుండును.

సుశ్రుతాచార్యాదు మండల-శతారు-విపాదిక-అలసక-చర్మదల-విస్ఫోటకుష్ఠములను జెప్పక వదలెను. అంతట బోక స్థూలారుష్క-మహాకుష్ఠ-పరీసర్ప-విసర్ప-రాకస-అరుణకుష్ఠములు నారిటిని జెప్పి వానిలక్షణములవివరించెను. ఋషివాక్యములు ప్రమాణములు కావున నవియన్నియుం గూడ నాదరణీయములు. ఇంతియగాక దేశకాలశీతోష్ణధర్మముల మార్పునంజేసి వ్యాధులయందును కొన్నిక్రొత్తమార్పులు కల్గుచునేయుండును. వానివానిలక్షణములబట్టి వ్యాధిస్వరూపమును వాతాదిదోష సంబంధమును నిర్ణయించి ప్రతివిధాన మాచరించుట కుశలులగువైద్యులతలపై భారమని యూహించెద.

### కుష్ఠములయందు వాతాదిభేదముల గమనించువిధము.

దోషభేదీయవిహితైః ఆదిశేల్లిఙ్గకర్మభిః,
కుష్ఠేషు దోషోల్బణతాం

సకలకుష్ఠంబులును త్రిదోషజములైనను అందు వాతాదిదోషాధిక్యమునుబట్టి వాతికాదిభేదములు కల్గును. ఈవిషయమై పైన వివరింపబడినది. అందు దోషభేదీయాధ్యాయమున దోషములకు వేరువేర జెప్పినప్రకారము ఆయాదోషముల లక్షణములను దానిదానికి సంబంధించినకృత్యములను గమనించి కుష్ఠములయందును ఆయాదోషాధిక్యము నూహించునది.

### అసాధ్యకుష్ఠములు.

సర్వదోషోల్బణం త్యజేత్. 30
రిష్టోక్తం యచ్చ యచ్చాస్థిమజ్జశుక్రసమాశ్రయమ్,

పైజెప్పినకుష్ఠములలో సన్నిపాతమునగల్గినకుష్ఠము అసాధ్యము కావున చికిత్స జేయంబడదు. మరియుం వికృతివిజ్ఞానీయాధ్యాయమున జెప్పిన 'కుష్ఠం విశీర్యమాణాఙ్గం' ఇది మున్నగునరిష్టలక్షణములు కల్గినకుష్ఠము అసాధ్యము కాన విడువందగు. మరియుం అస్థి-మజ్జ-శుక్రముల నాశ్రయించినకుష్ఠంబును చికిత్సానర్హంబు.

### యాప్య-కృచ్ఛ్రసాధ్య-సుసాధ్యకుష్ఠములు.

యాప్యం మేదోగతం; కృచ్ఛ్రం పిత్తద్వన్ద్వాస్రమాంసగమ్.
అకృచ్ఛ్రం కఫవాతాఢ్యం త్వక్స్థమేకమలం చ యత్,

మేదస్సు నాశ్రయించి జనించినకుష్ఠము యాప్యము. పిత్తముతోగూడిన ద్వంద్వజ (అనగా పిత్తవాత, పిత్తకఫములసంసర్గమున బుట్టిన) కుష్ఠములును, రక్తమాంస

ముల నాశ్రయించినకుష్ఠములును కృచ్ఛ్రసాధ్యములు, కఫవాత సంసర్గమున బుట్టిన కుష్ఠములును, త్వక్కునాశ్రయించిన కుష్ఠంబును, ఏకదోషమున బుట్టినకుష్ఠమును సుఖ సాధ్యములు.

### రసాదిధాతుగతకుష్ఠలక్షణములు.

తత్ర త్వచి స్థితే కుష్ఠే తోదవైవర్ణ్యరూక్షతాః. ౩౩
స్వేదస్వాపశ్వయథవః శోణితే పిశితే పునః,
పాణిపాదాశ్రితాః స్ఫోటాః, క్లేదస్సన్ధిషు చాధికమ్. ౩౪
కౌణ్యం గతిక్షయోఽఙ్గానాం దలనం స్యాచ్చ మేదసి,
నాసాభఙ్గోఽస్థిమజ్జస్థే నేత్రరాగః స్వరక్షయః. ౩౫
క్షతే చ కృమయశ్శుక్రే స్వదారాఽపత్యబాధనమ్,
యథాపూర్వం చ సర్వాణి స్యుర్లిఙ్గాన్యసృగాదిషు. ౩౬

త్వక్కున (రసధాతువునందు) కుష్ఠము జనించినయెడ పోటును వైవర్ణ్యంబును కల్గును. చర్మము జిడ్డులేక రూక్షముగ నుండును. కుష్ఠము రక్తమునజేరినప్రుడు చెమట యధికముగ వెడలును. చేతతాకినను స్పర్శము దెలియకుండును. వాపు కల్గును. మాంస మునజేరినపుడు చేతులయందును కాళ్లయందును బొబ్బలు కల్గును. కీళ్లయందు అధిక ముగ ద్రవముచేరి స్రవించును. మేదస్సున కుష్ఠముచేరినపుడు కాళ్లుచేతులు వంకరటింక రగ వక్రములగును. నడచుట మున్నగుపనులజేయు సామర్థ్యములేక అవయవములు కత్తిచే దెగవేసినట్లు పడలును. అస్థిమజ్జలయందు కుష్ఠము చేరినపుడు ముక్కు నానాట హరించును. కన్ను లెఱ్ఱపడును, కంఠస్వరము నశించును. వ్రణములయందు క్రిములు పుట్టును. శుక్రమున జేరినపుడు తనభార్యకును తనసంతతికిని కుష్ఠసంబాధము లగు బాధలు కల్గును. మరియు శుక్రమున కుష్ఠము చేరినపుడుఅట్టివానిభార్యకును వానిసంతతి కిని పైజెప్పినప్రకారము రసాదిధాతుగతకుష్ఠలక్షణములన్నియు సంభవించును.

### శ్విత్రనిదానము.

కుష్ఠైకసంభవం శ్విత్రం కిలాసం దారుణం చ తత్.
నిర్దిష్టమపరిస్రావి త్రిధాతూద్భవసంశ్రయమ్. ౩౭

శ్విత్రమనునది కుష్ఠముతోసమానమైనయుత్పత్తి కల్గియుండును. ఇది కిలాస మనియుం చెప్పబడును. మిక్కిలి క్రూరమైనరోగము. ఇయ్యది కుష్ఠమునుబోలె చీము మొదలగుదోషమును స్రవింపదు. మరియుం వాతపిత్తకఫముల మూడిటిచేత రక్తమాంస మేదస్సుల నాశ్రయించి కల్గును.

## వాతాదిశ్విత్రలక్షణములు.

వాతాద్రూక్షారుణం పిత్తాత్తామ్రం కమలపత్రవత్,
సదాహం రోమవిధ్వంసి కఫాచ్ఛ్వేతం ఘనం గురు. 38
సకణ్డు చ క్రమాద్రక్తమాంసమేదస్సు చాదిశేత్,

అందు వాతమున రక్తము నాశ్రయించి శ్విత్రము జనించును. ఇయ్యది రూక్షంబును అరుణవర్ణంబును నై యుండును. పిత్తము చేత మాంసము నాశ్రయించి శ్విత్రము పుట్టును. ఇది దామరాకువలె తామ్రవర్ణమై మంటతోఁగూడి వెండ్రుకల నూడించుస్వభావము కలిగియుండును. కఫము చేత మేదస్సు నాశ్రయించి శ్విత్రము కలుగును. ఇది శ్వేతవర్ణంబును ఘనంబునై బరువుకలిగి మిక్కిలి జిలతోఁ గూడియుండును.

## శ్విత్రమునకు కృచ్ఛ్రత్వము.

వర్ణేనైవేదృగుభయం కృచ్ఛ్రం తచ్చోత్తరోత్తరమ్ 39

శ్విత్రమునకు పైజెప్పినపద్ధతి ననుసరించి దానివర్ణమునుబట్టియే దోషదూష్యసంబంధమును నిర్ణయించునది. (శ్విత్రము రక్తవర్ణమై యుండునేని వాతముచే రక్తము నాశ్రయించి పుట్టినదనియు, తామ్రవర్ణమైయున్నచో పిత్తముచేత మాంసము నాశ్రయించి జనించెననియు, తెల్లగనుండునెడ కఫముచే మేదస్సు నాశ్రయించి పుట్టినదనియు నెరుంగనగుగాని వేరుగవర్ణాంతరము కలుగుననియైనను, దోషదూష్యసంబంధము వేరువిధముగ మారుననియు, నూహింపవలదనిభావము)

మరియు పైజెప్పిన మూడువిధములగు శ్విత్రంబులును ఒకదానికన్న నొకటి కృచ్ఛ్రసాధ్యములు. (వాతముచే రక్తము నాశ్రయించి రక్తవర్ణముగ బుట్టినశ్విత్రమునకన్న పిత్తముచే మాంసము నాశ్రయించి శ్వేతవర్ణమై పుట్టినశ్విత్రంబును, దానికన్న కఫముచేత మేదస్సు నాశ్రయించి శ్వేతవర్ణమై జనించినశ్విత్రము మిక్కిలి కృచ్ఛ్రసాధ్యమనియు భావము.)

## సాధ్యాఽసాధ్యశ్విత్రలక్షణములు.

అశుక్లరోమాఽబహులం అసంశ్లిష్టం మిథో నవమ్,
అనగ్నిదగ్ధజం సాధ్యం శ్విత్రం వర్జ్యమతోఽన్యథా. 40
గుహ్యపాణితలోష్ఠేషు జాతమప్యచిరన్తనమ్,

శ్విత్రము మచ్చయందలి వెండ్రుకలు తెల్లబడక నల్లగనే యున్నను, చర్మము స్థూలముగాక పలుచనై యున్నను, మచ్చలు ఒండొంట గలియక విడివిడిగనున్నను, అట్టి శ్విత్రము నిప్పునకాలినదిగాకున్నను, సంవత్సరకాలమునకు లోపుగ పుట్టినను, అట్టి శ్విత్రము చికిత్సచే సాధింపదగియుండును. ఈలక్షణములకు వ్యతిరేకముగ మచ్చ

యందు వెంద్రుకలు తెల్లబడినదియుం, ఘనమైనదియుం, మచ్చలొకటితోనొకటి కలిసినదియుం, చిరకాలము ననుసరించియున్నదియు నిప్పున కాలినదియుం నగుశ్విత్రము అసాధ్యమని భావము. మరియు గుహ్యామునందును, అరకాలు అరచేతులయందును, పెదవులయందును పుట్టినశ్విత్రము నవీనముగ జనించినదైనను నివర్తింప నేరదు; కావున యశమును గోరువైద్యుడు చికిత్స జేయదగదు.

'అతోఽన్యథా' అనుదానివివరము చరకమున నిట్లున్నది:—"యచ్ఛుక్లరోమ బహుళం యత్సంలగ్నం పరస్పరమ్, యచ్చవర్షగణోపేతం తచ్ఛ్విత్రం నైవ సిధ్యతి" ఈశ్లోకార్థము పైనిచెప్పబడినది.

## సాంక్రామికవ్యాధులు.

స్పర్శైకాహారశయ్యాదిసేవనాత్ ప్రాయశో గదాః　　　౪౧
సర్వే సంచారిణో నేత్రత్వగ్వికారాః విశేషతః,

జ్వరాదిరోగములన్నియుం అట్టిరోగములు కలవారినితాకినను, వారితోగూడజేరి భుజించుట, ఒకటిగపరుండుట, ఒకచోట వారితో జేరి కూర్చొనియుండుట మున్నగుపనుల జేసినను ప్రాయికముగ నొకరినుండి మరియొకరికి వ్యాపించుస్వభావము కలిగియుండును. అందును నేత్రరోగంబులును, చర్మమునకు సంబంధించినరోగంబులును విశేషముగా పైజెప్పినకారణములచే నవశ్యముగ నొకరినుండి యింకొకరికి వ్యాపించును.

## కృమిభేదములు.

కృమయస్తు ద్విధాప్రోక్తాః బాహ్యాభ్యన్తరభేదతః.　　　౪౨

కృములు బాహ్యములనియుం ఆభ్యంతరములనియుం రెండువిధములు. (అందు కేశములను వస్త్రములను మున్నగువాని నాశ్రయించి పుట్టునవి బాహ్యములు. ప్రేవులు మున్నగుశరీరాంతర్భాగము నాశ్రయించి పుట్టినవి యాంతరక్రిములు).

## క్రిమిచాతుర్విధ్యము.

బహిర్మలకఫాసృగ్విట్ జన్మభేదాచ్చతుర్విధాః,
నామతో వింశతివిధాః

వెంద్రుకలు వస్త్రములు మున్నగుబాహ్యములకారణములచే బుట్టినక్రిములు కొన్ని, శరీరమునందలి కఫమునబుట్టినవికొన్ని, రక్తమున బుట్టునవికొన్ని, మలమున బుట్టునవికొన్ని ఇత్తెరంగున అవి పుట్టుట కాశ్రయములభేదముచే నాల్గువిధములనుండును.

## బాహ్యక్రిములు; వానివలనగల్గురోగములు.

బాహ్యాస్తత్రాఽసృగుద్భవాః.　　　౪౩

తిలప్రమాణసంస్థానవర్ణాః కేశామ్బరాశ్రయాః,
బహుపాదాశ్చ సూక్ష్మాశ్చ యూకా లిక్షాశ్చ నామతః. ४४
ద్విధా తే కోఠపిటికా కణ్డూగణ్డాన్ ప్రకుర్వతే,

బాహ్యాభ్యంతరరూపములైన క్రిములతో రక్తముయొక్క మలరూపమైన స్వేదము మున్నగువానివలన బుట్టినవి బాహ్యక్రిములు అయ్యవి నువ్వులవంటి యాకారంబును వర్ణంబునుకలిగి వెండ్రుకలనైనను బట్టలనైన నాశ్రయించియుండును. అనేకపాదములంకలిగి సూక్ష్మములైన యాకారములు కలిగియుండును. అయ్యవి యూకలు(పేలు)అనియు, లిక్షలు(చీరపేలు)అనియు చెప్పబడును. ఈరెండువిధములైన క్రిములును పొడలను బొబ్బలను దురదను కణుతులను కలిగించును.

## ఆన్తరక్రిములు, వానియుత్పత్తి.

కుష్ఠైకసమ్భవాఽన్తర్జాః శ్లేష్మజాస్తేషు చాధికమ్. ४५
మధురాన్నగుడక్షీరదధిసక్తునవోదనైః,

కఫము రక్తము మలము అను నీమూటియందును బుట్టినక్రిములు ఆంతరములు. ఈక్రిములు కుష్ఠములతో సమానములగుకారణముచే బుట్టును. (కుష్ఠములను కలిగించు మిథ్యాహారవిరుద్ధభోజనాదికారణములచేతనే యాంతరక్రిములు పుట్టుననుట) వానిలో కఫమున బుట్టుక్రిములు మధురములగుపాయసము మున్నగు నన్నములచేతను, బెల్లముచేతను, పాలచేతను, పెరుగుచేతను, సత్తుపిండిచేతను, నవీనమైన యన్నముచేతను విశేషముగ సంభవించును.

## మలజక్రిములవిశేషకారణములు.

శకృజ్జాః బహువిద్ధాన్యపర్ణశాకోలుకాదిభిః ४౬

కుష్ఠముల గల్గించుకారణములచేతనే ప్రాయికముగ మలమునందు క్రిములు జనించును.అంతియకాక మలము నధికముగ వృద్ధినొందించు యవలు సెనగలు మున్నగు ధాన్యములును, ఆకుకూరలును, పచ్చపెసలు మున్నగునవియు మలమున క్రిములను విశేషముగ గల్గించును.

(ఇచ్చట "శాకోలక, శాకోలుక" అని పాఠభేదము గనబడుచున్నది).

## ఆమాశయమునందలికఫజక్రిములలక్షణము.

కఫాదామాశయే జాతాః వృద్ధాస్సర్పన్తి సర్వతః,
పృథుబ్రధ్ననిభాః కేచిత్ కేచిద్గణ్డూపదోపమాః. ४౭
రూఢధాన్యాఙ్కురాకారాః తనుదీర్ఘాస్తథాణవః,
శ్వేతాస్తామ్రావభాసాశ్చ నామతస్సప్తధా తు తే. ४౮

అన్త్రాదా ఉదరావేష్టాః హృదయాదాః మహాగుహాః,
చురవో దర్భకుసుమాః సుగన్ధాః తే చ కుర్వతే. ౪౯
హృల్లాసమాస్యస్రవణం అవిపాకమరోచకమ్,
మూర్ఛాచ్ఛర్దిజ్వరానాహకార్శ్యక్షవథుపీనసాః. ౫౦

కఫము నాధారముగ జేసి యామాశయముననే పైజెప్పిన కారణములచే క్రిములు జనించును. ఆయ్యవి నానాట వృద్ధినొంది దేహమునందెల్ల సంచరించుచుండును. అందు కొన్ని తోలుగొట్టములబోలె పెద్దవియై నునుపుకల్గియుండును. ఇవి నానాట వ్యాపించి ప్రేవులం దినును కావున నంత్రాదములని చెప్పబడును. కొన్ని యెఱ్ఱలవలె నున్నగ నిడుదలై యుండును. ఇవి కడుపున చుట్టలుగ చుట్టికొనియుండును. కావున నుదరావేష్టములని చెప్పబడును. కొన్ని ధాన్యపు మొలకలవలె సూక్ష్మాకారములై యుండును. ఇవి హృదయమున బాశి హృదయమును తిని బొత్తుగ జెరచును. కావున హృదయాదములని చెప్పబడును. కొన్ని సన్ననియాకారముకల్గి నిడుదలై యుండును. ఇవి మహాగుహములని చెప్పనగును. (మహాగుదములను పాఠమున గుదస్థానమున జేరి గుదరంధ్రమును తినుచు పెద్దదిగ జేయునవి యని యర్థము) కొన్ని మిక్కిలి సూక్ష్మమైన యాకారముగల్గి శరీరమునందెల్ల వ్యాపించును. ఇయ్యవి చురు అను పేరుచే బిలువంబడును. కొన్ని తెల్లనిరంగుకల్గియుండును. అవి రెల్లుపువ్వులంబోలె నుండును. కావున దర్భకుసుమములని బిలువంబడును. కొన్ని యెఱ్ఱనికాంతికల్గియుండును. ఇవి సువాసనకల్గియుండును. కావున సుగంధములని పేర్కొనంబడును. ఇత్తెరంగున నేకవిధములైన క్రిములు కఫముచే నామాశయమున జనించినయెడ వానిచే రొమ్ముదరును. నోటనీరుకారును. భుజింపబడినయాహారము జీర్ణింపదు. అరోచకంబును, మూర్ఛయు, వాంతియు, జ్వరంబును, కడుపుబ్బరంబును కల్గును. శరీరము కృశించును. తుమ్ములు వెడలును. పడిసెముబట్టును.

### రక్తజక్రిములు, వానిభేదములు, వానికృత్యములు.

రక్తవాహిసిరోత్థానాః రక్తజాః జన్తవోఽణవః,
అపాదా వృత్తతామ్రాశ్చ సౌక్ష్మ్యాత్కేచిదదర్శనాః. ౫౧
కేశాదాః రోమవిధ్వంసాః లోమద్వీపాః ఉదుమ్బరాః,
షట్తే కుష్ఠైకకర్మాణః సహసౌరసమాతరః. ౫౨

రక్తమును వహించుసిరలయందు పుట్టుక్రిములు రక్తజములు. ఇవి కేవలము అణుమాత్రస్వరూపముకల్గి కాళ్లులేక వర్తులాకారములై తామ్రవర్ణము కల్గియుండును. అందు కొన్ని మిక్కిలి పరమాణువులబోలె సుసూక్ష్మములై యుండుటంజేసి కన్నులకు

గానరావు. అయ్యవి కొన్ని తలవెండ్రుకల కుదుళ్లనుచెరిచి వెండ్రుకల నూడించుటంజేసి కేశాదములనియు, కొన్ని శరీరమునందలి లోమముల నూడించుటవలన లోమవిధ్వంసము లనియు, రోమముల నాధారముగ జేరియుండునవి రోమద్వీపములనియు, కొన్ని ఉదుంబరములనియు, కొన్ని సౌరసములనియు, కొన్ని మాతలనియు నానుములచే బిలువంబడును. ఇవియారును కుష్ఠములబోలె రోమహర్షము, దురద, కేశలోమనాశము, త్వక్-సిరా-స్నాయు-మాంస-తరుణాస్థిభక్షణము మున్నగు కృత్యముల జేయును.

ఇచ్చట "సహసౌరసమాతరః" అనుచోట "సహజారసమాతరః" అను పాఠము కానంబడియెడు. శరీరమున రక్తమున స్వభావముచే బుట్టినవి సహజములనియు, రసము వలనపుట్టినవి రసమాతలనియు నర్థము. ఈపాఠము చాలబాగున్నది.

పురీషజక్రిమిభేదములు. వానికృత్యములు.

పక్వాశయే పురీషోత్థాః జాయన్తేఽధోవిసర్పిణః,
వృద్ధాస్తే స్యుర్భవేయుశ్చ తే యదాఽఽమాశయోన్ముఖాః. ౫౩
తదాస్యోద్గారనిశ్వాసాః విడ్గన్ధానువిధాయినః,
పృథువృత్తతనుస్థూలాః శ్యావపీతసితాఽసితాః. ౫౪
తే పఞ్చ నామ్నా క్రిమయః కకేరుకమకేరుకాః,
సౌసురాదాః సలూనాఖ్యాః లేలిహాః జనయన్తి చ. ౫౫
విడ్భేదశూలవిష్టమ్భ కార్శ్యపారుష్యపాణ్డుతాః,
రోమహర్షాఽగ్నిసదనగుదకణ్డూర్బహిర్గమాత్. ౫౬

పురీషమున జనించుక్రిములు పక్వాశయమున నే పుట్టును. అయ్యవి యధోమార్గమున సంచరించునుగాని శరీరమున పైమార్గము సంచరింపవు. అయ్యవి నానాట వృద్ధి నొంది యెప్పుడు ఆమాశయమున కున్ముఖములవునో అప్పుడు ఆరోగికి క్రోపులును విశ్వాసంబును మలముయొక్క దుర్గంధము ననుసరించియుండును. అట్టిక్రిములు విస్తృతము లును వర్తులంబులును సూక్ష్మంబులును స్థూలంబులునై శ్యామపీతశ్వేతకృష్ణవర్ణములు కలిగియుండును. మరియు నవి కకేరుకములు, మకేరుకములు, సౌసురాదములు, లూనములు, లేలిహములు నని యైదుపేరులు కలిగి యైదువిధముల నుండును. అట్టిక్రిములు పుట్టినపుదు మలము ఉండలై వెడలును. కడుపులో నొప్పిపుట్టును. మలము బంధించును. శరీరము కృశించును. పరుషముగ నుండును. పాండురోగము సంభవించును. రోమాంచము కలుగును. కాయాగ్ని నశించును. అయ్యవి బైటవెడలునప్పుడు గుదస్థానమున జిలపుట్టును.

ఇతి చతుర్దశోఽధ్యాయః.

# పఞ్చదశాధ్యాయము.

అవ:—కుష్ఠమునుబోలె వాతవ్యాధియు పలుదెరంగులై నానావిధకష్టముల గలిగించునది కావున కుష్ఠనిదానమును జెప్పినపిదప వాతవ్యాధినిదానము చెప్పబడును.

**సూ. అథాతో వాతవ్యాధినిదానం వ్యాఖ్యాస్యామః.**

కుష్ఠనిదానమును సవిమర్శముగ జెప్పినపిదప వాతవ్యాధినిదానమును వివరించెదనని భావము.

శరీరశుభాఽశుభములకు వాతము కారణమనుట.

సర్వార్థానర్థకరణే విశ్వస్యాస్యైకకారణమ్,
అదుష్టదుష్టః పవనః శరీరస్య విశేషతః. ౧

ఈప్రపంచమునకు సంబంధించినశుభములను అశుభములను కలిగించుటకు వాతము ప్రధానమైనకారణము. అందు శుభములకన్నిటికిని (స్థితిరూపమగు శుభమునకు) దుష్టముకాక స్వభావస్థితి నుండువాతము ప్రధానకారణము. లోకవినాశరూపమగునశుభములకన్నిటికి స్వభావస్థితి నుండక దుష్టమైనవాతము ప్రధానకారణము అందును శరీరము సుస్థముగనుండుటకు దుష్టముకాక స్వభావస్థితినుండువాతము విశేషముగ ప్రధానకారణము. శరీరము అనేకవ్యాధులచే చెడి నాశమునొందుటకు దుష్టమైనవాతము విశేషముగ ప్రధానకారణము.

(ప్రాణ-అపాన-వ్యాన-ఉదాన-సమాన-భేదములచే నైదువిధములైనవాతము చేత శరీరముపుట్టి దానిచేతనే ధరింపబడియుండును; కావున నట్టివాతమును చెడనీయక సమస్థితి నుండునట్లుచేసికొనుట ప్రధానకృత్యమని భావము.)

వాతము విశ్వకారణమని నిరూపించుట.

స విశ్వకర్మ విశ్వాత్మా విశ్వరూపః ప్రజాపతిః,
స్రష్టా ధాతా విభుర్విష్ణుః సంహర్తా మృత్యురన్తకః. ౨

పైజెప్పబడినవాతము శరీరమును పుట్టించుట వృద్ధినొందించుట, ధరించుట, (ప్రకోపమునొందినపుడు) చెడగొట్టుట, శోషింపజేయుట మున్నగుసకలకర్మలజేయుటం జేసి 'విశ్వకర్మ' యనబడును. (ఇచ్చట విశ్వశబ్దము సర్వవాచకము), సకలశుభాశుభములకును హేతువు అగుటంజేసి విశ్వాత్మ యనబడును. (ఆత్మశబ్దము హేత్వర్థకము). బాహ్యస్థలమునను అభ్యంతరస్థలమునను వ్యాపించియుండుటంజేసి విశ్వరూపము. ప్రజల

నందరిని స్వస్థతనొసంగి పరిపాలన జేయుటంజేసి ప్రజాపతి. ప్రపంచమునెల్లసృజించుట కారణమగుటంజేసి బ్రహ్మసత్యలోకపర్యంతమైన ప్రపంచమునకు ఆధారమై ధరించుట వలన ధాత, నానావిధరూపముల నొందుటవలన విభువు, స్థిరచరాత్మకమైన ప్రపంచమున వ్యాపించుస్వభావము కలిగియుండుటవలన విష్ణువు, ప్రకోపమునొందినపుడు బాహ్యాభ్యంతరరూపమైన ప్రపంచమును సంహరించుటంజేసి సంహర్త. మరణము నొందించుటంజేసి మృత్యువు కావుననే యంతకను.

(ఇట్లీరంగున బాహ్యప్రపంచమునకును, ముఖ్యముగ శరీరమునకును సృష్టిస్థితిలయరూపములగు శుభాశుభములకు ప్రధానకారణము వాతమగుటంజేసి అట్టివాతమును ప్రకోపమునొందనీయక సమస్థితియుండునట్లు ప్రయత్నపడుట ముఖ్యకర్తవ్యమని భావము.)

### వాతకృత్యములవిభాగము, విమర్శనము.

తదదుష్టం ప్రయత్నేన యతితవ్యమతః సదా,
తస్యోక్తం దోషవిజ్ఞానే కర్మ ప్రాకృతవైకృతమ్. 3
సమాసాద్వ్యాసతో దోషభేదీయే నామ ధామ చ,
ప్రత్యేకం పఞ్చధా చారో వ్యాపారశ్చేహ వైకృతమ్. ౪
తస్యోచ్యతే విభాగేన సనిదానం సలక్షణమ్.

అట్టివాతమునకు సంబంధించినకృత్యములు ప్రాకృతవైకృతభేదములచే రెండువిధములు. వాతము వికృతిజెందక స్వభావస్థితియందయుండి చేయుకృత్యములు ప్రాకృతములు (స్వభావసిద్ధములు) ప్రకోపము నొందినపుడు చేయుకృత్యములు వైకృతము. ఈరెండువిధములైన వాతకృత్యములును దోషభేదీయాధ్యాయమున సంగ్రహముగ జెప్పబడినవి. అట్టికృత్యములే దోషభేదీయాధ్యాయమున విపులముగ జెప్పబడినవి. మరియు అట్టివాతమునకు ఐదువిధములైనభేదంబులును ఆయైదింటికిని ప్రత్యేకముగ నామభేదములును, అవి యైదును నియతముగ నుండుస్థలంబులును, వానిసంచారక్రమంబును, ఆయ్యవి వేరువేరజేయుకృత్యములును, దోషభేదీయాధ్యాయమున విపులముగ జెప్పబడినవి. అట్టివాతము వికృతి(ప్రకోపము)జెందినపుడు జేయుకృత్యములును వానికి నిదానములును లక్షణములును ఈయధ్యాయమున ప్రత్యేకముగ జెప్పబడును.

### రెండువిధములగు వాతప్రకోపకారణములు.

ధాతుక్షయకరై ర్వాయుః కుప్యత్యతినిషేవితైః ౫
చరన్ స్రోతస్సు రిక్తేషు భృశం తాన్యేవ పూరయన్,
తేభ్యోఽన్యదోషపూర్ణేభ్యః ప్రాప్య వాఽఽవరణం బలీ. ౬

రసాదిధాతువులను క్షీణింపజేయు నాహారవిహారాదుల నధికముగ చిరకాలము సేవించినయెడదానంజేరి వాతము ప్రకోపమునొందును. ఇత్తెరంగున ప్రకుపితమైనవాతము ధాతుక్షయముచేతనే శూన్యములుగనుండుస్రోతస్సుల యథేష్టముగ సంచరించుచు నా స్రోతస్సులను తనస్వభావముచే నిండించును. మరియు నాస్రోతస్సులయందు ఇతర దోషములచే నిండి వాతసంచారమార్గము నడ్డగించినను వాతము ప్రకోపమునొందును. ఇత్తెరంగున ధాతుక్షయంబును ఇతరదోషములు తనమార్గము నడ్డగించుటయు వాత ప్రకోపమునకు ప్రధానకారణములు.

### పక్వాశయప్రకుపితవాతకృత్యములు.

తత్ర పక్వాశయే క్రుద్ధః శూలానాహాంత్రకూజనమ్,
మలరోధాఽశ్మవర్ధ్మార్శస్త్రికపృష్ఠకటీగ్రహమ్ ౭
కరోత్యధరకాయేషు తాంస్తాన్కృచ్ఛ్రానుపద్రవాన్,

పక్వాశయమున వాతము పైజెప్పినరెండువిధములైన కారణములచే వాతము ప్రకోపమునొందినయెడ శూలమును కలిగించును. కడుపుబ్బరించును. ప్రేవులరచును. మలము వెడలక బద్ధగించును. మూత్రకృచ్ఛ్రమును కలిగించును. అండవృద్ధివి అర్శో రోగమును నడుముకు క్రిందిభాగమున వీపుననునొప్పిని కలిగించును. మరియు శరీరమున నాభికి క్రిందిభాగమున మిక్కిలి కష్టములగు నాయాయుపద్రవముల గలిగించును.

### ఆమాశయాదిప్రకుపితవాతలక్షణము.

ఆమాశయే తృడ్వమథుశ్వాసకాసవిసూచికాః. ౮
కణ్ఠోపరోధముద్గారాన్ వ్యాధీనూర్ధ్వం చ నాభితః,
శ్రోత్రాదిష్విన్ద్రియవధం త్వచి స్ఫుటనరూక్షణే. ౯

ఆమాశయమున వాతము ప్రకోపమునొందినపుడు దప్పియు, వాంతియు, శ్వాసకాసంబులును, విషూచికంబును, కంఠరోధంబును (కుత్తుక నడ్డగించుట), త్రేనుపులును ఇవిమున్నగురోగముల గలిగించును మరియు నాభికి పైభాగమున పలు తెరంగులగువ్యాధులనుకూడ గలిగించును చెవులు ముక్కులు కన్నులు మున్నగు నింద్రియాధిష్ఠానములయందు ప్రకోపించినయెడ నాయాయింద్రియములశక్తిని నశింప జేసి దానిదానికృత్యములకు హానిని కలిగించు. చర్మముపై ప్రకోపించిననాడు చర్మము మిక్కిలి రూక్షమై పగులును.

### రక్తమునప్రకుపితమైనవాతలక్షణము.

రక్తే తీవ్రాః రుజః స్వాపం తాపం రోగం వివర్ణతామ్,
అరూంష్యన్నస్య విష్టమ్భం అరుచిం కృశతాం భ్రమమ్. ౧౦

వాతము రక్తమునజేరి ప్రకోపమునొందినపుడు మిక్కిలి తీవ్రముగ నొప్పులు పుట్టును. స్పర్శము దెలియదు. మంటపుట్టును. వర్ణము మారును. పొక్కులు లేచును. భుజింపబడినయాహారము బద్ధగించును. అరుచిపుట్టును. శరీరము కృశించును. ఒడలు తిరుగును.

### మాంస-మేదోగత వాతలక్షణములు.

మాంసమేదోగతే గ్రన్థీన్ తోదాఢ్యాన్ కర్కశాన్ భ్రమమ్,
గుర్వఙ్గం చాతిరుక్ స్తబ్ధం ముష్టిదణ్డహతోపమమ్. ౧౧

వాతము మాంసమునను మేదస్సునను జేరి ప్రకోపమునొందినపుడు మిక్కిలి పోటుకలిగి కర్కశములైన గ్రంథుల గలిగించును. శరీరము తిరుగునట్లుండును. శరీరము బరువై మిక్కిలి నొప్పికలిగి పిడికిటిచేతను కట్టెలచేతను కొట్టినవిధముగ నొప్పికలిగి స్తంభించియుండును.

మరియు శుక్రాచార్యులు మాంసమేదోగతవాతలక్షణముల ప్రత్యేకముగ నిట్లు చెప్పెను.— "కర్కశాంస్తోదబహులాన్ గ్రన్థీన్ మాంససమాశ్రితః, వాయుం ర్మేదోయుతః కుర్యాత్ గ్రన్థీన్ మందరుజో నృణామ్" (వాతము మాంసమునజేరి ప్రకుపితమైనపుడు మిక్కిలి కఠినములై తీవ్రమైన పోటుకల గ్రంథుల గలిగించును. అట్టిది మేదస్సునజేరి ప్రకుపితమైనవాడు స్వల్పముగునొప్పి కల గ్రంథుల గలిగించును )

### అస్థి-మజ్జగతవాతలక్షణములు.

అస్థిస్థః సక్థిసన్ధ్యస్థి శూలం తీవ్రం బలక్షయమ్,
మజ్జస్థోఽస్థిషు సౌషిర్యం అస్వప్నం స్తబ్ధతాం రుజమ్. ౧౨

వాతము అస్థులయందుజేరి ప్రకోపమునొందినయెడ తొడలయందును కీళ్లయందును అస్థులయందును తీవ్రమైన శూలమును గలిగించును. శరీరబలమును నశింపజేయును. మజ్జ(ఎముకలలోనిక్రొవ్వు)యందు జేరి ప్రకోపించినవాడు అస్థులయందు రంధ్రములు పడును. నిదురపట్టదు. అవయవములు స్తంభించి నొప్పిపుట్టును.

### శుక్రగత ప్రకుపితవాతలక్షణము.

శుక్రస్య శీఘ్రముత్సర్గం సఙ్గం వికృతిమేవ చ,
తద్వద్గర్భస్య శుక్రస్థః

వాతము శుక్రధాతువున జేరి ప్రకోపమునొందినపుడు సంభోగకాలమున శుక్రము శీఘ్రముగ వెడలును. లేక చిరకాలమువరకు బంధించును. లేక వికృతజెందును. అట్టివాతదుష్టమైన శుక్రముచేగలిగినగర్భము శీఘ్రముగ బైటవెడలును, లేక చిరకాలము వెడలకుండును. లేక వికృతిజెందును.

## సిరా-స్నాయుంగతవాతలక్షణములు.

సిరాస్థ్వాధ్మానరిక్తతే. ౧౩
తత్థస్సః స్నావస్థితః కుర్యాత్ గృధ్రస్యాయామకుబ్జతాః,

సిరలయందు వాతము చేరి ప్రకుపితమైనచో సిరలు శూన్యములై వాతముచే సిరలు నిండియుండును. స్నాయువులజేరి వాతము ప్రకుపితమైనయెడ గృధ్రసీ వాతము కలుగును, నరములు లాగిపట్టును. కుబ్జత్వము కలుగును.

## సంధిగతవాతప్రకోపలక్షణము.

వాతపూర్ణదృతిస్పర్శం శోథం సన్ధిగతోఽనిలః. ౧౪
ప్రసారణాకుఞ్చనయోః ప్రవృత్తిం చ సవేదనామ్,

సంధి(కీళ్ల) యందు జేరినవాతము కుపితమైనపుడు గాలిచేనిండిన తోలుతిత్తిని తాకినట్లుండు వాపు కలుగును. అప్పుడు కాళ్లు వాచునపుడును ముడుచునపుడును నొప్పి కలుగును.

## సర్వాంగ ప్రకుపితవాతలక్షణము.

సర్వాంగసంశ్రయస్తోదభేదస్ఫురణభఞ్జనమ్. ౧౫
స్తమ్భమాక్షేపణం స్వాపం సంధ్యాకుఞ్చనకమ్పనమ్,

వాతము సర్వశరీరమును జేరి ప్రకోపించినపుడు సూదులబొడిచిన విధముగ పోటుపుట్టును. అవయవములు అదరును. విరుగును. స్తంభించును. ఆక్షేపకవాతము స్పర్శము తెలియకుండును. సంధులు ముడుచుకొనును.

## ఆక్షేపకవాతలక్షణము.

యదా తు ధమనీస్సర్వాః క్రుద్ధోఽభ్యేతి ముహుర్ముహుః. ౧౬
తదాఙ్గమాక్షిపత్యేషః వ్యాధిరాక్షేపకస్స్మృతః,

శరీరమునందలి ధమనులనన్నిటికిని ప్రకోపమునొందినవాతము అభిముఖముగ నెపుడు పోవునో అప్పుడు వాతము ఆయంగము నాక్రమించును. ఇయ్యది యాక్షేపక వాతమని చెప్పబడును.

## అపతన్త్ర-అపతానకవాతలక్షణములు.

అధః ప్రతిహతో వాయుః వ్రజత్యూర్ధ్వం హృదాశ్రితాః. ౧౭
నాడీః ప్రవిశ్య హృదయం శిరశ్శఙ్ఖౌ చ పీడయన్,
ఆక్షిపేత్పరితో గాత్రం ధనుర్వచ్చాస్య నామయేత్. ౧౮
కృచ్ఛ్రాదుచ్ఛ్వసితి స్తబ్ధస్రస్తమీలితదృక్తథా,
కపోత ఇవ కూజేత్సః నిస్సంజ్ఞః సోఽపతన్త్రకః. ౧౯

స ఏవ చాపతానాఖ్యో ముక్తే తు మరుతా హృది,
అశ్నువీత ముహుస్స్వాస్థ్యం ముహురస్వాస్థ్యమావృతే. ౨౦

వాతము అధోమార్గమున ప్రతిహతమై ప్రతిలోమముగ వెనుకకు మరలి పైకి వ్యాపించుచు హృదయస్థానమునుండి వ్యాపించునాడులలో జేరి హృదయమును శిరస్సును కణతలను బాధించుచు శరీరమునెల్ల నాక్రమించును. ఆరోగియొక్క శరీరమును విల్లువలె వంచును. ఆరోగి మిక్కిలి కష్టముచే శ్వాసమునువిడచును. కన్నులు చలించక స్తంభించి వడలి కన్నులు కొంచెముగ మూసికొనియుండును. పిమ్మట నారోగి కపోతము (పావురము)వలె కూకలిడుచు మైమరచియుండును. ఇది యపతంత్రకవాత మనబడును. వాతముచే హృదయము విడువబడినపుడు కొంచెముసుఖమును బొందును. మరల వాతము హృదయము నాక్రమించునపుడు పైజెప్పినవిధముగ బాధపడును. ఇట్లు పలుమారు మారుచుండుస్థితియందు ఆపతానకమని చెప్పబడును.

(ఏకాకారముగ బాధించునది యపతంత్రకమనియు విడిచివిడిచి బాధించునది యపతానకమనియు నీరెండిటికిని భేదము నరయునది).

### అపతంత్రకకృచ్ఛ్రసాధ్యత్వము.

గర్భపాతసముత్పన్నః శోణితాఽతిస్రవోత్థితః,
అభిఘాతసముత్థశ్చ దుశ్చికిత్స్యతమో హి సః ౨౧

స్త్రీలకు గర్భము పూర్తికాక నడుమనే యకాలమున భిన్నమైనప్పుడు పైజెప్పబడిన అపతంత్రకవాతము సంభవించును. అధికముగ రక్తము స్రవించుటచేతను అభిఘాతముచేతను స్త్రీపురుషసామాన్యముగ నీవ్యాధి సంభవించును. ఈమూడిటిలో గర్భపాతముచే స్త్రీలకు సంభవించినది కష్టసాధ్యము. అంతకన్న రక్తాధికస్రావమువలన గల్గినది మిక్కిలి కష్టసాధ్యము. ఈరెండిటికంటె నభిఘాతమున సంభవించినదిమిక్కిలికృచ్ఛ్రసాధ్యతమము.

### అన్తరాయామలక్షణము.

మన్యే సంస్తభ్య వాతోఽన్తః ఆయచ్ఛన్ ధమనీర్యదా,
వ్యాప్నోతి సకలం దేహం జత్రురాయమ్యతే తదా. ౨౨
అన్తర్ధనురివాఙ్గం చ వేగైస్తమ్భం చ నేత్రయోః,
కరోతి జృమ్భాం దశనం దశనానాం కఫోద్వమమ్. ౨౩
పార్శ్వయోర్వేదనాం వాక్యహనుపృష్ఠశిరోగ్రహమ్,
అన్తరాయామ ఇత్యేషః

మెడ యిరుప్రక్కలనుండు నాడులు మన్యాశబ్దముచే జెప్పబడును. వాతము ప్రకుపితమై మన్యల స్తంభింపజేసి లోప్రక్కకువంచుచు శరీరమునందలిధమనులన్నిటి యందు వ్యాపించి సకలశరీరమును మెడను లోప్రక్కకు లాగి శరీరమును విల్లువలె నుండునట్లు పూర్తిగ వంగదీయును. శరీరమునెల్ల వాతము తనవేగముచేత ఛేదించిన విధముగను చీల్చుతీరునను నానావిధవేదనలచే బాధించి కన్నుల కదలనీయక స్తంభింప జేయును. ఒడలు విరుపులుకలుగును, పండ్లు పటపటకొరుకును. నోట కఫము వాంతి యగును. ఇరుప్రక్కలయందును లాగిపట్టినవిధముగ తీవ్రమైనబాధ కలుగును. నోట మాట వెడలక పట్టియుండును. అంసలు బిగపట్టి వీపుతలయు పట్టి లాగినట్లుండును. ఇయ్యది శరీరమును లోప్రక్కకు విల్లువలె వంగునట్లు చేయువ్యాధి కావున అంత రాయామ మని యన్వర్థముగ జెప్పబడును.

## బాహ్యాయామలక్షణము.

బాహ్యాయామశ్చ తద్విధః. ౨౪

దేహస్య బహిరాయామాత్ పృష్ఠతో నీయతే శిరః,

ఉరశ్చోత్క్షిప్యతే తత్ర కంధరా చాపమృచ్ఛతే. ౨౫

దన్తేష్వాస్యే చ వైవర్ణ్యం ప్రస్వేదస్స్రస్తగాత్రతా,

బాహ్యాయామం ధనుష్కమ్భం బ్రువతే వేగినం చ తమ్. ౨౬

పైజెప్పిన అంతరాయామమువలెనే సంప్రాప్తించుసమయము శరీరమును వెనుక ప్రక్కకు ధనుస్సుబోలెవంచినయెడ బాహ్యాయామమనబడును. ఈవ్యాధియందు శిరస్సు వీపుప్రక్కకు వంగును. రొమ్ముపైకిలాగినట్లున్నతముగనుండును. మెడనులిమినట్లుండును. దంతములయందును ముఖమునందును మామూలువర్ణము మారి వేరువర్ణము కలుగును. శరీరమెల్ల చెమటపట్టును. అవయవములన్నియు శిథిలములుగ నుండును. ఈక్రూరమైన వ్యాధిని బాహ్యాయామమనియు, ధనుష్కమ్భమనియు, వేగియనియు జెప్పెదరు.

## వ్రణాయామలక్షణము.

వ్రణం మర్మాశ్రితం ప్రాప్య సమీరణసమీరణాత్,

వ్యాయచ్ఛన్తి తనుం దోషాః సర్వామాపాదమస్తకమ్. ౨౭

తృష్యతః పాణ్డుగాత్రస్య వ్రణాయామస్స వర్జితః,

దోషములన్నియు మర్మస్థలములగు హృదయాదిస్థానముల గలవ్రణమును జేరి వాతముప్రేరణ చేయుటచే పాదములనుండి శిరస్సువరకుం గలశరీరమునెల్ల వ్యాపించును. దప్పి యధికమై శరీరము పాండువర్ణము కలిగియుండును. ఇది వ్రణాయామమని చెప్పబడును. మిక్కిలియసాధ్యముగుటం జేసి దానికి చికిత్స జేయ బూనదగదు.

ఆక్షేపకములయందు స్వస్థతకు అవధి.

గతే వేగే భవేత్స్వాస్థ్యం సర్వేష్వాక్షేపకేషు చ. ౨౮

"యదా తు ధమనీస్సర్వాః" అని యుపక్రమించి ప్రణాయామమువరకును జెప్పబడినవి యాక్షేపకవాతభేదములు. వీనియన్నిటియందును వాతము తనవేగము నుడిగినప్పుడు స్వస్థత కలుగునుగాని తక్కినసమయమున స్వస్థత కొంచెమైన గల్గబోదు.

హనుగ్రహవాతలక్షణము.

జిహ్వాతిలేఖనాచ్ఛుష్కభక్షణాదభిఘాతతః,
కుపితో హనుమూలస్థః స్రంసయిత్వాఽనిలో హనూ. ౨౯
కరోతి వివృతాస్యత్వం అథవా సంవృతాస్యతామ్,
హనుస్రంసస్స తేన స్యాత్ కృచ్ఛ్రాచ్చర్వణభాషణమ్. 30

పలుదోమునపుడు నాలుకను అధికముగ నోరుదెరచి గీచుటచేతను, కఠినములగు భక్షణముల నమలుటచేతను, ఇతరములగు నభిఘాతములచేతను అంకిళ్లసంధులయందుండు వాతము ప్రకోపమునొంది అంకిళ్లను సడలించును. దానంజేసి నోరు తెరచుకొనియుండును. మరల మూయుటకు వలనుపడదు. ఒకసమయమున నోరు మూసికొని మరల తెరువ వలనుపడక బిగిసియుండును. ఇది హనుస్రంసమనువ్యాధి యనబడును. ఈవ్యాధియందు నమలుటకును మాటలాడుటకును మిక్కిలి కష్టముగ నుండును.

జిహ్వాస్తంభవాతలక్షణము.

వాగ్వాహినీసిరాసంస్థో జిహ్వాం స్తమ్భయతేఽనిలః,
జిహ్వాస్తమ్భస్స తేనాన్నపానవాక్యేష్వనీశతా. 31

వాతము ప్రకుపితమై వాక్కును వహించుసిరలయందు జేరి నాలుకను స్తంభింపజేయును. ఇయ్యది జిహ్వాస్తంభవాతమని చెప్పనగును. ఈవ్యాధియందు అన్నాదుల భుజించుటకు నీళ్లు ద్రాగుటకును మాట్లాడుటకును సామర్థ్యములేకుండును.

అర్దితవాతలక్షణము.

శిరసా భారహరణాత్ అతిహాస్యప్రభాషణాత్,
ఉత్త్రాసవక్త్రక్షవథుఖరకార్ముకకర్షణాత్. 32
విషమాదుపధానాచ్చ కఠినానాం చ చర్వణాత్,
వాయుర్వివృద్ధస్తైస్తైశ్చ వాతలైరూర్ధ్వమాస్థితః. 33
వక్త్రీకరోతి వక్త్రార్ధముక్తం హసితవీక్షితమ్,
తతోఽస్య కంపతే మూర్ధా వాక్సఙ్గస్తబ్ధనేత్రతా. 34

దన్తచాలః స్వరభ్రంశః శ్రుతిహానిః క్షవగ్రహః,
గన్ధాఽజ్ఞానం స్మృతేర్మోహః త్రాసస్సుప్తస్య జాయతే ౩౫
నిష్ఠీవః పార్శ్వతోయాయాత్ ఏకస్యాఽక్ష్ణో నిమీలనమ్,
జత్రోరూర్ధ్వం రుజా తీవ్రా శరీరాఽర్ధేఽధరేఽపివా. ౩౬
తమాహురర్దితం కేచిదేకాయామమథాఽపరే,

తలపైనిడికొని భారము నధికముగ మోచుట, విశేషముగ బిగ్గరగ నవ్వుట మాటలాడుట, తటాలున నులికిపడుట, వక్రముగ మెడత్రిప్పితుమ్ముట, మిక్కిలి కఠినమైవిల్లు బాకర్షించుట, ఈ కారణములచేతను, సర్వరోగనిదానాదిస్థలములజెప్పిన నాయావాత ప్రకోపనకారణములచేతను వాతము మిక్కిలి ప్రకోపమునొంది శరీరముయొక్క ఊర్ధ్వ భాగమున పూర్తిగ వ్యాపించి నోటియందు అర్ధము వక్రముగజేయును. దానంజేసి మాటలును నవ్వును చూపునుగూడ వక్రముగనే యుండును. అట్టి రోగి తల వణకును. మాటలు ధారాళముగ వెడలక పట్టినట్లుండును. కన్నులు స్తంభించియుండును. దంతములు కదలును. కంఠస్వరముచెడును. చెవులకు వినబడదు. ముక్కుకు వాసనతెలియదు. జ్ఞాపకశక్తి తగ్గును. నిదురపోవుసమయమున భయపడును. ఉమిసినచో నయ్యది యెదురుగవెడలక ప్రక్కవాటుగ వెడలును.ఒకకన్ను మూసికొనును. కంఠమునకు పైభాగమున తీవ్రమైన నొప్పికలుగును. శరీరమున నర్ధభాగమునందైనను నాభికి క్రిందిభాగము నందైనను మిక్కిలి తీవ్రమైన బాధ కలుగును. ఈ క్రూరమైనవ్యాధిని కొందర రర్దిత వాతమనియు కొందరు ఏకాంగవాతమనియు జెప్పెదరు.

### సిరాగ్రహవాతలక్షణము.

రక్తమాశ్రిత్య పవనః కుర్యాన్మూర్ధధరాస్సిరాః ౩౭
రూక్షాస్సవేదనాః కృష్ణాః సోఽసాధ్యస్స్యాత్సిరాగ్రహః,

వాతము ప్రకోపమునొంది రక్తమునజేరి శిరస్సునుధరించియుండుసిరలను రూక్షములుగను కృష్ణవర్ణములుగనుజేసి మిక్కిలి తీవ్రమైనబాధ గలిగించును. ఇయ్యది సిరాగ్రహమను వాతరోగము.

### ఏకాంగ(పక్షవధ)వాతలక్షణము.

గృహీత్వార్ధం తనోర్వాయుః సిరాస్స్నాయూర్విశోష్య చ ౩౮
పక్షమన్యతరం హన్తి సన్ధిబన్ధాన్ విమోక్షయన్,
కృత్స్నోఽర్ధకాయస్తస్య స్యాత్ అకర్మణ్యో విచేతనః ౩౯
ఏకాఙ్గరోగం తం కేచిత్ అన్యే పక్షవధం విదుః,

వాతము ప్రకుపితమై శరీరమునందు సగపాలున వ్యాపించి యాభాగముననుండి సిరలను స్నాయువులను శోషింపజేసి యాయర్ధశరీరము సంధిబంధములను శిథిలములుగ జేసిబాధించును. ఆయర్ధశరీరము పనులజేయుసామర్థ్యముడిగి ప్రాణములేనివిధముగ నిశ్చేష్టమైయుండును. ఈ వ్యాధిని కొందరు ఏకాంగవాతమనియు, కొందరు పక్షవధమనియును జెప్పెదరు.

## సర్వాంగవాతలక్షణము.

సర్వాఙ్గరోగం తద్వచ్చ సర్వకాయాశ్రితేఽనిలే. ४०

పైజెప్పినవిధముగవాతము ప్రకోపించి శరీరమునందెల్లసిరాస్నాయువుల శోషింప జేసి శరీరమునందలి సంధిబంధముల నన్నటిని శిథిలములుగ జేసి యవయవములనన్నిటిని పనులయందు సామర్థ్యముడుగంజేసి నిశ్చేష్టముగ జేసిన నయ్యది సర్వాంగవాతమని చెప్పబడును.

## కృచ్ఛ్రసాధ్య-అసాధ్యపక్షవధలక్షణము.

శుద్ధవాతహతః పక్షః కృచ్ఛ్రసాధ్యతమో మతః,
కృచ్ఛ్రస్త్వన్యేన సంసృష్టః వివర్జ్యః క్షయహేతుకః. ४౧

వాతము కఫపిత్తములతో గలియక వాతము మాత్రమే ప్రకుపితమై పక్షవాతమును గల్గించినయెడ నయ్యది మిక్కిలి కృచ్ఛ్రసాధ్యము. కఫపిత్తములతో నొకదానిం గూడి వాతము కలిగించినయెడ కృచ్ఛ్రసాధ్యము. రసాదిధాతువులు క్షీణించుటచే గలిగినపక్షవాతము అసాధ్యము, కావున విడువందగు.

## దండకవాతలక్షణము.

ఆమబద్ధాయనః కుర్యాత్ సంస్తభ్యాఙ్గం కఫాన్వితః,
అసాధ్యం హతసర్వేహం దణ్డవద్దణ్డకం మతమ్. ४౨

వాతము ఆమముచే స్రోతోమార్గములు నిరోధింపబడినపుడు కఫముతోగూడి ప్రకోపమునొంది శరీరమునెల్ల స్తంభింపజేయును. దానివలన శరీరము చలనాదిచేష్టల దక్కి కట్టెవలె స్తంభించియుండును. ఇయ్యది దండకమనువాతరోగము. మిక్కిలి యసాధ్యము.

## అవబాహుకవాతలక్షణము.

అంసమూలస్థితో వాయుః సిరాస్సంకోచ్య తత్రగాః,
బాహుప్రస్పన్దితహరం జనయత్యవబాహుకమ్. ४౩

భుజమూలముల యందు వాతము జేరి ప్రకుపితమై యచ్చటిసిరలనన్నిటిని సంకోచమునొంద (ముడుచుకొనునట్లు) జేసి బాహువుల గదలింపనీయక స్తంభింపజేయును ఇయ్యది అవబాహుకము.

### విశ్వాచీవాతలక్షణము.

తలం ప్రత్యఙ్గులీనాం యా కణ్డరా బాహుపృష్ఠతః,
బాహుచేష్టాపహరణీ విశ్వాచీ నామ సా స్మృతా. ౪౪

అరచేతులకువెనుకప్రక్క చేతివ్రేళ్ల వరకు వ్యాపించియుండు కండరములయందు వాతము ప్రకుపితమై వ్యాపించి చేతులముడుచుట చాచుట మున్నగువ్యాపారములయందు సామర్థ్యములేకుండ జేయును. అయ్యది విశ్వాచియనువాతరోగము.

### ఖంజ-పంగువాతములలక్షణములు.

వాయుః కట్యాం స్థితస్సక్థ్నః కణ్డరామాక్షిపేద్యదా,
తదా ఖఞ్జో భవేజ్జన్తుః పఙ్గుస్సక్థ్నోః ద్వయోరపి. ౪౫

వాతమునడుమునజేరి ప్రకోపమునొంది ఒకతొడయందలి కండరమున వ్యాపించి దాని నాకర్షించినయెడ నాకాలు బాధచే నడువ కష్టముగనుండును. ఇది ఖంజవాత మనదగును. అట్టివాతము రెండుతొడలకండరములజేరి రెండుతొడల నాకర్షించినయెడ రెండుకాళ్లును నడువ సాధ్యములుకాకుండును. ఇది పంగువాతము.

### కళాయఖంజవాతలక్షణము.

కమ్పతే గమనారమ్భే ఖఞ్జన్నివచ యాతి యః,
కళాయఖఞ్జం తం విద్యాత్ ముక్తసన్ధిప్రబన్ధనమ్. ౪౬

నడచుట కారంభించునపుడు కాలువణకుచు కుంటినడచినయెడ నయ్యది కళాయఖంజమనువాతవ్యాధి. ఈరోగమున సంధిబంధము సడలి శిథిలమై యుండును.

### ఊరుస్తంభనిదాన-సంప్రాప్తి-లక్షణములు.

శీతోష్ణద్రవసంశుష్కగురుస్నిగ్ధైర్నిషేవితైః,
జీర్ణాఽజీర్ణే తథాఽఽయాససంక్షోభస్వప్నజాగరైః ౪౭
సశ్లేష్మమేదః పవనమామ మత్యర్థసఞ్చితమ్,
అభిభూయేతరం దోషమూరూ చేత్ప్రతిపద్యతే ౪౮
సక్థ్యస్థీని ప్రపూర్యాన్తః శ్లేష్మణా స్తిమితేనతత్,
తదాస్కభ్నాతి తే నోరూ స్తబ్ధా శీతావచేతనా. ౪౯
పరకీయావివ గురూ స్యాతామతిభృశవ్యథా,
ధ్యానాఙ్గమర్దస్తైమిత్య తన్ద్రాచ్ఛర్ద్యరుచిజ్వరైః. ౫౦

సంయుతైః పాదపదనకృచ్ఛ్రోద్ధరణసుప్తిభిః,
తమూరుస్తంభమిత్యాహు రాఢ్యవాతమథాపరే. ౫౧

భుజింపబడిన యాహారపదార్థములలో కొంతభాగము జఠరాగ్నిచే జీర్ణమై కొంతభాగము జీర్ణము కాకుండుసమయమున పరస్పరవిరుద్ధములైన శీతోష్ణపదార్థములను ద్రవ(తడిగల) శుష్క(ఎండిన)పదార్థములను, గురులఘుపదార్థములను, స్నిగ్ధరూక్ష పదార్థములను ఒకటిగగూర్చి నిరంతరముగ భుజించినను; శరీరమున కాయాసమును గలిగించుపనులజేసినను, మనస్సుకు నిల్కడలేక క్షోభమును కలిగించుపనులజేసినను, పగలు నిదురపోయినను, రాత్రి నిదురమేల్కాంచినను, ఈకారణములచేత కఫము తోడను మేదస్సుతోడను వాతముతోడను గూడినయామరసము మిక్కిలి వృద్ధినొంది పిత్తమును ఆక్రమించి తొడలయందుజేరి తొడలయందుండు ఎముకలలోనిరంధ్రములను ఘనీభవించిన కఫముచేతను మేదస్సుచేతను నిండించి స్తంభింపజేయును. దానంజేసి యప్పుడు తొడలు స్తంభించి కదలకుండును. చల్లపడి ప్రాణములేనివానింబోలె స్పర్శమును కొంచెమైన నెరుంగజాలక మరియొకరియవయవములుబోలె బరువై మిక్కిలి నొప్పిమున్నగుబాధలం గూడియుండును. మరియు నీవ్యాధియందు చింత, ఒడలినొప్పులు, తడిగుడ్డగప్పినవిధముగ శరీరమెల్ల జడముగనుండుట, మైకము, వాంతి, అరోచకము, జ్వరము అనునీయుపద్రవములతో గూడియుండును. పాదములు కృశించును, పైకెత్తుటకును వలనుపడక మిక్కిలి కష్టమై స్పర్శము నెరుంగనేరకుండును. ఈవ్యాధిని కొందరు ఊరుస్తంభవాతమనియు, ఆఢ్యవాతమనియు మరికొందరును జెప్పెదరు.

### క్రోష్టుకశీర్షలక్షణము.

వాతశోణితజశ్శోఫః జానుమధ్యే మహారుజః,
జ్ఞేయః క్రోష్టుకశీర్షశ్చ స్థూలః క్రోష్టుకశీర్షవత్. ౫౨

వాతము ప్రకుపితమై రక్తమునజేరి మోకాలునందు నక్కతలవలె స్థూలమై మిక్కిలిబాధతోగూడిన వాపుకల్గును. ఇయ్యది నక్కతలవలె స్థూలమైయుండుటంజేసి క్రోష్టుకశీర్షమని యన్వర్థముగ జెప్పబడును.

### వాతకంటకలక్షణము.

రుక్పాదే విషమన్యస్తే శ్రమాద్వా జాయతే యదా,
వాతేన గుల్ఫమాశ్రిత్య తమాహుర్వాతకంటకమ్. ౫౩

పాదమును మిట్టపల్లముగ నుండుస్థలమున నునిచి నడచుటచేనైనను, శ్రమముచేనైనను వాతము ప్రకోపించి చీలమండ(కాలిమడిమ)లోజేరి తీవ్రముగ నొప్పిని కల్గించును. ఇయ్యది వాతకంటకమని చెప్పెదరు.

### గృధ్రసీవాతలక్షణము.

పార్ష్ణిప్రత్యఙ్గులీనాం యా కణ్డరా మారుతార్దితా,
సక్థ్యుత్క్షేపం నిగృహ్ణాతి గృధ్రసీం తాం ప్రచక్షతే ౫౪

చీలమండకు అభిముఖముగ వ్యాపించియుండు అంగుళుల (వ్రేళ్ల) కండరములలో వాతము జేరి బాధించుచు తొడల పైకెత్తనీయక నిరోధించును. ఇయ్యది గృధ్రసీవాతమని చెప్పనగును.

### ఖల్లీవాతలక్షణము.

విశ్వాచీ గృధ్రసీ చోక్తా ఖల్లీ తీవ్రరుజాన్వితా,

"తలం ప్రత్యంగు...విశ్వాచీనామ సాస్మృతా" అనుశ్లోకము చేత విశ్వాచీవాతలక్షణంబును, పైశ్లోకము చేత గృధ్రసీవాతలక్షణంబును చెప్పబడినవి. ఈరెండువ్యాధులయందును తీవ్రమైననొప్పి కలిగియున్నయెడ నదియే ఖల్లీవాత మనబడును.

### పాదహర్షలక్షణము.

హృష్యేతే చరణౌ యస్య భవేతాం చ ప్రసుప్తవత్. ౫౫
పాదహర్షః స విజ్ఞేయః కఫమారుతకోపతః,

పాదములు జల్లుజల్లుమని జలదరించి తిమిరిపట్టి కొంతసేపటికి స్పర్శమును దెలియకయుండిన నయ్యది పాదహర్షమను వాతరోగము. ఇది కఫవాతముల ప్రకోపమున గలిగినది.

### పాదదాహలక్షణము.

పాదయోః కురుతే దాహం పిత్తాఽసృక్సహితోఽనిలః. ౫౬
విశేషతశ్చఙ్క్రమితే పాదదాహం తమాదిశేత్,

వాతము పిత్తముతోడను రక్తముతోడనుకూడి మిక్కిలి ప్రకోపమునొంది పాదములయందు విశేషముగ మంటబుట్టించును. ఇయ్యది పాదదాహ మనబడును. ఈవ్యాధి విశేషముగ సంచరించువారికి సంభవించును.

ఇతి అష్టాంగహృదయనిదానే పంచదశోఽధ్యాయః.

---

# షోడశాధ్యాయము.

అవ. పైయధ్యాయమున వాతప్రకోపము ప్రధానముగజేసి జనించుసామాన్యములగు రోగముల నిదానలక్షణాదులు వివరింపబడియె. వాతరక్తమనువ్యాధికూడ వాతవ్యాధిభేదమగుటంజేసి వాతవ్యాధి నిదానాధ్యాయముననే చెప్పవలసియున్నను. ఈవ్యాధియందు చెప్పవలసినవిషయములనేకములుగ నుండుటచే నీయధ్యాయమున వాతరక్తనిదానము ప్రత్యేకముగ జెప్పబడును.

**సూ. అథాతో వాతశోణితనిదానం వ్యాఖ్యాస్యామః.**

వాతవ్యాధి సామాన్యములనిదానమును జెప్పినపిదప వాతవ్యాధివిశేషరూపమైన వాతరక్తనిదానమును వివరించెదనని భావము.

### వాతరక్తనిదానము-సంప్రాప్తి.

విదాహ్యన్నం విరుద్ధం చ తత్తచ్చాసృక్ప్రదూషణమ్,
భజతాం విధిహీనం చ స్వప్నజాగరమైథునమ్. ౧
ప్రాయేణ సుకుమారాణాం అచఙ్క్రమణశాలినామ్,
అభిఘాతాదశుద్ధేశ్చ నృణామసృజి దూషితే. ౨
వాతలైశ్శీతలై ర్వాయుః వృద్ధః క్రుద్ధో విమార్గగః,
తాదృశేనాఽసృజా రుద్ధః ప్రాక్తదేవ ప్రదూషయేత్. ౩
ఆఢ్యరోగం ఖుడం వాతబలాసం వాతశోణితమ్,
తదాహుర్నామభిస్తచ్చ పూర్వం పాదౌ ప్రధావతి. ౪
విశేషాద్యానయానాద్యైః ప్రలమ్బా

మద్యము పులుపుగలపదార్థములుమజ్జిగ పెరుగు అనుములు ఉదకమున సంచరించు జంతువులమాంసము ఉలవలు మున్నగునవి విదాహిపదార్థములు, అట్టివిదాహిపదార్థములజేర్చి యన్నముసు భుజించు నలవాటుకలవారికిని, సంయోగాదులచే పరస్పరవిరుద్ధములగు క్షీరమత్స్యాదుల నొకటిగజేర్చి భుజించువారికిని రక్తమును జెరచు నాయాపదార్థముల విశేషముగ సేవించువారికిని, అట్టివిహారాదులసలుపువారికిని, నిదురను నిదుర మేల్కాంచుటను సంభోగమును శాస్త్రవిధి ననుసరింపక వ్యత్యస్తముగ నాచరించువారికిని, వాతరక్తవ్యాధి సంభవించును. సుకుమారముగ నుండువారికిని పాదసంచారము బొత్తుగజేయనివారికిని యీవ్యాధి తరుచుగ సంభవించును. ఎట్లులన:—పైజెప్పినవారికి ప్రహారాదిగూపముచే బలుతెరంగులైన యభిఘాతముచేనైనను, వమనవిరేచ

నాదిశోధనకర్మములచే శరీరము శుద్ధముజేసికొనకుండుటచేతను రక్తమును చెరచు నితర కారణముల చేతను శరీరమునందలి రక్తముచెడినపుడు, సర్వరోగనిదానాదిస్థలములయందు జెప్పినవాతమును వృద్ధినొందించు కారణములచేతను, శీతలపదార్థముల నధికముగ సేవించుటచేతను వాతము మిక్కిలి వృద్ధినొంది ప్రకుపితమై యుత్పథమునొంది పైజెప్పిన విధముగ చెడి ప్రకోపమునొందినరక్తముచే నడ్డగింపబడి మిక్కిలి ప్రకుపితమై సమీపముననుండు నారక్తమునే తొలుత చెరిచి పిమ్మట క్రమముగ మాంసాదిధాతువులగూడ చెరచును. ఇత్తెరంగునచెడి వృద్ధినొంది చాలకాలమునుండి చేరియుండురక్తము ఆఢ్యరోగమనియు, ఖండమనియు, వాతబలాసమనియు జెప్పబడును. ఈరోగము స్వభావముచేతనే తొలుత పాదములయందు పుట్టును. విశేషముగ గుఱ్ఱములు ఏనుగులు మున్నగువాహనములపై నెక్కి కాళ్లు వ్రేలవేసి సవారిచేయుటచే పాదములయందు వాపుకలిగి యీరోగము సంప్రాప్తమగును.

## వాతరక్తపూర్వరూపము.

తస్య లక్షణమ్,

భవిష్యతః కుష్ఠసమం తథా సాదః శ్లథాఙ్గతా. ౫
జానుజంఘోరుకట్యంసహస్తపాదాంగసంధిషు,
కణ్డూః స్ఫురణనిస్తోదభేదగౌరవసుప్తతాః ౬
భూత్వా భూత్వా ప్రణశ్యన్తి ముహురావిర్భవన్తి చ,

పైజెప్పిన వాతరక్తము సంప్రాప్తియగుటకుముందు కుష్ఠమునకు జెప్పిన మిక్కిలి నునుపు మిక్కిలి కర్కశముగనుండుట మున్నగుపూర్వరూపములన్నియు కలుగును. అవియేగాక శరీరము కృశించును. సంధిబంధములు శిథిలములగును. మోకాళ్లు పిక్కలు తొడలు నడుము భుజశిరస్సులు హస్తములు పాదములు అను నీయవయవముల సంధులయందు దురదయు, అదరుటయు, పోటును, పగులుటయు భారంబును కలిగి స్పర్శము దెలియకుండును. పైజెప్పినదురద మున్నగులక్షణములు అప్పుడప్పుడు కలిగి మరల తనంతనే శమించుచునుండును. ఇవియన్నియు వాతరక్తమునకు పూర్వరూపములు.

## వాతరక్తము వ్యాపించుక్రమము.

పాదయోర్మూలమాస్థాయ కదాచిద్ధస్తయోరపి. ౭
ఆఖోరివ విషం క్రుద్ధం కృత్స్నం దేహం విధావతి,

ఈవాతరక్తము ఒకసమయమున పాదమూలము (చీలమండము)లయందువ్యాపించియుండియు, ఒకప్పుడు చేతులయందు నిల్కడగ నిలిచియుండియు ఎలుకవిషముబోలె ప్రకోపించి శరీరమునందెల్ల వ్యాపించును. (ఎలుక కరచినపుడు దానివిషము శరీరమునం

దొకచోట నిల్కడగ నిలిచి యొకసమయమున ప్రకోపమునొంది శరీరమంతయు నొక్కపెట్ట తటాలున వ్యాపించును. ఆరీతిగనే వాతరక్తము పాదములయందైనను హస్తములయందైనను నిలిచియుండి తటాలున శరీరమునందెల్ల వ్యాపించునని భావము)

ఉత్తాన-గమ్భీరభేదములచే వాతరక్తద్వైవిధ్యము.

త్వఙ్మాంసాశ్రయ ముత్తానం తత్పూర్వం జాయతే తతః ౮
కాలాన్తరేణ గమ్భీరం సర్వాన్ ధాతూనభిద్రవత్,

పైజెప్పబడినరీతిగ వాతరక్తము తొలుత త్వక్ మాంసములయందు పుట్టును. ఇది శరీరముపై ప్రక్కనుండుధాతువుల నాశ్రయించినది గావున ఉత్తానవాతరక్త మన బడును. అట్టియవస్థయందు తగినచికిత్స జేయక యుపేక్షించినయెడ కొంత కాలమునకు మేదస్సును అస్థిని మజ్జను శుక్రమును వరుసగ వ్యాపించును. ఇది శరీరముల లోభాగ ముననుండు ధాతువుల నాశ్రయించి పుట్టుటచేత గంభీరవాతరక్త మనబడును.

ఉత్తానవాతరక్తలక్షణము.

కండ్వాదిసంయుతోత్తానే త్వక్ తామ్రశ్యావలోహితా. ౯
సాయామా భృశదాహోషా

ఉత్తానవాతశోణితమునందు చర్మమున దురదయు పోటును మున్నగుబాధలు కలిగియుండును. తామ్ర-శ్యామ-రక్తవర్ణములు మిశ్రముగ కలిసియుండును. చర్మము లాగినట్లుండి మిక్కిలి తీవ్రమైనమంటయు నొప్పియు కలిగియుండును.

గంభీరవాతరక్తలక్షణము.

గమ్భీరేఽధికపూర్వరుక్,
శ్వయథుర్గ్రథితః పాకీ వాయుస్సన్ధ్యస్థిమజ్జసు. ౧౦
ఛిన్దన్నివ చరత్యన్తః వక్రీకుర్వంశ్చ వేగవాన్,
కరోతి ఖఞ్జం పఙ్గుం వా శరీరే సర్వతశ్చరన్. ౧౧

గంభీరవాతరక్తమునందు మిక్కిలి యధికమైనబాధ కలుగును. వాపు ముడిపడి వించి పుండగును. మరియు వాతము మిక్కిలి ప్రకోపమునొంది సంధులయందును అస్థుల యందును మజ్జయందును లోపలసంచరించుచు ఛేదించువిధముగ బాధకలిగించును. అట్టి సంధులను అస్థులను వక్రములుగ జేయును. మిక్కిలి వేగముతో శరీరమునందెల్ల వ్యాపించుచు ఖంజము (ఒకకాలు కుంటి నడచుట)నైనను, పంగు (రెండుకాళ్లును నడువ సాధ్యముగాకుండుట)వునైనను కలిగించును.

### వాతాధికవాతరక్తలక్షణము.

వాతేఽధికేఽధికం తత్ర శూలస్ఫురణతోదనమ్,
శోఫస్య రౌక్ష్యకృష్ణత్వశ్యావతావృద్ధిహానయః. ౧౨
ధమన్యఙ్గులిసన్ధీనాం సంకోచోఽఙ్గగ్రహోఽతిరుక్,
శీతద్వేషాఽనుపశయౌ స్తమ్భవేపథుసుప్తయః. ౧౩

వాతంబును రక్తంబును కలిసి వాతరక్తవ్యాధిని కలిగించును. అందు వాతమధికమైనపుడు కలిగినవాతరక్తమున ఎడలేనినొప్పి తీవ్రముగ నుండును. అదరును. కొరడాలతోకొట్టిన విధముగనుండి యుండుండినొచ్చును. మిక్కిలి రూక్షమై గరగరలాడుచు నల్లని రంగైనను, శ్యామలవర్ణంబైనను కలిగినవాపు పుట్టి అవ్యాధి తనంతనే వృద్ధినొందుచు తగ్గుచు నుండును. ధమనులును వ్రేళ్లకీళ్లు ముడుచుకొనును. అవయవములన్నియుం లాగి పట్టినట్లుండును. నొప్పి యధికముగనుండును. చల్లని యుపచారాదులయందు ద్వేషము పుట్టును. అట్టియుపచారాదుల జేసినపుడు శరీరమునకు సుఖములేక ప్రతికూలముగ నుండును. శరీరము స్తంభించును. లేక వణకును. శరీరముపై స్పర్శజ్ఞానము బొత్తుగ జెడి చచ్చినట్లుండును.

### రక్తాధికవాతరక్తలక్షణము.

రక్తే శోఫోఽతిరుక్తోదః తామ్రశ్చిమిచిమాయతే,
స్నిగ్ధరూక్షైశ్శమం నైతి కణ్డూక్లేదసమన్వితః. ౧౪

రక్తమధికముగనున్న వాతరక్తమునందు వాతాధికమునకన్న నధికమైనబాధ కలిగి వాపు అధికమగును. పోటును తీవ్రముగనుండును. చర్మము తామ్రవర్ణమై చిమచిమలాడుచుండును. స్నిగ్ధంబులును రూక్షంబులును నగుచికిత్సలచే నీశోఫ శాంతినొందదు. ఆవాపు దురదయును చెమ్మయును కలిగియుండును.

### పిత్తాధికవాతరక్తలక్షణము.

పిత్తే విదాహస్సమ్మోహః స్వేదో మూర్ఛా మదస్తృట్,
స్పర్శాఽక్షమత్వం రుగ్రాగః శోఫపాకౌ భృశోష్మతా. ౧౫

వాతరక్తమున పిత్తం బధికముగనున్నపుడు మంటయధికముగనుండును. భ్రమము గ్రమ్మును. చెమటపట్టును. మూర్ఛవచ్చును. తిక్కయెత్తినట్లుండును. దప్పి యధికమగును. చేతతాకినను ఓర్వరానినొప్పి కలుగును. వాపు ఎఱ్ఱనై పుండగును. మిక్కిలి వేడిగనుండును.

### కఫాధిక-ద్వంద్వజవాతరక్తలక్షణము.

కఫే స్తైమిత్యగురుతా సుప్తిస్నిగ్ధత్వశీతతాః,
కణ్డూర్మన్దా చ రుక్; ద్వన్ద్వసర్వలిఙ్గం చ సంకరే. ౧౬

వాతరక్తంబున కఫ మధికముగనుండు నెడ శరీరముపై తడిగుడ్డ గప్పినవిధముగ మొద్దుబారియుండును. శరీరము బరువై యుండును. చర్మముపై స్పర్శము దెలియదు. అట్టిచర్మము స్నిగ్ధమై చల్లనై యుండును. దురదయు కొంచెముగ నొప్పియు కలుగును.

మరియు నీవాతరక్తమున వాతపిత్తకఫరక్తములు నాలుగును దోషరూపముగనుండి యీవ్యాధిని కలిగించును. అందు వాతాదులచే వేరువేర గలుగువానిలక్షణములు పైని చెప్పబడినవి. అందు రెండేసిదోషములలక్షణములు సంకరముగ నున్నపుడు ఆరెండు దోషములచే జనించినదనియు, వాత-రక్త-పిత్త-కఫములనాలిగిటిలక్షణములు సంకరమై యున్నయెడ సన్నిపాతజమనియు ద్వంద్వసన్నిపాతజవాతరక్తములని నూహించునది.

సాధ్యాసాధ్య వాతరక్తములు.

ఏకదోషానుగం సాధ్యం నవం యాప్యం ద్విదోషజమ్,
త్రిదోషజం త్యజేత్ స్రావి స్తబ్ధమర్బుదకారి చ. ౧౭

ఏకదోషముమాత్రము అధికమై నూతనముగ బుట్టినవాతరక్తము సాధ్యము. రెండుదోషముల ననుసరించి కలిగినది యాప్యము. మూడుదోషములచే గలిగినదియు స్రవించుచుండునదియు నసాధ్యము. అర్బుదవ్రణమునకు కారణమైనది స్తంభించియుండును. అదియు నసాధ్యము.

వాతరక్తముచే ప్రాణహానికలుగురీతి.

రక్తమార్గం నిహన్త్యాశు శాఖాసన్ధిషు మారుతః,
నివిశ్యాన్యోన్యమావార్య వేదనాభిర్హరత్యసూన్. ౧౮

వాతము హస్తపాదాదిశాఖలసంధులయందు జేరి రక్తము ప్రవహించుమార్గమును అడ్డగించును. దానంజేసి రక్తము వాతమును వాతము రక్తమును తమతమతావుల నుండి చలింపజేయును. పిదప వాతమునకును రక్తమునకును సంబంధించినొప్పి పోటు మున్నగు ననేకబాధల గలిగించి తుదకు ప్రాణముల హరించును.

ప్రాణవాతప్రకోపకారణములు దానగలుగురోగములు.

వాయోః పఞ్చాత్మకే ప్రాణః రౌక్ష్యవ్యాయామలఙ్ఘనైః,
అత్యాహారాఽభిఘాతాధ్వవేగోదీరణధారణైః ౧౯
కుపితశ్చక్షురాదీనాం ఉపఘాతం ప్రవర్తయేత్,
పీనసాఽర్దితతృట్కాసశ్వాసాదీంశ్చామయాన్ బహూన్. ౨౦

ప్రాణ-ఉదాన-వ్యాన-సమాన-అపానంబులని వాతము ఐదువిధములుగ దోషభేదీయాధ్యాయమున జెప్పబడినవి. అమైదిటిలో ప్రాణవాతము రూక్షగుణమును కలిగించునాహారవిహారాదులచేతను,శరీరకుశ్రమముజేయుంట చేతను,లంకణ (ఉపవాస) ముల

చేతను, మితిమీరి యాహారమును భుజించుటచేతను, అభిఘాతముచేతను, త్రోవనడచుటచేతను, వాతమూత్రపురీషాదులవేగమును నిరోధించుటచేతను, లేక వాతమూత్రాదులు వెడలకుండునపుడు వానిని వెడలింపను ప్రయత్నించుటచేతను ప్రకోపమునొందును. ప్రాణవాతప్రకోపముచేత నేత్రములు మున్నగువానికి హానికలుగును. పీనసము అర్దితవాతము దప్పి కాసశ్వాసములు మున్నగు ననేకరోగముల గలిగించును.

(ప్రాణవాతమునకు ప్రధానస్థానము శిరస్సు, అచ్చట నియతముగనుండి ఉరస్సునను కంఠమునను సంచరించును. కావున పైజెప్పినకారణములచే నది ప్రకోపమునొందినపుడు హృదయమునకు పైభాగమున నేత్రాదులయందు పైజెప్పినరీతిగ నాయారోగముల గలిగించునని భావము.)

### ఉదానవాతప్రకోపకారణములు, దానగలుగు రోగములు.

ఉదానః క్షవథూద్గారచ్ఛర్దినిద్రావధారణైః,
గురుభారాతిరుదితహాస్యాద్యైర్వికృతో గదాన్. ౨౧
కంఠరోధమనోభ్రంశచ్ఛర్ద్యరోచకపీనసాన్,
కుర్యాచ్చ గలగణ్డాదీన్ తాంస్తాన్ జత్రూర్ధ్వసంశ్రయాన్. ౨౨

(ఉదానవాతము ఉరస్థానమున నియతముగనుండినాసికాస్థానమునను నాభిస్థానమునను కంఠస్థానమునను సంచరించును) తుమ్ములను త్రేనుపులను వాంతిని నిద్రను వీని వేగమును నిరోధించుట, తనబలమున కలవికానిభారమును మోచుట, అధికముగ నేడ్చుట, అధికముగ నవ్వుట, ఇవి మున్నగుకారణములచే నుదానవాతము ప్రకోపము జెంది కంఠబిలము నడ్డగించును. మనస్సును భ్రమింపజేయును. వాంతిని కలిగించును. అరోచకమును పడిసెమును కలిగించును. మఱియు గలగండము మున్నగు నాయారోగములను కంఠమునకు పైభాగము నాశ్రయించువానిని కలిగించును.

(ఈయుదానవాతము ఉరస్సుననుండి పైభాగమున వ్యాపించునది. కావున కంఠమునకు పైభాగము నాశ్రయించిన రోగముల గలిగించునని భావము.)

### వ్యానవాతప్రకోపకారణములు, దానగలుగురోగములు.

వ్యానోఽతిగమనధ్యానక్రీడావిషమచేష్టితైః,
విరోధిరూక్షభీహర్షవిషాదాద్యైశ్చ దూషితః. ౨౩
పుంస్త్వోత్సాహబలభ్రంశశోఫచిత్తోత్ప్లవజ్వరాన్,
సర్వాఙ్గరోగనిస్తోదరోమహర్షాఙ్గసుప్తతాః. ౨౪
కుష్ఠం విసర్పమన్యాంశ్చ కుర్యాత్సర్వాఙ్గగాన్ గదాన్,

(వ్యానవాతము హృదయస్థానమున నియతముగనుండి శరీరమునందంతటను సంచరించును) అధికముగ నడచుట, దీర్ఘకాలము మనస్సుతో యోచన జేయుట, ఆటలయందు విషమములుగ చేష్టలజేయుట, విరోధములగుగుణములు గలక్షీరమత్స్యాదుల జేర్చి భుజించుట, రూక్షపదార్థముల సేవించుట, మిక్కిలి భయముసైనను సంతోషముసైనను బొందుట ఇవి మున్నగుకారణములచే వ్యానవాతము ప్రకోపించును. దానివలన మనుజునకు పుంస్త్వంబును ఉత్సాహంబును బలంబును నశించును. వాపుకలుగును. చిత్తము మారును, జ్వరము, సర్వాంగవాతము, శరీరమునందెల్ల పోట్లు, రోమహర్షము, ఒడలియందు ద్రవము, కుష్ఠము, విసర్పము, ఈరోగములను సర్వాంగములయందును వ్యాపించునితరరోగంబు లనేకములను కలిగించును.

(వ్యానవాతము శరీరమునందెల్ల వ్యాపించునది కావున శరీరమునందెల్ల వ్యాపించు రోగములను కలిగించుననిభావము.)

### సమానవాతప్రకోపకారణములు, దానంగలుగురోగములు.

సమానో విషమాఽజీర్ణశీతసంకీర్ణభోజనైః. ౨౫
కరోత్యకాలశయనజాగరాద్యైశ్చ దూషితః,
శూలగుల్మగ్రహణ్యాదీన్ పక్వామాశయజాన్ గదాన్. ౨౬

(సమానవాతము పక్వాశయమునకు ఆమాశయమునకును నడుమనుండు పాచకాగ్నికి సమీపముననుండి కోష్ఠమునందంతటను సంచరించుచుండును) ప్రమాణమునకు న్యూనాధికములుగ భుజించుట, జీర్ణముకాని సమయమున భుజించుట, చల్లనిపదార్థముల భుజించుట, ఉష్ణశీతాదిపదార్థముల నన్నిటిని జేర్చి భుజించుట, అకాలమున నిద్రపోవుట, రాత్రులయందు నిదురమేల్కొంచుట, ఇవిమున్నగుపనులచేత సమానవాతము ప్రకోపించి శూల, గుల్మము, గ్రహణిమున్నగాగల పక్వామాశయములకు సంబంధించిన రోగముల గలిగించును.

(పక్వామాశయముల నడుమనుండుటంజేసి సమానవాతము ప్రకుపితమైనపుడు పక్వామాశయములకు సంబంధించినరోగముల గలిగించుననిభావము).

### అపానవాతప్రకోపకారణములు, దానంగలుగురోగములు.

అపానో రూక్షగుర్వన్నవేగఘాతాఽతివాహనైః,
యానయానాసనస్థానచఙ్క్రమైశ్చాతిసేవితైః. ౨౭
కుపితః కురుతే రోగాన్ కృచ్ఛ్రాన్ పక్వాశయాశ్రయాన్,
మూత్రశుక్రప్రదోషార్శోగుదభ్రంశాదికాన్ బహూన్. ౨౮

(అపానవాతము ముఖ్యముగ నపానస్థానముననుండి పిరుదులు వస్తి శిశ్నము తొడలు వీనియందు సంచరించుచుండును) జిడ్డులేక రూక్షమైనయన్నమును చిరకాలమునకు జీర్ణమగునన్నమును భుజించుట, అపానవాతవేగమును నిరోధించుట, బలాత్కారముగ నపానవాతమును ప్రేరేపించుట, గుఱ్ఱము మున్నగువాహనములపై నెక్కి సవారిచేయుట, చాలకాలము కూర్చొనియుండుట, అధికముగ సంచరించుట, ఇవి మున్నగుకారణములచేనపానవాతము ప్రకోపమునొంది పక్వాశయమునకు సంబంధించిన మూత్రశుక్రరోగములు, అర్శస్సులు, గుదభ్రంశము మున్నగు ననేకరోగముల గలిగించును.

(అపానవాతము అపానస్థానమున జేరియుండుటంజేసి తత్సంబంధములగు వ్యాధుల గలిగించుననిభావము.)

### సామ-నిరామవాతలక్షణములు.

సర్వం చ మారుతం సామం తన్ద్రాస్తైమిత్యగౌరవైః,
స్నిగ్ధత్వారోచకాలస్యశైత్యశోఫాగ్నిహానిభిః. ౨౯
కటురూక్షాభిలాషేణ తద్విధోపశయేన చ,
యుక్తం విద్యాన్నిరామం తు తన్ద్రాదీనాం విపర్యయాత్. ౩౦

కునికిపాటు, నిశ్చలత, బరువుగనుండుట, స్నిగ్ధముగనుండుట, అరోచకము, ఆలస్యము, చల్లగనుండుట, వాపు, జఠరాగ్నిమందగించుట, లేక నశించుట, కటురసము కలపదార్థములయందును రూక్షపదార్థములయందును అభిలాషపొడముట, అట్టి కటురూక్షపదార్థములకు విరుద్ధములగువాని సేవించుటచే సుఖముగనుండుట, ఈలక్షణములు కలిగినప్పుడు వాతము ఆమసహితముగ నున్నదనియు, పైజెప్పినలక్షణములకు విరుద్ధముగ నున్నపుడు వాతము నిరామముగ నున్నదనియు నెరుంగునది.

### ఆవరణవాతభేదములు, అందు పిత్తావృతవాతలక్షణము.

వాయో రావరణం చాతో బహుభేదం ప్రవక్ష్యతే,
లిఙ్గం పిత్తావృతే దాహ స్తృష్ణా శూలం భ్రమ స్తమః. ౩౧
కటుకోష్ణామ్లలవణైః విదాహశ్శీతకామతా,

వాతము పిత్తాదులచే నావృతమైనయపుడు అనేకభేదములు గలిగియుండును. అట్టియావరణభేదమునగలుగు ననేకభేదము లీక్రింద వివరింపబడును:— వాతము పిత్తముచే నావరింపబడినపుడు మంటయు, దప్పియు, నొప్పియు, భ్రమంబును, చీకటిమున్నవిధముగ తమంబును పుట్టును. కటు-ఉష్ణ-అమ్ల-లవణపదార్థముల సేవించినపుడు విశేషతాపంబును గలుగును. చల్లనియుపచారాదులయందు అభిలాష వొడమును.

## కఫావృతవాతలక్షణము.

శైత్యగౌరవశూలాని కట్వాద్యుపశయోఽధికమ్. 32
లఙ్ఘనాయాసరూక్షోష్ణకామతా చ కఫావృతే,

వాతము కఫముచే నావరింపబడినపుడు శరీరము చల్లనై బరువుగనుండి శూల (నొప్పి) కలుగును. కటు-ఆమ్ల-లవణ-ఉష్ణపదార్థములచే శమించును. లంకణమును, శరీరమున కాయాసమును కలిగించుపనులను రూక్షంబులును ఉష్ణంబులునైన పదార్థములను కోరును.

## రక్తావృతవాతలక్షణము.

రక్తావృతే సదాహార్తిః త్వఙ్మాంసాన్తరజా భృశమ్. 33
భవేచ్చ రాగీ శ్వయథుః జాయన్తే మణ్డలాని చ,

వాతము రక్తముచే నావరింపబడినపుడు చర్మమునకును మాంసమునకును నడుమ తీవ్రమైనమంటయు నొప్పియు కలుగును. ఎఱ్ఱనిరంగుతో గూడినవాపును పొడలును కలుగును.

## మాంసావృతవాతలక్షణము.

మాంసేన కఠినశ్శోఫః వివర్ణః పిటికాస్తథా. 34
హర్షః పిపీలికానాం చ సంచార ఇవ జాయతే,

వాతము మాంసముచే నావరింపబడినపుడు మిక్కిలి కఠినమై వివర్ణమైనవాపు పుట్టును. చీమలు పాకినవిధమున గులగులమని జలబరించును. బొబ్బలు లేచును.

## మేదస్సుచే నావరింపబడినవాతలక్షణము.

చలః స్నిగ్ధో మృదుశ్శీతః శోఫో గాత్రేష్వరోచకః 34
ఆఢ్యవాత ఇతి జ్ఞేయః సకృచ్ఛ్రో మేదసావృతే,

మేదస్సుచే వాతము ఆవరింపబడినపుడు చంచలంబును స్నిగ్ధంబును మృదువును శ్వేతవర్ణంబును నగువాపు అవయవములన్నిటియందును కలుగును. అరుచికలుగును. అట్టి లక్షణములు కలిగినది యాఢ్యవాతమని చెప్పనగును. ఇయ్యది మిక్కిలి కష్టసాధ్యము.

## అస్థ్యావృతవాతలక్షణము.

స్పర్శమస్థ్యావృతేఽత్యుష్ణం పీడనం చాఽభినన్దతి. 36
సూచ్యేవ తుద్యతేఽత్యర్థం అఙ్గం సీదతి శూల్యతే,

వాతము అస్థిచే నావరింపబడినపుడు చేతతాకిన మిక్కిలి వేడిగ నుండును. చేత పిసికించుకొనిన మిక్కిలి సుఖముగనుండును. సూదులచే బొడిచినవిధముగ పోటు పుట్టును. శరీరము కృశించును. నొప్పి తీవ్రముగ బుట్టును.

## మజ్జావృతవాతలక్షణము.

మజ్జావృతే వినమనం జృమ్భణం పరివేష్టనమ్. 3౭
శూలం చ పీడ్యమానేన పాణిభ్యాం లభతే సుఖమ్,

వాతము మజ్జ(అస్థులలోపలనుండుమూలగ)చే నావరింపబడినపుడు అవయవములు వంగును. ఒడలివిరుపులు పుట్టును. కొంకరలుపోవును. తీవ్రమైన నొప్పికలుగును. చేతులతో పిసికిన కొంచెము సుఖముగ నుండును.

## శుక్రావృతవాతలక్షణము.

శుక్రావృతేఽతివేగో వా న వా నిష్ఫలతాపి వా. 3౮

వాతము శుక్రముచే నావరింపబడినపుడు శుక్రము అతివేగముతో వెడలును. లేక తీవ్రత బొత్తిగ లేకుండును. లేక ఆశుక్రము గర్భమును కలిగించుశక్తిలేక నిష్ఫలమగును.

## అన్నావృతవాతలక్షణము.

భుక్తే కుక్షౌ రుజా జీర్ణే శామ్యత్యన్నావృతేఽనిలే,

వాతము భుజింపబడినయన్నముచే నావరింపబడినయెడ భుజించినవెంటనే తీవ్రమైననొప్పి కలుగును. అయ్యది జీర్ణమైనపుడు శమించును.

## మూత్రావృతవాతలక్షణము.

మూత్రాఽప్రవృత్తిరాధ్మానం వస్తౌ మూత్రావృతే భవేత్. 3౯

వాతము మూత్రముచే నావరింపబడినపుడు మూత్రము బైటవెడలక వస్తి (మూత్రపుతిత్తి) యుబ్బియుండును.

## విడావృతవాతలక్షణము.

విడావృతే విబన్ధోఽధః స్వస్థానే పరికృన్తతి,
వ్రజత్యాశు జరాం స్నేహః భుక్తే చానహ్యతే నరః. ౪౦
శకృత్పీడితమన్నేన దుఃఖం శుష్కం శరాత్సృజేత్,

వాతము పురీషముచే నావరింపబడినపుడు అపానస్థానమున బంధింపబడును. దానంజేసి గుదస్థానమున కత్తిచే కోసినవిధముగ బాధకలుగును. ఆముదము మున్నగు స్నేహద్రవ్యములు అతిశీఘ్రముగ జీర్ణమగును. భుజించినతోడనే కడుపుబ్బరించును. మలము జీర్ణముకానియన్నముతోగూడి యెండి చిరకాలమునకు మిక్కిలి కష్టముతో వెడలును.

## సర్వధాత్వావృతవాతలక్షణము.

సర్వధాత్వావృతే వాయౌ శ్రోణీవంక్షణపృష్ఠరుక్. ४౧
విలోమో మారుతోఽస్వస్థం హృదయం పీడ్యతేఽతి చ,

రసాదిధాతువులన్నింటిచే వాతము ఆవరింపబడినపుడు పిరుదులయందును గజ్జల యందును వీపునందును నొప్పికలుగును. వాతము విలోమముగ సంచరించును. హృదయము వ్యాకులమై మిక్కిలి బాధకలిగియుండును.

## పిత్తావృతమైన ప్రాణాదివాతలక్షణములు.

భ్రమో మూర్ఛా రుజా దాహః పిత్తేన ప్రాణ ఆవృతే. ४౨
విదగ్ధేఽన్నే చ వమనం ఉదానేఽపి భ్రమాదయః,
దాహోఽన్తరూర్జాభ్రంశశ్చ; దాహో వ్యానే చ సర్వగః. ४౩
క్లమోఽఙ్గచేష్టాసంగశ్చ ససన్తాపస్సవేదనః,
సమాన ఊష్మోపహతిః అతిస్వేదోఽరతిస్తృట్. ४४
దాహశ్చ స్యాదపానే తు మలే హారిద్రవర్ణతా,
రుజోఽతివృద్ధిస్తాపశ్చ యోనిమేహనపాయుషు ४౫

ప్రాణవాతము పిత్తముచే నావరింపబడినపుడు భ్రమంబును, మూర్ఛయు, నొప్పియు, మంటయు పుట్టును. అన్నము (భుజింపబడిన యాహారము) జఠరాగ్నిచే పక్వమగు సమయమున వాంతియగును.

ఉదానవాతము పిత్తముచే నావరింపబడినపుడు పైజెప్పిన భ్రమ మూర్ఛాదులును కలుగును. లోపల విశేషముగ మంటపుట్టును. శరీరబలము నశించును.

వ్యానవాతము పిత్తముచే నావృతమైనయెడ శరీరము లోభాగమునను పైభాగమునను అంతట మంట తీవ్రముగ బుట్టును. బడలిక కలుగును. ఆయా యవయవములచే జేయవలసినచేష్ట లుడుగును. సంతాపంబును వేదనయు కలుగును.

సమానవాతము పిత్తముచే నావృతమైన నాడు కాయాగ్నికి భంగముకలుగును. శరీరముపై చెమట విశేషముగ బట్టును, పనులయం దాసక్తి యుండుగును. దప్పి యధికమగును. మంటపుట్టును.

అపానవాతము పిత్తముచే నావృతమైనయెడ మలములు పచ్చని రంగుకలిగి యుండును. నొప్పి మిక్కిలివృద్ధినొందును. యోనియందును మేఢ్రమునందును గుదమునందును మంటపుట్టును.

శ్లేష్మణా త్వావృతే ప్రాణే సాదస్తన్ద్రాఽరుచిర్వమిః,
ష్ఠీవనక్షవథూద్గారనిశ్వాసోచ్ఛ్వాససఙ్గ్రహాః. ४౬

ఉదానే గురుగాత్రత్వం అరుచిర్వాక్స్వరగ్రహః,
బలవర్ణప్రణాశశ్చ; వ్యానే పర్వాస్థివాగ్గ్రహః. ౪౭
గురుతాఽఙ్గేషు సర్వేషు స్ఖలితం చ గతౌ భృశమ్,
సమానేఽతిహిమాఙ్గత్వం అస్వేదో మన్దవహ్నితా. ౪౮
అపానే సకఫం మూత్రం శకృతస్స్యాత్ప్రవర్తనమ్,
ఇతి ద్వావింశతివిధం వాయోరావరణం విదుః. ౪౯

ప్రాణవాతము కఫముచే నావృతమైనయెడ శరీరము కృశించును. కునికిపాటు కలుగును. అరోచకము పుట్టును. వాంతియగును. నోట కఫము వెడలును. తుమ్ములును త్రేనుపులును వెడలును. ఉచ్ఛ్వాసనిశ్వాసములు పట్టునట్లు వెడలును. ఉదానవాతము కఫముచే నావరింపబడినయెడ శరీరము బరువుగనుండును. అరోచకము కలుగును. వాక్కును కంఠస్వరంబును పట్టినట్లుండును శరీరబలంబును కాంతియు నశించును.

వ్యానవాతము కఫముచే నావృతమైనయెడ శరీరమునందలి యస్థులన్నియును వాక్కును బిగబట్టినట్లుండును. అవయవములన్నియు బరువుగనుండును. నడచునప్పుడు మిక్కిలి తొట్రుబాటుకలుగును.

సమానవాతము కఫముచే నావరింపబడినపుడు శరీరమంతయు మిక్కిలి చల్లగ నుండును. చెమట బొత్తుగపట్టదు. కాయాగ్ని మందగించును.

అపానవాతము కఫముచే నావరింపబడినపుడు మలమూత్రములు కఫముతో గూడి వెడలును. ఇత్తెరంగున వాతావరణభేదములు "లింగం పిత్తావృతే...అపానేస కఫంమూత్రం శకృతస్స్యాత్ప్రవర్తనమ్" అనుగ్రంథముచేత వానివానిలక్షణములతో నిరువదిరెండువిధముల వేరువేర జెప్పబడినది.

## ప్రాణాదివాతములపరస్పరావరణభేదములు.

ప్రాణాదయస్తథాన్యోన్యం ఆవృణ్వన్తి యథాక్రమమ్,
సర్వేఽపి వింశతివిధం విద్యాదావరణం చ తత్. ౫౦

మరియు ప్రాణ-ఉదాన-వ్యాన-సమాన-అపానవాతములు అయిదును పైజెప్పిన రీతిగ పిత్తకఫములచే నావరింపబడినభంగి ప్రాణాదిపంచవాతములును ఒకదాని నొకటి వరుసగ నావరించును. ఈయావరణభేదములు ఇరువదివిధము లగును.

ఇచ్చట నీవివరణము నెరుంగునది:—ప్రాణ [illegible] ఉదానవ్యానసమాన-అపానములను వేరువేర నొక్కొకదానిచే నావరిం[illegible]న నయ్యవి నాల్గుభేదములు. ఇత్తెరంగున నుదానవాతము తక్కిననాలుగు(ప్రాణాది)వాతములచే నావరింపబడునవి నాలుగుభేదములు. వ్యానవాతము తక్కిన నాలిగిటిచే నావరింపబడినవి నాలుగుభేద

ములు. సమానవాతము తక్కినవాటిచే నావరింపబడినవినాలుగు, అపానవాతముతక్కిన వాలిగిటిచే నావరింపబడిన భేదములునాలుగు. ఇవియన్నియును కలిసి ప్రాణాదివాతములైదిటి పరస్పరావరణభేదములు ఇరువదియైదును.

## వాతముల పరస్పరావరణలక్షణము.

నిశ్శ్వాసోచ్ఛ్వాససంరోధః ప్రతిశ్యాయః శిరోగ్రహః,
హృద్రోగో ముఖశోషశ్చ ప్రాణేనోదాన ఆవృతే. ౫౧
ఉదానేనావృతే ప్రాణే వర్ణౌజోబలసంక్షయః,
దిశానయా చ విభజేత్ సర్వమావరణం భిషక్. ౫౨
స్థానాన్యవేక్ష్య వాతానాం వృద్ధిం హానిం చ కర్మణామ్,

ప్రాణవాతము చేత నుదానవాతము ఆవరింపబడినప్పుడు నిశ్వాసోచ్ఛ్వాసము లడ్డగింపబడును. పడిసెముపట్టును. తలపట్టినట్లు స్తంభించియుండును. హృదయమునకు సంబంధించిన హృద్రోగము కలుగును. నోరు ఎండును. ఉదానవాతముచే ప్రాణవాతమావరింపబడినపుడు శరీరవర్ణంబును ఓజస్సును బలంబును నశించును.

మరియు తక్కినవాతభేదములపరస్పరావరణలక్షణమును ఆయావాతముయొక్క స్థానములను, వానివానికి నిర్ణయింపబడినకృత్యములవృద్ధిని క్షయమును చక్కగ బరిశీలించి తత్తదనుసారముగ వానివానియావరణమును బుద్ధికౌశలముచే నూహించి నిర్ణయించునది.

ఇచ్చట నీవిమర్శనము నెరుంగునది:—ఆవరణమన నడ్డగించుట. వాతము తన మార్గమున శరీరమునందు యథేచ్ఛముగ సంచరించుతరి ఇతరములగుదోషదూష్యాదులు తనమార్గమున కడ్డుచేసి నిలచిన నయ్యది వాతావరణమనబడును. ఈవిషయమే పైన ప్రత్యేకముగ వివరింపబడినది. ఇట్లుండ వాతముఆకారరూపములు లేనిపదార్థము. తక్కినదోషదూష్యాదులకు ఆకారరూపంబులు కలవు. కావున నిరాకారమైనవాతము శరీరమునందు సంచరించుచుండ సాకారములైన పిత్తకఫములును రసరక్తాదులును వాతసంచారమార్గము నడ్డగించుట సంభవించును. అట్టి నిరాకారమైనవాతము ఒక్కటియె ప్రాణాదిభేదములచే నైదువిధములుగ స్థానాదిభేదములచే నైదువిధములుగ విభజింపబడినది. అట్టి నిరాకారమైనవాతమును నిరాకారమైనయింకొకవాత మెట్లు అడ్డుచేయును? అనుసంశయము [illegible] కీసమాధానము నెరుంగునది.—

ప్రాణాదివాతము [illegible] కారములనునది నిక్కము. అయినను ప్రాణవాతము సంచరించునెడ అపానాదివాతములతో నెదిరియైన మిక్కిలి బలయుక్తమై దాని నెదుర్కొని చనునెడ అట్టిప్రాణవాతము తనకెదిరించినవాతముచే ప్రతిహతమైనపుడు

తనసంచారమున కడ్డుకలుగునుకదా? అంతమాత్రముచేత నయ్యది యావృతమార్గమగును కావున వాతముతో నింకొకవాతము ఆవృతమగుటకు అనుపపత్తిలేశమైన నుండబోదు. కావున ప్రాణాదివాతములకును పరస్పరావరణము చెప్పినది సుసంగతము.

### ప్రాణాదివాతములకు సంసర్గాదిభేదములచే గలుగునావరణసంఖ్య.

ప్రాణాదీనాం చ పఞ్చానాం మిశ్రమావరణం మిథః. ౫౩
పిత్తాదిభిర్ద్వాదశభిః మిశ్రాణాం మిశ్రితైశ్చ తైః,
మిశ్రైః పిత్తాదిభిస్తద్వత్ మిశ్రణాభిరనేకధా. ౫౪
తారతమ్యవిభాగాచ్చ యాత్యావృత్తిరసంఖ్యతామ్,
తాం లక్షయేదవహితో యథాస్వం లక్షణోదయాత్. ౫౫
శనైశ్శనైశ్చోపశయాత్ గూఢామపి ముహుర్ముహుః,

పైజెప్పినరీతిగ పంచభేదములు గలవాతములు పరస్పరము ఆవరణభేదములతోగూడి పిదప పిత్తావరణము మొదలు సర్వధాత్వావరణమువరకుంగల పనిరెండు ఆవరణభేదములలో వేరువేరుగ నావరణభేదముల గల్పించిన నవి యసంఖ్యాకావరణభేదములగును. మరియుం ప్రాణాదివాతములు పరస్పరావరణభేదమునొందినపిదప పిత్తాదిసంసర్గావరణము బొంది, అందును ఏకదోషద్విదోషాదిసంసర్గరూపమైన యావరణమునొందిన నవియన్నియుం జేరి సంఖ్యాతీతము లగును. అందును వాతాదిదోషములు మున్నగువాని న్యూనాఽధికసంఖ్యాభేదమునుబట్టి తారతమ్యముల విమర్శించునెడ అట్టియావరణభేదములు లెక్కకు నలవిగాకయుండును. అట్టి యావరణసంఖ్యాభేదములను ఆయాదోషములు మున్నగువాని సుసూక్ష్మలక్షణభేదములను ఉపశయాదియుక్తులచే మెల మెల్లగ పలుమారుగమనించి నిర్ణయించునది (పైజెప్పినసంసర్గాదిభేదములు విస్తరభీతిచే నిట వివరింపబడవయ్యె).

### ప్రాణోదానప్రాశస్త్యము.

విశేషాజ్జీవితం ప్రాణ ఉదానో బలముచ్యతే. ౫౬
స్యాత్తయోః పీడనాద్ధానిః ఆయుషశ్చ బలస్య చ,

ఐదువిధములైనవాతములును జీవనరూపములై జీవితమునకు ముఖ్యాధారములు. అందును ప్రాణవాతము విశేషముగ జీవితమునకు ప్రధానతమమైనది. అలాగుననే ఉదానవాతము బలమును పోషించుటంజేసి బలస్వరూపమనదగును. అట్టిప్రాణ-ఉదానవాతములకు బాధకలిగిననాడు మనుజున కాయువునకును బలమునకు హానికలుగును. కావున వైద్యుడు మిక్కిలి మెలకువతో ప్రాణ-ఉదా తగిన ఆహారవిహారాదులచే గాపాడుట ప్రధానకృత్యము.

### ఆవరణవాతాసాధ్యత్వము.

ఆవృతా వాయవోఽజ్ఞాతాః జ్ఞాతా వా వత్సరం స్థితాః, ౫౭

ప్రయత్నేనాపి దుస్సాధ్యాః భవేయుర్వాఽనుపక్రమాః,

పైజెప్పినప్రకారము ప్రాణాదిపంచవాతములకు ఆవరణము ఇతరదోషదూష్యాదులచే గలిగినపుడు అట్టి యావరణభేదమును గమనించకున్నను, ఒకవేళ గమనించినను సంవత్సరకాలమువరకు తగినచికిత్స జేయక యుపేక్షించినయెడ మిక్కిలి ప్రయత్నముతో చికిత్స జేసినను అట్టి యావరణవాతములు అసాధ్యములగును. (కావున ఆవరణవాతములయందు మిక్కిలి జేర్పుతోలోలుత ప్రారంభదశయందే గమనించి తగినచికిత్స జేయుట ముఖ్యకర్తవ్యము)

విద్రధిప్లీహహృద్రోగగుల్మాఽగ్నిసదనాదయః,
భవన్త్యుపద్రవాస్తేషాం ఆవృతానాముపేక్షణాత్. ౫౭

ఇతి శ్రీ సింహగుప్తసూను వాగ్భటవిరచితాయాం
అష్టాఙ్గహృదయసంహితాయాం తృతీయం
నిదానస్థానం సమాప్తమ్.

పైజెప్పినవిధముగ ఇతరములచే నష్టపరచబడిన ఆవృతవాతములకు దగినచికిత్సల సకాలమున జేయక యుపేక్షించునెడ విద్రధి, ప్లీహవృద్ధి, హృద్రోగము, గుల్మము, అగ్నినాశము మున్నగువ్యాధులు ఈవాతవ్యాధుల కుపద్రవరూపములై సంభవించును. కావున చికిత్స జేయుటకు శీఘ్రముగ ప్రయత్నించుట మంచిది.

---

ఇతి విశ్వనాథరచితా వ్యాఖ్యాహ్యష్టాఙ్గహృదయస్య,
అష్టాఙ్గచన్ద్రికాఖ్యా జీయాదాచంద్రతారకం చాంధ్రీ.

ఇతి శ్రీ శ్రీ శ్రీ కాళహస్తిసంస్థానాధిపాస్థానవిద్వద్వరేణ్యులును సర్వతన్త్రస్వతన్త్రులునగు బ్రహ్మశ్రీ కుంభకోణము లక్ష్మీనృసింహశాస్త్రులవారి చరణకమలసంసేవాసమాసాదితపాణినీయాదిశాస్త్రవిజ్ఞానసముల్లసితుండును, శ్రీమాన్ వైద్యరత్న పణ్డిత డి. గోపాలాచార్యులవారి యాయుర్వేదాశ్రమమునం దాస్థానవిద్వాంసుడుగ నున్నవాడును, కౌణ్డిన్యగోత్రవిరాజమాన నుదురుపాటి వంశపయఃపారావారసుధాకరుండును, బ్రహ్మశ్రీ అగ్నిచిత్ సీతారామవాజపేయయాజిసీతామ్బాసోమపీథిసీతనూభవుండును నగు వైయాకరణవిద్వాన్ బ్రహ్మశ్రీ పణ్డిత విశ్వనాథశాస్త్రిచే విరచితంబగు అష్టాఙ్గచన్ద్రికయను అష్టాఙ్గ[illegible]హితాంధ్రవ్యాఖ్యానమున నిదానస్థానము సమాప్తము.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1930.